# మహాయానం

ప్రాచీన భారతదేశ, చైనా, శ్రీలంక, టిబెట్ దేశాలకు చెందిన
తాంత్రిక విశేషాలను మరియు అద్భుత హైందవ ఆలయాల విశేషాలను
తెలియజేసే పరిశోధనాత్మక గ్రంథం

రచన :
**శ్రీధరన్ కాండూరి**



# మహాయానం

(ప్రాచీన భారతదేశ, చైనా, శ్రీలంక, టిబెట్ దేశాలకు చెందిన తాంత్రిక విశేషాలను మరియు అద్భుత హైందవ ఆలయాల విశేషాలను తెలియజేసే పరిశోధనాత్మక గ్రంథం.)




**Sreedharan Kanduri**

M.A. Economics, M.A. English, M.A. Journalism, I.R.P.M.

Ph : 0883-2462565,9032462565.



ప్రకాశకులు :

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదురుగా,

కోటగుమ్మం, రాజమండ్రి - 533101.

Online Print Books Store

**Devullu.com**





[వెల : 360/-

# ఈ పుస్తకంలో....

20. ఆధ్యాత్మిక మార్గాన్ని అడ్డగించే కామ ప్రభావం ?
21. మళయాళ మంత్రవాదుల మర్మాలు?
22. గోవాలో కొలువైన శ్రీ మహాలసదేవీ క్షేత్ర విశేషాలు?
23. హైందవ జ్యోతిషశాస్త్రంలో గ్రహాలకు గ్రహణం ఏర్పడటం/అస్తంగత్వం (Combustion) యొక్క విశేషాలు?
24. జాతకచక్రంలో గ్రహణం పట్టిన గ్రహాలు జాతకులకు ఎలాంటి ఫలితాలు ఇస్తాయి?
25. భారతదేశ వివిధ ప్రాంతాలలో ఉన్న కొన్ని విచిత్ర ఆలయాల విశేషాలు?
26. జాతకచక్రంలో 'పీడించబడిన గ్రహములు' జాతకులకు ఎలాంటి ఫలితాలను ఇస్తాయి?
27. రావణ సంహితలో చెప్పబడిన రహస్యములు?
28. మీ జాతకచక్రంలో దాగి ఉన్న అదృష్ట/దురదృష్ట కారక గ్రహస్థితుల మర్మం?
29. ప్రాచీన శ్రీలంక తంత్రశాస్త్రంలో చెప్పబడిన వ్యాధుల మర్మం?
30. ప్రాచీన తంత్ర శాస్త్రములలో చెప్పబడిన స్త్రీ సంబంధ విశేషాలు?



# 1. తంత్ర–యోగశాస్త్ర మహా గురువు 'గోరఖ్‌నాధ్' అద్భుత జీవిత విశేషాలు?

గోరఖ్‌నాధ్ ఒక మానవ గురువుగా భావించబడలేదు. ఆయన, సృష్టికి ముందు కూడా ఉన్నాడని చెబుతారు. భూలోక సంబంధ కాలపరిమితులు గోరఖ్‌నాధ్‌కి వర్తించవు. ఆయన, వివిధ యుగాలలో ఈ భూమిమీద కనిపించాడని భావిస్తారు. సత్యయుగంలో – ఆయన పంజాబ్ ప్రాంతంలోని పెషావర్‌లో జీవించాడని, త్రేతాయుగంలో ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్ వద్ద నివసించాడని, ద్వాపరయుగంలో గుజరాత్‌లోని ద్వారక ప్రాంతానికి దగ్గరలో ఉన్న హర్‌ముజ్ అనే ప్రదేశంలో నివసించాడని, ఇక, కలియుగంలో కధియవాడ్ ప్రాంతంలోని గోరఖ్‌మారి (గోరఖ్‌మండి) అనే ప్రాంతంలో అవతరించాడని తెలుస్తున్నది.

'కన్‌ఫటా' యోగివర్గం (గోరఖ్‌నాధ్ శిష్యులు) ఈ ప్రపంచంలో మానవ సృష్టి ప్రారంభం కావటానికి ముందు నుంచి ఉన్నదని, ఈ మతానికి చెందిన ప్రాచీన సాహిత్యంలో చెప్పబడి ఉన్నది. 'నాధ్' మతానికి చెందిన ఒక గ్రంధంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, ఈ సృష్టి ప్రారంభానికి ముందు గోరఖ్‌నాధ్ పాతాళ లోకంలో నివసిస్తూ ఉండేవాడు. ఆ సమయంలో ఈ భూమిమీద ఎటు చూసినా అనంతమైన జలరాశి వ్యాపించి ఉండేది. అపారమైన ఆ జలాన్ని చూసి భయానికి గురైన మహావిష్ణువు ఏం చెయ్యాలో? అర్ధంకాక, నేరుగా గోరఖ్‌నాధ్ వద్దకు వెళ్ళి 'సృష్టి' చెయ్యటానికి తనకి సహకరించమని ఆ మహాగురువుని ప్రార్ధించాడు. విష్ణువు మీద జాలిపడిన గోరఖ్‌నాధ్, తన ముందు మండుతున్న యజ్ఞగుండం నుండి ఒక గుప్పెడు భస్మాన్నితీసి మహావిష్ణువుకి ఇచ్చాడు. అప్పుడు మహావిష్ణువు, గోరఖ్‌నాధ్ ఆజ్ఞమీద మళ్ళీ భూమిమీదకి వచ్చి, ఆపై తాను తెచ్చిన భస్మాన్ని అపారమైన జలరాశి మీద చల్లాడు. ఫలితంగా, జలం మాయం అయి వివిధ రకాల జీవులు అక్కడ ఆవిర్భవించాయి. గోరఖ్‌నాధ్ యొక్క శక్తి గురించి తెలుసుకున్న విష్ణువు, ఆ విషయాన్ని బ్రహ్మ, రుద్రులకు తెలియజేసాడు. ఆపై త్రిమూర్తులు ముగ్గురూ పాతాళానికి వెళ్ళి గోరఖ్‌నాధ్ యొక్క ప్రధమ శిష్యులుగా మారిపోయారు.

మధ్యయుగంలో రచించబడిన కొన్ని గ్రంధాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే – గోరఖ్‌నాధ్, హిమాలయాలలోని నేపాల్ ప్రాంతంలోను, మధ్య భారతదేశంలోను, బెంగాల్ ప్రాంతంలోను, పశ్చిమ భారతదేశంలోను, సింధు

ప్రాంతంలోను, పంజాబ్ ప్రాంతంలోను విస్తారంగా సంచరించినట్లుగా తెలుస్తున్నది. ఆ కారణంగానే ఆయా ప్రాంతాలలో గోరఖ్‌నాథ్ యొక్క మహిమలను తెలియజేసే అనేక ఉదంతాలు గ్రంధస్తం చెయ్యబడ్డాయి.

కొంతమంది పాశ్చాత్య మరియు చైనా పరిశోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, గోరఖ్‌నాథ్ ప్రాధమికంగా వజ్రయాన బౌద్ధమతానికి చెందినవాడని మరియు ఆయనకు మత్స్యేంద్రనాథ్ ద్వారా పరమశివుడితో సంబంధం ఏర్పడిందని తెలుస్తున్నది. ఈ పరిశోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే – గోరఖ్‌నాథ్ పంజాబ్‌లో అవతరించినట్లుగా తెలుస్తున్నది. ఏదిఏమైనా, గోరఖ్‌నాథ్ క్రీ.శ. 14వ శతాబ్దంలో అవతరించినట్లుగా నిర్ధారించబడింది. 'నాథ' మతంలో ప్రముఖంగా ప్రచారంలో ఉన్న సిద్ధాంతం ప్రకారం చూసినట్లయితే, పరమశివునియొక్క అవతారమైన ఆదినాథ్ అనే యోగికి మత్స్యేంద్రనాథ్ కుమారుడని, ఆ మత్స్యేంద్రనాధుని యొక్క కుమారుడే గోరఖ్‌నాథ్ అని భావించబడుతున్నది. ఏదిఏమైనా – నాథ మతానికి మూలం, యోగులకు గురువైన శివుడే అని నిస్సందేహంగా భావించవచ్చు.

"హఠ"యోగానికి మూలం గోరఖ్‌నాథ్ అని చరిత్రకారులు అభిప్రాయ పడుతున్నారు. మధ్యయుగ చివరి భాగంలో హిందీ భాషలో ఉత్తర భారతదేశంలో వెలువడిన వేదాంత సూక్తులకు మరియు వేదాంత బోధనలకు సంబంధించిన గ్రంధాలలో చాలాభాగం గోరఖ్‌నాథ్ చేత రచించబడ్డాయని అనేకమంది పరిశీలకులు భావిస్తున్నారు.

**మత్స్యేంద్రనాథ్ :**

నేపాల్ దేశంలో మత్స్యేంద్రనాధుడిని నేపాల్ దేశ రక్షకుడిగా భావించి పూజించడం జరుగుతున్నది. నేపాల్‌లో ప్రచారంలో ఉన్న విశ్వాసాల ప్రకారం చూసినట్లయితే, మత్స్యేంద్రనాధుడు, వజ్రయాన బౌద్ధమతంలో పూజించబడుతున్న పద్మపాణి లేదా అవలోకితేశ్వర అనే దైవంయొక్క అవతారంగా భావించవచ్చు.

'నాథ' సాహిత్యంలో ప్రచారంలో ఉన్న ఒక కథ ప్రకారం చూసినట్లయితే – సత్య యుగంలో ఉత్తర భారతదేశంలోని ఒక రాజ్యాన్ని పరిపాలిస్తున్న ఉధోధరుడు అనే ఒక మహారాజు గొప్ప శివభక్తుడిగా గుర్తించబడ్డాడు. ఆయన మరణించిన తరువాత ఆయన మృతదేహాన్ని ఆనాటి సాంప్రదాయం ప్రకారం దహనం చేసారు. అయితే, విచిత్రంగా ఆయన బొడ్డు ప్రాంతం అగ్నిలో దహనం కాకుండా మిగిలిపోయింది. అది గమనించిన ఆయన కుటుంబీకులు ఆ నాభి భాగాన్ని తీసుకువెళ్ళి

అక్కడకు దగ్గరగా ప్రవహిస్తున్న ఒక నదిలో వదిలివేసారు. అలా నదిలో వదిలివేయబడిన ఆ నాభి భాగాన్ని ఒక చేప గుటుక్కున మ్రింగివేసింది. ఆ చేపచేత మ్రింగబడిన ఆ బొడ్డు భాగం ఆపై కొన్నాళ్ళకు ఒక మానవ శిశువు రూపంలో ఆ చేప కడుపు నుండి బైటకు వచ్చింది. అలా బైటకు వచ్చిన ఆ శిశువే మత్స్యేంద్రనాధుడిగా గుర్తించబడ్డాడు. గతజన్మలో మహా శివభక్తుడిగా, యోగిగా జీవించిన కారణంగా ఆ రాజు మళ్ళీ మత్స్యేంద్రనాధుడిగా జన్మించటంవల్ల ఆయనకు గతజన్మలోని జ్ఞానం యధాతధంగా పుట్టుకతోనే సంప్రాప్తించింది. ఫలితంగా, మత్స్యేంద్రనాధ్ పుట్టగానే జ్ఞానిగా మారాడు.

భారతదేశంలోని నాసిక్ ప్రాంతంలో ప్రచారంలో ఉన్న కధ ప్రకారం చూసినట్లయితే – నేపాల్ దేశానికి ఉత్తర దిశలో ఉన్న ముక్తినాధ్ అనే ప్రదేశంలో మత్స్యేంద్రనాధ్ అవతరించినట్లుగా తెలుస్తున్నది. ఏదిఏమైనా, భారతదేశంలో ప్రచారంలో ఉన్న వివిధ రకాల వృత్తాంతాలబట్టి చూసినట్లయితే బౌద్ధమతం (మహాయాన బౌద్ధమతం) మరియు శైవ మతానికి మధ్య ఉన్న సంబంధమే గోరఖ్‌నాధ్ మరియు మత్స్యేంద్రనాధ్ మధ్య ఉన్నట్లుగా అర్ధం చేసుకోవచ్చు.

ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, ప్రారంభంలో ‘నాధ’ మార్గానికి అనగా నాధ మతానికి గురువుగా ఉన్న శైవుడైన మత్స్యేంద్రనాధుడు, నేపాల్‌కి చెందిన బౌద్ధుడైన గోరఖ్‌నాధుడిని శైవంలోకి మార్చాడని అనేకమంది పరిశోధకులు బలంగా అభిప్రాయ పడుతున్నారు. ఫలితంగా, అనేకమంది బౌద్ధయోగులు – గోరఖ్‌నాధ్ శిష్యులుగా మారిన తరువాత శివుడిని ఆరాధించే శైవ మతస్తులుగా మారిపోయారు అన్నమాట యదార్ధం.

గోరఖ్‌నాధీయులు, కన్‌ఫటాలు, నాధయోగులు – అనే విభిన్నమైన పేర్లతో పిలువబడే యోగులకు “హఠయోగాన్ని” అందించిన మహాగురువు గోరఖ్‌నాధ్ అని గ్రహించాలి.

మధ్య యుగంలో ఉత్తర భారతదేశంలో ప్రముఖ యోగులుగా గుర్తించబడిన కబీర్‌దాస్, దాదూదయాళ్, ముల్లాదాద్, మలిక్‌మహమ్మద్ జైసి లాంటి వారిపైనే కాక, ఆధునిక కాలంలో సంచలనాత్మక మరియు వివాదాస్పద మహా గురువుగా గుర్తించబడిన ఓషోమీద కూడా గోరఖ్‌నాధ్ యొక్క ప్రభావం విపరీతంగా ఉందని చెబుతారు. భారతదేశంలో ఒక కొత్త మతాన్ని సృష్టించిన ఘనత గోరఖ్‌నాధ్‌కి చెందుతుంది. ఆ మహాయోగి లేకపోయినట్లయితే – కబీర్, నానక్, మీరా, బాబాఫరీద్,

దాదూదయాళ్ లాంటి మహా వేదాంతులు ఉండేవాళ్ళు కాదని ఒక సమయంలో గురుఓషో ఉద్ఘాటించటం జరిగింది. ఎంతోమంది మేధావుల్ని తన గ్రంధాలతో అనగా బోధనలతో ప్రభావితంచేసి వారిని మహా యోగులుగా మార్చిన ఘనత గోరఖ్‌నాధ్‌కి దక్కుతుంది.

గోరఖ్‌నాధ్ మొదటిసారిగా హిమాలయ పర్వతాలలోని నేపాల్ ప్రాంతంలో మానవులకు దర్శనమిచ్చినట్లుగా చెబుతారు. బహుశా ఆ కారణంగానే ఈనాటికీ నేపాల్‌లోని ఒక గుహలో గోరఖ్‌నాధ్ యొక్క విగ్రహం మరియు ఆయన పాదరక్షలు కనిపిస్తాయి. గోరఖ్‌నాధ్ నివసించిన ప్రాంతాన్ని "గోర్ఖా" అని పిలిచారు. (ఈనాడు గూర్ఖాలుగా పిలువబడేవారు గోరఖ్‌నాధ్ పేరుమీదుగానే 'గూర్ఖా' అనే పేరును పొందారని పరిశీలకులు అభిప్రాయపడుతున్నారు.) ఉత్తర భారతదేశంలో ఉన్న గోర్ఖాపూర్ లేదా గోరఖ్‌పూర్ అనే పట్టణం కూడా గోరఖ్‌నాధ్ పేరుమీదుగానే ఏర్పడిందని భావిస్తున్నారు. గోవులను రక్షిస్తాడు కనుక ఆయనను గోరఖ్‌నాధ్ అని మరి కొందరు పిలుస్తారు.

గోరఖ్‌నాధ్ రంగంలోకి వచ్చేసరికి భారతదేశంలోని సామాజిక పరిస్థితులు అల్లకల్లోలంగా ఉన్నాయి. ఒక ప్రక్క – విగ్రహారాధనను మరియు హైందవ మతాన్ని నాశనం చెయ్యటానికి భారతదేశం మీదకి పరాయి దేశాల ముస్లింలు దాడులు చెయ్యటం ప్రారంభించారు. అప్పటి వరకు విగ్రహారాధన మరియు బ్రాహ్మణ సంబంధ తాంత్రిక విధానాలను ఖండిస్తూ వచ్చిన బౌద్ధ మతస్తులు అప్పటి నుండి తాంత్రిక సాధనలను, మంత్ర, తంత్రాలను అనుసరించటం ప్రారంభించటమే కాకుండా ప్రజలకు కూడా తాంత్రిక బౌద్ధమతాన్ని ప్రబోధించటం ప్రారంభించారు. ఫలితంగా, భారతదేశంలో ముఖ్యంగా, ఉత్తర భారతదేశంలో మతపరమైన గందరగోళం ఏర్పడింది. అలాంటి పరిస్థితుల్లో గోరఖ్‌నాధ్ రంగంలోకి వచ్చాడు. అప్పటికి భారతదేశంలోని దళిత జాతుల వారికి హిందూమతంలో ప్రవేశం తీవ్రంగా నిషేధించబడింది. ఫలితంగా, కుల–మతాలతో ప్రమేయంలేని గోరఖ్‌నాధ్‌కి చెందిన "నాధ" మతంలోకి హైందవ మతంలోని అనేక నిమ్న కులాలవారు తండోపతండాలుగా వచ్చి చేరారు. అంతేకాకుండా అప్పటికే ఇస్లాం మతాన్ని పాటిస్తున్న కొందరు ఇస్లాం మతస్తులు కూడా "నాధ" మతస్థులుగా మారిపోయారు.

"నాధ" సాహిత్యంలో లభించే సమాచారం ప్రకారం చూసినట్లయితే "నాధ" మతాన్ని పరమశివుడు స్థాపించాడని, ఆయన తరువాత ఆయన శిష్యుడు మత్స్యేంద్రనాధ్

ఆ మతాన్ని తన శిష్యుడైన గోరఖ్‌నాథ్‌కి బోధించాడని ఆ తరువాతకాలంలో గోరఖ్‌నాథ్ మహా గురువుగా మారి, ఆపై 'నాథ' మతాన్ని ఆసియాలోని చాలా ప్రాంతాలకు వ్యాపించేలా చేసాడని తెలుస్తున్నది.

సంస్కృత భాషలో "గో" అనగా మట్టి అని, "రఖ్" అనగా రక్షించుట అని అర్ధం. మత్స్యేంద్రనాథ్ ఇచ్చిన విభూది నుండి పుట్టిన బిడ్డను భూదేవి (మట్టి) 12 సంవత్సరాల పాటు తనలో ఉంచుకుని రక్షించింది. అందువలన ఆ బిడ్డకు "గోరఖ్" అనే పేరు మత్స్యేంద్రనాథ్ పెట్టాడని చెబుతారు. ఏదిఏమైనా, గోరఖ్, అయోనిజుడు అనగా ఏ స్త్రీ యొక్క యోని నుండి జన్మించలేదు.

"నాథ" మతంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, "నాథ" మత తొలి గురువు అయిన మత్స్యేంద్రనాథ్ అనుగ్రహంతోనే గోరఖ్‌నాథ్ జన్మించాడని తెలుస్తున్నది. గోరఖ్‌నాథ్ జన్మవృత్తాంతము చాలా ఆసక్తికరంగా ఉంటుంది. అది ఎలాగంటే...

"నాథ" సాంప్రదాయానికి ఆద్యుడిగా చెప్పబడిన మత్స్యేంద్రనాథ్, ప్రతిరోజూ మధ్యాహ్న సమయంలో తన మఠం నుండి బయలుదేరి ప్రక్కనే ఉన్న గ్రామాలలోకి వెళ్ళి భిక్షాటనచేసి ఆపై ఆ భిక్షతో తన ఆకలి తీర్చుకుంటూ ఉండేవాడు. ఆయన మహా యోగి కనుక ఆవిధంగా జీవిస్తూ ఉండేవాడు. ఆ సమయంలో...

మహారాష్ట్రలోని గోదావరీ తీరంలో చంద్రగిరి అనే ఒక గ్రామం ఉండేది. ఆ గ్రామంలో సూరజ్ అనే పేరుగల ఒక బ్రాహ్మణుడు నివసిస్తూ ఉండేవాడు. ఆయన భార్యపేరు సరస్వతి. వివాహం జరిగి ఎన్నేళ్ళు అయినా ఆ దంపతులకు సంతానం కలుగలేదు.

ఆ సమయంలో ఒకసారి మత్స్యేంద్రనాథ్ ఆ చంద్రగిరి గ్రామానికివెళ్ళి ఆపై ఆ బ్రాహ్మణుడి ఇంటిముందు నిలబడి "మాతా భిక్షాందేహి" అని అన్నాడు. అప్పుడు ఆ ఇంట్లోని గృహిణి బైటకువచ్చి మత్స్యేంద్రనాథ్‌కి నమస్కరించి ఆయనతో "స్వామీ! నాకు వివాహం అయి ఎన్నో ఏళ్ళు గడిచాయి. ఇంతవరకు సంతానం కలగలేదు. ఎప్పటికైనా నాకు బిడ్డలు పుడతారా? పుట్టరా? దయచేసి చెప్పు" అన్నది. అప్పుడు మత్స్యేంద్రనాథ్ చిన్నగా నవ్వి, ఆపై తన భుజం నుండి వ్రేలాడుతున్న జోలి నుండి గుప్పెడు విభూదిని బైటకుతీసి ఆమె చేతిలో పెట్టి ఆపై ఆమెతో "అమ్మా! ఈ విభూదిని స్నానంచేసిన తరువాత నోట్లో వేసుకుని మ్రింగు. త్వరలోనే నీకు సంతాన భాగ్యం

కలుగుతుంది" అన్నాడు. ఆపై ఆయన ఆ విభూదిని ఆ గృహిణి రెండు చేతులలో ఉంచి, ఆపై అక్కడ నుండి ఇంకొక ఇంటిముందుకి వెళ్ళాడు. మత్స్యేంద్రనాధుడు అలా వెళ్ళగానే ఆ గృహిణి తన ఇంట్లోకి వెళ్ళింది. ఆపై, తన చేతిలో ఉన్న విభూదిని చూసి "ఈ బూడిద మ్రింగితే పిల్లలు పుడతారా?ఆ బైరాగి ఏదో బుద్ధిలేక చెప్పినంత మాత్రాన నేను దానిని ఎందుకు నమ్ముతాను?" – అని తనలోతాను అనుకుని ఆపై తన దోసెట్లో ఉన్న బూడిదను తన ఇంటి పెరట్లో ఉన్న ఒక మట్టి దిబ్బమీద పోసింది.

ఆ తరువాత 12 సంవత్సరాలు గడిచాయి. ఒకరోజు మధ్యాహ్న సమయంలో మత్స్యేంద్రనాధ్ మళ్ళీ ఆ ఇంటిముదుకు వచ్చి ఆపై ఆ ఇంట్లోని గృహిణిని బైటకు పిలిచి ఆమెతో "అమ్మా! నీ కొడుకు ఎలా ఉన్నాడు? ఏం చేస్తున్నాడు?" అన్నాడు. అప్పుడు ఆమె, మత్స్యేంద్రనాధ్ వైపు విచిత్రంగా చూసి "అయ్యా! నీవు ఇచ్చిన బూడిదను ఆ రోజే నేను మా పెరట్లో పారేసాను. కనుక నాకు పిల్లలు పుట్టలేదు" అన్నది. అప్పుడు మత్స్యేంద్రనాధ్, ఆమెను వెంటపెట్టుకుని ఆ ఇంటి పెరట్లోకి వెళ్ళాడు. అక్కడ – దాదాపు 6 అడుగుల ఎత్తు ఉన్న ఒక మట్టి దిబ్బ కనపడింది. మత్స్యేంద్రనాధ్ ఆ మట్టి దిబ్బముందు నిలబడి కళ్ళు మూసుకుని తన దివ్యదృష్టితో ఆ మట్టి దిబ్బలోకి చూసాడు. ఆ దిబ్బ లోపల పద్మాసనంలో కూర్చుని ఉన్న 12 సంవత్సరాల బిడ్డ మత్స్యేంద్రనాధ్ మనోదృష్టికి కనిపించాడు. ఆ బిడ్డను చూడగానే మత్స్యేంద్రనాధ్ పెదవులపై అప్రయత్నంగా చిరునవ్వు సాక్షాత్కరించింది. ఆపై ఆయన పెద్ద స్వరంతో "బిడ్డా! ఆ దిబ్బలోంచి బైటకు రా!" అన్నాడు. అంతే, ఆ మట్టి దిబ్బను చీల్చుకుని 12 సంవత్సరాల బాలుడు బైటకు వచ్చాడు. ఆ బిడ్డను చూడగానే ఆ గృహిణికి ఆశ్చర్యంతో తల తిరిగిపోయింది. మహాయోగి అయిన మత్స్యేంద్రనాధ్ ఇచ్చిన విభూదిని పనికిమాలిన బూడిదగా భావించిన తను ఆ విభూదిని మట్టిదిబ్బ మీద పారేసింది. కానీ, మహిమగల ఆ విభూది వల్ల బిడ్డ ఆవిర్భవించాడు. ఆ మహాయోగి చెప్పినట్లుగానే తాను ఆనాడే ఆ విభూదిని మ్రింగి ఉంటే తన కడుపు నుండే ఈ బిడ్డ పుట్టి ఉండేవాడని ఆమెకు చాలా ఆలస్యంగా అర్ధమయ్యింది. ఆపై ఆమె ఎంతో పశ్చాత్తాపపడి మత్స్యేంద్రనాధ్ పాదాలపైపడి ఆయనతో ఇలా అన్నది. "స్వామీ! తప్పు చేసాను. నన్ను క్షమించి నా బిడ్డను నాకు ఇవ్వు". అప్పుడు మత్స్యేంద్రనాధ్, ఆమెవైపు చూస్తూ ఇలా అన్నాడు. "నీ గతజన్మ కర్మ కారణంగా నీవు సంతానంలేక బాధపడుతున్నావు. నేను నీకు బిడ్డను ప్రసాదించాలని ఆశపడినా నీయొక్క చెడుకర్మ కారణంగా నీవు నా మాటలు నమ్మలేదు. నీకు సంతాన భాగ్యాన్ని కలిగించే విభూదిని పారేసావు. అంటే

నీ యొక్క చెడు కర్మని తప్పించటం నావల్ల కాలేదు. నీకు ఈ బిడ్డను పొందే అర్హతలేదు". ఆపై మత్స్యేంద్రనాధ్, ఆ 12 సంవత్సరాల బిడ్డను తనతోపాటు తీసుకువెళ్ళిపోయాడు.

గోరఖ్‌ని తన శిష్యుడిగా మార్చుకున్న మత్స్యేంద్రనాధ్ అతడికి అన్ని రకాల యోగ విద్యలను నేర్పినట్లుగా తెలుస్తున్నది. మత్స్యేంద్రనాధ్ ఒకరోజు మధ్యాహ్న సమయంలో తన శిష్యుడైన గోరఖ్‌తో కలిసి వారికి దగ్గరలో ఉన్న గ్రామానికి భిక్షకోసం వెళ్ళారు. ఆపై, ఆ గురు శిష్యులు ఇద్దరూ ఒక ఇంటి దగ్గరకు వెళ్ళారు. ఆ సమయంలో ఆ ఇంట్లో ఏదో ఒక సందర్భంగా అనేకమందికి విందు భోజనాలు పెడుతున్నారు. తమ ఇంటి దగ్గరకు వచ్చిన ఈ గురు శిష్యులకు కూడా అతి రుచికరమైన పదార్ధాలతో ఆ ఇంటి గృహిణి మంచి భోజనం పెట్టింది. తృప్తిగా భోజనం చేసిన తరువాత ఆ గురుశిష్యులు ఇద్దరూ తిరిగి తమ నివాసానికి వచ్చారు. మరుసటిరోజు మధ్యాహ్నం మత్స్యేంద్రనాధ్ ఆశ్రమంలోనే ఉండి, ఆపై తన శిష్యుడైన గోరఖ్‌వైపు చూసి "బిడ్డా! ఆ ఇంట్లో నిన్న మధ్యాహ్నం మనకు పెట్టిన భోజన పదార్ధాలు నాకు చాలా బాగా నచ్చాయి. ఈ రోజు నేను రాను. నీవు ఒక్కడివే ఆ ఇంటి దగ్గరకువెళ్ళి ఆ గృహిణితో 'నిన్న ఇచ్చిన భోజనం లాంటి భోజనం ఇవాళ కూడా ఇవ్వమని' చెప్పు" అన్నాడు. గోరఖ్ ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆ గృహంలోకివెళ్ళి ఆపై అక్కడ ఏదో పనిలో ఉన్న ఆ గృహిణిని పిలిచి ఆమెతో "అమ్మా! మీ ఇంట్లో నిన్న పెట్టిన భోజనం మా గురువు గారికి చాలా బాగా నచ్చింది. అందువలన ఆయన ఈ రోజు కూడా అలాంటి భోజనమే మీ ఇంటి నుండి తీసుకురమ్మని నన్ను ఇక్కడకు పంపించాడు. కనుక, నీవు అలాంటి భోజనం ఇవాళ కూడా మాకు భిక్షగా ఇవ్వు" అన్నాడు. అప్పుడు ఆ గృహిణి చిన్నగా నవ్వి "నాయనా! నిన్న మా ఇంట్లో మా మామగారి తద్దినం పెట్టాం. అందువలన నిన్న అనేక రకాల రుచికరమైన వంటకాలతో అందరికీ భోజనాలు పెట్టాము. కానీ, ప్రతిరోజూ అన్ని వంటకాలు చెయ్యటం నా ఒక్కదానికి ఎలా సాధ్యం అవుతుంది?. మేము రోజూ తినే ఆహారం కావాలంటే ఇస్తాను. అది తీసుకువెళ్ళి నీవు మరియు నీ గురువుగారు హాయిగా ఆరగించండి" అన్నది. ఆ గృహిణి అన్న మాటలకు గోరఖ్ కాసేపు మౌనం వహించాడు. ఆ తరువాత మృదువైన స్వరంతో ఆ గృహిణితో "అమ్మా! నా గురువు ఆజ్ఞ నాకు నా ప్రాణం కన్నా విలువైనది. ఆయన కోరిన కోర్కెలు తీర్చటం నా బాధ్యత. అందువలన దయచేసి, నిన్న పెట్టిన లాంటి భోజనమే ఈ రోజు కూడా ఇవ్వు" అన్నాడు.

భిక్షకోసం వచ్చి అలా గట్టిగా అడిగే సరికి గోరఖ్‌మీద ఆ గృహిణికి బాగా కోప వచ్చింది. ఆపై ఆమె కఠినమైన స్వరంతో గోరఖ్‌తో "నీ గురువు నీ కళ్ళు కావాలి అని అడిగితే ఇచ్చేస్తావా?" అన్నది. అప్పుడు గోరఖ్ దృఢమైన స్వరంతో "నా గురువు ఏది అడిగినా సరే, నిస్సంకోచంగా ఆయనకు ఇచ్చేస్తాను" అన్నాడు. అప్పుడు ఆ గృహిణి గోరఖ్ అన్న మాటలకు మనసులో నవ్వుకుని, ఆపై గోరఖ్ యొక్క గురు భక్తి నిజమైనదో? కాదో? తేల్చుకోవాలని నిర్ణయించుకున్నది. అప్పుడు ఆమె మెత్తటి స్వరంతో "నాయనా! నీకు నీ గురువుమీద అంత గొప్ప భక్తి ఉన్నమాట వాస్తవమే అయితే నీ రెండు కళ్ళు పీకి అక్కడ పెట్టు. ఆపై నేను, నిన్న ఎలాంటి విందుభోజనం మీకు ఇచ్చానో, సరిగ్గా అలాంటి భోజనాన్నే ఈ పూట కూడా ఇస్తాను" అన్నది. ఆపై గోరఖ్ ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా తన కుడిచేతి చూపుడు వేలుని మరియు బొటనవేలుని కుడి కంట్లో దూర్చి ఆ కనుగుడ్డిని పెకలించే ప్రయత్నం మొదలుపెట్టాడు. అది చూసి హడలిపోయిన ఆ గృహిణి, పెద్ద స్వరంతో "నాయనా! దయచేసి నీ సాహసాన్ని మానుకో. నీ కళ్ళు నాకు అవసరం లేదు. నీవు కోరినట్లుగానే మంచి రుచికరమైన భోజనం ఒక గంటలోగా నీకు ఇస్తాను. దయచేసి శాంతించు" అన్నది. ఆపై ఆ గృహిణి, ఇరుగు పొరుగు గృహిణుల సహకారంతో చాలా కొద్దిసేపట్లోనే రచికరమైన వంటకాలు తయారుచేసి, వాటిని ఒక బుట్టలో సర్ది ఆపై ఆ బుట్టను గోరఖ్ చేతికి ఇచ్చింది. ఆపై గోరఖ్ వేగంగా నడుస్తూ తన గురువు దగ్గరకి ఆ బుట్టతో సహా బయలు దేరాడు.

ఘుమ ఘుమ లాడే వంటకాలతో నిండిన బుట్టను తన దగ్గరకు తెచ్చిన గోరఖ్‌ని చూసిన మత్స్యేంద్రనాథ్ చిన్నగా నవ్వాడు. ఆ తరువాత గోరఖ్ ముఖాన్ని పరిశీలనగా చూసి ఆపై అతడితో "నాయనా! నీ కళ్ళు అలా ఎర్రగా ఉన్నాయి. ఏం జరిగింది?" అన్నాడు. "మీకు మంచి భోజనం ఇవ్వటంకోసం ఆ గృహిణి, మొదట నా రెండు కళ్ళను అడిగింది. నేను మొదట నా కుడి కంటిని పీకబోతున్న సమయంలో ఆ గృహిణి వొద్దని అన్నది. కానీ, ఆ గుడ్డుని పెకలించటంకోసం నా కుడి కంట్లో నా చేతి వేళ్ళను గట్టిగా గుచ్చిన కారణంగా నా కన్ను ఇలా ఎర్రబడి ఉన్నది" అని గోరఖ్ తన గురువైన మత్స్యేంద్రనాథ్‌తో వినయపూర్వకమైన స్వరంతో చెప్పాడు. తనపట్ల అంతటి గురుభక్తిని కలిగి ఉన్న గోరఖ్‌నిచూసి మత్స్యేంద్రనాథ్ మహా సంతోషంతో పొంగిపోయాడు. ఆపై ఆయన గోరఖ్‌తో "బిడ్డా! నీకు నా పట్ల ఎంతటి దృఢమైన భక్తి ఉన్నదో తెలుసుకోవాలన్న ఆసక్తితోనే నేను ఆ ప్రత్యేక భోజనం తెమ్మని నీకు పరీక్ష పెట్టాను. ఆ గృహిణి నిన్ను ఏమి అడుగుతుందో కూడా నాకు ముందే తెలుసు.

నేను పెట్టిన ఈ కఠిన పరీక్షలో నువ్వు నెగ్గావు. నేను నీ గురు భక్తికి ఎంతో తృప్తి చెందాను. ఆ పరమశివుడికి మరియు నాకు తప్ప ఈ సృష్టిలో ఏ జీవికీ లేదా దైవానికి తెలియని మహా రహస్యమైన యోగశాస్త్ర రహస్యాలను నీకు ఇక నేను తెలియజేస్తాను. భవిష్యత్తులో నీవు "మహా గురువు"గా ఈ లోకంలో గుర్తించబడతావు" అన్నాడు. ఆపై, గోరఖ్‌ని తపస్సు చేసుకోవటంకోసం బదరీనారాయణ్ ప్రాంతానికి పంపించాడు మత్స్యేంద్రనాథ్. ఆ ఏకాంత ప్రదేశంలో గోరఖ్ కొన్ని సంవత్సరాలపాటు తీవ్రమైన తపస్సుచేసాడు. ఆ సమయంలో కొంతమంది అప్సరసలు మరియు యక్షిణులు, గోరఖ్ దగ్గరకు వచ్చి ఆయనను తమ వంపు సొంపులతో లొంగదీసుకుని ఆయన తపస్సుని భగ్నం చెయ్యాలని శతవిధాలా ప్రయత్నించారు. కానీ, గోరఖ్ కఠినమైన మనోనిగ్రహంతో తన తపస్సుని కొనసాగించాడు. ఫలితంగా, గోరఖ్‌నాథ్ అనేక సిద్ధులను పొందాడు. 12 సంవత్సరాల వయస్సులో తపస్సు ప్రారంభించిన గోరఖ్ తన 24వ సంవత్సరంలో తపో సిద్ధిని పొందాడు. ఆపై మత్స్యేంద్రనాథ్, గోరఖ్ వద్దకు వెళ్ళి గోరఖ్ యొక్క కఠిన దీక్షకు మరియు చేసిన తపస్సుకి ఎంతగానో మెచ్చుకున్నాడు. అంతేకాక తన దగ్గర ఉన్న సమస్త మంత్ర విద్యలను గోరఖ్‌కి ధారపోసాడు.

గోరఖ్‌నాథ్ కన్నా ముందు అనేకమంది సాధకులు, తంత్రసాధనలు చేస్తున్నప్పుడు ఆ సాధనలకు సంబంధించిన యక్షిణులు వారి దగ్గరకు రావటం జరిగింది. అసాధారణమైన రూప లావణ్యాలతో మెరిసిపోతున్న ఆ యక్షిణీలను చూసి సాధకులు తమ సాధన సంగతి మర్చిపోయి, ఆ అమానుష సుందరీ మణులతో నిరంతరం శృంగార సంభోగాలలో పాల్గొంటూ పతనం అయిపోవటం జరిగింది. కానీ, గోరఖ్‌నాథ్ మాత్రం అలాంటి కామ వ్యామోహాలకు ఏమాత్రం లోనుకాలేదు. తన సాధనలను కఠినమైన ఏకాగ్రతతో మరియు మనోనిగ్రహంతో కొనసాగించాడు. ఫలితంగా ఆ యక్షిణులు, గోరఖ్‌నాథ్‌కి అసాధారణమైన యోగసిద్ధులను ప్రసాదించారు.

కుండలినీ శక్తిని నిద్రలేపటానికి తాంత్రిక శృంగారం అవసరం అవుతుందని, ఆ సాధనలో యోగినీల యొక్క సహకారం కావాలని మత్స్యేంద్రనాథ్ ఉద్ఘాటించారు. గోరఖ్ – అన్ని విషయాలలోను తన గురువుని అనుసరించినప్పటికీ, తాంత్రిక సంభోగాన్ని సంపూర్తిగా తిరస్కరించాడు. అందుకు కారణం ఏమంటే, "కుండలినీ" సాధనకోసం స్త్రీతో సంభోగాన్ని ప్రారంభించే సాధకుడు కొద్ది రోజుల తరువాత సాధన విషయం మర్చిపోయి పరిపూర్ణంగా శృంగారానికి బానిసకావటం జరుగుతుంది.

అందువలన తంత్ర సాధకులు, స్త్రీకి సంపూర్తిగా దూరంగా ఉండాలని గోరఖ్‌నాధ్ శాసించాడు.

ఏ సాధకుడు, అయితే తనలోని శృంగార వాంఛలను దహించివేస్తాడో, ఆశల్ని వదిలివేస్తాడో, తనను నిరంతరం కమ్ముకుని ఉండే మాయను తొలగించుకుంటాడో అలాంటి సాధకుడి యొక్క పాదాలను కడగటానికి సాక్షాత్తు మహావిష్ణువు కూడా సిద్ధపడతాడు అని గోరఖ్‌నాధ్ తాను వ్రాసిన ఒక వేదాంత శాస్త్ర సంబంధ గ్రంధంలో తెలియజేసాడు.

కుండలినీ సాధనలో స్త్రీల పాత్ర ఏమాత్రం ఉండరాదని గోరఖ్‌నాధ్ ఉద్ఘాటించాడు. స్త్రీని సాధకుడికి ప్రమాదాన్ని కలిగించే క్రూరమైన జీవిగా పేర్కొన్నాడు. గోరఖ్‌నాధ్, స్త్రీ గురించి కొంత కఠినంగానే చెప్పటం జరిగింది. అది ఎలాగంటే... "గృహస్తు" అని పిలువబడే పురుషుడు తన ఇంట్లో "భార్య" అనే పేరు గల ఒక ఆడ పులిని, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ఒక రాక్షసిని పోషిస్తున్నాడు. ఆమెతో సంభోగం జరుపుతూ స్వర్గాన్ని పొందుతున్నట్లుగా భ్రమకు గురి అవుతున్నాడు. ఆ రాక్షసి యొక్క యోని, ఒక రక్తం త్రాగే పిశాచి. ఆ పిశాచికి (యోనికి) దంతాలు, కోరలు ఉండవు, కానీ, తనతో సంభోగం జరిపే పురుషుడియొక్క జీవశక్తిని అతడి వీర్యం ద్వారా పీల్చివేస్తుంది. సాధకుడు తన భార్యతో లేదా సంభోగ భాగస్వామితో వళ్ళు, వళ్ళు రుద్దుకుని ఆనందపడుతూ తన కాలాన్ని వృధా చేసుకుంటున్నాడు.

మహాగురు గోరఖ్‌నాధ్ అసాధారణమైన అతీంద్రియ శక్తులను కలిగి ఉన్నాడని చెబుతారు. ఆయన, ప్రకృతిని నియంత్రించగలడని, ఆకాశంలో ఎగరగలడని, నీటిమీద నడవగలడని, మట్టిని బంగారంగా మార్చగలడని చెబుతారు. ఆయన త్రికాలజ్ఞాని.



గోరఖ్‌నాధ్ భుజం మీద నుండి ఒక జోలె (సంచి లాంటిది) ఎల్లప్పుడూ వ్రేలాడుతూ ఉంటుంది. ఆ జోలెకు అమోఘమైన మహత్యం ఉంటుందని

చెబుతారు. గోరఖ్‌నాథ్, అవసరమైనప్పుడు తన జోలె నుండి ఏ పదార్ధాన్ని అయినా బైటకు తీసేవాడు. ఒక్కో సమయంలో ఆ జోలె నుండి భస్మాన్ని, ఒక్కోసారి పుష్పాలను, ఇంకోసారి బార్లి గింజలను, ఒక్కొక్కసారి యాపిల్ పండ్లను ఆ జోలె నుండి బైటకుతీసి తన భక్తులకు ఇస్తూ ఉండేవాడు. గోరఖ్‌నాథ్ ఒక్కో సమయంలో తన చేతిలో ఉన్న భస్మాన్ని రత్నాలుగా మార్చి అవసరమైనవారికి ఇస్తూ ఉండేవాడు. గోరఖ్‌నాథ్ ఒక ప్రత్యేకమైన చతురస్రాకార పట్టామీద కూర్చుని ధ్యానంచేసుకునేవాడు. ఈ పట్టా యొక్క విశేషం ఏమంటే, ఎక్కడో దూరంలో ఉండే ఎవరైనా శిష్యుడు ఆపదలో ఉండి గోరఖ్‌ని తలచుకున్నట్లయితే ఈ గోరఖ్ కూర్చుని ఉన్న ఈ పట్టా అనేకసార్లు చలించటం జరిగేది. ఆ సూచనలను బట్టి ఎవరో తన శిష్యుడు కష్టాలలో ఉన్నాడని గోరఖ్‌నాథ్ గ్రహించేవాడు. ఆపై ఆ శిష్యుడి కష్టాలను తన యోగశక్తితో తొలగించేవాడు. ఇంకొక విచిత్రం ఏమంటే, గోరఖ్‌నాథ్ అనేకసార్లు ఈ పట్టామీద కూర్చుని ఎగురుతూ అనేక ప్రదేశాలకు వెళ్ళి వచ్చేవాడని చెబుతారు.

గోరఖ్‌నాథ్, శివుడియొక్క సహకారంతో చేసిన అసాధారణమైన యోగసాధనల కారణంగా ఆయనకు అనేక మహిమలు సంప్రాప్తించాయి. ఫలితంగా, ఆయన శివుడి కన్నా గొప్పవాడు అన్న పేరును పొందాడు. హిమాలయ పర్వతాలలో ఈనాటికీ గోరఖ్‌నాథ్ సంచరిస్తూ ఉంటాడని భావిస్తున్నారు. అనేక మహిమలు కలిగిన ఆయనను హిమాలయ పర్వతాలలో నివసించే కొండజాతివారు "విద్యాధరుడు" అనే పేరుతో పిలుస్తూ ఉంటారు. "విద్యాధరుడు" అనగా మంత్ర విద్యలు తెలిసినవాడు అని అర్ధం.

గోరఖ్‌నాథ్‌కి అసాధారణమైన శక్తులు ఉన్నాయని చెబుతారు. ఒకసారి గోదావరి ఒడ్డున కుంభమేళా ఉత్సవాలు జరుగుతున్న సమయంలో గోరఖ్‌నాథ్ అక్కడకు వెళ్ళాడు. ఆ సమయంలో ఆయన, నేలమీద పరిచిన వేలాది విస్తరాకులలోకి రుచికరమైన భోజనాలు వచ్చేలాచేసి వాటిని అక్కడకు వచ్చిన యోగులకు ఇచ్చాడు. ఇంకొక సమయంలో ఆయన ఒక బండరాయిమీద మూత్ర విసర్జన చెయ్యగా అది బంగారంగా మారిపోయింది. గోరఖ్‌నాథ్ ఒక్కోసారి తన యోగ శక్తితో తగలబడి బూడిదగా మారి, ఆపై కొంతసేపు గడిచిన తరువాత మళ్ళీ యదార్ధ రూపాన్ని ధరిస్తూ ఉండేవాడు. ఇంకొక సమయంలో ఆయన తన మంత్రశక్తితో ఒక కొండయొక్క సగ భాగాన్ని బంగారంగా మార్చి ఆపై కొంతసేపటి తరువాత మళ్ళీ కొండగా మార్చాడు.

**గురువుకే జ్ఞానబోధ చేసిన మహాగురు గోరఖ్ :**

మత్స్యేంద్రనాధ్ తన మత లేదా జ్ఞానపరమైన సిద్ధాంతాలను ప్రచారం చెయ్యటంకోసం ఆనాటి సింహళ ప్రాంతానికి (సిలోన్/శ్రీలంక) వెళ్ళాడు. ఆ సమయంలో ఆ ప్రాంతాన్ని ఒక మహారాణి పరిపాలిస్తూ ఉండేది. మహాద్భుత సౌందర్యంగల మత్స్యేంద్రనాధుడిని చూసి మోహించిన ఆ మహారాణి, ఆయనను తన తాంత్రిక శక్తితో మరియు అద్భుతమైన అందంతో లొంగదీసుకుని ఆయన్ని తన అంత:పురంలో ఉంచుకుని ఆయనతో నిరంతరం శృంగార భోగాలు అనుభవించటం ప్రారంభించింది. ఎన్నేళ్ళు గడిచినా తన గురువైన మత్స్యేంద్రనాధుడు తిరిగి రాకపోవటంతో ఆయన శిష్యుడైన గోరఖ్‌నాధ్ ఆయనను వెతుక్కుంటూ సింహళ దేశానికి వెళ్ళాడు. ఆ మహారాణి, గోరఖ్‌నాధ్‌ని శ్రీలంక నుండి తరిమి వెయ్యటానికి తన శక్తిని ఉపయోగించింది. కానీ, గోరఖ్‌నాధ్ తన అసాధారణమైన యోగశక్తితో ఆ మహారాణి ప్రయత్నాలన్నీ భగ్నంచేసాడు. అప్పటికే ఆ మహారాణి, మత్స్యేంద్రనాధుడి ద్వారా పార్శ్వనాధ్ మరియు నేమినాధ్ అనే ఇద్దరు మగబిడ్డలను పొందింది.

గోరఖ్‌నాధ్ తన చివరి ప్రయత్నంగా తన గురువైన మత్స్యేంద్రనాధుడిని ఇహలోక బంధాల నుండి తప్పించటంకోసం మత్స్యేంద్రనాధుడి యొక్క ఆ ఇద్దరు కుమారులను సంహరించి, ఆపై వారి మృతదేహాలను ఒక చెట్టు కొమ్మకి వ్రేలాడదీసాడు. ఆ మృతదేహాలను చూసి మత్స్యేంద్రనాధుడు తీవ్రంగా రోదించాడు. గురువు యొక్క బాధను తగ్గించటంకోసం గోరఖ్‌నాధ్ ఆ ఇద్దరు బిడ్డలను మళ్ళీ బ్రతికించాడు.

ఆపై గోరఖ్‌నాధ్, మత్స్యేంద్రనాధ్‌కి "స్త్రీ సంబంధ వాంఛ ఎంత ప్రమాదకరమో, ఆ మహారాణియొక్క వ్యామోహంలో పడి మత్స్యేంద్రనాధుడు ఎంత పతనం అయిపోయాడో" వివరించాడు. గోరఖ్‌నాధ్ మాటల్లోని వాస్తవాన్ని గ్రహించిన మత్స్యేంద్రనాధుడు ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా గోరఖ్‌నాధ్‌తోపాటు వెళ్ళిపోవటానికి సిద్ధపడ్డాడు. మత్స్యేంద్రనాధుడిని తన ప్రాణ సమానంగా ఆరాధిస్తున్న ఆ మహారాణి, మత్స్యేంద్రనాధుడిని వదులుకోవటానికి ఏమాత్రం ఇష్టపడలేదు. కానీ, గోరఖ్‌నాధ్‌యొక్క మొండి పట్టుదల కారణంగా ఆమె, మత్స్యేంద్రనాధుడిని వెళ్ళకుండా ఆపలేకపోయింది. గోరఖ్‌నాధ్ తనతోపాటుగా తన గురువునే కాకుండా ఆయన ఇద్దరు కుమారులను కూడా తన వెంట పెట్టుకుని సింహళదేశం నుండి భారతదేశంవైపు బయలుదేరాడు. ఆ తరువాతకాలంలో మత్స్యేంద్రనాధ్ కుమారులైన పార్శ్వ మరియు నేమినాధులు 'జైన' మతానికి స్థాపకులుగా పరిణామం చెందారు.

నేపాల్‌దేశంలో ప్రచారంలో ఉన్న ఒక కథ ప్రకారం చూసినట్లయితే, ఒక సమయంలో గోరఖ్‌నాధ్ మరియు మత్స్యేంద్రనాధ్‌లు నేపాల్ దేశంలోని ఒక అరణ్యం గుండా నడిచివెళుతున్నప్పుడు అక్కడ ఒకచోట వారికి ఒక రాజుయొక్క మృతదేహం కనపడింది. అప్పుడు మత్స్యేంద్రనాధుడు తన శిష్యుడైన గోరఖ్‌తో "బిడ్డా! నేను కొంతకాలంపాటు ఈ రాజు దేహంలో జీవిస్తాను. నేను మళ్ళీ తిరిగి నా దేహంలో ప్రవేశించేదాకా నీవు నా పార్థివ దేహానికి కాపలాగా ఉండు" అని చెప్పి, ఆపై 'పరకాయ ప్రవేశ విద్య' ద్వారా తన శరీరాన్ని వదిలిపెట్టి, అక్కడ పడి ఉన్న మహారాజు యొక్క మృతదేహంలో ప్రవేశించాడు. ఫలితంగా, ఆ మహారాజు తిరిగి జీవించాడు. ఆపై ఆయన తన అంత:పురానికి తిరిగి వెళ్లాడు. ఆ అంత:పురంలో మహా సౌందర్య వంతులైన అనేకమంది రాణులు కనిపించారు. మత్స్యేంద్రనాధ్ మహాయోగి అయినప్పటికీ "మన్మధుడికి కూడా మతిపోగొట్టగల మహాద్భుతమైన ఒంపుసొంపులు ఉన్న ఆ రాణులను చూసి కామ వ్యామోహానికి గురయ్యాడు". ఆపై, ఆయన అనునిత్యం ఆ రాణులతో అద్దూఆపులేని శృంగార భోగాలు అనుభవించటం ప్రారంభించాడు. అలా సంవత్సరం గడిచింది. అక్కడ మత్స్యేంద్రనాధుడి మృతదేహానికి కాపలాగా ఉన్న గోరఖ్‌నాధ్‌కి తన గురువు, మళ్ళీ కామపంకిలం(పంకిలం అనగా ఊబి)లో చిక్కుకున్నాడని స్పష్టంగా అర్ధమయ్యింది. దాంతో, ఆయన ఒక చిలుకరూపంలో అంత:పురంలోకి ప్రవేశించి మత్స్యేంద్రనాధ్‌కి జ్ఞానబోధ చేసాడు. శిష్యుడియొక్క మాటలతో మత్స్యేంద్రనాధ్‌ని ఆవరించి ఉన్న కామ వ్యామోహం నశించి పోయింది. ఆపై, ఆయన తన శిష్యుడితో కలిసి ఆ అంత:పురం నుండి బైటకు వచ్చేసాడు. ఆపై ఆ రాజు శరీరాన్ని వదిలిపెట్టి మళ్ళీ తన దేహంలోకి ప్రవేశించాడు. పైన చెప్పి రెండు వృత్తాంతాల్లోను (సింహళదేశం, నేపాల్) గోరఖ్‌నాధ్ తన గురువుని కామ వ్యామోహం నుండి తప్పించి, ఆయనను మళ్ళీ జ్ఞానమార్గంలోకి రప్పించాడు. ఆవిధంగా గోరఖ్‌నాధ్ తన గురువైన మత్స్యేంద్రనాధుడికే గురువుగా గుర్తించబడ్డాడు. అందుకే గోరఖ్‌నాధుడిని నాధ మతస్తులు "మహా గురు గోరఖ్" అని పిలుస్తారు.

**గోరఖ్‌నాధ్ మాహాత్యాన్ని వివరించే వృత్తాంతములు :**

మహాభారతయుద్ధం ముగిసిన కొన్నేళ్ళ తరువాత ద్రౌపదితో సహా పంచ పాండవులు పైలోకాలకు వెళ్ళటానికి "మహాప్రస్థానం" ప్రారంభించారు. ఆ సమయంలో వాళ్ళు, హస్తినాపురం (ఢిల్లీ) నుండి బయలుదేరి కాలి నడకన ఉత్తరం వైపుగా ఉన్న హిమాలయ పర్వతాలమీదకి చేరుకున్నారు. ఆ తరువాత స్వర్గారోహణ చెయ్యటానికి

వీలును కలిగించే అతి ఎత్తైన ఒక పర్వత శిఖరం మీదకి నడక ప్రారంభించారు. (హిమాలయ పర్వతాలలో ఉన్న ఒక శిఖరంమీద నుండి పై లోకాలకు చేరుకునే మార్గం ఉంటుందని హైందవ మత గ్రంథాలలో చెప్పబడి ఉన్నది. ఆ కారణంగానే పాండవులు హిమాలయాలలోని ఆ శిఖరంవైపు ప్రయాణించారు అని గ్రహించాలి.) ఏదిఏమైనా, ఆ శిఖరంవైపు ప్రయాణిస్తున్న ద్రౌపది మరియు పంచ పాండవులు ముందుకి నడుస్తున్నారు. ఆ సమయంలో ఒక్కొక్కరు నేలపై కూలిపోయి మరణించటం ప్రారంభించారు. ఒక్క భీమసేనుడు మాత్రమే నేలపై కూలిపోయి మూర్ఛపోయాడు కాని, చనిపోలేదు. కానీ, ధర్మరాజు మాత్రం సజీవంగా ఆ శిఖరం మీదకి చేరుకున్నాడు. ఆపై, అక్కడికి ఇంద్రుడు పంపిన స్వర్గలోక విమానం వచ్చింది. ధర్మరాజు ఆ విమానం ఎక్కి సశరీరంగా స్వర్గలోకానికి వెళ్లిపోయాడు. ఆ సమయంలో హిమాలయాలలో సంచరిస్తున్న గోరఖ్‌నాథ్‌కి ఆ మంచు పర్వతంమీద మూర్ఛలో ఉన్న భీమసేనుడు కనిపించాడు. భీమసేనుడిమీద జాలిపడిన గోరఖ్‌నాథ్, ఆయన్ని రక్షించి, ఆపై ఆయన్ని నేపాల్ దేశానికి ప్రభువుగా చేసాడు. ఆ కారణంగానే నేపాల్ రాజవంశస్తులు, "భీమసేనుడిని తమ వంశ మూలపురుషుడిగా" చెప్పుకోవటం జరుగుతున్నది. గోరఖ్‌నాథ్, వంధ్యలు అయిన అనేకమంది స్త్రీలకు సంతానాన్ని ప్రసాదించిన సంఘటనలు ఎన్నో జరిగాయి. గోరఖ్‌నాథ్ యొక్క అనుగ్రహంతో పుట్టిన వారిలో చాలామంది గొప్ప యోగులుగా గుర్తించబడ్డారు.

గోరఖ్‌నాథ్ – అష్ట నాగులను తన ఆధిపత్యంలో ఉంచుకున్నాడని చెబుతారు. ఈ అష్టనాగులు ఎవరంటే – 1.అనంతుడు – ఈ సర్పం ముదురు నీలం రంగులో ఉంటుంది. ఇది తూర్పు దిక్కుకి రక్షకుడికిగా ఉంటుంది. 2.పద్మక అనే ఐదు తలల సర్పం తామరతూడు (కాడ) రంగులో ఉంటుంది. ఇది దక్షిణ దిక్కుకి రక్షకుడిగా ఉంటుంది. 3. తక్షక అనే సర్పం, కుంకుమ పువ్వు రంగులో ఉంటుంది. దీనికి తొమ్మిది పడగలు ఉంటాయి. ఇది పశ్చిమ దిక్కుకి రక్షకుడిగా ఉంటుంది. 4. తక్షకుడు అనే ఏడు తలల సర్పం ముదురు ఆకుపచ్చ రంగులో ఉంటుంది. ఇది ఉత్తర దిక్కుకి అధిపతిగా ఉంటుంది. 5. శంఖపాల అనే మహా సర్పం ముదురు పసుపు రంగులో ఉంటుంది. ఇది నైరుతిదిశకు రక్షకుడిగా ఉంటుంది. 6. కులిక అనే 30 పడగల మహా సర్పం తెలుపు రంగులో ఉంటుంది. ఇది వాయువ్య దిశకు రక్షకుడిగా ఉంటుంది. 7.బంగారం రంగులో ఉండే మహా పద్మ అనే సర్పం ఈశాన్య దిక్కుకి రక్షకుడిగా ఉంటుంది. అష్టనాగులలో ఎనిమిదవ వాడు అయిన కర్కోటకుడు నీలం రంగులో ఉంటాడు. అయితే ఈ కర్కోటకుడు మానవ రూపంలో కనిపిస్తాడు.

ఇతడికి పాము తోక ఉంటుంది. తనతోటి సర్పాలలాగా కాకుండా, తనకి చాలా వరకు మానవ రూపం ఉన్న కారణంగా కర్కోటకుడు ఎంతో సిగ్గుపడతాడు. ఆ కారణంగానే అతిశక్తివంతమైన మంత్రాలను ఉపయోగించేవారికి మాత్రమే కర్కోటకుడు కనిస్తాడు. అదికూడా మానవ రూపంలో కనిపిస్తాడు.

**నాథ మతంలో చెప్పబడిన పవిత్ర జంతువులు :**

"నాథ" మతంలో అనేక రకాల జంతువులకు పవిత్రమైన స్థానం ఇవ్వబడింది. హిందూమతంలో లాగానే ఈ మతంలో కూడా గోవుని ఆరాధిస్తారు. అదేవిధంగా ఖడ్గమృగం (రైనో), కుక్కలు, సర్పాలు, నలుపురంగు జింకలకు కూడా "నాథ" మతంలో ప్రముఖస్థానం ఇవ్వబడింది. ఇక, నల్లజింకకు "నాథ" సాంప్రదాయంలో ప్రముఖస్థానం ఇవ్వటానికి వెనుకాల ఒక చారిత్రక వృత్తాంతము కనిపిస్తుంది. అది ఏమిటంటే, భతృహరి అనే రాజు ఒక సమయంలో ఒక అరణ్యంలోకి వేటకు వెళ్ళాడు. ఆ సమయంలో ఆయనకు ఒక జింకల మంద కనపడింది. ఆయన వాటిని వేటాడటానికి వాటి వెంట పడ్డాడు. అయితే, ఆయన ఎంత ప్రయత్నించినా వాటిలో ఒకటి కూడా భతృహరి బాణానికి దొరకలేదు. అయితే, చాలాసేపటి వరకు భతృహరి ఆ దుప్పులను వెంటాడాడు. ఆ సమయంలో ఒక దుప్పి, పరుగు ఆపి ఒకచోట నిలబడింది. దానిని వెంటాడుతూ వచ్చిన భతృహరి కూడా ఆ దుప్పికి కొద్ది అడుగుల దూరంలో నిలబడ్డాడు. అప్పుడు ఆ దుప్పి, మానవ భాషలో ఆ రాజుతో ఇలా చెప్పింది. "ఓ రాజా! క్షత్రియ వంశానికి చెందిన నీవు వేటాడలేక తిరిగి వెళ్ళిపోవటం నీకు చాలా అవమానకరం. అందువల్ల నీ బాణాన్ని నామీద ప్రయోగించి నన్ను చంపు. నేను చనిపోయిన తరువాత నా కాళ్ళను దొంగకి ఇవ్వు. అలా ఇవ్వటం వల్ల దొంగ, తాను దొంగతనం చేసిన తరువాత చాలా వేగంగా పరుగెత్తి ఎవరికీ దొరక్కుండా ఉంటాడు. ఇక, నా కొమ్ముల్ని యోగికి ఇవ్వు. అతడు ఆ కొమ్ముతో బూరా తయారు చేసి అవసరమైనప్పుడు ఆ బూరాను ఊదుతాడు. ఇక, నా చర్మాన్ని ఋషికి ఇవ్వు. ఆయన నా చర్మం మీద కూర్చుని తపస్సు చేసుకుంటాడు. ఇక, అందమైన నా నేత్రాలను అందమైన స్త్రీకి ఇవ్వు. ఫలితంగా, ఆమెకు "మృగనయని" (లేడి కళ్ళవంటి కళ్ళను కలది) అన్న పేరు వస్తుంది. ఇక, నా మాంసాన్ని నీవు ఆరగించు. నీ వంటి పుణ్యాత్ముడు తినటం వల్ల నా భౌతిక దేహానికి ఎంతో పుణ్యం లభిస్తుంది".

ఆపై, భతృహరి తన ధనస్సు నుంచి ఒక బాణాన్ని ఆ దుప్పిపైకి ప్రయోగించాడు. ఆ బాణం దిగగానే ఆ దుప్పి చనిపోయింది. సరిగ్గా అదే సమయంలో ప్రక్కనే ఉన్న

చెట్ల పొదల మధ్య నుండి గోరఖ్‌నాథ్ బైటకు వచ్చి, అక్కడ నేలమీద పడి ఉన్న దుప్పి మృతదేహాన్ని చూసి ఆపై క్రోధంతో భతృహరితో ఇలా అన్నాడు. "నీవు అన్యాయంగా నా శిష్యుడిని చంపావు".

అప్పుడు భతృహరి విచిత్రమైన స్వరంతో "నేను ఆ దుప్పిని చంపినమాట వాస్తవం. ఆ దుప్పి నిజంగా నీ శిష్యుడు అయితే, నీవు దానిని బ్రతికించు". అప్పుడు గోరఖ్‌నాథ్ ఒకసారి పరిశీలనగా భతృహరి ముఖంలోకి చూసి, ఆపై క్రిందకు వంగి నేలమీద నుండి గుప్పెడు మట్టిని తీసుకుని, ఆ మట్టిని తన కళ్ళకు అద్దుకుని మంత్రించాడు. ఆ తరువాత ఆ మట్టిని ప్రక్కనే పడి ఉన్న దుప్పి మృతదేహంపై చల్లాడు. ఆ మరుక్షణం ఆ దుప్పి బ్రతికి లేచి నిలబడింది.

గోరఖ్‌నాథ్ ఆనాటి బౌద్ధమత మరియు వైదిక బ్రాహ్మణ మత సిద్ధాంతాలను చాలావరకు వ్యతిరేకించాడు. ముఖ్యంగా, బహుదేవతారాధనను, విపరీతమైన ఛాందస ఆచారాలను ఖండించాడు. ఫలితంగా, ఆనాటి భారతదేశంలోని అనేకమంది నిస్సహాయులైన అంటరానివారు అనగా నిమ్న కులస్తులు "నాథ" మతంలోకి చేరిపోయారు.

మహా గురువుగా పేరుపొందిన గోరఖ్‌నాథ్ దాదాపు 40 గ్రంధాలను వ్రాసాడు. వాటిలో ఎక్కువ భాగం సంస్కృత భాషలో ఉండగా, తక్కువ సంఖ్యలో హిందీ భాషలో ఉన్నాయి. తన మత సిద్ధాంతాలను తాను రచించిన అద్భుత గ్రంధాల ద్వారా ప్రజల్లోకి తీసుకువెళ్లటం గోరఖ్‌నాథ్ యొక్క ప్రత్యేకతగా గుర్తించబడింది. గోరఖ్‌నాథ్ హిందీలో వ్రాసిన పద్యరూప గ్రంధాలలో గోరఖ్‌నాథ్ తన గురువైన మత్స్యేంద్రనాథ్ (మీనానాథ్)తో జరిపే వేదాంత సంబంధ చర్చలు కనిపిస్తాయి.

**కన్‌ఫటా యోగులు :**

గోరఖ్‌నాథ్ ప్రబోధించిన మతాన్ని పాటించేవారు కనుక ఆయన మతాన్ని అనుసరించే యోగుల పేరు చివర "నాథ్" అనే బిరుదులాంటి పదం చేర్చబడుతుంది. "నాథ" మతంలోకి చేర్చుకోబడేవారు మొదట, అనేక రకాల కఠినమైన పరీక్షలకు గురి చేయబడతారు. "నాథ" మతాన్ని అనుసరించగలిగే శక్తిసామర్ధ్యాలు కలిగిన వ్యక్తికి ముందుగా చెవి లోపలిభాగంలో అనగా చెవి తమ్మెకి వెనక వైపున ఒక చురకత్తితో రంధ్రంచేసి దానిగుండా ఒక కుండలాన్ని చెవికి అమరుస్తారు. అదేవిధంగా రెండవ చెవికి కూడా ఒక కుండలాన్ని అమరుస్తారు. "నాథ" యోగులుగా దీక్ష

తీసుకోవటానికి అర్హులయ్యే వ్యక్తులయొక్క "చెవులకు చిల్లులు" వేస్తారు కనుక ఈ వ్యక్తులకు సన్యాసదీక్ష ఇచ్చిన తరువాత వీరిని "కన్‌ఫటా" యోగులు అని పిలుస్తారు. ("కన్‌ఫట్" అనగా చీల్చబడిన చెవులుగల అని అర్ధం – "కాన్" అనగా చెవి అని, "ఫటా" అనగా చీల్చటం అని అర్ధం.)

ఇలా చెవులకు చిల్లులు పెట్టటం వెనకాల యోగశాస్త్ర సంబంధమైన ఒక కారణం ఉన్నదని తెలుస్తున్నది. అది ఏమిటంటే...కుండలాలు ధరింపచేయటానికి చెవి లోపల భాగంలో రంధ్రం చేసినప్పుడు, ఆ ప్రాంతం గుండా వెళు తున్న ఒక "నాడి" ఖండించ బడు తుంది. ఫలితంగా, ఆ వ్యక్తికి కొన్ని అసాధారణ యోగశక్తులు వస్తాయి. "నాధ" యోగులుగా చేర్చుకోబడేవారికి మొదట, చెవులకు కుండలాలు/ రింగులు ధరింప చేస్తారు. ఈ కుండలాలు లేకుండా "నాధ" మతస్తులు ఆహారంకూడా తీసుకోరు. అంతటి పవిత్రస్థానం మరియు ముఖ్యస్థానం ఈ కుండలాలకు ఇవ్వబడింది. "నాధ" సాంప్రదాయంలో ఈ కుండలాలను ధరించే విధానం ఎలా ప్రారంభం అయ్యిందో? తెలిపే ఒక కధ "నాధ" సాహిత్యంలో కనిపిస్తుంది. అది ఎలాగంటే...



పార్వతీదేవి ఒకసారి తన ఒంటిమీద ఉన్న మట్టితో తొలిసారిగా ఈ కుండలాలను సృష్టించింది. ఆ తరువాత తొలిసారిగా పరమశివుడియొక్క చెవులకు రంధ్రాలువేసి వాటికి ఈ కుండలాలను అమర్చింది. ఫలితంగా, ఆయన మరణాన్ని జయించాడు. ఆ తరువాత పార్వతీదేవి, స్వయంగా ఒక జత కుండలాలను గోరఖ్‌నాధ్‌కి ధరింప చేసింది. ఫలితంగా, గోరఖ్‌నాధ్ కూడా ఏనాటికీ మరణంలేని మహాయోగిగా మారాడు. ఆ తరువాతకాలంలో "నాధ" మతంలోకి చేర్చుకోబడే ప్రతి శిష్యుడికీ మొదట చెవులకు కుండలాలు అమర్చి ఆ తరువాతే అతడికి "నాధ" మత సిద్ధాంతాలు బోధించబడ్డాయి.

ఖడ్గమృగం యొక్క తలభాగంలో ఉండే ఖడ్గం లాంటి బలమైన ఎముక నుండి తయారుచేసిన కర్ణాభరణాలను ధరించటం "నాధ" మతంలో ఒక సాంప్రదాయంగా గుర్తించబడింది. అంతేకాకుండా, "నాధ" యోగులు తమ కుడిచేయి యొక్క చూపుడు వేలుకి ఖడ్గమృగం కొమ్ముతో తయారు చేసిన ఉంగరాలను ధరించటం జరిగింది. సాక్షాత్తూ, పరమేశ్వరుడే ఖడ్గమృగం కొమ్ముతో తయారుచేసిన కుండలాలను చెవులకు ధరించాడని "నాధ" మతంలో విశ్వసించబడింది.

ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, "నాథ" మతాన్ని పాటించే స్త్రీలను "నాథిని" అనే పేరుతో పిలుస్తారు. పశ్చిమ భారతదేశంలో "నాథ" మత యోగినులను "ధర్మనాథి" అనే పేరుతో పిలుస్తారు. "నాథ" యోగినులుగా మారిన స్త్రీలు ముఖ్యంగా, వితంతు స్త్రీలు (భర్త చనిపోయిన స్త్రీలు) అనేక రకాల కుండలాలను తన చెవులలో ధరిస్తారు.

"నాథ" మతంలో కులవ్యవస్థ లేదు. ఆహారం తీసుకోవటంలో, మద్యం సేవించటంలో, పొగ త్రాగటంలో (గంజాయి లేదా పొగాకు) ఎలాంటి కుల విచక్షణ ఉండదు. ఎవరు, ఎవరితో అయినా సరే కలిసి నిరభ్యంతరంగా భోజనాలు చెయ్యవచ్చు. మధువు సేవించవచ్చు. పొగ త్రాగవచ్చు. "నాథ" మతంలో అందరూ సమానులుగా గుర్తించబడ్డారు. అయితే, స్త్రీలను మాత్రం పురుష నాథయోగులు సహపంక్తి భోజనాలకు రానివ్వరు. స్త్రీ యోగినులు ప్రత్యేకంగా భోజనాలు చేస్తారు.

"నాథ" సాంప్రదాయంలోని కొంతమంది మరియు ఉత్తర భారతదేశంలోని చాలామంది హిందువులు గోరఖ్‌నాథ్‌ని శివుడియొక్క ఇంకొక రూపంగా భావిస్తారు. ఫలితంగా, కొన్ని శివాలయాలలో గోరఖ్‌నాథ్ యొక్క విగ్రహాన్ని ఉంచి పూజించటం జరుగుతున్నది. కొన్ని ప్రదేశాలలో గోరఖ్‌నాథ్‌కి ప్రత్యేకమైన ఆలయాలు ఉన్నాయి. "నాథ" యోగులు ఈనాటికీ భారతదేశంలోని చాలా ప్రాంతాలలో కనిపిస్తారు. ఉత్తర భారతదేశంలోని కొంతమంది యోగులు ఈనాటికీ గోరఖ్‌నాథ్ మరియు భతృహరిలను – తమ గురువులని చెప్పుకోవటమే కాకుండా, తాము "నాథ" వర్గానికి చెందిన వారమని భావిస్తారు.

ఉత్తర భారతంలో చాలామంది నాథయోగులు సంసారులుగా ఉండటం విశేషం. పంజాబ్ ప్రాంతంలో కుటుంబ జీవితాన్ని గడిపే నాథయోగుల్ని "రావల్" అనే పేరుతో పిలుస్తారు. వీళ్ళు, నాథయోగులయొక్క చరిత్రలను గీతాలుగా పాడుతూ ఆపై ప్రజలు ఇచ్చే భిక్షతో జీవితాన్ని గడుపుతూ ఉంటారు. ఇక, బెంగాల్ ప్రాంతంలో ఉండే నాథ సన్యాసులను "జోగులు" అని పిలుస్తారు. ఒక విశేషం ఏమంటే, ఇలా కుటుంబ జీవితాలు గడుపుతూ నాథయోగులుగా ఉండే వారిలో అత్యధిక సంఖ్యాకులు వస్త్రాలు నేసే "సాలె" కులానికి చెంది ఉన్నారు.

టిబెట్‌దేశంలో ప్రచారంలో ఉన్న సమాచారం ప్రకారం చూసినట్లయితే, గోరఖ్‌నాథ్ టిబెట్ దేశానికి చెందిన ఒక మహా 'మంత్రవాది' అని తెలుస్తున్నది. ఇంకొక విచిత్రం ఏమంటే, గోరఖ్‌నాథ్ పెంపుడు బిడ్డ 'మహమ్మద్' అని, ఆ మహమ్మదే తరువాతకాలంలో ఇస్లాం మతాన్ని స్థాపించాడని చెబుతారు. ఆ కారణంగానే 12,

13 శతాబ్దాల మధ్య జీవించిన అనేకమంది ముస్లిం యోగులు, గోరఖ్‌నాధుడిని తమ గురువుగా గుర్తించారు. నేటి పాకిస్థాన్‌లోని సింధు ప్రాంతంలో గోరఖ్‌నాధుడిని "దాతర్ జమిల్‌షా" అనే పేరుతో ఆరాధిస్తున్నారు.

ఉత్తర ప్రదేశ్‌లోని తూర్పు ప్రాంతంలోని అనేక గ్రామాలలో ముస్లిం యోగులు నివసిస్తున్నారు. విచిత్రం ఏమంటే, ముస్లిం యోగులు, ముస్లిం సాంప్రదాయ రంగు అయిన ఆకుపచ్చరంగు వస్త్రాలు ధరించాలన్న నియమం ఉండగా, ఉత్తర ప్రదేశ్‌లో నివసించే ముస్లిం యోగులు, ఇతర నాధ యోగులు లాగా కాషాయరంగు వస్త్రాలు ధరించటం జరుగుతుంది. ఈ ముస్లిం యోగులు తమ చేతులలో ఒక సారంగి వాయిద్యాన్ని పట్టుకుని, ఆపై తమ సమీప ప్రాంతాలలో ఉండే గ్రామాలలో తిరుగుతూ నాధ యోగులలో ప్రముఖులుగా గుర్తించబడ్డ గోపీచంద్ర మరియు రాజాభతృహరి లాంటి ప్రభువులు – మహా గురువు అయిన గోరఖ్‌నాధ్ యొక్క ప్రభావం వల్ల ఏవిధంగా సన్యాసులుగా మారిపోయారో? పాటలుగా పాడుతూ ఉంటారు. వీళ్ళు పాడే పాటలు విని ఆనందించే వివిధ వర్గాల గ్రామస్తులు, వీళ్ళకి ఆహారము మరియు కొద్ది మొత్తంలో డబ్బు అభిమానంగా ఇచ్చి ఆదరించటం జరుగుతుంది. ముఖ్యంగా, మహాగురు గోరఖ్ గురించి ఈ ముస్లిం సన్యాసులు పాడుతున్నప్పుడు గ్రామస్తులు విపరీతమైన ఆనందానికి లోనుకావటం జరుగుతుందని చెబుతారు.

భారతదేశంలోని ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని గోరఖ్‌పూర్ అనే పట్టణం గోరఖ్‌నాధ్ పేరుమీదుగా ఏర్పడినట్లుగా తెలుస్తున్నది. ఒక విశేషం ఏమంటే, ఈ పట్టణం నేపాల్ దేశానికి దాదాపు 100 కి.మీ. దూరంలో ఉన్నది. అందువలన ఆ కాలంలో గోరఖ్‌నాధ్ ఈ ప్రాంతం నుండి నేపాల్‌కి వెళ్ళినట్లుగా తెలుస్తున్నది. ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని పూర్వాంచల్ ప్రాంతంలో (అనగా ఉత్తర ప్రదేశ్ యొక్క ఈశాన్య ప్రాంతం) ప్రవహిస్తున్న రాప్తీనది తీరంలో ఈ గోరఖ్‌పూర్ పట్టణం ఉన్నది. ఈ ప్రాంతంలోనే గోరఖ్‌నాధ్ జన్మించాడని భావిస్తున్నారు. ఆ కారణంగానే, ఇక్కడ గోరఖ్‌నాధ్ యొక్క ఆలయం (గోరఖ్‌నాధ్ సన్యాసుల మఠం) ఉన్నది. ఈ మఠంలో లేదా ఆలయంలో గోరఖ్‌నాధ్ యొక్క సమాధి మరియు ఆయన ఆనాడు తపస్సు చేసుకున్న గద్ది (ప్రార్ధనా ఆసనం) ఉన్నట్లుగా తెలుస్తున్నది. ప్రతి సంవత్సరం మకర సంక్రాంతి రోజున బాబా గోరఖ్‌నాధ్ అనుగ్రహం పొందటంకోసం ఇక్కడకు వచ్చిన భక్తులు ప్రత్యేక ప్రార్ధనలు, పూజలు చేస్తారు. "నాధ" సాంప్రదాయంలో కులవ్యవస్థకు స్థానంలేదు. ఆ కారణంగానే ఈ గోరఖ్‌నాధ్ మందిరంలో బ్రాహ్మణేతర పూజారులు పూజలు నిర్వహిస్తూ ఉంటారు. ఈ మఠం యొక్క మహంత్ (ప్రధాన పూజారి)

మరణించినప్పుడు ఆ యోగియొక్క మృతదేహాన్ని ఈ మఠంలోనే సమాధి చేస్తారు. ఆ తరువాత ఇంకొక యోగిని ప్రధాన మహంత్‌గా నియమిస్తారు. ఇంకొక విశేషం ఏమంటే, ఈ మఠానికి చెందిన యోగి ఆదిత్యనాథ్ – ప్రస్తుతం ఉత్తర ప్రదేశ్ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ఉన్నాడు. యోగులు, రాజ్యాలను పరిపాలించటం అనే సాంప్రదాయం గొప్ప ప్రజా సంక్షేమాన్ని ప్రసాదిస్తుందని కొంతమంది హైందవ వేదాంతులు అభిప్రాయపడుతున్నారు.

గోరఖ్‌నాథ్ సిద్ధపురుషుడిగా గుర్తించబడ్డాడు. ఆయన, ఎంత దూరంలో ఉన్నప్పటికీ అక్కడ నుండే తన భక్తులను కాపాడతాడని చెబుతారు. ఈనాటికీ గోరఖ్‌నాథ్ హిమాలయ పర్వతాలలో సంచరిస్తూ ఉంటాడని తెలుస్తున్నది. గోరఖ్‌నాథ్‌కి సంబంధించిన ఒక 'శాబరి' మంత్రాన్ని 366 రోజులపాటు జపం చేసిన వారికి గోరఖ్‌నాథ్ యొక్క సాక్షాత్కారం కలుగుతుందని ఫలితంగా, వారికి త్రికాలజ్ఞానం లభిస్తుందని చెబుతారు. దాదాపు రెండు దశాబ్దాల క్రితం తిరుపతి ప్రాంతంలో జీవించిన మా గురువుగారైన శ్రీకేశవన్ అయ్యంగారికి గోరఖ్‌నాథ్‌యొక్క సాక్షాత్కారం జరిగినట్లుగా తెలుస్తున్నది. అంతేకాకుండా, ఆయనకు గోరఖ్‌నాథ్‌ని ప్రత్యక్షం చేసుకోగల అతి రహస్యమైన 'శాబరి' మంత్రం కూడా తెలుసు అన్నమాట వాస్తవం. ఆయన ఆ మంత్రాన్ని ఎవరికి ఉపదేశించారో ఆయనకు మరియు ఆ గోరఖ్‌నాథ్‌కి మాత్రమే తెలుసు అనటంలో అతిశయోక్తిలేదు.



# 2. ఓడియన్ మంత్రగాళ్ళ మహా గురువు 'కారి గురుక్కల్' అద్భుత జీవిత విశేషాలు?

ప్రాచీన కేరళ రాష్ట్రంలో నిమ్న జాతులవారు, అగ్ర కులాల యొక్క అణచివేతకు గురి అవుతూ ఉండేవారు. అగ్ర కులాలలో ప్రముఖులైన నంబూద్రి బ్రాహ్మణులు వేద సంబంధమైన "మంత్రవాదాన్ని" పాటిస్తూ ఉండేవాళ్ళు. భారతదేశ ఆగ్నేయ ప్రాంతంలో ఉన్న కేరళ రాష్ట్రంలోని నేటి కాసర్‌గడ్ మరియు కన్నూర్ జిల్లాలు, వైయనాడ్ జిల్లాలోని మనంధవాడి తాలూకా, కోజికోడ్ జిల్లాలోని కోయిలాండి, వాతకర తాలూకాలను కలిపి "ఉత్తర మలబార్" అనే పేరుతో పిలుస్తారు. ఈ

ప్రాంతంలోనే కారిగురుక్కల్ జీవితం గడిచిందని చరిత్ర తెలియజేస్తున్నది.

అయితే, ఆనాటి హైందవ సమాజంలో అత్యంత అల్పస్థాయికి చెందిన "పులియన్లు" అనే కులస్తులు, ఆటవిక మతానికి చెందిన మంత్రవాదాన్ని అనుసరించటం జరిగింది. హైందవ మతంలో అత్యంత తక్కువస్థాయి కులంగా గుర్తించబడిన పుల్యన్ కులస్థులు కర్నాటక, కేరళ, తమిళనాడు రాష్ట్రాలలో వ్యాపించి ఉన్నారు. ఆనాటి పులియన్లలలో కారిగురుక్కల్ అనే అసాధారణమైన వ్యక్తి ఆవిర్భవించాడు. అతడు యుద్ధ విద్యలలో మహానిపుణుడు. అంతేకాకుండా, అనేక తాంత్రిక విద్యలను ఔపోసన పట్టాడు. అతనికి ఉన్న ఒక ప్రత్యేక శక్తి ఏమంటే "అవసరం అయినప్పుడు అతడు పులిగా మారిపోగలడు". ఆ కాలంలో పులియన్ కులానికి చెందిన మంత్రవాదులు, ఈ కారిగురుక్కల్‌ని "పులిమరంజ తొాండచ్చన్" అని గౌరవించేవాళ్ళు. (ఈ మళయాళ భాషా పదానికి పులిగా మారిన ముత్తాత అని అర్ధం.) ఒకవిధంగా చెప్పాలంటే పుల్యన్ కులస్తులకు ఈ కారిగురుక్కాల్ కులదైవంగా గుర్తించాలి.



**(పులియన్ దంపతులు)**

ప్రాచీనకాలంలో మంత్రాన్ని జపించాలన్నా, మంత్రవాదం (తాంత్రిక ప్రయోగం) చెయ్యాలన్నా కేవలము నంబూద్రి బ్రాహ్మణుడికే అర్హత ఉండేది. ఇతర కులాలకు మంత్రవిద్యలు నేర్పబడేవి కాదు.

కారిగురుక్కాల్ పుట్టుకతో బ్రాహ్మణుడు కాదు. కానీ, తన స్వయంకృషితో అనేక తంత్రవిద్యలను నేర్చుకుని, ఆకాలంలో గొప్ప మంత్రవాదులుగా పేరుపడిన అనేకమంది నంబూద్రి బ్రాహ్మణుల కన్నా గురుక్కాల్ గొప్పవాడిగా పేరు పొందాడు.

ఆనాటి ఉత్తర కేరళలోని కన్నూర్ జిల్లాలో ఉన్న కరివల్లూర్ అనే ప్రాంతంలో గురుక్కాల్ జీవించినట్లుగా తెలుస్తున్నది.

మహా మంత్రవాదిగా, అంతకు మించి అనేక యుద్ధ విద్యలు తెలిసిన బలశాలిగా పేరుపొందిన కారిగురుక్కల్‌ని ఆయన పుట్టిన పులియన్ కులస్తులు తమ కులగురువుగా పూజిస్తారు. ముఖ్యంగా, ఆ తరువాతకాలంలో వచ్చిన అనేకమంది పులియన్

మంత్రగాళ్ళు, కారిగురుక్కల్‌ని తమ మంత్రవాద "మహాగురువు"గా గుర్తించటం జరిగింది.

**పులిగా మారిన కారిగురుక్కల్ :**

ఏదిఏమైనా, ఒక తక్కువ కులంలో పుట్టిన కారిగురుక్కల్ ఆనాటి కేరళ అంతటా గొప్ప పేరుని సంపాదించుకున్నాడు. "ఒక నిమ్నజాతి కులస్తుడు తమ కన్నా గొప్పవాడుగా గుర్తించబడటం" ఆనాటి బ్రాహ్మణేతర అగ్రకులస్తులకు ఏమాత్రం రుచించలేదు. ఏదోఒకవిధంగా కారిగురుక్కల్‌ని అంతం చెయ్యాలని ఆ ప్రాంతానికి చెందిన అనేకమంది అగ్రకుల నాయర్లు ఆశపడుతూ ఉండేవాళ్ళు. అలాంటి సమయంలో ఆ ప్రాంతంలోని బాగా సంపన్నుడైన ఒక నాయర్ కుల భూస్వామికి అతి భయంకరమైన చర్మవ్యాధి వచ్చింది. ఆ వ్యాధికి ఆనాటి ప్రముఖ ఆయుర్వేద వైద్యులు ఎన్ని ఔషధాలు ఉపయోగించినా ఆ వ్యాధి ఏమాత్రం తగ్గలేదు. అలాంటి పరిస్థితుల్లో ఆ వైద్యులలో ప్రముఖుడైన ఒక వృద్ధ వైద్యుడు, ఆ భూస్వామికి ఇలా చెప్పాడు. అది ఏమిటంటే...ఆడ చిరుతపులి యొక్క మెడ భాగంలో ఉండే జూలు మరియు తోకతో తయారుచేసే ఔషధం ద్వారా మాత్రమే ఆ భూస్వామియొక్క చర్మవ్యాధి తగ్గుతుందని. చిరుతపులి యొక్క జూలును తీసుకురాగలిగిన సమర్థుడు కేవలము కారిగురుక్కల్ మాత్రమే అని తెలుసుకున్న ఆ భూస్వామి, కారిగురుక్కల్‌ని తన దగ్గరకు రప్పించుకుని ఆపై అతడితో ఇలా చెప్పాడు. "నాకు అతి దారుణమైన చర్మవ్యాధి వచ్చింది. కేరళలోని ఏ వైద్యుడూ నా రోగాన్ని ఇంతవరకు తగ్గించలేకపోయాడు. ఒక వృద్ధ వైద్యుడు చెప్పిన సలహా ప్రకారం, చిరుతపులి శరీరంమీద ఉండే వెంట్రుకలతో చేసిన ఔషధం ఉపయోగిస్తే నా చర్మవ్యాధి తగ్గిపోతుంది. ఉత్తర కేరళ ప్రాంతంలో ఉన్న పురియూర్‌కున్ అనే దట్టమైన అడవిలో పులులు మరియు చిరుతపులులు విస్తారంగా తిరుగుతూ ఉంటాయి. నీవు మహాశక్తిగల మంత్రవాదివి కనుక నీవు చిరుతపులి వెంట్రుకలను తీసుకురాగలవని ఆశపడుతున్నాను. నీవు వాటిని తేగలిగితే నా ఆస్తిలో సగభాగం నీకు ఇస్తాను".

ఆ భూస్వామి చెప్పిన మాటలను శ్రద్ధగా విన్న కారిగురుక్కాల్ ఒక నిమిషం ఆలోచించాడు. ఆపై "సరే" అన్నట్లుగా తల ఊపి, అక్కడ నుండి నేరుగా తన ఇంటికి వచ్చాడు. తన భార్య 'వెల్లాచ్చి'తో ఇలా చెప్పాడు. "భూస్వామికి ఆడ చిరుతపులి వెంట్రుకలు తెచ్చి ఇస్తే మనకి కొన్ని వందల ఎకరాల భూమి బహుమతిగా వస్తుంది. అందువల్ల నేను మగ చిరుపులి రూపం ధరించి అరణ్యంలోకి వెళ్ళి, ఆపై అక్కడ

ఉండే ఏదో ఒక ఆడ చిరుతపులిని చంపి దాని శరీరం మీద ఉండే బొచ్చుని చర్మంతో సహా తీసుకువచ్చి భూస్వామికి ఇస్తాను". ఆపై కారిగురుక్కల్ తన భార్యకు ఒక మంత్రాన్ని చెప్పి ఆమెతో ఇలా అన్నాడు.

"ఇప్పుడు నేను నా మంత్ర ప్రయోగంతో చిరుతపులిగా మారి అరణ్యంలోకి వెళతాను. ఆపై అక్కడ నాకు ఎదురయ్యే ఏదో ఒక ఆడ చిరుతపులిని చంపి దాని చర్మంలో కొంత భాగాన్ని బొచ్చుతో సహా తెచ్చి భూస్వామికి అందజేస్తాను. ఆ తరువాత ఇక్కడికి వస్తాను. నీవు, ఆపై నామీద ఒక ముంతడు కుడితి నీళ్ళుచల్లి, చీపురుతో మూడుసార్లు నాపై కొట్టు. ఆపై ఇప్పుడు నేను నీకు చెప్పిన మంత్రాన్ని మూడుసార్లు పఠించి, అప్పుడు నేను మామూలు మనిషిగా మారిపోతాను". అతడి భార్య "సరే" అని ఆనందంగా చెప్పింది. అనుకున్న ప్రకారమే, కారిగురుక్కాల్ ఒకసారి కళ్ళుమూసుకుని మంత్రాన్ని చదివాడు. అంతే, అతడు అతి బలిష్టమైన ఒక మగ చిరుతపులి రూపంలోకి మారిపోయాడు. ఆ తరువాత బాణంలాగా ఆ ఇంట్లోంచి బైటకు దూసుకువచ్చి, ఆపై అక్కడకు కొంచెం దూరంలో ఉన్న అరణ్యంలోకి దూసుకుపోయాడు.

ఆ అరణ్యంలో కొన్ని గంటలు సంచరించిన తరువాత ఒక ఆడ చిరుతపులి కనపడింది. మగ చిరుతపులి రూపంలో ఉన్న కారిగురుక్కాల్ ఆ ఆడ చిరుతపులి దగ్గరకువెళ్ళి దాని శరీరాన్ని నాలుకతో చాలాసేపు నాకాడు. ఫలితంగా ఆ ఆడ చిరుతపులిలో కామోద్రేకం చెలరేగింది. అది గ్రహించిన మగ చిరుతపులి ఆ ఆడ చిరుతపులితో సంభోగం ప్రారంభించింది. సంభోగం పూర్తి అయ్యేలోగా ఆడ



చిరుతపులి, చనిపోయింది. అది గమనించిన మగ చిరుతపులి అనగా కారిగురుక్కాల్ ఆ ఆడచిరుతపులి శరీరంపైన ఉన్న చర్మంలో కొంత భాగాన్ని తన పదునైన దంతాలతో చీల్చి నోటితో పట్టుకుంది. ఆ తరువాత అక్కడ నుండి పరుగులు తీస్తూ నేరుగా భూస్వామి భవనంలోకి వచ్చింది.

బొచ్చుతో కూడిన చిరుతపులి చర్మం ముక్కని నోటితో పట్టుకుని తీసుకువచ్చిన చిరుతపులి రూపంలోని కారిగురుక్కాల్ చూసి ఒక్క ఆ భూస్వామి తప్ప అక్కడ ఉన్న మిగిలిన వాళ్ళు మరియు వైద్యులు భయంతో వణికిపోయారు. ఆ భూస్వామి స్వయంగా ఆ చిరుతపులి దగ్గరకువెళ్ళి, తెరచిన దాని నోటి నుండి చిరుతపులి చర్మం ముక్కను తీసుకుని, ఆపై దానిని అక్కడ ఉన్న వైద్యులకు ఇచ్చి వెంటనే ఔషధం తయారు చెయ్యమని చెప్పారు. వాళ్ళు ఔషధం తయారుచేసే పనిలో పడ్డారు. అప్పుడు చిరుతపులి రూపంలో ఉన్న కారిగురుక్కాల్ మానవ స్వరంతో "ప్రభూ! నేను నా మంత్రశక్తితో చిరుతపులిగా మారి, ఆపై ఒక ఆడ చిరుతపులిని చంపి దాని చర్మాన్ని తెచ్చి నీకు ఇచ్చాను. నీవు అన్నమాట ప్రకారం నాకు నీ సంపదలో సగభాగం వెంటనే వ్రాసి ఇవ్వు". అప్పుడు ఆ భూస్వామి వికృతంగా నవ్వి "ఓరీ పిచ్చివాడా! మాలాంటి ప్రభువులు ఎల్లప్పుడూ నీ లాంటి తక్కువస్థాయి వాళ్ళని ఉపయోగించుకుని వదిలి వేస్తారేగాని, మిమ్మల్ని మాతో సమానంగా చేసుకుంటారా?. ఇప్పుడు నేను నా సంపదల్లో సగభాగం నీకు ఇస్తే నువ్వు నాతో సమానం అవుతావు. అందుకు నేను ఏమాత్రం ఇష్టపడను. కనుక, నీవు వెంటనే ఇక్కడ నుండి వెళ్ళిపో. లేకపోతే నా మనుషులు నిన్ను దారుణంగా చంపేస్తారు" అన్నాడు. ఒకవేళ, చిరుతపులి రూపంలో ఉన్న కారిగురుక్కాల్ తనకి ఎదురు తిరిగితే అతడిని చంపటానికి సాయుధులైన అనేకమంది వ్యక్తుల్ని తనకు దగ్గరలో అప్పటికే సిద్ధంగా ఉంచుకున్నాడు ఆ భూస్వామి. అదంతా స్పష్టంగా తెలుసుకున్న కారిగురుక్కాల్ బాధతో కూడిన మానవ స్వరంతో "ఓ ప్రభూ! ఈ ప్రపంచంలో అన్ని పాపాలకన్నా, హీనమైనది 'నమ్మకద్రోహం'. నేను నా ప్రాణాలను పణంగా పెట్టి నీ కోసం ఇంత సాహసం చేసాను. అయినా, నీవు ఇంత కృతఘ్నుడిలా ప్రవర్తించావు. నీకు న్యాయమైన మనసు లేదు. నాకు నమ్మకద్రోహం చేసిన నీవు అతి తొందరలోనే 'ఉన్మాది'గా మారిపోతావు. అప్పుడు నీకు ఈ లోకంలోనే నరకం కనిపిస్తుంది" అన్నాడు.

(కారిగురుక్కాల్, చిరుతపులి రూపంలో తెచ్చి ఇచ్చిన చిరుతపులి బొచ్చుతో చేసిన వైద్యం వల్ల ఆ భూస్వామికి చర్మవ్యాధి రెండు రోజులలోపే తగ్గిపోయింది. కానీ, అతడు చేసిన నమ్మకద్రోహంవల్ల ఆ తరువాత ఆరు నెలలు తిరిగేలోగా ఆ భూస్వామికి మతి చెడిపోయింది. అతడు ఉన్మాదంతో పెద్దగా అరుస్తూ ఆ తరువాత కొద్ది సంవత్సరాలకే మరణించాడు.)

ఆపై, ఆ చిరుతపులి అక్కడ నుండి నేరుగా బయలుదేరి తాను ఉండే గ్రామంలోకి ప్రవేశించింది. అప్పటికి ఇంకా తెల్లవారలేదు. ఆ చిరుతపులి తన ఇంట్లోకి ప్రవేశించింది.

అప్పుడే నిద్రలేచి కళ్ళు నులుపుకుంటున్న కారిగురుక్కాల్ భార్య వెల్లాచ్చి తన ఎదురుగా నిలబడిన చిరుతపులిని చూసి భయంతో కేకలు వేసింది. తన ముందు చిరుతపులి రూపంలో ఉన్నది సాక్షాత్తు తన భర్త అయిన కారిగురుక్కాల్ అన్న విషయం ఆమెకు తాత్కాలికంగా గుర్తుకురాలేదు. అప్పుడు కారిగురుక్కాల్, మానవ స్వరంతో తన భార్యతో ఇలా అన్నాడు. "భయపడకు! నేను చిరుతపులి రూపంలో ఉన్న నీ భర్తని. మొన్న, నేను చిరుతపులిగా మారబోయేముందు నీకు ఒక మంత్రం చెప్పాను. నీవు వెంటనే అప్పుడు చెప్పిన విధంగా నామీద కుడితి నీళ్ళుపోసి, ఆపై కొబ్బరి చీపురుతో నా శరీరంమీద మూడుసార్లు కొట్టి ఆ మంత్రాన్ని మూడుసార్లు పఠించు. నేను మళ్ళీ మనిషిగా మారిపోతాను".

అప్పటికి ఆ భార్యకు అసలు విషయం అర్థమయ్యింది. ఆపై, ఆమె ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా వంటగదిలోకివెళ్ళి అక్కడ సిద్ధంగా ఉంచిన బియ్యం కుడితిని తీసుకువచ్చి ఆ చిరుతపులిమీద గుమ్మరించింది. ఆ తరువాత ఆ ఇంట్లో ఒక మూలగా ఉన్న కొబ్బరి చీపురుతో ఆ చిరుతపులి ఒంటిమీద మూడు దెబ్బలు వేసింది. ఆపై కళ్ళు మూసుకుని మంత్రం చదవాలని ప్రయత్నించింది. దురదృష్టం...! ఆ సమయంలో ఆ భార్యకు ఆ మంత్రం ఒక అక్షరం కూడా గుర్తుకురాలేదు. ఆమె ఎంతగా ప్రయత్నించినా ఆ మంత్రం గుర్తుకు రావటంలేదు. ఆమె ఎదురుగా చిరుతపులి రూపంలో నిలబడి ఉన్న కారిగురుక్కాల్‌కి ఆ విషయం అర్థమైపోయింది. తాను ఇంకా మనిషి రూపంలోకి మారటం సాధ్యంకాదని అతడికి అర్థమైపోయింది. ఆపై అతడు అక్కడ నుండి అరణ్యంలోకి పరుగులు తీసాడు.

అలా తిరిగి అరణ్యంలోకి చేరిన కారిగురుక్కాల్ ఒక పెద్ద మర్రిచెట్టు క్రింద ఉన్న ఒక పుట్ట దగ్గరలో కూర్చుని, అక్కడ 40 రోజులపాటు తన గురువు చెప్పిన అతిముఖ్యమైన మంత్రాన్ని నిద్రాహారాలు లేకుండా పఠించాడు. అప్పటికి 10 సంవత్సరాల క్రితం అతని గురువు ఆ మర్రిచెట్టు క్రింద సమాధి అయిపోయాడు. ఏదిఏమైనా, తన ప్రియ శిష్యుడైన కారిగురుక్కాల్, చిరుతపులి రూపం నుండి బైటకు రాలేక బాధపడుతున్నాడని సమాధిలో ఉన్న అతడి గురువుకి అర్థమైపోయింది. ఆపై ఆ గురువు ఒక జ్యోతి రూపంలో ఆ పుట్టలోంచి బైటకు వచ్చి, అక్కడ కూర్చుని మంత్రధ్యానంలో ఉన్న చిరుతపులి దగ్గరకువెళ్ళి ఆ చిరుతపులి చుట్టూ 108 సార్లు గుండ్రంగా తిరిగి మళ్ళీ తన పుట్టలోకి వెళ్ళిపోయాడు. ఆ తరువాత కొద్ది నిమిషాలకే ఆ చిరుతపులి క్రమ క్రమంగా మానవ రూపంలోకి మారిపోయింది. అలా మానవ రూపంలోకి మారిపోయిన కారిగురుక్కాల్ మెల్లగా నడుస్తూ తన గ్రామంలోకి

ప్రవేశించాడు. మనిషి రూపంలో మళ్ళీ తిరిగి వచ్చిన కారిగురుక్కాల్‌ని చూసి అతని భార్య మరియు కుటుంబ సభ్యులు ఎంతో సంతోషించారు. ఈ సంఘటన గురించి మొత్తం కేరళ అంతా కొద్ది నెలల్లోనే వ్యాపించింది.

**కారిగురుక్కాల్‌ని పరీక్షించిన కోలాద్రి ప్రభువు :**

స్వతంత్రం రావటానికి కొద్దికాలం ముందు వరకూ ఉనికిలో ఉన్న "కోలాద్రి" రాజ్యాన్ని పరిపాలించే రాజుకి అనేకమంది అగ్రకుల సంపన్నులు, కారిగురుక్కాల్ గురించి చెప్పి, అతడిని ఏదోఒక విధంగా అణచివెయ్యమని విజ్ఞప్తి చేసుకున్నారు. అగ్రకులానికి చెందిన ఆ రాజుకి కూడా ఒక తక్కువస్థాయి వ్యక్తి గొప్పవాడు కావటం ఏమాత్రం ఇష్టంలేదు. అసలు ఒక నిమ్న కులస్థుడికి అంత గొప్పస్థాయి మంత్రవిద్యలు ఎలా తెలుస్తాయి?, అసలు ఆ కారిగురుక్కాల్ నిజంగా మహాశక్తి గల మంత్రవాదా? కాదా? అన్న విషయాన్ని ముందుగా తేల్చుకుని, ఆపై గురుక్కాల్‌ని ఏం చెయ్యాలో నిర్ణయించుకోవాలని ఆ రాజు భావించాడు. ఆపై ఆయన, కారిగురుక్కాల్‌ని తన దగ్గరకు రమ్మని ఒక దూత ద్వారా కారిగురుక్కాల్‌కి సందేశం పంపించాడు. ఆ తరువాత ఏం జరిగిందంటే...?

"కోలాద్రి ప్రభువు, నిన్ను అత్యవసరంగా కలవాలని అనుకుంటున్నారు. నీవు వెంటనే బయలుదేరి రావాలి" అనే రాజ సందేశంతో ఒక దూత నేరుగా కారివల్లూర్ గ్రామానికి వెళ్ళాడు. రాజుగారి ఆజ్ఞను కాదు అనటం సాధ్యంకాదు కనుక కారిగురుక్కాల్, రాజు దగ్గరకు వెళ్ళటానికి సిద్ధపడ్డాడు. ఆయన తన ప్రయాణాన్ని ప్రారంభించటానికి ముందు తన కుటుంబ దేవతల్ని భక్తితో ప్రార్థించాడు. ఆ తరువాత తన ప్రియశిష్యుడు అయిన పుధియోడన్‌నాయర్‌ని వెంటపెట్టుకుని రాజధానివైపు నడక ప్రారంభించాడు. ఆ కాలంలో కారివల్లూర్ నుండి రాజధానికి చేరాలంటే ఎంతో దూరం నడవాల్సి వచ్చేది. అంతేకాదు, మార్గమధ్యంలో మూడు నదుల్ని దాటాల్సి వచ్చేది. ఏదిఏమైనా, మహా సాహసవంతుడు మరియు బలిష్టుడు అయిన కారిగురుక్కాల్ ఎంతో ఓర్పుతో తన ప్రయాణాన్ని సాగించాడు. అలా కొంతదూరం నడిచిన తరువాత ఆ గురుశిష్యులకు మార్గమధ్యంలో మొదటి నది ఎదురయ్యింది. ఆ సమయంలో అక్కడ ఒక్క పడవ కూడా కనపడలేదు. నిజానికి ఆ సమయంలో అక్కడ కనీసం నాలుగైదు పడవలు ఉంటాయి. కానీ, మహా మంత్రవాది అని అందరూ చెప్పుకుంటున్న కారిగురుక్కాల్, పడవ లేకపోయినా నదిని దాటగలడా? లేదా? అని పరీక్షించటంకోసం కోలాద్రి ప్రభువు, కావాలని ఆ సమయంలో అక్కడ

పడవలు లేకుండా చేసాడని దివ్యదృష్టి కలిగిన కారిగురుక్కాల్‌కి క్షణాలలో అర్థమైపోయింది. తన శక్తిని రాజుగారు పరీక్షిస్తున్నాడని ఆ క్షణంలో కారిగురుక్కాల్‌కి తెలిపోయింది. అప్రయత్నంగా కారిగురుక్కాల్ పెదవులపై చిన్న చిరునవ్వు ఒక్క క్షణం మెరిసి మాయం అయిపోయింది. ఆపై ఆయన తన శిష్యుడైన నాయర్‌ని చూస్తూ, "నాయనా! నీవు కళ్ళుమూసుకుని నా చెయ్యిపట్టుకుని నా ప్రక్కనే నుంచో. మనిద్దరం ఈ నదిని సులువుగా దాటేద్దాం" అన్నాడు.

ఆ తరువాత కారిగురుక్కాల్ ఒక్కసారి ఆకాశంలోకి చూసి, ఆపై కళ్ళుమూసుకుని "జలస్థంభన" మంత్రాన్ని తొమ్మిదిసార్లు జపించాడు. కారిగురుక్కాల్ తొమ్మిదోసారి ఆ మంత్రాన్ని ఉచ్ఛరించిన మరుక్షణమే ఆ నదిలోని నీళ్ళు ఒక పెద్ద రాయిలాగా నిశ్చలంగా నిలబడిపోయాయి. అప్పుడు ఆ గురుశిష్యులు చాలా సులువుగా మరియు వేగంగా ఆ నదిమీదుగా నడుచుకుంటూ అవతల గట్టుకి చేరుకున్నారు. వాళ్ళు అలా నది గట్టుకి చేరుకోగానే జలస్థంభన మంత్ర ప్రభావం అదృశ్యం అయ్యింది. ఆ మరుక్షణమే ఆ నది, ఎప్పటిలాగా పెద్ద శబ్దంచేస్తూ మహావేగంతో ప్రవహించటం ప్రారంభించింది. ఆ తరువాత ఆ గురుశిష్యులు – పాశయంగాడి నది మరియు వాలార్ పట్టణం నది – అనే రెండు నదులను కూడా జలస్థంభన సహాయంతో అవలీలగా దాటి అవతల గట్టుకి చేరుకున్నారు.


కారిగురుక్కాల్ (ఊహాచిత్రం)

అంతిమంగా, కారిగురుక్కాల్ తన శిష్యుడైన నాయర్‌తో కలిసి రాజుగారి భవనం దగ్గరకు చేరుకున్నారు. వీళ్ళు వెళ్ళేసరికి ఆ భవనం తలుపులు మూయబడి ఉన్నాయి. అంతేకాదు, అక్కడ – చాలా విచిత్రంగా కాపలాదారులు కూడా లేరు. తనకి ఇంకొక పరీక్ష రాజుగారు పెడుతున్నాడని కారిగురుక్కాల్‌కి అర్థమైపోయింది. మహా మంత్రవాది అయిన కారిగురుక్కాల్ ఆ పరీక్షని ఎదుర్కోవాలని నిర్ణయించు కున్నాడు. ఆ తరువాత ఒక్కసారి కళ్ళుమూసుకుని ఒక మంత్రాన్ని మూడుసార్లు పఠించాడు. ఆపై, తన శిష్యుడి చెయ్యిపట్టుకుని, మూసి ఉన్న ద్వారం గుండా తన శిష్యుడితో సహా లోపలికి ప్రవేశించాడు. దాదాపు ఆరు అంగుళాలు మందం ఉండే ఆ తలుపులకు ఏవిధమైన హాని లేకుండా కనీసం ఒక్క గీత కూడా

ఆతలుపుల మీద పడకుండా తన మంత్రశక్తితో కారిగురుక్కాల్ ఆ తలుపులలోంచి లోపలికి వెళ్ళిపోయాడు. అలా తన శిష్యుడితో సహా రాజ భవనంలోకి ప్రవేశించిన కారిగురుక్కాల్‌కి అక్కడ ఒకేరకంగా తయారు చేయబడిన అనేక ఆసనాలలో కూర్చుని ఉన్న అనేకమంది వ్యక్తులు కనపడ్డారు. విశేషం ఏమంటే, వాళ్ళందరూ కూడా ఒకేరకమైన రాజదుస్తులను ధరించి ఉన్నారు. వారిలో కోలాద్రి ప్రభువు ఎవరో? కనుక్కోవలసిన బాధ్యత కారిగురుక్కాల్‌మీద పడింది. అప్పటి వరకు తన గ్రామం మరియు తన గ్రామాన్ని ఆనుకుని ఉన్న అరణ్యం తప్ప ఏనాడూ ఇంకొక ప్రాంతానికి వెళ్ళని మరియు రాజుల్ని, జమిందారులను ఏనాడూ చూడని ఆ కారిగురుక్కాల్ ఖచ్చితంగా, తమలో ఉన్న రాజు ఎవరో పసికట్టలేడని అక్కడ కూర్చుని ఉన్న అగ్రకుల సంపన్నులు అభిప్రాయపడ్డారు. కానీ, మహామేధావి మరియు అంతకు మించి మంత్రశాస్త్ర మహా గురువు అయిన కారిగురుక్కాల్‌కి చాలా కొద్దిసేపట్లోనే, అక్కడ ఆసనాలలో కూర్చుని ఉన్న వారిలో కొలాద్రి ప్రభువు ఎవరో అర్థమైపోయింది. ఆపై అతడు ఆ రాజు ముందుకువెళ్ళి మోకాళ్ళపై ఆయన ముందు కూర్చుని శిరస్సు వంచి ఆయనకు నమస్కరించాడు. అప్పటికే కారిగురుక్కాల్ మీద కోలాద్రి ప్రభువుకి కొంత గౌరవ భావం ఏర్పడింది. అందువలన ఆయన, కారిగురుక్కాల్‌ని మధ్యాహ్న భోజనానికి రమ్మని అడిగాడు. ఆ కాలంలో కేరళలో – అగ్రవర్ణాల ప్రజలు భోజనం చేసే సమయంలో వాళ్ళతో కలిసి భోజనంచేసే హక్కు లేదా అర్హత నిమ్నకులస్తులు అయిన పులియన్లకు ఉండేదికాదు. ఇంకొక విశేషం ఏమంటే, అగ్రవర్ణాల వ్యక్తులు భోజనాలు పూర్తిచేసుకుని, ఆపై చేతులు కడుక్కోవటానికి బైటకు వెళ్ళిపోయేవాళ్ళు. ఆ గృహాలలో ఉండే పనివాళ్ళు వచ్చి ఆ ఎంగిలి ఆకులను ఎత్తి బైట పారేసేవాళ్ళు. కానీ, తక్కువ కులానికి చెందిన కారిగురుక్కాల్ ఆ సమయంలో అగ్రకులస్థులతో కలిసి భోజనం చేసినప్పటికీ, ఆయన భోజనం చేసిన అరిటాకును ఆయనే తీసుకువెళ్ళి బైటపారవెయ్యాల్సి ఉంటుంది. అంటే, నిమ్నకులస్థుడి ఎంగిలి ఆకును తియ్యటం ఆ కాలంలోని పనివాళ్ళకు కూడా చాలా అవమానకరంగా ఉండేది అన్నమాట.

ఏదిఏమైనా, తనకి అవమానం చెయ్యటానికి రాజుగారు తనని ఇలా పంక్తి భోజనాలకు పిలిచాడని భోజనానికి ముందే కారిగురుక్కాల్‌కి అర్థమైపోయింది. దాంతో అతడు చిన్న స్వరంతో ఆ రాజుతో "ప్రభూ! మీరు అడిగినట్లుగా ఇక్కడ భోజనం చెయ్యటానికి నాకు ఎలాంటి అభ్యంతరం లేదు. కానీ, నాకు దోస ఆకులతో తయారుచేసిన విస్తరాకులో భోజనం పెట్టించండి. అరిటాకులో వద్దు" అన్నాడు. ఆ రాజు అందుకు అంగీకరించాడు. ఆవిధంగానే దోస ఆకులతో తయారుచేసి విస్తరిని

కారిగురుక్కాల్ ముందు పరిచి ఆ ఆకులో అతడికి అద్భుతమైన భోజనాన్ని వడ్డించారు. విందు భోజనం పూర్తి అయ్యింది. ఇక, ఆకులు ఎత్తే సమయం ప్రారంభం అయ్యింది. కారిగురుక్కాల్ ముందున్న విస్తరాకు మాయం అయిపోయింది. ఇతరుల ముందు మాత్రం ఎంగిలి విస్తర్లు అలాగే ఉన్నాయి. కారిగురుక్కాల్ తన మహత్యంతో తన విస్తరిని మాయం చేసాడని ఆ రాజుకి అర్థమయ్యింది. ఈవిధంగా ఆ రాజు పెట్టిన నాలుగు కఠిన పరీక్షలను తన మంత్రబలంతో కారిగురుక్కాల్ గెలిచాడు.

ఆ రోజు సాయంత్ర సమయంలో రాజుగారు, ఊరిమధ్యలో ఒక సమావేశం ఏర్పాటుచేసాడు. ఆ సమావేశానికి ఊరులోని ప్రజలందరూ హాజరయ్యారు. అప్పుడు కారిగురుక్కాల్ తన మంత్రశక్తితో అనేక రకాల అద్భుతాలు అక్కడ ప్రదర్శించాడు. అవి చూసి రాజుగారితో సహా అక్కడ జేరిన ప్రజలందరూ ఆశ్చర్యంతో నోరు తెరచి అలా ఉండిపోయారు. ఆ తరువాత రాజుగారు, కారిగురుక్కాల్‌తో ఇలా అన్నాడు. “ఈ రోజు రాత్రి నీవు, 40 ధెయ్యాములు (కేరళ జానపద నృత్యకళ) చేయించాలి. అనగా, 40 మంది కళాకారులతో కార్యక్రమాన్ని నిర్వహించాలి. ఇంత తక్కువ సమయంలో నీవు, 40 మందిని ఏర్పాటు చెయ్యగలవా?. అప్పటికే సాయంత్రం 7 గంటలు అవుతున్నది. సాధారణంగా, రాత్రి 10 గంటల ప్రాంతంలో ఆ కాలంలో ధెయ్యాములు ప్రారంభిస్తారు. ఆ కాలంలో ఫోన్లు లేవు. అలాంటి పరిస్థితులలో ఎక్కడో దూరంగా, విభిన్న ప్రాంతాలలో ఉండే 40 మంది ధెయ్యాము కళాకారులను అతి కొద్దిసేపట్లో అక్కడకు రప్పించటం సాధారణ మానవుడికి సాధ్యంకాదని ఆ రాజుకి తెలుసు.

కానీ, కారిగురుక్కాల్ ఏమాత్రం చలించలేదు. తన మంత్రబలంతో 40 మంది ధెయామ్ కళాకారులను సృష్టించాడు. వాళ్ళు అందరూ ఎంతో అద్భుతంగా ధెయామ్ నృత్యాలు చేసి అటు రాజుని, ఇటు ప్రజలను మంత్ర ముగ్ధులను చేసారు. రాజుగారు పెట్టిన ఆ పరీక్షలో కూడా కారిగురుక్కాల్ విజయం సాధించాడు.



(ధెయ్యామ్ కళాకారుడు)

ఆ మర్నాడు ఉదయం ఆ రాజు, దురాశ నిండిన స్వరంతో కారిగురుక్కాల్‌తో ఇలా

అన్నాడు. "నాకు ఒకసారి స్వర్గలోకంలోకి వెళ్ళి రావాలని ఉన్నది. నీకు నిజంగా శక్తి ఉంటే నన్ను ఒక్కసారి స్వర్గానికి పంపించు" అన్నాడు. రాజు అన్న మాటలు విన్న కారిగురుక్కాల్ ఒకసారి కళ్ళుమూసుకుని ఏదో మంత్రం పఠించాడు. ఆపై, కళ్ళు తెరచి రాజుతో "ప్రభూ! స్వర్గలోకంలోకి వెళ్ళటానికి సిద్ధంగా ఉండండి" అన్నాడు. దాదాపు రెండు, మూడు నిమిషాలు గడిచిన తరువాత ఆకాశం నుండి ఎరుపురంగులో ఉండే ఒక లావాటి తాడు, సర్పంలాగా నిటారుగా – వాళ్ళు ఉన్న ప్రదేశంలో దిగింది. అది గమనించిన కారిగురుక్కాల్ గంభీరమైన స్వరంతో ఆ రాజుతో "రాజా! నీవు ఈ తాడుని గట్టిగా పట్టుకో. ఆ తాడు నిన్ను స్వర్గానికి క్షణాలలో చేరుస్తుంది. ఆపై, అక్కడ నీకు స్వర్గం కనిపిస్తుంది. ఆపై స్వర్గంలో నీ ఇష్టం వచ్చినంతసేపు కాలం గడిపి, ఇదే తాడుని పట్టుకుని క్రిందికి దిగి వచ్చేసేయ్" అన్నాడు. అక్కడ గుమిగూడి ఉన్న ప్రజలందరూ ఆశ్చర్యంగా ఆ తాడుకేసి మరియు కారిగురుక్కాల్‌కేసి చూస్తున్నారు. ఎలాగైనా సరే, స్వర్గాన్ని చూడాలన్న ఆశతో ఉన్న ఆ రాజు, చక చకా ఆ తాడు దగ్గరకు వెళ్ళి ఆపై దాన్ని గట్టిగా పట్టుకుని నిలబడ్డాడు. ఆశ్చర్యం! ఆ తాడు ఎంత వేగంగా క్రిందకు వచ్చిందో, అంత వేగంగా పైకి వెళ్ళిపోయి క్షణాలలో ఆకాశం దాకా చేరుకుని అక్కడ అదృశ్యం అయిపోయింది. ఆపై కొద్ది నిమిషాలు గడిచాయి. పై నుండి ఏడుపులతో కూడిన అరుపులు, క్రింద ఉన్న వారికి వినిపించాయి. "నేను ఇక్కడ కనపడుతున్న దృశ్యాలను చూడలేకపోతున్నాను. నాకు భయంతో ప్రాణం పోయేటట్లుగా ఉన్నది. దయచేసి నన్ను క్రిందకు రప్పించు" అన్నాడు ఆ రాజు. కారిగురుక్కాల్ యొక్క మంత్రబలం కారణంగా ఆ తాడు ఆ రాజుని స్వర్గం నుండి తెచ్చి నేలపై దించి అదృశ్యం అయిపోయింది. కారిగురుక్కాల్ లాంటి మహా మాంత్రికుడిని పరీక్షించాలని, పరాభవించాలని భావించిన తనకు తగిన పరాభవం జరిగిందని ఆ రాజుకి అర్థమయ్యింది. కారిగురుక్కాల్ ఎదురులేని మంత్రవాది అని ఆ రాజుకి చాలా స్పష్టంగా తెలిసింది. ఆపై ఆ రాజు, కారిగురుక్కాల్‌కి ఘన సన్మానంచేసి చాలా పెద్ద మొత్తంలో బంగారం, వెండి, రత్నాలు లాంటివి బహూకరించాడు. కారిగురుక్కాల్ ఆ సంపదలతో మరియు తన శిష్యుడు నాయర్‌తో కలిసి తన గ్రామానికి చేరుకున్నాడు. అలా కొన్నేళ్ళు గడిచాయి. ఆ తరువాత ఒక రోజు ఉదయం కారిగురుక్కాల్ తన ప్రియ శిష్యుడైన పుదియోడన్ నాయర్‌ని మరియు తన మేనల్లుళ్ళన్ని తన దగ్గరకు రప్పించుకుని వాళ్ళతో ఇలా చెప్పాడు...."నేను ఈ భౌతిక దేహాన్ని చాలించే సమయం ఆసన్నమైనది. నేను సమాధి అవటంకోసం ఒక భూగర్భ గదిని రాళ్ళతో నిర్మించండి. ఆ భూగర్భ గదిలోకి గాలి వచ్చేటట్లుగా ఒక చిన్న రంధ్రాన్ని ఏర్పాటు చేయండి.

నేను, సమాధిలోకి వెళ్ళిన రోజు నుండి 41 రోజుల వరకు ఆ సమాధిపైన ప్రతిరోజూ మధ్యాహ్నం 12 గంటల సమయంలో నీళ్ళు పొయ్యండి. అంతేకాకుండా, ఆ భూగర్భగదిలో నా పుస్తకాలు మరియు లేఖిని (పెన్నులాంటిది) ఉంచండి".

ఆపై, ఒక అమావాస్య మధ్యాహ్నం రోజున కారిగురుక్కాల్, ఒకసారి తన ఇష్టదైవాన్ని స్మరించుకుని, ఆపై తన శిష్యుడు మరియు బంధువులవైపు చిరునవ్వుతో చూసి ఆ తరువాత ఆ భూగర్భ గదిలోకి దిగిపోయాడు. ఆపై అక్కడ ఉన్నవారు ఆ భూగర్భగదిపైన ఒక బండరాయినివేసి మూసివేసారు. ఆ తరువాత కారిగురుక్కాల్ యొక్క మేనల్లుళ్ళల్లో రోజుకి ఒకడు ఆ సమాధి పైన నీళ్ళు పోస్తూ ఉండేవాడు. అలా 30 రోజులు గడిచాయి. 31వ రోజున ఆ సమాధి పైన నీళ్ళు పోస్తున్న ఒక మేనల్లుడికి ఆ సమాధి లోపల ఏం జరుగుతుందో? తెలుసుకోవాలని ఆసక్తి కలిగింది. ఆపై, అతడు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా – ఆ సమాధిలోకి గాలి పోవటానికి ఏర్పాటు చేసిన కంతలోంచి లోపలికి తొంగి చూసాడు. ఆ మరుక్షణమే ఆ సమాధిలోపల ఉన్న కారిగురుక్కాల్ యొక్క లేఖిని బాణంలాగా దూసుకువచ్చి, కంతలోకి తొంగి చూస్తున్న వ్యక్తి యొక్క కన్ను పొడిచేసింది. ఆ తరువాత ఏనాడూ, ఎవరూ కూడా ఆ సమాధిలోకి తొంగి చూసే సాహసం చెయ్యలేదు. ఇప్పటికీ ఆ సమాధి యధాతథంగా నిలిచి ఉన్నది. పులియన్ కులస్థులు తమ కులదైవంగా భావిస్తున్న ఈ కారిగురుక్కాల్ యొక్క సమాధి ఆ జాతి వారికి ఒక పవిత్రమైన ఆలయం అని చెప్పక తప్పదు.

# 3. టిబెట్ తంత్రశాస్త్రంలో చెప్పబడిన క్షుద్రశక్తుల ప్రభావాలు ఏమిటి?

**టిబెటన్ లామా 'చోగ్స్ సాంగ్' ప్రదర్శించిన తాంత్రిక శక్తులు :**

హిమాలయ పర్వతాలలో ఉన్న టిబెట్ దేశంలో మహాయాన బౌద్ధమతం ప్రధాన మతంగా పాటించబడుతుంది. ఈ మహాయాన మతంలో 'వజ్రయానం' అని పిలువబడే తాంత్రిక వర్గానికి చెందిన మంత్రవాదులలో ఎక్కువ మంది చేసే తాంత్రిక సాధనలలో మృతదేహాలకు ప్రధాన పాత్ర ఉంటుంది. టిబెటన్ మంత్రవాదులలో తక్కువస్థాయికి చెందిన మంత్రవాదులు అనగా క్షుద్ర మంత్రవాదులు తమ తాంత్రిక సాధనల

ద్వారా అనేక శక్తులను సంపాదించి, వాటిని తమ స్వార్థంకోసం అనగా ఇహలోక భోగాలు పొందటంకోసం ఉపయోగించుకోవటం జరుగుతున్నది. భారతదేశం నుండి టిబెట్‌లోకి ప్రవేశించిన తంత్రశాస్త్రాల ప్రభావం వల్ల టిబెట్‌లోని లామాలు అనగా బౌద్ధమత సన్యాసులు, అతి శక్తివంతమైన తాంత్రిక సాధనలను చెయ్యటం జరిగింది. అలా చేసినవారిలో "చోగ్స్‌సాంగ్" అనే లామా కూడా ఒకడని చెబుతారు. ఈయన కేవలము గొప్ప బౌద్ధమత గురువే కాకుండా ఆయన - చైనా, టిబెట్ మరియు ప్రపంచ దేశాల గురించి చెప్పిన ఎన్నో జోస్యాలు (ప్రిడిక్షన్స్) తూ.చ. తప్పకుండా జరిగినట్లుగా తెలుస్తున్నది.



ఈ చోగ్స్‌సాంగ్ అసాధారణమైన తాంత్రిక శక్తులను కలిగి ఉన్నాడని చెప్పుకుంటారు. అయితే, ఈ లామా ప్రవర్తన చాలా విచిత్రంగా ఉండేది. ఒక్కోసమయంలో ఆయన ఏం మాట్లాడుతున్నాడో? ఎవరికీ అర్థమయ్యేదికాదు. ఈయన విపరీతంగా మద్యం సేవించేవాడని చెబుతారు. ఈయన జీవించి ఉన్న సమయంలో ఒకసారి, ఆనాటి టిబెట్ రాజుయొక్క అశ్వశాలకు అధిపతిగా ఉన్న ఒక అధికారి దగ్గర కొంతకాలం గడిపాడు. ఆ సమయంలో ఒకరోజు సాయంత్రం చోగ్స్‌సాంగ్ మరియు ఆ అశ్వశాల అధికారి మద్యం సేవిస్తున్నారు. మాటల సందర్భంలో ఈ లామా ఆ అశ్వశాల అధికారితో ఇలా అన్నాడు. "నీ చెల్లెలు చాలా అందంగా ఉన్నది. ఆమెను నాకు భార్యగా ఇవ్వు".

లామా మాటలు విన్న ఆ అశ్వశాల అధికారికి విపరీతమైన ఆగ్రహం వచ్చింది. ఆపై అతడు కోపంతో కూడిన స్వరంతో ఆ లామాతో "నీవు అసలే సన్యాసివి. అందులోనూ మధ్యవయస్సుకి వచ్చేసావు. అలాంటి నీకు, యుక్తవయస్సులో ఉన్న నా చెల్లెలిని ఇస్తానని ఎలా అనుకుంటున్నావ్?" అన్నాడు. అశ్వశాల అధికారి అలా అనగానే చోగ్స్‌సాంగ్‌లో ఆగ్రహం కట్టలు తెంచుకున్నది. దాంతో ఆయన తన చేతిలో ఉన్న అత్యంత విలువైన జేడ్ మద్యం పాత్రని బలంగా నేలపైకి విసిరాడు.

(జెడ్ అనే రత్నం టిబెట్ ప్రాంతంలోని పర్వతాలలో లభిస్తుంది. బాగా పెద్దగా ఉండే ఈ రత్నంతో గ్లాసు లాంటి పాత్రని తయారుచేస్తారు. ఈ పాత్రలో మద్యం సేవించటం ఒక గౌరవంగా భావించబడుతుంది.). ఆపై గంభీరమైన స్వరంతో ఆ అశ్వశాల అధికారిని ఇలా శపించాడు. "నా కోరికను తిరస్కరించిన నీవు రెండు రోజుల తరువాత తప్పనిసరిగా చనిపోతావు". ఈ విషయం ఆనాటి టిబెట్ రాజుకి తెలిసింది. తన అశ్వశాల అధిపతి అయిన వ్యక్తి యువకుడు మరియు మంచి ఆరోగ్యవంతుడు. అలాంటివాడు ఈ త్రాగుబోతు లామా ఇచ్చిన శాపానికి చనిపోవటం జరగదని ఆ టిబెట్ రాజు భావించాడు. ఆ లామాకి ఎలాంటి శక్తులు లేవని ఆ టిబెట్ రాజు అప్పటికి బలంగా నమ్ముతూ ఉండేవాడు. ఏదిఏమైనా, రెండు రోజులు గడిచాయి. నాల్గవ రోజున ఆ యువ అశ్వశాల అధికారి హఠాత్తుగా గుండె ఆగి చనిపోయాడు. ఈ సంగతి తెలుసుకున్న ఆ అశ్వశాల అధికారి కుటుంబీకులు మరియు లామా పెళ్లిచేసుకోవాలని ఆశించిన ఆ కుటుంబానికి చెందిన అమ్మాయి విపరీతంగా భయపడ్డారు. అంతేకాదు, టిబెట్ రాజుకూడా భయంతో వణకిపోయాడు. ఆపై టిబెట్ రాజు, అశ్వశాల అధికారి చెల్లెలు మరియు కుటుంబ సభ్యులను కలుపుకుని నేరుగా లామా దగ్గరకువెళ్ళి ఆయనతో ఇలా అన్నాడు. "గురుదేవా! దయచేసి ఈ అమ్మాయిని వివాహం చేసుకోండి. మమ్మల్ని అనుగ్రహించండి". అప్పుడు చోగ్సాంగ్ వారి అందరివైపు ఒకసారి పరిశీలనగాచూసి, ఆపై విచిత్రమైన స్వరంతో ఇలా అన్నాడు. "నేను అడిగినప్పుడే ఈ అమ్మాయిని నాకు ఇచ్చి పెళ్ళిచేసి ఉంటే నేను ఈ అమ్మాయి సహకారంతో ఎంతోమందికి మేలుచేసే ఒక కార్యాన్ని సాధించి ఉండేవాడిని. కానీ ఆ అవకాశం లేదా సమయం దాటిపోయింది. ఇప్పుడు నాకు భార్యతో ఏమాత్రం పనిలేదు".

ఒకరోజు సాయంత్ర సమయంలో చోగ్సాంగ్ తన శిష్యులలో ఒకడిని తన దగ్గరకు పిలిచి అతడితో ఇలా చెప్పాడు. "మనిద్దరం అత్యవసరంగా బైటకు వెళ్ళాలి. రెండు గుఱ్ఱాలను సిద్ధంచెయ్యి". తన గురువు అలా చెప్పటంతో ఆ యువ సన్యాసికి కొంచెం ఆశ్చర్యం వేసింది. ఆపై అతడు నసుగుతున్నట్లుగా ఇలా అన్నాడు. "గురుదేవా! ఇప్పటికే సాయంత్రం అయిపోయింది. మనం బైటకు వెళ్ళేసరికి బాగా చీకటి పడిపోతుంది. ఆ చీకట్లో మనం తిరగటం అంత క్షేమకరంకాదు. అందువల్ల మనం రేపు ఉదయం వెళదాం". శిష్యుడు అలా అనగానే చోగ్సాంగ్ ఆ శిష్యుడివైపు తీక్షణంగాచూసి ఆపై గంభీరమైన స్వరంతో "ఎదురు చెప్పకు. పద పోదాం" అన్నాడు. ఇక చేసేదిలేక ఆ శిష్యుడు రెండు గుఱ్ఱాలకు జీనులు తొడిగి సిద్ధం చేసాడు. ఆపై ఆ

గురు–శిష్యులు ఇద్దరూ ఆ గుర్రాలను అధిరోహించి అక్కడకు దగ్గరలో ఉన్న ఒక అరణ్యంలోకి ప్రవేశించారు. అప్పటికి రాత్రి అయ్యింది. వాళ్ళు కొంచెంసేపు అలా ప్రయాణించి ఒక నది సమీపానికి చేరుకున్నారు. అప్పుడు చోగ్స్‌సాంగ్, గుర్రం దిగి ఆ నది జలాల దగ్గరకు నడవటం ప్రారంభించాడు. ఆయన శిష్యుడు కూడా గుర్రం దిగి ఆయన వెనకాలే నడిచాడు. కొద్ది నిమిషాల వాళ్ళు ఇద్దరూ ఆ నది దగ్గరకు చేరుకున్నారు. ఆ సమయంలో ఆకాశం పరిపూర్ణమైన నల్లటిరంగులో కనిపిస్తున్నది. అయినప్పటికీ ఆ నదీ జలాలమీద ఒకచోట స్వచ్ఛమైన మరియు ప్రకాశవంతమైన సూర్యకాంతి పడుతున్నది. అదిచూసి ఆ శిష్యుడు ఆశ్చర్యంతో అలా ఉండిపోయాడు. ఇంతలో ఆ వెలుతురు ఉన్న జలంమీదకి ఒక మృతదేహం కొట్టుకు వచ్చింది. దానిని గురుశిష్యులు ఇద్దరూ పరిశీలనగా చూస్తున్నారు. విచిత్రంగా, ఆ మృతదేహం గట్టు దగ్గర ఉన్న వాళ్ళ దగ్గరకు కొట్టుకు వచ్చింది. ఆ మృతదేహాన్ని చూసిన చోగ్స్‌సాంగ్ పెదవులపై అప్రయత్నంగా విచిత్రమైన చిరునవ్వు మెరిసింది. ఆపై ఆయన తన శిష్యుడితో “నీ దగ్గర ఉన్న కత్తితో ఆ మృతదేహంలోంచి ఒక ముక్కను కోసుకుని తిను. భారతదేశంలో నాకు ఒక మిత్రుడు ఉన్నాడు. అతడు ప్రతి సంవత్సరమూ ఇదే రోజున ఈ నది ద్వారా నాకు ఒక మృతదేహాన్ని పంపిస్తూ ఉంటాడు. ఇప్పుడు కూడా అలాగే అతడు పంపించాడు” అన్నాడు. ఆపై చోగ్స్‌సాంగ్ ఆ మృతదేహం దగ్గరకువెళ్ళి, తన దుస్తుల వెనకాల నుండి దాదాపు అడుగు పొడవు ఉన్న ఒక పదునైన కత్తిని బైటకుతీసి ఆపై ఆ కత్తితో ఆ మృతదేహంలోని ఒక ముక్కనుకోసి ఆ ముక్కను నోట్లో పెట్టుకుని కసకస నమిలి మ్రింగాడు. ఆ దృశ్యం చూసిన ఆయన శిష్యుడు పట్టరాని భయంతో గజగజా వణకిపోతూ, అరవటానికి కూడా ధైర్యం చాలక జీవశ్ఛవంలాగా అలా గురువుకేసి చూస్తూ ఉండిపోయాడు. అది గమనించిన చోగ్స్‌సాంగ్ తన శిష్యుడికేసి చిరునవ్వుతో చూసి “అలా భయపడతావేంటి? రా నువ్వు కూడా కోసుకుని తిను” అన్నాడు. ఆ శిష్యుడు ఎలాగో తేరుకుని తన కత్తితో ఆ మృతదేహాన్ని తన గురువులాగా కోసుకుని తినాలని ప్రయత్నించాడు. కొయ్యటం అయితే కోసాడుగాని, కోసిన ఆ నరమాంసం ముక్కని నోట్లో పెట్టుకునే ధైర్యం చెయ్యలేకపోయాడు. “ఆ ముక్కను పారేస్తే గురువు శపిస్తాడేమో” అన్న భయంతో ఆ శిష్యుడు ఆ మాంసం ముక్కని నోట్లో పెట్టుకున్నాడు. గురువు ప్రక్కకు తిరగగానే నోట్లోంచి ఆ మాంసం ముక్కని బైటకుతీసి, చాలా వేగంగా తన భుజానికి వ్రేలాడుతున్న సంచిలో వేసుకున్నాడు. ఆ తరువాత ఆ గురుశిష్యులు ఇద్దరూ గుర్రాలు ఎక్కి సూర్యోదయ సమయానికి తమ నివాసానికి చేరుకున్నారు.

నివాసానికి వచ్చిన తరువాత చోగ్‌సాంగ్ తన శిష్యుడితో ఇలా అన్నాడు. “ఎంతో అదృష్టం ఉన్నవాళ్ళకు మాత్రమే అలాంటి తాంత్రిక మాంస భోజనంచేసే అవకాశం వస్తుంది. నీవు నా ప్రియ శిష్యుడివి అన్న అభిమానంతో నిన్ను మాత్రమే ఆ నది దగ్గరకు తీసుకువెళ్ళి, నీకు ఆ నరమాంసం తినే అవకాశాన్ని ఇచ్చాను. ఆ మాంసం ముక్క నీవు తిని ఉన్నట్లయితే నీకు అసాధారణ మంత్రశక్తులు వచ్చి ఉండేవి. కానీ, నీవు అది తినటానికి భయపడి దానిని నీ సంచిలో దాచుకున్నావు”. గురువు అలా అనే సరికి ఆ శిష్యుడికి చాలా బాధ కలిగింది. అద్భుతమైన అవకాశాన్ని తాను పోగొట్టుకున్నానని అతనికి అర్థమయ్యింది. ఇప్పటికైనా మించిపోయింది లేదు. తన సంచిలో ఆ మాంసం ముక్క ఉన్నది కనుక అది ఇప్పుడైనా తినవచ్చు అన్న భావనతో అతడు తన కుడిచేయిని తన సంచిలో పెట్టాడు. ఆశ్చర్యం! ఆ సంచిలో ఆ ముక్కలేదు.

**పుర్‌బూ :** ఒక మూడువైపులా పదునుగల ఒక ప్రత్యేక నిర్మాణం గల ఆయుధాన్ని టిబెటన్ భాషలో ‘పూర్‌పా’ లేదా ‘పుర్‌బూ’ అని పిలుస్తారు. టిబెటన్ మంత్రవాదులు భూత, ప్రేతాలను లొంగదీసుకునే సమయంలో ఈ ‘పుర్‌బూ’ అనే ఒక ప్రత్యేకమైన కత్తిని ఉపయోగిస్తూ ఉంటారు. సంస్కృత భాషలో ఈ ఆయుధాన్ని ‘కిలయా’ అని పిలుస్తారు. ఈ ఆయుధానికి దుష్టశక్తుల్ని తరిమివేయగల శక్తులు ఉంటాయని టిబెటన్ మంత్రవాదులు భావిస్తారు. ఈ ఆయుధం యొక్క పై భాగం శిరస్సు ఆకారంలో ఉంటుంది. మధ్యభాగం కలువ పువ్వు రెక్కల ఆకారంలో ఉంటుంది. క్రింద భాగంలో మొసలిని పోలిన రూపం కనిపిస్తుంది. ఏదిఏమైనా ప్రతి పురుబూ దాదాపుగా 8 అంగుళాల పొడవు దాకా ఉంటుంది. అయితే, ఈ పుర్‌బూ ఏవిధమైన పదార్థంతో తయారు అవుతుందో, ఆ పదార్థాన్నిబట్టి ఈ ఆయుధం ఉపయోగపడే విధానం కూడా మారుతుంది.

ప్రేతాత్మలను తరిమివేయటానికి లేదా శిక్షించటానికి ఉపయోగించే పుర్‌బూ – ఇనుము లేదా ముళ్ళు కలిగి ఉండే చెట్టు కాండంతో తయారు చేస్తారు. దీని రంగు ఆకుపచ్చ లేదా నలుపు రంగులో ఉంటుంది. ఇక, వ్యక్తుల్ని వశీకరణ చెయ్యటానికి ఉపయోగించే పుర్‌బూని రాగి లోహంతో తయారుచేస్తారు. ఈ ఆయుధం ఎరుపు రంగులో ఉంటుంది. మనిషి యొక్క శక్తిని పెంచటానికి ఉపయోగించే పుర్‌బూను బంగారంతో తయారు చేస్తారు. ఈ ఆయుధం పసుపురంగులో ఉంటుంది. ఉగ్ర దేవతల్ని శాంతింపచేయటానికి ఉపయోగించే పుర్‌బూను వెండి/అల్యూమినియం/

తెల్లగంధపుచెట్టు కాండంతో తయారుచేస్తారు. ఈ పురుబూ, తెలుపు రంగులో ఉంటుంది.



**పర్బా (తాంత్రిక కత్తి) :** ఈ కత్తికి అసాధారణ మైన తాంత్రిక శక్తులు ఉంటాయని చెబుతారు. అందువలన ఈ పుర్బూలను సాధారణమైన వ్యక్తుల ఇళ్ళల్లోగాని, సిద్ధిపొందని సన్యాసుల మఠాలలోగాని ఉంచరు. కారణం, ఈ తాంత్రిక కత్తులు ఏ క్షణంలో అయినా విజృంభించి, తమకు సమీపంలో ఉండే మానవులను చంపివేయటం జరుగుతుంది. ఒక పాశ్చాత్య పరిశోధకుడు, దాదాపు 50 సంవత్సరాల క్రితం టిబెట్ దేశంలోని మంత్రవాదుల గురించి పరిశోధనలు చెయ్యటానికి టిబెట్ వెళ్ళాడు. అతడు, టిబెట్‌లో పర్యటిస్తున్న సమయంలో ఒక చలికాలం మధ్యాహ్నం రోజున ఉత్తర టిబెట్ ప్రాంతంలో ఒక ప్రదేశంలో నిలబడి ఉన్నాడు. ఆ సమయంలో కొంతమంది లామాలు ఒక చిన్న పెట్టెను ఒక పల్లకిలో పెట్టి ఆ పల్లకిని మోసుకుంటూ వెళుతున్నారు. వాళ్ళు అంత శ్రద్ధగా తీసుకువెళుతున్న ఆ చిన్న పెట్టెను చూసి ఆ పరిశోధకుడు ఎంతో ఆశ్చర్యపోయాడు. ఆపై అతడు ఆ లామాల దగ్గరకు వెళ్ళి వారిలో ఒకరిని ఇలా అడిగాడు. "ఈ పెట్టెలో ఏమున్నది?. ఇంతమంది లామాలు దీనిని అతి భద్రంగా ఎక్కడికి తీసుకువెళుతున్నారు?".

అప్పుడు ఆ లామా ఇలా చెప్పాడు. "ఈ పుర్బూ, మహా శక్తివంతుడైన ఒక లామా గురువుకి చెంది ఉన్నది. ఆయన బ్రతికి ఉన్నంతకాలం ఈ పుర్బూ ఆయన ఆధీనంలో ఉండి, ఆయన చెప్పినట్లుగా ప్రవర్తిస్తూ ఉండేది. కొద్ది రోజుల క్రితం ఆయన చనిపోయాడు. అప్పటి నుండి ఈ పుర్బూ ప్రతిరోజూ మా సన్యాసుల మఠంలో ఉన్న ఎవరో ఒక వ్యక్తిని చంపుతున్నది. మొన్నటి వరకు మా మఠానికి అధిపతిగా ఉన్న లామాకి ఉన్న మంత్రసిద్ధి కారణంగా ఆ పుర్బూ ఎవరికీ ఏ హానీ చెయ్యలేదు. ఎప్పుడైతే ఆయన చనిపోయాడో ఆ పుర్బూని అడ్డుకునే శక్తిగల వాళ్ళు ఎవరూ లేకుండా పోయారు. దాంతో అది మా మఠంలో ఉంటే మాకు ఇంకా ఎన్నో అశుభాలు జరుగుతాయని నిర్ణయించుకుని, దీనిని నాశనం చెయ్యాలని ప్రయత్నించాం. కానీ, దానివల్ల మాకు మరింత చెడు జరిగింది. అందువల్ల మేము, దీనిని ఒక పెట్టెలో ఉంచి ఇక్కడికి కొంచెం దూరంలో ఉన్న ఒక గుహలో

భద్రపరచటానికి వెళుతున్నాం". ఆ పరిశోధకుడు రెండు అడుగులు ముందుకువేసి ఆ పల్లకి దగ్గరకువెళ్ళి లోపలికి తొంగి చూసాడు. ఆ పెట్టె లోపల నుండి భయంకరమైన "మూలుగులు" వినపడ్డాయి. "ఆ శబ్దాలు ఆ పుర్‌బూ నుండి వస్తున్నవే" అని అతడి ప్రక్కనే ఉన్న ఒక లామా ఆ పరిశోధకుడికి చెప్పాడు. ఏదిఏమైనా, ఆ లామాలు ఆ పల్లకిని మోసుకుంటూ ఒక గుహ దగ్గరకు వెళ్ళారు. ఆపై ఇద్దరు లామాలు ఆ పల్లకిలో ఉన్న పెట్టెను చాలా జాగ్రత్తగా పట్టుకుని తాంత్రిక మంత్రాలు పఠిస్తూ ఆ పెట్టెను గుహలోపలికి తీసుకువెళ్ళారు. లోపల, భయంకరమైన రూపంలో ఉన్న ఒక ఎత్తైన దేవతా విగ్రహం కనపడింది. అప్పుడు ఆ లామాలు ఆ పెట్టెను ఆ విగ్రహం ముందు ఉంచి వెనక్కి తిరిగి చూడకుండా బైటకు వచ్చేసారు. ఇలాంటి అపారమైన తాంత్రిక శక్తిగల పుర్‌బూలను ఎవరూ నియంత్రించలేకపోతే అవి గాలిలో తేలుతూ ప్రయాణిస్తాయి. మార్గమధ్యంలో ఎవరైనా మనుషులు తమకు కనిపిస్తే అవి వారిని దారుణంగా చంపుతాయి.

**రోలాంగ్ (నిలబడిన మృతదేహం) :** టిబెట్ దేశంలోకి బౌద్ధమతం ప్రవేశించటానికి ముందు ఆ దేశంలో "బాన్‌పో" తాంత్రిక మతానికి చెందిన మంత్రవాదులు, తమ మంత్రశక్తితో ఏదైనా మానవ మృతదేహాన్ని తిరిగి జీవించేలా చెయ్యటం జరిగేది. ఈ విధానంలో ఏదోఒక ఆత్మను తమ మంత్రశక్తితో ఆహ్వానించి, ఆపై ఆ ఆత్మను తాము ఎన్నుకున్న మృతదేహంలోకి ప్రవేశపెడతారు. ఫలితంగా, ఆ మృతదేహం మళ్ళీ ప్రాణం పోసుకుంటుంది. ఇలా తిరిగి బ్రతికిన మృతదేహాన్ని టిబెటన్ భాషలో "రోలాంగ్" అని పిలుస్తారు. ఈ ప్రక్రియ ఎలా జరుగుతుంది అంటే...

మొదట, బాన్‌పో మంత్రగాడు ఒక మృతదేహాన్ని ఒక చీకటి గదిలో ఉంచి ఆ గది తలుపులు లోపల నుండి మూసుకుంటాడు. ఆ తరువాత, వెల్లికిలా పడి ఉన్న మృతదేహం పైన బోర్లా పడుకుని, మృతదేహంయొక్క పెదవులతో తన పెదవులు కలుపుతాడు. ఆ తరువాత ఆ మృతదేహాన్ని తన రెండు చేతులతో గట్టిగా పట్టుకుంటాడు. ఆపై, "మృతదేహానికి ప్రాణంపోసే మంత్రాలను" కొద్ది క్షణాలపాటు మనసులో పఠిస్తాడు. కొంతసేపు గడిచిన తరువాత ఆ మృతదేహంలో కదలికలు ప్రారంభం అవుతాయి. ఆపై, అది నిటారుగా లేచి నిలబడుతుంది. అంతేకాదు, ఆ గదిలోంచి బైటకు తప్పించుకుపోవాలని ప్రయత్నిస్తుంది. అయితే, ఆ మృతదేహాన్ని తన రెండు చేతులతో గట్టిగా పట్టుకుని ఉన్న ఆ మంత్రవాది, ఆ మృతదేహం ఎటూ వెళ్ళిపోకుండా అడ్డుకుంటాడు. దాంతో, ఆ మృతదేహం అతడి పట్టు నుండి తప్పించుకోవటానికి

విపరీతంగా ఊగిపోతుంది. తనని పట్టుకుని ఉన్న అతడిని విసిరివేయటానికి తీవ్రంగా ప్రయత్నిస్తుంది. అంతేకాదు, గాలిలోకి లేచి ఎగురుతుంది. అయినప్పటికీ ఆ మంత్రవాది ఆ మృతదేహం యొక్క పెదవులపై ఉన్న తన పెదవులను ఏమాత్రం ఇవతలికి తియ్యకుండా అలాగే ఉంచి, మళ్ళీ మనసులో మంత్రాలను చదవటం ప్రారంభిస్తాడు. అలాంటి సమయంలో ఆ మృతదేహం నోరు తెరుస్తుంది. ఆపై, దాని నోట్లోంచి నాలుక ఒక కత్తిలాగా బైటకు వస్తుంది. ఆ సమయంకోసం ఎదురుచూస్తున్న ఆ మంత్రవాది ఆ నాలుకను తన పళ్ళతో గట్టిగా పట్టుకుని “కసుక్కున” కొరికి అవతలికి ఉమ్మివేస్తాడు. దాంతో ఆ శవం నేలపై కూలిపోతుంది. ఏదిఏమైనా, మంత్రబలంతో ఏదైనా మృతదేహానికి ఇలా ప్రాణంపోసిన మంత్రవాది, ప్రాణం వచ్చిన తరువాత ఆ మృతదేహాన్ని నియంత్రించలేకపోతే, మళ్ళీ జీవించిన ఆ మృతదేహంవల్ల ఆ మంత్రవాది ప్రాణాలు కోల్పోవటమే కాకుండా, అతడి బారి నుండి తప్పించుకున్న ఆ సజీవ మృతదేహం అనేకమందిని సంహరించే అవకాశాలు ఉంటాయి.

ఇలా మళ్ళీ జీవించిన మృతదేహం యొక్క నాలుకను తన దంతాలతో ఖండించి అవతల పడేసిని ఆ మంత్రవాది, ఆపై ఆ నాలుక ముక్కను బాగా ఎండపెడతాడు. ఫలితంగా, అది మహా శక్తివంతమైన ఒక తాంత్రిక ఆయుధంగా మారుతుంది. ఈనాటికీ టిబెట్ పర్వతాలలో ఏదో ఒక ప్రదేశంలో అమావాస్య రాత్రులలో ఇలాంటి “రోలాంగ్” తాంత్రిక ప్రక్రియలు జరుగుతూ ఉంటాయని తెలుస్తున్నది. ఆ కారణంగానే టిబెట్ ప్రాంతంలోని ప్రజలు, తమ కుటుంబాలకు సంబంధించిన మృతదేహాలను ఏ మంత్రవాది అపహరించకుండా ఉండటంకోసం ఆ మృతదేహాలకు తగు రక్షణ కల్పిస్తూ ఉంటారు.

**టిబెటన్ చేతబడి విధానం :** ఒక వ్యక్తికి తీవ్ర అనారోగ్యాన్ని లేదా మరణాన్ని కలిగించటంకోసం టిబెటన్ మంత్రవాదులు ఒక ప్రత్యేకమైన విధానంలో ఆ వ్యక్తికి చేతబడి చేస్తారు. ఆ ప్రక్రియ ఎలా జరుగుతుందంటే...



మొదట, ఒక మంత్రవాది నేలమీద – ఎరుపు రంగు ముగ్గు పొడితో అర్ధచంద్రాకారంలో ఒక బొమ్మని వేస్తాడు. ఆ తరువాత, ప్లేగు వ్యాధితో మరణించిన వ్యక్తి చివరగా ధరించి ఉన్న వస్త్రం

నుండి సేకరించిన ఒక చిన్న ముక్కని తీసుకుని దానిమీద తాను ఎవరికైతే చేతబడి చెయ్యబోతున్నాడో ఆ వ్యక్తి యొక్క పేరుని మరియు ఇంటిపేరుని, నలుపు రంగులో ఉండే ఒక ఉన్నతస్థాయి కన్యయొక్క బహిష్టు రక్తంతో రాస్తాడు. ఆ తరువాత, తాను ఇంతకుముందు వేసిన ముగ్గుకి దగ్గరలో ఏర్పాటుచేసిన నిప్పులమీద గుగ్గిలంవేస్తాడు. అప్పుడు ఆ నిప్పుల నుండి నల్లటి దట్టమైన పొగ బైటకు వస్తుంది. అప్పుడు ఆ మంత్రవాది, టిబెటన్ తంత్రశాస్త్రంలో చెప్పబడిన – కొందరు ఉగ్రదేవతలను మంత్రాలతో ఆవాహన చేస్తాడు. ఆ తరువాత, తాను రక్తంతో పేర్లు వ్రాసిన వస్త్రపు ముక్కని ఆ ముగ్గుమీద ఉంచుతాడు. ఆ తరువాత, ప్లేగు వ్యాధితో మరణించిన వ్యక్తియొక్క ఎముకతో తయారుచేసిన ఒక పుర్‌బూని ఎడమ చేతితో గాలిలోకి ఊపుతూ లక్షసార్లు ఒక మారణ మంత్రాన్ని (చేతబడి మంత్రాన్ని) నిర్విరామంగా పఠిస్తాడు. ఆ రోజు అర్ధరాత్రి సమయంలో, తాను ఎవరికైతే ఆ చేతబడి చెయ్యాలనుకుంటున్నాడో ఆ వ్యక్తి నిద్రించే ప్రదేశంలో, తాను మంత్రించిన వస్త్రం ముక్కని ఉంచుతాడు. ఆ వస్త్రం ముక్క యొక్క ప్రభావం వల్ల, ఆ వ్యక్తి తెల్లవారే సరికి తీవ్రమైన అనారోగ్యానికి గురై ఆపై కొద్దిరోజులకే దారుణంగా మరణిస్తాడు.

**క్రూర గ్రహ ప్రభావాల నుండి మనిషిని రక్షించే టిబెటన్ తాంత్రిక పరిహారములు :**

టిబెటన్ మత విశ్వాసాల ప్రకారం చూసినట్లయితే, ప్రతి మనిషి జీవితంలోనూ 10 సంవత్సరాలకు ఒకసారి ప్రమాదాలు వస్తాయి. ఆ ప్రమాదాలు మనిషికి మరణాన్ని కూడా కలిగించే అవకాశాలు ఉంటాయని తెలుస్తున్నది. అది ఎలాగంటే...

**1. వయస్సు ప్రకారం వచ్చే ప్రమాదం :** ఈ ప్రమాదం ప్రతి మనిషికీ 10 సంవత్సరాలకు ఒకసారి వస్తుంది. అనగా, ఒక మనిషికి 9 సంవత్సరాల వయస్సు ఉన్నప్పుడు, 19 సంవత్సరా వయస్సులోను, 29 సంవత్సరాల వయస్సులోను ఇలా... మనిషి మరణించేవరకు ప్రమాదాలు దశాబ్దానికి ఒకసారి ఎదురవుతాయి. ఇలాంటి అశుభకరమైన సంవత్సరాలను "గూమిగ్" అనే పేరుతో పిలుస్తారు.

**2. పుట్టిన సంవత్సరాన్నిబట్టి :** చైనా మరియు టిబెటన్ జ్యోతిషశాస్త్రాలలో 12 రాశులు ఉంటాయి. ఒక్కోరాశికి ఒక్కో జంతువు అధిపతిగా ఉంటుంది. ప్రతి మనిషి ఏదో ఒక రాశిలో (ఆ రాశి జరిగే సమయంలో) పుడతాడు కనుక ఒక మనిషి పుట్టిన రాశి, మళ్ళీ 12 సంవత్సరాలకు వస్తుంది. కనుక, ప్రతి మనిషికి 12 సంవత్సరాలకు ఒకసారి ఏదో ఒక తీవ్రమైన చెడు జరుగుతుంది. ఈవిధంగా చెడు జరిగే 12వ

సంవత్సరాన్ని "లోకాగ్" అనే పేరుతో పిలుస్తారు. ఏదిఏమైనా, ప్రతి మనిషికీ జీవితంలో మూడుసార్లు తీవ్రమైన గండాలు ఎదురవుతాయి. వీటిని ఎదుర్కోవటంకోసం "గుల్‌గ్రోల్" అనే పేరుగల ఒక తాంత్రిక పరిహారాన్ని టిబెటన్ మంత్రవాదులచేత చేయించటం జరుగుతుంది.

ఈ పరిహార ప్రక్రియ ప్రారంభ సమయంలో బౌద్ధమత ప్రధాన దైవం అయిన ధర్మపాల మరియు ఆయన అనుచర దేవతల్ని మంత్రాలతో ఆవాహనచేస్తారు. ఆ తరువాత ఆ విగ్రహాల ముందు ఉంచిన ఎత్తు తక్కువ ఉండే ఒక బల్లమీద ఈ క్రింద చెప్పిన ఏర్పాట్లను చేస్తారు. అది ఎలాగంటే... మొదట, బార్లి పిండితో చేసిన 9 చిన్న చిన్న ముద్దల్ని ఆ బల్లమీద ఒక వరుసలో ఉంచుతారు. ఆ తరువాత ప్రతి ముద్దలోను గొర్రె ఎముక నుండి రూపొందించిన ముక్కలను గుచ్చుతారు. ఆపై, ఒక చిన్న ధనస్సును, కొత్త బట్టలను, తాజాగా ఉన్న వండిన ఆహారాన్ని ఆ ముద్దల తరువాతి వరుసలో ఉంచుతారు. ఎవరికోసం అయితే ఈ పరిహారం చేయించబడుతున్నదో ఆ వ్యక్తి, పాత వస్త్రాలను ధరించి ఈ పరిహారం జరుగుతున్న గదిలోకి ప్రవేశిస్తాడు. ఆ సమయంలో ఆ వ్యక్తి తలపైన ఒక టోపి, చేతిలో ఒక చిన్న కర్ర ఉంటాయి. ఆపై ఆ వ్యక్తి తన చేతిలోని కర్రతో ఆ బల్లమీద ఉన్న ఒక్కో ముద్దని తాకుతాడు.



ఆ తరువాత ఆ గదిలో ఉన్న మంత్రవాది, కొన్ని తాంత్రిక సంబంధమైన మంత్రాలను పఠిస్తాడు. ఆపై, ఆ బల్లకి ప్రక్కన స్థాపించబడిన ధర్మపాల మరియు ఇతర దేవతలను ప్రార్థించి, ఆ వ్యక్తికి ఎదురవుతున్న ప్రమాద బారినుండి ఆ వ్యక్తిని రక్షించమని ఆ దేవతల్ని అభ్యర్థిస్తాడు. ఆ తరువాత ఆ మంత్రవాది సలహామీద ఆ వ్యక్తి ఆ బల్లమీద ఉన్న తొమ్మిది ముద్దలను ఒక్కొక్కటి తీసి ప్రక్కనే ఉన్న ఒక చిన్న పాత్రలో వేస్తాడు. ఆ తరువాత, ఆ వ్యక్తి యొక్క కుటుంబ సభ్యుడు లేదా సభ్యురాలు కొత్త బట్టలను తీసుకుని ఆ

గదిలోకి వస్తుంది. అప్పుడు ఆ వ్యక్తి, మంత్రవాది సలహాపైన, అప్పటి దాకా తన వంటిమీద ఉన్న పాత దుస్తులను వదిలిపెట్టి కొత్త దుస్తులను ధరిస్తాడు. అదేవిధంగా తన నెత్తిమీద ఉన్న పాత టోపీని మరియు చేతి కర్రను, ధర్మపాల విగ్రహం పాదాల దగ్గర ఉంచుతాడు. ఆ తరువాత ఆ బల్లమీద ఉంచిన నైవేద్యంలో కొంత భాగాన్ని తీసుకుని ఆరగిస్తాడు. ఈవిధంగా పరిహారం పూర్తి అయిన తరువాత ఆ మంత్రగాడు ఆ బల్లమీద ఉన్న తొమ్మిది పిండి ముద్దలను మరియు నైవేద్యాన్ని మరియు ఆ వ్యక్తి, ధర్మపాల విగ్రహం దగ్గర ఉంచిన పాత దుస్తులను, టోపీని, చేతి కర్రని ఒక సంచిలో వేసుకుని, ఆపై ఆ సంచిని తీసుకుని నిర్మానుష్యంగా ఉండే ఒక ప్రదేశానికివెళ్ళి, అక్కడ ఆ సంచిని వదిలివేసి ఇవతలికి వస్తాడు. ఈ పరిహారం వల్ల ఆ వ్యక్తికి ఎదురవుతున్న ప్రమాదం తొలగిపోతుంది.

కొంతమంది టిబెటన్ మంత్రవాదులు కొన్ని తాంత్రిక మంత్రాలతో క్రూరమైన మరియు పెద్ద పరిమాణంలో ఉండే రాబందులు, గద్దలు లాంటి పక్షుల్ని తమ వశం చేసుకుని ఆపై తమకు అవసరం అయినప్పుడు ఆ పక్షుల్ని ఇతరులకు సందేశాన్ని పంపించటంకోసమో లేక శత్రువులయొక్క గొర్రెల మందలకు మరణం కలిగించటం కోసమో ఉపయోగిస్తూ ఉంటారు. కొన్ని సమయాలలో ఈ మంత్రగాళ్ళు తమ మంత్రాలతో అప్పటికప్పుడు రాబందుల్ని లేదా గ్రద్దలను తమ దగ్గరకు రప్పించుకుని ఆపై వాటిని తమకు అవసరమైనవిధంగా ఉపయోగించుకోవటం జరుగుతుంది. తూర్పు, పశ్చిమం, దక్షిణం, ఉత్తరం మరియు ఆకాశం – అనే ఐదు దిక్కులలో ఐదు రకాల దేవతలు నివసిస్తూ ఉంటారు. కొంతమంది మంత్రవాదులు ఈ దేవతలను లేదా ఢాకినీలను తాంత్రిక సాధనలతో తమ వశం చేసుకుంటారు. తమకు అవసరం అయినప్పుడు ఈ మంత్రవాదులు, రాబందుల్ని లేదా గ్రద్దలను ఈ ఢాకినీల ద్వారా తమ దగ్గరకు రప్పించుకుని, వాటి ద్వారా తాము చెయ్యాలనుకున్న కార్యాలను చేస్తూ ఉంటారు.

**వజ్రయాన తంత్రసాధనలో మద్య–మాంసములు :**

భారతదేశంలో, అనగా ఒకనాటి భారతదేశంలో భాగమైన నేపాల్ దేశంలో జన్మించిన గౌతమబుద్ధుడి చేత స్థాపించబడిన బౌద్ధమతంలో మొదట యజ్ఞయాగాలు, తాంత్రిక సాధనలు సంపూర్తిగా నిషేధించబడ్డాయి. కానీ, ఆ మత స్థాపకుడైన గౌతమ బుద్ధుడు మరణించిన తరువాత ఆ బౌద్ధమతం – హీనయానం మరియు మహాయానం అనే రెండు శాఖలుగా చీలిపోయింది. అందులో హీనయాన శాఖవారు, గౌతమ

బుద్ధుడిని ఒక గురువుగా మాత్రమే గుర్తిస్తారు. ఆ శాఖలో తాంత్రిక సాధనలు ఉండవు. కేవలము తపస్సులు మాత్రమే ఉంటాయి. ఇక, బౌద్ధమతంలోని రెండవ భాగం అయిన మహాయాన మతం గౌతమబుద్ధుడిని దైవంగా భావించింది. అంతేకాకుండా, హైందవ తంత్రశాస్త్రంలోని అనేక తాంత్రిక సాధనలను తనలో విలీనం చేసుకున్నది. ఆ కారణంగానే, మహాయాన మతంలో తంత్రదేవతలు, తాంత్రిక సాధనలు ఉన్నాయి. ఈ మహాయాన మతం నుండి "వజ్రయానం" అనే పేరుగల ఒక పరిపూర్ణమైన తాంత్రిక మతం ఆవిర్భవించింది. ఈ వజ్రయానంలో ఆచరించే తాంత్రిక సాధనలు, చాలా వరకు హైందవ తాంత్రిక సాధనలు పోలి ఉండటం విశేషం. ఈ వజ్రయాన తాంత్రిక మతం, హిమాలయ పర్వత దేశం అయిన టిబెట్‌లో విశేషమైన ప్రచారంలో ఉన్నది.

ప్రధాన బౌద్ధమతంలో జీవహింస నిషేధించబడింది. అనగా మాంసాహారం నిషేధించబడింది అని చెప్పవచ్చు. అయితే, సముద్ర మట్టానికి కొన్నివేల అడుగుల ఎత్తులో, సూర్యుడి జాడ దాదాపు కనపడని హిమాలయాల్లో జీవించే వజ్రయాన బౌద్ధమత సాధకులు, తమ తాంత్రిక సాధనలో భాగంగా మాంసంతోపాటుగా మద్యాన్ని కూడా తీసుకోవటం జరుగుతున్నది.



# 4. ఆధునిక యుగంలో ఆచార్య చాణక్య చెప్పిన నీతి సూత్రాల ప్రాధాన్యత ఏమిటి?

దాదాపు 25 శతాబ్దాల క్రితం ఉత్తర భారతదేశంలో ఒక మహాద్భుత చరిత్రకు కర్త అని చెప్పబడిన మహామేధావి చాణక్యుడిని "కౌటిల్యుడు" అనే ఇంకొక పేరుతో పిలుస్తారు. ఈ చాణక్యుడి అసలు పేరు విష్ణుగుప్తుడు అని గుర్తించాలి. మహా గురువుగా, గొప్ప అర్ధశాస్త్ర వేత్తగా, నిగూఢమైన జ్ఞానంగల వేదాంతిగా, న్యాయశాస్త్ర నిపుణుడిగా, రాజగురువుగా పేరుపొందిన చాణక్యుడు, మౌర్య సామ్రాజ్య తొలి చక్రవర్తి అయిన చంద్రగుప్తుడికి మరియు అతడి కుమారుడికి కూడా మార్గదర్శిగా గుర్తించబడ్డాడు.

ఒక సమయంలో చాణక్యుడిని నందరాజులు తీవ్రంగా అవమానించారు. ఆత్మాభిమానం అధికంగా కలిగిన చాణుక్యుడు వాళ్ళని నిందించాడు. దాంతో

వాళ్ళు, చాణుక్యుడిని కారాగారంలో బంధించారు. అప్పుడు చాణుక్యుడు తన మేధస్సుతో ఆ కారాగారం నుండి తప్పించుకుని బైటకు వచ్చాడు. ఆ తరువాత ఆయన చెట్లతో, పొదలతోకూడిన ఒక ప్రాంతంలో నడిచివెళుతున్నప్పుడు ఒక చిన్న పొద కాలికి తగలటంతో ఆయన నేలమీద బోర్లా పడ్డాడు. నందరాజులు చేసిన అవమానం వల్ల అప్పటికే పగ, ప్రతీకారాలతో రగిలిపోతున్న చాణుక్యుడికి తన కాలికి అడ్డం తగిలి, తనని నేలమీదకి పడకొట్టిన ఆ పొదమీద కూడా చాణుక్యుడికి విపరీతమైన కక్ష కలిగింది. ఆ పొదమీద కక్షను తీర్చుకోవటంకోసం ఆయన, కొంచెం పంచదారను తెచ్చి ఆ పొదమీద పోసాడు. కొద్ది నిమిషాలలోనే వేలాది ఎర్ర చీమలు ఆ పంచదార కోసం ఆ చిన్న పొదమీద దాడిచేసి ఒక గంటలోగా ఆ పొదను సంపూర్తిగా నిర్మూలించాయి. సరిగ్గా, అదే సమయంలో అక్కడకు వచ్చిన చంద్రగుప్తుడు ఈ దృశ్యాన్ని చూసి ఆశ్చర్యపడ్డాడు. “తనకు హానిచేసిన చిన్న పొదను కూడా అంతటి యుక్తితో మరియు అంతకు మించిన క్రూరత్వంతో నిర్మూలించిన చాణుక్యుడు ఎంత మేధావో” అర్థం చేసుకున్నాడు. తనని శిష్యుడిగా చేసుకుని, జ్ఞాన భిక్ష పెట్టమని ఆ చాణుక్యుడి పాదాలపై పడ్డాడు చంద్రగుప్తుడు.

ఆ చంద్రగుప్తుడి ముఖ మరియు అంగసాముద్రిక లక్షణాలను బట్టి అతడు ప్రభువు కాగలిగే సామర్థ్యాన్ని కలిగి ఉన్నాడు అని గ్రహించిన చాణుక్యుడు ఆ చంద్రగుప్తుడిని తన శిష్యుడిగా తీసుకుని ఆపై తనయొక్క అసాధారణమైన కుటిల మేధస్సుతో మరియు చంద్రగుప్తుడియొక్క సాహస, బలపరాక్రమాలతో తన శత్రువులు అయిన నంద వంశ రాజులను సంపూర్తిగా నిర్మూలించి, ఆపై తన ప్రియశిష్యుడైన చంద్రగుప్తుడిని ఉత్తర భారతదేశానికి చక్రవర్తిగా చేసాడు. ఆ తరువాత తనయొక్క మహత్తరమైన జ్ఞానాన్ని ఉపయోగించి “అర్ధశాస్త్రం” అనే గొప్ప రాజకీయ, ఆర్థిక, పరిపాలనా సంబంధ గ్రంధాన్ని వ్రాసి – ఆపై దానిని భవిష్యత్తులో రాబోయే పాలకులకు కానుకగా ఇచ్చాడు. ఒకవిశేషం ఏమంటే, కొన్ని వందల సంవత్సరాల క్రితం చాణుక్యుడు వ్రాసిన అర్ధశాస్త్రం యొక్క గొప్పతనాన్ని ఈనాటి మన పాలకులు గుర్తించలేకపోయినా, పాశ్చాత్య మేధావులు ఏనాడో గుర్తించారు. ఒక సంస్థను సమర్ధవంతంగా నడపాలనుకునే వ్యక్తి, తన కుటుంబాన్ని చక్కగా సరిదిద్దాలనుకునే వ్యక్తి, సమాజంలో ఉన్నతస్థాయికి చేరాలనుకునే వ్యక్తి, రాజకీయాలలో రాణించాలనుకునే వ్యక్తి తప్పనిసరిగా చాణుక్యుడియొక్క అర్ధశాస్త్రాన్ని సంపూర్తిగా పఠించాలి.

**చాణక్య సూక్తులు :**

1. మేధావి అయినవాడు గతం గురించి బాధపడడు. భవిష్యత్తు గురించి ఆందోళనకు గురికాడు. కేవలం వర్తమానం గురించి మాత్రమే ఆలోచిస్తాడు. అందుకు సంబంధించిన తన కర్తవ్యాన్ని నిర్వహిస్తాడు.

2. ప్రపంచంలో అత్యంత శక్తిగల రెండు అంశాలు ఏవంటే... 1.యవ్వనం 2. ఆడదాని అందం.

3. విధి లేదా కాలం ఒక మనిషిని గొప్పవాడిని చెయ్యగలదు మరియు నాశనం కూడా చెయ్యగలదు.

4. సంపదని, భార్యని, స్నేహితుడిని, రాజ్యాన్ని - పోగొట్టుకున్నా మళ్ళీ పొందవచ్చు. కానీ, నీ శరీరం పోతే (అనగా నువ్వు చనిపోతే) మళ్ళీ పొందటం సాధ్యంకాదు.

5. ఈ భూమిమీద నీరు, ఆహారము, మనసుకి నచ్చే మాటలు - అనే మూడు రకాల నిజమైన రత్నాలు ఉన్నాయి. కేవలము, మూఢులు మాత్రమే రత్నాలు అని పిలువబడే రాళ్ళను విలువైనవిగా భావిస్తారు.

6. ఒకసారి నీవు ఏదైనా పని ప్రారంభించిన తరువాత ఆ పనిలో రాబోయే పరాజయం గురించి భయపడి ఆ పనిని చెయ్యటం మానవొద్దు. ఎవరైతే తమ పనిని పరిపూర్ణమైన ఆత్మవిశ్వాసంతో చేస్తారో, వాళ్ళు ఈ ప్రపంచంలో అందరికన్నా సంతోషంగా ఉండగలరు.

7. మనిషిని నిజంగా నాశనం చేసేది అతడిలో తలెత్తే భయం. అందుకే నిన్ను, భయం సమీపిస్తున్న మరుక్షణంలోనే దానిమీద దాడిచేసి నాశనం చెయ్యాలి.

8. మనిషికి విద్యను మించిన మిత్రుడు లేడు. విద్యావంతుడు ఎక్కడికి వెళ్ళినా గౌరవాన్ని పొందగలడు. అందం, యవ్వనం కూడా విద్య కన్నా గొప్పవి కాదని గ్రహించాలి.

9. పూలయొక్క పరిమళం (సువాసన) గాలి ఎటువైపు వీస్తే అటువైపు వెళు తుంది. కానీ, మనిషియొక్క మంచితనం అన్ని దిక్కులకూ వ్యాపిస్తుంది. అనగా మంచివాడి గురించి అందరూ గొప్పగా అనుకుంటారు.

10. నీ బిడ్డకి 5 సంవత్సరాల వయస్సు వచ్చే వరకు అత్యంత ప్రియమైన మరియు మృదువైన మాటలతో పెంచాలి. ఆ తరువాత 5 సంవత్సరాల వరకు అనగా 10 సంవత్సరాల వయస్సు వచ్చే వరకు చిన్న తప్పుచేసినా అందుకు తగినట్లుగా నిందించాలి. నీ బిడ్డకి 16వ సంవత్సరం వచ్చినప్పటి నుండి ఆ బిడ్డని (కొడుకు లేదా కూతురు) నీ స్నేహితుడిగా లేదా స్నేహితురాలిగా భావించి వాళ్ళతో అలాగే ప్రవర్తించు.

11. ఈ భూమిమీదకి ప్రతి మనిషీ ఒంటరిగానే వస్తాడు. అలాగే ఒంటరిగానే ఈ లోకం నుండి వెళ్ళిపోతాడు. అతడు ఈ లోకంలో ఉన్నప్పుడు చేసిన మంచి లేదా చెడు కర్మలయొక్క ఫలితాలను ఒంటరిగానే అనుభవిస్తాడు. ఒంటరిగానే స్వర్గానికి లేదా నరకానికి వెళతాడు. అనగా, మనిషి అనేవాడు ఎప్పటికీ ఒంటిరివాడే అని మర్చిపోకూడదు.

12. గుడ్డివాడికి అద్దం ఎలా ఉపయోగపడదో అలాగే బుద్ధి హీనుడికి పుస్తకం ఉపయోగపడదు.

13. డబ్బులేనప్పుడు భార్యయొక్క స్వభావాన్ని, అవసరంలో ఉన్నప్పుడు స్నేహితుడి యొక్క స్వభావాన్ని, కష్టాల్లో ఉన్నప్పుడు బంధువుల యొక్క స్వభావాన్ని, ఒక పని చెయ్యమని ఒక పనివాడిని నియమించినప్పుడు ఆ పనివాడి యొక్క స్వభావాన్ని - స్పష్టంగా తెలుసుకోవచ్చు.

14. కాస్త వివేకం ఉన్న ఏ మనిషి అయినా సరే పూర్తిగా నిజాయితీగా ఉండ కూడదు. ఎందుకంటే, బాగా నిటారుగా ఉండే చెట్లను ముందు నరుకుతారు. నిజాయితీగా ఉండేవాళ్ళను ముందుగా చిక్కుల్లో ఇరికిస్తారు.

15. మనిషియొక్క గొప్పతనం అతడి సుగుణాలలో, మంచితనంలో ఉంటుంది. గొప్ప పదవిలో లేదా ఉద్యోగంలో ఉన్నంత మాత్రాన మనిషి గొప్పవాడు కాదు. కాకి, ఎత్తైన భవనం మీద నిలబడి ఉన్నా, నేలపై నిలబడి ఉన్నా గ్రద్ద కన్నా గొప్పది కాదని గుర్తించాలి.

16. దురాశాపరుడిని డబ్బుతో, భక్తిని ప్రదర్శించి గర్విష్టిని, తెలివి తక్కువవాడు ఏది చెబితే అది అంగీకరించి - వాడిని లొంగదీసుకోవచ్చు. కానీ, పండితుడిని కేవలము సత్యముతో అనగా నిజాయితీతో మాత్రమే వశపరచుకోగలరు.

17. ఒక త్రాగుబోతు, మంచికి మరియు చెడుకి మధ్య ఉండే తేడాని గుర్తించలేదు. అదేవిధంగా ఒక స్వార్ధపరుడు తన లక్ష్యాలు సాధించుకోవటంకోసం మంచి, చెడులు చూడలేని గుడ్డివాడిగా మారిపోతాడు.

18. చెడ్డ భార్య, చెడ్డ స్నేహితుడు, చెడ్డ శిష్యుడు – అనే వాళ్ళని కలిగి ఉండటం కన్నా అసలు వాళ్ళు లేకుండా ఉంటేనే చాలా మంచిది.

19. నీ వ్యాపారంలో లేదా నీ వృత్తిలో నీకు వస్తున్న నష్టాల్ని, కష్టాలను మరియు నీ హృదయం ఏ విషయంలో అయినా పగిలిపోయిన (భగ్న హృదయం) విషయాన్ని మరియు నీ కుటుంబంలో జరిగిన చెడు సంఘటనల గురించి, నీకు లేదా నీ కుటుంబ సభ్యులకు జరిగిన అవమానాల గురించి పొరపాటున కూడా ఇతరులకు చెప్పవొద్దు. అలా చెప్పినట్లయితే వాళ్ళు, భవిష్యత్తులో ఏదో ఒక సమయంలో ఆ సమాచారం ఆధారంగా నిన్ను దెబ్బతియ్యవచ్చని గుర్తించు.

20. ఏదైనా నేర్చుకునే విషయంలో, ఆహారం తీసుకునే విషయంలో, వ్యాపార వ్యవహారాలలో నీవు సంకోచం లేదా సిగ్గులేనివాడిగా ఉండాలి.

21. ఏ ప్రాంతంలో – చట్టం అంటే గౌరవంలేని ప్రజలు, సిగ్గు ఎగ్గులేని ప్రజలు, మూర్ఖత్వంగల ప్రజలు, దానం, ధర్మం చెయ్యటానికి ఇష్టపడని ప్రజలు, కళలపట్ల ఏమాత్రం ఆసక్తిలేని ప్రజలు ఉంటారో – అలాంటి ప్రదేశంలో సరైన మనిషి పొరపాటున కూడా నివసించరాదు.

22. పేదరికాన్ని ఓర్పుతో ఎదుర్కోవచ్చు. శుభ్రంగా ఉంటే విలువ తక్కువ వస్త్రాలు కూడా ఆకర్షణీయంగా కనిపిస్తాయి. వేడిగా మరియు తాజాగా ఉండే ఆహారం రుచి లేకపోయినా ఆరగించగలరు. అదేవిధంగా శారీరకమైన సౌందర్యం లేకపోయినా మంచి గుణాలు గల వ్యక్తి ఆకర్షణీయంగా కనిపిస్తాడు.

23. నీ రహస్యాలు ఏనాడూ రెండో వ్యక్తికి చెప్పవొద్దు. నీవు ఇతరులకు చెప్పిన నీ రహస్యం ఏనాటికైనా నిన్ను నాశనంచేసి తీరుతుంది.

24. ప్రతి స్నేహం వెనకాల కొంత స్వార్ధం ఉంటుంది. స్వార్ధంలేని స్నేహ బంధం ఉండదు. ఇది చేదుగా ఉన్నప్పటికీ నిజం.

25. ఒక బిడ్డ తన తల్లి కడుపులో ఉండగానే ఆ బిడ్డయొక్క ఆయుర్దాయం, చెయ్యబోయే కార్యాలు, పొందబోయే జ్ఞానం, సంపాదించబోయే సంపద, మరణ సమయం – అనే ఐదు విషయాలు నిర్ణయం అవుతాయి. వాటిని మార్చటం ఏ మనిషి వల్లాకాదు.

26. అనుబంధం మరియు ప్రేమ అనే రెండు అంశాలు ఒకటే అని భావించ వొద్దు. అవి ఒకదానికి ఒకటి శత్రువు. ఎందుకంటే అనుబంధం అన్నిరకాల ప్రేమలను నాశనం చేస్తుంది.

27. నీ స్థాయికన్నా తక్కువగా ఉండే వ్యక్తులతో ఎన్నడూ స్నేహం చెయ్యరాదు. అలాంటి స్నేహాలు నీకు ఎన్నటికీ ఆనందాన్ని కలిగించవు.

28. శత్రువులను జయించటానికి సామ, దాన, భేద, దండ అనే ఐదు మార్గాలను ఒక వరుసలో ఉపయోగించాలి. "సామ" అనగా – మొదట ప్రశాంతంగా ప్రత్యర్థికి మంచిగా చెప్పి చూడాలి. అలా వీలుకాని పక్షంలో "దాన" విధానంలో శత్రువుకి ఏదో ఒక లాభాన్ని కలిగించాలి. అది కూడా ఫలించని పక్షంలో "భేద" అనే విధానంలో అనగా శత్రువుకి అనుకూలంగా ఉన్నవాళ్ళతో ఆ శత్రువుకి విభేదాలు కల్పించి, శత్రువును బలహీనపరచి దెబ్బతియ్యాలి. ఒకవేళ శత్రువు మేధావి అయి ఉండి మరియు ఈ భేద విధానం అతడి దగ్గర పనిచెయ్యనప్పుడు అతడిని ఏదోఒకవిధంగా శిక్షించాలి. ఈ అంతిమ విధానం పేరు "దండం". అనగా దండించటం అన్నమాట.

29. మోసపూరితమైన స్వభావంగల వ్యక్తిని, తన స్వార్థంకోసం నమ్మినవారికి "వెన్నుపోటు" పొడిచే వ్యక్తిని, అకారణంగా అబద్ధాలు ఆడే వ్యక్తిని ఏనాడూ నమ్మరాదు. మరియు అలాంటి వ్యక్తితో ఏవిధమైన సంబంధాలను కలిగి ఉండరాదు.

30. ఒక పనిని (చట్టబద్ధమైన పనిని) చెయ్యటం ప్రారంభించిన తరువాత ఏవిధమైన ఆటంకాలు వచ్చినా వెనుకాడకుండా ముందుకు వెళ్ళితీరాలి. అప్పుడే మనిషికి విజయం లభిస్తుంది.

31. అవమానాన్ని భరించి బ్రతకటం కన్నా, చనిపోవటమే మంచిది. ఎందుకంటే చనిపోయే ముందు మాత్రమే కొంచెంసేపు బాధ ఉంటుంది. కానీ, అవమానం ప్రతిరోజూ, ప్రతి క్షణం మనిషిని చంపుతూ ఉంటుంది. కనుక, మేధావి మరియు ఆత్మగౌరవం గల మానవుడు తప్పనిసరిగా – తనకు జరిగిన అగౌరవానికి ప్రతీకారం తీర్చుకుని తీరాలి.

32. ఒక మనిషియొక్క గొప్పతనం అతడు చేసే మంచి కార్యాలను బట్టి నిర్ణయం అవుతుందేగాని, అతడి పుట్టుకను బట్టికాదు.

33. డబ్బులేని పురుషుడిని స్నేహితులు దూరం చేస్తారు. భార్య గౌరవించదు. ఇక, అతడిపై ఆధారపడినవారు, శ్రేయోభిలాషులు కూడా అతడిని హీనంగా చూస్తారు. అయితే, అతడు ఒకవేళ ధనవంతుడిగా మారినట్లయితే ఈ వర్గాలకు చెందిన వ్యక్తులందరూ అతడికి బంకలాగా అంటుకుపోతారు. కనుక, ఈ లోకంలో "మనిషికి నిజమైన మిత్రుడు ధనం మాత్రమే" అని గుర్తించాలి.

34. గుడ్లగూబ పగటిపూట చూడలేకపోవటానికి కారణం సూర్యుడుకాదు. చెకోరపక్షి నోట్లో వర్షపునీరు పడక పోవటానికి కారణం మేఘం కాదు. అదేవిధంగా ఒక వ్యక్తియొక్క నుదుటిమీద వ్రాసి ఉన్న వ్రాతను తుడిచివేసే శక్తి ఏ వ్యక్తీ ఉండదు.

35. భిక్షగాడు – రాజుకావొచ్చు, రాజు – భిక్షగాడు కావొచ్చు. ఈ విచిత్రం ఆయా వ్యక్తుల విధివ్రాతలోనే దాగి ఉంటుంది.

36. దేవుడు, కొయ్య లేదా రాతివిగ్రహంలో ఉండడు. ఆయన మనిషి విశ్వాసంలో మాత్రమే ఉంటాడు.

37. వందమంది బుద్ధిహీనులైన కొడుకుల కన్నా, బుద్ధిమంతుడైన ఒక్క కొడుకు కుటుంబానికి వన్నె తెస్తాడు. ఆకాశంలో వేలాది నక్షత్రాలు ఉన్నా, రాని వెలుతురు ఒక్క చంద్రుడు ఉంటే వస్తుంది.

38. "వ్యామోహం" అన్ని రకాల భయాలకు, బాధలకు మూలకారణం అని గ్రహించాలి. ఏ మనిషి అయితే వ్యామోహాన్ని వదులుకుంటాడో అతడు సంతోషాన్ని పొందుతాడు. (పుత్రవ్యామోహం, సౌందర్యవ్యామోహం, ధనవ్యామోహం, అధికార వ్యామోహం).

39. సర్పానికి విషం లేకపోయినా అది, తాను విషపూరితమైన దానిగా నటిస్తుంది. అదేవిధంగా ఈ సమాజంలో క్షేమంగా జీవించాలంటే మంచివాడు కూడా కొంతవరకు క్రూరంగా నటించాల్సి ఉన్నది.

40. మర్యాదగా ఎలా ప్రవర్తించాలో రాజుల దగ్గర నేర్చుకోవాలి. ఎలా మాట్లాడాలో పండితుల దగ్గర నేర్చుకోవాలి. అబద్ధాలు ఎలా ఆడాలో జూదరుల దగ్గర నేర్చుకోవాలి. ఎలా మోసగించాలో స్త్రీల దగ్గర నేర్చుకోవాలి.

41. మేధావి అయిన వ్యక్తి తన విజయానికి మూలకారణం ఏమిటో, ఇతరులకు చెప్పరాదు. ఒక వృత్తిదారుడు తన ఉత్పత్తి యొక్క రహస్యం ఏమిటో చెప్పరాదు. అలాగే ఇతరులకు తాను చేసిన దానం గురించి, తన కుటుంబంలో జరుగుతున్న గొడవల గురించి, తనకి ఇతరులు ఇచ్చి రుచిలేని ఆహారం గురించి, తనకు వినపడిన అసభ్యమైన మాటల గురించి ఏనాడూ ఇంకొకరికి చెప్పరాదు.

42. రాజు (ఈనాటి మంత్రి), యమధర్మరాజు, అగ్ని, దొంగ, వయస్సులో ఉన్న యువకుడు, ముష్టివాడు, వేశ్య, పన్ను వసూలుచేసే వ్యక్తి – ఈ ఏడు వర్గాలకు చెందిన వ్యక్తులు ఎట్టి పరిస్థితుల్లోను ఇతరుల యొక్క బాధల గురించి ఏమాత్రం పట్టించుకోరు.

43. పండితుడు (విద్యాధికుడు) గ్రంధాల ద్వారా, ప్రభువు (పరిపాలకుడు), తన గూఢచారుల ద్వారా, ఆవు తన ముక్కుద్వారా (వాసన చూడటం ద్వారా తనకు పనికివచ్చే ఆహారం ఏదో ఆవు తెలుసుకుంటుంది.), సామాన్యుడు తన కళ్ళద్వారా లోకంలో జరిగేవి తెలుసుకోవటం జరుగుతుంది.

44. మనిషి తన తండ్రిని చంపిన వ్యక్తిని అయినా క్షమించగలడేమో గాని, తన ఆస్తులను అపహరించిన వ్యక్తులను తన చివరి శ్వాసదాకా క్షమించలేడు.

45. పొరపాటున కూడా నీ బలహీనతలను రెండవ వ్యక్తికి (భార్య మినహా) చెప్పవద్దు. అలా చెప్పినట్లయితే ఆ వ్యక్తి నీ బలహీనతలను తమ స్వార్ధంకోసం ఉపయోగించుకునే అవకాశంకోసం ఎదురుచూస్తూ ఉంటాడని మర్చిపోవద్దు.

46. ఈ ప్రపంచం మొత్తాన్ని జయించాలని ఆశించే వ్యక్తి, మొదట చెయ్యాల్సిన పని తన నాలుకను అదుపులో పెట్టుకోవాలి. అనగా, ఇతరుల గురించి బహిరంగంగా చెడుగా మాట్లాడరాదు.

47. చుక్కలు చుక్కలుగా పడే నీటితో కుండ నిండుతుంది. అలాగే ధనాన్ని, జ్ఞానాన్ని కొంచెం కొంచెంగా అయినా సరే సంపాదించుకోవాలి.

48. చేసే పని చిన్నదైనా లేక పెద్దది అయినా దానిని పరిపూర్ణమైన శక్తితో మరియు ఏకాగ్రతతో చెయ్యాలి. మనిషి ఈ అంశంలో “సింహాన్ని” ఆదర్శంగా తీసుకోవాలి.

నోట్ : సింహం ఒక కుందేలుపై దాడిచేసినా లేక ఒక ఏనుగుపై దాడిచేసినా ఒకేవిధమైన క్రూరత్వంతో, తీవ్రమైన ఏకాగ్రతతో చేస్తుందని చెబుతారు.

"May my enemies live long life to see my success"

**కుటుంబం గురించి చాణుక్యుడు చెప్పిన సూక్తులు :** ఒక మనిషి సుఖంగా జీవించాలంటే సంపదలతో పాటుగా చక్కటి కుటుంబ జీవితం కూడా ఉండాలి అని చాణుక్యుడు చెప్పాడు. కుటుంబ జీవితానికి మూల స్థంభం “భార్య” అని గుర్తించాలి. అలాంటి భార్య, ఎలా ఉండాలో?, కుటుంబ సభ్యులతో మనిషి సంబంధాలు ఎలా ఉండాలో? చాణుక్యుడు చెప్పాడు. అది ఎలాగంటే...

1. ఒక స్త్రీయొక్క భౌతిక సౌందర్యం కన్నా, మానసిక సౌందర్యానికే విలువ ఇచ్చి, ఆపై అటువంటి స్త్రీని వివాహం చేసుకోవాలి.

2. మంచి చరిత్రలేని కుటుంబానికి చెందిన స్త్రీని వివాహం చేసుకోకూడదు.

3. వధువు మరియు వరుడికి మధ్య అన్ని విషయాలలోను సమతౌల్యం ఉండాలి. లేకుంటే ఆ వివాహం భవిష్యత్తులో వాళ్ళిద్దరికీ నష్టాన్ని కలిగిస్తుంది.

4. భార్య ఎల్లప్పుడూ తన భర్తను భక్తి, గౌరవాలతో సేవించాలి. అలాగే భర్త తన భార్యకు కావలసిన అవసరాలను అన్నింటినీ శ్రద్ధతో తీర్చాలి. ఆమెను ఏనాడూ అకారణంగా అగౌరపరచరాదు.

5. ఒక స్త్రీ ఎన్ని దానాలు చేసినా, వందల కొద్ది వ్రతాలు చేసినా, అనేక పవిత్ర నదులలో స్నానంచేసినా ఆమెకు పుణ్యంరాదు. ఎప్పుడైతే ఆమె తన భర్త యొక్క పాద జలాన్ని తన నెత్తిన ధరిస్తుందో అప్పుడు ఆమె మహాపుణ్యాత్మురాలు అవుతుంది.

6. ఆదర్శవంతురాలైన భార్య, ఉదయ సమయంలో తల్లిలాగా సేవలు చేస్తుంది. మధ్యాహ్న సమయంలో సోదరిలాగా ప్రేమిస్తుంది. రాత్రి సమయంలో వేశ్యలాగా రంజింపచేస్తుంది.

7. ఏ పురుషుడియొక్క ఆశయాలకు అనుగుణంగా అతడి భార్య చేసే కార్యాలు ఉంటాయో ఆ కుటుంబం భూమిమీద స్వర్గం అవుతుంది.

8. వికారంగా ఉన్నా సరే, గౌరవనీయ కుటుంబానికి చెందిన కన్యను వివాహం చేసుకోవటం పురుషుడికి మేలు చేస్తుంది.

9. ఏ వ్యక్తి అయితే తన కుటుంబ సభ్యులతో విపరీతమైన బంధాన్ని పెంచుకుంటాడో ఆ వ్యక్తికి ఏదో ఒక సమయంలో భయము, బాధ ఎదురవుతాయి. మనిషికి ఎదురయ్యే అన్ని సమస్యలకు మూల కారణం బంధాలే. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే వ్యామోహాలే అని గుర్తించాలి.

ఈనాటికీ భారతదేశంలో చాణక్యుడి యొక్క సిద్ధాంతాల ఆవశ్యకత ఎంతైనా ఉన్నదని చెప్పవచ్చు. నెరవేర్చుకోలేని అసాధారణమైన వాగ్దానాలు చేస్తూ – ప్రజల్ని ధనంతో, మద్యంతో, మతంతో, కులంతో వ్యామోహానికి గురిచేసి అధికారంలోకి వచ్చి, ఆపై ప్రభుత్వంలోని ఆదాయంవచ్చే అన్ని వ్యవస్థలను తమ స్వార్థానికి ఉపయోగించుకుంటూ, ప్రజల సంపదను పట్టపగలే నిస్సిగ్గుగా దోచుకుంటూ మరియు ఆ దోపిడీకి అడ్డంపడే మేధావుల్ని మరియు ధర్మం తెలిసివాళ్ళని తమ అధికార

బలంతో అణచివేస్తూ – “నేను శ్రీరాముడంత గొప్ప పాలకుడిని, నాది రామరాజ్యం” అని చెప్పుకునే రావణుడి లాంటి – ఇంకా చెప్పాలంటే నరకాసురుడి లాంటి పాలకులు – ఈ ప్రజాస్వామ్యంలో అధికారానికి వస్తున్నారు. ఇలాంటి సమయంలో ప్రజలకు నిజమైన నాయకుడు ఎలా ఉండాలో? తెలియాలి. అప్పుడు మాత్రమే ప్రజలు – కుల, మత, ప్రాంత పక్షపాతాలకు గురికాకుండా నిజమైన నాయకుడిని ఎన్నుకుంటారు. అలాంటి నాయకుడు ఎలా ఉండాలో? చాణక్యుడు కొన్ని వందల శతాబ్దాల క్రితమే లోకానికి చాలా స్పష్టంగా తెలియజేసాడు. అందుకే ఈనాటికీ కేవలము భారత దేశానికి మాత్రమే కాక మొత్తం ప్రపంచానికి కూడా చాణిక్యుడికి యొక్క బోధనలు తిరుగులేని అవసరాలుగా ఉన్నాయి.



# 5.ప్రాచీన భారతదేశ తాంత్రిక పూజల రహస్యాలు?

భారతదేశంలో మానవ నాగరికత మొదలైన సమయంలోనే లాటిన్ అమెరికా దేశాల్లో కూడా మంత్ర, తంత్రాలను విశ్వసించే నాగరికత ప్రచారంలో ఉన్నది. “మయన్” జాతి ప్రజలు తమ దైవాలకు శక్తి రావటంకోసం నరబలులు ఇస్తూ ఉండేవాళ్ళు. కొన్ని సమయాలలో మనిషికి బదులుగా పందులు, దున్నలు లాంటి వాటినికూడా బలి ఇవ్వటం జరిగేది. బలుల అన్నింటిలోకి “నరబలి” చాలా గొప్పదని నాటి మాయన్ ప్రజలు బలంగా విశ్వసించేవారు. సాధారణంగా, తమ చేతిలో యుద్ధంలో ఓడిపోయిన ఇతర తెగలకు చెందిన మానవుల్ని బలి ఇచ్చే సాంప్రదాయం మయన్ ప్రజల్లో ఉండేది. అది ఏమిటంటే, తామ చేతుల్లో ఓడిపోయిన వేరే తెగ రాజుని లేదా ఉన్నతస్థాయికి చెందిన అధికారుల్ని మాత్రమే తమ దేవతలకు బలి ఇచ్చేవారు. శత్రుజాతికి చెందిన తక్కువస్థాయి మనుషుల్ని తమకు సేవలు చేసే శ్రామికులుగా మార్చుకునేవాళ్ళు. మాయన్ ప్రజలు, నరబలులు ఇచ్చేవిధానం చాలా అమానుషంగా ఉండేదని ఆకాలంనాటి శిల్పాల వలన తెలుస్తున్నది. బలి ఇవ్వాలనుకున్న మనిషిని దైవ విగ్రహానికి ఎదురుగా ఉంచి, ఆపై అతడిని కొంతమంది వ్యక్తులు బాణాలతో చంపటం జరిగేది. అదేవిధంగా, బ్రతికి ఉన్న మనిషిని సజీవ సమాధి చెయ్యటం జరిగేది. మయన్ దైవాలకు మనిషి గుండె అంటే చాలా ఇష్టమని ఆ కాలంలో భావించటం జరిగింది. ఫలితంగా, తమ దైవ విగ్రహం ముందు బలి

ఇచ్చే వ్యక్తిని పడుకోపెట్టి, ఆపై పదునైన ఆయుధాలతో ఆ మనిషియొక్క గుండెను బైటకు తీసి తమ దైవానికి నైవేద్యంగా పెడుతూ ఉండేవాళ్ళు. అదేవిధంగా, నరబలి ఇవ్వబడిన వ్యక్తియొక్క శరీరం నుండి స్రవించే రక్తాన్ని పాత్రలతో సేకరించి దైవానికి నైవేద్యంగా ఇచ్చేవాళ్ళు.

మెక్సికో లోయ మరియు అజిటెక్ ప్రాంతాలలో ఉండే ప్రజలు కూడా నరబలులు చాలా అత్యధికంగా ఇవ్వటం జరిగేది. సాధారణంగా, ఈ నరబలులు మయన్ ప్రజల ఆలయాల పరిసరాలలో జరిగేవని తెలుస్తున్నది. నరబలి ఇచ్చే అవకాశం లేనప్పుడు కోళ్ళు, జింకలు, కుక్కలు లాంటి వాటిని తమ దేవతలకు బలులుగా ఇస్తూ ఉండేవాళ్ళు. మయన్ ప్రజలు విగ్రహారాధకులు మరియు ఆ విగ్రహాలకు నరబలులతో సహా అన్ని రకాల బలులు ఇచ్చే సాంప్రదాయాన్ని కలిగి ఉండేవారు. అయితే, కాలక్రమంలో అనగా –17వ శతాబ్దం చివరి భాగం వచ్చేసరికి మయన్ ప్రజలను ఆనాటి స్పానిష్ (స్పెయిన్) దేశీయులు తమ స్వాధీనంలోకి బలప్రయోగం ద్వారా తెచ్చుకున్నారు. ఈ స్పానిష్ దేశీయులు క్రైస్తవ మతాన్ని పాటిస్తారు. తాము జయించిన ప్రాంతాలలో క్రైస్తవ మత ప్రచారం చెయ్యటం "వలస ప్రభుత్వ" అధికారులకు ఒక సాంప్రదాయంగా ఉంటుంది. అందులో భాగంగానే ఆనాటి స్పెయిన్ ప్రభుత్వం తన ఆధీనంలోకి వచ్చిన అనేక మయన్ ప్రాంతాలలో క్రైస్తవ మత ప్రచారం చెయ్యటానికి అనేక 'మిషనరీలను' పంపించింది. అన్య మతాన్ని తీవ్రంగా ద్వేషించే ఆనాటి మయన్ ప్రజలు తమకు అవకాశం దొరికినప్పుడల్లా ఆ క్రైస్తవ మిషనరీలకు సంబంధించిన మత ప్రచారకుల్ని బంధించి, ఆపై వారిని తమ దైవాలకు బలి ఇస్తూ ఉండేవాళ్ళు. దాంతో ఆనాటి స్పెయిన్ దేశ క్రైస్తవ మత ప్రచారకులు మయన్ ప్రాంతాలలో క్రైస్తవ మత ప్రచారం చెయ్యటానికి హడలిపోతూ ఉండేవారని తెలుస్తున్నది.

**తాంత్రిక సాధనలలో నరబలులు :**

ప్రాచీనకాలంలో హైందవ మతానికి చెందిన తాంత్రిక పూజలలో బలులు ఇవ్వటం జరిగేది. ఈ బలులలో "నరబలి"కి అత్యధికమైన ప్రాధాన్యత ఇవ్వబడింది. ఆర్యులు, భారతదేశానికి రావటానికి పూర్వమే భారతదేశంలోని చాలా ప్రాంతాలలో తాంత్రిక శక్తులకు నరబలులు ఇచ్చే సాంప్రదాయం వాడుకలో ఉండేది. ఉదాహరణకి – భారతదేశానికి చెందిన ప్రాచీన మహా గ్రంధం అయిన ఋగ్వేద సంహితలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే "సునసేపుడు" అనే బాలుడిని బలి

ఇవ్వటానికి ప్రయత్నించినట్లుగా తెలుస్తున్నది. యజ్ఞాలలో కూడా నరబలి ఉండేది. ఈవిధానాన్ని "పురుషమేధ" అని పిలిచేవాళ్ళు.

**సునచ్ఛేపుడి వృత్తాంతము :**

ప్రాచీన హైందవ దేశానికి చెందిన 'శుక్లయజుర్వేదం'లోని 13వ అధ్యాయంలో 'పురుషమేధ' అనే ఒక ప్రక్రియ గురించి చెప్పబడి ఉన్నది. పురుషమేధ అనగా మనిషిని యజ్ఞ సమయాలలో దైవాలకు బలి ఇవ్వటం అని గుర్తించాలి. మహాభాగవత గ్రంథంలో కూడా నరబలికి సంబంధించిన సమాచారం కనిపిస్తుంది.

శ్రీరామచంద్రుడు జన్మించిన ఇక్ష్వాకు వంశీయుడైన హరిశ్చంద్రుడికి వందమంది భార్యలు ఉన్నప్పటికీ పురుష సంతానం కలుగలేదు. అలాంటి సమయంలో నారదుడు, హరిశ్చంద్రుడి వద్దకు వచ్చి అతడితో "రాజా! నీకు సంతానం కలగాలంటే నువ్వు వరుణదేవుడికి ప్రీతి కలిగించే యజ్ఞాన్ని చెయ్యి. అప్పుడు ఆయన నిన్ను అనుగ్రహించి నీకు పురుష సంతానాన్ని కలిగిస్తాడు" అన్నాడు. అప్పుడు హరిశ్చంద్రుడు, వరుణదేవుడిని ప్రార్థించాడు. వరుణదేవుడు ప్రత్యక్షం అయ్యాడు. అప్పుడు హరిశ్చంద్రుడు, వరుణదేవుడితో "ప్రభూ! నాకు పురుష సంతానంలేదు. నీవు నాకు ఒక కుమారుడిని ప్రసాదించినట్లయితే నేను ఆ కుమారుడిని నీకు బలి ఇస్తాను" అన్నాడు. వరుణదేవుడు "తథాస్తు" అన్నాడు. ఆ తరువాత కొంతకాలానికే హరిశ్చంద్రుడి పెద్ద భార్య అయిన చంద్రమతి గర్భవతి అయ్యింది. మరికొంతకాలానికి ఆమెకు ఒక కొడుకు పుట్టాడు. ఆ బిడ్డకు "రోహిత" అనే పేరు పెట్టబడింది. వెంటనే వరుణదేవుడు అక్కడకు వచ్చి "నీ కొడుకుని నాకు వెంటనే బలి ఇవ్వు" అని హరిశ్చంద్రుడిని అడిగాడు. అప్పుడు హరిశ్చంద్రుడు ప్రశాంతమైన స్వరంతో "ప్రభూ! నా బిడ్డకి 10 రోజులు నిండిన తరువాత నీకు అతడిని బలి ఇస్తాను" అన్నాడు. సరిగ్గా పది రోజుల తరువాత వరుణదేవుడు మళ్లీ హరిశ్చంద్రుడి దగ్గరకు వచ్చి ఆ బిడ్డను తనకు బలి ఇవ్వమని అడిగాడు. అప్పుడు హరిశ్చంద్రుడు "ప్రభూ! ఈ బిడ్డకు దంతాలు పెరిగినట్లయితే అతడు పవిత్రుడు అవుతాడు. అప్పుడు నీకు అతడిని బలి ఇస్తాను" అన్నాడు. అప్పటికి వరుణదేవుడు వెళ్ళిపోయాడు.

ఆ తరువాత కొంతకాలానికి వరుణదేవుడు, హరిశ్చంద్రుడి వద్దకు వచ్చి ఆ బిడ్డను తనకు బలి ఇవ్వమన్నాడు. అప్పుడు హరిశ్చంద్రుడు "దేవా! ఈ బిడ్డ పళ్ళు మొత్తం రాలిపోతే ఇతడు పవిత్రుడు అవుతాడు. అప్పుడు ఇతడిని నీకు బలి ఇస్తాను" అన్నాడు. చేసేది లేక వరుణదేవుడు వెళ్ళిపోయాడు. మళ్ళీ కొన్నేళ్ళు గడిచిన తరువాత

వరుణదేవుడు, హరిశ్చంద్రుడి వద్దకు వచ్చాడు. అతడిని చూసిన హరిశ్చంద్రుడు గంభీరమైన స్వరంతో "దేవా! నా కుమారుడు క్షత్రియ వంశంలో జన్మించాడు. అతడు, ఇంకొంతకాలం ఆగితే తనను తాను రక్షించుకోగల సమర్థుడు అవుతాడు. అప్పుడు అతడు పరిశుద్ధుడు అవుతాడు. కనుక, నీవు అప్పటిదాకా దయచేసి ఆగు" అన్నాడు. ఆవిధంగా – తన కొడుకు మీద ఉన్న ప్రేమతో హరిశ్చంద్రుడు అనేకసార్లు తన కొడుకు రోహితుడిని వరుణుడికి బలి ఇవ్వకుండా వాయిదాలువేస్తూ వచ్చాడు. రోహితుడికి 16 సంవత్సరాలు వచ్చాయి. "తనని తన తండ్రి వరుణదేవుడికి బలి ఇచ్చే ఉద్దేశంలో ఉన్నాడని" రోహితుడికి అర్థమైపోయింది. దాంతో అతడు తనను తాను రక్షించుకోవటంకోసం ధనుర్బాణాలు ధరించి, ఆపై తన నివాసాన్ని వదిలిపెట్టి అరణ్యాలలోకి వెళ్ళిపోయాడు.

అరణ్యాలలో జంతువుల్ని వేటాడుతూ కడుపు నింపుకుంటూ కాలం గడుపుతున్నాడు. రోహితుడు. ఇంతలో అతనికి ఒక బాధాకరమైన వార్త తెలిసింది. అది ఏమిటంటే, వరుణుడికి బాకీ ఉన్న నరబలిని ఇవ్వని కారణంగా హరిశ్చంద్రుడికి "జలోధరవ్యాధి" వచ్చింది. (పొట్ట విపరీతంగా పెరిగిపోయే ఒక వ్యాధిని జలోధర వ్యాధి అంటారు. ఏమీ తినకపోయినా సరే, పొట్ట అనారోగ్యకరంగా పెరిగిపోతుంది.) ఈవిధంగా తన తండ్రి తీవ్రమైన వ్యాధికి గురి అయ్యాడన్న విషయం తెలుసుకున్న రోహితుడు ఆపై అరణ్యంలో ఉండలేక వెంటనే తన రాజ్యానికి తిరిగివెళ్ళాలనుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో ఇంద్రుడు అతడి దగ్గరకువచ్చి "నాయనా! నీవు ఇప్పుడు నీ తండ్రి దగ్గరకు వెళ్ళకు. అది నీకు మంచిదికాదు" అన్నాడు. అంతేకాదు, రోహితుడికి ఇలా చెప్పాడు. "నీవు ఈ భరతవర్షంలో ఉన్న అన్ని తీర్థాలను, క్షేత్రాలను దర్శించు. అలా చెయ్యటంవల్ల నీ తండ్రికి వ్యాధి నివారణ అవుతుంది". ఇంద్రుడి సలహామీద రోహితుడు దాదాపు 5 సంవత్సరాలపాటు అనేక పుణ్య క్షేత్రాలను దర్శించి ఆయా క్షేత్రాలలో కొలువైన దైవాలను మనస్ఫూర్తిగా ప్రార్థించాడు. ఆపై తన తండ్రి దగ్గరకు వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో ఇంద్రుడు ఒక వృద్ధ బ్రాహ్మణ వేషంలో అతడి దగ్గరకు వచ్చి "నాయనా! తొందరపడకు. నువ్వు కొన్నాళ్ళు అరణ్యంలోనే ఉండు. ఆ తరువాత నీ తండ్రి దగ్గరకు వెళ్ళు" అన్నాడు.

రోహితుడు తన తండ్రిని వదిలిపెట్టి అరణ్యానికి వచ్చి అప్పటికి ఐదు సంవత్సరాలు నిండాయి ఆరవ సంవత్సరం ప్రవేశించింది. ఇక, తండ్రిని చూడకుండా ఉండటం తనకు సాధ్యంకాదని గ్రహించిన రోహితుడు తన రాజ్యానికి వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. "తాను రాజ్యానికి వెళితే తన తండ్రి తనని ఖచ్చితంగా వరుణుడికి

బలి ఇస్తాడు. అలా జరగకుండా ఉండాలంటే తనకు బదులుగా ఇంకొక అర్హుడైన యువకుడిని వరుణుడికి బలి ఇవ్వాలి". – ఇలా ఆలోచించుకున్న రోహితుడు తన రాజ్యానికి తిరిగివెళుతున్న సమయంలో అతడికి ఒక గ్రామంలో – అంగీరస మహర్షి వంశానికి చెందిన అజిగర్ధ అనే పేరుగల ఒక బ్రాహ్మణుడు కనిపించాడు. ఆ బ్రాహ్మణుడు దరిద్రంతో బాధపడటమే కాకుండా, ద్రవ్యంకోసం ఎంతకైనా తెగించే స్వభావాన్ని కలిగి ఉన్నాడు. ఆ బ్రాహ్మణుడికి ముగ్గురు కొడుకులు ఉన్నారు. ఆ విషయం తెలుసుకున్న రోహితుడు ఆ బ్రాహ్మణుడితో "అయ్యా! నీకు ముగ్గురు కుమారులు ఉన్నారు. వారిలో ఒకడిని నాకు ఇచ్చినట్లయితే అతడిని మా తండ్రి వరుణదేవుడికి బలి ఇస్తాడు. అప్పుడు నేను బ్రతికిపోతాను. నీ కొడుకుని నాకు ఇచ్చినందుకు ప్రతిఫలంగా నీకు వెయ్యి ఆవుల్ని కానుకగా ఇస్తాను" అన్నాడు. అన్ని ఆవులు వస్తాయి అని తెలిసే సరికి అజిగర్తుడికి విపరీతమైన దురాశ కలిగింది. ఆపై అతడు, రోహితుడితో "యువరాజా! నీవు చెప్పిన మాటలు నాకు చాలా సంతోషాన్ని కలిగించాయి. కానీ, నా పెద్ద కొడుకు లేకుంటే, నాకు అంత్యక్రియలు చేసేవాళ్ళు ఉండరు. పెద్ద కొడుకు నాకు పుణ్యలోకాలు కలిగిస్తాడు. అందువలన వాడిని నీకు ఇవ్వలేను. కనుక నా మిగిలిన ఇద్దరు కుమారులలో ఎవరో ఒకడిని నీకు ఇస్తాను. అతడిని నిరభ్యంతరంగా బలి ఇచ్చుకో" అన్నాడు. అప్పుడు అజిగర్తుడి భార్య కోపంతో కూడిన స్వరంతో తన భర్తతో ఇలా అన్నది. "నాకు, ఆఖరి వాడు అయిన నా మూడవ కొడుకు అంటే ప్రాణం. అందువలన ఎట్టి పరిస్థితుల్లోను వాడిని వదులుకోను". పెద్ద కొడుకుని తండ్రి వదులుకోడు. చివరి కొడుకుని తల్లి వదులుకోదు. ఇక మిగిలింది మధ్యకొడుకు. అతడిని అటు తల్లిగాని, ఇటు తండ్రిగాని పట్టించుకోలేదు. ఫలితంగా, అజిగర్తుడు తన రెండవ కుమారుడు అయిన సునచ్ఛేపుడిని రోహితుడికి ఇవ్వటానికి సంతోషంగా అంగీకరించాడు. ఏదిఏమైనా, రోహితుడు వెయ్యి ఆవులను అజిగర్తుడికి ఇచ్చి, ఆపై అతడి రెండవ కొడుకు సునసేపుడిని వెంటపెట్టుకుని నేరుగా తన తండ్రి హరిశ్చంద్రుడి దగ్గరకు వెళ్ళాడు. ఆపై, సునసేపుడిని తన తండ్రికి ఇచ్చి అతడిని వరుణదేవుడికి బలి ఇవ్వమని చెప్పాడు. హరిశ్చంద్రుడు సంతోషంగా అంగీకరించాడు. క్షత్రియ కుమారుడైన రోహితుడికి బదులుగా – బ్రాహ్మణ కుమారుడైన సునచ్ఛేపుడిని బలిగా తీసుకోవటానికి వరుణదేవుడు కూడా అంగీకరించాడు.

ఆ మర్నాడే వరుణదేవుడికి నరబలి ఇవ్వటంకోసం ఒక గొప్ప హెూమం ప్రారంభం అయ్యింది. ఆ హెూమాన్ని నిర్వహించే ప్రధాన బాధ్యతను విశ్వామిత్రుడు తీసుకున్నాడు. ఇక, మహా జ్ఞాని అయిన జమదగ్ని మహర్షి ఆ యజ్ఞ సమయంలో

యజుర్వేద మంత్రాలను పఠించటానికి సిద్ధపడ్డాడు. వశిష్టుడు ఆ యజ్ఞానికి పర్యవేక్షకుడిగా ఉన్నాడు. ఇక, అగస్త్య మహర్షి – సామవేదాన్ని ఆ యజ్ఞ సమయంలో పఠించటానికి అంగీకరించాడు. ఆ మహా యజ్ఞం పూర్తి కాబోతున్న సమయంలో సునచ్ఛేపుడిని బలి ఇవ్వటానికి యజ్ఞగుండం దగ్గరకు తీసుకువచ్చారు. సునచ్ఛేపుడిని యజ్ఞగుండానికి కొంచెం దూరంలో ఉన్న ఒక కొయ్య స్తంభానికి తాళ్ళతో కట్టివేసారు. అయితే, ఆ యజ్ఞ నిర్వహణలో పాల్గొంటున్న బ్రాహ్మణ పురోహితులు, తమ జాతికి చెందిన సునచ్ఛేపుడిని బలి ఇవ్వటానికి వెనకాడారు. దాంతో వాళ్ళు "మేము ఈ యువకుడిని నరకలేం. అది మా వల్లకాదు" అన్నారు. ఆ సమయంలో అక్కడే ఉన్న సునచ్ఛేపుడి తండ్రి అయిన అజగర్తుడు ముందుకు వచ్చి, ఆపై పెద్ద స్వరంతో ఇలా అన్నాడు. "నాకు ఇంకొక వంద ఆవులు ఇచ్చినట్లయితే నేనే స్వయంగా నా కొడుకు శిరస్సుని ఖండిస్తాను". వెంటనే అజగర్తుడికి వంద ఆవులు ఇవ్వబడ్డాయి. ఆపై అజగర్తుడు ఒక పెద్ద కత్తిని తీసుకుని సునచ్ఛేపుడి తల నరకటానికి అతనివైపుగా అడుగులు వేసారు. సాక్షాత్తు తన కన్న తండ్రే తనని అలా బలి ఇవ్వటానికి యముడి లాగా వస్తూ ఉండటంతో సునచ్ఛేపుడికి పట్టరానిబాధ మరియు అంతకు మించిన భయం కలిగాయి. ఆపై అతడు పరిపూర్ణమైన భక్తితో తన మనసులో ఋగ్వేద దేవతలను ఇలా స్మరించుకున్నాడు. "ఓ దేవతలారా! నన్ను ఈ నరబలి బారి నుండి రక్షించండి". ఆవిధంగా సునచ్ఛేపుడు ఋగ్వేద మంత్రాలతో దేవతల్ని స్మరించేసరికి ఋగ్వేద దేవతలలో అతి ముఖ్యురాలైన 'ఉష' (ఈమె ఉదయకాలానికి అధిపతిగా ఉంటుంది.) అక్కడ ప్రత్యక్షం అయి సునచ్ఛేపుడిని బంధవిముక్తుడిని చేసింది. అంతేకాకుండా, హరిశ్చంద్రుడికి వచ్చిన భయంకర వ్యాధిని కన్నుమూసి తెరిచేలోగా మాయం చేసింది. వరుణుడు కూడా శాంతించి హరిశ్చంద్రుడిని ఆశీర్వదించాడు. ఇక, తనని నిర్దాక్షిణ్యంగా అమ్ముకున్న తన తల్లిదండ్రుల దగ్గరకు వెళ్లటానికి సునచ్ఛేపుడు ఏమాత్రం ఇష్టపడలేదు. తన మంత్రబలంతో ఋగ్వేద దేవత అయిన ఉషను ప్రత్యక్షం చేసుకున్న సునచ్ఛేపుడిని చూసి విశ్వామిత్రుడు సంతోషంతో పొంగిపోయాడు. ఆపై విశ్వామిత్రుడు, సునచ్ఛేపుడిని తన పెద్ద కుమారుడిగా దత్తత తీసుకున్నాడు.

ఆ తరువాత విశ్వామిత్రుడు, సునచ్ఛేపుడికి 'దేవవ్రత' అనే ఇంకొక పేరుని పెట్టి ఆపై అతడికి తనకు తెలిసిన విద్యలన్నీ ధారపోసాడు. అయితే, అప్పటికే విశ్వామిత్రుడికి చాలామంది కుమారులు ఉన్నారు. అలాంటి పరిస్థితుల్లో ఇంకొక యువకుడిని తన తండ్రి దత్తత తీసుకోవటం మరియు అతడిని తమకు అన్నగా నిర్ణయించటం వాళ్ళకు నచ్చలేదు. దాంతో వాళ్ళు, విశ్వామిత్రుడు తీసుకున్న దత్తతను తీవ్రంగా వ్యతిరేకించారు.

అందుకు ఆగ్రహించిన విశ్వామిత్రుడు తన కుమారులను "ఆర్యావర్త" ప్రాంతాన్ని వదిలిపెట్టి వెళ్ళిపొమ్మని" శపించాడు. అలా విశ్వామిత్రుడిచేత శాపానికి గురైన అతడి 50 మంది కొడుకులు, ఉత్తర భారతదేశాన్ని వదిలిపెట్టి దక్షిణ భారతదేశానికి వచ్చారు. అలా వచ్చిన వారిలో ఒక కొడుకు వంశస్తులే ఆ తరువాతకాలంలో "ఆంధ్రులు" గా గుర్తించబడ్డారు. అనగా, నేటి ఆంధ్ర ప్రజలు 'విశ్వామిత్రుడి' వంశస్తులు అన్నమాట. ఇక, మిగిలిన విశ్వామిత్ర కుమారులు దక్షిణ భారతదేశంలోని వివిధ ప్రాంతాలకు వెళ్ళారు. ఆపై వారి వంశస్థులు వివిధ ద్రవిడ వర్గాలుగా ఏర్పడ్డారు.

హైందవ పురాణాలలో చాలాచోట్ల "చండికకు" మహారాజులు, మహామాంత్రికులు నరబలులు ఇచ్చినట్లుగా చెప్పబడి ఉన్నది. కాలక్రమంలో వైదిక ధర్మాలను పాటించే వర్గంవారు, నరబలులు నిషేధించినప్పటికీ వైదిక మతానికి సమాంతరంగా, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే పోటీగా నడిచిన మంత్రవాదంలో చండీ, భైరవుడు లాంటి ఉగ్రదేవతలకు నరబలులు ఇవ్వటం కొనసాగింది. కొన్ని సమయాలలో బలి ఇవ్వటానికి మనిషి దొరకనప్పుడు ఒక మనిషి యొక్క బొమ్మని వస్త్రంతో తయారుచేసి ఆపై ఆ బొమ్మని ఉగ్రదేవత ముందు బలి ఇవ్వటం జరిగేది.

ఇప్పటికీ మారుమూల అడవులలో ఉండే ఆటవిక తెగలవారు తమ ప్రాంతాలలో ఉండే చిన్న చిన్న కాళీ లేదా దుర్గా ఆలయాలలో అప్పుడప్పుడూ నరబలులు ఇవ్వటం జరుగుతుంది. కానీ, నిగూఢమైన ఆ ప్రాంతాలలో జరిగే ఈ బలుల గురించి సభ్య సమాజానికి తెలిసే అవకాశాలు దాదాపు ఉండవనే భావించాలి.

ప్రాచీన భారతదేశంలో ఎవరైనా రాజు తీవ్రమైన అనారోగ్యానికి గురైనప్పుడు మరియు ఏ ఔషధాలవల్ల అతడికి వ్యాధి నయంకానప్పుడు మంత్రవాదులు రంగంలోకి దిగి అనేక రకాల తాంత్రిక పూజలు చేసేవాళ్ళు. ఆ సందర్భంలో తప్పనిసరిగా "నరబలి" ఇవ్వటం జరిగేది. ప్రాచీన పంజాబ్‌లో ఉన్న ఒక ఓడరేవు నుండి ఓడ – రేవు నుండి సముద్రంలోకి కదలాలంటే తప్పనిసరిగా ఆ ఓడకి నరబలి ఇవ్వాల్సి వచ్చేది. క్రీ.శ.1861లో ఆనాటి విశాఖపట్టణానికి అవతల ఉన్న జైపూర్ (నేటి ఒరిస్సాలో ఉన్నది) పాలకుడైన ఒక రాజుగారు, దుర్గాదేవి ఆలయాన్ని నిర్మించిన సందర్భంలో అమ్మవారి విగ్రహ ప్రతిష్టాపన సమయంలో ఒక 16 సంవత్సరాల బాలికను బలి ఇవ్వటం జరిగింది. అయితే, ఆ కాలంలో పాలకులైన బ్రిటీషువారు ఈ విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు. ఆ తరువాత కొంతకాలానికి నాటి

కర్ణాటకలోని బీదర్ ప్రాంతంలో గుప్తనిధులు కనుక్కోవటంకోసం నరబలి ఇవ్వటం జరిగింది.

క్షుద్ర దేవతలకు నరబలులు ఇవ్వటం సంగతి అటుంచి, ఆ బలి ఇచ్చిన మృతదేహాన్ని ఆరగించే సాంప్రదాయం కూడా ప్రాచీన భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో వాడుకలో ఉండేవి. ఉత్తర భారతదేశంలోని అఘోరాలు, మానవ మృతదేహాలను నిరభ్యంతరంగా ఆరగిస్తూ ఉండేవాళ్ళు. ఆ సమయంలో ఒకసారి ఒక పాశ్చాత్య రచయిత ఒక అఘోరా దగ్గరకు వెళ్ళాడు. ఆ సమయంలో ఆ అఘోరా ఒక మృతదేహంలోని తొడ భాగాన్ని ఆరగిస్తున్నాడు. తన దగ్గరకు వచ్చిన ఆ పాశ్చాత్య రచయితకు ఆ అఘోరా ఆ మృతదేహంలోని ఒక చిన్న మాంసం ముక్కని ఇచ్చి "నువ్వు ఇది తింటే మహా సంపన్నుడివి అవుతావు. తీసుకో" అన్నాడు. ఆ భయంకర ఆహారాన్ని చూసి ఆ రచయిత తీవ్రమైన భయాందోళనలకు గురయ్యాడు. దాంతో ఆ అఘోరా తీవ్ర కోపానికి గురై ఆ మాంసం ముక్కని విసురుగా ఆ రచయిత మీదకి విసిరాడు. ఆ మాంసం ముక్క బలంగా ఆ రచయిత తలను తాకింది. ఫలితంగా, ఆ రచయిత తలమీద ఒక శాశ్వతమైన బొప్పె ఏర్పడింది.

**తంత్రశాస్త్రంలో మానవ రక్త ప్రాధాన్యత :**

భారతదేశంతోపాటుగా ప్రపంచంలోని చాలా దేశాలలో మానవ రక్తానికి ఎన్నో అతీత శక్తులు ఉంటాయని విశ్వసించటం జరిగింది. మానవ రక్తంతో స్నానం చేస్తే అనేక తీవ్రమైన రోగాలు తగ్గిపోతాయని ఆ కాలంలో బలంగా విశ్వసించటం జరిగింది. ప్రాచీన బెంగాల్‌లోని కెవాట్ అనే తెగకు చెందిన ఆటవికులు తమ కుటుంబాలలో వివాహం జరిగినప్పుడు, పెళ్ళి కూతురు యొక్క ఎడమచేయి చిటికెన వేలు చివర మరియు పెళ్ళి కొడుకుయొక్క కుడిచేయి చిటికెనవేలు చివర కత్తితో చిన్న గాటుపెట్టి ఆపై ఆ ఇద్దరి వేళ్ళ నుండి రక్తాన్ని సేకరించేవాళ్ళు. ఆ తరువాత దానిని అన్నంలో కలిపి ఆ అన్నాన్ని ఆ కొత్త దంపతులకు తినిపించేవాళ్ళు. ఇలా, ఆ ఇద్దరి రక్తం కలిపిన అన్నం వాళ్ళిద్దరూ తినటం వల్ల – ఒకరి రక్తంలో ఇంకొకరి రక్తం ప్రవేశించి వాళ్ళిద్దరూ జీవితాంతం అన్యోన్యంగా ఉంటారని ఆ కెవాట్ ప్రజలు విశ్వసించేవారు. ఇక, సంతాల్ జాతికి చెందిన ఆటవిక తెగలో ఒక విచిత్రమైన ఆచారం ఈనాటికీ ప్రచారంలో ఉంది అది ఏమిటంటే, కొత్త పెళ్ళికూతురి మరియు పెళ్ళి కొడుకు యొక్క చిటికెన వేలు నుండి సేకరించిన రక్తాన్ని ఆ నవ దంపతుల భుజాల పైన అటు, ఇటు బొట్టుగా పెట్టటం జరుగుతుంది.

బ్రిటీషువారు భారతదేశాన్ని పరిపాలించే సమయంలో మద్రాసు ప్రాంతంలో ఏదైనా ఒక కోటని నిర్మించటానికి ముందు, పునాది రాయి క్రింద ఒక 16 సంవత్సరాల అమ్మాయిని సజీవంగా సమాధి చెయ్యటం జరిగేది. అలా కన్యబలి ఇవ్వటంవల్ల ఆ కోటలు చెక్కుచెదరకుండా శతాబ్దాలపాటు నిలిచి ఉంటాయని బ్రిటీషువారు కూడా నమ్మటం ఒక విశేషంగా భావించాలి. చాలా దశాబ్దాల క్రితం చునార్ ప్రాంతంలోని జార్గో నదిమీద ఆ ప్రాంతాన్ని పరిపాలించే రాజు ఒక బ్రిడ్జిని నిర్మించాలని ప్రయత్నించాడు. ఒక విచిత్రం ఏమంటే, ఎన్నిసార్లు, ఎంత జాగ్రత్తగా కట్టినా ఆ బ్రిడ్జి కూలిపోతూ ఉండేది. ఏం చెయ్యాలో అర్థంకాని ఆ రాజు తన రాజ్యంలోని ఒక మంత్రగాడి దగ్గరకువెళ్ళి "బ్రిడ్జి కూలిపోకుండా ఉండాలంటే ఏం చెయ్యాలో చెప్పు" అని అడిగాడు. అప్పుడు ఆ మంత్రగాడు కాసేపు కళ్ళుమూసుకుని తన ఇష్టదేవతను స్మరించుకున్నాడు. ఆ తరువాత కళ్ళుతెరచి ఆ రాజుతో "రాజా! నువ్వు 14 సంవత్సరాల వయస్సు ఉన్న ఒక బ్రాహ్మణ కన్యను ఆ బ్రిడ్జికి బలి ఇస్తే ఆపై ఆ బ్రిడ్జి కూలకుండా శతాబ్దాలపాటు నిలబడి ఉంటుంది" అన్నాడు. ఆ తరువాత ఆ రాజు చాలా రహస్యంగా ఒక బ్రాహ్మణ బాలికను తీసుకువచ్చి ఒక పౌర్ణమి అర్ధరాత్రి సమయంలో ఆ బాలికను కొందరు మంత్రవాదుల సహాయంతో ఆ బ్రిడ్జియొక్క పునాది వద్ద బలి ఇచ్చాడు. ఆ తరువాత బ్రిడ్జిని మళ్ళీ నిర్మించాడు. అప్పటి నుండి ఆ బ్రిడ్జి మహాబలంగా నిలబడి పోయింది. ఇక, ఆ రాజుచేత బలి ఇవ్వబడిన ఆ బ్రాహ్మణ బాలిక ఒక ప్రేతాత్మగా మారి ఆ బ్రిడ్జి ప్రాంతంలో సంచరించటం మొదలుపెట్టింది. ఆ బ్రిడ్జిమీదుగా వెళ్ళే ప్రయాణీకులకు రాత్రి సమయంలో కనిపిస్తూ వాళ్ళని భయభ్రాంతులకు గురి చేస్తూ ఉండేది. ఆ విషయం ఎలాగో ఆ రాజుకి తెలిసింది. ఆపై ఆయన ఒక బ్రాహ్మణ పండితుడి సలహామీద ఆ బ్రాహ్మణ బాలిక యొక్క విగ్రహాన్ని ఆ బ్రిడ్జికి దగ్గరలో ప్రతిష్టించి దానికి పూజలు చెయ్యటం ప్రారంభించారు. కాలక్రమంలో ఆ బాలిక ప్రేతాత్మను "మారి" అనే పేరుతో పూజించటం ప్రారంభం అయ్యింది. అప్పటి నుండి ఆ బాలిక ప్రేతాత్మ ఎవరికీ కనపడలేదు. కానీ, ఆమె విగ్రహాన్ని పూజించిన వాళ్ళకి మాత్రం చాలా మంచి జరిగింది.

కలకత్తాలో హుగ్లీ బ్రిడ్జిని నిర్మించటానికి ముందు ఆ బ్రిడ్జియొక్క పునాది రాయి వద్ద ఒక అమ్మాయిని బలి ఇచ్చినట్లుగా ఈనాటికీ చెప్పుకుంటారు. పూర్వకాలంలో భారతదేశంలో ముఖ్యంగా, పశ్చిమ భారతదేశంలోని ప్రాంతాలలో బావులు త్రవ్వే సమయంలో ఎంత లోతు త్రవ్వినా నీళ్ళు పడేవికాదు. అలాంటి సమయంలో ఒక మనిషి యొక్క శిరస్సును నరికి, ఆపై ఆ రక్తాన్ని ఆ బావిలోకి వంచేవాళ్ళు. ఆ

తరువాత కొద్ది రోజులకే ఏ ప్రయత్నం లేకుండానే అనగా ఇంకా లోతు త్రవ్వకుండానే ఆ బావిలో నీళ్ళు విపరీతంగా ఊరి కొద్ది గంటల్లోనే అంచుదాకా చేరుకునేవని చెప్పుకోవటం జరిగింది. గంగమ్మ తల్లికి బలి ఇస్తేగాని, నీళ్ళు ఇవ్వదని పశ్చిమ మరియు ఉత్తర భారతదేశాల్లో అనేకమంది బలంగా నమ్మటం జరిగింది.

ప్రాచీన బొంబాయి ప్రాంతంలో "వడాలా" సరస్సు (రిజర్వాయర్) నిర్మించిన తరువాత, కొద్దిసేపట్లోనే గట్టు తెగిపోయి నీళ్ళు బైటకు వెళ్ళిపోయాయి. ఎన్నిసార్లు ప్రయత్నించినా ఆ సరస్సులో నీళ్ళు నిలబడలేదు. అలాంటి పరిస్థితుల్లో ఆ ప్రాంతానికి చెందిన ఒక గ్రామ దేవతకి ఆ ప్రాంత పెద్దయొక్క కూతుర్ని బలి ఇచ్చారు. అంతే, ఆ సరస్సులో నీళ్ళు నిలబడ్డాయి. ఈ సంగతి అలా ఉంచి పంజాబ్‌లో జరిగిన ఒక ఉదంతం గురించి చెప్పుకుందాం. షోర్‌కోట్ ప్రాంతానికి చెందిన ఒక మహారాజు తన ప్రాంతంలో ఒక కోటని నిర్మించటం ప్రారంభించాడు. ఎన్నిసార్లు నిర్మించినా ఆ కోట గోడలు పడిపోతూ ఉండేవి. అలాంటి పరిస్థితుల్లో ఒక ఫకీర్ (ఇస్లాం మతానికి చెందిన సూఫీ సన్యాసి) ఆ మహారాజుతో ఇలా అన్నాడు. "ఒక తల్లికి మొదట పుట్టిన కొడుకుని తీసుకువచ్చి ఆపై అతడిని కోట బురుజు ప్రక్కన పాతిపెట్టు. ఆపై నీ కోట పడదు. శాశ్వతంగా నిలబడుతుంది". ఆ మహారాజు ఆ ఫకీర్ చెప్పినట్లే చేసాడు. ఆపై ఆ కోట స్థిరంగా మరియు బలంగా నిలబడిపోయింది. తన కొడుకుని ఆ మహారాజు అలా కోటకి బలి ఇవ్వటంతో ఎంతో ఆగ్రహానికి గురైన ఆ బిడ్డతల్లి నేరుగా మక్కా నగరానికి వెళ్ళింది. అక్కడ ఉన్న తన సోదర మహమ్మదీయులకు, తన బిడ్డకు జరిగిన దారుణం గురించి చెప్పింది. దాంతో దాదాపు 500 మంది మహమ్మదీయులు ఆయుధాలు ధరించి షోర్‌కోట్ కోటని ముట్టడించారు. అయితే ఆ కోటని జయించటం అనగా ఆ కోటలోకి ప్రవేశించటం వాళ్ళకి ఎంత ప్రయత్నించినా సాధ్యంకాలేదు. దాంతో వాళ్ళు ఓటమితో అక్కడ నుండి తిరిగి వెళ్ళిపోయారు. వాళ్ళతో పాటు వచ్చిన ఒక ముస్లిం సన్యాసి ఎలాగైనా సరే, ఆ మహారాజుకి శిక్ష వెయ్యాలని నిర్ణయించుకున్నాడు. ఆపై ఆ సన్యాసి ఒక గుడ్లగూబ రూపం ధరించి నేరుగా ఆ రాజుగారి అంత:పురంమీద నిలబడి అర్ధరాత్రి సమయాలలో ఒక వారం రోజులపాటు భయంకరంగా కూతలు వేసాడు. గుడ్లగూబ కూతలు అలా వినపడటంతో ఆ రాజు ఆ కోటను ఖాళీచేసి వేరే చోటుకి వెళ్ళిపోవాలని నిర్ణయించు కున్నాడు. అలా వెళుతూ ఆ రాజు పెద్ద స్వరంతో ఆ కోటని ఇలా నిందించాడు. "ఓ కోటా! నీకు సిగ్గులేదు. ఇంకా నిలబడి ఉన్నావు". ఆ రాజు అలా అన్నాడో లేదో ఆ కోట కొద్ది గంటల్లోపే నేల మట్టం అయిపోయింది.

♦ చాలా దశాబ్దాల క్రితం బొంబాయి ప్రాంతానికి చెందిన కర్హాడా అనే వర్గానికి చెందిన బ్రాహ్మణులు తమ కులదేవతలకు నవరాత్రులలో చేసే పూజలలో ఒక బ్రాహ్మణ యువకుడిని తప్పనిసరిగా బలి ఇస్తూ ఉండేవాళ్ళు. "శక్తి" అనే దేవత మానవ రక్తంతో తృప్తిపడుతుందని భావించేవాళ్ళు. ఆ కారణంగానే ఆమెకు ఎర్రటి పూలతో పూజచేసేవాళ్ళు.

**ఈ నరబలి ఎలా జరిగేది?**

ఈ కర్హాడా వర్గానికి చెందిన బ్రాహ్మణ కుటుంబాలలో ఏదో ఒక కుటుంబం 12 సంవత్సరాలకు ఒకసారి విజయదశమినాడు చండీమాతకి నరబలి ఇవ్వటం జరిగేది. ఆ నరబలి ఇవ్వటంకోసం, తమకు ఏమాత్రం పరిచయంలేని ఒక బ్రాహ్మణ యువకుడిని ఎంతో ఆదరంతో తమ ఇంటికి రప్పించుకునేవాళ్ళు. ఆ తరువాత అతడికి ప్రతిరోజూ మత్తును కలిగించే పదార్థాన్ని కలిపిన ఆహార పదార్థాలను తినిపిస్తూ ఉండేవాళ్ళు. అతడు తమను బాగా నమ్మటం కోసం అతడికి తమ కుమార్తెను ఇచ్చి వివాహం చేసేవాళ్ళు. అల్లుడిగా మారిన ఆ యువకుడికి ఐదారు నెలలపాటు ఎంతో ఆదరాభిమానాలతో భోజనాలు పెడుతూ రాచమర్యాదలు చేస్తూ ఉండే వాళ్ళు. ఇంతలో విజయదశమి రోజు వచ్చేది. వాళ్ళు అన్ని నెలలుగా అతడిపై ప్రయోగించిన విషంలాంటి మత్తుమందు కారణంగా ఆ యువకుడు ఒకవిధమైన మైకానికి గురయ్యేవాడు. అలాంటి పరిస్థితుల్లో ఆ ఇంటి యజమాని (ఆ యువకుడి మామగారు లేదా పినమామగారు) ఆ యువకుడిని వెంటపెట్టుకుని చండీఆలయంలోకి తీసుకువెళ్ళేవాడు. ఆ తరువాత ఆయువకుడిని అమ్మవారి విగ్రహంచుట్టూ మూడుసార్లు ప్రదక్షిణాలు చెయ్యమని అడిగేవాడు. ఆ తరువాత ఆ యువకుడిని అమ్మవారి ముందు సాష్టాంగ నమస్కారం చెయ్యమని చెప్పేవాడు. ఆ యువకుడు ఆవిధంగా సాష్టాంగ నమస్కార భంగిమలో ఉన్నప్పుడు ఆ యజమాని ఆ యువకుడి యొక్క తలను పదునైన మరియు బరువుగా ఉన్న ఒక కత్తితో ఒకే దెబ్బకి ఖండించేవాడు. ఆ తరువాత ఆ యువకుడి మొండెం నుండి స్రవిస్తున్న రక్తాన్ని ఒక చిన్న వెండి పాత్రలోకి సేకరించేవాడు. ఆ తరువాత ఆ రక్తంలో కొంతభాగాన్ని చండీ విగ్రహంయొక్క పెదవులకు పూసేవాడు. ఆ తరువాత గుప్పెడుతో ఆ రక్తాన్ని తీసుకుని ఆ అమ్మవారి విగ్రహం పైన చిలకరించేవాడు. ఆ తరువాత చండీ విగ్రహం పాదాల దగ్గర అప్పటికే తవ్వబడి సిద్ధంగా ఉంచిన గోతిలో ఆ యువకుడి మృతదేహాన్ని ఉంచి, ఆపై దానిమీద మట్టి కప్పి ఏమాత్రం ఆధారం దొరక్కుండా నేలను బాగా చదునుచేసి

ఆపై ఆ ఆలయం నుండి నేరుగా తన ఇంటికి వచ్చేవాడు. ఇంటికి వచ్చిన కర్వాడా బ్రాహ్మణుడు ఎంతో సంతోషంతో పొంగిపోతూ తనలోతాను "నేను చండీదేవికి ఈ నరబలి ఇవ్వటం వల్ల ఆమె రక్తదాహం తీరింది. ఇంకా పన్నెండు ఏళ్ళవరకు ఆమె ప్రశాంతంగా ఉంటుంది. మా కుటుంబాలను కాపాడుతుంది". అని పదే పదే ఆ రాత్రంతా అనుకునేవాడు.

తెల్లవారిన తరువాత ఆ బ్రాహ్మణుడు, మళ్ళీ చండీ ఆలయంలోకి వచ్చి అమ్మవారి పాదాల వద్ద ఉన్న గొయ్యిని త్రవ్వి దాంట్లో ఉన్న యువకుడి మృతదేహాన్ని బైటకుతీసి అక్కడికి దూరంగా ఉన్న నిర్మానుష్య ప్రదేశంలో పారేసేవాడు. ఆ తరువాత అమ్మవారి విగ్రహాన్ని రహస్యంగా అదే ఆలయంలో ఉన్న ఒక పెద్ద పెట్టెలో భద్రపరచేవాడు. మళ్ళీ 12 ఏళ్ళ తరువాత వచ్చే దసరా 10వ రోజున ఇంకొక బ్రాహ్మణ యువకుడిని బలి ఇచ్చే వరకు ఆ చండీ విగ్రహం ఆ పెట్టెలోనే ఉండిపోయేది.

**బాలుడి దేహం నుండి రక్త ఔషధం :**

ఉత్తర భారతదేశంలో కొన్ని దశాబ్దాల క్రితం కన్నా పూర్వం – కత్తి గాయాలను, బరెసెపోట్లవల్ల ఏర్పడిన లోతైన గాయాలను, బాణాలు దిగటంవల్ల ఏర్పడిన గాయాలను క్షణాలలో తగ్గించటానికి "మొమై" అనే ఒక తైలాన్ని ఉపయోగిస్తూ ఉండేవాళ్ళు. ఆ తైలం తయారుచేసే విధానం చాలా భయానకంగా ఉంటుంది. అది ఎలాగంటే... లావుగా మరియు నల్లగా ఉండే ఒక 8 సంవత్సరాల బాలుడిని తీసుకువచ్చి, ఆపై అతడి తల మధ్యభాగంలో లోతుగా ఒక గాయంచేసి ఆ తరువాత ఆ బాలుడిని సన్నగా మండుతున్న మంటకి నాలుగు అడుగుల ఎత్తులో తల్లక్రిందులుగా వ్రేలాడదీసేవాళ్ళు. కొంతసేపు గడిచిన తరువాత ఆ బాలుడి తల నుండి చిక్కటి ద్రవం చుక్కలు చుక్కలుగా కారటం ప్రారంభం అయ్యేది. అలా ప్రారంభంకాగానే ఒక వ్యక్తి, ఒక పాత్రలో ఆ ద్రవాన్ని పట్టుకునేవాడు. ఆ ద్రవమే మహా శక్తివంతమైన ఔషధం. దానిపేరే "మొమై" అని చెబుతారు. ఈ తైలాన్ని గాయాలపై వ్రాసినప్పుడు కొద్ది క్షణాల్లోనే ఆ గాయాలు మాడిపోవటం జరిగేది. కుమాయూన్ ప్రాంతంలో ఈ ఔషధ తైలాన్ని "నారాయణతేల్" లేదా "రామ్‌తేల్" అనే పేరుతో పిలిచేవాళ్ళు. (ఈనాడు బజారులో నెప్పులకోసం లభిస్తున్న ఆయుర్వేద నారాయణతైలం మరియు ఆనాటి ఆ మొమై తైలం ఏమాత్రం ఒకటికాదని గుర్తించాలి.)

ఇంకొక విచిత్రం ఏమంటే, ఆ కాలంలో ఐరోపా నుండి ఒక గౌరవనీయమైన వ్యక్తి, భారతదేశానికి వచ్చి ఆనాటి బ్రిటీషు ప్రభుత్వంతో ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు.

అది ఏమిటంటే, "మొమై తైలం తయారుచేయటానికి అవసరమైన మగ పిల్లల్ని నిరభ్యంతరంగా తీసుకోవటానికి ఆ వ్యక్తికి చట్టపరంగా అధికారం ఇవ్వబడింది. అంతేకాదు, అతడు ఆ తైల తయారీకోసం ఎంతమంది మగ పిల్లల్ని చంపినా అది నేరంకాదు. అంతేకాక, ఈ ఐరోపా వ్యక్తికి "మొమైవాలాసాహీబ్" అనే బిరుదుకూడా ఇవ్వబడింది. ఇతడు మంత్రవిద్యలో ప్రావీణ్యాన్ని కలిగి ఉండేవాడని తెలుస్తున్నది. మొమై తైలం తయారీకి అవసరమైన మగపిల్లల్ని సేకరించటంకోసం ఈ వ్యక్తి, తరచుగా ఉత్తర భారతదేశంలోని గ్రామీణ ప్రాంతాలలో తిరుగుతూ ఉండేవాడు. ఆ సమయంలో ఎవరైనా బాలుడు తన కంట పడితే ఈ వ్యక్తి ఆ బాలుడిని తన దగ్గరకు పిలిచి ఆపై ఆ బాలుడికి తన దగ్గర ఉన్న 7 అంగుళాల మంత్రదండం లాంటి కర్రని వాసన చూపించేవాడు. ఆ వాసనకి లొంగిపోయిన ఆ బాలుడు ఆ వ్యక్తి వెంట మంత్రముగ్ధుడిలాగా వెళ్ళిపోయేవాడు. ఈవిధంగా కనీసం ఒక డజను మంది మగపిల్లల్ని తన వశం చేసుకున్న తరువాత, వాళ్ళందరినీ ఆ ప్రాంతానికి దగ్గరలో పర్వతాలపై ఉన్న ఏదో ఒక వేసవి విడిది క్షేత్రానికి ఒక పెద్ద జట్కా బండిలో తీసుకువెళ్ళేవాడు. ఆ తరువాత రోజుకి ఒక బాలుడిని ఆ తైలం తయారీకి ఉపయోగిస్తూ ఉండేవాడు. ఆనాటి బ్రిటీషు ప్రభుత్వంయొక్క అండ ఆ వ్యక్తికి ఉన్న కారణంగా ఆ వ్యక్తిని ఎవరూ ఏమీ చెయ్యలేకపోయారు. ఒక విశేషం ఏమంటే, ఈ వ్యక్తికి దొరికిపోయి, ఆపై అదృష్టవశాత్తు ఆ వ్యక్తి బారి నుండి తప్పించుకున్న ఒక బాలుడు ఆ తరువాతకాలంలో తన అనుభవాన్ని ఒక పాశ్చాత్య రచయితకి తెలియజేసాడు. ఆ బాలుడు ఆ పాశ్చాత్య రచయితకి ఇలా చెప్పాడు...

"నేను, మీరట్ పట్టణంలో జరుగుతున్న 'నవచండి' తిరునాళ్ళకి మా పెద్దవాళ్ళతో కలిసి వెళ్ళాను. నేను కొంతమంది పిల్లలతో కలిసి ఆ తిరునాళ్ళలో ఆనందంగా తిరుగుతున్న సమయంలో మొమైవాలా సాహెబ్ నా దగ్గరకు వచ్చాడు. అతడిని చూసి నేను నిలబడిపోయాను. ఆపై అతడు తన కోటు జేబులోంచి ఒక కర్రని బైటకు తీసి దానిని నా తలపై ఉంచాలని ప్రయత్నిస్తున్నాడు. సరిగ్గా అదే సమయంలో ఎవరో ఒక స్త్రీ నన్నుచూసి పెద్ద స్వరంతో "ఏయ్ బేటా! వాడు పరమ దుర్మార్గుడు. నువ్వు వెంటనే అక్కడ నుండి పారిపో అన్నది". ఆ స్త్రీ మావైపు పరుగెత్తుకుంటూ రావటం గమనించిన ఆ సాహెబ్, నన్ను వదిలిపెట్టి వేగంగా నడుస్తూ జనాల గుంపులోకి వెళ్ళిపోయాడు. ఉత్తర భారతదేశంలోని కొన్ని పర్వతాలపై అక్కడక్కడా ఒక విచిత్రమైన చెట్టు పెరుగుతుంది. ఆ చెట్టు కాండంతో లేదా కొమ్మలతో తయారుచేసే 7 అంగుళాల కర్రని "మొమై దండం" అని పిలుస్తారు. ఆ కర్ర ఒకవిధమైన మత్తు

గొలిపే సువాసనను వెదజల్లుతూ ఉంటుంది. ఎవరి నెత్తిమీద అయినా సరే, ఆ కర్రను ఉంచి ఆ తరువాత ఆ కర్రని ఆ వ్యక్తికి వాసన చూపిస్తే ఆ వ్యక్తి ఒకవిధమైన మైకానికి గురై కొన్ని గంటలపాటు, తనకు ఆ కర్రని వాసన చూపించిన వ్యక్తి వెంట వెళ్ళిపోతాడు. అయితే, ఇప్పటికీ చాలా అరుదుగా ఆ చెట్లు ఉన్నాయని, కొందరు తాంత్రిక పరిశోధకులు భావిస్తున్నారు. అయితే ఆ చెట్టుని ఎలా గుర్తుపట్టాలో తెలియజేసే సమాచారం మాత్రం చాలా కొద్దిమంది మంత్రగాళ్ళకు మాత్రమే తెలుసు అని చెప్పుకుంటారు.

తంత్రసాధనలు చేసే సాధకులు తాము పూజించే యంత్రం లేదా చిత్రపటం లేదా విగ్రహం ముందు ఆముదంతో దీపాన్ని వెలిగించినట్లయితే ఆ ప్రదేశంలో ఆ దేవతయొక్క లేదా దైవం యొక్క శక్తి వ్యాపిస్తుంది. ఆముదం దీపం నుండి వచ్చే వంగపండు రంగు (వైలెట్‌కలర్) దేవతాశక్తిని తనవైపు ఆకర్షించుకుంటుందని తంత్రశాస్త్ర పండితులు తెలియజేస్తున్నారు. ఆముదం దీపాన్ని వెలిగించటంవల్ల సాధకులలో ఏకాగ్రతా శక్తి పెరుగుతుంది.

క్షుద్ర ప్రయోగ పరిహారాలు/గ్రహ పరిహారాలు వదిలిపెట్టటానికి ఒక ప్రత్యేకమైన విధానం ప్రపంచ వ్యాప్తంగా పాటించబడుతున్నది. అందులో మొదటిది – ప్రవహించే జలంలో పరిహారాలను వదిలిపెట్టటం వల్ల "భూత సంబంధ/గ్రహ సంబంధ" పీడలు శక్తివంతంగా తొలగించబడతాయి. ఎందుకంటే, ప్రవహించే జలంలో దైవ సంబంధమైన "సకారాత్మక శక్తులు" (పాజిటివ్ ఎనర్జీ) ఉంటాయి. అందువలన తమలో నిమజ్జనం చెయ్యబడిన పరిహారాలలో ఉండే "నకారాత్మక శక్తులను (నెగటివ్ ఎనర్జీని) ఈ శక్తులు శక్తివంతంగా తొలగిస్తాయి. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, చెడుశక్తులు – ప్రవహిస్తున్న జలాన్ని దాటలేవు. అందువలన పరిహారాలకు సంబంధించిన వస్తువుల్ని ప్రవహించే జలంలో కలిపినప్పుడు ఆ పరిహారాలలో బంధించబడిన చెడుశక్తులు తమయొక్క శక్తిని కోల్పోయి నశించిపోతాయి. ప్రవహించే జలంలో ఆవిధమైన శక్తి ఉన్న కారణంగానే హైందవ మతంతో సహా అనేక మతాలలో "పవిత్ర స్నానాలు" చెయ్యటం జరుగుతుంది. పవిత్ర నదులలో మంత్రపూర్వకంగా స్నానాలు చేసినట్లయితే ఆ స్నానాలు చేసిన వ్యక్తులను ఆవహించి ఉండే చెడు శక్తులు లేదా శాపాలు లేదా ప్రయోగాలు ఆ వ్యక్తుల్ని వదిలిపెట్టి వెళ్ళిపోతాయి.



# 6. ప్రాచీన చైనా క్షుద్రవిద్య 'కు' (KU) మర్మం ఏమిటి?

ప్రాచీన చైనాలో క్షుద్ర విద్యలు ప్రబలంగా ప్రచారంలో ఉండేవి. ఈ క్షుద్ర విద్యలు కేవలం చైనాలోనే కాకుండా థాయ్‌లాండ్, లావోస్, వియత్నాం, కాంబోడియా లాంటి ఆగ్నేయ-ఆసియా దేశాలలో కూడా ఉపయోగించబడ్డాయి. ప్రాచీన దక్షిణ చైనాలో, ముఖ్యంగా నాన్‌యూ అనే రాష్ట్రంలో "కు(KU)" ప్రయోగాలు విపరీతంగా జరిగినట్లుగా తెలుస్తున్నది.

చైనాలో ఉపయోగించబడిన క్షుద్ర విద్యను "కు(KU)" అనే పేరులో పిలిచారు. ఇప్పటికీ చాలామంది పాశ్చాత్యులకు "కు(KU)" కు సంబంధించిన సమాచారం పూర్తిగా తెలియదని చెబుతారు. "కు(KU)" అంటే ఏమిటో? మొదట తెలుసుకోవలసి ఉన్నది. కొంతమంది చైనా పరిశోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే - "కు(KU)" విధానంలో అనేక విషపూరితమైన జంతువులతో తయారుచేసిన అతి భయంకరమైన విషాన్ని, తాంత్రిక మంత్రాలతో అభిమంత్రించిన ఏదో ఒక జీవి ద్వారా శత్రువులపైకి ప్రయోగించటం జరుగుతుందని, ఆ ప్రయోగానికి గురైన వ్యక్తి అతి కొద్ది రోజుల్లోనే తీవ్రమైన అనారోగ్యానికి గురై, ఆపై దారుణంగా మరణించటం జరుగుతుందని తెలుస్తున్నది.



అయితే, చైనాకి చెందిన కొందరు మంత్రవాదుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, ''కు(KU)'' అనగా క్షుద్ర మంత్రాలతో అవతరించిన ఒక ఆత్మ లేదా పిశాచి అని భావించాల్సి ఉంటుంది. ప్రతి ''కు(KU)'' ప్రయోగానికి ఆధారంగా ఒక పిశాచిని మంత్రగాడు ఉపయోగిస్తాడు. "కు(KU)" ప్రయోగానికి చెందిన పిశాచి, తాను ఎవరిపైకి ప్రయోగించబడిందో ఆ వ్యక్తిని కొంతకాలంపాటు పీడించి, ఆపై చంపివేయటం జరుగుతుందని గుర్తించాలి. దాదాపు మూడువేల సంవత్సరాల నుండి "కు(KU)"

అనే తాంత్రిక విద్య, చైనాలో ప్రచారంలో ఉన్నది. ఇప్పటికీ చైనాలోని మారుమూల ప్రాంతాలలో "కు(KU)"ని ప్రయోగించే మంత్రగాళ్ళు అధిక సంఖ్యలో ఉన్నారని తెలుస్తున్నది.

ప్రాచీన చైనాలోని ఎల్లోరివర్ లోయ ప్రాంతాలలోను, యాంగ్‌పో లోయ ప్రాంతాలలోను మరియు చైనాలోని దక్షిణ ప్రాంతాలలోను "కు(KU)" ప్రయోగాలు విపరీతంగా జరిగినట్లుగా తెలుస్తున్నది. ముఖ్యంగా, దక్షిణ చైనా ప్రాంతంలో మహా శక్తివంతులైన "కు(KU)" మంత్రగాళ్ళు వందల సంఖ్యలో ఉండేవారని ఆనాటి గ్రంథాలలో లిఖించబడి ఉన్నది.

**"కు(KU)" ప్రయోగానికి అవసరమైన విషం ఎలా తయారుచేస్తారు?**

క్రీ.శ. 6వ శతాబ్దంలో రచించబడిన ఒక గ్రంథంలో "కు(KU)" విషం ఎలా తయారుచేస్తారో? చాలా స్పష్టంగా చెప్పబడి ఉన్నది. మొదట, ఒక పెద్ద గాజు పాత్రలోకి మల్బరీ పురుగులు (తెలుపురంగులో ఉండే గొంగళిపురుగులు), కాళ్ళజెర్రులు, విషపూరితమైన త్రాచుపాములు, తేళ్ళు, విషం నిండి ఉండే కప్పలు – అనే జీవుల్ని వదిలిపెడతారు. వాటికి ఆహారం ఇవ్వరు. ఆ పాత్రలోంచి అవి బైటకు రాలేవు. అప్పుడు, ఆ పాత్రలో దారుణమైన మరణకాండ ప్రారంభం అవుతుంది. ఆకలి తట్టుకోలేక ఒక జీవి, ఇంకొక జీవిని తినివేయటం ప్రారంభిస్తుంది. కొద్ది రోజుల్లోనే ఆ పాత్రలోని జీవులు ఒకదానిని ఒకటి తినివెయ్యటం జరుగుతుంది. చివరికి – ఒక జీవి మాత్రమే బ్రతికి ఉంటుంది. విషపూరితమైన కాళ్ళజెర్రిని తిన్న కారణంగా తేలులో సహజంగా ఉండే విషం మరింత పెరిగిపోతుంది. అలా బాగా విషపూరితంగా మారిన తేలుని తిన్న కప్పలో – సహజంగా ఉండే దాని విషంతో పాటు తేలుయొక్క విషం కూడా చేరుతుంది. అలాంటి కప్ప, మల్బరి పురుగుల్ని తింటుంది. అతి భయంకరమైన విషంతో నిండిని ఆ కప్పని విషపూరితమైన త్రాచుపాము తింటుంది. చివరగా ఆ పాత్రలో త్రాచుపాము మిగులుతుంది. ఆ త్రాచుపాము అతిభయంకరమైన విషాన్ని కలిగి ఉంటుంది. ఇప్పుడు ఆ త్రాచుపాము "కు(KU)" ప్రయోగానికి సంబంధించిన ఆయుధంగా మారిపోయింది అని గుర్తించాలి. ఈవిధంగా పాత్రలో వేయబడిన జీవులలో అంతిమంగా ఏ జీవి బ్రతుకుతుందో అది "కు(KU)"కు ప్రతినిధిగా ఉండే జీవిగా మారుతుందని చెబుతారు.

ఒక ముఖ్యవిషయం ఏమంటే, ఇలా అంతిమంగా బ్రతికిన లేదా విజేతగా మిగిలిన జీవిని "కు(KU)" సంబంధించిన మంత్రాలతో పిశాచిగా మారుస్తారు. ఆపై, ఆ పిశాచిని ఏదోఒక పానీయంలో లేదా ఆహార పదార్ధంలోకి ప్రవేశపెట్టి ఆ పానీయాన్ని లేదా పదార్థాన్ని ఏదో ఒక వ్యక్తిచేత స్వీకరింపచేస్తారు. ఆపై "కు(KU)" విషం లేదా పిశాచి ఆ వ్యక్తి శరీరంలో చేరిపోయి, అతి స్వల్పకాలంలోనే ఆ వ్యక్తిని తీవ్ర అనారోగ్యానికి గురిచేసి ఆపై మరి కొద్ది కాలంలోనే చంపివేస్తుంది. కొంతమంది "కు(KU)" మంత్రగాళ్ళు – కుక్కల్ని లేదా పందుల్ని తమ తాంత్రిక మంత్రాలతో "కు(KU)" జంతువులుగా అనగా "కు(KU)" ప్రయోగ సంబంధ పిశాచాలుగా మార్చటం జరుగుతుంది. ఆ "కు(KU)" సంబంధ జంతువులు భౌతికంగా కనపడుతున్నప్పటికీ, అవి నిజమైన జీవులు కాదని గుర్తించటం సాధారణ మానవులకు దాదాపు అసాధ్యమనే చెప్పాలి.



"కు(KU)" ప్రయోగాల గురించి పరిశోధనలు చేసిన ఒక పాశ్చాత్య పరిశోధకుడి అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే "కు(KU)" లేదా "గు(GU)" ప్రయోగానికి సంబంధించిన పిశాచి (స్పిరిట్), అవసరమైనప్పుడు వివిధ రకాల జంతువుల రూపాలలోకి, సర్పాల రూపంలోకి, కప్పల రూపంలోకి లేదా పందుల రూపంలోకి మారిపోగల శక్తిని కలిగి ఉన్నట్లుగా తెలుస్తున్నది.

**'చిన్‌షాన్' క్షుద్ర ప్రయోగం :**

పాత్రలో వేయబడిన విషపు జీవులలో అన్నింటినీ తినివేసి బ్రతికిన జీవి, మల్బరీ ఆకులను తినే గొంగళిపురుగు అయినట్లయితే దానిని "బంగారు గొంగళిపురుగు" అని పిలుస్తారు.

"కు(KU)" ప్రయోగంలో ఉపయోగించే బంగారు రంగు పట్టు పురుగును (గొంగళి పురుగు) సాంప్రదాయ చైనా భాషలో "చిన్‌షాన్" అనే పేరుతో పిలిచారు. ఈ పట్టు పురుగునే చైనాలోని కొన్ని ప్రాంతాలలో "జిన్‌కాన్" అనే పేరుతో కూడా పిలవటం జరిగింది. ఇక, చైనాలోని కొన్ని ప్రాంతాలలో "కు(KU)" ప్రయోగాన్ని "గు(GU)" అని పిలవటం జరిగింది. "గు(GU)" అనగా "పిశాచ సంబంధ విషము" అని అర్థం.

ఇలాంటి బంగారు గొంగళిపురుగు రూపంలో ఉండే “కు(KU)” ప్రయోగాన్ని ‘చిన్‌షాన్’ అనే ఇంకొక పేరుతో కూడా పిలుస్తారు. ఈ చిన్‌షాన్ ప్రయోగానికి చెందిన గొంగళిపురుగు, పట్టు వస్త్రాన్ని ఆహారంగా తీసుకుంటుంది. ఇది విసర్జించే మలాన్ని ఏదైనా పానీయంలో లేదా ఆహారంలో కలిపి ఎవరికైనా ఇచ్చినప్పుడు వాళ్ళు ఆ “కు(KU)” విషం కారణంగా చనిపోవటం జరిగేది. వాళ్ళు చనిపోగానే వాళ్ళ పొట్టల్లో ఉండే బంగారు గొంగళిపురుగు బయటకు వచ్చి, ఆపై వాళ్ళ ఇళ్ళల్లో ఉండే విలువైన బంగారం, వెండి లాంటి వాటిని తన మంత్రశక్తితో లేదా మహిమతో తీసుకువచ్చి, తనను ప్రయోగించిన యజమానికి అందజేస్తూ ఉండేవి. ఈవిధమైన చిన్‌షాన్ ప్రయోగం కారణంగా బాగా సంపన్నులుగా మారిన వ్యక్తులకు ఆ తరువాతకాలంలో చిన్‌షాన్‌కి ప్రతినిధిగా ఉండే గొంగళిపురుగు పిశాచాన్ని వదిలించుకోవటం చాలా కష్టం అయిపోయేది. ఎందుకంటే, ఆ పురుగు ప్రేతాత్మల్ని అగ్నిగాని, నీరుగాని, పదునైన ఆయుధాలుగాని చంపలేకపోయేవి. వాటిని వదిలించుకోవటానికి ఉన్న ఏకైక మార్గం ఏమంటే, చాలా పెద్ద మొత్తంలో బంగారాన్ని మరియు వెండిని ఒక వెదురుబుట్టలో ఉంచి, ఆపై అన్ని రోజులుగా తమకు సంపదలను ఇస్తున్న చిన్‌షాన్ గొంగళిపురుగుని ఆ బుట్టలో ఉంచి, ఆపై ఆ బుట్టని నలుగురూ నడిచే రహదారిమీద ఏ అర్ధరాత్రి సమయంలోనో వదిలిపెట్టి వచ్చేసేవాళ్ళు. ఆ తరువాత ఆ బుట్టని ఎవరు తీసుకుంటారో అనగా ఆ బుట్టలోని వెండి, బంగారాలను ఎవరు సొంతంగా చేసుకుంటారో వాళ్ళని ఆ చిన్‌షాన్ గొంగళిపురుగు ప్రేతాత్మ ఆవహించేది. ఈ చిన్‌షాన్ గొంగళిపురుగుని ఆరాధించటం లేదా దానికి ఇష్టమైన ఆహారాన్ని శ్రద్ధగా ఇచ్చిన కారణంగా ప్రాచీన చైనాలోని చాలా ప్రాంతాలలో, చాలామంది వ్యక్తులు హఠాత్తుగా కోటీశ్వరులు అయిపోవటం జరిగింది.

**“టియావోషెంగ్” క్షుద్ర విద్య :**

“టియావోషెంగ్” అనే ఇంకొక రకమైన “కు(KU)” ప్రయోగం కూడా ప్రాచీన చైనాలో కొన్నిచోట్ల ఉపయోగించబడింది. స్పష్టంగా చెప్పాలంటే, ఈ రకమైన “కు(KU)” ఒక ప్రమాదకరమైన చేతబడి (బ్లాక్‌మాజిక్) అని గుర్తించాలి. ఈ విధానంలో – ఎవరైనా ఒక వ్యక్తి ఒక చేపను చేతబడి మంత్రాలతో అభిమంత్రించి ఆపై దానితో కూర వండి, తన ఇంటికి వచ్చిన అతిధికి ఆ కూరను తినిపించటం జరిగేది. ఆ వ్యక్తి ఆ చేప కూరను తిన్న కొద్ది గంటలకు, అతడి కడుపులోకి చేరిన చేప కూర మళ్ళీ చేపగా బ్రతికి ఆపై ఆ వ్యక్తి పొట్టను చీల్చుకుని బైటకు వచ్చేది.

ఫలితంగా, ఆ వ్యక్తి అక్కడికక్కడే చనిపోయేవాడు. ఒకవిశేషం ఏమంటే, ఇలా టియావోషెంగ్ క్షుద్ర ప్రయోగం ద్వారా అనగా మంత్రించిన చేప కూర ద్వారా చనిపోయిన వ్యక్తి, ప్రేతాత్మగా మారి ఆపై తనకు ఆ చేప కూరను తినిపించిన మంత్రగాడికి బానిసగా మారిపోవటం జరిగేది.

టియావోషెంగ్ విధానంలో కేవలము చేపలనే కాకుండా కోడి లేదా బాతు మాంసంతో కూడా ఇతరులపై ప్రయోగాలు చేస్తారు. అది ఎలాగంటే, తమ ఇంటికి వచ్చిన అతిథికి కోడి లేదా బాతుతో వండిన మాంసాన్ని వడ్డిస్తారు. మొదట మామూలు మాంసమే పెడతారు. ఆ తరువాత వడ్డించే మాంసంలో "కు(KU)" విషాన్ని ఉంచి ఆపై ఆ మాంసాన్ని అతిథికి వడ్డిస్తారు. ఆ అతిథి ఆ మాంసాన్ని తిన్న ఒక గంట లోపే, అతడి పొట్టలోకి చేరిన కోడి లేదా బాతు మాంసం సజీవమైన కోడి లేదా బాతుగా మారి ఆపై తన ముక్కుతో ఆ అతిథి పొట్టను చీల్చుకుని బైటకు వచ్చేస్తుంది. దాంతో ఆ అతిథి చనిపోతాడు. అంతేకాదు, ఆ వ్యక్తియొక్క ఆత్మ ఆ మంత్ర ప్రయోగం చేసిన మంత్రగాడికి బానిసగా మారిపోతుంది. టియావోషెంగ్ తాంత్రిక విధానం చాలా ప్రమాదకరమైనదిగా గుర్తించిన కారణంగా ఆనాటి చైనాలో ఎవడైనా టియావోషెంగ్ మంత్రగాడు దొరికితే వాడిని సజీవంగా దహనం చెయ్యటమో లేదా సమాధి చెయ్యటమో జరిగేది.

టియావోషెంగ్ మంత్రశక్తి ఎంత గొప్పదో లేదా శక్తివంతమైనదో తెలియజేసే ఒక యదార్ధ సంఘటన గురించి ఇక్కడ తెలుసుకుందాం....చైనాలోని హైనాన్ దీవిలో ఉన్న ఒక పట్టణంలో చుంగ్‌హా అనే ఒక గొప్ప పండితుడు ఉండేవాడు. అంతేకాకుండా, అతడు ఆ ద్వీపంలో న్యాయాధిపతి(మాజిస్ట్రేట్)గా పనిచేస్తూ ఉండేవాడు. ఆ ప్రాంతంలో ఉన్న ఒక మంత్రగాడు, టియావోషెంగ్ ప్రయోగంలో చాలా సమర్ధుడని కొంతమంది ద్వారా చుంగ్‌హాకి తెలిసింది. అది నిజమో కాదో తేల్చుకోవాలని నిర్ణయించుకున్న చుంగ్‌హా, ఒకరోజు మధ్యాహ్న సమయంలో ఆ మంత్రగాడి ఇంటికి వెళ్ళాడు. ఆపై తనతో తెచ్చిన పంది మాంసాన్ని ఒక ప్లేటులో పెట్టి, ఆపై ఆ ప్లేటుని ఆ మంత్రగాడి ముందు ఉంచి "నీకు నిజంగా మంత్రశక్తి ఉంటే ఈ మాంసాన్ని సజీవంగా మార్చు చూద్దాం" అన్నాడు. అప్పుడు ఆ మంత్రగాడు ఏమాత్రం శబ్దం రాకుండా పెదవులు కదుపుతూ రెండు నిమిషాలపాటు ఏదో మంత్రం చదివాడు. ఆశ్చర్యం! చుంగ్‌షా చేతిలోని ప్లేటులో ఉన్న మాంసం మీద చాలా విచిత్రంగా చర్మం ఏర్పడింది. ఆపై దానిమీద బొచ్చు మొలిచింది. అదిచూసి ఆ న్యాయాధిపతి ఆశ్చర్యంతో నోరు వెళ్ళబెట్టాడు.

దక్షిణ చైనాలో "కు(KU)" విషాన్ని తయారుచేసే మంత్రగాళ్ళ అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, ప్రతి సంవత్సరం మే నెల 5వ తేదీన విషజీవులలో విషం విపరీతమైన స్థాయిలో ఉంటుంది. కనుక, ఆ రోజు ఉదయం నుండి సాయంత్రం లోగా "కు(KU)" విషం తయారుచేయుటానికి అవసరమైన కాళ్ళజెర్రులు, విషపు కప్పలు, త్రాచుపాములు, తేళ్ళు, మండ్రగబ్బలు లాంటి వాటిని సేకరించి ఆపై వాటిని "కు(KU)" తయారీకి ఉపయోగించటం జరిగేది.



క్రీ.శ.4వ శతాబ్దంలో చైనాలోని యుంగ్-యాంగ్ అనే రాష్ట్రంలో లియావ్ అనే కుటుంబం నివసిస్తూ ఉండేది. "కు(KU)" ప్రయోగానికి సంబంధించిన విషాలను తయారుచెయ్యటంలో ఈ కుటుంబానికి మొత్తం చైనాలో గొప్ప పేరు ఉండేది. ఈ విషాన్ని అమ్మటం వల్ల ఆ కుటుంబం కోట్లకు పడగలు ఎత్తింది. అయితే, ఆ విషాన్ని ఎలా తయారు చెయ్యాలి? అన్న విషయం ఆ కుటుంబంలో ప్రతి తరంలోనూ ఒక వ్యక్తికి మాత్రమే తెలిసేది. అంటే, ఆ విషాన్ని తయారుచేసే విధానం చాలా రహస్యంగా ఉంచేవారు అన్నమాట. ఏదిఏమైనా, "కు(KU)" తయారీ కారణంగా లియావ్ కుటుంబం సభ్యులు గొప్ప సంపన్నులుగా మారిపోయారు. కొన్ని దశాబ్దాలు గడిచిపోయిన తరువాత ఆ కుటుంబంలోని ఒక అబ్బాయికి పెళ్లి జరిగింది. ఒక విశేషం ఏమంటే, ఆ కుటుంబంలో ఆ తరంలో ఆ అబ్బాయికి మాత్రమే "కు(KU)" విషం ఎలా తయారుచెయ్యాలో తెలుసు. అయితే, అతడు ఏనాడూ తన భార్యకి ఆ రహస్యాన్ని చెప్పలేదు. "కు(KU)"కు సంబంధించిన తయారీ రహస్యాన్ని తెలుసు కోవాలని ఆ భార్యకి విపరీతమైన ఆసక్తిగా ఉండేది. ఇలా కాలం గడుస్తున్నది.

ఒకరోజు ఉదయం ఆ కుటుంబం మొత్తం, ప్రక్క పట్టణంలో జరిగే ఒక పెళ్ళికి వెళుతూ కోడల్ని ఇంట్లో ఆ ఇంటికి కాపలాగా ఉంచి వెళ్ళిపోయారు. ఆ అవకాశం కోసం ఎంతకాలంగానో ఎదురుచూస్తున్న ఆమె, ఇంట్లో అందరూ వెళ్ళి పోయిన తరువాత ఇల్లంతా వెతకటం ప్రారంభించింది. అలా వెతగ్గా వెతగ్గా, తాళం వేసిన ఒక గది కనపడింది. ఆమె ఒక రాయితో ఆ తాళం పగలకొట్టి గదిలోకి వెళ్ళి చూసింది. ఆ గదిలో దాదాపు 5 అడుగుల ఎత్తు, 3 అడుగుల చుట్టుకొలత ఉన్న

ఒక పెద్ద ఇత్తడి పాత్ర కనపడింది. దానిమీద ఒక మూత కూడా ఉన్నది. ఆమె ఆత్రంగా ఆ పాత్ర దగ్గరకువెళ్ళి ఆపై తన రెండు చేతులతో ఆ మూతను లాగి ప్రక్కన పడేసి ఆపై లోపలికి తొంగి చూసింది. లోపల చుట్టలు చుట్టుకుని పడుకుని ఉన్న లావాటి ఒక నల్ల త్రాచుపాము కనపడింది. దాన్ని చూసి భయపడిన ఆమె, వెంటనే వంటగదిలోకివెళ్ళి ఆపై ఒక పెద్ద గిన్నె నిండా నీళ్ళని మరిగేదాకా కాచి ఆపై ఆ నీళ్ళను తెచ్చి గిన్నెలో ఉన్న సర్పంమీద వంచింది. ఆ వేడినీళ్ళ ధాటికి ఆ సర్పం క్షణాల్లో చనిపోయింది. మర్నాడు సాయంకాలానికి ఇంట్లోవాళ్ళు తిరిగి వచ్చారు. ఆమె, వాళ్ళకి తాను ఏం చేసిందో వివరంగా చెప్పింది. ఆమె చెప్పిన మాటలు వినగానే ఆమె భర్తతో సహా ఆ ఇంట్లోని పురుషులందరూ భయంతో వణికిపోయారు. ఏదో ప్రమాదం తమ కుటుంబాన్ని చుట్టుముట్టబోతున్నదని వాళ్ళకు అర్థమయ్యింది. ఆ తరువాత వాళ్ళు ఆ గదికి మళ్ళీ తాళంవేసి ఇవతలికివచ్చేసారు. ఈ సంఘటన జరిగిన ఏడవ రోజున ఆ ఇంట్లో ప్లేగు వ్యాధి ఆవిర్భవించింది. ఫలితంగా, కొద్ది గంటల్లోనే ఆ ఇంట్లోని వారందరూ చనిపోయారు.

"కు(KU)" అనే ప్రయోగం ఒక మనిషిమీద ప్రయోగించినప్పుడు, ఆ మనిషికి "కు(KU)" ప్రయోగం – కుక్కల రూపంలోను, పందుల రూపంలోను, పట్టు పురుగుల రూపంలోను, సర్పాల రూపంలోను కనపడటం జరుగుతుంది. అవి నిజమైన జీవులు కావని, తనపై "కు(KU)" ప్రయోగం జరగటంవల్ల అవి తనకు కనిపిస్తున్నాయని ఆ మనిషికి అర్థంకాదు. ఫలితంగా, కొద్ది రోజుల్లోనే ఆ మనిషి "కు(KU)" ప్రయోగ ప్రభావం వల్ల చనిపోవటం జరుగుతుంది. ఒక మనిషి మీద "కు(KU)" ప్రయోగం జరిగింది అన్న విషయం తొందరగా తెలిసినట్లయితే, ఆ ప్రయోగాన్ని ఏదో ఒక విధానంలో తిప్పికొట్టే అవకాశం ఉంటుంది. ఫలితంగా, ఆ మనిషి "కు(KU)" బారి నుండి రక్షించబడతాడు.

**"కు(KU)" తాంత్రిక ప్రయోగాలకు సంబంధించిన కొన్ని యదార్థ సంఘటనలు :**

♦ ప్రాచీన చైనాలోని ఒక రాష్ట్రంలో ఉన్న పోయాంగ్ జిల్లాలో చావోషా అనే ఒక మంత్రగాడు ఉండేవాడు. అతడి దగ్గర "కు(KU)" పిశాచిచేత ఆవహించబడిన ఒక పెంపుడు కుక్క ఉండేది. ఈ చావోషా తన పెంపుడు కుక్క ద్వారా ఇతరులపై "కు(KU)" ప్రయోగాలు చేస్తూ ఉండేవాడు. ఒక సమయంలో చన్ అనే ఒక వ్యక్తి చావోషా ఇంటికి వచ్చాడు. ఆ సమయంలో పసుపు రంగులో ఉన్న ఆరు కుక్కలు ఆ వ్యక్తిమీదకి పెద్దగా అరుస్తూ దాడి చేసాయి. ఆ కుక్కలన్నీ "కు(KU)"కు సంబంధించిన

పిశాచాలని చెప్పుకుంటారు. ఒకసారి, యూసియాంగ్ అనే వ్యక్తి, చావోషొ ఇంటికి వచ్చాడు. ఆ సమయంలో చావోషొ ఇంటివద్ద లేడు. ఏదిఏమైనా, ఆ కొత్తవ్యక్తి, చావోషొ భార్య ఆహ్వానంమీద ఆమెతో కలిసి ఆ ఇంట్లో చక్కటి భోజనం ఆరగించాడు. ఆ తరువాత తన ఇంటికి తిరిగివెళ్ళాడు. అలా వెళ్ళిన యూసియాంగ్‌కి ఆ మర్నాటి సాయంత్రం నుండే ముక్కు నుండి విపరీతంగా రక్తం కారటం మొదలయ్యింది. ఆ రక్త స్రావంవల్ల అతడు చనిపోయే స్థితికి దగ్గర అయ్యాడు. అదృష్టవశాత్తూ ఆ సమయంలో అతడికి దగ్గరలో ఉన్న ఒక వృద్ధుడికి యూసియాంగ్‌కి ఎందుకు అలా ప్రమాదకరంగా రక్తస్రావం అవుతుందో అర్థమైపోయింది. చావోషొ ఇంట్లో భోజనంచేసిన యూసియాంగ్‌కి ఆ భోజనం ద్వారా "కు(KU)" ప్రయోగం సంక్రమించిందని అర్థం చేసుకున్న ఆ వృద్ధుడు, ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా అక్కడకు దగ్గరలో ఉన్న ఒక నారింజ చెట్టుయొక్క వేళ్ళను తీసుకువచ్చి, ఆపై ఆ వేళ్ళతో తయారుచేసిన ద్రవాన్ని "కు(KU)" ప్రయోగాన్ని తిప్పికొట్టే మంత్రంతో అభిమంత్రించి యూసియాంగ్‌కి త్రాగించాడు. ఫలితంగా, యూసియాంగ్ చావు నుండి బైట పడ్డాడు.

◆ క్రీ.శ. 4వ శతాబ్దంలో ప్రాచీన చైనాలోని యునాన్ రాష్ట్రంలో ఉన్న కైహువా పట్టణ మెజిస్ట్రేట్ (జడ్జి) ఒక రాత్రి సమయంలో తన పనివాళ్ళతో కలిసి తన మేడమీద నిలబడి ఆకాశంలోకి చూస్తున్నాడు. అవి అమావాస్య రాత్రులు కావటంవల్ల ఆకాశం అంతటా నక్షత్రాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ సమయంలో ఆ మెజిస్ట్రేట్, నిలబడి ఉన్న భవనం పైన, ఆకాశంలో పొడవుగా మరియు ఎంతో ప్రకాశంతో మెరిసిపోతున్న ఒక ఉల్క లాంటి ఆకారం ఎగురుతూ కనపడింది. దానిని చూసిన ఆ మెజిస్ట్రేట్ ఆ వెలుగు ఏమిటి? అని తన పనివాళ్ళను ఆసక్తిగా అడిగాడు. అప్పుడు వారిలో ఒకడు విచిత్రమైన స్వరంతో, "ఆ వెలుగు ఏ ఉల్కా కాదు. అది ఎగిరే "కు(KU)" లేదా సర్ప"కు(KU)" అన్నాడు.

ఏదిఏమైనా, "కు(KU)" ద్వారా సంపన్నులైన వ్యక్తులకు విపరీతమైన వెండి-బంగారాలు, "కు(KU)" ప్రేతాత్మ ద్వారా లభించినప్పటికీ వాళ్ళ ఇళ్ళలోని స్త్రీలకు మాత్రం ఆ "కు(KU)" ప్రేతాత్మలు పెద్ద పీడలాగా మారిపోయేవి. ఎందుకంటే, ఆ "కు(KU)" ప్రేతాత్మలు ఆ ఇళ్ళలోని స్త్రీలను తమ ఇష్టం వచ్చినప్పుడు అతి క్రూరంగా అనుభవిస్తూ ఉండేవి. ముఖ్యంగా, సర్ప"కు(KU)" ఇలా తనను ఉపయోగించుకునే మంత్రవాది యొక్క కుటుంబంలోని స్త్రీలను తరచుగా అనుభవించటం జరిగేదని చెబుతారు. ఇంకొక విశేషం ఏమంటే, ప్రతిరోజూ రాత్రి

ఈ సర్ప"కు(KU)"లు తమను ఉపయోగించుకుంటున్న మంత్రవాది గృహంలోంచి ఒక వెలుగు రూపంలో ఆకాశంలోకి వెళ్ళి, ఆపై భూమిమీద చాలా తక్కువగా జనసంచారం ఉన్నచోట ఒక ఉల్కలాగా భూమిమీదకి వాలేవి. ఆ తరువాత తమకు దొరికిన మనిషియొక్క మెదడును ఆహారంగా తీసుకునేవి. ఆ కారణంగానే ఆనాటి యునాన్ రాష్ట్రంలోని క్రైహువా పట్టణంలోని ప్రజలు, సూర్యాస్తమయం అయిన తరువాత ఒంటరిగా బైటకు వెళ్ళటానికి భయపడుతూ ఉండేవారు. కారణం, రాత్రి సమయంలో బైటకు వెళితే, ఏ క్షణంలో అయినా సర్ప"కు(KU)" తమపై దాడిచేసి తమని చంపివేస్తుందని వాళ్ళకి తెలుసు.

◆ 5వ శతాబ్దంలో చైనాలోని యుచి పట్టణానికి అధిపతి అయిన ఒక మాజిస్ట్రేట్ ఒకరోజు మధ్యాహ్నం ఆ పట్టణ వీధుల గుండా నడిచి వెళుతున్నాడు. ఒకచోట ఆయనకు కుప్పలుగా పోసి అమ్మబడుతున్న పుచ్చకాయలు కనిపించాయి. ఆయనకు ఆ పుచ్చకాయలను చూసి నోరు ఊరింది. ఆపై ఆయన ఒక బస్తాడు పుచ్చకాయలను కొని ఒక పనివాడిచేత వాటిని తన ఇంటికి చేర్పించాడు. మర్నాడు మధ్యాహ్నం పుచ్చకాయ తిందామని ఒక పుచ్చకాయను కోసాడు. దాంట్లో "కు(KU)" ప్రయోగానికి చెందిన ఒక గొంగళిపురుగు (పట్టు పురుగు) కనపడింది. దాంతో ఆయన ఉలిక్కిపడి ఆ కాయను ప్రక్కన పారేసాడు. ఆ తరువాత ఇంకొక కాయను కోసి చూడగా దాంట్లో కూడా "కు(KU)" పురుగు కనపడింది. దాన్నీ పారేసాడు. ఆవిధంగా ఆ బస్తాలో ఉన్న కాయలన్నింటిలోనూ "కు(KU)" పురుగులు కనపడ్డాయి. అందుకు ఎంతో ఆగ్రహించిన ఆ మాజిస్ట్రేట్ అప్పటికప్పుడే తన ఇంటి నుండి బయలుదేరి, నేరుగా ఆ పుచ్చకాయలు అమ్మిన చిన్న వ్యాపారి దగ్గరకువెళ్ళి అతడికి విషయం చెప్పి, "కు(KU)" పురుగులు ఉన్న పుచ్చకాయలు నాకు ఎందుకు అమ్మావో మర్యాదగా చెప్పు?" అన్నాడు. అప్పుడు ఆ చిన్నవ్యాపారి భయంతో వణకిపోతూ ఆపై ఆ మాజిస్ట్రేట్‌కి దణ్ణంపెట్టి "అయ్యా! ఈ పుచ్చకాయల్లో "కు(KU)" పురుగులు ఉన్నాయన్న విషయం నాకు ఏమాత్రం తెలియదు. నేను, ఈ పట్టణం చివర ఉన్న ఒక టోకు (హోల్‌సేల్) పుచ్చకాయల వ్యాపారి దగ్గర ఈ కాయలను తీసుకువచ్చాను. నన్ను నమ్మండి" అన్నాడు. అప్పుడు ఆ మాజిస్ట్రేట్, కొంతమంది భటుల్ని వెంటపెట్టుకుని నేరుగా పుచ్చకాయల టోకు వ్యాపారి ఇంటికివెళ్ళి ఆపై ఆ వ్యాపారిని ఒక స్తంభానికి కట్టేసి కొరడాతో నాలుగు దెబ్బలు కొట్టి, ఆపై క్రోధం నిండిన

స్వరంతో "ఏయ్! నీకు ఎంత ధైర్యం. "కు(KU)" పురుగుల్ని పుచ్చకాయల్లోకి ప్రవేశపెట్టి వాటిని ప్రజలకు అమ్ముతున్నావా? నువ్వు ఎంత పెద్ద నేరం చేస్తున్నావో నీకు తెలుసా?" అన్నాడు. అప్పుడు ఆ వ్యాపారి తీవ్రమైన భయంతో ఏడుస్తూ ఆ మాజిస్ట్రేట్‌తో ఇలా అన్నాడు. "అయ్యా! నేను గాని, మా కుటుంబ సభ్యులుగాని, చివరికి మా తాతలుగాని ఏనాడూ ఎవరిమీదా "కు(KU)" ప్రయోగాలు చెయ్యలేదు. ఈ ఊరి చివర ఉన్న ఒక పాడుపడ్డ భవనంలో ఒక "కు(KU)" మంత్రగాడు తన కుటుంబంతో ఉంటున్నాడు. ఒక సందర్భంలో వాడికి, నాకు పెద్ద తగాదా అయ్యింది. అప్పటి నుండి వాడు నా మీద పగ పట్టాడు. బహుశా వాడు, నాకు నష్టం కలిగించాలన్న ఉద్దేశంతో, నేను అమ్మే పుచ్చకాయల్లోకి "కు(KU)" పురుగుల్ని ప్రవేశపెడుతున్నాడేమో అన్న అనుమానం నాకు కలుగుతున్నది. నేనుమాత్రం నిర్దోషిని".

ఆ టోకు వ్యాపారి చెప్పిన మాటలు శ్రద్ధగా విన్న ఆ మాజిస్ట్రేట్ వెంటనే కొంతమంది భటుల్ని ఆ మంత్రగాడి దగ్గరకు పంపించాడు. వాళ్ళు ఆ మంత్రగాడిని బంధించి తీసుకువచ్చి మాజిస్ట్రేట్ ముందు నిలబెట్టారు. తన ముందు నిలబడిన ఆ మంత్రగాడికేసి తీవ్రంగా చూసిన ఆ మాజిస్ట్రేట్, ఆపై కఠినమైన స్వరంతో ఆ మంత్రగాడితో "నీవు "కు(KU)" మంత్ర ప్రయోగాలు చేసే మంత్రగాడివి అని ఈ వ్యాపారి నీమీద అభియోగం మోపాడు. అది నిజమా? కాదా? చెప్పు" అన్నాడు. "తాను మంత్రగాడిని కాదని" ఆ మంత్రగాడు అనలేదు. మౌనంగా ఉండిపోయాడు. దాంతో అతడు క్షుద్ర మంత్రగాడని అర్థంచేసుకున్న ఆ మాజిస్ట్రేట్, అతడిని కొరడాలతో తీవ్రంగా చావ కొట్టించాడు. కాలిన ఇనుప కడ్డీలతో వాడి వంటిమీద వాతలు పెట్టించాడు. ఈ రకంగా చిత్రహింసలు అనుభవించినప్పటికీ ఆ "కు(KU)" మంత్రగాడు చాలా ప్రశాంతంగా, మౌనంగా ఉండిపోయాడు. ఈ మంత్రగాడు చాలా ప్రమాదకరమైన మంత్రశక్తులు కలవాడని, అందుకే వాడికి తాను పెట్టించిన హింసలు ఏమాత్రం బాధపెట్టలేకపోయాయని ఆ మాజిస్ట్రేట్‌కి అర్థం అయిపోయింది. దాంతో ఆ మంత్రగాడిని కారాగారంలో పెట్టమని తన భటులకు ఆజ్ఞ ఇచ్చాడు. ఆపై ఆ భటులు, గట్టి కాపలా ఉన్న ఒక కారాగారంలో ఆ మంత్రగాడిని బంధించారు. విచిత్రంగా, ఆ మంత్రగాడు ఆ కారాగారం నుండి ఆ రోజు అర్ధరాత్రి సమయంలో అదృశ్యం అయిపోయాడు. ఆ విషయం కొద్ది నిమిషాలలోనే మాజిస్ట్రేట్‌కి తెలిసింది. ఆపై ఆయన ఆ అర్ధరాత్రి సమయంలో కొంతమంది భటులను వెంటపెట్టుకుని

ఊరు చివర ఉన్న మంత్రగాడి భవనంలోకి వెళ్ళాడు. ఆశ్చర్యం! అక్కడ మనిషి అనేవాడు కనపడలేదు.

◆ క్రీ.శ. 1175, జూన్ నెలలో హాంగ్‌కాంగ్ ప్రాంతంలో నివసించే షావోషన్ అనే ధనికుడియొక్క తల్లి, ఒకరోజు రాత్రి – విషప్రయోగం కారణంగా చనిపోయింది. ఆమె, "కు(KU)" విషప్రయోగం కారణంగా చనిపోయిందేమో? అన్న అనుమానం ఆ కుటుంబ సభ్యులకు వచ్చింది. అప్పుడు ఆ కుటుంబ యజమాని అయిన షావోషన్ ఒక టావోయిస్ట్ మంత్రగాడిని తన ఇంటికి పిలిపించి, ఆపై అతడితో ఇలా చెప్పాడు. "నా తల్లి "కు(KU)" ప్రయోగం వల్ల చనిపోయిందా? లేక సాధారణ విషప్రయోగం వల్ల చనిపోయిందా? తెలుసుకోవాలని భావిస్తున్నాను. ఈ విషయంలో నీవు ఏం చెబుతావు?". అప్పుడు ఆ టావోయిస్ట్ మంత్రగాడు చిన్న స్వరంతో షావోషన్‌తో ఇలా అన్నాడు. "నీ తల్లి మృతదేహం యొక్క పొట్టను చీల్చి, అందులో నుండి గర్భసంచిని బైటకు తీసి దానిని ఆమె శరీరానికి మూడు అడుగుల దూరంలో తగలపెట్టండి. ఆ గర్భసంచి తగలబడుతున్న సమయంలో వచ్చే వెలుగు నీ తల్లి మృతదేహంమీద పడుతుంది. అప్పుడు ఆమె ప్రేతాత్మ, తనపై "కు(KU)" ప్రయోగం జరిగిందా? లేదా? అన్న విషయాన్ని మీకు చెబుతుంది".

షావోషన్ పనివాళ్ళు, ఆ టావోయిస్ట్ మంత్రగాడు చెప్పినట్లుగానే చేసారు. ఫలితంగా, షావోషన్ తల్లియొక్క ప్రేతాత్మ వాళ్ళకి కనపడి ఆపై వాళ్ళతో ఇలా చెప్పింది. "నాకు 90 రోజుల క్రితం నా చిన్న కోడలు లైషి, "కు(KU)" విషం కలిపిన బాతు మాంసాన్ని తినిపించింది. నా చావుకి కారణం అయిన "కు(KU)" ప్రేతాత్మ ఇప్పటికి కూడా లైషి ఇంట్లోని వంట గదిలో నైరుతి మూలలో నిలబడి ఉన్నది".



"షావోషన్ తల్లి "కు(KU)" ప్రయోగం కారణంగా చనిపోయింది" అన్న విషయం ఆ ప్రాంత మాజిస్ట్రేట్‌కి తెలిసింది. దాంతో ఆయన, కొంతమంది భటుల్ని వెంటపెట్టుకుని నేరుగా లైషి ఇంటికి వెళ్ళాడు. వాళ్ళని చూడగానే లైషి భయంతో వణికిపోయింది. "తాను తన అత్తగారిని "కు(KU)" ప్రయోగంతో చంపిన విషయం మాజిస్ట్రేట్ దాకా వెళ్ళిందని ఆమెకు

అర్ధమైపోయింది. ఆపై ఆమె ఏమి చెయ్యాలో అర్ధంకాక భయంతో బిగుసుకుపోయి నిలబడిపోయింది. మాజిస్ట్రేట్ నేరుగా ఆమె వంట గదిలోకి వెళ్ళిచూసాడు. ఆ గదిలో నైరుతి మూలను పరిశీలనగా చూడగా, అక్కడ ఏడు రంధ్రాలు ఉన్న ఒక చెక్కపెట్టె కనిపించింది. ఆ మాజిస్ట్రేట్ స్వయంగా ఆ పెట్టెను తెరచి చూడగా అందులో కొన్ని వెండి కడ్డీ ముక్కలు, ఐదు రంగులు ఉన్న ఒక దారం, కొన్ని బంగారు నగలు, ఆరు అంగుళాల పొడవు ఉన్న నాలుగు కొయ్య బొమ్మలు, రెండు కట్టల సూదులు కనిపించాయి. ఒక్కొక్క కట్టలో సరిగ్గా 51 సూదులు ఉన్నాయి. విశేషం ఏమంటే, ఆ సూదులకు కళ్ళు లేవు. (సూదిలో దారం గుచ్చే రంధ్రాన్ని 'కన్ను' అని పిలుస్తారు.) ఆ పెట్టెలో ఉన్న వస్తువులన్నీ సాధారణ మానవుల దగ్గర ఉండవని, కేవలము ఇతరులకు హాని చెయ్యటానికి క్షుద్ర ప్రయోగాలు చేసే "కు(KU)" మంత్రగాళ్ళ దగ్గర మాత్రమే ఉంటాయని ఆ మాజిస్ట్రేట్‌కి అప్పటికే తెలిసి ఉన్న కారణంగా ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా ఆమెను బంధించి తన న్యాయస్థానానికి తీసుకు రమ్మని తన భటుల్ని ఆజ్ఞాపించాడు. తన ముందు విచారణకోసం నిలబడిన ఆమెను వెంటనే ఉరితీసి చంపమని తన భటుల్ని ఆజ్ఞాపించాడు. ఆ భటులు, మాజిస్ట్రేట్ ఆజ్ఞను అమలు పరచారు. ఆ తరువాత ఆమె మృతదేహాన్ని, ఆమె భర్తకి అందజేసారు. ఆ భర్త ఆ మృతదేహాన్ని నేరుగా తన ఇంటికి తీసుకువెళ్ళి, ఆపై ఆమె మృతదేహాన్ని తన ఇంటి మధ్యభాగంలో ఉన్న ఒక మంచంమీద పడుకోపెట్టాడు. అలా పడుకోపెట్టిన ఐదు నిమిషాల తరువాత ఆమె, నిద్ర నుండి లేచినట్లుగా లేచి కూర్చున్నది. ఆమె – స్వయంగా "కు(KU)" మంత్రగత్తె అయిన కారణంగా ఉరిశిక్ష ఆమె ప్రాణాన్ని తాత్కాలికంగా మాత్రమే తీసిందని, ఆమెకు తోడుగా ఉండే క్షుద్రశక్తులు ఆమెను మళ్ళీ బ్రతికేలా చేసాయని, ఆ ప్రాంతంలో చాలాకాలంపాటు కధలు కధలుగా చెప్పుకోవటం జరిగింది.

◆ "కు(KU)" విషం రెండు రకాలుగా ఉంటుందని చెబుతారు. అందులో మొదటి రకం ఒక మనిషి మీద ప్రయోగించబడిన కొద్ది రోజుల్లోపే ఆ మనిషిని చంపేస్తుంది. ఇక, రెండవ రకానికి చెందిన "కు(KU)" ఒక మనిషి మీద ప్రయోగించిన తరువాత చాలా నిదానంగా అంటే సుమారు ఆరు నెలల్లోపు ఆ మనిషిని హతమారుస్తుంది. ప్రాచీన చైనాలో కూడా చట్టాలు చాలా బలంగా ఉండేవి. ఎవరైనా ఒకవ్యక్తి తన శత్రువుని బహిరంగంగా ఏ కత్తితోనో, రాయితోనో చంపితే ఆ వ్యక్తికి ప్రభుత్వం మరణశిక్ష విధించటం జరిగేది. అలా శిక్ష పడకుండా తప్పించుకోవటానికి ఆనాటి కొందరు వ్యక్తులు, "కు(KU)" ప్రయోగం ద్వారా తమ

శత్రువుల్ని చాలా రహస్యంగా చంపిస్తూ ఉండేవాళ్ళు. అది ఎలాగో చూద్దాం...

పింగ్ అనే ఒకవ్యక్తికి నితాంగ్ అనే ఇంకొక వ్యక్తితో ఏదో కారణంగా తీవ్రమైన విరోధం ఏర్పడింది. ఆ విరోధం ఎంత భయంకరంగా ఉన్నదంటే, నితాంగ్‌ని దారుణంగా పొడిచి పొడిచి చంపాలన్నంత కసి, పింగ్‌కి ఉన్నది. కానీ, నితాంగ్‌ని చంపితే తన కక్ష తీరుతుంది. కానీ – చట్టం తనని ఉరితీసి చంపుతుంది. కనుక చట్టానికి దొరక్కుండా, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఆధారాలు దొరక్కుండా నితాంగ్‌ని చంపాలని పింగ్ నిర్ణయించుకున్నాడు. అప్పటి నుండి పింగ్ తనలోని ద్వేషాన్ని, పగని మనసులోనే దాచుకుని నితాంగ్‌తో విపరీతమైన స్నేహంతో ప్రవర్తిస్తూ ఉండేవాడు. కొద్ది రోజులు గడిచాయి. ఒకరోజున పింగ్ ఎంతో ఆప్యాయంగా నితాంగ్‌ని తన ఇంటికి పిలిచి ఆపై అతడికి "కు(KU)" విషం కలిపిన మహా రుచికరమైన మాంసాహారాన్ని తినిపించాడు. ఈ "కు(KU)" విషం – ఆపై ఆరవనెల చివరివారంలోని చివరి రోజున నితాంగ్‌ని చంపేసింది. ఒక విశేషం ఏమంటే, నిదానంగా మనిషిని చంపే విషం ఆ మనిషిని చంపిన తరువాత అతని శరీరం నుండి అదృశ్యం అయిపోతుంది. అందువలన నితాంగ్ చనిపోయిన తరువాత అతని శరీరాన్ని కోసి పరిశీలించిన ప్రభుత్వ అధికారులకు అతడి శరీరంలో "కు(KU)" విషం తాలీకు ఆనవాళ్ళు ఏమాత్రం కనపడలేదు. దాంతో నితాంగ్ మామూలుగానే చనిపోయాడని నిర్ధారించారు. పింగ్ ఏ శిక్షా లేకుండా బైటపడ్డాడు.

◆ క్రీ.శ. 1775వ సంవత్సరంలో చింగ్‌చౌ పట్టణానికి తూర్పు దిక్కులో ఉన్న ఒక ప్రాంతంలో సూప్ (జంతువుల ఎముకలతో తయారుచేసే పులుసు) తయారుచేసి అమ్మే ఒకవ్యక్తి ఉండేవాడు. అతడు ఈ సూప్‌తో పాటుగా అతి భయంకరమైన "కు(KU)" విషయాన్ని కూడా అవసరాన్నిబట్టి తయారుచేస్తూ ఉండేవాడు. ఆ విషయం చాలా ఆలస్యంగా ప్రభుత్వానికి తెలిసింది. ఏదిఏమైనా, ఆ వ్యక్తియొక్క రహస్యం బయట పడటంతో ఆ వ్యక్తిని ప్రభుత్వం ఉరితీసి చంపింది. ఇంకొక విశేషం ఏమంటే, ఆ వ్యక్తి – "కు(KU)" విషయాన్ని తన ఇంట్లోని స్త్రీల సహాయంతో రాత్రి సమయంలో చాలా రహస్యంగా తయారుచేస్తూ ఉండేవాడు. ఈ "కు(KU)" తయారీ విధానం చాలా ఆసక్తికరంగా మరియు భయానకంగా ఉండేదని చెబుతారు. అది ఎలాగంటే... అర్ధరాత్రి దాటిన తరువాత ఆ వ్యక్తి "కు(KU)" విషాన్ని తయారుచేస్తున్న సమయంలో – ఆ ఇంట్లోని వివిధ వయస్సుల స్త్రీలూ నగ్నంగా మారి ఆ తరువాత జుట్టు విరబోసుకుని నృత్యాలు చేసేవాళ్ళు. ఆ తరువాత జింక మాంసంతో తయారుచేసిన

సూప్‌ని ఆ ఇంటి మధ్యభాగంలో ఉంచేవాళ్ళు. అప్పుడు ఆ వ్యక్తి, "కు(KU)"కి సంబంధించిన మంత్రాలు చదవటం ప్రారంభించేవాడు. ఆ మంత్ర పఠనం పూర్తి అయ్యేసరికి ఆ ఇంటి కప్పులోనుండి మిడతలు, విచిత్రమైన రంగుల్లో ఉండే సీతాకోక చిలుకలు మరియు అనేక రకాల విషపూరితమైన కీటకాలు, ఆ సూప్ ఉన్న గిన్నెమీద వాలి, ఆపై అందులో ఉన్న సూప్‌ని సంపూర్తిగా ఆరగించి, ఆపై ఆ గిన్నెలోనే మలమూత్ర విసర్జనచేసి అక్కడ నుండి బైటకు వెళ్ళిపోయేవి. అలా ఆ జీవులు విసర్జించిన పదార్థాలే అతి భయంకరమైన "కు(KU)" అని గుర్తించాలి.

ఇంకొక ముఖ్య విషయం ఏమంటే, "కు(KU)" విషాన్ని తయారుచేసే వ్యక్తుల యొక్క ఇళ్ళు చాలా శుభ్రంగా ఉండేవని చెబుతారు. ఎందుకంటే, అర్ధరాత్రి సమయంలో తమ ఇళ్ళల్లో "కు(KU)" తయారీకోసం జరిగే అసహ్యకరమైన ప్రక్రియ గురించి ఇతరులు ఎవరికీ కొంచెం కూడా అనుమానం రాకూడదు అన్న ఉద్దేశంతో తమ ఇళ్ళ లోపలి భాగాన్ని చాలా పరిశుభ్రంగా ఉంచుకునేవాళ్ళు. ఆ కారణంగానే ప్రాచీన చైనాలో చాలా శుభ్రంగా ఉండే ఇళ్ళల్లో "కు(KU)" విషం తయారవుతుందని చాలామంది అనుమానిస్తూ ఉండేవాళ్ళు.

### ♦ "కు(KU)" వశీకరణ మందుతో పురుషుల్ని వశం చేసుకున్న మంత్రగత్తెలు :

నైరుతి చైనా ప్రాంతంలో ఉన్న షాన్ పర్వతాలలో ఆదిమ జాతికి చెందిన అనేకమంది జీవిస్తూ ఉండేవాళ్ళు. ఆ ప్రాంతంలోని స్త్రీలకు నాగరిక జాతికి చెందిన పురుషులంటే గొప్ప వ్యామోహం మరియు ఆకర్షణ ఉండేవి. వ్యాపార నిమిత్తం వెళ్ళే కొందరు వ్యాపారులు ఈ పర్వతాల మీదుగా ఉండే మార్గాల ద్వారా ప్రయాణించ వలసి వచ్చేది. షాన్ పర్వతాల్లో ఉన్న స్త్రీలు "కు(KU)" విద్యను ప్రయోగించటంలో మహా నైపుణ్యాన్ని కలిగి ఉండేవాళ్ళు. ఈ విషయం తెలియని కొందరు వ్యాపారులు ఆ పర్వతాలపైన ఉన్న స్త్రీలతో లైంగిక సంబంధాలు పెట్టుకుని, కొన్నేళ్ళపాటు వాళ్ళతో కలిసి సహజీవనం చేసేవారు. ఆ తరువాత కొంతకాలానికి వాళ్ళు తమ సొంత ప్రాంతానికి బయలుదేరేవాళ్ళు. "ఆ వ్యాపారులు మళ్ళీ తిరిగి తమ దగ్గరకు రారు" అని గ్రహించిన ఆ స్త్రీలు ఆ వ్యాపారులు బయలు దేరే ముందు రోజు, వాళ్ళకి మంచి విందు భోజనం పెట్టేవాళ్ళు. ఆ విందు భోజనంలో వడ్డించే ఏదో ఒక పదార్థంలో "కు(KU)" విషాన్ని కలిపి ఆ వ్యాపారులకు తినిపించేవాళ్ళు. ఆ తరువాత ఆ వ్యాపారులు తమ ప్రాంతాలకు బయలుదేరుతూ, అప్పటిదాకా తమతో గడిపిన ఆ స్త్రీలతో ఇలా చెప్పేవాళ్ళు. "మేము తొందరలోనే మళ్ళీ తిరిగి వచ్చి మీతో ఎప్పటి

లాగానే కాపురం చేస్తాం". అలా తమ సొంత ప్రాంతానికి వెళ్ళిన వ్యాపారులు ఆరు నెలలు ముగిసేలోగా తిరిగి షాన్ పర్వతాలలో ఉన్న తమ ప్రియురాళ్ళ దగ్గరకు తిరిగి వచ్చినట్లయితే, ఆ ప్రియురాళ్ళు చాలా వేగంగా, "కు(KU)"కి విరుగుడు మందును ఆ వ్యాపారులచేత తినిపించేవాళ్ళు. దాంతో ఆ వ్యాపారులపై "కు(KU)" ప్రయోగ ప్రభావం సంపూర్తిగా తొలగిపోయేది. వాళ్ళు ప్రాణగండం నుండి వాళ్ళకు తెలియకుండానే బైటపడేవాళ్ళు. ఎవరైనా వ్యాపారులు ఆరు నెలలు ముగిసిన తరువాత కూడా తిరిగి రానట్లయితే, అప్పటి దాకా వాళ్ళ శరీరంలో రహస్యంగా దాగి ఉన్న "గో-కు(KU)" యదార్ధరూపం ధరించి, ఆపై వాళ్ళ పొట్టలు చీల్చుకుని బైటకు వచ్చేవి. దాంతో వాళ్ళు మరణించేవాళ్ళు.

ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, చైనాలోని కౌంగ్‌సీ జిల్లాలో స్త్రీలు మాత్రమే ఈ "కు(KU)" విషాన్ని తయారుచేసేవాళ్ళని తెలుస్తున్నది. ఒక విచిత్రం ఏమంటే,



ఈ స్త్రీలు ఈ విషాన్ని తమకు నచ్చిన పురుషులను వశీకరణ చేసుకోవటానికి ఉపయోగించేవాళ్ళు. (భారతదేశంలో, ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో ఇలా ఎవరినైనా లొంగ దీసుకోవటానికి లేదా వశీకరణ చేసుకోవటానికి ఉపయోగించే తంత్రశాస్త్ర సంబంధమైన ప్రమాదకర పదార్ధాన్ని ఎవరిమీదైనా ప్రయోగిస్తే దాన్ని "మందు పెట్టటం" అని పిలవటం జరుగుతున్నది.) ఏదిఏమైనా, ఆనాటి కౌంగ్‌సీ జిల్లాకు చెందిన స్త్రీలు, తాము ఇష్టపడిన పురుషుల్ని తమ అదుపులో ఉంచుకోవటం కోసం వాళ్ళకి ఏదైనా పానీయంలో లేదా ఆహారంలో ఈ "కు(KU)" మందుని కలిపి

ఇస్తూ ఉండేవాళ్ళు. ఈ వశీకరణ "కు(KU)" ప్రభావం వల్ల ఆ పురుషులు ఆ స్త్రీలకు శృంగార సుఖాన్ని ఇచ్చే బానిసలుగా మారిపోయేవాళ్ళు. ఇంకొక ముఖ్య విషయం ఏమంటే, ఈ "కు(KU)" మందుకి విరుగుడు కూడా ఆ స్త్రీలకు తెలుసు. ఇంకొక విశేషం ఏమంటే, ఇలా "కు(KU)" తయారుచేసి ఇతరుల్ని లొంగదీసుకోవటానికి లేదా చంపటానికి ఉపయోగించే వ్యక్తులు – వాళ్ళు స్త్రీలు కావొచ్చు లేదా పురుషులు కావొచ్చు. చనిపోయిన తరువాత ప్రమాదకరమైన "కు(KU)" ప్రేతాత్మలుగా మారటం జరిగేది. ఇంకొక విచిత్రం ఏమంటే, ఇలా "కు(KU)" ప్రయోగాలు చేసి చేసి చనిపోయిన స్త్రీల యొక్క ప్రేతాత్మలు పూర్తి పసుపురంగులో కనపడేవి. వాటి కళ్ళు చింత నిప్పుల్లాగా మెరుస్తూ ఉండేవి. ఏ గృహంలో అయినా సరే అలాంటి విచిత్రమైన రూపం ఉన్న స్త్రీ కనపడినట్లయితే ఆ స్త్రీ మనిషి కాదని, "కు(KU)" ప్రేతాత్మ అని గుర్తించటం జరిగేది. "కు(KU)" ప్రయోగాన్ని చేసిన అనేకమంది స్త్రీల వృత్తాంతాలు ఆనాటి గ్రంథాలలో లిఖించబడ్డాయి. అలాంటి వాటిలో ఒక ఆసక్తికరమైన సంఘటన ఇక్కడ తెలుసుకుందాం...

క్రీ.శ.14వ శతాబ్దంలో చైనాలోని దక్షిణ ప్రాంతాన్ని చెంగ్‌టుంగ్ వంశస్తులు పరిపాలిస్తున్న కాలంలో, ఉత్తర చైనాలోని ఒక పట్టణానికి చెందిన చౌలీ అనే ఒక యువకుడు వ్యాపార నిమిత్తం కౌంగ్‌షీ నగరానికి వచ్చాడు. అక్కడ వ్యాపారం బాగా సాగింది. ఆ సమయంలో అతడు ఆ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న చెంగ్ రాజవంశ కుటుంబానికి చెందిన ఒక వితంతు యువతిని (భర్తచనిపోయిన స్త్రీ) పెళ్ళిచేసుకున్నాడు. ఆమెతో చౌలీ చాలా ఏళ్ళపాటు సుఖంగా సంసారం చేసాడు. ఆ సమయంలోనే ఆ యువతికి ఒక కొడుకు పుట్టాడు. దాదాపు 20 సంవత్సరాలపాటు చౌలీ ఆ ప్రాంతంలో వ్యాపారంచేసి బాగా డబ్బు గడించాడు. ఆ తరువాత ఒకరోజున అతడు తన సొంత ప్రాంతానికి వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. అప్పటికి అతడికి పుట్టిన కొడుక్కి 16 సంవత్సరాల వయస్సు వచ్చింది. ఏదిఏమైనా, తన సొంత ప్రాంతానికి వెళ్ళటానికి సిద్ధపడుతున్న చౌలీని అడ్డుకోవటానికి ఆ యువతికి ధైర్యం చాలలేదు. అతడిని బాగా ప్రేమించి ఉన్న కారణంగా అతడిని వదులుకోవటం ఆ యువతికి ఇష్టంలేదు. తన సొంత ప్రాంతానికి వెళ్ళిన చౌలీ మళ్ళీ ఇక్కడకు తిరిగి వస్తాడన్న నమ్మకం ఆ యువతికి ఏమాత్రంలేదు. అందుకోసం ఆమె ఒక ఉపాయం పన్నింది. దాని ప్రకారమే – ఆమె, 16 సంవత్సరాల తన కొడుకుని తన దగ్గరకు పిలిచి అతడితో ఇలా చెప్పింది. "నీవు కూడా నీ తండ్రితోపాటు అతడి ప్రాంతానికివెళ్ళు. అతడు మూడు నెలల్లోగా తిరిగి ఇక్కడకు రాకపోతే అతడిని వదిలిపెట్టి వచ్చెయ్. ఒకవేళ అతడు

ఇక్కడకు రావటానికి సిద్ధపడితే నేను, నీకు ఇవ్వబోతున్న ఔషధాన్ని అతడికి ఇవ్వు. ఎందుకంటే, నేను అతడిమీద "కు(KU)" ప్రయోగం చెయ్యబోతున్నాను".

ఏదిఏమైనా, చౌలీ తన ప్రాంతానికి తిరిగి వెళ్ళబోతున్న రోజున అతడికి "కు(KU)" విషం కలిపిన ఆహారాన్ని ఎంతో ప్రేమతో తినిపించింది ఆమె. ఆపై, చౌలీ తన కొడుకుని వెంటపెట్టుకుని కొద్ది రోజుల్లోనే కాలినడకన తన ప్రాంతానికి చేరుకున్నాడు. తన ఇంటికి చేరుకున్న చౌలీకి మొదటి మూడు రోజులు ఏమీ కాలేదు. నాల్గవ రోజు ఉదయం నుండి అతని పొట్ట క్రమ క్రమంగా ఉబ్బిపోవటం మొదలయ్యింది. అంతేకాకుండా, అతడికి విపరీతమైన దాహంకూడా ప్రారంభం అయ్యింది. దాంతో అతడు గ్లాసుల కొద్ది నీళ్ళు విపరీతంగా త్రాగటం ప్రారంభించాడు. విపరీతంగా త్రాగిన నీళ్ళు కారణంగా అతని పొట్ట మరింత ఉబ్బిపోయింది. అతడికి మనసులో ప్రాణభయం మొదలయ్యింది. అది గమనించిన అతని కొడుకు అతడి దగ్గరకు వెళ్ళి ఆపై ప్రశాంతమైన స్వరంతో అతడితో ఇలా అన్నాడు. "నువ్వు మన ఇంటికి ఎప్పుడు తిరిగి వస్తావు? అసలు వస్తావా? రావా? చెప్పు" అన్నాడు.

అప్పుడు చౌలీ, వణుకుతున్న స్వరంతో తన కొడుకుతో ఇలా అన్నాడు. "నేను మీ అమ్మ దగ్గరకు రావటానికి మొన్నే నిర్ణయించుకున్నాను. కానీ, నిన్నటి నుండి నా పొట్ట ఇలా ఉబ్బిపోతున్నది. నాకు ఏదో తెలియని అనారోగ్యం వచ్చింది. ఇలాంటి పరిస్థితుల్లో నేను అంతదూరం ప్రయాణంచేసి మీ అమ్మ దగ్గరకు ఎలా వెళ్ళాలి?" అన్నాడు. అప్పుడు అతడి కొడుకు తన తండ్రితో ఇలా అన్నాడు. "నువ్వు మా అమ్మ దగ్గరకు తిరిగి వస్తానని అంగీకరించావు కనుక, నీకు వచ్చిన ఈ అనారోగ్యాన్ని నేను తొలగిస్తాను భయపడకు". ఆపై ఆ అబ్బాయి, చౌలీ నోట్లో ఏదో గుర్తు తెలియని ఒక పొడిని వేసాడు. చౌలీ ఆ పొడిని అతి కష్టంమీద సంపూర్తిగా మ్రింగాడు. ఆ తరువాత ఆ అబ్బాయి, చౌలీని ఆ ఇంట్లో ఉన్న ఒక పెద్ద స్తంభానికి తాళ్ళతో కట్టేసాడు. కొద్ది సేపు గడిచిన తరువాత చౌలీకి విపరీతమైన దాహం వేసింది. దాంతో చౌలీ పెద్ద స్వరంతో "బిడ్డా! నేను దాహం తట్టుకోలేక పోతున్నాను. నాకు మంచినీళ్ళు ఇవ్వు" అన్నాడు. అతడి కొడుకు చిన్నగా నవ్వి ఆపై ఒక మట్టి పాత్రలో నీళ్ళు తీసుకుని చౌలీ దగ్గరకు వచ్చి, ఆపై ఆ పాత్రని చౌలీ నోరుదాకా తీసుకువచ్చి, చౌలీ ఆ నీటిని తన నోటితో అందుకునే లోగానే ఆ అబ్బాయి ఆ పాత్రని నేలమీదకి వదిలేసేవాడు. మట్టి పాత్ర పగిలిపోయి నీళ్ళన్నీ నేలమీద ప్రవహించాయి. ఇలా అనేకసార్లు చౌలీ నీళ్ళు అడగటం, ఆ అబ్బాయి నీరు ఉన్న పాత్రను చౌలీ నోటిదాకా తీసుకురావటం మళ్ళీ

క్రింద పడవెయ్యటం జరిగింది. ఏదిఏమైనా, అలా అనేకసార్లు జరిగింది. చౌలీ ఆ దాహం తట్టుకోలేకపోయాడు. అతని కడుపులో మెలిపెట్టినట్లుగా అనిపించింది. ఆ తరువాత అతడు వాంతి చేసుకున్నాడు. ఆ వాంతిలో దాదాపు 3 అంగుళాల పొడవు ఉన్న ఒక గొంగళి పురుగు కనపడింది. విచిత్రం ఏమంటే, ఆ పురుగు సజీవంగా ఉన్నది. ఎప్పుడైతే అతడు ఆ గొంగళి పురుగుని వాంతి చేసుకున్నాడో ఆ మరుక్షణం నుండి అతడి పొట్ట మామూలుగా మారిపోయింది. అతడు ఆరోగ్యవంతుడు అయ్యాడు. ఆ తరువాత చౌలీ తన కొడుకుని వెంటపెట్టుకుని భార్య దగ్గరకు వెళ్ళిపోయాడు. తమని వదిలిపెట్టి వెళ్ళిన భర్తలు మళ్ళీ తమ దగ్గరకు చచ్చినట్లుగా తిరిగి రావటంకోసం ఆ భర్తలమీద "కు(KU)" ప్రయోగాన్ని కొంతమంది భార్యలు చేస్తూ ఉండేవాళ్ళు. ఇంకొక ముఖ్య విషయం ఏమంటే, పొరుగు ప్రాంతానికి చెందిన భర్త, ఆరు నెలల్లోగా తిరిగి తన దగ్గరకు వచ్చినట్లయితే ఆ భార్య ఆ భర్తకి "కు(KU)"కి విరుగుడు మందు ఇచ్చేది. ఫలితంగా, ఆ భర్త బ్రతికిపోయేవాడు. ఒకవేళ ఆ భర్త తిరిగి రానట్లయితే ఆరునెలలు ముగిసిన మర్నాడే "కు(KU)" ప్రభావం వల్ల అతడు చనిపోవటం జరిగేది. ఆ కారణంగానే ఆనాటి దక్షిణ చైనాలో నివసించిన వితంతు స్త్రీలను "పిశాచ భార్యలు" అని పిలిచే వాళ్ళు. ఎందుకంటే, అలాంటి వితంతు స్త్రీలను వివాహం చేసుకున్న పురుషులమీద ఆ స్త్రీలు తప్పనిసరిగా ఏదోఒక సమయంలో "కు(KU)"ని ప్రయోగించి, ఆపై ఆ పురుషుల్ని శాశ్వతంగా తమ ఆధీనంలో ఉంచుకునేవాళ్ళు.

### ◆ బర్మాలో "కు(KU)" మంత్రగాళ్ళు :

బర్మా దేశంలో కూడా "కు(KU)" ప్రయోగాలు చేస్తారు. అయితే, బర్మాలో "కు(KU)" విషం బదులుగా నేరుగా మంత్రాలనే తమ శత్రువులపైకి ప్రయోగిస్తారు. బర్మాలోని ఒక్కొక్క గ్రామంలో ఒక్కొక్క కుటుంబం "కు(KU)" ప్రయోగాన్ని చెయ్యగలిగే శక్తిని కలిగి ఉంటుంది. కుటుంబ పెద్ద, తాను చనిపోవటానికి ముందు "కు(KU)" ప్రయోగ మంత్రాన్ని తన కుటుంబంలో ఒకవ్యక్తికి నేర్పిస్తాడు. ఆ వ్యక్తి తన జీవితాంతమూ ఆ "కు(KU)" మంత్రంతో క్షుద్ర ప్రయోగాలు చేస్తాడు. ఆ వ్యక్తికూడా తాను చనిపోయే సమయంలో "కు(KU)" మంత్ర విద్యను తన వారసుడికి ఇస్తాడు. ఈవిధంగా "కు(KU)" మంత్ర విద్య, వారసత్వంగా ఆ కుటుంబంలో కొనసాగుతుంది. ఇంకొక విశేషం ఏమంటే, ప్రాచీన బర్మాలోని "కు(KU)" మంత్రగాళ్ళకు చైనా ప్రజల మీద విపరీతమైన ద్వేషం మరియు కోపం ఉండేవి. అందువలన ఎవరైనా

చైనా వ్యక్తి, బర్మాలోకి ప్రవేశించినప్పుడు ఏదో ఒక సందర్భంలో బర్మాలోని ఏదోఒక మంత్రగాడు, చైనా నుండి వచ్చిన వ్యక్తికి "కు(KU)" ప్రయోగం ద్వారా హాని చెయ్యటం జరిగేది. అది ఎలా జరిగేదో క్లుప్తంగా తెలియజేస్తాను.

బర్మా మంత్రగాళ్ళు "కు(KU)" మంత్రాన్ని ఉపయోగించి, ఒక సంపూర్ణమైన మరియు ఎండిపోయిన ఆవు చర్మాన్ని 49 రోజులపాటు మంత్రించేవాళ్ళు. ఆ మంత్ర ప్రభావం వల్ల ఆ ఆవుచర్మం, ఆవగింజ పరిమాణంలోకి మారిపోయేది. ఇలా ఆవగింజ పరిమాణంలోకి మారిపోయిన ఆవు చర్మాన్ని "గోవు-కు(KU)" అనే పేరుతో పిలిచే వాళ్ళు. ఎవడైనా చైనా దేశీయుడు తమకు ఎదురుపడినప్పుడు బర్మామంత్రగాడు తన చూపుడు వేలు గోరులో అమర్చుకున్న "గోవు-కు(KU)" ని తన బొటనవేలుతో గట్టిగా కొట్టేవాడు. దాంతో, అతడి చూపుడు వేలు గోరులో ఇరికించబడి ఉన్న ఆవగింజ పరిమాణంలోని "గోవు-కు(KU)" వేగంగా వెళ్ళి, ఎదురుగా ఉన్న చైనా దేశీయుడి పొట్టలోకి బుల్లెట్‌లాగా ప్రవేశించేది. చాలా చిన్న పరిమాణంలో ఉన్న ఆ "గోవు-కు(KU)" తన పొట్టలోకి ప్రవేశించిన విషయం ఆ చైనా దేశీయుడికి ఏమాత్రం తెలిసేదికాదు. ఆ తరువాత ఆ చైనా దేశీయుడు, బర్మాలో తన పని పూర్తిచేసుకుని తిరిగి చైనాకి బయలుదేరేవాడు. ఆ చైనా దేశీయుడు, చైనాలోని అతడి ఇంటికి వెళ్ళటానికి ఎన్ని రోజుల సమయం పడుతుందో ఈ బర్మా మంత్రగాడు లెక్క వేస్తాడు. చైనా దేశీయుడు తన ఇంటికి చేరిన రోజున ఫలించేటట్లుగా "గోవు-కు(KU)" ప్రయోగానికి సంబంధించిన మంత్రాన్ని అనేకసార్లు పఠిస్తాడు.

ఏదిఏమైనా, ఆ చైనా దేశీయుడు తన ఇంటికి చేరిన కొద్ది నిమిషాల్లోనే "గోవు-కు(KU)" క్షుద్ర మంత్రం పనిచెయ్యటం ప్రారంభిస్తుంది. ఫలితంగా, ఆ చైనా దేశీయుడు రోజు రోజుకీ సన్నబడిపోతాడు. అతని పొట్ట బెలూన్‌లాగా ఉబ్బిపోవటం మొదలవుతుంది. ఆపై 40 రోజుల్లో ఏదో ఒక రోజున, ఆ వ్యక్తియొక్క పొట్టలో ఆవగింజ పరిమాణంలో ఉన్న "గోవు-కు(KU)" - అప్పుడే ఆవు శరీరం మీద నుండి వలచబడిన చర్మం ఎంత తాజాగా ఉంటుందో అంత తాజాగా మారటమే కాకుండా, నిజమైన ఆవు చర్మం ఎంత పరిమాణంలో ఉంటుందో అంత పరిమాణంలోకి పెరిగిపోయి, ఆ చైనా దేశీయుడియొక్క పొట్టను చీల్చుకుని బైటకు వచ్చేస్తుంది. ఫలితంగా, ఆ చైనా దేశీయుడు దారుణమైన బాధను అనుభవిస్తూ మరణిస్తాడు. ఇక్కడ ఇంకొక ముఖ్యమైన విషయాన్ని తెలుసుకోవాలి. అది ఏమిటంటే, ఒక్కోసారి - చైనా దేశీయుడు తన ఇంటికి తిరిగి వెళ్ళిన తరువాత అతడి పొట్ట

పెరిగిపోవటం ప్రారంభం అవటాన్ని ఎవరైనా చైనా "కు(KU)" మంత్రవాది పసిగట్టినట్లయితే, ఆ మంత్రవాది "గోవు-కు(KU)" ప్రయోగానికి వ్యతిరేకంగా "కు(KU)" మంత్రాన్ని ప్రయోగిస్తాడు. ఫలితంగా, ఆ "గోవు-కు(KU)" ప్రయోగం – తనని ప్రయోగించిన బర్మా మంత్రగాడి శరీరంలోకి ప్రవేశించి, ఆపై యదార్ధ రూపంతో ఆ మంత్రగాడి శరీరంలోంచి బైటకు వస్తుంది. ఫలితంగా, ఆ బర్మా మంత్రగాడు మరణిస్తాడు.

ఇంకొక ముఖ్యవిషయం ఏమంటే, "కు(KU)" ప్రయోగాలు చేసే మంత్రగాళ్ళ ఇళ్ళలోని స్త్రీలను ఆ "కు(KU)"లకు సంబంధించిన ప్రేతాత్మలు తరచుగా శృంగార పరంగా అనుభవించటం జరిగేది. అంతేకాకుండా, ఆ మంత్రగాళ్ళ ఇళ్ళల్లో ఉండే చిన్న పిల్లల యొక్క మెదడుని ఆ "కు(KU)"లు ఏదో ఒక సమయంలో తినివెయ్యటం జరిగేదని తెలుస్తున్నది. తనను ఉపయోగించుకుంటున్న మంత్రగాడిమీద ఏ కారణం చేతైనా ఆగ్రహించిన "కు(KU)" ప్రేతాత్మ ఆ మంత్రగాడియొక్క కుటుంబ సభ్యులను చంపివెయ్యటం జరిగేది.

(ప్రాచీన చైనాలో ప్రేతాత్మకు సంబంధించిన ఒక విశ్వాసం ప్రబలంగా ప్రచారంలో ఉండేది. అది ఏమిటంటే, ఎవరైనా మనిషిని ఒక పులి చంపి తినేసినట్లయితే ఆ తరువాత ఆ మనిషియొక్క ప్రేతాత్మ, ఆ పులిని ఇలా అడుగుతుంది. "నన్ను చంపినట్లుగానే నీవు ఇంకొక మనిషిని కూడా చంపు. కానీ, ఆ మనిషి మృతదేహాన్ని తినవొద్దు. అప్పుడు నేను ఆ మృతదేహంలోకి ప్రవేశించి మళ్ళీ మనిషిగా ఈ లోకంలో జీవిస్తాను".)

దాదాపు రెండువేల సంవత్సరాల క్రితం చైనాలో రచించబడిన 'షాన్‌హైచింగ్' అనే గ్రంథంలో ఇలా చెప్పబడి ఉన్నది. చైనాలోని 'లీ' ప్రాంతానికి తూర్పు దిక్కులో 300 మైళ్ళ దూరంలో చియాంగ్‌షూ అనే ఒక పెద్ద పర్వతం ఉన్నది. ఆ పర్వతం మీద తొమ్మిది తోకలు ఉన్న నక్కలు తిరుగుతూ ఉంటాయి. ఈ నక్క యొక్క స్వరం ఒక పసిబిడ్డ ఏడిచినప్పుడు ఎలా ఉంటుందో అలా వినిపిస్తుంది. దోవ తప్పి ఆ పర్వతం మీదకి వచ్చిన మనుషుల్ని ఈ నక్కలు చంపి తినివేస్తూ ఉంటాయి. ఒక విశేషం ఏమంటే, ఎవరైనా మనిషి ఈ నక్కను చంపి తిన్నట్లయితే, ఆపై ఆ మనిషి మీద "కు(KU)" ప్రయోగం ఏమాత్రం ఫలించదని నమ్ముతారు. ఇంకొక విశేషం ఏమంటే, ఆ కాలంలో కొన్ని ప్రాంతాలలో హఠాత్తుగా పెనుగాలులు వీస్తూ ఉండేవి. ఆ గాలుల ధాటికి ఎడ్ల బండ్లు కూడా గాలిలోకి ఎగిరి దూరంగా పడుతూ

ఉండేవి. ఆ గాలులు, "కు(KU)" ప్రయోగం ద్వారా ఆవిర్భవించిన క్షుద్రశక్తుల వల్ల వస్తున్నాయని నమ్మిన ఆయాప్రాంతాల ప్రజలు, ఆ గాలులు వచ్చినప్పుడు రహదారుల మీద అక్కడక్కడా నల్ల కుక్కల్ని బలి ఇవ్వటం జరిగేది. నల్ల కుక్కల యొక్క రక్తం క్షుద్ర శక్తుల్ని బలహీనపరుస్తుందని ప్రాచీన చైనా మంత్రగాళ్ళు భావించటం జరిగింది. ఇప్పటికీ, చైనాలోని కొన్ని ప్రాంతాలలో ఎవరిమీదైనా క్షుద్ర ప్రయోగం జరిగిందని అనుమానం వచ్చినప్పుడు ఆ వ్యక్తికి ఎదురుగా ఒక నల్ల కుక్కను ఉంచి, ఆపై దానిని ఒక కత్తితో నరికి చంపటం జరుగుతుంది.

ప్రాచీనకాలంలో – చైనాలో "కు(KU)" ప్రయోగాలు వేలాదిమందిని బలితీసుకోవటంతో ఆనాడు చైనాను పరిపాలిస్తున్న టాంగ్ రాజవంశం "కు(KU)"ని చట్టపరంగా నిషేధించింది. "కు(KU)" ప్రయోగం చెయ్యటం ఒక అమానుషమైన నేరంగా గుర్తించబడింది. అంతేకాదు, "కు(KU)" ప్రయోగాలు చేసేవాళ్ళని మరియు ఆ ప్రయోగాలు చేసే విధానాలను ఇతరులకు నేర్పేవాళ్ళని తీవ్రమైన నేరస్తులుగా గుర్తించి, ఆపై వారియొక్క ఆస్తులను ప్రభుత్వం స్వాధీనం చేసుకుని, ఆపై వాళ్ళని బహిరంగంగా ఉరితీసి చంపటం జరిగేది. అంతేకాకుండా, ఆ "కు(KU)" మంత్రవాదుల గృహాలను స్వాధీనం చేసుకోవటమే కాకుండా ఆ గృహాలలో ఉండే మంత్రవాది కుటుంబ సభ్యులను ఆ ఇళ్ళల్లోంచి బైటకు వెళ్ళగొట్టటం జరిగేది.

**జ్ఞానంగల ధర్మాత్ములు "కు(KU)" ప్రయోగాలకు భయపడరు :**

"సంపదల కన్నా ధర్మానికే విలువ ఇచ్చే మానవులు సమాజానికి వెన్నుముక లాంటివారు" అని ప్రాచీన చైనాలో విశ్వసించటం జరిగింది. ధర్మమార్గంలో నడిచే జ్ఞాని, మహా ప్రమాదకరమైన "కు(KU)" ప్రభావాన్ని అడ్డుకుని, ఆ ప్రయోగాలను నిర్వీర్యం చెయ్యగలడని భావించటం జరిగింది. క్షుద్ర మాంత్రికులు, ధర్మాన్ని మరియు దైవాన్ని త్రికరణశుద్ధిగా నమ్ముకున్న వ్యక్తుల్ని ఏనాటికీ జయించలేరని భావించారు. ఒక సమాజం నీతివంతంగా నిలబడాలంటే ఆ సమాజానికి పునాదిగా దైవజ్ఞాని అయిన ధర్మాత్ముడు ఉండాలని ప్రాచీన చైనాలో ఉద్ఘాటించబడింది. చెడు శక్తులను ధర్మాత్ములు ఏవిధంగా ఓడించగలరో తెలియజేసే కొన్ని సంఘటనలు ప్రాచీన చైనాలో జరిగాయి. అది ఎలాగంటే...

Ψ ప్రాచీన చైనాలోని "చిచౌ" అనే ప్రాంతంలో సోలాంగ్ అనే ఒక మహా పండితుడు ఉండేవాడు. అతడు మంత్రశాస్త్రంలో పెద్దస్థాయి అర్హత పత్రాలను (సర్టిఫికెట్లు) పొందాడు. ఈ ప్రపంచంలో అన్నిచోట్లా కనపడే ఒక విచిత్రం ఏమంటే, "విద్య

ఉన్న వాడి దగ్గర డబ్బు ఉండదు. కానీ, విద్య ఉన్నవాడి దగ్గర తప్పనిసరిగా మంచి గుణం ఉండే అవకాశాలు చాలా ఎక్కువగా ఉంటాయి". ఆ ప్రకారమే ఈ సోలాంగ్ కూడా గొప్ప పండితుడే అయినప్పటికీ అతడి దగ్గర డబ్బు ఏమాత్రం ఉండేదికాదు. అయినప్పటికీ, అతడు చాలా ధర్మమార్గంలో నడిచే వ్యక్తిగా గుర్తించబడ్డాడు. ఒకరోజు ఉదయం సోలాంగ్ తన గ్రామానికి దగ్గరలో ఉన్న ఒక పట్టణానికి వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు. అందువల్ల ఆ రోజు తెల్లవారుఝామునే నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకుని, ఆపై ఇంట్లోంచి బైటకు వచ్చి తాను వెళ్ళాల్సిన పట్టణంవైపు నిదానంగా నడవటం ప్రారంభించాడు. అలా కొంతదూరం నడిచిన తరువాత అతడికి ఆ మట్టి రోడ్డు ప్రక్కన నేలమీద ఒక వెదురుబుట్ట కనిపించింది. ఆ బుట్ట అక్కడికి ఎలా వచ్చిందో? సోలాంగ్‌కి అర్థంకాలేదు. కొద్దిసేపు ఆ బుట్టకేసి పరిశీలనగా చూసిన సోలాంగ్ ఆపై ఆ బుట్టని తెరచి చూసాడు. ఆ బుట్టలో అనేక వెండి నాణాలు కనపడ్డాయి. అప్పటికి ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. కనుక జనసంచారం అసలు లేదు. తనను ఎవరూ చూడటంలేదు అని ఖచ్చితంగా నిర్ధారణ చేసుకున్న తరువాత సోలాంగ్ ఆ బుట్టను తీసుకుని, ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా తన ఇంటికి తిరిగివెళ్ళి ఆ బుట్టను తన భార్య చేతికి ఇచ్చి సన్నటి గొంతుతో ఆమెతో ఇలా చెప్పాడు. "ఈ బుట్టలో ఉన్న వెండి నాణాలు నాకు అనుకోకుండా లభించాయి. బహుశ పై లోకాలలో ఉండే ఆ దేవుళ్ళు నాకు సహాయం చెయ్యటంకోసం ఈ సొమ్మును నాకు ఇచ్చి ఉంటారు".



సోలాంగ్ అలా ఈ మాటలు చెప్పటం ముగించాడో లేదో అతని ఎడమ తొడమీద బంగారం రంగులో మెరిసిపోతున్న ఒక గొంగళి పురుగు చాలా నిదానంగా పాకుతూ కనిపించింది. దాంతో అతడు ఉలిక్కిపడి, ఆపై అతడు తన ఎడమ చేత్తో ఆ గొంగళి పురుగుని తీసి నేలపైకి విసిరాడు. అతడు అలా నేలపైకి విసిరాడో లేదో మరుక్షణంలో ఆ గొంగళిపురుగు అతని తొడమీద మళ్ళీ కనపడింది. దాంతో అతడు ఈసారి ఆ గొంగళి పురుగుని నేలపైవేసి తన కాలితో చితక్కొట్టి చంపేసాడు. విచిత్రం! మళ్ళీ ఆ గొంగళిపురుగు అతని తొడమీద సరిగ్గా అదే ప్రదేశంలో సజీవంగా కనపడింది. ఆపై అతడు ఆ గొంగళి పురుగుని చంపటంకోసం దాన్ని మంటల్లో వేసాడు. కానీ, అది చావలేదు. కత్తితో దాన్ని చిన్న చిన్న ముక్కలుగా నరికాడు. అయినా అది

చావలేదు. దాన్ని లోతైన నీళ్ళలోకి విసిరాడు. అయినా అది చావలేదు. అతడు దాన్ని వదిలించుకోవాలని ఎన్ని ప్రయత్నాలు చేసినా, అది అతడి తొడని అంటిపెట్టుకుని ఉండిపోయింది. అతడు ఎక్కడికి వెళ్ళినా అతడితోపాటే ఆ గొంగళిపురుగు వెళుతూ ఉండేది. ఈ పరిస్థితికి విపరీతమైన ఆందోళనకు గురైన సోలాంగ్ తన బాధను తన మిత్రులకు చెప్పుకుని "ఆ గొంగళి పురుగుని వదిలించుకునే మార్గం ఏదైనా చెప్పమని" ఆ మిత్రులను అడిగాడు.

ఆ మిత్రులలో ఒకడు క్షుద్ర ప్రయోగాల గురించి బాగా తెలిసి ఉన్నాడు. అందువల్ల అతడు, సోలాంగ్ తొడమీద అతుక్కుని ఉన్నట్లుగా ఉన్న ఆ బంగారు రంగు గొంగళిపురుగుని పరిశీలనగా చూస్తూ సోలాంగ్‌తో "మిత్రమా! నీకు చాలా ద్రోహం జరిగింది. ఈ గొంగళి పురుగు సాధారణ గొంగళిపురుగు కాదు. ఇది 'చిన్–షాన్' అని తెలుసుకో. చూడటానికి ఇది చిన్నదిలాగా కనపడ్డా, ఇది నీకు తీవ్రమైన ప్రమాదాన్ని కలిగిస్తుంది. ప్రస్తుతం నీ తొడమీద ఉన్న ఈ గొంగళిపురుగు కొద్ది రోజుల్లోనే నీ ఉదరంలోకి ప్రవేశించి, ఆపై అక్కడ ఉన్న ప్రేగుల్ని నాశనంచేసి ఆ తరువాత చాలా క్షేమంగా నీ ఉదరంలోంచి బైటకు వస్తుంది" అన్నాడు. ఆ మిత్రుడు అలా చెప్పగానే సోలాంగ్ చెప్పరానంత భయానికి గురై గజగజా వణికిపోవటం ప్రారంభించాడు.



ఆపై తనకు కొద్ది రోజుల క్రితం తెల్లవారుఝాము సమయంలో వెండి నాణాలతో నిండిన బుట్ట దొరికిన విషయం కూడా ఆ మిత్రుడికి నసుగుతూ చెప్పాడు. ఆ మిత్రుడు చిన్నగా నవ్వి, ఆపై గంభీరమైన స్వరంతో "మిత్రమా! నువ్వు చెప్పకుండానే నాకు ఆ బుట్ట విషయం ఇందాకే తెలిసిపోయింది. నీవు ఈ చిన్‌షాన్ "కు(KU)"ని సేవించినట్లయితే నువ్వు త్వరలోనే మహా ధనవంతుడివి అవుతావు" (బంగారం రంగులో మెరిసిపోతున్న ఆ గొంగళి పురుగే "కు(KU)" అని గుర్తించాలి) అన్నాడు. ఆ మిత్రుడు అలా అనటంతో సోలాంగ్ కొంచెంసేపు తన భయాన్ని మర్చిపోయి, ఆపై ఆసక్తి నిండిన స్వరంతో ఆ

మిత్రుడితో ఇలా అన్నాడు. "ఈ గొంగళి పురుగు వల్ల నాకు సంపద ఎలా వస్తుందో చెప్పు?". అప్పుడు ఆ మిత్రుడు ప్రశాంతమైన స్వరంతో ఇలా అన్నాడు. "ఈ గొంగళిపురుగు ప్రతిరోజూ 4 అంగుళాల పట్టు గుడ్డను ఆహారంగా తీసుకుంటుంది. నీవు ప్రతిరోజూ దానికి పట్టుగుడ్డని ఆహారంగా ఇవ్వు. ఆపై కొద్దిసేపటికి అది మలవిసర్జన చేస్తుంది. ఆపై నీవు, కొద్ది రోజులపాటు దాని మలాన్ని సేకరించి ఉంచుకో. ఆ తరువాత ఒక రోజున దానిని బాగా ఎండపెట్టి ఆపై దానిని ఒక రోటిలో దంచి పొడిగా చెయ్యి. ఆ తరువాత ఆ పొడిలో కొంచెం భాగాన్ని ఆహారంలో లేదా పానీయంలో కలిపి ఎవరికైనా ఇవ్వు. ఆ ఆహారం లేదా పానీయం తీసుకున్న వ్యక్తిమీద విషప్రయోగం అనగా "కు(KU)" ప్రయోగం జరుగుతుంది. ఆపై, నీ వంటిమీద ఉన్న "కు(KU)"కి సంబంధించిన ఆ గొంగళి పురుగు, నీ చేత విష ప్రయోగం చేయబడిన వ్యక్తికి సంబంధించిన విలువైన వస్తువుల్ని (వెండి, బంగారం, రత్నాలు లాంటివి) తెచ్చి నీ ఇంట్లో పడేస్తుంది".

ఆ మిత్రుడు చెప్పిన మాటలు విన్న సోలాంగ్ ఒక్క నిమిషం మౌనంగా ఉండి ఆపై పెద్దగా నవ్వాడు. ఆపై విచిత్రమైన స్వరంతో "అలాంటి చెడ్డపని చేసేవాడిలాగా నేను నీకు కనిపిస్తున్నానా?" అన్నాడు. అప్పుడు ఆ మిత్రుడు "నువ్వు అలాంటి పనులు చేసేవాడివి కాదని నాకు తెలుసు. కానీ, నువ్వు ఇంకేమి చెయ్యగలవో చెప్పు" అన్నాడు. అప్పుడు సోలాంగ్ చిన్నగా నవ్వి "నాకు లభించిన ఆ వెండి నాణాల బుట్ట కారణంగానే ఈ గొంగళిపురుగు అనగా "కు(KU)" నాకు అంటుకున్నది. కనుక, నేను ఆ బుట్టను ఎక్కడో ఒకచోట వదిలివేస్తాను. అప్పుడు ఈ గొంగళిపురుగు కూడా నన్ను ఖచ్చితంగా వదిలి వెళ్ళిపోతుంది. ఆపై నాకు ఏ సమస్యా ఉండదు" అన్నాడు. అప్పుడు ఆ మిత్రుడు విచిత్రంగా నవ్వి "మిత్రమా! నీకు ఈ "కు(KU)" పురుగు సంగతి సరిగ్గా తెలియదు. నీకు ఎంత సొమ్ము దొరికిందో (వెండి నాణాలు) అంత సొమ్ముని వదిలిపెడితే ఈ పురుగు నిన్ను వదిలివేస్తుందని అనుకుంటున్నావు. కానీ, వాస్తవంలో అలా జరగదు. ఈ పురుగుతో పాటుగా నీకు ఎంత సొమ్ము లభించిందో దానికి అనేక ఎక్కువ రెట్లు సొమ్ము వదిలిపెడితే కాని ఈ పురుగు నిన్ను వదిలిపెట్టదు. అసలే పేదరికంలో ఉన్న నీవు అంత సొమ్ముని ఎక్కడ నుండి తెస్తావు?, ఒక్కసారి ఆలోచించు" అన్నాడు. సోలాంగ్ ఏదో అనేలోగా ఆ మిత్రుడు మళ్ళీ ఇలా అన్నాడు. "నా మాట విని కొన్నాళ్ళపాటు ఈ పురుగుని సేవించు. అనగా దానికి కావలసిన ఆహారంపెట్టు. అది నీకు విపరీతంగా విలువైన వస్తువుల్ని తెచ్చి ఇస్తుంది. అప్పుడు నువ్వు, నీకు కావలసినంత సొమ్ముని ఉంచుకోవచ్చు మరియు మొదట్లో

నీకు ఎంత సొమ్ము దొరికిందో అంతకి ఎన్నో రెట్లు వదిలివేయవచ్చు. అప్పుడు ఈ పురుగు తప్పనిసరిగా నిన్ను వదిలి వెళ్ళిపోతుంది".

మిత్రుడు చెప్పిన మాటలు శ్రద్ధగా విన్న సోలాంగ్ ఒక్కసారి బలంగా నిట్టూర్చి ఆపై ఆకాశంలోకి పరిశీలనగా చూసి మళ్ళీ తల క్రిందకు వంచి తన మిత్రుడి ముఖంలోకి సూటిగా చూస్తూ ఇలా అన్నాడు. "మిత్రమా! ఇప్పుడు నా వయస్సు దాదాపు 50 సంవత్సరాలు ఉంటుంది. ఇప్పటి వరకు నేను న్యాయంగానే బ్రతికాను. ఏనాడూ నేను మోసానికి పాల్పడలేదు. నా దురదృష్టం, ఈ పురుగు నన్ను తగులుకున్నది". ఆ మిత్రుడు ఏమీ మాట్లాడలేక మౌనంగా ఉండిపోయాడు. ఆపై సోలాంగ్ వేగంగా నడుస్తూ తన ఇంటికి వచ్చాడు. ఆపై తన భార్యతో ఆ పురుగు యొక్క రహస్యం గురించి వివరంగా చెప్పి ఆపై ఆమెతో ఇలా అన్నాడు. "ఈ పురుగుని మేపటం నాకు సాధ్యంకాదు. అలాగే దాన్ని వెళ్లగొట్టటానికి అవసరమైన సొమ్ముకూడా నా దగ్గర లేదు. ఇక, ఈ పురుగు ఏదో ఒక సమయంలో నా ఉదరంలోకి ప్రవేశించి నన్ను చంపేస్తుంది. అనగా, నాకు చావు తప్ప వేరే మార్గం లేదు. కనుక నీవు నీ భవిష్యత్తుని నువ్వే నిర్ణయించుకోవలసి ఉన్నది".

సోలాంగ్ అన్న మాటలకు అతని భార్య భయాందోళనలతో వణికిపోయింది. ఆపై సోలాంగ్ ఒకసారి తన ఇష్టదైవాన్ని ప్రార్థించుకుని ఆపై తన ఎడమ తొడని అంటిపెట్టుకుని ఉన్న ఆ గొంగళిపురుగుని తన కుడిచేత్తో ఇవతలికి లాగి, ఆపై దానిని నోట్లో వేసుకుని గుటుక్కున మ్రింగాడు. అతడు ఆ గొంగళిపురుగుని మ్రింగకుండా చెయ్యటానికి అతని భార్య ఎంతగానో ప్రయత్నించింది. కానీ, సోలాంగ్ ఈ పురుగుని మ్రింగేసాడు. అతడు తొందరలోనే చనిపోతాడని అర్థంచేసుకున్న అతని భార్య అతి దీనంగా రోదించటం ప్రారంభించింది. కొద్ది రోజులు గడిచాయి. సోలాంగ్‌కి ఏవిధమైన అనారోగ్య సమస్యా రాలేదు. అతడు ఎప్పటిలాగానే ఇంట్లో భోజనం చేస్తున్నాడు. నీళ్ళు త్రాగుతున్నాడు. నెల గడిచింది. అతడు మంచి ఆరోగ్యంతోనే కనపడుతున్నాడు. ఆపై అతడు 40 ఏళ్ళపాటు ఆరోగ్యంగా బ్రతికాడు. చివరికి తన 90వ ఏట అతడు మరణించాడు.

ఒక విచిత్రం ఏమంటే, సోలాంగ్‌కి మార్గ మధ్యంలో బుట్టలో దొరికిన వెండి నాణాలతోనే అతడు తన 90వ ఏట దాకా తన కుటుంబాన్ని పోషించాడు. అయినప్పటికీ ఆ "కు(KU)" పురుగు, అతడి కడుపులో ఉన్నప్పటికీ అతడిని చంపలేకపోయింది. అందుకు కారణం ఏమిటి? – తన దగ్గరకు చేరిన "కు(KU)" పురుగుని ఇతరులమీదకి

ప్రయోగించి విపరీతంగా సంపాదించాలి అన్న దురాశను సోలాంగ్ తన మనసులోకి రానియ్యలేదు. ఆ “కు(KU)” ద్వారా వచ్చిన వెండి నాణాలను ఆ దైవం తనకు ఇచ్చిన సహాయంగా భావించి వాడుకున్నాడు. ఒక రకంగా చెప్పాలంటే అతడు ధర్మ మార్గంలోనే నడిచాడు. బహుశా ఆ కారణంగానే “కు(KU)” విషప్రయోగం సోలాంగ్‌ని చంపలేకపోయింది అని నమ్మవచ్చు.

Ψ ప్రాచీన చైనాలోని చాంగ్‌చౌ జిల్లాలోని ఒక ప్రాంతంలో యాంగ్ అనే పేరుగల ఒక ధైర్యవంతుడైన పండితుడు ఉండేవాడు. “ఈ ప్రపంచంలో మానవులు అనవసరంగా ప్రతి దానికీ భయపడుతూ పిరికివాళ్ళలాగా బ్రతుకుతూ ఉంటారు. నిజానికి ఈ ప్రపంచంలో దేని గురించీ మనిషి భయపడనవసరంలేదు” అని యాంగ్ తరచుగా తన చుట్టు ప్రక్కల వాళ్ళకి చెబుతూ ఉండేవాడు. “దయ్యాలు” అంటే ప్రతి వారికీ భయమే. కానీ, నన్ను భయపెట్టే ఏ దయ్యమూ నాకు కనపడటంలేదు. నేను నా ధైర్యాన్ని పరీక్షించుకోవటానికి ఏ దయ్యమూ నాకు ఎదురు కావటంలేదు” అని యాంగ్ తరచుగా తనలో తాను బాధపడుతూ ఉండేవాడు. ఒక సమయంలో యాంగ్ కొంతమంది స్నేహితులతో కలిసి తన గ్రామానికి కొంచెం దూరంలో ఉన్న ఇంకొక గ్రామానికి ఏదో పనిమీద కాలి నడకన బయలు దేరాడు. మార్గ మధ్యంలో అతడికి రహదారిమీద ఒక సిల్క్ వస్త్రంతో కట్టిన ఒక పెద్ద మూట కనపడింది. ఆ మూటలో “కు(KU)”కు సంబంధించిన ఏదో ఒక వస్తువు ఉండి ఉంటుందని అర్థం చేసుకున్న అతడి స్నేహితులు ఆ మూటవైపు పరిశీలనగా చూడటానికి కూడా ధైర్యం చెయ్యలేదు. వారి భయాన్ని గమనించిన యాంగ్ పెద్దగా నవ్వి “నేను పేదవాడిని. నేను ఆ మూటను ఎందుకు తీసుకోకూడదు?” అన్నాడు. వాళ్ళు ఏం మాట్లాడాలో అర్థంకాక భయంతో ఆ మూటకేసి మరియు యాంగ్‌కేసి మార్చి మార్చి చూడటం ప్రారంభించారు. అప్పుడు యాంగ్, తాపీగా క్రిందకు వంగి ఆ మూటను తీసుకున్నాడు. ఆ తరువాత నేలపై కూర్చుని ఆ మూటను విప్పదీసి చూసాడు. ఆ మూటలో “చిన్న చిన్న చుట్టలుగా చుట్టబడిన కొన్ని సిల్క్ వస్త్రాలు, ఒక పెద్ద వెండి కడ్డీ మరియు “కు(KU)”కి సంబంధించిన ఒక పెద్ద కప్ప కనిపించాయి.



అప్పుడు యాంగ్ ఆ కప్పకేసి చూసి ఆపై ఆ కప్పతో "ఓ కప్పా! ఈ మూటలో ఉన్న సిల్క్ వస్త్రాల చుట్టలు మరియు వెండి కడ్డీ నేను తీసుకుంటాను. నువ్వు నాకు అక్కరలేదు. నీ ఇష్టం వచ్చినచోటుకి స్వేచ్ఛగా వెళ్ళిపో" అన్నాడు. ఆపై యాంగ్ తన మిత్రులతో "మీరు ప్రక్క గ్రామానికి వెళ్ళండి. నేను ఈ వస్తువులు తీసుకుని నా ఇంటికి వెళ్ళిపోతాను" అన్నాడు. ఆపై ఆ మిత్రులు ముందుకి వెళ్ళిపోయారు. యాంగ్ ఆ వస్తువులను తీసుకుని వేగంగా నడుస్తూ తన ఇంటికి చేరుకున్నాడు. ఆపై ఇంట్లో వారికి తాను తెచ్చిన వస్తువులు చూపించాడు. యాంగ్ తెచ్చిన వస్తువులను చూసిన అతని ఇంట్లోని వారికి విపరీతమైన భయం కలిగింది. "కు(KU)" ప్రయోగానికి సంబంధించిన వస్త్రాలను మరియు వెండిని తెచ్చుకున్న యాంగ్‌కి తీవ్రమైన ప్రమాదం ఏర్పడబోతున్నదని వాళ్ళకి వెంటనే అర్ధవయ్యింది. ఆపై వాళ్ళు, యాంగ్‌ని చూసి బాధతో ఏడవటం ప్రారంభించారు. అప్పుడు యాంగ్ పెద్ద స్వరంతో "ఎందుకు మీరందరూ నా గురించి భయపడుతున్నారు. ప్రమాదం ఏదైనా వస్తే అది నాకు మాత్రమే వస్తుంది. మీకు నా ప్రమాదం గురించి ఆలోచన అనవసరం. నా సంగతి నేను చూసుకోగలను. ముందు మీరు ఏడుపు ఆపండి" అన్నాడు. ఇక చేసేది లేక అతడి ఇంట్లోని వారు మౌనం వహించారు.

రాత్రి అయ్యింది. యాంగ్, భోజనం పూర్తిచేసుకుని ఆపై తన పడక దగ్గరకు వెళ్ళాడు. ఆ పడక మీద, దాదాపు ఒక సంవత్సరం వయస్సు ఉన్న బిడ్డ ఎంత పరిమాణంలో ఉంటుందో అంత పరిమాణంలో ఉన్న రెండు కప్పలు అతడి మంచంమీద కూర్చుని ఆపై యాంగ్‌కేసి తీక్షణంగా చూస్తున్నాయి. వాటిని గమనించిన యాంగ్ నిమిషంలో తన చేతిలోకి గొడ్డలిని తీసుకుని, ఆపై ఆ రెండు కప్పలను నాలుగు ముక్కలుగా నరికి కస కసా నమిలి మ్రింగేసాడు. ఆ దృశ్యం చూసిన అతని ఇంట్లో వారు భయంతో రోదించారు. కానీ, యాంగ్ మాత్రం చిరునవ్వులు చిందిస్తూ "నా జీవితంలో ఇప్పటి వరకు ఇంత రుచికరమైన మాంసం తినలేదు సుమా" అన్నాడు. ఆ తరువాత యాంగ్, కొంచెం మద్యాన్ని సేవించి మంచంమీద పడుకుని కొద్దిసేపట్లోనే నిద్రలోకి జారుకున్నాడు. ఆ రాత్రి, ఏ చెడు సంఘటనలు లేకుండా ప్రశాంతంగా గడిచిపోయింది.

రెండవ రోజు రాత్రి తన పడక దగ్గరకు వెళ్ళిన యాంగ్‌కి దాదాపు డజను కప్పలు ఆ పడక మీద కనిపించాయి. కాకపోతే, అవి నిన్నటి కప్పల కన్నా కొంచెం చిన్న పరిమాణంలో ఉన్నాయి. యాంగ్ వాటిని చూసి చిన్నగా నవ్వుకుని ఆపై ఆ

డజను కప్పలను వంట గదిలోకి తీసుకువెళ్ళి అప్పటికప్పుడే వండుకుని తినేసాడు. మూడవ రోజు రాత్రి పడక దగ్గరకు వెళ్ళిన యాంగ్‌కి దాదాపు 30 కప్పలు ఆ పడకమీద కనిపించాయి. ఈ కప్పలు, నిన్న కనిపించిన కప్పల కన్నా చిన్న పరిమాణంలో ఉన్నాయి. యాంగ్ ఏమాత్రం వెనకాడకుండా ఆ 30 కప్పలను కూడా వండుకుని హాయిగా ఆరగించాడు.

నాల్గవ రోజు రాత్రి చిన్న పరిమాణంలో ఉన్న 100 కప్పలు ఆ పడక మీద కనిపించాయి. వాటిని కూడా అతి కష్టంమీద యాంగ్ ఆరగించాడు. ఆ మర్నాటి రాత్రి దాదాపు పెద్ద నిమ్మకాయ పరిమాణంలో ఉన్న వందలాది కప్పలు అతడి మంచం మీద గంతులు వేస్తూ కనిపించాయి. వాటిని తినటం తనకు సాధ్యం కాదని యాంగ్ మౌనంగా ఉండిపోయాడు. కొద్ది రోజుల్లోనే అతని ఇల్లంతా కప్పలతో నిండి పోయింది. వాటిని చూసి భయపడిన అతని కుటుంబ సభ్యులు తాత్కాలికంగా ఆ ఇంటిని వదిలిపెట్టి ప్రక్క గ్రామంలో ఉన్న తమ బంధువుల ఇళ్ళకి వెళ్ళిపోయారు. ఇక చేసేది లేక యాంగ్, కొంతమంది పనివాళ్ళని తన ఇంటికి రప్పించి వాళ్ళతో ఇలా చెప్పాడు. “ఈ ఇంట్లో విశృంఖలంగా చెలరేగిపోతున్న ఈ వేలాది కప్పలను పట్టుకుని అడవికి తీసుకువెళ్ళి అక్కడ వీటిని పాతి పెట్టండి. మీకు అందుకు తగిన కూలీ ఇస్తాను” అన్నాడు. ఏదిఏమైనా “కు(KU)” ప్రయోగంవల్ల తన ఇంట్లోకి చేరిన ఆ కప్పల పీడ తనను అంతగా పీడించినా యాంగ్ ఏమాత్రం భయపడలేదు. పైగా మరింత ధైర్యాన్ని పొందాడు. ఏదిఏమైనా, ఆ పనివాళ్ళు అనేక బస్తాలలో ఆ కప్పల్ని నింపి అడవిలోకి తీసుకువెళ్ళి అక్కడ ఒకచోట గోతుల్లో పాతిపెట్టారు. మర్నాడు కూడా వేలాది కప్పలు ఇంట్లో గంతులు వేస్తూ కనిపించాయి. యాంగ్ ఏమాత్రం ఆలోచించకుండా మళ్ళీ పనివాళ్ళని పిలిపించి ఆ కప్పల్ని వాళ్ళచేత అడవిలో పాతర వేయించాడు. ఇలా నెల రోజుల పాటు జరిగింది. 31వ రోజున ఆ ఇంట్లో ఒక కప్ప కూడా కనపడలేదు. ఈ విషయం తెలుసుకున్న అతడి భార్య మరియు పిల్లలు తమ ఇంటికి తిరిగి వచ్చారు. అప్పుడు యాంగ్ తన భార్యను చూసి విచిత్రంగా నవ్వి “కు(KU)” ప్రయోగం వల్ల వచ్చే ప్రమాదం ఇంతేనా?” అన్నాడు. అప్పుడు అతని భార్య కొంచెం భయం ధ్వనిస్తున్న స్వరంతో “మనం ఒక ముళ్ళ పందిని కొనుక్కొచ్చి ఇంట్లో పెట్టుకుంటే మంచిదేమో అని నాకు అనిపిస్తున్నది” అన్నది. అప్పుడు యాంగ్ పెద్దగా నవ్వి “ఆహా! నేనే ఒక ముళ్ళపందిని. సరే, ఇంకేమి చెయ్యమంటావో చెప్పు” అన్నాడు. దాంతో అతడి కుటుంబ సభ్యులు ప్రశాంతంగా నవ్వుకున్నారు. ఆ తరువాత ఏనాడూ అతని ఇంట్లో “కు(KU)” ప్రయోగానికి సంబంధించిన కప్పలు కనపడలేదు.

తన ధైర్యంతో క్షుద్ర ప్రయోగాన్ని ఎదుర్కొన్న యాంగ్ గొప్పతనం గురించి ఆ ప్రాంత ప్రజలు చాలాకాలంపాటు కథలు కథలుగా చెప్పుకున్నారు.

Ψ ప్రాచీన చైనాలోని చువాన్‌చౌ అనే పట్టణంలో ప్రాచీన కాలానికి చెందిన ఒక భవనం ఉండేది. ఆ భవనంలోని వివిధ అంతస్తులలో కొన్ని కుటుంబాలు అద్దెకి ఉంటూ ఉండేవి. ఆ కుటుంబాలలో లిన్ అనే ఒక వ్యక్తి కుటుంబం కూడా ఉన్నది. ఈ లిన్ ఒకరోజు రాత్రి తన ఇంట్లోంచి బైటకు వచ్చి, ఎదురుగుండా ఉన్న రోడ్డుమీద నడుచుకుంటూ వెళుతున్నాడు. ఆ సమయంలో అతనికి రోడ్డు ప్రక్కన బాగా పాతదిగా కనిపిస్తున్న ఒక పెద్ద వెదురుబుట్ట కనిపించింది. లిన్, సరదాగా ఆ బుట్టని తన కుడి కాలితో బలంగా తన్నాడు. దాంతో ఆ బుట్ట ప్రక్కకి దొర్లింది. ఆపై ఆ బుట్టమూత తెరుచుకున్నది. లిన్, ఆసక్తిగా ఆ బుట్ట దగ్గరకువెళ్ళి ఆ బుట్టలోకి తొంగి చూసాడు. ఆ బుట్ట లోపల దాదాపు పదివేల వెండి నాణాలు ఉన్నాయి. ఆ సమయంలో చుట్టు ప్రక్కల ఎవరూ లేకపోవటంతో లిన్, చాలా హుషారుగా ఆ బుట్టని చేతిలోకి తీసుకుని ఆపై తన మనసులో "ఈ వెండి నాణాలను ఆ దైవం నాకు పంపించి ఉంటుంది" అని అనుకుని, ఆపై ఆ బుట్టతో సహా తన ఇంట్లోకి వెళ్ళిపోయాడు. లిన్‌కి వెండి నాణాలతో ఉన్న బుట్ట దొరికిన విషయం ఆ భవనంలో ఉన్న అందరికీ తెలిసి పోయింది. అప్పుడు ఆ భవనం యజమాని అయిన వృద్ధుడు, లిన్ దగ్గరకు వచ్చి ఆపై ఆందోళన నిండిన స్వరంతో లిన్‌తో "బిడ్డా! నీకు వెండి నాణాలు దొరికాయని సంతోషిస్తున్నావు. కానీ, ఇవి మామూలు వెండి నాణాలు కాదు. "చిన్–షాన్" ప్రయోగంతో మంత్రించబడిన వెండి నాణాలు అని తెలుసుకో. ఎందరినో "చిన్–షాన్" ప్రయోగంతో నాశనంచేసి, గొప్ప సంపన్నుడిగా మారిన ఎవరో ఒక వ్యక్తి, మొదట తనకి ఎన్ని నాణాలు దొరికాయో అన్ని నాణాలను చిన్–షాన్ ప్రయోగంతో మంత్రించి ఆపై వాటిని ఒక బుట్టలో పెట్టి రోడ్డు ప్రక్కన ఉంచి ఉంటాడు. ఏదిఏమైనా, నీవు ఆ నాణాలను తీసుకున్నావు కనుక ఆ సంపన్నుడిని వదిలిపెట్టిన చిన్–షాన్ ప్రయోగానికి చెందిన పిశాచి తప్పనిసరిగా రేపు రాత్రిలోగా నీ దగ్గరకు వస్తుంది. నువ్వు ఆ పిశాచికి తగినవిధంగా సేవలు చేస్తే నువ్వుకూడా కొద్దికాలంలోనే గొప్ప సంపన్నుడివి అవుతావు. ఆపై ఆ పిశాచిని ఇంకొకరికి బదిలీచెయ్యి. నీవు ఏ కారణంచేతైనా ఆ పిశాచిని తిరస్కరించినట్లయితే నీకు దాని వలన ప్రాణహాని ఉంటుందని మర్చిపోకు" అన్నాడు.

భవన యజమాని చెప్పిన విధంగానే రెండవ రోజు రాత్రి, దాదాపు 10 అడుగుల పొడవు ఉన్న మరియు బంగారం రంగులో మెరిసిపోతున్న ఒక త్రాచుపాము

జరజరా పాకుతూ లిన్ పడక గదిలోకి వచ్చింది. అలాంటిది ఏదో ఒకటి, ఈ రాత్రి తన దగ్గరకు వస్తుందని అంచనా వేస్తున్న లిన్ ఆ త్రాచుపాముని చూసి పెద్దగా ఆశ్చర్యపోలేదు. అతడు వేగంగా కదిలి ఆపై ఆ త్రాచుపాము పడగ క్రింద భాగాన్ని చేత్తో వడిసి పట్టుకుని ఆ పాముని గాలిలోకి లేపాడు. ఆపై ఆ త్రాచుపాము కళ్ళలోకి సూటిగా చూస్తూ "నీవు "చిన్-షాన్" ప్రయోగానికి సంబంధించిన పిశాచివే కదూ. నేను నీకు ఎట్టి పరిస్థితుల్లోను సేవ చెయ్యను. అనగా, నీకు తృప్తి కలగటంకోసం ఇతరులకు "కు(KU)" విషాన్ని "చిన్-షాన్" ప్రయోగం ద్వారా తినిపించి, ఆపై నీ ద్వారా మహా సంపన్నుడిని కావటం నాకు ఇష్టంలేదు. నిన్ను తృప్తి పరచకపోతే నువ్వు నన్ను మింగేస్తావని నాకు తెలుసు. కానీ, నువ్వు నన్ను మింగేలోగా నేనే నిన్ను తినేస్తాను" అన్నాడు.

లిన్ అన్న మాటలు విన్న ఆ త్రాచుపాము ఏదో సౌంజ్ఞను తన పడగతో చేసే ప్రయత్నంలో ఉండగా లిన్ ఆ త్రాచుపాము పడగని తన నోట్లో పెట్టుకుని కసకసా నమిలి మింగాడు. ఆపై ఆ త్రాచుపాము శరీరంలో ఒక చిన్న ఎముక కూడా మిగలకుండా మొత్తం పాముని తినేసాడు. ఆ తరువాత తన భార్యచేత ద్రాక్షసారా తెప్పించుకుని బాగా మత్తు ఎక్కేదాకా త్రాగి ఆపై తన మంచంపై పడిపోయాడు. మర్నాడు ఉదయం సూర్యోదయ సమయానికి లిన్‌కి మెళుకువ వచ్చింది. విషపూరితమైన ఆ త్రాచుపాముని తిన్నప్పటికీ లిన్‌కి ఏమీ కాలేదు. లిన్ ప్రదర్శించిన ధైర్యాన్ని చూసి ఆ భవనంలో ఉంటున్న అన్ని కుటుంబాల వారు లిన్‌ని ధర్మాత్ముడు, ధైర్యవంతుడు అని ప్రశంసించారు. ఏదిఏమైనా, "చిన్-షాన్" ప్రయోగం ద్వారా తనకు లభించిన వెండి నాణాలతో లిన్, చిన్నస్థాయి ధనవంతుడిగా మారి చాలాకాలంపాటు హాయిగా జీవించాడు.

Ψ షియాంగ్ అనే చిన్నస్థాయి పట్టణంలో సెంగ్ అనే పేరుగల ఒక వృద్ధుడు నివసిస్తూ ఉండేవాడు. అతడు ఒకరోజున తన పట్టణంలోని ఒక రోడ్డుమార్గంలో నడిచి వెళుతున్నప్పుడు ఒకచోట రోడ్డు ప్రక్కన ఒక వెదురు బుట్ట కనిపించింది. సెంగ్ ఇంకేమీ ఆలోచించకుండా ఆ వెదురుబుట్టని తీసుకుని ఇంటికి వచ్చేసాడు. ఇంటికి వచ్చిన తరువాత ఆ బుట్టను తెరిచి చూడగా అందులో దాదాపు 5 కేజీల బరువు ఉన్న 12 స్వచ్ఛమైన వెండి కడ్డీలు కనిపించాయి. ఆ వెండి కడ్డీలు ఉన్న బుట్ట ఖచ్చితంగా "చిన్-షాన్" ప్రయోగానికి సంబంధించినది అని సెంగ్‌కి అర్థమైపోయింది. రాత్రి అయిన తరువాత అందరూ నిద్రపోతున్నారు. సెంగ్ ఒక్కడే నిద్రపోకుండా ఒక

కుర్చీలో కూర్చుని, తన ఎదురుగా ఉన్న బల్లమీద ఉన్న వెదురు బుట్టని పరిశీలనగా చూస్తున్నాడు. అర్ధరాత్రి దాటిన తరువాత ఒక అందమైన యువకుడు, సెంగ్ ముందు ప్రత్యక్షం అయ్యాడు. ఆ యువకుడి చుట్టూ బంగారం రంగు వెలుగు కనిపించింది. అలా సెంగ్ ముందు ప్రత్యక్షం అయిన ఆ యువకుడు గంభీరమైన స్వరంతో సెంగ్‌తో ఇలా అన్నాడు. "నువ్వు వెంటనే నీ ఇంటి పూజా మందిరంలో ఉన్న నీ ఇష్టదైవం బుద్ధుడి విగ్రహం ముందు సాంబ్రాణి వెలిగించి ధూపం వెయ్యి. ఈ రోజు నుండి సరిగ్గా 21వ రోజున ఎవరో ఒక వ్యక్తికి విషంపెట్టి చంపుతానని ఆ దైవం ముందు ప్రమాణంచేసి చెప్పు". ఆ యువకుడిని మరియు అతడు అన్న మాటలను వినగానే సెంగ్‌కి స్పష్టంగా ఒక విషయం అర్థమైపోయింది. అది ఏమిటంటే..."ఆ యువకుడు మనిషి కాదని, "చిన్-షాన్" ప్రయోగానికి సంబంధించిన క్షుద్రశక్తి" అని. మొదట, సెంగ్‌కి యువకుడి రూపంలో ఉన్న ఆ క్షుద్రశక్తిని చూసి చాలా భయం కలిగింది. అయినప్పటికీ తోటి మనిషిని విషం పెట్టి చంపటానికి మానవత్వం కలిగిన సెంగ్ అంగీకరించలేదు. ఎలాగో ధైర్యం కూడదీసుకుని సెంగ్ ఆ క్షుద్రశక్తితో "నేను తోటి మనిషిని నిష్కారణంగా చంపటానికి ఏమాత్రం అంగీకరించను" అన్నాడు.

అయినప్పటికీ, ఆ క్షుద్రశక్తి, సెంగ్‌ని అనేక రకాలుగా భయపెట్టింది. బెదిరించింది. చివరికి సెంగ్ ఆ క్షుద్రశక్తి చెప్పినట్లుగా ప్రమాణం చేసాడు. కాలం వేగంగా గడిచిపోయింది. 21వ రోజు వచ్చింది. ఆ రోజు ఉదయం సెంగ్, అల్లుడు ఏదో పనిమీద సెంగ్ ఇంటికి వచ్చాడు. అది గమనించిన ఆ క్షుద్రశక్తి ఆ అల్లుడు తినబోతున్న ఆహారంలో విషం కలిపింది. ఆ విషయం తెలియని సెంగ్ ఎంతో అభిమానంతో తన అల్లుడికి ఆ ఆహారాన్ని ఇచ్చాడు. ఆ అల్లుడు ఆ ఆహారం తిని కాసేపు అక్కడే విశ్రాంతి తీసుకుని సాయంత్రానికి తన ఇంటికి తిరిగి వెళ్ళిపోయాడు. అలా ఇంటికి తిరిగి వెళ్ళిన సెంగ్ అల్లుడికి విపరీతమైన కడుపునొప్పి వచ్చింది. ఆ నొప్పి తట్టుకోలేక అతడు నేలమీదపడి గిలగిలా కొట్టుకోసాగాడు. ఈ విషయం ఎవరిద్వారానో తెలిసిన సెంగ్ ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా అల్లుడి ఇంటికివెళ్ళి, ఆపై తనతోపాటు తెచ్చిన ఒక ఔషధాన్ని అల్లుడిచేత త్రాగించాడు. (ఆ ఔషధం, "చిన్-షాన్" ప్రయోగం ద్వారా శరీరంలో చేరిన విషాన్ని నిర్మూలిస్తుంది. అనగా "చిన్-షాన్" ప్రయోగానికి ఆ ఔషధం విరుగుడు అన్నమాట.) ఏదిఏమైనా సెంగ్, విరుగుడు ఔషధం ఇచ్చి తన అల్లుడిని బ్రతికించుకున్నాడు. ఈ విషయం గ్రహించిన "చిన్-షాన్" ప్రయోగ సంబంధ క్షుద్రశక్తి, అర్ధరాత్రి సమయంలో సెంగ్ దగ్గరకు వచ్చి అతడిమీద తీవ్రమైన ఆగ్రహాన్ని ప్రదర్శించింది. అప్పుడు సెంగ్ దీనమైన స్వరంతో ఆ క్షుద్రశక్తితో "నువ్వు

విషం పెట్టింది సాక్షాత్తు నా అల్లుడికి. నా అల్లుడు చనిపోతే నా కూతురు అనాథ అవుతుంది. ఆమెకు పిల్లలు కూడా లేరు. ఆమెకు అన్యాయం జరగకూడదు అన్న ఉద్దేశంతోనే నా అల్లుడికి చేతబడి విరుగుడికి ఔషధం ఇచ్చాను" అన్నాడు. సెంగ్ అన్న మాటలను నిశ్శబ్దంగా విన్న ఆ క్షుద్రశక్తి అప్పటికి ఏమీ మాట్లాడకుండా వెళ్ళిపోయింది. సరిగ్గా వారం రోజుల తరువాత ఒక అర్ధరాత్రి సమయంలో సెంగ్ దగ్గరకు మళ్ళీ వచ్చిన ఆ క్షుద్రశక్తి, సెంగ్‌తో ఇలా అన్నది. "ఇవాల్టికి మూడవ రోజున నీ ఇంటికి ఎవరైనా వస్తే ఆ వ్యక్తికి తప్పనిసరిగా నీవు విషంపెట్టి చంపాలి. ఇది నా ఆజ్ఞ".

సెంగ్ మౌనంగా ఉండిపోయాడు. సరిగ్గా మూడవ రోజు మధ్యాహ్న సమయంలో సెంగ్ చెల్లెలు కొడుకు అతని ఇంటికి వచ్చాడు. అది గమనించిన ఆ క్షుద్రశక్తి, సెంగ్ చెల్లెలు కొడుకు తినబోతున్న ఆహారంలో విషం కలిపింది. అది తెలియని సెంగ్ తన మేనల్లుడికి ఆహారం ఇచ్చాడు. కాసేపటి తరువాత ఆ మేనల్లుడు తన ఊరికి తిరిగి వెళ్ళిపోయాడు. అలా వెళ్ళిన కొంతసేపటికే అతడికి విపరీతమైన కడుపునొప్పి వచ్చింది. దాదాపు చనిపోయే పరిస్థితి అతనికి ఏర్పడింది. ఈ విషయం తెలుసుకున్న సెంగ్ వెంటనే తన మేనల్లుడి ఇంటికివెళ్ళి అతడికి విరుగుడు ఔషధం ఇచ్చి, అతడిని మరణం బారి నుండి రక్షించాడు. ఆ రోజు రాత్రి అర్ధరాత్రి సమయంలో ఆ క్షుద్రశక్తి, సెంగ్ ముందు ప్రత్యక్షం అయి తీవ్రమైన క్రోధంతో నిండిన స్వరంతో సెంగ్‌తో ఇలా అన్నది. "నీ దైవం ముందు ప్రమాణంచేసి, ఒక వ్యక్తికి విషంపెట్టి చంపుతానని నాకు మాట ఇచ్చావు. కానీ, నీవు ఆ విషానికి విరుగుడు ఇచ్చి ఆ వ్యక్తిని రక్షించావు".

ఆ క్షుద్రశక్తి అన్న మాటలను ఎంతో భయంతో విన్న సెంగ్, వణుకుతున్న స్వరంతో ఆ క్షుద్రశక్తితో "నా చెల్లెలికి ఆ కొడుకు తప్పించి ఇంకొక తోడు అంటూ లేదు. వాడు చనిపోతే నా చెల్లెలు ఏకాకి అయిపోతుంది. అందుకే నేను నా మేనల్లుడిని నీవు ఇచ్చిన విషం బారి నుండి రక్షించాను" అన్నాడు. ఆ క్షుద్రశక్తి తీవ్రమైన ఆగ్రహంతో సెంగ్‌కేసి చూసి వికృతంగా అరిచింది. అప్పుడు సెంగ్ ధైర్యాన్ని చిక్కబట్టుకుని ఆపై పెద్ద స్వరంతో ఆ క్షుద్రశక్తితో "ఓ పిశాచి! నువ్వు చెప్పినట్లుగా, నేను నా తోటి మానవుల్ని నిష్కారణంగా విషంతో చంపలేను. నువ్వు చెప్పే పాపాలు చెయ్యటం నా వల్లకాదు. అయ్యింది ఏదో అయ్యింది. నీ ద్వారా వచ్చిన వెండి నాణాలను నీకు తిరిగి ఇచ్చేస్తాను. నువ్వు నన్ను వదిలిపెట్టి వెళ్ళిపో. ఇంకెవరినైనా పట్టుకో" అన్నాడు. అప్పుడు ఆ క్షుద్రశక్తి వికృతంగా నవ్వి ఆపై "నేను నీ దగ్గరకు

వచ్చిన తరువాత నీ పొల్లాల్లో పంటలు విపరీతంగా పండాయి. దానివల్ల నువ్వు ఎంతో లాభం పొందావు. కనుక, నా ద్వారా నువ్వు ఎన్ని వెండి నాణాలు పొందావో, వాటికి 30% అధికంగా వడ్డీవేసి నాకు ఇవ్వు. అప్పుడే నేను నిన్ను వదిలిపెట్టి వెళ్ళిపోతాను" అన్నది. ఆ మర్నాడు ఉదయమే సెంగ్, తనకు బుట్టలో దొరికిన వెండి నాణాలతో పాటుగా వడ్డీగా చెల్లించటానికి కావలసిన వెండి నాణాలకోసం తన పొలాన్ని అమ్మేశాడు. అలా అమ్మటం వల్ల వచ్చిన వెండి నాణాలను మరియు తనకు గతంలో దొరికిన వెండి నాణాలను కలిపి ఒక బుట్టలో పెట్టి ఆ రోజురాత్రి 12 గంటల సమయంలో తన ఇంటికి కొంచెం దూరంలో ఉన్న ఒక ప్రదేశంలో వదిలిపెట్టి ఆపై వెనక్కి తిరిగి చూడకుండా ఇంటికి వచ్చేసాడు. ఆ తరువాత ఏనాడూ ఆ క్షుద్రశక్తి, సెంగ్‌కి కనపడలేదు.

**ముగింపు** – ప్రాచీన చైనాలో క్షుద్ర విద్యలు ఎంత ప్రమాదకరమైన స్థాయిలో ఉండేవి అన్న విషయం పైన చెప్పుకున్న యదార్ధ గాధలను బట్టి మనం అర్ధం చేసుకోవచ్చు. ఆ కాలంనాటి చరిత్ర కారులు ఈ యదార్ధ గాధలను తాము ప్రత్యేకంగా రచించిన గ్రంధాలలో లిఖించారు. చైనాలోని కొన్ని ప్రాంతాలలో "కు(KU)" అనే పేరుతోను, మరి కొన్ని ప్రాంతాలలో "చిన్-షాన్" అనే పేరుతోను పిలువబడిన ఈ క్షుద్ర ప్రయోగాలు ఆకాలంలో ఎంతోమందిని గజగజలాడించాయి.

''కు(KU)'' ప్రయోగాన్ని ప్రధానంగా సంపదలను పొందటానికి ఉపయోగించేవాళ్ళు. కొద్దిమంది మాత్రం ఈ క్షుద్ర ప్రయోగాన్ని తమ శత్రువులను ఆధారాలు లేకుండా చంపటంకోసం ఉపయోగించటం జరిగింది. ఎవరైనా వ్యక్తి, "కు(KU)" ప్రయోగాలకు పాల్పడినట్లుగా రుజువు అయినట్లయితే ఆ వ్యక్తిని ఘోరమైన నేరస్తుడిగా ప్రకటించటమే కాకుండా ఆ వ్యక్తితోపాటుగా అతని కుటుంబ సభ్యులను కూడా అతి దారుణంగా చంపించటం మరియు ఆ వ్యక్తియొక్క ఆస్థులను స్వాధీనం చేసుకోవటం జరిగేది.

"కు(KU)" ప్రయోగాలను ఎదుర్కోవటంకోసం ఆనాటి చైనీయులు అనేక మార్గాలను కనుక్కొన్నారు. కొన్నిరకాల వృక్ష సంబంధ ఔషధాలను, చేతబడిని తిరగ్గొట్టే మంత్రాలతో అభిమంత్రించి, ఆపై వాటిని "కు(KU)" ప్రయోగంతో బాధపడుతున్న వారికి ఇవ్వటం జరిగేది. ఫలితంగా, "కు(KU)" ప్రయోగం భగ్నం అయ్యేది. ఇక, మహాయాన బౌద్ధమత సాధువులు తమకు తెలిసిన మంత్రాలతో మరియు దైవ సంబంధ ప్రార్ధనలతో "కు(KU)" ప్రయోగాలను నిర్వీర్యం చెయ్యటం జరిగేది.

19వ శతాబ్దం చివరి భాగంలో కొందరు చైనా పరిశోధకులు జరిపిన పరిశోధనలలో "కు(KU)" నిజంగా ఉన్నట్లుగా నిర్ధారించారు. ఇప్పటికీ చైనా లోని మారుమూల ప్రాంతాలలో "కు(KU)" ప్రయోగాలను చెయ్యగల మంత్రవాదులు ఉన్నారని చెబుతారు. ఏదిఏమైనా, చెడు మార్గాలలో అనగా ఇతరుల్ని చంపి లేదా నాశనంచేసి సంపాదించిన సొమ్ము – తాత్కాలికంగా సమాజంలో గౌరవాన్ని, స్థాయిని ఇస్తుందేమో కాని, దీర్ఘకాలంలో, అలాంటి కార్యాలు చెయ్యటం వల్ల వచ్చే పాపం ఆ కార్యాలను చేసిన వాళ్ళని మాత్రమే కాక, వాళ్ళ కుటుంబాలను కూడా సర్వనాశనం చేస్తుందని మర్చిపోకూడదు. ఎప్పటికైనా ధర్మమార్గంలో పైకి వచ్చినవాళ్ళు మాత్రమే జీవితాంతం సుఖంగా ఉంటారని అలాంటి వారే మంచి వాళ్ళుగా చరిత్రలో నిలిచి పోతారని మరచిపోకూడదు.



# 7. ప్రాచీన భారతదేశ తంత్ర రహస్యాలు?

భారతదేశంలో లభించే తంత్రశాస్త్రాలలో చాలా గ్రంథాలకు రచయితలు ఎవరో ఈనాటికీ తెలియదు. దైవం నుండి తంత్రశాస్త్రాలు మానవులకు లభించాయని, అందువలన వాటికి కర్తగా ఉండే రచయితలు ఉండరని, జ్ఞానులు ఉద్ఘాటిస్తున్నారు. తంత్రశాస్త్రాలలో అనేక రకాలు ఉన్నాయి. ఆగమ, నిగమ, యామల అనే మూడు రకాలుగా తంత్రశాస్త్రాలు విభజించబడ్డాయి. సాధారణంగా, ఏ తంత్రశాస్త్రంలో అయినా – శాస్త్ర విషయాలు, ఇద్దరు వ్యక్తుల మధ్య జరిగే సంభాషణల రూపంలో ఉంటాయి.

"ఆగమ" అని పిలువబడే వర్గానికి చెందిన తంత్రశాస్త్రాలలో పరమశివుడు, పార్వతీదేవికి అనేక రకాల మంత్ర, తంత్రాల గురించి సంభాషణల రూపంలో వివరిస్తాడు. ఈ ఆగమ గ్రంథాలు నాలుగు భాగాలుగా విభజించబడి ఉంటాయి. ప్రతి ఆగమ గ్రంథములోని మొదటి భాగం ఆధ్యాత్మిక జ్ఞానానికి సంబంధించి ఉంటుంది. ఈ విషయంలో ఈ భాగం "ఉపనిషద్"లను పోలి ఉంటుంది. ఇక, రెండవ భాగం యోగశాస్త్రానికి సంబంధించిన రహస్యాలను తెలియజేస్తుంది. ఆపై మూడవ భాగం యజ్ఞ, యాగాదుల గురించి, వివిధ రకాల ఆరాధనల గురించి వివరిస్తుంది. ఇక, నాల్గవ భాగం – మనిషి వ్యక్తిగతంగా ఎలాంటి లక్షణాలను

కలిగి ఉండాలి?, స్వభావాన్ని కలిగి ఉండాలి? సమాజంలో ఎలా ప్రవర్తించాలి? అన్న విషయాల గురించి వివరిస్తుంది. ఇక, "నిగమ" వర్గానికి చెందిన తాంత్రిక గ్రంధాలలో పార్వతీదేవి, తంత్రశాస్త్ర రహస్యాలను పరమశివుడికి సంభాషణ రూపంలో తెలియజేస్తుంది. తాంత్రిక గ్రంధాలు మూడు వర్గాలుగా విభజించ బడ్డాయి. అందులో మొదటి వర్గాన్ని "శైవ ఆగమాలు" అని పిలుస్తారు. ఈ వర్గానికి చెందిన గ్రంధాలకు పరమశివుడు అధిపతిగా ఉంటాడు. రెండవ వర్గంపేరు "వైష్ణవ ఆగమాలు" అని గుర్తించాలి. ఈ ఆగమాలను "పంచరాత్ర" అనే పేరుతో పిలుస్తారు. ఈ వర్గానికి చెందిన గ్రంధాలకు మహావిష్ణువు అధిపతిగా ఉంటాడు. ఇక, మూడవ వర్గానికి చెందిన ఆగమాలను 'శక్త' ఆగమాలు అని పిలుస్తారు. ఈ వర్గానికి చెందిన గ్రంధాలకు పార్వతీదేవి యొక్క తొలి రూపం అయిన ఆదిపరాశక్తి అధిపతిగా ఉంటుంది. భారతదేశానికి చెందిన ఈ మూడు రకాల గ్రంధాలే కాక, దాదాపు 25 శతాబ్దాల క్రితం టిబెట్ దేశంలోని కొందరు మహాయాన బౌద్ధమత సన్యాసులు కొన్ని తాంత్రిక గ్రంధాలను రచించారు. భారతదేశంలో సంస్కృత భాషలో రచించబడిన కొన్ని తాంత్రిక గ్రంధాలు, భారతదేశం నుండి టిబెట్‌కి వెళ్ళే బౌద్ధ భిక్షువుల ద్వారా టిబెట్‌కి చేరాయి. ఆ గ్రంధాలను అక్కడ ఉన్న టిబెటన్ బౌద్ధమత మంత్రవాదులు టిబెట్ భాషలోకి అనువదించారు. ఫలితంగా, భారతదేశానికి చెందిన అనేక తాంత్రిక మంత్రాలు మరియు ప్రయోగాలు టిబెట్ దేశంలోని మహాయాన మతంలోకి ప్రవేశించాయి.

తంత్రశాస్త్రాలలో వామపక్ష (లెఫ్ట్‌హాండ్ పాత్) మరియు దక్షిణపక్ష (రైట్‌హాండ్ పాత్) అనే రెండు రకాలు ఉన్నాయి. భారతదేశం, చైనా, ఆఫ్రికా, ఐరోపా, ఇతర ఆసియాదేశ మత సాంప్రదాయాలలో "కుడి" (రైట్) భాగం పురుషుడికి సంబంధించినదిగాను, "వామ/ఎడమ" అనేభాగం స్త్రీలకు సంబంధించినదిగాను గుర్తించటం జరిగింది. బహుశా ఆ కారణంగానే, అటు, పాశ్చాత్య, ఆఫ్రికా తాంత్రిక దేవతలకు మరియు హైందవ దేశంలో ఆరాధించే తాంత్రిక దేవతలకు నైవేద్యాలను, పూలను ఎడమ చేత్తో సమర్పించటం జరుగుతుంది. ఒక విషయం ఏమంటే, వామపక్ష తంత్ర మతానికి చెందిన దేవతల్ని ఆరాధించే స్త్రీలు మరియు పురుషులు కూడా తమ ఎడమ చేత్తోనే దేవతల్ని పూజించాలి అని చెబుతారు. ఇక, ప్రాచీన చైనాకు చెందిన "ఫెంగ్‌షూయ్" అనే తాంత్రిక వాస్తుశాస్త్రంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, తమ పడకమీద స్త్రీలు ఎడమవైపు వత్తిగిల్లి/ఎడమవైపు తిరిగి పడుకోవాలి. ఇక, పురుషులు తమ కుడివైపు తిరిగి పడుకోవాలి. ఈవిధంగా

చేసినట్లయితే స్త్రీ మరియు పురుషుల ఆరోగ్యం చక్కగా ఉంటుందని తెలుస్తున్నది. ఇంకొక విచిత్రం ఏమంటే, కొన్ని దేవతా, దైవ సంబంధ మంత్రాలను కుడివైపు నుండి ఎడమవైపుకు చదివినట్లయితే అవి తీవ్రమైన క్షుద్ర మంత్రాలుగా మారతాయని చెబుతారు.

**స్వేచ్ఛాచార :** ఆధ్యాత్మికత కలిగిన తంత్రసాధకులు, స్వేచ్ఛాచారులుగా ఉండాలి. సాధకుడు లేదా సాధకురాలు తమ ఇష్టం వచ్చినట్లుగా ప్రవర్తించటానికి హక్కులు కలిగి ఉన్నారు. సాధకురాలు 'శక్తి' యొక్క రూపం. సాధకుడు, శివుడి యొక్క 'ప్రతిరూపం' అయి ఉన్నారు. కనుక, ఆ శివ మరియు శక్తుల మధ్య నైతికత (మోరాలిటి) అనే మాటకు స్థానం లేదు. ఇతరులు ఏది చేస్తే దాన్ని అనుసరిస్తూ వెళ్ళిపోయే మానవులు (వాళ్ళు సాధకులు కూడా కావొచ్చు) వారి యొక్క మనసుకి బందీలుగా ఉంటారు వీరినే పశువులు అని తంత్రశాస్త్రం పిలుస్తారు.

“యోనితంత్ర” అనే ప్రాచీన తాంత్రిక గ్రంథంలోని 7వ అధ్యాయంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, స్వేచ్ఛాచార విధానాన్ని పాటించే సాధకులు ఏవిధమైన సాంప్రదాయాలకు బందీలు కారు. అంతేకాకుండా, స్త్రీ సాధకులకు మరియు పురుష సాధకులకు మధ్య ఏవిధమైన అరమరికలు, కట్టుబాట్లు ఉండవు. ఒకవిధంగా చెప్పాలంటే, ఒక అవధూత ప్రవర్తించే విధానమే “స్వేచ్ఛాచారం” అని చెప్పవచ్చు. దత్తాత్రేయుడు, భారతదేశంలో ఒక గొప్ప మహా అవధూతగా గుర్తించబడ్డాడు. అవధూత ఎల్లప్పుడూ ఒక మహదానంద స్థితిలో ఉంటాడు. అవధూతని గుర్తు పట్టటం సాధారణ మానవులకు సాధ్యంకాదు. ఎందుకంటే, అవధూత తన ఇష్ట ప్రకారం లోకానికి కనిపిస్తూ ఉంటాడు. ఒక సమయంలో పిచ్చివాడుగాను, ఒక సమయంలో మూగవాడిగాను, ఒక సమయంలో పక్షవాతం వచ్చినవాడిగాను ప్రజలకు దర్శనమిస్తాడు. అంతేకాకుండా, కొన్నిసార్లు చాలా మంచివాడుగాను, కొన్నిసార్లు ఒక భూతంలాగాను ప్రవర్తిస్తాడు. అందువల్ల ఎవరు అవధూత? – అని అంచనా వెయ్యటం అందరికీ సాధ్యంకాదు. కానీ, యోగి విషయానికి వచ్చినట్లయితే యోగి ఎల్లప్పుడూ స్వచ్ఛంగా ఉంటాడు. ఆయన స్వచ్ఛమైన మాటలు మాట్లాడతాడు, స్వచ్ఛమైన జీవన విధానాన్ని కలిగి ఉంటాడు. అందువలన యోగి వేరు, అవధూత వేరు అని గుర్తించాలి. అవధూతలకు 'మడి–మైల' అనే తేడా ఉండదు. ఈ సృష్టిలోని అన్ని అంశాలు, జీవులు – అవధూతకి సమానంగా కనిపిస్తాయి.

**కాళీ రూపంయొక్క అంతరార్థం :** అతి భయంకరమైన రూపంతో, అంతకన్నా భయంకరమైన అలంకారాలతో కనిపించే కాళికాదేవి యొక్క రూపం వెనకాల నిగూఢమైన వేదాంత అర్థం దాగి ఉన్నదని చెబుతారు. అది ఎలాగంటే, రతి మరియు మన్మధుడు అనే ఇద్దరి పైన కాళికాదేవి నిలబడి ఉంటుంది. దాని అర్థం ఏమంటే, సృష్టికి కారణభూతం అయిన కామవాంఛకు ప్రతీక అయిన రతీమన్మధులకు తాను అధిపతిని అని కాళి సూచిస్తున్నది.

ఇక, ఆమె మెడలో ఉండే కపాలమాల – జ్ఞానానికి మరియు శక్తికి ప్రతీకగా ఉంటుంది. ఆమె నోటి నుండి బైటకు వ్రేలాడుతూ కనిపించే రక్తవర్ణ నాలుక ఆమె యొక్క రజోగుణ శక్తికి ప్రతీకగా ఉంటుంది. ఇక, ఆమె చేతులలో ఉండే వెడల్పాటి కత్తి మరియు శిరస్సు – వినాశనానికి, సృష్టి అంతానికి ప్రతీకలుగా ఉంటాయి. ఇతర చేతులలో ఉండే కత్తి మరియు డాలు – సాధకుడు తన అహంకారాన్ని(ఈగో) నశింపచేసుకోవాలని సూచిస్తాయి. ఇక, ఆమె మెడలో ధరించే మానవ హస్తాల మాల, సాధకుడి యొక్క కర్మను, సాధకుడు చేసే పనులను సూచిస్తాయి.

**గణచక్ర :** తాంత్రిక సాధన నిమిత్తం, వృత్తాకారంలో వేసిన ఒక ముగ్గుపైన – వృత్తాకారంలో కూర్చున్న తంత్రసాధకులను సంస్కృత భాషలో 'గణచక్ర' అనే పేరుతో పిలుస్తారు. ఈ గణచక్రానికే గణపూజ, చక్రపూజ, గణచక్ర పూజ అనే ఇతర పేర్లుకూడా ఉన్నట్లుగా తెలుస్తున్నది. వృత్తాకారంలో కూర్చున్న సాధకులు – స్త్రీ, పురుష భేదం లేకుండా అనేక రకాల తాంత్రిక సాధనలు చేస్తారు. సాధారణంగా, ఈ గణచక్ర పూజలో సాధకులకు ఒక ప్రత్యేకమైన విందు ఉంటుంది. ఈ విందులో – సాంప్రదాయ సమాజం నిషేధించిన ఆహార పదార్థాలు వడ్డించబడతాయి. టిబెట్‌కి చెందిన వజ్రయాన బౌద్ధమతంలో కూడా ఈ "గణచక్ర పూజలు" ఉండటం ఒక విశేషంగా గమనించాలి.

గణచక్రంలో కూర్చున్న స్త్రీ మరియు పురుష సాధకులు, ఎముకలతో తయారుచేసిన ఆభరణాలను మరియు కిరీటాలను ధరిస్తారు. ఈ సాధకులకు గురువుగా ఉండే ప్రధాన సాధకుడిని "చక్రేశ్వరుడు" అని పిలుస్తారు. ఆయనకు ఎడమవైపున ఆయన తాంత్రిక సాధనా భాగస్వామి అయిన ఒక స్త్రీ సాధకురాలు కూర్చుని ఉంటుంది. చక్ర పూజా ప్రక్రియ మధ్య దశలోకి వచ్చేసరికి గణచక్రం మధ్యభాగంలో ఉండే ప్రధాన సాధకుడు అనగా గురువు – తన తంత్ర సాధనా భాగస్వామితో, తంత్రశాస్త్రంలో చెప్పబడిన విధంగా తాంత్రిక శృంగార సంభోగం కొనసాగిస్తాడు.

(గణచక్ర పూజను సాత్విక విధానంలో చేసేవాళ్ళు గణచక్రం మధ్యలో శృంగార సంభోగం చెయ్యకుండా, తాము ఆరాధించే తాంత్రిక దేవతయొక్క మంత్రాన్ని పెద్ద స్వరంతో జపించటం జరుగుతంది.) ఈ చక్రపూజ ముగిసే సమయంలో, ఈ వృత్తంలోకి ప్రవేశించిన – కొందరు స్త్రీ, పురుష సాధకులు, మనసుని ఇంకొక లోకానికి తీసుకువెళ్ళే వాయిద్యాలను మ్రోగిస్తూ, తాంత్రిక సంబంధమైన నృత్యాలను చేస్తారు. ఇక, గణచక్రంలో కూర్చుని ఉన్న సాధకులకు మాంసంతో వండిన ఆహార పదార్థాలు మరియు మద్యం ఇవ్వబడుతుంది. (కొన్ని ప్రాంతాలలో జరిగే చక్ర పూజలలో మద్య, మాంసాలకు బదులుగా పాలు, పంచదార, తేనె – అని పిలువబడే "మధుర త్రయం" ఇవ్వబడుతుంది.)

**తాంత్రిక పరిహారములు :**

1. ఏదైనా పని ప్రారంభించినప్పుడు తీవ్రమైన ఆటంకాలు ఎదురవుతున్నట్లయితే శరభనృసింహ మంత్రాన్ని 1008 సార్లు పఠించినట్లయితే ఆ ఆటంకాలు తొలగిపోతాయి.

2. అష్టమి తిథినాడు, అపరాజితా మొక్క యొక్క వేరుని తీసుకుని, ఆపై నృసింహ మంత్రాన్ని 108 సార్లు పఠించి, ఆ తరువాత ఆ వేరుని ఒక దారానికి కట్టి ఆ దారాన్ని కుడిచేయి మణికట్టుకి కట్టుకున్నట్లయితే ఆ వ్యక్తికి చెడు శక్తుల వల్ల, నరదృష్టివల్ల మరియు దొంగలవల్ల ఎదురయ్యే ప్రమాదాలు తొలగిపోతాయి.

3. తెల్ల ఆవాలు గుప్పెడు చేతిలోకి తీసుకుని కలకాళి మరియు ఉగ్రచండ మంత్రాలను ఒక్కొక్కటి 108సార్లు పఠించి, ఆపై వాటిని తన శత్రువు యొక్క ఇంటి చుట్టుప్రక్కల రాత్రి సమయంలో చల్లినట్లయితే ఆ శత్రువుకి అప్పటి నుండి నిద్రలేకుండా పోతుంది.

4. తోక మిరియాలతో, 1008 సార్లు చాముండ మంత్రాన్ని పఠిస్తూ హోమాన్ని చేసినట్లయితే (హోమ సమయంలో అనగా తోకమిరియాలను హోమంలో వేస్తున్న సమయంలో ఆ వ్యక్తియొక్క పేరును ఉచ్ఛరించాలి.) ఆ వ్యక్తిని పీడిస్తున్న తీవ్రమైన చర్మవ్యాధులు నశించిపోతాయి.

5. ఎనిమిది అంగుళాలు పొడవు ఉన్న నేరేడు చెట్టుయొక్క కర్రని సప్తమినాడు ఏదైనా ఆవుల కొట్టం దగ్గర భూమిలో పాతిపెట్టినట్లయితే ఆ కొట్టంలోని ఆవులు,

పాలు ఇవ్వటం ఆగిపోతుంది. అయితే ఆ కొట్టంలో పాతిపెట్టిన ఆ నేరేడు కర్రని బైటకు తీసి అవతలపారేసినట్లయితే ఆ ఆవులు మళ్ళీ పాలు ఇస్తాయి.

6. ఒకవ్యక్తి తన చేతుల్లో, కాళ్ళలో మరియు శరీరంలో ఎన్ని మందులు వాడినా నెప్పులు కలిగి ఉన్నట్లయితే, ఆ వ్యక్తి ఏడు రోజులపాటు ఉదయం సమయంలో దోసిట్లో నీళ్ళు తీసుకుని అమృతపాణి మంత్రాన్ని 108 సార్లు పఠించి ఆ నీటిని నేలపై పారవెయ్యాలి. (ఈవిధంగా రోజుకి మూడుసార్లు చెయ్యాలి.)

7. శుక్లపక్ష సప్తమి తిథినాడు దానిమ్మచెట్టు యొక్క వేరుని చేతిలోకి తీసుకుని ఆపై ధనాదాయ మంత్రాన్ని 108 సార్లు పఠించి ఆ తరువాత ఆ వేరుని ధాన్యం కొట్టులో లేదా సొమ్ములు దాచుకునే బీరువాలో ఉంచుకున్నట్లయితే ఆ సంపదలు ఎన్నటికీ తగ్గిపోవు.

8. పశువుల కొట్టానికి (ఆవులు, గేదెలు ఉండే స్థలం) నాలుగు దిక్కుల్లో ఒంటె యొక్క ఎముకను భూమిలో పాతిపెట్టినట్లయితే ఆ పశువులు కదలికలు లేకుండా అలా నిలబడిపోతాయి.

9. తాము నివసిస్తున్న గృహం లేదా వ్యాపార స్థలం – అగ్ని ప్రమాదానికి గురి కాకుండా ఉండాలకునేవారు పటికను తీసుకువచ్చి ఆపై మహిష మర్దిని మంత్రాన్ని పదివేలసార్లు జపించి ఆపై ఆ పటికను ఇంటి ప్రధాన ద్వారంపైన లేదా ప్రధాన ద్వారానికి ప్రక్కన కట్టుకోవాలి.

10. జున్నుగడ్డి వేరుని చంద్రగ్రహణం జరుగుతున్న సమయంలో సేకరించి పొడి చేసుకోవాలి. ఆ తరువాత దానిని నెయ్యిలో కలిపి, బృహస్పతి మంత్రం చదువుతూ ఏడు రోజులపాటు కడుపులోకి తీసుకోవాలి. అలా చేసినట్లయితే ఆ వ్యక్తి గొప్ప మేధస్సుని పొందుతాడు.

11. కొన్ని సందర్భాలలో, కొత్తగా బిడ్డను ప్రసవించిన స్త్రీని కొన్ని రకాల చెడు ఆత్మలు పీడిస్తూ ఉంటాయి. అలాంటి సందర్భాలలో అటు తల్లికి, ఇటు బిడ్డకి ఏదో తెలియని అనారోగ్యం సంక్రమిస్తుంది. అంతేకాకుండా, బిడ్డ తరచుగా రోదిస్తూ ఉంటుంది. అలాంటి సమయంలో పగడం పూసని, వేపాకుల్ని, ఆవాలను కలిపి ముద్దగా నూరి ఆ తరువాత నెయ్యిలో ఆ పదార్థాన్ని కలిపి ఆ స్త్రీకి దగ్గరలో ఆ పదార్థాన్ని నిప్పులపైన కాల్చాలి. అప్పుడు వచ్చే పొగ ఆ స్త్రీకి తగిలినట్లయితే అప్పటివరకు ఆ స్త్రీని ఆవహించి ఉన్న చెడు ఆత్మలు దూరంగా వెళ్ళిపోతాయి.

12. పసిబిడ్డ, చెడు గ్రహాల కారణంగా ఆపకుండా రోదిస్తున్నట్లయితే రావిచెట్టు కాండంయొక్క ఒక అరంగుళం ముక్కని నల్లదారంతో తావీజులాగా కట్టి ఆపై ఆ బిడ్డ మెడలో వేసినట్లయితే ఆ బిడ్డ ఏడుపు మానివేస్తుంది.

13. అపరాజితా మొక్క ఆకుల నుండి తీసిన పసరును వేపాకు పూలతో కలిపి ఆపై ఆ పదార్థాన్ని ముక్కుతో బాగా వాసన చూసినట్లయితే ఆ స్త్రీని పీడిస్తున్న చెడు ఆత్మలు దూరంగా పారిపోతాయి.

14. పసుపు, బిల్వ పత్రాలు, తెల్ల ఆవాల గింజలు కలిపి నూరిన పదార్థాన్ని నిప్పులపై వేసినప్పుడు వచ్చే పొగ బాగా తగిలినట్లయితే బిడ్డ తల్లిని మరియు బిడ్డని పీడిస్తున్న చెడు శక్తులు దూరంగా పారిపోతాయి. బిడ్డ అకారణంగా ఏడవటం ఆపేస్తుంది.

15. పసిబిడ్డ అకారణంగా గుక్కపట్టి ఏడుస్తున్నట్లయితే నృసింహ మంత్రాన్ని 108 సార్లు పఠిస్తూ తెల్ల ఆవాలను మంత్రించాలి. ఆ తరువాత ఆ తెల్ల ఆవాలను ఆ బిడ్డ చుట్టూ గుండ్రంగా తిప్పి (దిష్టితీసి), ఆపై ఆ ఆవాలను దూరంగా పారవేసినట్లయితే ఆ బిడ్డను పీడిస్తున్న చెడుశక్తులు దూరంగా పారిపోతాయి.

16. కుందేలు దంతాన్ని తీసుకువచ్చి, ఆపై దానిని ఒక వెండి గొలుసుకి లాకెట్ లాగా అమర్చుకుని దానిని మెడలో వేసుకుంటే ఆ వ్యక్తిలో అద్భుతమైన దైవభక్తి ఏర్పడుతుంది.

17. పిల్లియొక్క బొడ్డుతాడుని (అంబ్లికల్ కార్డ్) ఉత్తర భారతదేశంలో 'బిల్లీకీజీర్' అని పిలుస్తారు. దీనిని క్యాష్‌బాక్స్‌లో లేదా పర్సులో పెట్టుకుంటే ధనానికి ఏనాడూ లోటు ఉండదని చెబుతారు.

18. ఆదివారంనాడు గాడిదలు, విశ్రాంతిగా ఉన్న ప్రదేశంలోకి వెళ్ళి ఆపై ఆ గాడిదల గిట్టల చేత తొక్కబడిన కొంచెం మట్టిని తీసుకువచ్చి, ఆపై ఆ మట్టి మీదకి గుగ్గులు దహనం అవటంవల్ల వచ్చిన పొగ బాగా తగిలేలా చెయ్యాలి. ఆ తరువాత ఆ మట్టిని ఎవరి ఇంట్లో అయినా పడవేస్తే ఆ ఇంట్లో అద్దు ఆపూ లేకుండా తగాదాలు జరగటం మొదలవుతుంది.

19. రెండు చేతులకూ మరియు రెండు పాదాలకు ఆరువేళ్ళు చొప్పున ఉన్న స్త్రీ లేదా పురుషుడు, మనస్ఫూర్తిగా ఎవరైనా రోగి యొక్క శరీరాన్ని తాకినట్లయితే ఆ రోగియొక్క రోగం తప్పనిసరిగా నివారణ అవుతుంది.

20. గుర్రం యొక్క లద్దెను (పేడ) ఎండబెట్టి, ఆపై తగలపెట్టి అలా వచ్చిన భస్మాన్ని నువ్వులనూనెతో కలిపి తలపై కొన్నాళ్ళు వ్రాసుకుంటే జుట్టు వత్తుగా మరియు పొడుగ్గా పెరుగుతుంది.

21. కంచర గాడిద (ఆడ గాడెదకు మరియు మగ గుర్రానికి పుట్టినది) యొక్క దంతాన్ని సంపాదించుకుని, ఆపై దానిని జేబులో ఉంచుకున్నట్లయితే సంపద బాగా అభివృద్ధి చెందుతుంది.

22. శ్రవణా నక్షత్రం జరుగుతున్న సమయంలో ఆముదం చెట్టుయొక్క వేరును భూమి నుండి తీసి, ఆపై దానికి పూజచేసి ఆ తరువాత దానిని లాకెట్ లాగా మెడలో కట్టుకుంటే కొద్దికాలంలోనే తప్పనిసరిగా గర్భం వస్తుంది.

23. విష్ణుక్రాంత మొక్కను వేరుతో సహా సేకరించి ఆపై దానిని నీటిలో బాగా కడిగి ఆరపెట్టి, ఆ తరువాత ఆ మొక్కని గేదెపాలు మరియు వెన్నతో కలిపి బాగా పేస్టు లాగా రుబ్బాలి. ఆ తరువాత ఆ పదార్థాన్ని – బహిష్టులో ఉన్న స్త్రీ, ఏడు రోజులపాటు వరుసగా తీసుకున్నట్లయితే ఆమె గర్భవతి అవుతుంది.

24. పలాస వృక్షం యొక్క ఆకును పొడిగాచేసి ఆపై దానిని, బాలింతరాలి నుండి సేకరించిన పాలలో కలిపి, బహిష్టులో ఉన్న స్త్రీ ఏడు రోజులపాటు (బహిష్టు ప్రారంభం అయిన రోజు నుండి) ఆ పదార్థాన్ని తీసుకున్నట్లయితే ఆ స్త్రీ తప్పనిసరిగా గర్భవతిగా మారుతుంది.

25. తరచుగా గర్భస్రావాలకు గురయ్యే స్త్రీ, కుమ్మరి సారె నుండి (కుండలు తయారు చేయటానికి సిద్ధంగా ఉంచిన బంకమట్టి) సేకరించిన కుంకుడు గింజంత మట్టిని తేనెతో కలిపి ఒక వారం రోజులపాటు “శ్రీ మాత్రే నమ:” అనే మంత్రాన్ని 9 సార్లు పఠించి కడుపులోకి తీసుకున్నట్లయితే ఆమెకు ఆపై గర్భవిచ్ఛిత్తి కాదు. అదేవిధంగా, ఇళ్ళల్లో పెరిగే పావురం యొక్క రెట్టని ఉప్పు మరియు నీళ్ళతో కలిపి కొద్ది పరిమాణంలో కడుపులోకి తీసుకున్నట్లయితే గర్భవిచ్ఛిత్తి ఆగిపోతుంది.

26. పచ్చి గేదె పాలలో పసుపు, ఎర్రచందనం పొడి కలిపి చిక్కటి పేస్టులాగా తయారు చేసుకోవాలి. ఆపై దానిని రాత్రిపూట ముఖానికి పట్టించుకుని తెల్లవారిన తరువాత శుభ్రం చేసుకోవాలి. ఈవిధంగా 21 రోజులపాటు చేసినట్లయితే పురుషులకు మరియు స్త్రీలకు ముఖం చాలా సౌందర్యవంతంగా మారుతుంది.

27. తేనెలో పెసలు వేసి బాగా నూరి ఆ తరువాత దానిని ముఖానికి దట్టంగా పూసుకోవాలి. ఈవిధంగా ఏడు రోజులపాటు చేసినట్లయితే చక్కటి ముఖ సౌందర్యం లభిస్తుంది.

28. బిల్వచెట్టుయొక్క వేరుని, గో మూత్రంలో కలిపి నూరి ఆపై ఆ పదార్ధాన్ని తలకు పట్టించుకున్నట్లయితే తలలో ఉండే పేల గుడ్లు సంపూర్తిగా నశించిపోతాయి.

29. నేరేడు చెట్టు వేరు మరియు ఆకులను నల్ల ఆవుయొక్క మూత్రంతో కలిపి పేస్టుగా రుబ్బి ఆపై ఆ పదార్ధాన్ని తల వెంట్రుకలకు కుదుళ్ళ నుండి పట్టించుకున్నట్లయితే జుట్టు కుదుళ్ళు చాలా బలంగా మారతాయి.



# 8. "దివ్యదృష్టి" (సిక్త్‌సెన్స్) నిజంగా ఉంటుందా?

ఈనాడు పాశ్చాత్య దేశాలకు చెందిన పారాసైకాలజిస్టులు బలపరుస్తున్న అతీంద్రియ శక్తి లేదా E.S.P. (extra sensory power) అని పిలువబడే మానవ మేధస్సుకి సంబంధించిన ఒక అసాధారణమైన శక్తి గురించి కొన్నివేల సంవత్సరాల క్రితమే భారతదేశానికి చెందిన మహర్షులు, మానవ లోకానికి తెలియజేసారు. పురాణకాలంనాటి మహర్షులకు "దివ్యదృష్టి" అనే ఒక అతీంద్రియశక్తి ఉండేది. ఆ శక్తి సహాయంతో ఈ ప్రపంచంలో ఏ మూల ఏం జరుగుతున్నా లేదా జరగబోతున్న విషయాలను తెలుసుకునే అవకాశం ఆనాటి హైందవదేశ యోగులకు ఉండేది. యోగసాధనలో పరిపూర్ణులైన వారికి తప్పనిసరిగా "దివ్యదృష్టి" లభిస్తుందని భారతీయ యోగశాస్త్రాలలో చెప్పబడి ఉన్నది. కేవలము, ఆనాటి మహర్షులకే కాక ఈనాడు గొప్ప దైవభక్తులుగా (నిజమైన దైవభక్తులు) గుర్తించబడిన అనేకమందికి ఈ దివ్యదృష్టి ఉన్నట్లుగా చెప్పుకుంటారు.

మనిషి మేధస్సు అనగా మెదడు (బ్రెయిన్) అసాధారణమైన శక్తిని కలిగి ఉన్నది. అది, తాను ఉన్న శరీరానికి సంబంధించిన కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మం – అనే ఐదు ఇంద్రియాల ద్వారా అనేక రకాల కార్యాలను చేయిస్తుంది. అయితే, ఆ పంచేంద్రియాలతో సంబంధం లేకుండానే ఒక్కోసారి తానే స్వయంగా కొన్ని విషయాలను తెలుసుకోవటం జరుగుతుంది. ఈ ప్రక్రియనే "ద్వితీయ దృష్టి" (సెకండ్‌సైట్) లేదా "సిక్త్‌సెన్స్" అని భావిస్తారు.

అన్ని జంతువులతోపాటుగా కొందరు మానవులలో కూడా ఈ అతీంద్రియజ్ఞానం (Sixth sense) దాగి ఉంటుంది. ఫలితంగా, వాళ్ళకి జరగబోయే విషయాలు ముందుగానే తెలుస్తాయి. అలాగే, ఎక్కడో జరుగుతున్న విషయాలు కూడా వాళ్ళ మనో నేత్రానికి తెలుస్తాయి. తమలో దాగి ఉన్న అతీంద్రియ జ్ఞానంవల్ల తమకి ఆ విషయాలు తెలుస్తున్నాయని వాళ్ళకి అర్థంకాదు. ఇక్కడ మనం ఒక ముఖ్య విషయాన్ని మర్చిపోకూడదు. అది ఏమిటంటే, మేధస్సు బాగా అభివృద్ధి చెందిన వాళ్ళు చూడకుండానే కొన్ని విషయాలు ఊహించగలుగుతారు. అవి చాలా వరకు నిజాలే అయి ఉంటాయి. అయితే, అలాంటి వాటిని వారు తమ అతీంద్రియ శక్తి ద్వారా తెలుసుకున్నట్లుగా భావించరాదు. మేధస్సుకి మరియు సిక్స్‌సెన్స్‌కి సంబంధం ఉండదు. ఆ కారణంగానే పెద్దగా విద్య, తెలివితేటలు లేని వ్యక్తులు కూడా అప్పుడప్పుడూ ఎక్కడో జరుగుతున్న లేదా జరగబోయే విషయాలను చాలా స్పష్టంగా చెప్పటం జరుగుతుంది.

ఈ అతీంద్రియ జ్ఞానాన్నే "రెండవ దృష్టి" (సెకండ్ సెన్స్) అనికూడా పిలుస్తారు. ఈ ప్రకృతిలో అనంతమైన నిగూఢ రహస్యాలు (మిస్టరీస్) దాగి ఉన్నాయి. వాటి వెనకాల ఉన్న మర్మం ఏమిటో? తల పండిన శాస్త్రజ్ఞులకు కూడా అర్దంకాదు. ఉదాహరణకి – తెల్లగా ఉండి మరియు నీలం రంగు కనుగుడ్లు కలిగి ఉండే అన్ని పిల్లులూ చెవిటి తనాన్ని కలిగి ఉంటాయి. అనగా, వాటికి శబ్దాలు వినపడవు. ఇక, తమ శరీరంపై తాబేలు శరీరంపై ఉండే మచ్చలు లాంటి మచ్చలను కలిగి ఉండే అన్ని ఆడ పిల్లులకు వినికిడి శక్తి ఉండదు.

**దివ్యదృష్టితో భవిష్యత్తును తెలియజేసిన ఒక యోగి వృత్తాంతము :**

దాదాపు 12 సంవత్సరాల క్రితం గుంటూరు జిల్లాలోని రేపల్లె పట్టణంలో ఉన్న ఒక ఆంజనేయస్వామి గుడికి నేను వెళ్ళటం జరిగింది. ఆ సమయంలో ఆ ఆలయ ధర్మకర్త అయిన ఒక యోగిని నేను కలవటం జరిగింది. ఆయన గొప్ప హనుమాన్ ఉపాసకుడని ఆ ప్రాంతంలో చెప్పుకునేవాళ్ళు. ఆయనకు హనుమంతుడు దర్శనమిచ్చాడని కూడా అనేకమంది విశ్వసించేవాళ్ళు. ఆయనే, స్వయంగా ఆ ఆలయంలో ఆంజనేయుడికి ఎంతో భక్తిశ్రద్ధలతో పూజలు చేస్తూఉండేవాడు. అలాంటి ఆ యోగిని – నేను కలిసినప్పుడు ఆయనకు నా గురించి ఏమీ చెప్పకుండానే ఆయన కాసేపు నాతో మాట్లాడి ఆపై నాతో ఇలా అన్నాడు.

"సరిగ్గా మూడు సంవత్సరాల తరువాత నీకు వరాహస్వామి సాక్షాత్కారం అవుతుంది. ఆ తరువాత నువ్వు ఒక సంవత్సరంపాటు ఈలోకంతో సంబంధం లేకుండా కాలం గడుపుతావు. ఆ తరువాత నీవు ఒక రచయితగా మారతావు. మానవాతీత శక్తులకు సంబంధించిన అనేక అద్భుత గ్రంధాలను నీవు వ్రాస్తావు. నీకు వేలమంది శిష్యులు ఏర్పడతారు".

అప్పటికి నేను, ఆనాటి కరీంనగర్ జిల్లాలో ఉన్న వేములవాడలోని ఒక కాలేజీలో పనిచేస్తున్నాను. నాకు, అప్పటికి రచనల గురించి ఏమాత్రం సంబంధంలేదు. అలాగే నేను, అప్పట్లో వీలున్నప్పుడల్లా ఏదో ఒక గుడికి వెళ్ళి అక్కడ కాసేపు నాకు తోచినవిధంగా దైవ ప్రార్ధన చేస్తూ ఉండేవాడిని. ఇక, వేములవాడలో ఉన్నప్పుడు ప్రతిరోజూ ఉదయంపూట రాజన్న గుడికి, సాయంత్రం పూట ఊరి చివర ఉన్న భీమేశ్వరస్వామి గుడికి వెళ్ళివస్తూ ఉండేవాడిని. ఆ తరువాత సరిగ్గా మూడేళ్ళకు నేను, అనుకోకుండా తిరుపతి వెళ్ళటం, అక్కడ మా గురువుగారైన శ్రీ కేశవన్ అయ్యంగారిని కలవటం జరిగింది. ఆ సమయంలోనే ఆయన నాతో ఇలా అన్నారు. "నీవు కూడా నాలాగే వరాహస్వామి మంత్రదీక్ష తీసుకో. నీ జాతకం ప్రకారం నీకు దైవ సాక్షాత్కారాన్ని పొందే యోగం ఉన్నది. వచ్చే సూర్యగ్రహణంనాడు నీకు ఆ మంత్రదీక్ష ఇస్తాను. నీకు ఎన్ని పనులున్నా సూర్యగ్రహణం ముందురోజు రాత్రికి తిరుపతి వచ్చేసెయ్".

సహజంగా, నాకు ఆయన మీద చాలా గౌరవం ఉన్నది. ఇంకొకవిశేషం ఏమంటే, ఆయన నాకు స్వయంగా మేనమామ. పైగా, ఆయన నాకు జ్యోతిషశాస్త్రాన్ని, మంత్రశాస్త్రాన్ని బోధించాడు. ఈ రోజునేను, ఎంతోమంది జ్యోతిష పండితులు కూడా మెచ్చుకుంటున్న జ్యోతిషశాస్త్ర గ్రంధాలను రచిస్తున్నాను అంటే ఆ ఘనత పూర్తిగా మా గురువుగారికే చెందుతుందని నమ్ముతాను. అలాంటి గురువుగారి మాట కాదనలేక నేను, ఆయన చెప్పినట్లుగానే సూర్యగ్రహణం ముందురోజు రాత్రి తిరుపతిలో దిగి అపై రైల్వేస్టేషన్ ముందు ఉన్న ఒక లాడ్జిలో బసచేసి, ఆ మర్నాడు ఉదయం ఆయన్ని కలిసాను. ఆయన నన్ను ఒక ఆలయ ప్రాంతానికి తీసుకువెళ్ళి అక్కడ మంత్రోక్తంగా తలస్నానం చేయించాడు. ఆ తరువాత అక్కడికి కొంచెం దూరంలో ఉన్న ఒక నిర్మానుష్య ప్రదేశంలో ఒక వేపచెట్టు క్రింద మేము ఇద్దరం కూర్చున్నాం. అప్పుడు, ఆయన నా శిరస్సుపై చేయి ఉంచి, తనలోని దివ్యశక్తిలో కొంతభాగాన్ని నాలోకి పంపించాడు. ఆ తరువాత నా చెవిలో అతి నిగూఢమైన, మహాశక్తివంతమైన "యజ్ఞవరాహస్వామి" బీజ మంత్రాన్ని ఉపదేశించాడు. ఆ తరువాత నేను, ఇతర

పనులన్నీ కట్టిపెట్టి ప్రతిరోజూ తెల్లవారుఝాము సమయంలో విజయవాడ దగ్గర సీతానగరం వైపు ఉన్న కృష్ణానది ఇసుకలో ఆ మంత్రాన్ని అనేక వేలసార్లు ఏకబిగిన పఠించటం జరిగింది. అలా అనేక రోజులు చేసిన తరువాత ఒక చంద్రగ్రహణ సమయంలో, అదే కృష్ణానదీ తీరంలో నాకు శ్రీ యజ్ఞవరాహస్వామి సాక్షాత్కారం జరిగింది. (ఆధ్యాత్మిక పుస్తకాలలో యంత్రాల పూజకోసం ఇచ్చే దైవ సంబంధ మంత్రాలు మరియు దైవం ప్రత్యక్షం అవటానికి ఆధ్యాత్మిక గురువులు ఇచ్చే మంత్రాలు ఒకటి కాదని గుర్తించాలి. యంత్రాలకోసం ఇచ్చే మంత్రాలు ఆ యంత్ర సంబంధ దైవం యొక్క అనుగ్రహాన్ని ప్రసాదించటానికి మాత్రమే ఉపయోగిస్తాయి. కానీ, ఆ దైవ దర్శనానికి అవి సహకరించవని గుర్తించాలి.)

ఏదిఏమైనా, ఆనాడు రేపల్లె హనుమాన్ ఆలయంలోని యోగి చెప్పినట్లుగానే ఆ తరువాత మూడు, నాలుగేళ్ళలోపే నేను ఒక రచయితగా అవతరించటం, ఆ తరువాత అతి కొద్దికాలంలోనే ఎంతోమంది పండితుల మరియు పామరుల యొక్క ఆదరణను పొందటం జరిగింది. ఇంకా జరుగుతున్నది. ఇక ముందు కూడా జరుగుతుందని నమ్ముతున్నాను. ఆ దైవం ఈ భూమిమీద సృష్టించిన సమస్త జీవులలో – పరిపూర్ణమైన శారీరక లక్షణాలను, మానసిక సామర్థ్యాన్ని – కేవలము మనిషి మాత్రమే కలిగి ఉన్నాడు. మానవుడు అనాగరికుడుగా అనగా జంతు సమానుడిగా జీవిస్తూ, జంతువుల్ని రాళ్ళతో వేటాడుతూ వాటి మాంసాన్ని ఆహారంగా తీసుకునే సమయంలో మనిషిలో "పంచేంద్రియాలకు" చెందిన జ్ఞానం చాలా అధికంగా ఉండేది. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, జంతువులకు ఆ జ్ఞానం ఎంత ఎక్కువ స్థాయిలో ఉంటుందో, అంతకన్నా అధిక స్థాయిలో ఆనాటి అనాగరిక మానవుడికి ఉండేదని చెప్పవచ్చు. ఈ పంచేంద్రియ జ్ఞానమే కాకుండా కేవలము మనసుతో మాత్రమే తెలుసుకోగలిగే అతీంద్రియ జ్ఞానం (సిక్స్ సెన్స్) కూడా ఉండేది. ఈనాటికీ అరణ్య ప్రాంతాలలో మరియు సముద్ర తీరాలలో జీవించే జీవులకు కొన్ని గంటలలో లేదా రోజులలో రాబోయే తీవ్రమైన వాతావరణ మార్పులు, తుఫాన్లు, భూకంపాలు లాంటి వాటి గురించి ముందుగానే తెలుస్తున్నది. సరిగ్గా, అలాంటి అతీంద్రియ జ్ఞానమే ఆనాటి అనాగరిక మానవుడికి కూడా ఉండేది.

మానవులకు దూరంగా ఉండే జంతువులకు, పక్షులకు, ఇతర జీవులకు ఈనాటికీ అతీంద్రియ జ్ఞానం (సిక్స్‌సెన్స్) చాలా శక్తివంతంగా పనిచేస్తున్నది. ఆ కారణంగానే ఆయా జీవులు, వాతావరణంలో రాబోతున్న మార్పుల్ని ముందుగానే పసిగట్టి అందుకు తగినట్లుగా ప్రవర్తిస్తాయి. ఉదాహరణకి – ఒక ప్రాంతంలో ఉండే జీవులకు ఆహారం

మరియు నీరు కొరత ఏర్పడబోతున్నట్లుగా ముందుగానే తెలిసినప్పుడు, తమకు ఆహారం, నీరు ఎక్కడ సమృద్ధిగా దొరుకుతుందో – అక్కడికి ఆ జీవులు సమూహాలుగా వలస వెళ్ళిపోతాయి. ప్రతి సంవత్సరం వివిధ జాతుల పక్షులు వేలాది కిలోమీటర్లు ఆకాశంలో ఎగురుతూ వలస వెళ్ళటానికి కారణం, ఆ పక్షులలో దాగి ఉన్న అతీంద్రియ జ్ఞానమే అని గుర్తించాలి. అలాగే, భూ కంపాలు రాబోయేముందు అనేక జంతువులకు, చివరికి, మానవులకు సమీపంలో జీవించే కుక్కలకు, పశువులకు, కోళ్ళు, బాతులు లాంటి పక్షి జాతికి చెందిన జీవులకు తెలిసిపోతుంది. అందుకే, ఆ జీవులు భూ కంపానికి కొద్ది గంటల ముందే విపరీతమైన ఆందోళనకు గురికావటం, విచిత్రంగా ప్రవర్తించటం జరుగుతుంది. ఇది శాస్త్రీయంగా కూడా రుజువు అయిన సత్యమే అని గ్రహించాలి.

కొంతమంది హేతువాదులు మరియు హేతువాదం నిండిన మనస్తత్వ శాస్త్రజ్ఞులు మరియు మనోరోగ చికిత్సకులు (సైకియాట్రిస్టు) – దివ్యదృష్టి లేదా సెకండ్‌సైట్ లేదా సిక్స్‌సెన్స్ లేదా E.S.P. (extra sensory power) నిజంగా లేవని, అలా ఉన్నాయి అని అనుకోవటం మూఢనమ్మకమని, మానసిక రోగం అని వాదిస్తూ ఉంటారు. "ఏదైనా ఒక విషయంలో మనకి పరిపూర్ణమైన జ్ఞానం ఉన్నప్పుడే – మనకి ఎదుటి వాడిలో ఎంత జ్ఞానం ఉన్నది? అన్న విషయాన్ని విశ్లేషణచేసే హక్కు లేదా అధికారం ఉంటుంది అన్నమాట న్యాయమే కదా!". ఈనాటికీ మనిషి మెదడులో దాగి ఉన్న నిగూఢ రహస్యాలను సైన్స్ సంపూర్తిగా తెలుసుకోలేకపోయింది. మరి, అలాంటి సైన్స్‌పై ఆధారపడిన శాస్త్రజ్ఞులు, మెదడుకి సంబంధించిన అసాధారణ శక్తి గురించి పొరపాటుగా ఎలా వాదిస్తున్నారు?. దివ్యదృష్టి లేదా ద్వితీయదృష్టి (సెకండ్‌సైట్) అనే శక్తి, మనిషిలో ఎంతో మానసిక సంబంధమైన సాధన జరిగిన తరువాతే ఆవిర్భవిస్తుంది. అతడికి మాత్రమే "దివ్యదృష్టి" అంటే ఏమిటో? అనుభవపూర్వకంగా తెలుస్తుంది. అలాంటి వ్యక్తియొక్క స్థాయికి చేరకుండానే ఇతరులు అతడికి కలుగుతున్న అతీంద్రియ శక్తి తాలీకు అనుభవాలను, గుడ్డిగా కొట్టిపారవేయటం, హేతుబద్ధంకాదని గ్రహించాలి. "ఏదైనా, తీసిపారవేయటం చాలా తేలిక. కానీ, సాధించటం చాలా కష్టం". ఈ సూత్రం అన్ని రకాల సిద్ధాంతాలకు వర్తిస్తుందని మర్చిపోకూడదు.

మనిషి మెదడు ఎలా పనిచేస్తుందో? యంత్రాల ద్వారా కొంతవరకు మాత్రమే తెలుసుకోగలుగుతారు. కానీ, మెదడుకి అసాధారణమైన శక్తిసామర్థ్యాలు ఉన్నాయి.

మెదడులోని ఒక్కోభాగంలో ఒక్కొక్క శక్తి దాగి ఉన్నది. వాటియొక్క వివరాలు ఇప్పటి దాకా కొనసాగుతున్న సైన్స్‌కి ఈనాటికీ అంతుపట్టలేదు. ప్రాచీన భారతదేశానికి చెందిన పతంజలి మహర్షి, తాను వ్రాసిన యోగశాస్త్ర గ్రంథంలో ఇచ్చిన సమాచారం ప్రకారం చూసినట్లయితే యోగసాధకులకు అనేక శక్తులు లభిస్తాయి. వాటిలో దివ్యదృష్టి (extra sensory power) కూడా ఒకటి అని తెలుస్తున్నది.

పశ్చిమ భారతదేశంలో ఆధునిక కాలంలో ఒక మహాయోగిగా గుర్తించబడిన శ్రీరామకృష్ణ పరమహంస ఒక సందర్భంలో ఇలా చెప్పారు. "తాంత్రిక సాధకులకు ఆ సాధనలో భాగంగా కొన్నిరకాల సిద్ధులు అనగా మధ్యస్థాయి అతీంద్రియ శక్తులు లభిస్తాయి. కానీ, మోక్షాన్ని కోరుకునే సాధకులు ఆ శక్తుల్ని ఉపయోగించాలని ప్రయత్నించకూడదు. ఎందుకంటే, అలాంటి శక్తుల్ని ప్రయోగించే యోగిని, ఆ ప్రాంత ప్రజలు లేదా ఇతరులు ఒక దైవంగా భావించి పూజించటం ప్రారంభిస్తారు. ఎప్పుడైతే సాధకుడు ఇలాంటి గౌరవాలకు లొంగిపోతాడో, క్రమ క్రమంగా అతడు తన అసలు లక్ష్యం అయిన మోక్ష సాధన విషయాన్నే మర్చిపోతాడు. క్రమ క్రమంగా అతడు ఆధ్యాత్మికంగా పతనం అయిపోతాడు. అందువలన, నిజమైన యోగులు ఎట్టిపరిస్థితుల్లోను తమకు అతీంద్రియ శక్తులు ఉన్న విషయాన్ని రెండవ మనిషికి తెలియకుండా జాగ్రత్త పడాలి".

భారతదేశంలో కూడా చాలా ప్రాంతాలలో పెద్దగా చదువు–సంధ్యలులేని స్త్రీలు అప్పుడప్పుడూ – ఎక్కడో జరుగుతున్న తమ వారికి సంబంధించిన సంఘటనల గురించి తమ ప్రక్కవారికి చెప్పటం జరుగుతుంది. మరికొంతమందికి తమకు జరగబోయే సంఘటన గురించి ముందుగానే తెలుస్తూ ఉంటుంది. ఒక్కోసారి ఈ దివ్యదృష్టి అనేది స్వప్నాల ద్వారా పనిచేస్తూ ఉంటుంది. ఒకవ్యక్తికి తెల్లవారుఝాము సమయంలో ఒక స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో, అతడికి ఒక భయంకరమైన వ్యాధి వచ్చినట్లుగా కనిపించింది. ఆ తరువాత రెండేళ్ళకు అతడికి వచ్చిన స్వప్నం నిజం అయ్యింది. ఇక్కడ, అతడిలో నిద్రాణంగా ఉన్న అతీంద్రియ శక్తి (E.S.P. ) యొక్క ప్రభావంవల్లే అతనికి స్వప్నంలో అతడికి అతని భవిష్యత్తు కనపడింది అని భావించవచ్చు. అదేవిధంగా, మనకు బాగా ఆత్మీయుడైన వ్యక్తి గురించి మనం తలచుకుంటున్న సమయంలో ఎక్కడో ఉన్న ఆ వ్యక్తికి కూడా మనం హఠాత్తుగా గుర్తుకువస్తాము. ఆ ఇద్దరి మనుషుల మధ్య ఉన్న ఆత్మీయ సంబంధం కారణంగా వారి ఇద్దరి మధ్య 'టెలీపతి' అనే ఒక సంబంధం ఏర్పడింది. 'టెలీపతి' అంటే వేరు

వేరు ప్రదేశాల్లో ఉన్న ఇద్దరు వ్యక్తులు తమ మనసులతో మాట్లాడుకోవటం అన్నమాట.

మానవుల ప్రవేశానికి ఏమాత్రం వీలుకాని కొన్ని భూగర్భ గుహలు ఈ ప్రపంచంలో చాలాచోట్ల ఉన్నాయి. కొన్ని గుహలు నదుల అడుగున కొన్ని వందల మీటర్ల లోతులో కూడా ఉంటాయి. అలాంటి రహస్యమైన గుహలలో మనిషి మేధస్సుకి అందని అసాధారణమైన శక్తులు గల కొన్ని జీవులు నివసిస్తూ ఉంటాయి. వాటిలో కొన్ని జీవులు వందల సంవత్సరాల ఆయుర్దాయాన్ని కలిగి ఉంటాయి. ఈ గుహలలో కటిక చీకటి నిరంతరమూ వ్యాపించి ఉంటుంది. అలాంటి అద్భుతమైన భూగర్భ గుహలలో ఒకటి, కెంటకీ రాష్ట్రంలో ఉన్నది. ఆ గుహ దాదాపు 30 మైళ్ళ లోతులో ఉన్నట్లుగా తెలుస్తున్నది. ఇప్పటికీ ఏ పరిశోధకుడూ ఆ గుహ లోపలికి వెళ్ళిన దాఖలాలు లేవు. "స్టిక్స్" అనే పేరుగల నది ఈ చీకటి గుహ గుండా ప్రవహిస్తూ ఉంటుంది. ఈ గుహలో ప్రవహించే స్టిక్స్ నదిలో – చాలా లోతులో "సైప్రినోడన్" అనే పేరుగల ఒక చేప ఉంటుంది. దాని ప్రత్యేకత ఏమంటే, దానికి కళ్ళు ఉంటాయి గాని అవి కనపడవు. ఎన్నో తరాలుగా ఆ కారు చీకటి గుహలో ఆ జాతి చేపలు జీవించిన కారణంగా, ఆ జాతి చేపలు "చూడగలిగే శక్తిని" కోల్పోయాయి. మనిషి కూడా తనకు ఉన్న శక్తుల్ని వాడుకోకుండా వదిలివేసినట్లయితే, అవి కాలక్రమంలో నిద్రాణ స్థితిలోకి వెళ్ళిపోతాయి. అదేవిధంగా ఈ గుహలో జీవించే చేపలు కూడా తాముచూడటానికి ఆ గుహలో అవకాశం లేదు కనుక (చూడాలంటే వెలుతురు కావాలి. కారు చీకటి నిండిన ఆ గుహలో చూడటానికి అవకాశం ఉండదు కదా!) చూడలేవు. ఒక విచిత్రం ఏమంటే, కొందరు పరిశోధకులు అప్రయత్నంగా ఆ గుహలోకి ప్రవేశించటం జరిగింది. గుహలో ప్రవహించే నది అడుగుకి వాళ్ళు వెళ్ళలేకపోయారు. కానీ, నది పైభాగంలోనే వాళ్ళకి కొన్ని "సైప్రినోడన్" చేప పిల్లలు లభించాయి. వాళ్ళు, వాటిని తీసుకువచ్చి ఆపై లాబరేటరీలోని ఒక ఎక్వేరియంలో ఉంచి, ఆపై ఆ ఎక్వేరియంలోకి అతి తక్కువ స్థాయిలో వెలుతురుని ప్రసరింపచేసారు. ఆవిధంగా ఆ చేపలు ఆ ఎక్వేరియంలో కొంతకాలంపాటు పెంచబడ్డాయి. కొన్నేళ్ళ తరువాత ఆ చేపల యొక్క మూడవ తరం కూడా ఏర్పడింది. అప్పుడు ఆ మూడవ తరం చేపలు తమ కళ్ళతో తమకు ఎదురైనవాటిని చూడగలిగే శక్తిని పొందాయి.

ఈ సృష్టిలో ఎన్నో విచిత్రాలు మన కళ్ళముందే కనపడుతున్నా, మనకి వాటి గురించి అంతగా ఆలోచన ఉండదు. ఉదాహరణకి – మనకు కనపడే పక్షులన్నింటికీ రెక్కలు ఉన్నప్పటికీ అవి గాలిలో ఎగరలేవు. ఉదాహరణకి – ఈముపక్షి, ఆస్ట్రిచ్

పక్షి, ఇళ్ళల్లో పెరిగే కోళ్ళకు, బాతులకు రెక్కలు ఉంటాయి. కానీ, అవి ఆకాశంలోకి ఎగరలేవు. కారణం, అవి అనేక తరాలుగా తమయొక్క ఎగిరే శక్తిని ఉపయోగించుకోని కారణంగా వాటికి రెక్కలు ఉన్నా, అవి పైకి ఇతర పక్షుల్లాగా ఎగరలేకపోతున్నాయి. శారీరక నిర్మాణం ప్రకారం చూసినట్లయితే జంతువులు మరియు మానవులు దాదాపు 4వేల సంవత్సరాలుగా ఏవిధమైన మార్పు లేకుండా ఉన్నారు. ప్రాచీన ఈజిప్టులో లభించిన పిరమిడ్‌లలోని జంతువులయొక్క మరియు మానవులయొక్క మమ్మీలను (రసాయనాలను పూసి నిలువ చేయబడిన మృతదేహాలను 'మమ్మీలు' అని పిలుస్తారు.) పరిశీలించినట్లయితే, నాలుగువేల సంవత్సరాల నుండి ఈనాటి వరకు ఆ జంతువులలో లేదా మానవుల శరీర నిర్మాణంలో ఏమాత్రం తేడా లేకుండా ఉన్నట్లుగా పరిశోధకులకు అర్ధమయ్యింది. అయితే, ఆదిమానవుడి కాలంలో అనగా లక్షల సంవత్సరాల క్రితం ఆనాటి మానవులలో మరియు జంతువులలో ఉన్న అవయవాలు ఆ కాలానికి చెందిన వాటి అవసరాలకు ఉపయోగపడ్డాయి. కానీ, కాలక్రమంలో ఆ అవసరాలు ఆ తరువాత కాలంలోని మానవులకు, జంతువులకు లేకపోవటంతో ఆ అవయవాలు కూడా మారిపోయాయి. ఫలితంగా, నాలుగువేల సంవత్సరాల క్రితం మానవుల మరియు జంతువుల యొక్క శరీర నిర్మాణం ఒక విధానంలో స్థిరపడి పోయింది. అదే నేటికీ కొనసాగుతున్నది.

16వ శతాబ్దానికి చెందిన సెయింట్ ఫ్రాన్సెస్ జెవియర్ అనే ఒక రోమ్ క్రైస్తవ మతాధిపతి 1547లో తన మిత్రులకు వ్రాసిన ఒక ఉత్తరంలో ఒక అద్భుత విషయాన్ని ఇలా తెలియజేసాడు. అది ఏమిటంటే, "నేను మలాయ్/మలయ" ద్వీపాలలో సంచరిస్తున్నప్పుడు ఒక మగ మేక తన పిల్లలకు తన పొదుగుల ద్వారా పాలు ఇస్తున్నది. ఆ మగ మేక ఒక పొదుగు నుండి పిండితే దాదాపు ఒక లీటరుపాలు వస్తాయి. నేను కళ్ళారా ఆ విచిత్రాన్ని చూసి ఆశ్చర్యపోయాను. మగమేక పాలు ఇవ్వటం అనే అద్భుతం అప్పటి వరకు నేను చూడలేదు మరియు వినలేదు".

ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, ప్రస్తుత కాలంలో కూడా ఆవుకి అడుగు భాగంలో నాలుగు అభివృద్ధి చెందిన పొదుగులతో (పాలు స్రవించే పొదుగులు)తో పాటుగా రెండు అభివృద్ధి చెందని చిన్ని చిన్ని పొదుగులు కూడా ఉంటాయి. అయితే, కొన్ని ప్రాంతాలలో జీవించే కొన్ని ఆవులకు మామూలుగా ఉండే పొదుగులతో పాటుగా ఈ చిన్న పొదుగులు కూడా అభివృద్ధి చెంది ఉండటమే కాకుండా వాటి నుండి కూడా పాలు స్రవించటం జరుగుతుంది. ఆవుకి మామూలుగా ఉండే

పొదుగులతో పాటుగా, ప్రయోజనం లేకుండా ఉండే రెండు పొదుగులు ఉంటాయన్న విషయం దాదాపు ఎవరూ పట్టించుకోరు అన్న విషయాన్ని గుర్తించాలి. చాలాకాలంపాటు వాడకంలేని కారణంగా ఆవుల యొక్క రెండు అదనపు పొదుగులు పనికిరానివిగా మారిపోయాయని పరిశోధకులు నిర్ధారించారు.

**రెండవ దృష్టి (సెకండ్ సైట్)ని నిరూపించే యదార్ధ సంఘటనలు :**

ఈ సంఘటన "హొండూరస్" అనే లాటిన్ అమెరికా దేశంలోని తెగూషిగల్ప అనే పట్టణంలో దాదాపు 80 సంవత్సరాల క్రితం జరిగింది. అది ఎలాగంటే...డుపోటెట్ అనే ఒక ఫ్రెంచ్ ధనికుడు తన అందమైన మరియు 18 సంవత్సరాల కుమార్తెతో కలిసి వ్యాపార నిమిత్తం తెగూషిగల్ప పట్టణానికి చేరుకున్నాడు. అక్కడ తన మిత్రుడితో కలిసి ఒక ఇనుపసామాగ్రి అమ్మే దుకాణాన్ని స్థాపించటంకోసం ఆ ధనికుడు అక్కడకు వెళ్ళాడు. అలా వెళ్ళిన ఆ ధనికుడు – వెళ్ళిన రోజు రాత్రి ఆ పట్టణంలో ఉన్న అధునాతన హొటల్లో బసచెయ్యాలని నిర్ణయించుకున్నాడు. ఆపై, ఆ తండ్రి–కూతురూ, ప్రక్క ప్రక్కనే ఉన్న రెండు గదులలో ఆ రాత్రికి బస చేసారు. ఒకవిశేషం ఏమంటే, ఆ హొటల్‌లో ప్రతి గదిలోంచి ఇంకొక గదిలోకి ద్వారం కూడా ఉన్నది. రాత్రి 11 గంటలు కాగానే భోజనాలు పూర్తిచేసుకుని ఆ తండ్రి, కూతురు – ఎవరి గదిలోకివాళ్ళు వెళ్ళి తలుపులు వేసుకుని, తమ తమ పడకలపై పడుకుని నిద్రపోయారు. సరిగ్గా, అర్ధరాత్రి దాటిన తరువాత ఆ ధనికుడికి "ఎవరో తన భుజాన్ని తడుముతున్నట్లుగా" అనిపించటంతో హఠాత్తుగా నిద్రలేచాడు. ఆపై, అతడు తన రెండు చేతులలో కళ్ళు నులుపుకుంటున్న సమయంలో అతడి చెవిలో అతడి కూతురి యొక్క స్వరం చాలా సన్నగా ఇలా వినిపించింది. "ఫాదర్! వెంటనే నా గదిలోకి రా". తన కూతురు మాటలు తన చెవి దగ్గర అలా వినపడటంతో ఆ ధనికుడికి ఒక్కసారిగా నిద్రమత్తు వదిలిపోయింది. ఆపై, తన పడకమీద నుండి కిందకు దిగాడు. గదిలో నీలంరంగు జీరోవాల్ట్ బల్బు వెలుగుతున్నది. తన గదిలో ఎవరూ లేరు. మరి, కొద్ది సెకన్ల క్రితం తన చెవి దగ్గర మాట్లాడింది ఎవరు?, తన భుజాన్ని తడిమింది ఎవరు? – అన్న సందేహం ఆ ధనికుడిని కొద్ది సెకన్లపాటు తీవ్రంగా వేధించింది. ఆపై, అతడు తన గదిలో లైటు వేసాడు. ఆ తరువాత తన గదిలోంచి ప్రక్క గదిలోకి ఉన్న తలుపుని తెరచి ప్రక్క గదిలోకి వెళ్ళాడు. ఆ గదిలో బెడ్‌మీద అతని కూతురు గాఢంగా నిద్రపోతున్నది. ఈమె ఈ గదిలో నిద్రపోతున్నప్పుడు మరి, తనని ఇందాక లేపింది ఎవరు? – తనతో మాట్లాడింది ఎవరు? – అన్న

విషయం ఆ ధనికుడికి అర్ధంకాలేదు. అతడు అలా ఆలోచిస్తూ, అనుకోకుండా నిద్రపోతున్న తన కూతురి కాళ్ళవైపు చూసాడు.



ఆమె కప్పుకుని ఉన్న రగ్గుమీదుగా మెల్లి మెల్లిగా పాకుతూ పైకి వస్తున్న ఒక పెద్ద తెల్లతేలు ఆ ధనికుడికి కనపడింది. ఇంకొక 20, 30 సెకన్లు గడిస్తే ఆ విషపూరితమైన తేలు, ఆ బెడ్‌మీద కాళు ్ళ జాపుకుని నిద్రపోతున్న ఆ ధనికుడి కూతురి మెడదాకా వస్తుంది. ఆమె, తన కాళ్ళనుండి మెడ వరకు రగ్గు కప్పుకుని పడుకుని ఉండటంవల్ల ఆ తేలు ఆమెను అప్పటిదాకా కరవకుండా ఉన్నది. ఎప్పుడైతే అది, రగ్గుతో కప్పబడకుండా ఉన్న ఆమె మెడ దగ్గరకు చేరుతుందో ఆ క్షణంలో అది ఆ ధనికుడి కూతురి మెడమీద కాటు వేస్తుంది. మధ్య అమెరికా ప్రాంతంలో అతి భయంకరమైన విషం కలిగిన తేలుగా ఆ తెల్లతేళ్ళ జాతిని పేర్కొంటారు. దాంతో, ఆ ధనికుడు భయంతో దడదడలాడుతున్న తన గుండెను చిక్కబట్టుకుని ఆపై, గభాలున రెండు అడుగులతో ఆ బెడ్ దగ్గరకు చేరుకుని, ఆపై ఆ రగ్గుని రెండు చేతులతో పట్టుకుని లాగి దూరంగా పారేసాడు. ఆ తరువాత ఆ రగ్గుని ఒక చుట్టగా చుట్టి ఒక తాడుతో ఆ చుట్టను బిగించి, ఆ చుట్టను ఆ హోటల్ రూం కిటికీలోంచి బైటకు బలంగా విసరివేసాడు. కొద్ది నిమిషాల క్రితం, తన కూతురి స్వరం నిద్రలో ఉన్న తనకి వినపడనట్లయితే, తన కూతురు ఈపాటికి ఆ ప్రమాదకరమైన తేలు కాటుకి చనిపోయి ఉండేది. ఇంతకీ, ఆ అమ్మాయి ఆ ప్రక్క గదిలో నిద్రపోతూ ఉండగా ఆ అమ్మాయి స్వరం ఇవతల గదిలో నిద్రపోతున్న ఈ ధనికుడికి ఎలా వినపడింది?. దీనికి ఆ కాలంనాటి ఒక మెక్సికో దేశ మంత్రవాది చెప్పిన సమాధానం ఏమంటే, "ప్రతి కుటుంబానికి ఒక కులదైవం ఉంటుంది. ఆ కులదైవం ఆ ఇంట్లో సభ్యులను ఎల్లప్పుడూ కాపాడుతూ ఉంటుంది. ఈ సందర్భంలో కూడా ప్రక్క గదిలో ప్రమాదానికి గురికాబోతున్న ఆ ధనికుడి కూతురిని రక్షించటంకోసం ఆ కులదేవతే అతడి కుమార్తె యొక్క స్వరంతో అతడిని హెచ్చరించింది".

ఈ ధనికుడు తన అనుభవాన్ని తన కాలానికి చెందిన ఒక పారాసైకాలజిస్టుతో పంచుకున్నప్పుడు ఆ పారాసైకాలజిస్టు ఆ ధనికుడితో ఇలా చెప్పాడు. "సర్, మిమ్మల్ని

హెచ్చరించింది మీ కులదేవత అవునో? కాదో? నాకు తెలియదు. కానీ, నేను చేస్తున్న అతీంద్రియ శక్తులకు సంబంధించిన పరిశోధనా ఫలితాల ప్రకారం చూసినట్లయితే, మీలో నిద్రాణంగా ఉన్న దివ్యదృష్టి లేదా E.S.P. – ఆ సమయంలో పనిచేసిన కారణంగానే, మీ కూతురికి కొద్ది క్షణాలలో ఆ తేలువల్ల ఎదురుకాబోతున్న ప్రమాదం గురించి తెలిసింది. ఫలితంగా, మీరు ప్రక్క గదిలోకివెళ్ళి అక్కడ మీ కుమార్తెను కాటువెయ్యటానికి సిద్ధంగా ఉన్న తేలుని ప్రక్కకు తప్పించారు. మీ కుమార్తెను కాపాడుకోగలిగారు".

♦ పెంపుడు జంతువులలో ఒకవిధమైన 'సిక్స్‌సెన్స్' (అతీంద్రియజ్ఞానం) దాగి ఉంటుంది. అయితే, ఆ విషయాన్ని వాటి యజమానులు అంతగా పట్టించుకోరు. ఈ విషయాన్ని లండన్‌కి చెందిన ఒక పారాసైకాలజిస్టు నిరూపించాడు. అది ఎలాగంటే... క్రీ.శ.1917, ఏప్రియల్ నెలలో – లండన్ నగరంలో నివసిస్తున్న ఒక ధనికురాలియొక్క పెంపుడు పిల్లి ఏదో కారణం వల్ల తప్పిపోయింది. తన పిల్లిని ఎవరో దొంగిలించి తీసుకుపోవటమో లేదా చంపటమో జరిగి ఉంటుందని, ఆ ధనికురాలు అనుకున్నది. అయితే, ఆ పెంపుడు పిల్లి అదృశ్యం అయిన రెండు వారాల తరువాత ఆమెకి – లండన్‌కి దాదాపు 99 మైళ్ళ దూరంలో ఉన్న ఒక పట్టణం నుండి ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరంలో ఉన్న సమాచారం ఏమంటే, "ఆమె యొక్క పెంపుడు పిల్లి తన దగ్గర ఉన్నదని ఆ పట్టణంలోని ఒకవ్యక్తి ఆమెకు తెలియజేయటమే కాకుండా వెంటనే వచ్చి ఆ పిల్లిని ఆమె తీసుకువెళ్ళాలి".

ఇక్కడ ఒక విచిత్రం దాగి ఉన్నది. అది ఏమిటంటే, ఆమె, రెండు సంవత్సరాల క్రితం ఆ పట్టణంలోనే ఉన్నది. అంతేకాకుండా, ఆమె అక్కడ ఉన్నప్పుడే ఆ పిల్లిని తీసుకువచ్చి రెండు సంవత్సరాలు పెంచింది. ఆ తరువాత ఆమె ఆ పట్టణం వదిలి పెట్టి లండన్‌కి వచ్చింది. తనకు వచ్చిన ఉత్తరంలో ఉన్న సమాచారం చూసి ఆ ధనికురాలు నిర్ఘాంతపోయింది. కారణం, "రెండు వారాల క్రితం తప్పిపోయిన ఆమె పిల్లి, గతంలో ఆమె నివసించిన పట్టణంలోని ఇంటికి చేరుకున్నది. ప్రస్తుతం, ఆ ఇంట్లో ఇంకొక వ్యక్తి నివసిస్తున్నాడు. ఆ పిల్లి, గతంలో ఆ ఇంట్లో నివసించిన ధనికురాలికి సంబంధించినది అని ఆ వ్యక్తికి అతడి పొరుగువారి ద్వారా తెలిసింది. ఆపై, అతడు ఆ పిల్లి గురించి ఆ ధనికురాలికి ఉత్తరం ద్వారా తెలియజేసాడు. ఆ ధనికురాలు అంతగా ఆశ్చర్యపోవటానికి కారణం ఏమంటే, ఆమె ఆ పిల్లిని లండన్‌కి ఒక కారులో తీసుకువచ్చింది. ఆ ప్రయాణ సమయంలో ఆ కారు కిటికీ తలుపులు

(విండో గ్లాసెస్) మూసివేయబడి ఉన్నాయి. అంతేకాదు, ఆ కారు అనేక చిన్న చిన్న అడవులు, మైదానాలు మరియు రహదారికి అడ్డంగా ప్రవహించే జల ప్రవాహాల మీదుగా ప్రయాణించి లండన్‌కి వచ్చింది. అంతటి క్లిష్టమైన మార్గంలో మరియు తను కళ్ళారా చూడని మార్గంలో ఆ పెంపుడు పిల్లి, ఆ పట్టణంలో ఉన్న ఇంటికి ఎలా చేరగలిగింది...?

జంతువులకు సహజంగా, వాటి పంచేంద్రియాలకు అతీతమైన సిక్స్‌సెన్స్ ఉన్న కారణంగానే ఆ పిల్లి తన యజమానురాలి గత ఇంటికి చేరగలిగింది. ఆ తరువాత ఆ యజమానురాలు ఆ మర్నాడే, తను గతంలో ఉన్న ఆ పట్టణంలోని ఇంటికివెళ్ళి అక్కడ ఆ పిల్లిని తీసుకున్నది. తన యజమానురాలినిచూసి ఆ పిల్లి పట్టలేని ఆనందంతో 'మ్యావ్' అని అరుస్తూ తన యజమానురాలి కౌగిట్లో ఇమిడిపోయింది.



# 9. టిబెటన్ తంత్రశాస్త్రంలో చెప్పబడిన మానవ శరీర మర్మాలు?

మానవ శరీరంలో ఉండే ఐదు "ఇన్" (Yin) ఇంద్రియాలు, ఐదు రకాల మరియు ముఖ్యమైన "చి(Qi)" లను సృష్టిస్తాయి. ఈ "చి(Qi)" అనే శక్తుల కారణంగా మనిషిలో సంతోషం, ఆగ్రహం, బాధ, ఆందోళన, భయం – అనే ఐదు ఉద్వేగాలు (ఎమోషన్స్) ఆవిర్భవిస్తాయి. ఇక, ఏ ఉద్వేగం, ఏ అంగానికి (ఆర్గాన్) సంబంధించి ఉంటుందో టిబెటన్ తాంత్రిక – మానవ శాస్త్రంలో చెప్పబడి ఉన్నది. "సంతోషం(హ్యాపి)" మనిషి యొక్క "గుండె"కి సంబంధించి ఉంటుంది. "ఆగ్రహం(యాంగర్)" అనే ఉద్వేగం "కాలేయానికి (లివర్)"కి చెంది ఉంటుంది. బాధ లేదా వ్యాకులత (గ్లూమి) అనే ఉద్వేగం – గుల్మానికి(స్ప్లీన్) చెంది ఉంటుంది. "ఆదుర్దా" (యాంగ్జైటీ) అనే ఉద్వేగం "ఊపిరితిత్తులకు (లంగ్స్)" చెంది ఉండగా, "భయం(ఫియర్)" అనే ఉద్వేగం "మూత్ర పిండాలకు (కిడ్నీస్)" చెంది ఉంటుంది. టిబెటన్ తాంత్రిక వైద్యశాస్త్ర సూత్రాల ప్రకారం చూసినట్లయితే, మనిషికి వచ్చే వ్యాధులకు ప్రధానకారణం – ఆ మనిషిలోని భావోద్వేగాలే (ఎమోషన్స్) అని గుర్తించాలి. సాధారణంగా తన చుట్టూ ఉండే పరిసరాలు మరియు వ్యక్తుల కారణంగా ఆ వ్యక్తిలో భావోద్వేగాలు మార్పులు

చెందుతూ ఉంటాయి. ఒక మనిషి కొంతవరకు చెడు ఉద్వేగాలను అనగా బాధను, కోపాన్ని, భయాన్ని అదుపు చేసుకోగలడు. అయితే, మనిషి యొక్క మనో స్థాయికి మించిన ఉద్వేగాలు మనిషిలో చెలరేగినప్పుడు, ఆ మనిషి ఏదో ఒకవిధమైన అనారోగ్యాన్ని పొందుతాడు. ఉదాహరణకి – తన ఎత్తుకి తగిన బరువు మరియు మంచి ఆరోగ్యాన్ని కలిగి ఉన్న వ్యక్తి, ఎక్కువ కాలంపాటు తీవ్రమైన ఆందోళనకి, ఉద్వేగానికి గురైనట్లయితే ఆ వ్యక్తికి తప్పనిసరిగా అధిక రక్తపోటు (హై.బి.పి.) లేదా మధుమేహం (డయాబెటీస్/చక్కెరవ్యాధి) వచ్చి తీరుతుంది. కొన్నిసార్లు ఈ రెండు వ్యాధులు కొద్ది నెలల తేడాలో మనిషిని ఆవహిస్తాయి.

టిబెటన్ తంత్రశాస్త్రాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, మనిషిలోని భావోద్వేగాలు ముఖ్యంగా, చెడు భావోద్వేగాలు మోతాదును మించి పెరిగిపోతే ఆ మనిషిలో ఉండే "ఇన్ (Yin)" మరియు "యాంగ్ (Yang)" అనే శక్తుల మధ్య సమతౌల్యం (బాలెన్స్) తప్పిపోతుంది. ఫలితంగా, మనిషి శరీరంలో రక్తప్రసరణ మరియు "చి(Qi)" అనే ప్రాణశక్తి (వైటల్ ఎనర్జీ) యొక్క ప్రసరణ అస్థవ్యస్థం అవుతుంది మరియు నాడులలో (మనిషి యొక్క సూక్ష్మదేహంలో ఉండే మార్గాలను నాడులు అని పిలుస్తారు. వీటి గుండా ప్రాణశక్తి, శరీరం అంతా ప్రవహిస్తుంది. ఆయుర్వేద వైద్యశాస్త్రంలో రోగ నిర్ధారణకోసం పరీక్షించే నాడులు మరియు పైన చెప్పిన నాడులు ఒకటి కాదని గుర్తించాలి.) అడ్డంకులు ఏర్పడతాయి. ఫలితంగా, మనిషి శరీరంలోని ముఖ్యమైన అంగాల పనితీరు బాగా దెబ్బతింటుంది. ఫలితంగా, మనిషికి తీవ్రమైన అనారోగ్యాలు సంక్రమిస్తాయి. కనుక, అలాంటి పరిస్థితుల్లో కేవలం ఔషధ సహాయమే కాక, భావోద్వేగాలను అదుపులో పెట్టగలిగే ఆధ్యాత్మిక సంబంధ సహాయం కూడా ఆ మనిషికి అవసరం అవుతుంది.

ఇంకొక విచిత్రం ఏమంటే, టిబెటన్ తంత్రశాస్త్రంలో చెప్పబడిన భావోద్వేగాలు – అవి మంచివి కావొచ్చు లేదా చెడ్డవి కావొచ్చు. ఒక పరిమితికి మించి మనిషిలో చెలరేగినప్పుడు మనిషికి చెడు ఫలితాలు వచ్చే అవకాశాలు అధికంగా ఉంటాయి.

**మూత్రపిండములు :** ఒక వ్యక్తికి చెందిన మూత్రపిండాలలో అతడి గతజన్మ యొక్క వివరాలు ముద్రించబడి ఉంటాయని, మనిషిలోని సామర్థ్యం అతని మూత్ర పిండాలలో దాగి ఉంటుందని టిబెటన్ తంత్రశాస్త్రాలు తెలియజేస్తున్నాయి. మనిషి శరీరంలో తయారయ్యే అన్ని రకాల మలినాలను, విషపదార్థాలను (టాక్సిన్స్) శరీరం నుండి బైటకు వెళ్లగొట్టటానికి సహకరించే అతిముఖ్యమైన భాగం – మూత్రపిండాలు

(కిడ్నీస్) అని గుర్తించాలి. మూత్రపిండాలకు మరియు ఆ మనిషి శరీరంలోని ఎముకలు, దంతాలు, చెవులు, నెత్తిమీద ఉండే జుట్టుకు సంబంధం ఉంటుంది. అందువల్ల, మనిషి శరీరంలో మూత్రవ్యవస్థ దెబ్బతిన్నప్పుడు ఆ మనిషికి తాత్కాలికంగా జ్ఞాపకశక్తి నశించిపోవటం, వినపడకుండా పోవటం, జుట్టు హఠాత్తుగా తెల్లబడి పోవటం లాంటివి జరుగుతాయి.

టిబెటన్ మరియు ప్రాచీన చైనా తంత్రశాస్త్రాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, మనిషి జీవితంలో ఎదురయ్యే ఆశాభంగాలు, పరాజయాలు మనిషియొక్క మూత్ర పిండాలమీద విపరీతమైన ప్రభావాన్ని చూపిస్తాయి. అదేవిధంగా మనిషిలోని భయం, న్యూనతాభావం, అభద్రతాభావం, వంటరిగా ఉండాలని కోరుకోవటం లాంటి ఉద్వేగాలు (ఎమోషన్స్) – దీర్ఘకాలంపాటు ఒక మనిషిలో ఉన్నట్లయితే ఆ మనిషియొక్క మూత్రపిండాలు ఖచ్చితంగా దెబ్బతింటాయని గుర్తించాలి.

ఒకవ్యక్తిలో మూత్రపిండాలు సరిగా పనిచేయనప్పుడు ఆ వ్యక్తికి మలబద్ధకం ఏర్పడటం, మూత్రం నల్లగా రావటం, నోరు ఎండిపోవటం, పాదాలు – నీరు పట్టటం వల్ల వాచిపోవటం, విపరీతంగా నీళ్ళ విరోచనాలు కావటం లాంటివే కాక, నరాలకు సంబంధించిన సమస్యలు కూడా ఏర్పడతాయి.

**పంచ ఉద్వేగాలు సమతౌల్యం కోల్పోతే – ?**

**క్రోధము :** మనిషి మనసులో తరచుగా విపరీతమైన క్రోధము తల ఎత్తుతున్నట్లయితే ఆ మనిషి ఉదరంలో జీర్ణరసాలు ఉత్పత్తి అస్తవ్యస్థంగా మారిపోతుంది. ఫలితంగా, మనిషికి ఉదర సంబంధమైన అనారోగ్యాలు తల ఎత్తుతాయి.

**బాధ :** మనిషి మనసులో బాధ, దీర్ఘకాలంపాటు కొనసాగినట్లయితే ఆ మనిషి యొక్క నరాల వ్యవస్థ దెబ్బతింటుంది. శరీరంలో ఉత్పత్తి అవ్వాల్సిన అనేక రకాల రసాయనాలు ఉత్పత్తి కావు. ఫలితంగా, మనిషి శరీరంలో ఏదో ఒక బలమైన వ్యాధి ఆవిర్భవిస్తుంది. ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, నిరంతరమూ బాధతో క్రుంగి పోయేవారిలో రక్తం నిదానంగా ప్రవహిస్తుంది. ఫలితంగా, రక్తశుద్ధి సరిగా జరగదు. అదేవిధంగా ఈ వ్యక్తులలో ఆకలి, నిద్ర సరిగా ఉండవు. అపానవాయువు వెలువడుతూ ఉంటుంది. పొట్టలోని కండరాలు బిగుసుకుపోతూ ఉంటాయి. కాలేయం యొక్క పనితీరు కూడా దెబ్బతింటుంది.

**భయం :** మనిషిలో దీర్ఘకాలంపాటు భయం దాగి ఉన్నట్లయితే ఆ మనిషి యొక్క కండరాల యొక్క శక్తి తగ్గిపోతుంది. అంతేకాకుండా, ఎక్కువకాలంపాటు

భయానికి గురి కావటంవల్ల రక్తప్రసరణ వ్యవస్థ దెబ్బతింటుంది. గుండెయొక్క పనితీరు సరిగా ఉండదు. మనిషి ప్రమేయం లేకుండానే మలమూత్రాలు విసర్జించబడతాయి.

**సంతోషం :** మనిషికి మేలుచేసే ఉద్వేగాలలో (ఎమోషన్స్) సంతోషం ముఖ్యమైనది అని గుర్తించాలి. మనిషిలో విశ్వాసం ఉన్నప్పుడే మనిషి సంతోషాన్ని పొంద గలుగుతాడు. చాలా సందర్భాలలో రోగికి తనకు వైద్యం చేస్తున్న వైద్యుడిమీద మరియు ఆ వైద్యుడు తనకు ఇస్తున్న ఔషధాలమీద నమ్మకం ఉండదు. అందువల్ల మనిషికి ఆ వ్యాధి నివారణ జరగటం చాలా కష్టం అవుతుంది. మనిషి సంతోషంగా ఉన్నప్పుడే మనిషిలో ఆత్మవిశ్వాసం బలంగా ఉంటుంది. బలమైన ఆత్మవిశ్వాసం గల వ్యక్తి ఎంత పెద్ద వ్యాధి నుండి అయినా బైట పడగలడు. కానీ, మనిషిలో ఈ సంతోషం విపరీతంగా పెరిగిపోతే ఆ మనిషి యొక్క మెదడు అదుపు తప్పటం జరుగుతుంది. అదేవిధంగా, పట్టలేని సంతోషం కారణంగా గుండె పనితీరు మారటం, ఒక్కోసారి గుండె ఆగిపోవటం లాంటివి కూడా జరుగుతాయి. అందువలన సంతోషానికి కూడా ఒక పరిమితి ఉంటుందని గుర్తించాలి.

**ఆదుర్దా/ఆందోళన :** ఏదో ఒక విషయం గురించి విపరీతంగా ఆలోచించటం అనగా ఒక వ్యక్తికి ఏదైనా ప్రమాదం జరుగుతుందేమో అని ఆలోచించటం, తనకి సరైన ఉద్యోగం వస్తుందో, రాదో అని తీవ్రంగా మధన పడటం – లాంటి ఉద్వేగాలను (ఎమోషన్స్) – ఆందోళన/ఆదుర్దా అని పిలుస్తారు. మనిషిలో ఈవిధమైన ఆందోళన ఎక్కువ అయిపోతే మనిషిలో జీర్ణవ్యవస్థ దెబ్బతింటుంది. ఉదరంలో వాయువు ఉత్పత్తి అధికం అవుతుంది (గాస్ట్రిక్‌ట్రబుల్) మరియు కడుపులో పుండ్లు (అల్లర్స్) ఏర్పడతాయి. ఏకాగ్రత దెబ్బతింటుంది. ఒక్కో సమయంలో ఈ ఆందోళన కారణంగా మనిషి – ఆత్మహత్య చేసుకోవటం లేదా యాక్సిడెంట్లు చెయ్యటం లాంటివి కూడా జరుగుతాయి.

టిబెటన్ తాంత్రిక వైద్యశాస్త్రంలో చెప్పబడిన ప్రాథమిక సూత్రాల ప్రకారం చూసినట్లయితే, మనిషి శరీరంలో పైత్యరసం (త్రిప), వాయువు (లంగ్), శ్లేష్మం (బెకెన్) అనే మూడు శక్తులు ఉంటాయి. ఇవి సక్రమంగా పనిచేస్తున్న కాలమే మనిషి ఆరోగ్యవంతుడిగా ఉంటాడని గుర్తించాలి. ఇందులో, పిత్తరసం అనేది అగ్నితత్వానికి చెంది ఉంటుంది. ఇక, వాయువు – వాయుతత్వానికి చెంది ఉంటుంది. శ్లేష్మం – భూ మరియు జల తత్వానికి చెంది ఉంటుంది. మనిషి శరీరంలో "పిత్తరసం"

సమతౌల్యాన్ని కోల్పోతే అనగా ఎక్కువ అయిపోతే, ఆ మనిషిలో తరచుగా విపరీతమైన ఆగ్రహం కనిపిస్తుంది. మనిషిలో "వాయువు" అధికం అయిపోతే అతడిలో వ్యామోహాలు ఎక్కువ అయిపోతాయి. "శ్లేష్మం" అధికం అయిపోతే అతడిలో అజ్ఞానం లేదా భ్రమలు అధికం అయిపోతుంది. కనుక, మనసులో వచ్చే తేడాలు మరియు మనసులో చెలరేగే భావాలు ఆ మనిషి శరీర వ్యవస్థపైన నేరుగా ప్రభావం చూపిస్తాయి అని అర్థం చేసుకోవచ్చు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, "మనిషిలో ఏర్పడే చెడు భావాలు లేదా నెగటివ్ ఎమోషన్స్ కారణంగానే మనిషిలో వ్యాధులు ఆవిర్భవిస్తున్నాయి" అని గుర్తించాలి. అందువలన, మనిషి మనసుకి కూడా టిబెటన్ వైద్యశాస్త్రంలో ప్రాముఖ్యత ఇవ్వబడింది. అటు మనసుకి ఇటు శరీరానికి ఏకకాలంలో వైద్యం చేసినప్పుడే వ్యాధి నివారణ అవుతుందని టిబెటన్ వైద్య పండితులు ఉద్ఘాటిస్తున్నారు.

# 10. శాపాలు (Curses) నిజంగా ఉంటాయా? వాటికి పరిహారాలు ఏమిటి?

ఒకవ్యక్తి తనయొక్క శత్రువుకి చెడు జరగాలి అన్న బలమైన ఉద్దేశంతో మాట్లాడే మాటల్ని 'శాపం' (Curse) అని పిలుస్తారు. సాధారణంగా, కొంతమంది వ్యక్తులు తమకు జరిగిన దారుణమైన అన్యాయానికి తిరిగి ప్రతీకారం చెయ్యలేని అసహాయ స్థితిలో ఉంటారు. అలాంటివాళ్ళు "తమకు అపకారంచేసినవాళ్ళు నాశనం అయిపోవాలి" అని తీవ్రమైన ఆక్రోశంతో, ఆగ్రహంతో శపిస్తారు. అయితే, అలాంటి అసహాయులు ఇచ్చే శాపాలు ఫలించటానికి చాలాకాలం పట్టవచ్చు. కానీ, తంత్రశాస్త్రంలో చెప్పబడిన కొన్ని రకాల మంత్రాలను ఉచ్ఛరించి, ఆపై ఒకవ్యక్తిని శపిస్తే కొద్ది రోజుల్లోనే ఆ వ్యక్తి నశించిపోవటం జరుగుతుంది. ప్రపంచంలోని అన్ని మతాలలో కూడా ఈ 'శాపం' అనే అంశం కనిపిస్తుంది. ప్రాచీన గ్రీకు, రోమన్ దేశాలలో కొన్నిరకాల వస్తువుల్ని మంత్రించి, ఆపై వాటిని శాపాలుగా మార్చి శత్రువులపైకి ప్రయోగించటం జరిగేది. ఇక, ఆఫ్రికా ఖండానికి చెందిన 'వుడు' అనే చేతబడి విధానంలో కూడా శత్రువులపైకి శాపాన్ని ప్రయోగించటం జరుగుతుంది.

జీసెస్ క్రీస్తు ఒక సందర్భంలో ఇలా అన్నాడు. "మానవులు మాట్లాడే మాటలకు చాలా శక్తి ఉంటుంది. అందువలన ఏ మనిషి అయినా సరే విపరీతమైన కోపంతో

ఇంకొక మనిషికి చెడు కలగాలని నిందిస్తే ఆ "నింద" ఒక బలమైన శాపంగా మారి నిందించబడిన వ్యక్తిని పీడిస్తుంది. అందువలన ప్రతి మనిషి తన ఆగ్రహాన్ని అదుపులో పెట్టుకోవాలి".

కొంతమంది పారాసైకాలజిస్టుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, మనిషి యొక్క మనసుకి అసాధారణమైన శక్తి ఉంటుంది. ఒక మనిషి – తన మనసుని ఒకే అంశంపైన పరిపూర్తిగా లగ్నంచేసి ఆపై ఒక కోరికను లేదా ఆశను తన నోటితో పైకి చెప్పినట్లయితే ఆ కోరిక ఫలించే అవకాశాలు చాలా అధికంగా ఉంటాయి. అదేవిధంగా ఒక వ్యక్తి తనకు జరిగిన అన్యాయానికి తీవ్రమైన ఆవేదనను పొంది ఆపై తీవ్ర ఆగ్రహం చెంది, మనస్ఫూర్తిగా అనగా సంపూర్ణమైన ఏకాగ్రతతో ఒక వ్యక్తిని శపించినట్లయితే ఆ శాపం తప్పనిసరిగా ఫలిస్తుంది. "శాపం" అనే ఒక శబ్ద సంబంధమైన శక్తి, ఆ శాపం ఎవరిమీద విధించబడిందో ఆ వ్యక్తియొక్క సూక్ష్మదేహంలోకి ప్రవేశిస్తుంది. ఎప్పుడైతే, సూక్ష్మదేహంలోకి శాపం యొక్క చెడు ప్రభావం అనగా నకారాత్మకశక్తి (నెగటివ్ ఎనర్జీ) ప్రవేశిస్తుందో ఆ క్షణం నుండి ఆ వ్యక్తికి మనో నిబ్బరం క్రమ క్రమంగా తగ్గిపోతుంది.



ఎప్పుడైతే మనస్సు స్థిరత్వాన్ని కోల్పోతుందో ఆ మనిషి, ఏమాత్రం చెడు ఎదురు అయినా విపరీతమైన భయాందోళనకు గురి అవుతాడు. ఇలాంటి పరిస్థితుల్లో ఆ వ్యక్తియొక్క జాతకచక్రంలోని గ్రహస్థితులు కూడా బాగా చెడుగా ఉన్నట్లయితే అతడిని ఆవహించి ఉన్న శాపం, అతడిని చంపటమో లేదా తీవ్రమైన వ్యాధిగ్రస్తుడిగా మార్చటమో లేదా అతడియొక్క ఆస్థులను, స్థాయిని, వృత్తిని దెబ్బతియ్యటమో జరుగుతుంది. ఇటీవలకాలంలో, సామాన్యులను కూడా వదలకుండా లంచాలకోసం పీడించి, ఆపై అలా వచ్చిన లంచాలతో కోట్లకు పడగలు ఎత్తిన కొంతమంది ప్రభుత్వ ఉద్యోగులకు, వాళ్ళద్వారా పీడించబడిన వ్యక్తులలో ఎవరో ఒకరు ఇచ్చిన శక్తివంతమైన శాపం తగులుతున్న కారణంగానే ఆ ఉద్యోగులు "అవినీతి నిర్మూలనశాఖ" అధికారులు చేసే దాడిలో దొరికిపోయి, ముందు వాళ్ళు దాచుకున్న సొమ్ములు పోవటం, ఆ తరువాత వాళ్ళ ఉద్యోగం పోవటం, ఆపై వాళ్ళ ఆరోగ్యం పోవటం, చివరగా వాళ్ళు మానసికంగా క్రుంగిక్రుశించి పోవటం జరుగుతున్నది.

భారతదేశంలోని వివిధ ప్రాంతాలలో నివసిస్తున్న కొంతమంది హైందవ కుటుంబాలవారు "శాపం" కారణంగా అనేక రకాల సమస్యలను ఎదుర్కోవటం జరుగుతున్నది. అన్ని అర్హతలు ఉన్నా, కుమార్తెలకు వివాహం కాకపోవటం లేదా ఒక వివాహం భగ్నం కావటంతో రెండవ వివాహం చెయ్యటం జరుగుతుంది. ఒక్కో కుటుంబంలో ఒక అమ్మాయికి మూడు వివాహాలు జరిగిన సంఘటనలు కూడా ఉన్నాయి. అలాగే పుట్టిన బిడ్డలు పుట్టినట్లుగానే చనిపోవటం, ఎన్నిరకాల వైద్యపరమైన జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ తరచుగా గర్భవిచ్ఛిత్తులు (ఎబార్షన్స్) జరగటం లేదా పది లేదా పదిహేను లేదా 20 సంవత్సరాల వయస్సులో మగపిల్లలు అకాల మృతి చెందటం లాంటివి ఈ శాపాల కారణంగానే జరుగుతూ ఉంటాయి. ఒకవ్యక్తి దారుణమైన పాపం చేసినప్పుడు అతనికి తగిలే శాపం, అతని తరువాత ఎన్నో తరాల వారిని కూడా నిర్దాక్షిణ్యంగా పీడిస్తుంది. జాతకచక్రంలో ఒకవ్యక్తికి ఏదైనా శాపం ఉన్నదా? లేదా? అన్న విషయం తెలుస్తుంది. ఒకవ్యక్తికి శాపం వల్ల చెడు జరుగుతున్నది అని తెలిసినప్పుడు ఆ శాప నివారణకోసం శక్తివంతమైన పరిహారాలు చేయించుకోవలసి ఉంటుంది. ఎప్పుడైతే పరిహారాల వల్ల శాపం తొలగిపోతుందో, ఆ వ్యక్తికి ఆనాటి నుండి మంచి జరగటం ప్రారంభం అవుతుంది. అంతేకాకుండా శాపం "భగ్నం" కావటం వల్ల, అనగా నశించిపోవటంవల్ల ఆ వ్యక్తి తరువాతి తరాల వారికి కూడా ఏవిధమైన చెడు జరగదు.

మనిషి మనసుకి ఎంతో శక్తి ఉంటుంది. అయితే, ఆ విషయం చాలా మందికి తెలియదు. ఒక మనిషి, తనకు హాని చేసిన లేదా భరించలేని నష్టం కలిగించిన ఇంకొక మనిషిని నిరంతరం నిందిస్తూ ఉంటే ఆ "నింద" ఒక భయంకర శాపంగా మారి ఎదుటి వ్యక్తి తగులుతుంది. ఇక్కడ ప్రతి ఒక్కరూ గుర్తుంచుకోవలసిన ఒక ముఖ్య విషయం ఏమంటే, "ఎదుటి వ్యక్తియొక్క అభివృద్ధిని చూసి అసూయ పడుతూ – వీడు ఏదోఒకనాటికి ఖచ్చితంగా నాశనం అయిపోతాడు – అని శపించటం వల్ల ఎదుటి వ్యక్తికి ఏవిధమైన హాని కలగదు". ఎందుకంటే, ఒక వ్యక్తివల్ల నీకు నష్టం కలిగినప్పుడు మాత్రమే – అదికూడా నీకు చాలా దారుణమైన ఆవేదనను కలిగించినప్పుడు మాత్రమే నీవు ఇచ్చే శాపం ఎదుటి వ్యక్తికి మహాస్త్రంలా తగులుతుంది. అంతేగాని, అసూయతోనో లేదా కోపంతోనో ఇంకొక వ్యక్తిని శపించినంత మాత్రాన ఆ శాపం ఆ వ్యక్తిని ఏమీ చెయ్యలేదు. ఇలాంటి సందర్భాలలోనే పెద్దలు "పిల్లిశాపాలకు ఉట్లు తెగవు" అని చెబుతూ ఉంటారు.

కారణం ఏదైనప్పటికీ, కొన్ని సమయాలలో ఒక స్త్రీ గురించి లేదా పురుషుడి గురించి చుట్టు ప్రక్కల ఉన్నవాళ్ళు బాగా చెడుగా మాట్లాడుకుంటూ ఉంటారు. ఫలితంగా, ఆ స్త్రీ లేదా పురుషుడి గురించి చెడు పుకార్లు సమాజంలో వ్యాపిస్తాయి. ఇలాంటి చెడు పుకార్లు ఒక శాపంలాగా మారి, ఆ స్త్రీని లేదా పురుషుడిని దెబ్బకొట్ట లేకపోయినప్పటికీ ఈ పుకార్ల తాలీకు "నకారాత్మక శక్తి (నెగటివ్ ఎనర్జీ)" ఆ పుకార్లకు గురి అవుతున్న వ్యక్తులయొక్క ఆరోగ్యంపై ప్రభావం చూపిస్తాయి. పుకార్లకు గురి అవుతున్న వ్యక్తులకు తరచుగా తల బరువుగా ఉండటం, నిద్రపోతున్నప్పుడు గుండెల మీద ఎవరో కూర్చున్నట్లుగా అనిపించటం, అకారణంగా మనోస్థితులు (మూడ్స్) మారిపోవటం లాంటివి జరుగుతూ ఉంటాయి. ఇలా, పుకార్ల కారణంగా మానసికంగా బాధపడుతున్నవారు ఆ చెడు ప్రభావాన్ని అడ్డుకోవటంకోసం తంత్రశాస్త్రంలో చెప్పబడిన యంత్రాలను గృహంలో ప్రతిష్టించుకోవలసి ఉంటుంది.

పాశ్చాత్యదేశాలలో ప్రచారంలో ఉన్న ఒక సిద్ధాంతం ప్రకారం చూసినట్లయితే "ఈ సృష్టిలో ఎన్నో చెడు శక్తులు సంచరిస్తూ ఉంటాయి. ఒకవ్యక్తి, ఇంకొక వ్యక్తి ద్వారా తనకు కలిగిన విపరీతమైన నష్టానికి మరియు మనోవేదనకు ప్రతీకారంగా ఇంకొక వ్యక్తిని "సర్వనాశనం అయిపొమ్మని" శపిస్తాడు. ఎప్పుడైతే, నిజమైన బాధతో ఒక వ్యక్తి, ఇంకొక వ్యక్తిమీద శాపాన్ని వదులుతాడో అప్పుడు ఆ వ్యక్తికి సమీపంలో ఉండే ఏదో ఒక చెడుశక్తి (తక్కువస్థాయి శక్తి కలిగిన ప్రేతాత్మలు) ఆ శాపాన్ని ఆవహిస్తుంది. ఫలితంగా, ఆ ప్రేతాత్మ ఆ శాపాన్ని మోసుకువెళ్ళి ఆపై ఆ శాపం ఇవ్వబడిన వ్యక్తిని ఆవహిస్తుంది. అప్పటి నుండి ఆ వ్యక్తిని ఆ చెడుశక్తి అన్నిరకాలుగా పీడించటం ప్రారంభిస్తుంది. అనగా, ప్రతి బలమైన శాపానికి, ప్రతినిధిగా ఒక క్షుద్రశక్తి ఉంటుందని భావించాలి.

### ♦ వజ్రశాపం :

"హోప్ డైమండ్" అనే పేరుగల అత్యంత విలువైన ఒక వజ్రం ఒక ఆలయంలోని ఆదిపరాశక్తి విగ్రహంలో పొదగబడి ఉన్నది. అయితే, ఒక బరితెగించిన దొంగ ఒక అర్ధరాత్రి సమయంలో ఆ ఆలయంలోకి జొరబడి అమూల్యమైన ఆ వజ్రాన్ని దొంగిలించాడు. ఆ సమయంలో ఆ ఆలయ పూజారి, అనుకోకుండా ఆలయం దగ్గరకు వచ్చాడు. ఆ వజ్రాన్ని ఆ దొంగ తీసుకువెళ్ళకుండా అడ్డుకోవాలని శతవిధాల ప్రయత్నించాడు. కానీ, ఆ దొంగ ఆ బ్రాహ్మణుడిని నిర్దాక్షణ్యంగా ఒక కత్తితో దారుణంగా గాయపరచాడు. ఆ గాయాల వల్ల చనిపోబోతున్న ఆ బ్రాహ్మణుడు ఆ

దొంగని ఇలా శపించాడు. "ఈ వజ్రాన్ని దొంగిలిస్తున్న నీవు అతి త్వరలోనే చనిపోతావు. అంతేకాదు, ఈ వజ్రం ఎవరి దగ్గర ఉంటే వాళ్ళు నాశనం అయిపోతారు. ఈ వజ్రం మళ్ళీ ఈ ఆలయంలోని అమ్మవారి విగ్రహం దగ్గరకు చేరేదాకా ఈ వజ్రం శాపగ్రస్తం అవుతుంది. ఇది సత్యం". ఆ తరువాత కొద్ది రోజులకే ఆ దొంగను ఇతర దొంగలు ఆ వజ్రంకోసం చిత్రహింసలుపెట్టి చంపేసారు.



ఆపై, ఆ దొంగలు ఆ వజ్రాన్ని ఎవరో వ్యాపారికి అమ్మారు. అలా ఆ వ్యాపారి దగ్గరకు చేరిన ఆ వజ్రం ఆ వ్యాపారిని అనేక రకాల బాధలకు గురిచేసింది. దాంతో ఆ వ్యాపారి ఆ వజ్రాన్ని ఇతరులకు ఇచ్చేసాడు. అలా ఆ వజ్రం చేతులు మారుతూ 1673లో ఆనాటి ఫ్రాన్స్ రాజు14వ లూయిస్ రాజు దగ్గరకు చేరింది. అది ఇలా ఆ రాజు దగ్గరకు చేరిందో లేదో ఆ రాజు చనిపోయాడు. అతని సంతానం అందరికీ వళ్ళంతా పుండ్లు పడిపోయాయి. ఆ బిడ్డల్లో ఒక బిడ్డ మినహా మిగిలినవాళ్ళు చనిపోయారు. ఆ తరువాత, ఆ వంశానికి చెందిన 16వ లూయీకి ఆ వజ్రం వారసత్వ ఆస్థిగా లభించింది. ఆ రాజు ఆ వజ్రాన్ని తన ప్రియ భార్య అయిన మేరికి ఇచ్చాడు. ఆ తరువాత ఫ్రాన్స్ దేశంలో జరిగిన మహా విప్లవం కారణంగా లూయీ అధికారం తల్లక్రిందులు అయిపోయింది. ఫలితంగా, లూయీని మరియు అతని భార్య మేరీని విప్లవకారులు బహిరంగంగా మెడ నరికి సంహరించారు. ఆ తరువాత ఆ వజ్రం, విల్‌హేం అనే ఒక డచ్ వజ్రాల వ్యాపారి దగ్గరకు చేరింది. ఆ వజ్రాన్ని చూసి విపరీతంగా ఆశపడిన అతడి కొడుకు, అతడిని చంపి ఆ వజ్రాన్ని తన సొంతం చేసుకున్నాడు. ఆ తరువాత ఆ వజ్రం ఒక గ్రీకు వ్యాపారి చేతికి చేరింది. ఆ వజ్రం తన చేతికి వచ్చిన కొద్ది రోజులకు ఆ వ్యాపారి తన కారులో ప్రయాణిస్తూ అప్రయత్నంగా ఒక కొండపై దాకా వెళ్ళాడు. ఆపై ఆ కారు, కొండ శిఖరంమీద నుండి అగాధంలో పడిపోయింది. ఆ గ్రీకు వ్యాపారి నామరూపాలు లేకుండా నశించిపోయాడు. ఆ తరువాత ఆ వజ్రం ఎమిలిన్ అనే ఒక యువ సంపన్నురాలికి వారసత్వంగా లభించింది. అది, ఆమెకు లభించిన కొద్ది రోజులకే ఆమె కుమారుడు ప్రమాదంలో చనిపోయాడు. ఇక, ఆమె కూతురు విపరీతమైన పరిమాణంలో తీసుకున్న ఔషధంవల్ల చనిపోయింది.

ఆ తరువాత హోప్ డైమండ్, హారీవిన్‌స్టన్ అనే ఒక సంపన్నుడి దగ్గరకు చేరింది. అతడు కూడా ఆ వజ్రం తన దగ్గరకు వచ్చిన తరువాత అతడు ఎన్నో కష్టాలను ఎదుర్కొన్నాడు. ఆ వజ్రం, వ్యక్తుల దగ్గర ఉంటే దాని శాపం వాళ్ళని పీడిస్తుందని భావించిన హారీవిన్‌స్టన్ ఆ వజ్రాన్ని ఒక మ్యూజియంకి ఇచ్చేసాడు. ప్రస్తుతం ఆ వజ్రం ఆ మ్యూజియంలోనే ఉన్నది.

చాలామందికి తెలియని విషయం ఏమంటే, మనిషిలోని ఆత్మకు అసాధారణమైన శక్తి ఉంటుంది. ఎప్పుడైతే మనిషి యోగమార్గంలో తన మనసుని పూర్తిగా నిగ్రహించు కుంటాడో అనగా ఏదో ఒక అంశంపైన మనస్సుని సంపూర్తిగా నిమగ్నం చెయ్యగలిగే స్థితికి చేరుకుంటాడో, అలాంటి వ్యక్తి తన ఏకాగ్రతా శక్తితో ఇంకొక వ్యక్తిని శపించి నట్లయితే ఆ శాపం మహా శక్తివంతంగా పనిచేస్తుంది. కొంతమంది వ్యక్తులకు జన్మత: మహా శక్తివంతమైన వాక్‌శుద్ధి ఉంటుంది. అలాంటి వాళ్ళు, ఎదుటివాళ్ళని ఆశీర్వదిస్తే ఆ ఎదుటివాళ్ళకి చాలా మంచి జరుగుతుంది. అలాంటివాళ్ళని బాధపెడితే, అలా బాధపడినవాళ్ళు కోపంతో ఏదైనా అంటే అది "శాపం"గా మారి వాళ్ళని బాధపెట్టిన వాళ్ళని పీడిస్తుంది. కొంతమంది వ్యక్తులు ఉంటారు. వీళ్ళకి చెడు శక్తులయొక్క (నెగటివ్ ఎనర్జీస్) అండ విపరీతంగా ఉంటుంది. ఇలాంటి వాళ్ళు ఏదైనా చెడుమాట అంటే అది అటు, ఇటుగా ఖచ్చితంగా జరిగి తీరుతుంది. కేవలము చెడు మాత్రమే వీళ్ళ మాటలద్వారా జరుగుతుందని గుర్తించాలి.

### ♦ జ్యోతిష్కుడి శాపం :

ఈ సంఘటన టెక్సాస్ రాష్ట్రంలో దాదాపు రెండు దశాబ్దాల క్రితం జరిగింది. డాక్టర్ లారీడూసే, టెక్సాస్‌లోని ఒక హాస్పటల్‌లో శిక్షణ పొందుతున్న సమయంలో అతడికి ఆ హాస్పటల్‌లో ఒక రోగి కనిపించాడు. ఆ రోగి పేరు హేరాల్డ్‌బెనెట్. అతడు చావు బ్రతుకుల్లో ఉన్నాడు. ఆ హాస్పటల్‌కి చెందిన అనుభవజ్ఞులైన వైద్యులకు కూడా అతడికి వచ్చిన రోగం ఏమిటో? ఎంత ప్రయత్నించినా అర్థంకావటంలేదు. ఆ సమయంలో లారీడూసే, తన శిక్షణలో భాగంగా బెనెట్‌ని తరచుగా కలుసుకుని అతడితో మాట్లాడుతూ ఉండేవాడు. ఆ సందర్భంలో బెనెట్, లారీడూసేతో ఒకసారి ఇలా చెప్పాడు. "నేను ఒకసారి న్యూయార్క్‌లోని ఒక జ్యోతిష్కుడి దగ్గరకు వెళ్లాను. అతడిచేత నా భవిష్యత్తుకు సంబంధించిన కొన్ని విషయాలను చెప్పించుకున్నాను. అతడు చెప్పిన వాటిలో కొన్ని నాకు నచ్చలేదు. నాకు కోపం వచ్చింది. దాంతో నేను అతడికి ఫీజు చెల్లించలేదు. అందుకు ఆగ్రహించిన ఆ జ్యోతిష్కుడు 'నాకు ఫీజు

ఎగ్గొట్టిన నువ్వు, కారణం తెలియని రోగంతో అనేక రోజులు బాధపడి చనిపోతావు' అని నన్ను శపించాడు. నేను ఆ శాపం గురించి ఏమాత్రం పట్టించుకోలేదు. అతడు నన్ను శపించిన మూడు నెలల తరువాత నాకు తీవ్రమైన అనారోగ్యం వచ్చింది. అప్పటి నుండి ఈ హాస్పటల్‌లోనే ఉంటున్నాను".

బెనెట్‌కి శాపం వల్ల ఈ అనారోగ్యం వచ్చి ఉండవచ్చు లేదా ఆ శాపానికి భయపడిన బెనెట్‌కి మానసికంగా తీవ్రమైన భయం ఏర్పడటంవల్ల అతనికి వ్యాధి తగ్గకుండా ఉండిఉండవొచ్చు. ఏదిఏమైనా, తను శాపంచేత పీడించబడుతున్నాను అని అనుకుంటున్న అతనికి "శాప పరిహారం" చేయిస్తే అతడికి ఆ వ్యాధి తగ్గుతుంది అని భావించిన లారీడోసే తన మిత్రుడితో కలిసి ఒక వూడూ మంత్రగాడిని కలుసుకున్నాడు. ఆ తరువాత ఆ మంత్రగాడిని నేరుగా హాస్పటల్‌లో ఉన్న బెనెట్ దగ్గరకు తీసుకువచ్చాడు. ఆపై, ఆ మంత్రగాడు - బెనెట్‌యొక్క బెడ్‌కి కొంచెం దూరంలో అదే గదిలో నేలమీద ఒక అరగంటసేపు "వూడూ" తాంత్రిక విధానంలో ఏవో పూజలుచేసి, ఆపై ఒక ఎముకను బెనెట్ తలచుట్టూ మూడుసార్లు గుండ్రంగా తిప్పాడు. ఆ తరువాత ఆ గదిలో చిన్న అగ్నిని వెలిగించి, అందులో బెనెట్ తలమీద ఉన్న కాసిని వెంట్రుకలను తీసి ఆ అగ్నిలో వేసి కొన్ని మంత్రాలు చదివాడు. ఆ తరువాత ఒక పూసల దండని బెనెట్ మెడలో వేసాడు. ఆవిధంగా వూడూ పరిహారం జరిగింది.

ఆ మర్నాడు ఉదయం హాస్పటల్‌కి వెళ్ళిన డాక్టర్ లారీడోసెకి విపరీతమైన ఆశ్చర్యం కలిగింది. కారణం...బెడ్‌మీద బెనెట్ ప్రశాంతంగా కూర్చుని వేడి వేడి పాలు త్రాగుతున్నాడు. అంతకుముందు రోజు వరకు బెనెట్ ఎప్పుడూ ఆ బెడ్‌మీద నిస్త్రాణంగా పడుకుని ఉండేవాడు. ఏదిఏమైనా, వూడూ మంత్రగాడు పరిహారం చేసిన తరువాత బెనెట్ కొద్దిరోజుల్లోనే వ్యాధి నుండి కోలుకుని ఆ హాస్పటల్ నుండి తన ఇంటికి మంచి ఆరోగ్యంతో తిరిగి వెళ్ళాడు. వూడూ మంత్రగాడు చేసిన పరిహారం వల్ల బెనెట్‌కి వ్యాధి తగ్గిందా? లేదా అప్పటికి వైద్యులకు బెనెట్‌కి ఏవిధమైన వైద్యం చెయ్యాలన్న విషయం తెలిసిందా? - అన్న విషయం లారీడోసెకి ఇప్పటికీ అర్థం కాలేదు. హైందవ మతంలో ప్రముఖంగా గుర్తించబడిన రామాయణ, మహాభారత, భాగవత గ్రంథాలలో శాపాలకు సంబంధించిన అనేక కథలు కనిపిస్తాయి.

"తనకు సూర్యుడివలన పుట్టిన మొదటి బిడ్డ అయిన కర్ణుడు గురించి కుంతీదేవి ఏనాడూ, తన మిగిలిన బిడ్డలైన పాండవులకు చెప్పలేదు". (పంచ పాండవులలో

ధర్మరాజు, భీముడు, అర్జునుడు మాత్రమే కుంతికి పుట్టారు. మిగిలిన సహదేవుడు మరియు నకులుడు, కుంతీదేవి యొక్క సవతి అయిన మాద్రికి పుట్టారు.) ఏదిఏమైనా, కురుక్షేత్ర యుద్ధంలో కుంతీదేవి ప్రథమ పుత్రుడు అయిన కర్ణుడు, కౌరవ పక్షాన పోరాడాడు. పాండవుల శత్రుపక్షంగా ఉన్నాడు. ఆ యుద్ధం ముగిసే సమయానికి కర్ణుడు నేలకూలి మరణించాడు. అప్పుడు కుంతీదేవి బైటకు వచ్చి "కర్ణుడు తన పెద్ద కొడుకు అని" మిగిలిన కొడుకులకు చెప్పి పెద్దగా రోదించింది. కుంతీదేవి చెప్పిన ఆ రహస్యాన్ని తెలుసుకున్న ధర్మరాజు ఎంతగానో విచారించాడు. తమ అగ్రజుడైన కర్ణుడిని, కారణం ఏదైనప్పటికీ తామే చంపామని బాధపడ్డాడు. కుంతీదేవి తన పరువుకోసం కర్ణుడి జన్మరహస్యం గురించి పాండవులకు చివరిదాకా చెప్పలేదు. ఒకవేళ ఆమె, మొదట్లోనే ఆ నిజాన్ని చెప్పి ఉంటే కురుక్షేత్ర యుద్ధం జరిగి ఉండేది కాదేమో. ఏదిఏమైనా, కుంతీదేవి నిజాన్ని దాచిపెట్టటం వల్ల కొన్ని లక్షలమంది అమాయకులు ఆ యుద్ధంలో మరణించారు. పాండవులకు తమ సోదరుడిని చంపిన పాపం చుట్టుకున్నది. స్త్రీ అయిన కుంతి తన మొదటిబిడ్డ జన్మ రహస్యాన్ని దాచిన కారణంగానే ఇన్ని అకృత్యాలు జరిగాయి అని అర్ధంచేసుకున్న ధర్మరాజు తీవ్రమైన ఆగ్రహంతో తన తల్లి అయిన కుంతిని ఇలా శపించాడు. "నీవు నీ పరువుకోసం నీ హృదయాన్ని కఠినంగా మార్చుకుని రహస్యాన్ని దాచావు. దానివల్ల ఇన్ని చెడు సంఘటనలు జరిగాయి. ఇకపై, ఏ స్త్రీ కూడా రహస్యాన్ని దాచకుండా పోవుగాక". ఆనాటి నుండి ఈనాటి వరకు స్త్రీల మనసులో ఏ రహస్యాలు దాగకుండా పోతున్నాయని చెబుతారు.

బలహీనుల్ని నాశనం చెయ్యటం, నమ్మకద్రోహం ద్వారా బలహీనుల్ని వంచించటం లాంటి చెడు కార్యాలను చేసినవాళ్ళు, వాళ్ళవల్ల నాశనం అయిపోయిన వాళ్ళు ఇచ్చే శాపాలకు కొంచెం ఆలస్యంగా అయినా సరే దెబ్బతినక తప్పదని నిరూపించే సంఘటనలు భారతదేశంలోనే ఎన్నో జరిగాయి. దాదాపు వంద సంవత్సరాల క్రితం దక్షిణభారతదేశంలో జరిగిన యదార్ధ గాథ ఇది. ఆ సమయంలో బ్రిటీషువారు భారతదేశాన్ని పరిపాలిస్తున్నారు. ఈ బ్రిటీషు పాలకులు అవినీతి విషయంలో ఈనాటి కొందరు రాజకీయ నాయకుల కన్నా అనేక రెట్లు అధిక అవినీతి పరులుగా గుర్తించబడ్డారు. తమకు లాభం వస్తుంది అంటే, ఆనాటి బ్రిటీషు అధికారులు ఎంత నీచానికైనా దిగజారుతూ ఉండేవారు. ఆ కాలంలో ఆనాటి ఆంధ్రప్రదేశ్-తమిళనాడు సరిహద్దు ప్రాంతంలో వందల ఎకరాల ఆస్థి ఉన్న ఒక సాంప్రదాయ బ్రాహ్మణ కుటుంబం నివసిస్తూ ఉండేది. అదే ప్రాంతంలో కొద్దిపాటి

ఆస్థులు, ఎక్కువ అంగబలం కలిగిన కొన్ని బ్రాహ్మణేతర కుటుంబాలు కూడా ఉండేవి. అలాంటి సమయంలో ఒకరోజున, ఆ బ్రాహ్మణ కుటుంబం సపరివార సమేతంగా కాశీయాత్రకు వెళ్ళాలని నిర్ణయించుకున్నది. ఆ కాలంలో రవాణా సౌకర్యాలు దాదాపు లేవనే చెప్పాలి. వాళ్ళు – కొంతదూరం కాలినడకన, మరికొంతదూరం పడవలమీద, ఇంకొంత దూరం యడ్లబండ్లమీద లేదా గుర్రపు బండ్లమీద ప్రయాణించి కాశీకి చేరుకోవాల్సి వచ్చేది. అనగా, వాళ్ళు ఉన్న ఆ ప్రాంతం నుండి కాశీకి వెళ్ళి తిరిగి రావాలంటే దాదాపు సంవత్సరకాలం పట్టేది. అంతకాలంపాటు తమ పొలాలను మరియు పశువుల్ని మరియు వెండి, బంగారం లాంటి విలువైన వస్తువులను వదిలిపెట్టి వెళ్ళటం సాధ్యంకాదు. అందువల్ల వాళ్ళు, తమ ప్రాంతంలో తమకి బాగా విధేయుడుగా ఉండే ఒక వ్యక్తిని పిలిచి అతడితో ఇలా చెప్పారు. “నాయనా! మేము కాశీ యాత్రకు వెళుతున్నాం. సంవత్సరందాకా తిరిగిరాము. నీవు అప్పటిదాకా మా పొలాలను చూసుకో. అలాగే మా ఆవుల్ని, గేదెలను కూడా నీవే రక్షించు. మా ఇంట్లో ఉన్న వెండి, బంగారాలను ఒక భోషాణంలో పెట్టి, మీ ఇంటికి పంపిస్తాం. మేము వచ్చేదాకా ఆ వెండి, బంగారాలను కూడా నీవే నీ ఇంట్లో ఉంచుకుని రక్షించు. మేము రాగానే మళ్ళీ మా ఆస్తులు మేము తీసుకుంటాం”.

ఆ వ్యక్తి ఎంతో సంతోషంగా ఆ బ్రాహ్మణులు ఇచ్చిన బాధ్యతను స్వీకరించాడు. ఆ బ్రాహ్మణులు తమ ఇంట్లోని చిన్న పిల్లలతో సహా కాశీ యాత్రకు బయలుదేరి వెళ్ళిపోయారు. ఇక, ఆ తరువాత అసలు కథ మొదలయ్యింది...వందల ఎకరాలు తన పెత్తనంలోకి రాగానే ఆ వ్యక్తి మనసులో కొద్ది రోజుల్లోనే విపరీతమైన దురాశ మొదలయ్యింది. “ఈ ఆస్తులన్నీ నా సొంతం చేసుకుంటే నేను కోటీశ్వరుడిని అయిపోతాను. ఈ రెండు ఎకరాలు, మూడు ఎకరాలు సాగుచేస్తూ ఎంతకాలం పేదరికంలో బ్రతుకుతాను?. మోసమో, అన్యాయమో అనవసరం. నా చేతికి వచ్చిన ఈ ఆస్తులను నా సొంతం చేసుకుంటాను. నా తరువాత ఏడు తరాల వరకు నా వంశం జమిందారులు లాగా బ్రతుకుతారు”. – ఈవిధంగా ఆలోచించిన ఆ వ్యక్తి ఆపై తనకు తెలిసిన ఒక యుక్తిపరుడి సహాయంతో అక్కడకు దగ్గరలో ఉన్న ఒక బ్రిటీషు అధికారి దగ్గరకువెళ్ళి అతడితో తన పథకం గురించి చెప్పాడు. అతడికి ఎక్కువ మొత్తంలో లంచం ఇవ్వటానికి కూడా సిద్ధపడ్డాడు. ఉచితంగా డబ్బు వస్తూ ఉంటే కాదనటం ఆ బ్రిటీషు అధికారికి అలవాటు లేదు. ఆపై అతడు చిరునవ్వు నవ్వి “నీకు నేను ఏం సాయం చెయ్యాలో చెప్పు. వెంటనే చేస్తాను” అన్నాడు. అప్పుడు ఆ వ్యక్తి మరియు అతడికి సహాయంగా వచ్చిన యుక్తిపరుడు, సంయుక్త

స్వరంతో ఆ బ్రిటీషు అధికారితో “అయ్యా! ప్రస్తుతం మా ఆధీనంలో ఉన్న ఆ బ్రాహ్మణుల యొక్క వందలాది ఎకరాల భూమిని మాకు చెందేటట్లుగా ప్రభుత్వం తరపున మాకు అధికార పత్రాలు (పట్టాలు) ఇవ్వండి. మిగిలిన వ్యవహారాలు మేము చూసుకుంటాం” అన్నారు. ఆ బ్రిటీషు అధికారి బిగ్గరగా నవ్వి “రేపు సాయంత్రం లోగా మీకు ఆ భూములమీద పూర్తి అధికారం ప్రభుత్వం నుండి లభిస్తుంది. మీకు ఆ భూమి లభించిన వెంటనే నాకు ఇవ్వాల్సిన ధనరూప కానుకను పంపించండి” అన్నాడు. ఆ బ్రిటీషు అధికారి చెప్పినవిధంగానే ఆనాటి బ్రిటీషు ప్రభుత్వం ఆ బ్రాహ్మణుల వందల ఎకరాల భూమికి ఆ వ్యక్తిని యజమానిగా ధృవీకరించింది. ఆపై ఆ వ్యక్తి ఆ భూములన్నింటినీ తన ఆధీనంలోకి తెచ్చుకుని, ఆపై ఆ బ్రాహ్మణులు తన దగ్గర ఉంచిన వెండి, బంగారాలను అమ్మి అలా వచ్చిన సొమ్ములో సగ భాగాన్ని ఆ బ్రిటీషు అధికారికి లంచంగా ఇచ్చాడు. అప్పటి నుండి ఆ వ్యక్తి ఆ ప్రాంతంలో ఒక చిన్నస్థాయి జమిందారుగా లేదా ఒక పెద్ద భూస్వామిగా గౌరవం పొందటం ప్రారంభించాడు.

సరిగ్గా, సంవత్సరం పూర్తి అయిన ఏడవ రోజున ఆ బ్రాహ్మణ కుటుంబం తమ గ్రామానికి తిరిగి వచ్చింది. అలా గ్రామంలోకి ప్రవేశించగానే ఆ కుటుంబానికి “తాము తమ ఆస్తుల్ని ఎంతో నమ్మకంతో అప్పగించిన వ్యక్తి వాటిని కాజేసాడని” తెలిసింది. ఆపై వాళ్ళు ఊకుమ్మడిగా ఆ వ్యక్తి ఇంటికివెళ్ళి ఆ వ్యక్తిని నిలదీసారు. తనకి ప్రభుత్వ మద్దతు కూడా ఉన్న కారణంగా ఆ వ్యక్తి పెద్ద స్వరంతో ఆ బ్రాహ్మణ కుటుంబ పెద్దని గద్దించి ఆపై ఇలా అన్నాడు. “మీరు జంధ్యం వేసుకున్న బ్రాహ్మణులు. మీరు అడిగితే ఎవరైనా దాన ధర్మాలు చేస్తారు. మీకు ఎలాగైనా పొట్ట గడుస్తుంది. కానీ, నా లాంటి వాడికి ఆ అవకాశం లేదు. ఏదో ఆ దేవుడు నన్ను కరుణించటం వల్ల మీ ఆస్తులు నా సొంతం అయ్యాయి. మీరు ఏమాత్రం గొడవ చెయ్యకుండా ఇక్కడ నుండి వెళ్ళిపోండి. మీ ఆస్తుల విషయం మర్చిపోండి. సాక్షాత్తు బ్రిటీషు ప్రభుత్వమే మీ ఆస్తులను నాకు ఇచ్చేసింది. ఇక, మీరు నన్ను ఏమీ చెయ్యలేరు. మీరు ఏమైనా గొడవచేస్తే మీ ఇంట్లో అందరినీ చంపి ఒకేచోట అందరినీ పాతరవేస్తాను. నేను అలా చెయ్యకముందే మీరంతా మర్యాదగా వెళ్ళి మీ ప్రాణాలు దక్కించుకోండి”. ఆ వ్యక్తి అన్నంతపని చెయ్యగల దుర్మార్గుడే అని ఆ క్షణంలో ఆ బ్రాహ్మణ కుటుంబానికి స్పష్టంగా అర్ధమయ్యింది. ఆపై వాళ్ళు నేరుగా తమ ఇంట్లోకివెళ్ళి తలుపులు వేసుకున్నారు. చుట్టు ప్రక్కలవాళ్ళు ఆ బ్రాహ్మణ కుటుంబానికి జరిగిన దారుణమైన అన్యాయానికి చాలా బాధపడ్డారు. కానీ, కండబలం గల మరియు కొత్తగా వచ్చిన ధనబలం

కలిగిన ఆ వ్యక్తిని ఎదిరించే ధైర్యం ఆ గ్రామ ప్రజల్లో ఎవరికీ లేదు. దాంతో వాళ్ళు మనసులోనే బాధపడుతూ మౌనంగా ఉండిపోయారు.

ఆ రోజు రాత్రి ఆ బ్రాహ్మణ కుటుంబంలో ఒక్క మధ్యవయస్సు స్త్రీ తప్ప మిగిలిన అందరూ విషాన్ని భోజనంలో కలుపుకుని తిన్నారు. విష ప్రభావం వల్ల వారందరూ మగతకమ్మి పడిపోయారు. ఆ రోజు నిండు పున్నమి. సరిగ్గా రాత్రి 12 గంటల సమయంలో ఆ వ్యక్తి గాఢ నిద్రలో ఉన్నాడు. అప్పుడు ఆ ఇంటి బైట పెద్దగా కుక్కలు అరుస్తున్నాయి. అలా కుక్కలు అరుస్తూ ఉంటే, లోపల – మంచి నిద్రలో ఉన్న ఆ వ్యక్తికి మెళుకువ వచ్చేసింది. దాంతో అతడు తలుపులు తెరుచుకుని వాకిట్లోకి వచ్చి చూసాడు. ప్రధాన ద్వారం బైట ఒక మధ్యవయస్సు స్త్రీ నగ్నంగా, జుట్టు విరబోసుకుని నిలబడి ఉన్నది. ఆమె, అప్పటికి కొద్ది నిమిషాల క్రితమే తలస్నానం చేసినందుకు గుర్తుగా ఆమె శిరోజాల నుండి నీళ్ళు కారుతున్నాయి. శరీరం అంతా తడిగా ఉన్నది. ఆమెనుచూసి ఆ వ్యక్తి ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు. అప్పుడు ఆ స్త్రీ ఉగ్రమైన స్వరంతో ఆ వ్యక్తితో "ఉరేయ్! నిన్ను నమ్మి మా ఆస్తుల్ని నీ చేతిలోపెట్టి వెళితే, నీవు అతి నీచంగా నమ్మకద్రోహం చేసావు. మా ఆస్తుల్ని నీ సొంతం చేసుకుని మమ్మల్ని బికారులను చేసావు. నువ్వు చేసిన ఈ పనివల్ల మా కుటుంబంలోని చిన్న పిల్లతో సహా అందరూ విషం త్రాగి చనిపోవటానికి సిద్ధంగా ఉన్నారు. నేనుకూడా చనిపోబోతున్నాను. కానీ, నేను చచ్చేముందు నీకు ఒక సత్యం చెప్పటానికి వచ్చాను. మేము నిజంగా న్యాయాన్ని, ధర్మాన్ని, దైవాన్ని నమ్ముకుని ఇన్నాళ్ళు బ్రతికినమాట నిజమే అయితే, మాకు ఇంత అన్యాయంచేసి, మా చావుకి కారణం అయిన నీవు సర్వనాశనం అయిపోతావు. మమ్మల్ని మోసంచేసి నీ సొంతం చేసుకున్న ఆస్థిలో ఒక్క పైసాకూడా నీ కుటుంబానికి దక్కదు. నీ వారసులు అడుక్కుతింటూ జీవిస్తారు. ఇది సత్యం" అన్నది. ఆ వ్యక్తి ఏదో అనేలోగానే ఆ నగ్న స్త్రీ, గిరుక్కున వెనక్కితిరిగి ఆ అర్ధరాత్రి సమయంలో ఆ గ్రామ బజారుగుండా వేగంగా పగులుతీస్తూ తన ఇంటికి చేరుకున్నది. ఆమె వెళ్ళేసరికి ఆమె ఇంట్లోని వారందరూ చావుకి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళ నోటి చివర్ల నుండి – విష ప్రభావంవల్ల నురుగులు వస్తున్నాయి. ఆపై ఆమె వాళ్ళందరినీచూసి ఒక్కసారి వెర్రిగా కేకవేసి ఆపై పెరట్లోకి పరుగెత్తి అక్కడ ఉన్న లోతైన బావిలోకి గభాల్లున దూకింది. మర్నాడు మధ్యాహ్నం 12 గంటల ప్రాంతంలో ఆ వూళ్ళోని ప్రజలందరూ ఆ బ్రాహ్మణుడి ఇంటి దగ్గరకు వచ్చారు. మూసి ఉన్న ఆ ఇంటి తలుపులు పగలకొట్టి చూడగా "లోపల పిల్లలు,

పెద్దలు కలిపి మొత్తం 30 మృతదేహాలు కనిపించాయి. పెరట్లోకి వెళ్ళి చూడగా అక్కడ ఉన్న బావిలో శవమై తేలుతున్న ఆ ఇంటి స్త్రీ కనిపించింది".

ఊళ్ళో అందరూ ఆవ్యక్తిని అనేక రకాలుగా నిందించారు. కానీ, అప్పనంగా ఆస్తులు వచ్చిన ఆ వ్యక్తి ఆ తిట్ల గురించి ఏమాత్రం పట్టించుకోలేదు. ఆ తరువాత 50 సంవత్సరాలు గడిచాయి. ఆ వ్యక్తి అన్యాయంగా సొంతం చేసుకున్న ఆస్తులన్నీ చాలా విచిత్రంగా అతనికి దక్కకుండా పోయాయి. అతని మనుమడు ఆ గ్రామానికి దగ్గరలో ఉన్న పట్టణానికివెళ్ళి, అక్కడ కూలి పనులు చేస్తూ బ్రతుకుతున్నాడు. ఆ మనుమడి కుటుంబ సభ్యులు విచిత్రమైన రోగాలతో బాధపడ్డారు. దారుణమైన పేదరికం, అంతకన్నా భయంకరమైన వ్యాధులతో ఆ వ్యక్తియొక్క వారసులు చాలాకాలంపాటు బాధలు పడ్డారు. ఆ తరువాత ఏమైంది? అన్న విషయం స్పష్టంగా తెలియటంలేదు. ఏదిఏమైనా, తమకు జరిగిన అన్యాయానికి ఒక పుణ్యస్త్రీ ఇచ్చిన శాపం ఆ వ్యక్తిని మరియు ఆ వ్యక్తి తరువాత తరాలవారిని నాశనం చేసింది. ఆ కారణంగానే "చేసిన పాపము, చెడని పదార్థము" అది ఏనాటికైనా తిరిగి – ఆ పాపం చేసినవాళ్ళని బలి తీసుకుంటుంది అన్న విషయాన్ని ఎవరూ ఏనాడూ మర్చిపోకూడదు.

**♦ రతీదేవి శాపం :**

శివ–పార్వతి దంపతులకు జన్మించిన పుత్రుడు మాత్రమే మహా దుర్మార్గుడైన రాక్షసుడిని సంహరించగలడని బ్రహ్మదేవుడు ఆ రాక్షసుడికి వరం ఇచ్చాడు. ఫలితంగా, ఆ రాక్షసుడు మూడు లోకాలను హింసించటం ప్రారంభించాడు. ఆ సమయానికి పార్వతి మరియు శివుడు వేరు వేరుగా ఉంటున్నారు. కొంతకాలానికి శివుడు హిమాలయ పర్వతాలమీద ఉన్న ఒక అడవిలో తపస్సు చేసుకుంటున్నప్పుడు పార్వతి అతడి ప్రక్కనే కూర్చుని అతడికి సేవలు చేస్తూ ఉంటేది. శివుడు అలా వందల సంవత్సరాలపాటు తపస్సులో ఉండిపోయాడు. శివుడు తపస్సుమానివేసి పార్వతితో దాంపత్యం జరిపినప్పుడు మాత్రమే వారికి బిడ్డ జన్మిస్తాడు. ఆ బిడ్డ జన్మించేదాకా దేవతలు, మానవులు – ఆ రాక్షసుడు పెట్టే దారుణ హింసలను భరిస్తూ ఉండాలి.

ఇక అలా ఎన్నో ఏళ్ళపాటు ఆ బాధలను భరించిన దేవతలు ఆపై ఆ బాధలను ఓర్చుకోలేక బ్రహ్మదేవుడి దగ్గరకు వెళ్ళి "మమ్మల్ని రక్షించమని" ఆయన్ని వేడుకున్నారు. శివుడు తపస్సు ముగిస్తేగాని, ఆయన దృష్టి పార్వతిపై పడదు. అలా పడితేగాని వారి మధ్య సంగమం జరగదు. అలా జరగాలంటే – ముందు శివుడి తపస్సు భగ్నం

కావాలి. అయితే, శివుడి తపస్సుని భగ్నంచేసే శక్తి మరియు ధైర్యం ఆ సమయంలో ఎవరికీ లేవు. అయితే, లోక హితంకోసం బ్రహ్మదేవుడి కుమారుడైన మన్మధుడు, శివుడి తపస్సుని భగ్నం చెయ్యటానికి సిద్ధపడ్డాడు. ఆపై, మన్మధుడు తన భార్య రతీదేవితో కలిసి శివుడు తపస్సు చేసుకుంటున్న ప్రాంతానికివెళ్ళాడు. ఆపై శివుడిపై తన పూలబాణాలు అనగా మన్మధ బాణాలువేసాడు. ఆ బాణాల ప్రభావం కారణంగా శివుడిలో కామ వికారం తల ఎత్తింది. ఫలితంగా, ఆయన తపస్సు భగ్నం అయ్యింది. ఆపై ఆయన క్రోధంతో కళ్ళు తెరచి చూడగా ఎదురుగా మన్మధుడు కనిపించాడు. అతడి కారణంగానే తన తపస్సు ఆగిపోయింది అని గ్రహించిన శివుడు ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా తన మూడవ కన్ను తెరచాడు. అంతే, ఆ మూడవ కంటి నుండి అతి భయంకరమైన అగ్ని జ్వాలలు బైటకు వచ్చి నేరుగా మన్మధుడిపై పడ్డాయి. ఆ మరుక్షణమే మన్మధుడు బూడిద కుప్పగా మారి నేలపై పడ్డాడు. అది గమనించిన రతీదేవి ఎంతో బాధతో ఆ బూడిద కుప్పను తన రెండు చేతులతో పట్టుకుని పెద్దగా రోదించింది. ఆ తరువాత రతీదేవి దు:ఖాన్ని దిగమింగుకుని, కఠినమైన స్వరంతో అక్కడే ఉన్న పార్వతీదేవిని ఇలా శపించింది. "లోకహితంకోసం నీకు బిడ్డలు కలగాలని ప్రయత్నించిన నా భర్త మన్మధుడిని నీ కాబోయే భర్త పరమశివుడు భస్మం చేసాడు. ఇప్పుడు నాకు బిడ్డల్ని కనే యోగం లేకుండా పోయింది. అందువల్ల నీవు కూడా బిడ్డల్ని కనలేకుండా పోతావు".

ఆ తరువాత కాలంలో శివ-పార్వతులు, సంతానంకోసం సంభోగం జరుపుతున్న సమయంలో శివుడి నుండి విడుదల అయిన వీర్యం పార్వతియొక్క యోనిలో పడింది. భరించరాని ఉష్ణోగ్రతతో మరుగుతున్న ఆ వీర్యం యొక్క శక్తిని తట్టుకోలేకపోయిన పార్వతి ఆ వీర్యాన్ని బైటకు పంపించివేసింది. లోక రక్షణకోసం అవతరించబోతున్న ఒక శక్తివంతుడిని సృష్టించే ఆ శివవీర్యం అలా నేలబడటం గమనించిన అగ్నిదేవుడు ఆ వీర్యాన్ని తనలోకి చేర్చుకున్నాడు. మహాగ్ని స్వరూపుడైన అగ్నిదేవుడు కూడా శివుడి వీర్యం యొక్క ఉష్ణోగ్రతను తట్టుకోలేకపోయాడు. ఫలితంగా, ఆయన ఆ వీర్యాన్ని గంగానదీతీరంలో ఉన్న ఒక దర్భల పొదలో వదిలిపెట్టి వెళ్ళిపోయాడు. దైవ సంకల్పం వల్ల ఆ వీర్యం ఆ దర్భల పొదలోనే బిడ్డగా మారింది. ఆ బిడ్డే ఆ తరువాతకాలంలో శివుడియొక్క రెండవ కుమారుడైన కార్తికేయుడిగా పిలువబడ్డాడు. రతీదేవి శాప కారణంగానే పార్వతీదేవి శివుడి వీర్యాన్ని భరించలేక వదిలివేసింది. అందువల్ల ఆమె, కార్తికేయుడిని తానే కనలేకపోయింది. ఈవిధంగా రతీదేవి ఇచ్చిన శాపం పార్వతీదేవి మీద పనిచేసింది.

◆ఫలించిన పతివ్రత శాపం :

కర్నాటక రాష్ట్రంలోని మైసూర్ నగరానికి 45 కి.మీ. దూరంలోను, బెంగుళూరు నగరానికి 133 కి.మీ. దూరంలోను "తలకాడు" అనే పేరుగల ఒక నిర్మానుష్యమైన మరియు ఇసుకదిబ్బలతో కూడిన ఒక చిన్న పట్టణం ఉన్నది. తలకాడు క్షేత్రానికి చుట్టూ దట్టమైన యూకలిప్టస్ చెట్లతో కూడిన వనాలు ఉంటాయి.

చుట్టూ పచ్చగా వ్యాపించి ఉండే ప్రకృతి మధ్యలో ఎత్తైన ఇసుక దిబ్బలతో కూడిన ఎడారి లాంటి ప్రదేశంగా ఈనాడు కనపడుతున్న "తలకాడు" ఒకప్పుడు అష్టైశ్వర్యాలతో తులతూగిన నగరంగా ఉండేదని చరిత్రకారులు తెలియజేస్తున్నారు.

కావేరీ నది గట్టుమీద ఉన్న ఈ చిన్న పట్టణానికి కర్నాటక చరిత్రలో చాలా గొప్ప పేరు ఉన్నది. ఆ పేరుతో పాటుగా ఆ ప్రాంతానికి ఒక శాపం కూడా ఉన్నది. తనకు జరిగిన అన్యాయానికి రగిలిపోయిన ఒక మహా పతివ్రత ఇచ్చిన ఘోరశాపం అటు మైసూర్ మహారాజా కుటుంబాన్ని, ఇటు తలకాడు పట్టణాన్ని ఎలా దెబ్బతీసిందో తెలిస్తే ఎవరికైనా మహాశ్చర్యం కలగటమే కాకుండా, "శాపాలు నిజంగా ఉన్నాయి" అని విశ్వసించటం జరుగుతుంది. ఆ శాపం ఎలా ఏర్పడింది?, ఆ శాపం ఎలాంటి దారుణమైన ప్రభావాన్ని చూపించింది? అన్న విషయాలను తెలుసుకోవాలంటే, మనం దాదాపు 4 శతాబ్దాల వెనక్కి వెళ్ళాలి....

11వ శతాబ్ద ప్రారంభ భాగంలో పశ్చిమ గంగ వంశీయులు, చోళులతో జరిగిన యుద్ధంలో ఓడిపోయారు. ఫలితంగా, చోళవంశీయులు, పశ్చిమ గంగ వంశీయులకు చెందిన 'తలకాడు' పట్టణాన్ని తమ స్వాధీనంచేసుకుని ఆపై దానికి 'రాజరాజపురం' అనే పేరు పెట్టారు. సరిగ్గా, వందేళ్ళ తరువాత ఆనాడు కన్నడదేశాన్ని పరిపాలిస్తున్న హొయసల వంశీయుడైన 'విష్ణువర్ధనుడు' చోళుల ఆధీనంలో ఉన్న కన్నడ ప్రాంతాలపై యుద్ధం ప్రకటించి, ఆ యుద్ధంలో చోళులను సంపూర్తిగా ఓడించి మైసూర్ ప్రాంతం నుండి తరిమివేసాడు. ఆ సమయంలో తలకాడు ప్రాంతం ఏడు పట్టణాలుగా విభజించబడి ఉన్నది. అంతేకాకుండా, ఈ ప్రాంతంలో ఐదు సన్యాస మఠాలు ఉండేవి. ఈ ఏడు పట్టణాలలో మాలింగి/మలాంగి అనే పట్టణం కూడా ఉన్నది. అంతేకాకుండా, ఈ పట్టణం చాలా పెద్దదిగా ఉండేది. ఆకాలంలో ఈ మలాంగి పట్టణాన్ని 'జననాధపుర' అనే పేరుతో పిలిచేవారు. 14వ శతాబ్ధం మధ్యభాగం వచ్చేసరికి ఈ పట్టణం, హొయసల రాజవంశీయుల ఆధీనంలో ఉన్నది. ఆ తరువాతకాలంలో ఈ ప్రాంతం ఆనాటి విజయనగర చక్రవర్తుల సామంతుగా లేదా పాలెగాడుగా ఉన్న ఒక వ్యక్తి ఆధీనంలోకి వెళ్ళింది.

17వ శతాబ్దం ప్రారంభ భాగంలో శ్రీరంగపట్టణ రాజ్యం – 'తిరుమలరాజ' అనే విజయనగర సామంత రాజు లేదా పాలెగాడు అధికారం కింద ఉండేది. తలకాడు పట్టణం కూడా ఈ శ్రీరంగ పట్టణ రాజ్యంలో భాగంగా ఉండేది. ఈ తిరుమలరాజ అనే పాలిగాడి రెండవ భార్యపేరు అలిమేలమ్మ. ఈ అలిమేలమ్మ, శ్రీరంగపట్టణ రాజ్య మహారాణిగా గుర్తించబడింది. ఈమె, ఆ పట్టణంలో కొలువైన రంగనాధస్వామి ధర్మపత్ని అయిన రంగనాయకి దేవి యొక్క ప్రియ భక్తురాలుగా ఉ ండేదని చెబుతారు. ఆమె, సంవత్సరానికి ఒకసారి తన నగలను రంగనాయకీదేవికి అలంకరించటానికి పంపిస్తూ ఉండేది.

క్రీ.శ. 1610లో ఈ తిరుమల రాజుకి అతి దారుణమైన వ్యాధి సోకింది. వైద్యులు ఎన్ని ప్రయత్నాలు చేసినా ఆ వ్యాధి తగ్గలేదు. "తనని ఆ దైవం మాత్రమే ఈ వ్యాధి నుండి రక్షించగలడు" అని నిర్ణయించుకున్న తిరుమల రాజు, తన రాజధాని నగరం అయిన శ్రీరంగ పట్టణం నుండి తన పెద్ద భార్యతో కలిసి, తన రాజ్యంలోనే ఉన్న తలకాడు పట్టణానికి వెళ్ళటానికి నిర్ణయించుకున్నాడు. ఆ సమయంలో తలకాడు పట్టణంలో అత్యంత మహిమాన్వితమైన ఆలయంగా గుర్తించబడిన వైద్యనాథేశ్వర స్వామి ఆలయంలో కొంతకాలంపాటు పూజలు చేసుకున్నట్లయితే తనకు వచ్చిన వ్యాధి తగ్గుతుందని తిరుమలరాజు భావించాడని చెబుతారు. ఏదిఏమైనా, తిరుమలరాజు – తలకాడుకి వెళ్ళటానికి ముందు తన రాజ్యాన్ని తన చిన్న భార్య అయిన అలిమేలమ్మకు స్వాధీనం చేసాడు.

అలిమేలమ్మ ఆ కాలంలోని స్త్రీలలో మహా సౌందర్యవతిగా, అంతకు మించిన సుగుణవతిగా, మహా పతివ్రతగా గుర్తించబడింది. తన భర్త ఏదోఒకవిధంగా ఆరోగ్యవంతుడు అయితే చాలు అని భావించిన అలిమేలమ్మ తన భర్త తనకు అందించిన రాజ్య భారాన్ని మోయటానికి అంగీకరించింది. "తిరుమలరాజు, శ్రీరంగ పట్టణాన్ని వదిలిపెట్టి తలకాడుకి వెళ్ళాడు" అన్న విషయం తెలుసుకున్న మరుక్షణమే ఆనాటి మైసూర్ రాజు, ఒక్కసారిగా పట్టరాని ఆనందానికి గురయ్యాడు. అందుకు కారణం ఏమంటే, 1. శ్రీరంగ పట్టణ రాణి అయిన అలిమేలమ్మ వద్ద అసాధారణమైన విలువ గల అనేక బంగారు, రత్న ఆభరణాలు ఉన్నాయి. వాటిని తన సొంతం చేసుకోవాలని ఆనాటి మైసూర్ వడయార్ మహారాజు ఆశపడ్డాడు. 2. కొంతమంది పరిశోధకుల యొక్క అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, అసాధారణ సౌందర్యవతి అయిన అలిమేలమ్మను కూడా తన సొంతం చేసుకోవాలన్న దురాశ ఆనాటి వడయార్

మహారాజు మనసులో ఉన్నదని చెబుతారు. కనుక, అలిమేలమ్మను కూడా అపహరించాలన్న కోరిక వడయార్ రాజుకి ఉన్నదని భావించవచ్చు.

ప్రస్తుతం శ్రీరంగ పట్టణం రాజ్యానికి రాజులేడు. స్త్రీ అయిన అలిమేలమ్మ తన రాజ్యంపై దండెత్తిన శత్రువులను ఎదుర్కోలేదు. – ఈ విషయం బాగా అర్థం చేసుకున్న వడయార్ రాజు తన సైనికులను శ్రీరంగ పట్టణంమీదకు పంపించాడు. అది క్రీ.శ. 1610వ సంవత్సరం జూన్ నెల. అప్పుడు ఏం జరిగిందంటే...?

ఒక సేనాధిపతి ఆధ్వర్యంలో కొందరు సైనికులు శ్రీరంగపట్టణ రాజ్యాన్ని జయించి, ఆపై అలిమేలమ్మ ఆధీనంలో ఉండే ఆభరణాలను తీసుకోవటంకోసం ఆమె అంత:పురంలోకి ప్రవేశించారు. వాళ్ళు అలా వస్తారని ముందుగా ఊహించిన అలిమేలమ్మ తన దగ్గర ఉన్న ఆభరణాలను ఒక మూటగా కట్టి, ఆపై ఆ మూటను తలపై పెట్టుకుని, తలకాడు పట్టణం వైపు పరుగులు తీసింది. కొంతమంది సైనికులు ఆయుధాలు ధరించి పెద్దగా అరుస్తూ అలిమేలమ్మను వెంటాడారు. “చిరుతపులుల చేత తరమబడుతున్న లేడిలాగా అలిమేలమ్మ ప్రాణాలకు తెగించి పరుగులు తీసింది”.



ఒడయార్ రాజుయొక్క సైనికులచేత తరమబడుతున్న ఆ అలివేలమ్మ ఎంతోదూరం ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని పరుగెత్తింది. అలా పరుగెడుతూ పరుగెడుతూ – చివరికి తలకాడు ప్రాంతంలో ఉన్న మలాంగి పట్టణం దగ్గరకు చేరుకున్నది. అయినా సరే, ఆ సైనికులు ఆమెను మరింత వేగంగా వెంటాడటం ప్రారంభించారు. ఇక, తాను వాళ్ళ చేతుల్లో చిక్కక తప్పదని అర్థంచేసుకున్న ఆమె తన ముక్కుపుడకని ఒక వ్యక్తి ద్వారా శ్రీరంగ పట్టణ ఆలయంలోని రంగనాయకీదేవికి పంపించింది. ఆ తరువాత మిగిలిన నగలన్నింటినీ ఒక గుడ్డలో మూటగా కట్టి ఆపై ఆ మూటను తన రెండు చేతులతో గట్టిగా పట్టుకుని, ఆపై మలాంగి పట్టణానికి ఆనుకుని ప్రవహిస్తున్న కావేరీ నది గట్టుమీదకి చేరుకుని, ఆపై తన దుస్థితికి కారణమైన ఒడయార్ రాజవంశాన్ని ఆమె ఇలా శపించింది.

"తలకాడు మరలాగి, మలాంగి మదువాగి, మైసూర్ అరసరిగె మక్కలగాదిరాలి" (కన్నడ భాషలో ఈ శాపానికి అర్థం ఏమిటంటే... "తలకాడు ప్రాంతం ఇసుక అవుతుంది. మలాంగి ప్రాంతం ఒక సుడిగుండంగా మారిపోవుగాక, మైసూరు ప్రభువులకు సంతానం లేకుండా పోవుగాక".)



**అలిమేలమ్మ శాప ఫలితాలు :**

క్రీ.శ. 15వ శతాబ్దం చివరి వరకు ఎన్నో రాజ వంశాలకు రాజధాని నగరంగా ఒక వెలుగు వెలిగిన "తలకాడు" పట్టణం మహా పతివ్రత అయిన అలమేలమ్మ ఇచ్చిన శాపం కారణంగా ఒక ఎడారిలాగా మారిపోయింది. దాదాపు ఒక మైలు పొడవు ప్రాంతంలో విస్తరించి ఉన్న ఇసుక గుట్టల క్రింద, కొన్ని మీటర్ల లోతులో తలకాడు పట్టణం సమాధి అయిపోయింది. నాటి మైసూర్ పాలకులైన వడయార్ రాజవంశస్తుల దురాశ మరియు పదవీకాంక్ష కారణంగా మహాద్భుతమైన తలకాడు ప్రాంతం, అనంతమైన ఎడారి ప్రాంతంగా మారిపోయిందని చెబుతారు. తలకాడు ప్రాంతంలోకి కొత్తగా అడుగు పెట్టినవారికి "తాము ఒక పెద్ద ఎడారిలో ఉన్నామా? లేక కావేరీ నది ఒడ్డున ఉన్నామా?" అన్న విషయం ఏమాత్రం అర్థంకాదు.

"తలకాడు" ప్రదేశంలో విస్తరించి ఉన్న ఇసుక దిబ్బల్లో కొన్ని, ఒక్కొక్కటి 15 మీటర్ల ఎత్తు వరకు ఉండటం విశేషం. ఆ ప్రాంతంలో ఎంత పరిమాణంలో ఇసుక ఉన్నదో అంచనా వెయ్యటం ఎవరికీ సాధ్యంకాదని చెబుతారు. అతి సారవంతమైన కావేరీ నది గట్టున అపారమైన ఇసుక ఎలా వచ్చింది? – అన్న విషయం ఎవరికీ ఈనాటికీ అర్థం కావటంలేదు. అలిమేలమ్మ ఇచ్చిన శాపం కారణంగానే, పచ్చటి పంటలతో నిండిన ఆ నదీ తీర ప్రాంతం నీరులేని "ఎడారిగా" మారిపోయిందని విశ్వసిస్తారు.

ఆనాడు, కావేరి నది ఒడ్డున ఉన్న మలాంగి అనే గ్రామం, అలిమేలమ్మ ఇచ్చిన శాపం కారణంగా – ఆపై కొద్ది రోజుల్లోనే అనేక ప్రమాదకరమైన సుడిగుండాలతో నిండిన జలప్రాంతంగా మారిపోయింది (అనగా, ఆ గ్రామ భూభాగం – కావేరీ నదిలో భాగంగా మారిపోయింది అన్నమాట). ఈ మలాంగి ప్రాంతంలో ఉన్న జలం యొక్క లోతు ఎంతో ఈనాటికీ ఎవరికీ తెలియదు. ఈ ప్రాంతంలో ఉన్న సుడిగుండాలలో చిక్కుకుని ఎంతోమంది ఆచూకీలేకుండా ప్రాణాలు కోల్పోయారు.

కావేరీ నది, మలాంగి ప్రాంతంలో వంపు తిరిగి ప్రవహిస్తుంది. ప్రస్తుతం ఈ మలాంగి ప్రాంతంలోని కావేరీ నదిలో లోతు ఎంతో తెలియని అనేక సుడిగుండాలు ఉన్నాయి. చూడటానికి పైకి చాలా ప్రశాంతంగా కనిపించినప్పటికీ మలాంగి ప్రాంతంలో ఉండే సుడిగుండాలు ఎన్నో పడవల్ని కూడా ముంచివేసిన సంఘటనలు గతంలో జరిగాయి.

ఒక విశేషం ఏమంటే, ఇప్పటికీ ఇసుక – ప్రతి సంవత్సరం దాదాపు 9 మీటర్ల ముందుకి వస్తూ ఉంటుంది. ముఖ్యంగా, నైరుతి ఋతుపవనాలు అతిశక్తివంతంగా పనిచేస్తున్న కాలంలో ఇసుక ముందుకి వస్తూ ఉంటుంది. ఫలితంగా, ఇప్పటికీ తలకాడు ప్రాంతంలో – ఇసుక ముంపుకి గురి అవని ప్రదేశాలలో నివసిస్తున్న ప్రజలు – ముందుకు చొచ్చుకు వస్తున్న ఇసుక కారణంగా తమ ఇళ్ళు వదిలిపెట్టి ఆ ప్రాంతంలో మరింత ముందుకివెళ్ళి అక్కడ నివసించటం జరుగుతుంది. ఫలితంగా, వారు – ప్రతి సంవత్సరం తమ నివాసాలను ముందుకు జరుపుకోవటం జరుగుతున్నది. ఈ ప్రాంతానికి చుట్టుప్రక్కల అమిత సారవంతమైన భూములు ఉన్న కారణంగా ఆ ప్రజలు తలకాడులోనే ఏదోఒకవిధంగా నివసిస్తున్నారు.

మహా పతివ్రత అయిన అలిమేలమ్మ, మైసూర్ వడయార్ రాజ వంశాన్ని శపించి ఇప్పటికి నాలుగు శతాబ్దాలు గడిచినప్పటికీ, ఆమె ఇచ్చిన శాపం ఇప్పటికీ వడయార్ రాజ వంశాన్ని పీడిస్తున్నది. ఏదిఏమైనా, అలిమేలమ్మ శాపం ఇచ్చిన కొంతకాలానికే ఆనాటి వడయార్ రాజుయొక్క కుమారులు హఠాత్తుగా ఒకరి తరువాత ఒకరు చనిపోయారు. ఆ పతివ్రత శాపం తన కుటుంబాన్ని పీడిస్తున్నదని అర్ధంచేసుకున్న వడయార్ మహారాజు తన భవనంలో అలమేలమ్మ యొక్క విగ్రహాన్ని ప్రతిష్ఠించి, ఆమెను పూజించటం ప్రారంభించాడు. ఈనాటికీ ఆ విగ్రహానికి మైసూర్ రాజ వంశీకులు ఎంతో భక్తిశ్రద్ధలతో పూజలు చేస్తూ ఉంటారు.

అలిమేలమ్మ శాపం కారణంగానే, 17వ శతాబ్దం ప్రారంభం నుండి వడయార్ రాజ వంశంలో పురుష సంతానం లేకుండా పోయింది. అది ఎలాగంటే, హైందవ రాజ్య వారసత్వ నియమాల ప్రకారంచూసినట్లయితే – రాజుగారి పెద్ద కొడుకు రాజుగారికి వారసుడిగా సింహాసనాన్ని అధిస్తాడు. ఆయన తరువాత ఆయన పెద్ద కొడుకు ఆ రాజ్యానికి రాజు అవుతాడు. వడయార్ రాజవంశం విషయానికి వచ్చినట్లయితే, ప్రతి రెండు తరాలకు ఒకసారి ఈ వంశంలో వారసుడు పుడతాడు. (అనగా ప్రస్తుతం రాజుగా ఉన్న వ్యక్తికి కొడుకు పుడతాడు అన్నమాట.) అందువల్ల, నేరుగా పుత్ర సంతానంలేని వడయార్ రాజు తన తమ్ముడి కొడుకుని లేదా తన చెల్లెలు కొడుకుని తన వారసుడిగా నియమించటం జరుగుతుంది. మైసూర్ రాజవంశంలో 17వ శతాబ్దం నుండి మొన్నటి వరకు గొప్ప ప్రభువులుగా గుర్తించబడిన ఆరుగురు వడయార్ రాజులకు పెంపుడు కొడుకులే వారసులు అయ్యారు.

అలిమేలమ్మ ఇచ్చిన శాపం కారణంగా, వడయార్ వంశంలో నాలుగు శతాబ్దాల నుండి సరైన లేదా నిజమైన వారసుడు లేకుండా పోయాడు. రెండు తరాలకు ఒకసారి వాళ్ళ కుటుంబంలో మగపిల్లవాడు పుడతాడు. అలా పుట్టినప్పుడు ఆ సమయంలో రాజుగా ఉన్న వడయార్ వంశస్తుడు తన చెల్లెలి కొడుకుని లేదా ఇతర దగ్గర బంధువుల బిడ్డని దత్తత తీసుకుని, ఆపై ఆ బిడ్డని వడయార్ వంశ వారసుడిగా ప్రకటించటం జరుగుతుంది. వడయార్ రాజవంశంలో చాలా గొప్పవాడిగా పేరుపొందిన నల్వాడి కృష్ణరాజ వడయార్‌కి సంతానంలేదు. అందువల్ల ఆయన తన మేనల్లుడైన జయచామరాజను దత్తత తీసుకుని అతడిని తన వారసుడిగా ప్రకటించాడు.

2013లో శ్రీకంఠదత్త వడయార్ మరణించాడు. ఈయనకు సంతానంలేదు. అందువలన ఆయన పెద్ద చెల్లెలు గాయత్రిదేవి కుమారుడైన కంఠరాజ ఉరుసు అనే రాజవంశీకుడు, శ్రీకంఠదత్తకు అంత్యక్రియలు చెయ్యటం జరిగింది. ఆ తరువాత ఈయన భార్య అయిన ప్రమోదాదేవి తన మరిది మనుమడు అయిన యదువీర్ కృష్ణదత్తను 2015లో తమ వారసుడిగా దత్తత తీసుకున్నది.

**తలకాడు స్థలపురాణం :**

గతంలో ఈ ప్రాంతం ఒక దట్టమైన అరణ్యంగా ఉన్న సమయంలో – ఏనుగులు అధిక సంఖ్యలో ఇక్కడ సంచరిస్తూ ఉండేవి. ఆ కారణంగా, ఆ సమయంలో ఈ ప్రాంతాన్ని 'గజారణ్య క్షేత్రం' అనే పేరుతో పిలిచేవారు.

ఈ తలకాడు క్షేత్రానికి సంబంధించిన అనేక విశ్వాసాలు ఈనాటికీ బహుళ ప్రచారంలో ఉన్నాయి. కొన్ని వందల సంవత్సరాల క్రితం సోమదత్తుడు అనే ఒక యోగి తన శిష్యులతో కలిసి, ఆనాటి తలకాడు ప్రాంతంలో ఒక వృక్షంగా అవతరించిన శివుడిని ఆరాధించటంకోసం వెళుతున్న సమయంలో మార్గ మధ్యంలో కొన్ని అడవి ఏనుగులు వారిపై దాడిచేసి వారందరినీ తమ కాళ్ళతో తొక్కి చంపేసాయి. అలా చనిపోయిన వారందరూ ఆ తరువాత కొద్ది కాలానికే అడవి ఏనుగులుగా జన్మించి, తలకాడు ప్రాంతానికి చేరుకుని, ఆపై అక్కడ వృక్ష రూపంలో ఉన్న శివుడిని ఆరాధించటం ప్రారంభించాయి.

కావేరీ నది ఒడ్డున ఉన్న సారవంతమైన ఒక ప్రాంతానికి 'తలకాడు' అన్న పేరు ఎలా వచ్చింది? – అని తెలియజేసే ఒక కథ ఈ ప్రాంతంలో ప్రచారంలో ఉన్నది. అది ఏమిటంటే...తల మరియు కాడ అనే ఇద్దరు వెటగాళ్ళు ఒక సమయంలో ఈ అరణ్యంలోకి వచ్చారు. ఈ ప్రాంతంలో వాళ్ళు సంచరిస్తూ ఉండగా వాళ్ళకి ఒక అసాధారణమైన వృక్షం కనపడింది. వీళ్ళు ఆ వృక్షాన్ని గొడ్డళ్ళతో నరకటానికి ప్రయత్నించారు. వాళ్ళు తమ గొడ్డళ్ళతో ఆ చెట్టు మొదట్లో చెరొక దెబ్బ వేసారో – లేదో హఠాత్తుగా ఆ చెట్టు కాండం నుండి ఎర్రటి రక్తం బైటకు స్రవించటం మొదలయ్యింది. ఆ దృశ్యంచూసి, వాళ్ళు భయంతో హడలిపోయారు. ఏం చెయ్యాలో అర్థంకాక ఆ చెట్టువైపు నోరుతెరచి చూస్తూ ఉండిపోయారు. సరిగ్గా అదే సమయంలో ఒక అదృశ్య స్వరం ఇలా వినిపించింది. "మీరు వెంటనే, ఈ చెట్టుయొక్క ఆకులతో మరియు పండ్లతో ఈ చెట్టుమీద – మీరు నరికిన ప్రదేశంలో కట్టులాగా కట్టండి. త్వరలో ఆ చెట్టు గాయం మానిపోతుంది".

అలా వారం రోజులపాటు ఆ ఇద్దరు వేటగాళ్ళు అక్కడే ఉండి ప్రతిరోజూ ఉదయ సమయంలో ఆ చెట్టు గాయానికి కట్లు కట్టారు. ఎనిమిదవ రోజు ఉదయం కట్లు విప్పి చూసే సరికి ఆ చెట్టు యధాతధంగా మారిపోయింది. సాక్షాత్తు పరమశివుడే ఆ చెట్టుకి గాయాన్ని తగ్గించాడు కనుక అప్పటి నుండి ఈ ప్రాంతంలో ఉన్న శివుడికి 'వైద్యేశ్వరుడు' అన్న పేరు వచ్చింది. ఈ ప్రక్కనే పంచ లింగాలు కూడా ప్రతిష్ఠించబడ్డాయి.

ఈనాటికీ తలకాడు ఇసుక దిబ్బల క్రింద దాదాపు 30 ఆలయాలు దాగి ఉన్నాయని చెబుతారు. తలకాడులో ఉన్న ఆలయాల అన్నింటిలోకి వైద్యనాథేశ్వర ఆలయం చాలా పెద్దదని తెలుస్తున్నది. ఈ ఆలయాన్ని ఒకప్పుడు ఈ ప్రాంతాన్ని పరిపాలించిన చోళరాజులు నిర్మించారు.

తలకాడులో ఉన్న పాతాళేశ్వర ఆలయంలో ఉన్న పాతాళేశ్వర శివలింగం సూర్యోదయం నుండి సూర్యాస్తమయం వరకు మూడు రంగులు మారుస్తుందని తెలుస్తున్నది. ఉదయంపూట ఎరుపురంగులోను, మధ్యాహ్న సమయంలో నలుపురంగులోను, సాయంత్ర సమయంలో తెలుపురంగులో ఈ శివలింగం కనిపిస్తుంది. పంచలింగ ఉత్సవం సందర్భంలో మాత్రమే భక్తులు ఈ శివాలయాల్లోకి వచ్చి పూజలు చేసుకునే అవకాశం ఉంటుంది. ఆ సందర్భంలో వేలాదిమంది హైందవ భక్తులు ఈ ప్రాంతంలో కనిపిస్తారు. ఇతర సమయాలలో ఈ ప్రాంతం చాలా వరకు నిర్మానుష్యంగా ఉంటుంది. అప్పుడప్పుడూ కొంతమంది ఇక్కడికి విహారయాత్రకు వస్తూ ఉంటారు.

పాతాళేశ్వర, మరులేశ్వర, అర్కేశ్వర, వైద్యనాధేశ్వర, మల్లిఖార్జున – అనే ఐదు శివాలయాలను 'పంచలింగములు' అని పిలుస్తారు. ఈ పంచలింగముల గౌరవార్ధం ప్రతి 12 సంవత్సరాలకు ఒకసారి 'పంచలింగ దర్శన' అనే కార్యక్రమాన్ని నిర్వహిస్తారు. కార్తీకమాసంలోని అమావాస్య తిధినాడు ఈ ఉత్సవం జరుగుతుంది. ఆ రోజున ఈ క్షేత్రానికి వచ్చిన భక్తులు, గోకర్ణతీర్ధంలో స్నానంచేసి ఆపై గోకర్ణేశ్వర మరియు చండికాదేవి ఆలయాల్లో పూజలు చేసుకుని, ఆ తరువాత వైద్యేశ్వరస్వామిని దర్శించుకోవాలి. ఆ తరువాత కావేరి నది యొక్క ఉత్తర – తూర్పు – దక్షిణ – పశ్చిమ – దిక్కులలో ఉన్న జలాలలో స్నానంచేసి, ఆపై అర్కేశ్వర, పాతాళేశ్వర, మరలేశ్వర, మల్లిఖార్జున ఆలయాలను దర్శించుకోవాలి. ఇంకొక విశేషం ఏమంటే, ఈ నాలుగు ఆలయాల దర్శనం తరువాత మళ్ళీ వైద్యేశ్వరస్వామిని దర్శించుకోవలసి ఉంటుంది. ఈ ఆలయాన్ని దర్శించిన తరువాత చివరగా కీర్తినారాయణ ఆలయాన్ని దర్శించుకుని ఆపై ఈ క్షేత్రంలోంచి బైటకు రావటం జరుగుతుంది.

ఈ పంచలింగ ఆలయములే కాక, ఇంకా, కపిలేశ్వర ఆలయం అనే పేరుగల ఒక అద్భుత ఆలయం ఉన్నది. ఈ ఆలయంలో నవగ్రహాలు కనిపిస్తారు. ఏదిఏమైనా, తలకాడు క్షేత్రంలోని ఆలయాలన్నీ అసాధారణమైన వాస్తు కళతో భక్తుల కళ్ళకు విందు చేస్తూ ఉంటాయి. ప్రస్తుతం, ఈ క్షేత్రంలో ప్రతి 12 సంవత్సరాలకు ఒకసారి ఇక్కడ ఉన్న ఐదు శివాలయాలలో కొలువైన పంచలింగాలకు ప్రత్యేక పూజలు జరుగుతాయి. ఆ మర్నాటి నుండి ఈ ఆలయాల్లో ఏవిధమైన పూజలు ఉండవు.

ప్రస్తుతం ఈ తలకాడు, ఇసుక గుట్టలక్రింద దాదాపు 30 ఆలయాలు దాగి ఉన్నాయని అంతరిక్షంలో సంచరించే ఉపగ్రహాలు తెలియజేసాయి. ఈ ఆలయాలలో

ముఖ్యమైనది అయిన 'కీర్తినారాయణ్' ఆలయాన్ని సంపూర్తిగా ఇసుక నుండి బైటకు తీసారు. కీర్తినారాయణ ఆలయంలోని నారాయణుడి విగ్రహం 8 అడుగుల ఎత్తు ఉంటుంది. ఈ స్వామికి రెండువైపులా శ్రీదేవి మరియు భూదేవిలు కనిపిస్తారు.



వైష్ణవ మతస్థాపకుడిగా పేరుపొందిన రామానుజాచార్య తన కర్నాటకదేశ యాత్రలో భాగంగా తలకాడు ప్రాంతానికి వచ్చి, ఇక్కడ కీర్తినారాయణ ఆలయాన్ని నిర్మించాడని చెబుతారు. ఈ ఆలయంతో పాటుగా ఇంకొక నాలుగు నారాయణ ఆలయాలను కర్నాటకలోని ఇతర ప్రాంతాలలో రామానుజుడు ఏర్పాటు చేసాడు. అందువలన, ఈ ఐదు నారాయణ క్షేత్రాలను లేదా ఆలయాలను "పంచనారాయణ" క్షేత్రములు అనే పేరుతో పిలుస్తారు. తలకాడు క్షేత్రంలోని ఆలయాలను – ఉదయం 8 గంటల నుండి సాయంత్రం 6.30 గంటల మధ్య భక్తులు దర్శించుకోవచ్చు.

**ఈ క్షేత్రానికి ఎలా చేరాలి....?**

మైసూర్ నుండి 45 కి.మీ. దూరంలోను, బెంగుళూరు నుండి 185 కి.మీ. దూరంలోను తలకాడు క్షేత్రం ఉన్నది.

కర్నాటక రాష్ట్రంలోని టి.నర్సీపురం నుండి 29 కి.మీ. దూరంలోను, మైసూర్ నుండి 45 కి.మీ. దూరంలోను ఉన్న తలకాడు క్షేత్రానికి టి.నర్సీపురం నుండి మరియు మైసూర్ నుండి ప్రభుత్వ మరియు ప్రైవేటు బస్సులు క్రమం తప్పకుండా నడుస్తున్నాయి.

**శాపాలు–పరిహారములు :**

ఈనాడు ప్రపంచాన్ని శాసిస్తున్న మహాశక్తి "అమెరికా" అంటే అతిశయోక్తికాదు. సైన్స్‌పరంగా అమెరికాను మించిన అధునాతన దేశం ప్రపంచంలో ఇంకొకటిలేదు

అని చెప్పవచ్చు. కానీ, అలాంటి దేశంలో కూడా మానవాతీత శక్తులను, శాపాలను చాలా బలంగా విశ్వసిస్తున్నారు. ఉదాహరణకి – అమెరికా దేశాన్ని అత్యంత సమర్ధవంతంగా పరిపాలించిన నాటి అమెరికా అధ్యక్షుడు అయిన కెనడి వంశానికి ఒక జిప్సీ మంత్రగాడు ఇచ్చిన శాపం తగిలింది. అందుకు కారణం ఏమంటే, 19వ శతాబ్దం మొదటి భాగంలో ఒక కెనడి – న్యూయార్క్ నగరంలో ఒక ఇంటి స్థలాన్ని కొన్నాడు. అయితే, అప్పటికే ఆ స్థలంలో – సంచార జాతిగా గుర్తించబడిన జిప్సీ జాతికి చెందిన ఒకవ్యక్తి తన కుటుంబంతో సహా ఎన్నో సంవత్సరాలుగా నివసిస్తున్నాడు. ఆ స్థలాన్ని కొనుక్కున్న కెనడి, ఆ జిప్సీని అక్కడ నుండి కుటుంబ సమేతంగా బలవంతంగా వెళ్ళగొట్టాడు. “తాను ఎన్నో ఏళ్ళుగా ఉంటున్న ప్రదేశం నుండి తనని బలప్రయోగంతో నెట్టివేయటంతో” ఆ జిప్సీ మంత్రగాడు ఎంతో ఆగ్రహానికి గురయ్యాడు. ఆపై అతడు, కెనడిని ఇలా శపించాడు. “నీవు ఇప్పుడు నిర్మించబోతున్న గృహం నీ వారసుడికోసమే అని నాకు తెలుసు. ఎన్నో ఏళ్ళుగా ఇక్కడ ఉంటున్న నాకు నివాసం లేకుండా చేసావు. అందుకు ప్రతిఫలంగా నీ వంశంలో పుట్టే ప్రతి పురుషుడు తప్పనిసరిగా మధ్యవయస్సులోనే చనిపోతాడు”. ఆ జిప్సీ ఇచ్చిన శాపం ఫలించింది. కెనడి కుటుంబంలో పుట్టిన కొడుకులు – హత్య కారణంగానో, ప్రమాదం కారణంగానో చనిపోవటం జరిగింది. కొంతమంది ఆధునికులు “ఈ శాపాలు, చేతబడులు అంటే మేము నమ్మం. శాపాలు అసలు ఉండవు. అందువల్ల శాపాల గురించి మాకు చెప్పొద్దు” అని తరచుగా అంటూ ఉంటారు. కానీ, ఈ ఆధునికులు గుర్తుపెట్టుకోవలసిన ఒక ముఖ్య విషయం ఏమంటే, “ఒక మనిషికి శాపంపట్ల నమ్మకం ఉన్నా, లేకున్నా ఆ శాపం ఆ మనిషిని ఖచ్చితంగా దెబ్బతీస్తుంది. వ్యాపారాలలో తీవ్రంగా నష్టపోయినప్పుడో, చేస్తున్న మంచి ఉద్యోగం హఠాత్తుగా ఊడిపోయినప్పుడో, చేతికి అంది వచ్చిన పిల్లలు ఏదో ప్రమాదంలో దారుణంగా చనిపోయినప్పుడో – “శాపం” తగలటం వల్ల ఈ దారుణమైన కష్టం వచ్చింది అని తెలుసుకోవటం వల్ల ఏ ప్రయోజనం ఉండదు. ముందుగానే జాగ్రత్తపడితే ఎంతశక్తివంతమైన శాపానికైనా విరుగుడు చేసే అవకాశం ఉంటుంది”.

ఇటీవలకాలంలో సైన్స్ ఎంతగా అభివృద్ధి చెందుతున్నప్పటికీ,మానవాతీత శక్తులకు సంబంధించిన విశ్వాసాలు కూడా బలపడుతూ ఉండటం విశేషం. ఎందుకంటే, జ్ఞానం పెరిగిన కొద్దీ మనిషికి వాస్తవాలు తెలుస్తాయి. “సగం జ్ఞానం మాత్రమే ఉన్నవాళ్ళకి ఏ విషయం గురించి పూర్తి అవగాహన ఉండదు”. ఒక కుటుంబాన్ని లేదా వ్యక్తిని ఏదో ఒక శాపం పీడిస్తున్నప్పుడు, సాధ్యమైనంత తొందరగా

దానికి విరుగుడు లేదా పరిహారం చేసి తీరాలి. లేకపోతే, ఆ శాపం ఆపై ఎన్నో తరాలు ఆ కుటుంబాన్ని పీడిస్తుంది. ఇలాంటి శాపగ్రస్తమైన కుటుంబాలు ప్రపంచ వ్యాప్తంగా ఎన్నో ఉన్నాయని చరిత్ర తెలియజేస్తున్నది. హైందవ జ్యోతిషశాస్త్రంలో ఒక వ్యక్తియొక్క జాతకచక్రాన్నిబట్టి ఆ వ్యక్తిపై ఏదైనా శాపం యొక్క ప్రభావం ఉన్నదా? లేదా? అన్న విషయాన్ని తెలుసుకునే అనేక పద్ధతులు ఉన్నాయి. ఉదాహరణకి – ఒక వ్యక్తి కారణంగా ఒక సర్పం (త్రాచుపాము) నిష్కారణంగా చనిపోయినట్లయితే ఆ వ్యక్తికి మరియు ఆ వ్యక్తి కుటుంబానికి "నాగశాపం" తగులుతుంది. ఈ శాపం తగిలిన కుటుంబాలలో ఆర్థిక పరిస్థితులు అంతకంతకీ దెబ్బతింటూ ఉంటాయి. ఆ కుటుంబంలోని యువతీ యువకులకు వివాహాలు కావటం చాలా కష్టంగా ఉంటుంది. ఒకవేళ పెళ్ళిళ్ళు అయినా సంతానం ఉండదు. ఇక, కొన్ని జాతకాలలో "పితృశాపం" అనే దోషం కనిపిస్తుంది. తన తల్లిదండ్రుల పట్ల గతజన్మలో ఒకవ్యక్తి చేసిన అపచారం కారణంగా ఆ వ్యక్తికి ఈ జన్మలో పితృశాపం అంటుకుంటుంది. ఈ పితృశాపం కూడా ఎన్నో తరాలు – కుటుంబాలను వెంటాడుతూ ఉంటుంది. ఇవే కాకుండా "గురుశాపం", "స్త్రీ శాపం", "కళత్రశాపం", "మార్జాలశాపం" లాంటి శక్తివంతమైన శాపాలు – కొన్ని జాతకాలలో కనిపిస్తాయి. శాపాల వల్ల అనేక రకాల సమస్యలు ఎదుర్కొంటున్నవారు, తప్పనిసరిగా వాటికి తంత్రశాస్త్రంలో చెప్పబడిన పరిహారాలను సాధ్యమైనంత తొందరగా చేయించుకోవటం మంచిది. ఈ పరిహారాల వల్ల ఆ వ్యక్తులకు ఎదురవుతున్న సమస్యలు చాలా వరకు తొలగిపోతాయని చెప్పక తప్పదు.

ఒకవ్యక్తిపై పగ, ప్రతీకారాలను కలిగి ఉన్న ఇంకొక వ్యక్తి, క్షుద్ర ప్రయోగాల ద్వారా తన శత్రువుపై శాపాన్ని ప్రయోగించవచ్చు. ఇక్కడ విశేషం ఏమంటే, తనపై క్షుద్ర ప్రయోగం ద్వారా శాపం ప్రయోగించబడింది అన్న విషయం ఆ వ్యక్తికి అసలు తెలిసే అవకాశం ఉండదు. ఎందుకంటే, ఆ వ్యక్తికి జరిగే చెడు సంఘటనలకు ఏదో ఒక సహేతుక కారణం (లాజిక్) కనిపిస్తూ ఉంటుంది. అందువలన ఆ వ్యక్తి, తనను ఒక శాపం పీడిస్తుంది అన్న విషయాన్ని గ్రహించలేడు. కనుక, అతడు ఆ శాపానికి విరుగుడు చేయించుకోడు.



# 11. తంత్రశాస్త్రంలో చెప్పబడిన 'అష్టమితిథి' అద్భుత విశేషాలు?

"ఈ రోజుల్లో తిథులు, వారాలు అని ఎవరు పట్టించుకుంటున్నారు?" అని చాలా మంది ఆధునికులు - తిథి, వార ముహూర్తాలను చాలా తేలిగ్గా తీసిపారేస్తున్నారు. ఎవరూ పాటించనంత మాత్రాన తిథులకు, వారాలకు మానవుల జీవితాలపై ప్రభావాన్ని చూపించే శక్తి పోతుందని భావించటం చాలా పొరపాటు. గ్రహాలను దూరదర్శనులతో (టెలిస్కోప్) చూసి, ఈనాటి శాస్త్రజ్ఞులు నక్షత్రాల గురించి, గ్రహణాల గురించి చెబుతున్నారు. కానీ, ఈనాటి పాశ్చాత్యదేశాలు కొన్నివేల సంవత్సరాల క్రితం, చాలా అనాగరికంగా జీవిస్తూ ఉండేవి. అలాంటి సమయంలో భారతదేశంలో ఖగోళశాస్త్రజ్ఞానం పరిపూర్ణస్థాయికి చేరుకున్నది. కొన్నివేల సంవత్సరాల క్రితమే, హైందవ మహర్షులు, జ్యోతిషశాస్త్ర విజ్ఞానులు - గ్రహాల గురించి, నక్షత్రాల గురించి చాలా వివరంగా తెలియజేసారు. ఏవిధమైన సాంకేతిక పరిజ్ఞానం లేకుండానే కేవలము తమ మేధస్సుతో లెక్కలువేసి, చంద్రగ్రహణం ఎప్పుడు వస్తుంది?, సూర్యగ్రహణం ఎప్పుడు వస్తుంది? - అనే విషయాలను చాలా ఖచ్చితంగా తెలియ జేసేవాళ్ళు. ఆనాడు వాళ్ళు ఏవిధంగా అయితే ఖచ్చితంగా చెప్పగలిగారో, ఈనాటికీ పంచాంగ కర్తలు గ్రహణ సమయాల గురించి, ఆధునిక ఖగోళశాస్త్రజ్ఞులతో సమానంగా ఖచ్చితంగా చెప్పగలుగుతున్నారు. వారు చెబుతున్న లెక్కలు ఏమాత్రం తప్పటంలేదు. అంతటి శక్తిని కలిగి ఉన్న హైందవ జ్యోతిషశాస్త్రం, తిథులకు సంబంధించిన మంచి, చెడులను చెప్పినప్పుడు వాటిని నమ్మకుండా ఉండటం మేధస్సుకి చిహ్నంగా భావించటం న్యాయమా?.

అమావాస్య తిథినాడు - సూర్య, చంద్రులు ఒకే డిగ్రీమీద, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే సున్నా డిగ్రీమీద ఉంటారు. దీనినే "సూర్య చంద్రుల యుతి" లేదా సమాగమము అని పిలుస్తారు. ఎవరి జాతక చక్రంలో అయినా ఇలాంటి గ్రహస్థితి ఉంటే అది ఆ జాతకులకు మంచిదికాదని, అనగా, ఆ జాతకులకు రవి, చంద్రుల బలం సరిగ్గా అందదని చెబుతారు.

అష్టమి తిథినాడు, సూర్య మరియు చంద్రుల మధ్య "చతురస్రదృష్టి" (స్క్వేర్ యాస్పెక్ట్) ఉంటుంది. జ్యోతిషశాస్త్ర సిద్ధాంతాల రీత్యా చూసినట్లయితే ఈ రెండు గ్రహాల మధ్య - చతురస్ర దృష్టి మంచిదికాదు. అందువల్ల అష్టమి తిథి మంచిదికాదని చెబుతారు.

(సూర్య మరియు చంద్రుల మధ్య చతురస్ర దృష్టి అనగా, ఈ రెండు గ్రహాలు ఉండే స్థానాల మధ్య రెండు రాశుల తేడా లేదా ఎడం ఉంటుంది. ఉదాహరణకి – ప్రఖ్యాత అమెరికా వ్యాపార దిగ్గజం మరియు ప్రపంచ మానవ శ్రేయోభిలాషి అయిన వారెన్‌బఫెట్, ఆగష్టు 30, 1930లో నిర్మించాడు. ఆయన జాతకంలో రవి కన్యారాశిలోను, చంద్రుడు ధనస్సు రాశిలోను ఉన్నారు. అనగా ఆయన జాతకంలో రవి, చంద్రుల మధ్య చతురస్ర దృష్టి ఏర్పడింది.)

చైత్ర మరియు మార్గశిర మాసాలలో వచ్చే "శుక్ల అష్టమి తిథిని – మాస శూన్య తిథి" అని పేర్కొంటారు. ఈ తిథి చాలా అశుభకరమైనది అని చెబుతారు. ఈ తిథినాడు ప్రారంభించే పనులు విజయవంతం అవటం అసాధ్యం అని గుర్తించాలి.

శుక్ల అష్టమినాడు పూర్వాభాద్రా నక్షత్రం ఉన్నట్లయితే దానిని "దగ్ధతిథి" అని పిలుస్తారు. ఈ తిథినాడు రవిగ్రహం, మిధున లేదా కన్యా రాశుల గుండా ప్రయాణిస్తుంది. కనుక, ఈ తిథిని దహనమైన తిథిగా అనగా చెడు తిథిగా గుర్తిస్తారు.

మంగళవారంనాడు అష్టమితిథి ఉన్నట్లయితే ఆ తిథిని "సిద్ధయోగం" అనే పేరుతో పిలుస్తారు. అయితే, బుధవారంనాడు అష్టమితిథి ఉన్నట్లయితే ఆ యోగాన్ని "మృత్యుయోగం" అని పిలుస్తారు. అనగా, ఇది చాలా అశుభమైన తిథి అని గుర్తించాలి. శుక్లపక్ష అష్టమి తిథినాడు పొరపాటున కూడా మాంసాహారం సేవించరాదు.

భారతదేశంలోని హైందవులు అష్టమి తిథినాడు వివిధ రకాల దైవాలను ఆరాధించం జరుగుతున్నది. అది ఎలాగంటే...

పరమశివుడికి మూడు నేత్రాలు ఉంటాయి. అందువలన ఆయనను "త్రిలోచనుడు" అని పిలుస్తారు. ఒరిస్సా మరియు కొన్ని ఇతర ప్రాంతాలలో అష్టమి తిథినాడు శివుడిని ప్రత్యేకంగా పూజిస్తారు. ఆ కారణంగా, ఆ అష్టమిని "త్రిలోచనాష్టమి" అని పిలుస్తారు. ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, పరమశివుడిని కృష్ణపక్షంలో వచ్చే అష్టమి తిథినాడు పూజించాలి. (శుక్లపక్షంలో కాదు అని గుర్తించాలి.)

పరమశివుడి యొక్క ఉగ్రరూపం అయిన భైరవుడిని మార్గశిరమాసంలో వచ్చే కృష్ణపక్ష అష్టమి తిథినాడు పూజిస్తారు. ఈ అష్టమిని "భైరవాష్టమి" అనే పేరుతో పిలుస్తారు.

మహాలక్ష్మి స్వరూపం అయిన రాధాదేవి, భాద్రపదమాస, శుక్లపక్ష అష్టమితిథినాడు ఈ భూమిపై ఆవిర్భవించిందని విశ్వసిస్తారు. ఆ కారణంగానే, ఆమె జన్మదినాన్ని

"రాధాష్టమి" అనే పేరుతో పిలుస్తారు. ఉత్తర భారతదేశంలోని బృందావన్, బర్సానా, బ్రిజ్ లాంటి పవిత్ర క్షేత్రాలలో ఈ రాధాష్టమి పండుగను ఎంతో భక్తిశ్రద్ధలతో జరుపుకుంటారు.

ఫాల్గుణమాస కృష్ణపక్ష అష్టమి తిథినాడు సీతాదేవి అవతరించిందని, అనగా ఆ రోజున జనకమహారాజుకి పసిబిడ్డ రూపంలో ఆమె కనిపించిందని పురాణ గ్రంథాలలో చెప్పబడి ఉన్నది. ఆ కారణంగా ఆ రోజున సీతాష్టమి/జానకీజయంతి ఎంతో వైభవంగా జరుపుకుంటారు.

కార్తికమాసంలోని కృష్ణపక్షంలో వచ్చే అష్టమి తిథినాడు "అహోయ్ మాత" అనే దేవతని పూజిస్తారు. ముఖ్యంగా, తమ బిడ్డలు క్షేమంగా ఉండాలని కోరుకునే తల్లులు ఈ దేవతని ఆరాధిస్తారు. ఆ కారణంగానే ఈ అష్టమిని "అహోయ్ అష్టమి" అనే పేరుతో పిలుస్తారు. ఈ తిథి రోజున తల్లులు, రోజంతా ఉపవాసం ఉండి, ఆ దేవతని ఆరాధిస్తూ, సూర్యాస్తమయం దాకా కాలం గడుపుతారు. ఆపై ఆకాశంలో నక్షత్రాలు కనపడిన తరువాత ఉపవాసాన్ని ముగిస్తారు. ఉత్తర భారతదేశంలో అహోయ్ అష్టమి వ్రతం చాలా వైభవంగా జరుపుకోబడుతుంది.

చైత్రమాస కృష్ణపక్షంలో వచ్చే అష్టమి తిథినాడు "శీతలమాత" అనే ఒక దుర్గా రూపాన్ని ఆరాధిస్తారు. ఆ కారణంగానే ఈ అష్టమికి "శీతల అష్టమి" అనే పేరు వచ్చింది. ఈ రోజున శీతల మాతను ఉపవాసం ఉండి పూజించటం బిడ్డల తల్లులకు ఒక సాంప్రదాయంగా వస్తున్నది. తమ పసిబిడ్డలు, ఆటలమ్మ, మసూచి లాంటి అంటు వ్యాధులకు గురికాకుండా ఉండటానికి మరియు మంచి ఆరోగ్యంతో ఉండటానికి తల్లులు ఈ శీతల మాతను ఆరాధిస్తారు.

దుర్గాదేవిని ఆరాధించే నవరాత్రుల సమయంలో అష్టమి తిథినాడు "సంధిపూజ" అనే తాంత్రిక పూజను ఉత్తర భారతదేశంలో అధికంగా ఆచరిస్తారు. అష్టమి తిథి ముగిసే సమయంలో మరియు నవమి తిథి ప్రారంభం అయ్యే సమయంలో అనగా అష్టమి-నవమి తిథుల సంధికాలంలో దుర్గాదేవికి "బలిదానం" చేస్తారు. పూర్వకాలంలో ఆ సమయంలో దుర్గాదేవికి దున్నపోతుల్ని, మేకల్ని, కోళ్ళను బలి ఇవ్వటం జరిగేది. కానీ, మారిన సామాజిక పరిస్థితుల దృష్ట్యా బలులకు బదులుగా గుమ్మడికాయని పగలకొట్టి అమ్మవారికి బలి ఇవ్వటం జరుగుతున్నది.

మహాగౌరి అవతారం అష్టమినాడు ఆవిర్భవించిందని చెబుతారు. నవరాత్రులలో 8వ రోజున దుర్గాదేవి అవతరించిన కారణంగా ఆ తిథిని మహాఅష్టమి లేదా మహా దుర్గాష్టమి అన్న పేరుతో పిలుస్తున్నారు.

నవరాత్రులలో వచ్చే అష్టమితిథినాడు ఆయుధాలకు పూజ చేయటం జరుగుతుంది. ఆ కారణంగానే ఈ రోజుని "వీరాష్టమి" అన్న పేరుతో పిలుస్తున్నారు.

అష్టమి తిథి గురించి చాలా భయం - హైందవులలో వ్యాపించి ఉన్నది అన్నమాట వాస్తవం. అయితే, తంత్రశాస్త్రంలో అష్టమికి చాలా ప్రాముఖ్యత ఇవ్వబడింది. ఈ తిథినాడు చేసే కొన్ని కార్యాలు అద్భుతమైన ఫలితాలు ఇస్తాయని చెప్పబడింది. అది ఎలాగంటే...

జ్యోతిష మరియు తంత్రశాస్త్రాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, ధైర్యం మరియు సాహసం అవసరమైన కార్యాలకు అష్టమి తిథి చాలా అనుకూలంగా ఉంటుందని తెలుస్తున్నది. ఈ తిథి రోజున మనిషి శరీరంలో శక్తి విపరీతంగా ప్రవహిస్తుంది. ఫలితంగా, మనిషిలో ధైర్యం పెరిగిపోతుంది. ఏ సమస్యనైనా సరే, ఎదుర్కొనే పట్టుదల, సాహసం ఏర్పడతాయి.

ఎవరైనా వ్యక్తి, తమ శత్రువుల్ని జయించాలి అనుకుంటే అందుకు అష్టమితిథి మహా యోగ్యంగా ఉంటుంది. శత్రువులను ఓడించటంకోసం వ్యూహాలను ప్రయోగించే కార్యక్రమం అష్టమితిథినాడు ప్రారంభిస్తే తప్పనిసరిగా శత్రువులను ఓడించటం జరుగుతుంది.

**జ్యోతిషశాస్త్రంలో "అష్టమి-నవమి" మర్మం?**

అష్టమి, నవమి తిథులలో చంద్రుడి పరిమాణం సగం లేదా దాదాపు సగం ఉంటుంది. అటు కృష్ణపక్షంలోను, ఇటు శుక్లపక్షంలో కూడా ఈ రెండు తిథులలో చంద్రుడు పరిమాణం సగం ఉంటుంది. అయితే, ఈ తిథులలో (రెండు పక్షాలలోను) చంద్రుడిని చూసినప్పుడు సగం కనిపిస్తాడు. కనుక, అది శుక్లపక్షమా? లేదా కృష్ణపక్షమా? అని నిర్ణయించటం కష్టం అవుతుంది. (పంచాంగం చూస్తే అసలు విషయం అర్థం అవుతుంది.) కృష్ణపక్ష అష్టమి తిథినాడు అర్ధచంద్రుడు తెల్లవారుఝాము సమయంలో కనిపిస్తాడు. ఇక, శుక్ల పక్ష అష్టమి తిథినాడు అర్ధచంద్రుడు సాయంత్ర సమయంలో కనిపిస్తాడు. ఈ సూచన ప్రకారం ఆకాశంవైపు చూసినట్లయితే ఆ రోజు శుక్లపక్ష అష్టమా? లేక కృష్ణపక్ష అష్టమా? అన్న విషయం చాలా తేలిగ్గా అర్థం అవుతుంది.

ఇలా చంద్రుడు సగ పరిమాణంలో ఉన్న కారణంగా ఈ తిధులలో చంద్రుడి యొక్క ప్రభావం సగం మాత్రమే ఉంటుంది. అందువలన ఈ తిధులలో చేసే కార్యం సరిగా ఫలించదు. ఆ కారణంగానే, ఆ తిధులలో ఏ ముఖ్య కార్యాలను చెయ్యకూడదని చెబుతారు.

అష్టమి అనే తిధికి 8 అధిపతిగా ఉంటుంది. ఈ 8 అనే సంఖ్య పాపగ్రహం అయిన శనికి సంబంధించి ఉన్నది. నవమి తిధికి 9 అధిపతిగా ఉంటుంది. ఈ 9 అనే సంఖ్య ఉగ్ర స్వభావం కలిగిన కుజుడికి సంబంధించి ఉంటుంది. కనుక, ఈ రెండు తిధులను అశుభకరమైన తిధులుగా గుర్తించారు. జ్యోతిషశాస్త్ర పరంగా చూసినట్లయితే, అష్టమి మరియు నవమి తిధులలో రవి మరియు చంద్ర గ్రహాల మధ్య "చతురస్ర దృష్టి" ఏర్పడుతుంది. ఈ దృష్టి శుభకరమైనది కాదని చెబుతారు. మనిషి జీవితంపై అతి ముఖ్యమైన ప్రభావం చూపించే రవి, చంద్రుల మధ్య సరైన సంబంధం లేని సమయంలో (అష్టమి-నవమి తిధులలో) చేసే కార్యాలు ఫలించవని జ్యోతిషశాస్త్రం ఉద్ఘాటిస్తున్నది.

అష్టమి, నవమి తిధులలో జన్మించిన అవతార పురుషులైన శ్రీకృష్ణుడు మరియు శ్రీరాముడు ఎన్నో కష్టాలను ఎదుర్కొన్నారు. అష్టమి తిధినాడు జన్మించిన కృష్ణుడు, బాల్యంలో ఎన్నో కష్టాలను అనుభవించాడు. అసలు, పుట్టటమే కారాగారంలో పుట్టాడు. పసితనంలోనే అసలు తల్లిదండ్రులకు దూరం అయి ఎక్కడో దూరంగా పెరిగాడు. అలాగే శ్రీరాముడు, కారణం ఏదైనప్పటికీ సమస్త భోగభాగ్యాలను త్యజించి కష్టాలకు నిలయం అయిన అరణ్యాలకు వెళ్ళిపోయాడు. చివరికి తన ప్రాణ సమానం అయిన భార్యను కూడా కొంతకాలంపాటు కోల్పోయాడు. ఆ తరువాత కొంతకాలానికి ఆయన తన భార్యను మళ్ళీ పొందగలిగినప్పటికీ లోకోపవాదానికి జంకి, గర్భవతిగా ఉన్న సీతను తానే స్వయంగా అడవులకు పంపాడు. ఆ కారణంగానే ఈనాటికీ - ఏ బిడ్డ అయినా అష్టమి/నవమి తిధులలో జన్మిస్తే ఆ బిడ్డ చాలా కష్టాలకు గురి అవుతుందని చెబుతారు. ఈ తిధులలో జన్మించిన అవతార పురుషులకే కష్టాలు తప్పనప్పుడు, సాధారణ మానవులకు ఎలాంటి సమస్యలు ఎదురవుతాయో? ఊహించటం సాధ్యంకాదు. కేవలం, ఒక చెడు తిధిలో జన్మించినంత మాత్రాన మనిషియొక్క జీవితం కష్టాలమయంగా ఉంటుందని ఒక తీర్మానానికి రాకూడదు. ఎందుకంటే, ఒక మనిషి యొక్క జీవితం అతని జాతకచక్రంలోని గ్రహాల యొక్క

స్థితిగతులను బట్టి చాలా వరకు నిర్ణయం అవుతుంది. కనుక, అష్టమి లేదా నవమి తిథినాడు జన్మించినప్పటికీ జాతకంలోని గ్రహస్థితులు చక్కగా ఉన్నట్లయితే ఆ జాతకులకు చాలా వరకు మంచే జరుగుతుంది. కానీ, ఆ తిథులయొక్క చెడు ప్రభావం ఆ జాతకులపై ఎంతో కొంత ఉంటుందని మర్చిపోకూడదు.

# 12. జ్యోతిషశాస్త్రంలో చెప్పబడిన తిథుల మర్మం ఏమిటి?

భూమి - రవి అనే గ్రహాలకు మరియు చంద్రుడికి మధ్య ఉన్న దూరాన్ని ఆధారంగా చేసుకుని తిథులు ఏర్పడ్డాయి.

భూమిచుట్టూ ఒకసారి తిరిగి రావటానికి చంద్రుడికి 29 రోజుల 12 గంటల 44 నిమిషాల సమయం పడుతుంది. ఈ కాలాన్ని 'చంద్రమాసం' (లూనార్‌మంత్) అనే పేరుతో పిలుస్తారు. ప్రతి చంద్రమాసం - రెండు భాగాలుగా లేదా పక్షాలుగా విభజించబడింది. పౌర్ణమి వెళ్ళిన మర్నాటి నుండి చంద్రుడు క్రమ క్రమంగా క్షీణించిపోయి అమావాస్యనాటికి అసలు కనపడకుండా పోతాడు. ఇలా జరగటానికి దాదాపు 14 రోజుల సమయం పడుతుంది. ఈ 14 రోజులు మరియు అమావాస్య తిథిని కలిపి 'కృష్ణపక్షం' అనగా నల్లటి 15 రోజులు అని అర్థం. కారణం, ఆ సమయంలో చంద్రుడి నుండి రావాల్సిన కాంతి క్రమ క్రమంగా తగ్గిపోతుంది అన్నమాట. ఇక, అమావాస్య తిథి వెళ్ళిన మర్నాటి నుండి పౌర్ణమి తిథి వరకు అనగా, 15 రోజులపాటు చంద్రుడు క్రమ క్రమంగా పెరుగుతూ పౌర్ణమి



తిధినాటికి పరిపూర్ణమైన రూపంలోకి వస్తాడు. చంద్రుడి వెలుతురు క్రమంగా పెరిగే ఈ 15 రోజుల కాలాన్ని శుక్లపక్షము అనగా తెల్లటి లేదా ప్రకాశవంతమైన 15 రోజులు అని అర్ధం.

చంద్రుడు క్రమ క్రమంగా క్షీణించిపోవటం అనగా చంద్రుడియొక్క పరిమాణం తగ్గిపోవటాన్ని కృష్ణపక్షంగాను, చంద్రుడి పరిమాణం క్రమ క్రమంగా పెరిగే కాలాన్ని శుక్లపక్షంగాను పేర్కొన్నారు.

తిధులు (చంద్ర రోజులు/లూనార్ డేస్), మానవుని సూక్ష్మ శరీరంలో ఉండే నాడుల (ప్రాణశక్తి ప్రవహించే మార్గాలు) యొక్క పనితీరుని ప్రభావితంచేసే శక్తి కలిగి ఉంటాయి. అదేవిధంగా, మనిషియొక్క మనస్సుని ప్రభావితం చేసే శక్తి చంద్రుడికి ఉంటుంది. ఆ కారణంగానే, పురుష సూక్తంలో "చంద్రమా మనసో జాతా:" అని పేర్కొనబడింది. ప్రపంచం మొత్తాన్ని తనలో దాచుకుని ఉన్న విశ్వపురుషుడు అయిన భగవంతుడి యొక్క మనసు నుండి చంద్రుడు జన్మించాడని చెప్పబడి ఉన్నది. చంద్రుడి యొక్క హెచ్చు, తగ్గులను బట్టి (కళలు) మనిషియొక్క మనస్సు పనిచేసే తీరు మారుతుందని గుర్తించాలి.

హైందవ ధర్మశాస్త్రాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే చంద్రుడు క్రమ క్రమంగా పెరిగే "పక్షాన్ని" శుభకరమైనదిగాను, చంద్రుడు క్షీణించిపోయే 15 రోజుల కాలాన్ని "చెడు" సమయంగాను భావించవచ్చు. ఆ కారణంగానే, శుభ కార్యాలను వీలైనంత వరకు శుక్లపక్షంలో చెయ్యటం జరుగుతుంది. కారణం - క్రమ క్రమంగా పెరిగే చంద్రుడియొక్క కాంతి ఈ భూమిమీద శుభకరమైన పరిస్థితులను ఏర్పాటు చేస్తుంది అని గ్రహించాలి. కానీ, జ్యోతిషశాస్త్ర సూత్రాల ప్రకారం చూసినట్లయితే, శుక్షపక్షంలో వచ్చే 10వ రోజు (దశమి) మరియు కృష్ణపక్షంలో వచ్చే 5వ రోజు (పంచమి) చాలా శుభకరమైన తిధులు అని తెలుస్తున్నది. కారణం, ఈ రెండు తిధులలో చంద్రుడియొక్క శక్తి గరిష్టంగా ఉంటుంది.

శుక్లపక్ష చంద్రుడు మానవులయొక్క మానసిక స్థితులపై (మూడ్స్), భావోద్వేగాలపై (ఎమోషన్స్) పరిపూర్ణమైన ప్రభావాన్ని చూపిస్తాడు. శుక్లపక్షకాలంలో అనగా చంద్రుడు క్రమ క్రమంగా ప్రకాశాన్ని పొందుతున్న సమయంలో మానవులు ఉత్సాహంగా, శక్తివంతంగా ఉంటారు. కృష్ణపక్ష చంద్రుడు అనగా, చంద్రుడు మెల్లి మెల్లిగా ప్రకాశాన్ని కోల్పోతున్న సమయంలో మానవుల మనస్సులు అంతర్ముఖంగా (ఇంట్రోవెర్ట్) మారిపోతాయి. మానవుల తమను తాము విశ్లేషణ చేసుకోవటం మొదలవుతుంది.

మానవుడు గతజన్మలో చేసిన శుభ మరియు అశుభ కర్మల కారణంగానే ఆ మానవుడు తన మరుజన్మలో శుక్లపక్షంలో లేదా కృష్ణపక్షంలో జన్మించటం జరుగుతుందని ప్రాచీన జ్యోతిషశాస్త్ర మహర్షులు ఉద్ఘాటించారు.

**శుక్లపక్ష జాతకులు :** హైందవ జ్యోతిషశాస్త్రంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, సాధారణంగా శుక్లపక్షంలో జన్మించిన జాతకులు చాలా అదృష్టవంతులు అవుతారు. ఈ జాతకులు చాలా సామాన్య మరియు పేద కుటుంబంలో పుట్టినప్పటికీ, తమ స్వయం శక్తితో ఉన్నతస్థానానికి చేరుకుంటారు. వీరి అభివృద్ధి క్రమ క్రమంగా వృద్ధి చెందుతుంది. శుక్లపక్షంలో పుట్టిన జాతకులు చనిపోయే నాటికి మంచి స్థితిలో ఉంటారు. ఒకవిధంగా చెప్పాలంటే పుట్టినప్పుడు అట్టడుగున ఉన్న జాతకులు మరణించే నాటికి చాలా పై స్థితిలో ఉంటారు.

ఇంకొక విశేషం ఏమంటే, శుక్లపక్ష పాడ్యమి/ప్రతిపద నుండి పౌర్ణమి వరకు మధ్య ఉన్న కాలంలో జన్మించిన వ్యక్తులు తమ మధ్య వయస్సులో చాలా అభివృద్ధి దశకు చేరుకుంటారు. విచిత్రం ఏమంటే, ఒక మంచి స్థాయికి చేరుకున్న తరువాత వీరికి – క్రమ క్రమంగా అభివృద్ధి వెనకడుగు వేస్తుంది. ఈ పతనం వారి మరణ సమయం వరకు కొనసాగుతూనే ఉంటుందని చెబుతారు.

పౌర్ణమి వెళ్ళిన మర్నాడు అనగా కృష్ణపక్ష పాడ్యమినాడు జన్మించిన జాతకులు తమ జీవితంలో క్రమ క్రమంగా తక్కువ స్థాయికి చేరటం జరుగుతుంది. ఒకవేళ ఈ జాతకులు ఎంతో సామర్థ్యంతో పనిచేసినప్పటికీ రెండు అడుగులు ముందుకు వెళితే నాలుగు అడుగులు వెనక్కి రావటం జరుగుతుంది.

**కృష్ణపక్ష జాతకులు :** ప్రాచీనకాలంనాటి జ్యోతిష మహర్షుల దగ్గర నుండి ఈనాటి పరిపూర్ణమైన జ్యోతిషశాస్త్ర పరిశోధకుల వరకు జరిగిన పరిశోధనలో తేలిన ఒక అద్భుత విషయం ఏమంటే, సాధారణంగా కృష్ణపక్షంలో పుట్టిన జాతకులు తమ జీవితం అంతా అనేక కష్టనష్టాలను ఎదుర్కొంటూ జీవిస్తారు. వారు అనేక రకాల పరిస్థితులకు సర్దుకుపోతూ జీవితాన్ని కొనసాగిస్తారు. ఇంకొక విశేషం ఏమంటే, కృష్ణపక్ష జాతకులు సంపన్న కుటుంబాలలో జన్మించినప్పటికీ – వారు మరణించే సమయంలో పేదరికంలో ఉండటం జరుగుతుంది. కృష్ణపక్షంలో జన్మించిన అనేక మంది నాయకులు తమ మరణ సమయానికి అధికారాన్ని, పలుకుబడిని కోల్పోయి సామాన్యులుగా మిగలటం జరిగింది. అయితే, కృష్ణపక్షంలో పుట్టిన జాతక చక్రాలలో బలమైన శుభ గ్రహస్థితులు ఉన్నట్లయితే ఆ జాతకులు తమకి ఎన్ని కష్టాలు, సమస్యలు

ఎదురైనా వాటిని తట్టుకుని దిగ్విజయాలు సాధిస్తారు. అలాగే, చనిపోయే సమయానికి కూడా విజయాన్ని అనుభవిస్తున్నవారుగా ఉంటారు.

అమావాస్య తిధికి కొద్ది గంటల ముందు జన్మించినవారు – తమ జీవిత ప్రధమ భాగంలో తమకి ఎలాంటి సమస్యలు ఎదురైనా వాటిని చాలా తేలిగ్గా తీసుకుని ముందుకు వెళతారు. అయితే, మధ్యవయస్సు వచ్చే సరికి ప్రతి విషయాన్ని తీవ్రంగా తీసుకునే స్వభావం వీరికి ఏర్పడుతుంది.

హైందవ జ్యోతిషశాస్త్రంలో తిధికి చాలా ప్రాధాన్యత ఇవ్వబడింది. తిధి ఆధారంగానే ముహూర్తాలను నిర్ణయిస్తారు. శుక్లపక్షంలో 15 తిధులు, కృష్ణపక్షంలో 15 తిధులు ఉన్నప్పటికీ – ఈ రెండు పక్షాలలో ఉండే తిధులకు ఒకేపేరు ఉండటం విశేషం. కృష్ణపక్షం లేదా శుక్లపక్షంలో వచ్చే మొదటి తిధిని ఉత్తర భారతదేశంలో 'ప్రాతిపద' అని పిలువగా, దక్షిణ భారతదేశంలో ముఖ్యంగా, తెలుగు రాష్ట్రాలలో "పాడ్యమి' అనే పేరుతో పిలుస్తారు. ఏ తిధినాడు ఏవిధమైన కార్యాలు చేస్తే చక్కటి ఆశించిన ఫలితాలు వస్తాయో జ్యోతిషశాస్త్రంలో తెలియజేయబడింది. ఆ వివరాలను పరిశీలిద్దాం. శుక్లపక్షంలో వచ్చే 15 తిధులు మాత్రమే శుభకరమైనవి కనుక క్రింద వివరించబడిన తిధులు, "శుక్లపక్ష తిధులు" అని గ్రహించాలి.

సాధారణంగా, దశమి మరియు ఏకాదశి తిధులు చాలా శుభకరమైనవిగా పేర్కొంటారు. ఇటు ఇహలోక సంబంధమైన వ్యవహారాల నిర్వాహణకు, అటు ఆధ్యాత్మిక సాధనలకు ఈ తిధులు చాలా అనుకూలమైనవిగా చెబుతారు. కానీ, అష్టమి మరియు నవమి తిధులలో చేసే కార్యక్రమాలు ఏవైనా, వాటికి ఆటంకాలు వస్తాయని, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, ఈ తిధులలో ప్రారంభించే పనులు ఫలించకపోయే అవకాశాలు అధికంగా ఉంటాయి. ఆ కారణంగానే, తెలుగు రాష్ట్రాలలో "అష్టమి-నవమి - రోజులు కష్టపు రోజులు" అనే సామెత అనాదికాలం నుండి ప్రచారంలో ఉన్నదని భావించ వచ్చు.

**శుక్లపక్ష తిధుల విశేషాలు :**

**1. ప్రాతిపద/పాడ్యమి :** ఈ తిధికి సమస్త సంపదలకు అధిపతి మరియు యక్షులకు రాజైన కుబేరుడు అధిపతిగా ఉంటారు. దీనికి, సృష్టికర్త అయిన బ్రహ్మ మహాధిపతిగా ఉంటాడు. ఈ తిధినాడు ఏవైనా పెద్దస్థాయి కార్యక్రమాలు ప్రారంభించటానికి మరియు అభివృద్ధి చెయ్యటానికి అవసరమైన ప్రణాళికలు

రూపొందించటానికి చాలా అనుకూలంగా ఉంటుంది. అయితే, ఈ తిధినాడు ఏవిధమైన శుభకార్యాలు చెయ్యరాదు. ప్రయాణాలు ప్రారంభించరాదు.

సాధారణంగా, ఈ తిధినాడు గృహనిర్మాణాలు ప్రారంభించటం. నూతన గృహప్రవేశం చెయ్యటం, వివాహాలు చెయ్యటం, ప్రయాణాలు ప్రారంభించటం, బలవర్ధకమైన పోషకాహారాన్ని తీసుకోవటం ప్రారంభించటం లాంటివి చెయ్యటం జరుగుతుంది. ఒక విశేషం ఏమంటే, కృష్ణపక్ష పాడ్యమినాడు చంద్రుడు బలంగా ఉండగా, శుక్లపక్ష పాడ్యమి చంద్రుడు కొంతవరకు బలహీనంగా ఉంటాడు. ఆ కారణంగానే, శుక్లపక్ష పాడ్యమినాడు గృహప్రవేశములు, గృహనిర్మాణ ప్రారంభాలు, ఉపవాసం ఉండటం, వివాహం చేయటం లాంటివి నిషేధించబడ్డాయి.

**2. ద్వితీయ/విదియ :** ఈ తిధికి విశ్వదేవుడు అధిపతిగా ఉంటాడు. వివాహానికి, చంద్రుడిని చూడటానికి, ప్రధాన/వివాహ ఉంగరం కొనటానికి, దైవాలను ప్రతిష్టించటానికి ఈ తిధి చాలా శుభకరంగా ఉంటుంది. అయితే, యుద్ధాలు చెయ్యటానికి, తగాదాలు ఆడటానికి ఈ తిధి ఏమాత్రం అనుకూలంగా ఉండదని గ్రహించాలి.

ఈ తిధినాడు వివాహం చెయ్యటం, ప్రయాణాలు ప్రారంభించటం, ఆభరణాలు కొనుగోలు చెయ్యటం, సంగీత విద్యను నేర్చుకోవటం ప్రారంభించటం, ప్రభుత్వ సంబంధ వ్యవహారాలను ప్రారంభించటం, గృహనిర్మాణాలను ప్రారంభించటం – అనుకూల ఫలితాలను ఇస్తుంది. అయితే, ఈ తిధినాడు వంటికి లేదా తలకి నూనె పెట్టుకోవటం చాలా దోషంగా గుర్తించాలి.

**3. తృతీయ/తదియ :** ఈ తిధికి శివుడు మరియు గౌరీదేవి అధిపతులుగా ఉంటారు. గృహప్రవేశానికి, శంఖుస్థాపనకు, ఏదైనా కళను నేర్చుకోవటం ప్రారంభించటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది. కోర్టులో కేసులు వెయ్యటానికి, తగాదాలు ఆడటానికి, లాయర్ నోటీలు పంపించటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుందని గ్రహించాలి.

శిల్పవిద్య నేర్చుకోవటం, శిల్పాలు చెక్కటం ప్రారంభించటం, సంగీత విద్యను ప్రారంభించటం, కొత్త గాజులను ధరించటం, కొత్త ఇంటికి మారటం, వివాహం చెయ్యటం, ప్రయాణం ప్రారంభించటం, ప్రభుత్వ సంబంధ వ్యవహారం ప్రారంభించటం లాంటివి చేసినట్లయితే మంచి ఫలితాలు లభిస్తాయి.

**4. చతుర్థి/చవితి :** ఈ తిధికి విఘ్ననాయకుడైన గణపతి అధిపతిగా ఉంటాడు. ప్రత్యర్థులకు వ్యతిరేకంగా వేసే వ్యూహాలు మరియు ప్రణాళికలు రూపొందించటానికి చాలా అనుకూలంగా ఉంటుంది. అయితే, ఈ తిధినాడు ఏవిధమైన శుభకార్యాలు చెయ్యరాదు.

ఈ తిధినాడు శత్రువుల విధ్వంసానికి శ్రీకారం చుట్టటం, అగ్ని సంబంధ కార్యాలను ప్రారంభించటం, ఆయుధాల ఉపయోగాన్ని ప్రారంభించటం, ఎలక్ట్రానిక్ సంబంధ పరికరాల వాడకాన్ని ప్రారంభించటం చాలా మంచి ఫలితాలను ఇస్తుంది. మోటు పనులు ప్రారంభించటానికి ఈ తిధి చాలా మంచిది అని చెబుతారు.

**5. పంచమి :** ఈ తిధికి లలితా త్రిపురసుందరి అధిపతిగా ఉంటుంది. ఈ తిధినాడు అన్నిరకాల శుభకార్యాలు నిరభ్యంతరంగా చెయ్యవచ్చు. అదేవిధంగా ఈ రోజున ఆధ్యాత్మిక సంబంధ సాధనలు కూడా ప్రారంభించవచ్చు.

ఈ తిధినాడు ఏవిధమైన శుభ కార్యాలను అయినా నిరభ్యంతరంగా ప్రారంభించవచ్చు. అయితే, ఈ తిధినాడు ఎవరికైనా రుణం ఇస్తే ఆ సొమ్ము మళ్ళీ ఎట్టి పరిస్థితుల్లోను వసూలు కాదని గుర్తించాలి.

**6. షష్టి :** ఈ తిధికి పార్వతీ పుత్రుడైన కార్తికేయుడు అధిపతిగా ఉంటాడు. ఈ తిధినాడు భూములు–ఆభరణాలు కొనటం చాలా అభివృద్ధికరంగా ఉంటుంది.

యుద్ధ సంబంధ కార్యాలకు, వాస్తుపూజ ప్రారంభించటానికి, నూతన గృహ ప్రవేశానికి, నూతన వస్త్రాలు ధరించటానికి చాలా శుభకరంగా ఉంటుంది. కానీ, ఈ తిధినాడు అభ్యంగన స్నానం చెయ్యటం (వళ్ళంతా నూనె పూసుకుని మసాజ్ చేసుకోవటం) మంచిదికాదు.

**7. సప్తమి :** ఈ తిధికి గ్రహరాజైన రవి అధిపతిగా ఉంటాడు. వివాహం, ఉపనయనం లాంటి శుభకార్యాలు ఈ తిధినాడు చెయ్యటం చాలా శుభకరంగా ఉంటుంది.

వివాహాలకు, సంగీత సంబంధ కార్యాలు ప్రారంభానికి, నిర్మాణ ప్రారంభానికి, నూతన ఆభరణాలు ధరించటానికి మరియు కొనటానికి, ప్రయాణాలు ప్రారంభించటానికి, నూతన వధువు – అత్తగారింట్లో మొదటిసారి కాలు పెట్టటానికి, నూతన గృహప్రవేశానికి, ప్రభుత్వ సంబంధ కార్యాలు ప్రారంభించటానికి, వాస్తు

కార్యాన్ని ప్రారంభించటానికి, సంధ్యావందనం ప్రారంభించటానికి చాలా శుభకరంగా ఉంటుంది.

**8. అష్టమి :** ఈ తిథికి మహాశక్తివంతురాలైన దుర్గాదేవి అధిపతిగా ఉంటుంది. ఈ తిథి – అనేక రకాల శుభకార్యాలకు ఏమాత్రం అనుకూలంగా కాదని గుర్తించాలి. కాకుంటే, పూర్వీకుల ఆత్మలకు శాంతి కలిగించే పితృకర్మలు ఈ తిథినాడు నిరభ్యంతరంగా చేసుకోవచ్చు.

ఆస్థి సంబంధ/ కాంట్రాక్టు సంబంధ దస్తావేజులు వ్రాసుకోవటానికి, యుద్ధ సంబంధ కార్యక్రమాలకు, నిర్మాణ ప్రారంభానికి, రత్నాల కొనుగోలుకు, ఆయుధాల కొనుగోలుకు అనుకూలమైన తిథి అని గుర్తించాలి.

**9. నవమి :** ఈ తిథికి సరస్వతీదేవి అధిపతిగా ఉంటుంది. ఈ తిథినాడు శత్రువులను జయించటానికి సంబంధించిన కార్యాలను ప్రారంభించవచ్చు. అలాగే ప్రత్యర్థులను ఓడించటానికి, ప్రణాళికలను రూపొందించుకోవచ్చు. ప్రత్యర్థులమీద దాడిని ప్రారంభించవచ్చు. అయితే, ఈ తిథినాడు ఎలాంటి శుభకార్యాలు చెయ్యరాదు. ప్రయాణాలు ప్రారంభించరాదు.

వేట, యుద్ధం ప్రారంభించటానికి, ఆయుధాల నిర్మాణానికి, కట్టడాల నిర్మాణానికి, మద్య వ్యాపారాన్ని ప్రారంభించటానికి, అన్ని రకాల క్రూర కార్యాలు ప్రారంభించటానికి ఈ నవమి తిథి చాలా అనుకూలంగా ఉంటుంది.

**10. దశమి :** ఈ తిథికి పరమశివుడి అంశతో జన్మించిన మహోగ్ర దైవం అయిన వీరభద్రుడు అధిపతిగా ఉంటాడు. సాధారణంగా, ఈ తిథి చాలా శుభవంతమైనదిగా చెప్పబడింది. అందువలన ఈ రోజున అన్ని రకాల శుభకార్యాలు మరియు గృహప్రవేశం, శంఖుస్థాపన లాంటి కార్యాలు కూడా నిరభ్యంతరంగా చేసుకోవచ్చు.

నూతన వధువు అత్తగారింట్లో తొలిసారి కాలుపెట్టటానికి, వివాహం చెయ్యటానికి, నూతన వస్త్రాలు ధరించటానికి, ప్రయాణాలు ప్రారంభించటానికి, నూతన గృహప్రవేశం చెయ్యటానికి, గుర్రాలకు, ఏనుగులకు సంబంధించిన కార్యాలు ప్రారంభించటానికి, ప్రభుత్వ సంబంధ కార్యాలను ప్రారంభించటానికి, సంగీతం నేర్చుకోవటానికి ఈ రోజు చాలా అనుకూలంగా ఉంటుంది.

**11. ఏకాదశి :** ఈ తిధికి మహావిష్ణువు అధిపతిగా ఉంటాడు. ఈ తిధి వివాహాలు జరపటానికి మరియు ఉపవాసాలు ఉండటానికి చాలా అనుకూలంగా ఉంటుంది. ఈ తిధినాడు మహావిష్ణువు యొక్క ప్రభావం ఈ భూమిమీద విస్తారంగా వ్యాపించి ఉంటుందని చెబుతారు.

ఉపవాసం ఉండటానికి, మత సంబంధ కార్యక్రమాలు చెయ్యటానికి, పండుగలు జరుపుకోవటానికి, వాస్తు పూజలు చెయ్యటానికి, యుద్ధ సంబంధ కార్యాలు ప్రారంభించటానికి, ప్రయాణాలు ప్రారంభించటానికి చాలా శుభకరంగా ఉంటుంది.

**12. ద్వాదశి :** ఈ తిధికి కూడా మహావిష్ణువే అధిపతిగా ఉండటం విశేషం. అభివృద్ధికోసం పధకాలు వెయ్యటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది. అదేవిధంగా, ఈ తిధినాడు దానాలు చేసినా, ఉపవాసాలు ఉన్నా చాలా మంచి ఫలితాలు వస్తాయి.

వివాహ సంబంధ కార్యక్రమాలు ప్రారంభించటానికి, కారు కొనటానికి, రోడ్డు నిర్మాణ సంబంధ కార్యాలు ప్రారంభించటానికి, పోషకాహారం ఇవ్వటం ప్రారంభించటానికి ఈ తిధి చాలా బాగుంటుంది. అయితే, నూతన గృహ ప్రవేశం చెయ్యటానికి, ప్రయాణం ప్రారంభించటానికి, గృహనిర్మాణం ప్రారంభించటానికి ఈ ద్వాదశి తిధి ఏమాత్రం పనికిరాదని గ్రహించాలి.

**13. త్రయోదశి :** ఈ తిధికి మహాశివుడు మరియు మన్మధుడు అధిపతిగా ఉంటారు. రచయితలు కొత్త పుస్తకాలను ప్రారంభించటానికి, గ్రహ సంబంధ పరిహారాలు ప్రారంభించటానికి, నృత్యం నేర్చుకోవటం ప్రారంభించటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది.

యుద్ధ సంబంధ, సైన్యం సంబంధ, ఆయుధ సంబంధ కార్యాలు ప్రారంభించటానికి ఈ తిధి అనుకూలంగా ఉంటుంది. అదేవిధంగా నిర్మాణాలను ప్రారంభించటానికి, సంగీత పాఠాలు ప్రారంభించటానికి శుభకరంగా ఉంటుంది. ఒకవిధంగా చెప్పాలంటే, అన్ని రకాల శుభకార్యాలూ ఈ త్రయోదశి తిధినాడు నిర్మొహమాటంగా చెయ్యవచ్చు. అయితే, యజ్ఞోపవీత ధారణ, నూతన వస్త్రాలు, నూతన ఆభరణాలు ధరించటం, నూతన గృహప్రవేశం చెయ్యటం, ప్రయాణాలు ప్రారంభించటం లేదా ప్రయాణానికి సంబంధించిన పనులు చెయ్యటం ఏమాత్రం శుభకరం కాదని గుర్తించాలి.

**14. చతుర్దశి :** ఈ తిధికి రౌద్రానికి ప్రతీకగా ఉండే "రుద్రుడు" అధిపతిగా ఉంటాడు. ఈ తిధినాడు శివుడియొక్క ఉగ్రప్రభావం భూమిమీద చాలా అధికంగా ఉంటుంది. అందువలన ఈ రోజున తమ తమ ఇష్టదైవాన్ని పూజించినట్లయితే ఆ ఇష్టదైవం యొక్క అనుగ్రహం సంపూర్తిగా లభిస్తుంది.

పశు స్వభావం కలిగిన మరియు దూకుడుగా చేసే ఏ రకమైన కార్యమైనా ఈ చతుర్దశినాడు ప్రారంభించవచ్చు. అదేవిధంగా ఆయుధాల వాడకాన్ని ఈ తిధినాడు ప్రారంభించవచ్చు. కానీ, ఈ తిధినాడు ప్రయాణాలు ప్రారంభించటం మంచిదికాదు.

**15. పౌర్ణమి :** ఈ తిధి, లక్ష్మిని మరియు సరస్వతిని ఆరాధించటానికి చాలా అనుకూలంగా ఉంటుంది.

చేతి వృత్తులకు సంబంధించిన పనులను ప్రారంభించటానికి, ఆభరణాల కొనుగోలుకు లేదా ధరించటానికి ఈ తిధి చాలా శుభకరంగా ఉంటుంది. అంతేకాకుండా, వివాహం చెయ్యటానికి, బలులు ఇవ్వటానికి/మొక్కుబడులు తీర్చుకోవటానికి, ప్రయాణాలు ప్రారంభించటానికి, జల సంబంధ కార్యాలు మొదలు పెట్టటానికి, శాంతి చర్చలు మొదలుపెట్టటానికి ఈ తిధి చాలా శుభకరంగా ఉంటుంది.

**కృష్ణపక్ష తిధుల విశేషాలు :**

**1. కృష్ణపక్ష ప్రాతిపద/పాడ్యమి :** ఈ తిధికి దుర్గాదేవి అధిపతిగా ఉంటుంది. ఈ తిధి – కొత్త కార్యక్రమాలకు పథకాలు వెయ్యటానికి, వైద్యం ప్రారంభించటానికి చాలా అనుకూలంగా ఉంటుంది. కానీ, ఈ తిధినాడు ఏవిధమైన శుభకార్యాలు చెయ్యరాదు.

**2. కృష్ణపక్ష ద్వితీయ/విదియ :** ఈ తిధికి వాయుదేవుడు అధిపతిగా ఉంటాడు. ఈ తిధినాడు తీర్థయాత్రలు ప్రారంభించటానికి, భవన నిర్మాణం ప్రారంభించటానికి చాలా అనుకూలంగా ఉంటుంది.

**3. కృష్ణపక్ష తృతీయ/తదియ :** ఈ తిధికి అగ్నిదేవుడు అధిపతిగా ఉంటాడు. ఈ తిధి – నిర్మాణాలు ప్రారంభించటానికి, నృత్యం, సంగీతం లాంటి కళలు నేర్చుకోవటం ప్రారంభించటానికి చాలా అనుకూలంగా ఉంటుంది.

**4. కృష్ణపక్ష చతుర్ధి/చవితి :** ఈ తిధికి గణపతి అధిపతిగా ఉంటాడు. ఏవైనా ఆటంకాలు ఉంటే, వాటిని తొలగించటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది. అయితే ఏవిధమైన శుభకార్యాలు ఈ తిధినాడు చెయ్యకూడదు.

**5. కృష్ణపక్ష పంచమి :** ఈ తిధికి నాగదేవతలు అధిపతిగా ఉంటారు. తీర్ధయాత్రలు ప్రారంభించటానికి, ఆధ్యాత్మిక సాధన ప్రారంభించటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది.

**6. కృష్ణపక్ష షష్టి :** ఈ తిధికి కుజుడు అధిపతిగా ఉంటాడు. ఔషధాలు తీసుకోవటం ప్రారంభించటానికి, భూమి సంబంధ వ్యవహారాలు చెయ్యటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది.

**7. కృష్ణపక్ష సప్తమి :** ఈ తిధికి మహర్షులు మరియు ఇంద్రుడు అధిపతిగా ఉంటారు. ఆటంకాలు తొలగించటానికి, శత్రువులను ఓడించే పధకాలు వెయ్యటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది. అయితే, ఈ తిధినాడు ఏవిధమైన శు భకార్యాలు చెయ్యరాదు.

**8. కృష్ణపక్ష అష్టమి :** ఈ తిధికి శివుడు మరియు కాలభైరవుడు అధిపతిగా ఉంటారు. ఈ తిధినాడు ఏవిధమైన శుభకార్యాలు చెయ్యరాదు. ఎవరితోనూ వ్యవహారాలు జరుపరాదు. ఔషధసేవ ప్రారంభించరాదు.

**9. కృష్ణపక్ష నవమి :** ఈ తిధికి దుర్గాదేవి మరియు యముడు అధిపతులుగా ఉంటారు. మొత్తం, కృష్ణపక్ష తిధులలో ఇది చాలా తక్కువ శుభ లక్షణాలను కలిగి ఉంటుందని గుర్తించాలి. అయితే, శుత్రువులను, పోటీదారులను ఎదుర్కోవటానికి, పధకాలు వెయ్యటానికి, భవిష్యత్తులో అభివృద్ధిని కలిగించే ప్రణాళికలు రూపొందించ టానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది.

**10. కృష్ణపక్ష దశమి :** ఈ తిధికి ధర్మదేవత మరియు గురుగ్రహం అధిపతిగా ఉంటారు. ఈ రోజున అన్నిరకాల శుభకార్యాలు చెయ్యవచ్చు. ఉన్నతస్థాయి అధికారులను, మంత్రులను కలుసుకోవచ్చు.

**11. కృష్ణపక్ష ఏకాదశి :** బంగారం, ఆభరణాలు కొనటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది. ఈ తిధినాడు మహావిష్ణువుకు ప్రీతిని కలిగించే ఉపవాసం ఉంటారు.

**12. కృష్ణపక్ష ద్వాదశి :** ఈ తిధికి శుక్రుడు అధిపతిగా ఉంటాడు. ఆహారం, ధనం విరాళంగా లేదా దానంగా ఇవ్వటానికి కావలసిన ప్రణాళిక వెయ్యటానికి ఈ రోజు చాలా అనుకూలంగా ఉంటుంది.

**13. కృష్ణపక్ష త్రయోదశి :** ఈ తిధికి పరమశివుడి యొక్క వాహనం అయిన నంది అధిపతిగా ఉంటుంది. చెడు కర్మను తొలగించే పరిహారాలు చేసుకోవటానికి, యోగసాధనలు ప్రారంభించటానికి, ధ్యానం ప్రారంభించటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది.

**14. కృష్ణపక్ష చతుర్దశి :** ఈ తిధికి రుద్రుడు అధిపతిగా ఉంటాడు. ఈ తిధి – శివుడిని ఆరాధించటానికి, సమస్యలు తొలగించటానికి అవసరమైన ప్రణాళిక లేదా వ్యూహం రూపొందించటానికి, దైవ సంబంధ సాధన ప్రారంభించటానికి చాలా అనుకూలంగా ఉంటుంది. అయితే, ఈ తిధినాడు ఏవిధమైన శుభకార్యాలు చెయ్యరాదు.

**15. అమావాస్య :** కృష్ణపక్ష తిధులలో అత్యంత చీకటి అయినది మరియు అశుభకరమైనది ఈ అమావాస్య తిధి అని తంత్రశాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి. ఈ తిధికి రౌద్ర రూపిణి అయిన కాళిక అధిపతిగా ఉంటుంది. ధ్యానం చేసుకోవటానికి, మానవులకు, జంతువులకు ఆహార దానం చెయ్యటానికి, పితృకర్మలు చెయ్యటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది. అయితే, ఈ తిధినాడు పొరపాటున కూడా ఏవిధమైన శుభకార్యాలు చెయ్యరాదు. ప్రయాణాలతో సహా ఏవిధమైన ప్రయత్నాలు ప్రారంభించరాదు. ఆ మర్నాడు అనగా శుక్లపక్ష పాడ్యమి వచ్చే దాకా ఏ కొత్తపని ప్రారంభించకుండా ఉండిపోవటం మంచిది.

పితృకర్మలు చెయ్యటానికి, మహాదానాలు చెయ్యటానికి ఈ తిధి చాలా అనుకూలంగా ఉంటుంది. ఈ తిధినాడు స్త్రీతో సంభోగం జరపటం నిషేధించబడింది.

**మోహినీ ఏకాదశి విశేషాలు :**

వైశాఖమాసంలోని శుక్లపక్ష ఏకాదశి తిధినాడు "మోహినీ ఏకాదశి" అనే వ్రతాన్ని హైందవ దేశంలోని హైందవులు ఎంతో భక్తి శ్రద్ధలతో ఆచరిస్తూ ఉంటారు. మానవుడు, తన గతజన్మలలో చేసిన పాపాలు తొలగిపోవటానికి ఈ మోహినీ ఏకాదశి వ్రతం ఎంతో సహకరిస్తుందని చెబుతారు.

మహా సుందరాకారుడైన మహావిష్ణువు, జగత్కళ్యాణం కోసం పురాణకాలంలో ఒకసారి మోహినీ అవతారం ఎత్తాడు. ఏనాటికీ, సాక్షాత్తు బ్రహ్మదేవుడు కూడా సృష్టించలేని అపురూప సౌందర్యవతి అయిన ఆ మోహినిని దేవతలు "జగన్మోహిని" అని కీర్తించారు. భస్మాసురుడు అనే కృతఘ్నుడు మరియు కపటి అయిన ఒక రాక్షసుడికి

వరాలు ఇచ్చి, ప్రాణగండానికి గురైన పరమశివుడిని రక్షించటంకోసం మహావిష్ణువు తొలిసారిగా "మోహినీరూపం" ధరించి, ఆపై భస్మాసురుడిని తన అపురూప సౌందర్యంతో మత్తెక్కించి ఆపై వాడిచేయి వాడిమీదే పెట్టుకుని వాడు భస్మం అయ్యేలా చేసాడు.

ఇక, రెండవసారి సాగర మధనం జరుగుతున్నప్పుడు ఆవిర్భవించిన అమృతం దుర్మార్గులైన రాక్షసులకు దక్కకుండా ఉండటంకోసం, మోహినీ రూపం ధరించి ఆపై రాక్షసుల్ని తన రూపంతో వ్యామోహానికి గురిచేసి, వాళ్ళని మాయలో ముంచి అదే సమయంలో చాలా యుక్తిగా అమృతాన్ని దేవతలకు మాత్రమే అందేలా చేసింది మోహిని. దక్షిణ భారతదేశంలోని కేరళ రాష్ట్రంలో ప్రచారంలో ఉన్న సమాచారం ప్రకారం చూసినట్లయితే, శబరిమలై క్షేత్రంలో కొలువైన అయ్యప్పస్వామి, జగన్మోహిని మరియు పరమశివుని యొక్క కలయిక వల్ల ఆవిర్భవించాడని తెలుస్తున్నది. అయితే, కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే – మధ్యయుగంలో శైవ మరియు వైష్ణవ మతస్తుల మధ్య తీవ్రమైన శత్రుత్వం ఉండేది. ఆ శత్రుత్వానికి ముగింపు పలకటంకోసం మరియు శివ – విష్ణువు అనే దైవాల మధ్య తేడాలేదు అని చెప్పటం కోసం అయ్యప్పస్వామిని "హరి–హర" పుత్రుడిగా పేర్కొనటం జరిగిందని తెలుస్తున్నది. ఏదిఏమైనా, జగన్మోహిని అని పిలువబడే మహావిష్ణువు యొక్క రూపం భక్తులకు ఎంతో శుభాన్ని ప్రసాదిస్తుందని చెప్పక తప్పదు.

తూర్పుగోదావరి జిల్లాలోని "ర్యాలి" అనే గ్రామంలో జగన్మోహిని ఆలయం ఉన్నది. జీవితంలో అభివృద్ధిలోకి రాలేకపోతున్న యువకులు, వివాహంకాక బాధలు పడుతున్న యువతులు – ఒక్కసారి ఈ ర్యాలి క్షేత్రంలోని జగన్మోహిని స్వామిని దర్శించుకుంటే వారి కష్టాలు తొలగిపోయి, వారికి మంచి భవిష్యత్తు లభిస్తుంది. ఈ క్షేత్రమే కాక, మహారాష్ట్రకు ఆనుకుని ఉన్న గోవా రాష్ట్రంలో కూడా జగన్మోహినికి ఒక ఆలయం ఉన్నది. ఆ ఆలయంలో కొలువై ఉన్న మోహినిని "మహాలసా నారాయణి" అనే పేరుతో పిలుస్తారు. ఈ క్షేత్రానికి సంబంధించిన సంపూర్ణ వివరాలు ఇదే గ్రంథంలో ఇంకొక అధ్యాయంలో చదువవచ్చు.

**మోహినీ ఏకాదశి వ్రత విధానము :**

1. ముందు రోజు రాత్రి అనగా దశమి రాత్రినేలపై నిద్రపోవాలి.

2. ఏకాదశి తెల్లవారుఝాము సమయంలో నిద్రలేచి, చల్లని నీటిలో రెండు దర్భ గడ్డి ముక్కలు మరియు చిటికెడు నల్లనువ్వులు వేసి, ఆ నీటితో తలస్నానం చెయ్యాలి.

3. ఏకాదశినాడు, అవకాశం ఉన్నవారు కేవలము నీటిని మాత్రమే తీసుకుంటూ ఉపవాసం ఉండవచ్చు. శరీరం సహకరించనివారు ఫలాలను మరియు నీటిని తీసుకుని ఉపవాసం చెయ్యవచ్చు.

4. మోహినీ ఏకాదశి రోజున బియ్యం మరియు ఆ బియ్యంతో తయారయ్యే అన్ని రకాల పదార్థాలను, అన్ని రకాల ధాన్యాలను నిషేదించాలి.

నోట్ : ఒక ముఖ్య విశేషం ఏమంటే, మోహినీ ఏకాదశి రోజున ఉపవాసం ఉండనివారు కూడా ధాన్యంతో సహా ఏవిధమైన ధాన్య సంబంధ ఆహారాలను తీసుకోకూడదని ధర్మశాస్త్రాలలో చెప్పబడి ఉన్నది.

5. ఇంకొక విశేషం ఏమంటే, మోహినీ ఏకాదశి రోజున ఉపవాసం ఉన్నవారు మర్నాడు ఉదయం సూర్యోదయం తరువాత తలస్నానంచేసి దైవాన్ని పూజించి ఆపై పాలను తీసుకోవాలి. అప్పటి నుండి మామూలుగా ఆహారం తీసుకోవచ్చు.

6. సంపూర్ణ ఏకాదశి ఉపవాసం అనగా ఏకాదశి ప్రారంభ గడియల నుండి ఆ మర్నాడు వచ్చే ద్వాదశికి చెందిన సూర్యోదయం వరకు కొనసాగుతుంది.

7. మోహినీ ఏకాదశి రోజున మహావిష్ణువుకి ఒక ప్రత్యేక మంటపాన్ని ఏర్పాటు చేసి దానిపైన ఆయన చిత్ర పటాన్ని ఉంచి పూజించాలి.

మహావిష్ణువుకి గంధంతో, నల్లనువ్వులతో, వివిధ రంగుల పూలతో పూజచేసి చివరగా మహావిష్ణువుకి అత్యంత ప్రీతిపాత్రమైన తులసితో ఆయనకు పూజచేసి ఆపై ఆయనకు ఫలాలు నైవేద్యంగా ఇవ్వాలి.

8. మోహినీ ఏకాదశి రాత్రి సమయంలో జాగారంచేసి మహావిష్ణువు యొక్క గాధలను, విష్ణుసహస్రనామాన్ని పఠించాలి.

**మోహినీ ఏకాదశి వ్రత కథ :**

పురాణకాలంలో, ఉత్తర భారతదేశంలోని సరస్వతీ నదీతీరంలో భద్రావతి అనే పట్టణం ఉండేది. ఆ పట్టణానికి దుతిమాన్ అనే క్షత్రియుడు ప్రభువుగా ఉండేవాడు. ఆ కాలంలో, అదే పట్టణంలో మహా సంపన్నుడు అయిన ఒక వైశ్యుడు కూడా ఉండేవాడు. ఆయన పేరు ధనపాల్. ఈ సంపన్న వైశ్యుడు, మహావిష్ణువుయొక్క మహా భక్తుడిగా గుర్తించబడ్డాడు. ఈ వైశ్య సంపన్నుడు, తాను నివసిస్తున్న ప్రాంతంలో అనేక అన్న సత్రాలు కట్టించాడు. చెరువులు త్రవ్వించాడు. బాటసారులకు వసతి

కల్పించే వసతిశాలలు (సత్రాలు) నిర్మించాడు. అంతేకాకుండా, ప్రజలకు ఉపయోగపడటంకోసం రహదారికి అటు, ఇటు మామిడి, నేరేడు, ఉసిరి, వేప చెట్లను నాటించాడు. మండుటెండలో ఆ రహదారి వెంట నడిచివెళ్ళే బాటసారులు కాసేపు ఆ చెట్ల క్రింద చల్లగా కూర్చుని, ఆపై ధనపాలుడియొక్క మంచితనాన్ని మెచ్చుకుని అక్కడ నుండి వెళ్ళిపోతూ ఉండేవాళ్ళు. ఈ ధనపాలుడికి ఐదుగురు కొడుకులు ఉన్నారు. అందులో పెద్దవాడు పరమ పాపాత్ముడు మరియు కుటిలాత్ముడు. అతడు ఎల్లప్పుడూ అందగత్తెలు అయిన వేశ్యలతోను, పాపాలు చేసేవారితోను కలిసి మెలిసి జీవిస్తూ ఉండేవాడు. అంతేకాకుండా, తనకు వీలున్నప్పుడల్లా ధనాన్ని పందెంగా పెట్టి జూదాలు ఆడుతూ ఉండేవాడు. ఇంకొక విశేషం ఏమంటే, ఇతడు నాస్తికుడు, మొండివాడు, చివరికి పితృదేవతల్ని కూడా చులకనగా చూసే అరాచకవాది అయి ఉన్నాడు. ఇతడు – రోజులో చాలా సమయాన్ని తన తండ్రి యొక్క ఆస్థిని నాశనం చెయ్యటానికి ఉపయోగించేవాడు.

సహజంగా, వైశ్యులు మద్య–మాంసాలకు దూరంగా ఉంటారు. కానీ, ధనపాలుడి కుమారుడు మాత్రం మాంసము లేకుండా భోజనం చేసేవాడుకాదు. మద్యం సేవించకుండా నిద్రపోయేవాడు కాదు. అతని తండ్రి మరియు తమ్ముళ్ళు, భార్య, ఇతర బంధువులు అతడిని మంచి మాటలతో బాగు చెయ్యాలని ఎంతగానో ప్రయత్నించారు. కానీ, అతడు తన చెడు మార్గాన్ని వదిలిపెట్టటానికి ఏమాత్రం ఇష్టపడలేదు. ఫలితంగా, ధనపాలుడు అతడిని ఇంట్లో నుండి వెళ్ళగొట్టాడు. ఇంట్లో నుండి బైటకు వచ్చేటప్పుడు అతడు తన వాటాగా వచ్చిన బంగారు నగలను, పట్టు వస్త్రాలను తనతోపాటు తీసుకువెళ్ళి ఆపై వాటిని అమ్ముకుని కొంతకాలంపాటు తన వ్యసనాలను కొనసాగించుకున్నాడు. ఎప్పుడైతే, అతడి దగ్గర సొమ్ము అయిపోయిందో అతడిని అప్పటిదాకా అంటిపెట్టుకుని ఉన్న అందమైన వేశ్యలు మరియు నీచులైన మిత్రులు అతడిని వదిలిపెట్టి దూరంగా వెళ్ళిపోయారు. కొద్ది రోజులు గడిచే సరికి అతడికి ఆకలిబాధ తీరని బాధగా మిగిలి పోయింది. అతడు తన ఆకలిని తీర్చుకోవటానికి దొంగతనం చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. ఒక అర్ధరాత్రి సమయంలో ఆపై ఒక ధనికుడి ఇంట్లోకి రహస్యంగా ప్రవేశించి కొంత డబ్బుని దొంగిలించి పారిపోతున్న అతడిని రక్షకభటులు వెంటాడి పట్టుకున్నారు. అయితే, ఎంతో పుణ్యాత్ముడు మరియు మహాదాత అయిన ధనపాలుడి కుమారుడు అయిన అతడిని శిక్షించటానికి వాళ్ళకు మనసురాలేదు. అందువల్ల అతడిని వదిలిపెట్టేశారు. ఇంకోసారి కూడా ఎక్కడో దొంగతనం చేస్తూ అతడు, రక్షక భటులకు దొరికాడు.

ఇతడు ఇక మారడని అర్ధంచేసుకున్న ఆ భటులు అతడిని బంధించి ఆపై రాజుముందు ప్రవేశ పెట్టారు. ఆ రాజు, అతడు చేసిన నేరాలను గురించి తెలుసుకుని ఆపై అతడిని కారాగారంలో వేయించాడు. రాజుగారి యొక్క ఆజ్ఞమీద కారాగారంలోని భటులు అతడికి ప్రతిరోజూ మూడు పూటలా చావు దెబ్బలను ఆహారంగా ఇస్తూ ఉండే వాళ్ళు. అతడు చావకుండా ఉండటానికి రోజూ కాస్త గంజి పోస్తూ ఉండేవాళ్ళు. అలా రెండు నెలలపాటు ఆ కారాగారంలో కాలం గడిపాడు. ఆపై ఆ రాజు అతడిని కారాగారం నుండి విడుదలచేసి అతడిని నగరం వదిలిపెట్టి వెళ్ళిపొమ్మని శాసించాడు. ఇక, చేసేదిలేక అతడు ఆ నగరానికి కొంచెం దూరంలో ఉన్న ఒక అరణ్యంలోకి వెళ్ళిపోయాడు.

పొట్టపోసుకోవటంకోసం ఆ అరణ్యంలో – తను సొంతంగా తయారుచేసుకున్న ధనస్సు, బాణాలతో వివిధ జాతుల పక్షుల్ని మరియు కుందేళ్ళు లాంటి సాధు జంతువులను వేటాడటం ప్రారంభించాడు. కొంతకాలం గడిచింది. ఒకరోజున అతనికి ఏ జీవీ లభించలేదు. అతడికి ఆకలి బాధ అధికం అయ్యింది. దాంతో అతడు ఆహారంకోసం ఆ అరణ్యం అంతా ఆత్రంగా వెతకటం ప్రారంభించాడు. ఆ సందర్భంలో అతడు, అనుకోకుండా కౌటిన్య మహర్షి ఆశ్రమం దగ్గరకు వెళ్లాడు. విధివశాత్తూ, అది వైశాఖమాసం అయి ఉన్నది. అదే సమయానికి ఆ మహర్షి, గంగానదిలో స్నానంచేసి తన ఆశ్రమం దగ్గరకు వచ్చాడు. అలా వచ్చిన ఆ ముని తన తడి వస్త్రాలను విప్పి ఒక పొడి వస్త్రాన్ని కట్టుకుని, ఆపై ఆ తడి వస్త్రాన్ని నీళ్ళు ఓడిపోవటంకోసం ఒకసారి గాలిలోకి విదిలించాడు. అప్పుడు ఆ వస్త్రంలోని కొన్ని నీటి బిందువులు, అక్కడ నిలబడి ఉన్న అతడిమీద పడ్డాయి. ఫలితంగా, అతడి మనసులో కొంత పవిత్రత అవతరించింది. ఆపై అతడు ఆ ముని దగ్గరకు వెళ్ళి రెండు చేతులూ జోడించి ఆపై దీనమైన స్వరంతో ఆ మునితో "ఓ మహాత్మా! నేను ధర్మాత్ముడు, పుణ్యాత్ముడు అయిన ఒక వైశ్య శ్రేష్టుడి కుమారుడినై పుట్టి కూడా చెయ్యకూడని పాపాలన్నీ చేసాను, నా పొట్ట నింపుకోవటంకోసం వేలాది పక్షుల్ని, ఇతర అమాయక జీవుల్ని నిర్ధాక్షణ్యంగా సంహరించాను. ఇప్పుడు నాలో పశ్చాత్తాపం ఏర్పడుతున్నది. పాప భీతి కలుగుతున్నది. దయచేసి నాకు ఈ పాపాలను పోగొట్టుకునే ఒక మార్గాన్ని తెలియజేయి" అన్నాడు. దివ్యదృష్టి కలిగిన ఆ మహర్షి ఒకసారి అతడిని తేరిపార చూసాడు. ఆపై చిరునవ్వు నవ్వి, దయతో నిండిన స్వరంతో అతడితో "నాయనా! విచారించకు, నీవు రేపటి ఏకాదశి రోజున కఠినమైన ఉపవాసం చెయ్యి. మహా మహిమాన్వితమైన ఈ వైశాఖ ఏకాదశి ఉపవాసం చేసి ఆపై శ్రీమన్నారాయణుడిని

త్రికరణశుద్ధిగా ప్రార్థించుకో. నీవు ఈ జన్మలో చేసిన పాపమే కాక, గత జన్మలలో చేసిన మహా పాపాలు కూడా దహించుకుపోతాయి. నీకు మరు జన్మ ఉండదు. నీకు తప్పనిసరిగా వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది" అన్నాడు. ఆపై అతడు ఆ ఆశ్రమంలోనే ఆ మునితో కలిసి మోహినీ ఏకాదశి ఉపవాసం చేసాడు. మర్నాడు ద్వాదశి మధ్యాహ్నం ఆ ముని పెట్టిన ఆహారాన్ని తీసుకున్నాడు. ఆ తరువాత అతడు ఆ ఆశ్రమంలోనే ఉండి మహావిష్ణువుని స్మరించుకుంటూ మరియు ఆ ముని చెప్పే వేదాంత బోధనలను వింటూ కాలం గడిపాడు. ఆ తరువాత కొన్నేళ్ళకు అతడు మరణించి ఆపై నేరుగా వైకుంఠానికి చేరుకున్నాడు.

శ్రీరాముడు సీతాదేవిని కోల్పోయిన తరువాత ఆయన వద్దకు వచ్చిన వశిష్ఠ మహర్షి శ్రీరాముడిని "మోహినీ ఏకాదశి" వ్రతం చెయ్యమని ఆజ్ఞాపించాడు. ఆ వ్రతాన్ని చేసిన కారణంగా ఆపై కొంతకాలానికే శ్రీరాముడు, యుద్ధంలో దశకంఠుడిని సంహరించి సీతాదేవిని మళ్ళీ పొందాడు. అదేవిధంగా, తన సోదరులతో కలిసి అరణ్యవాసం చేస్తున్న ధర్మరాజు, శ్రీకృష్ణుడి సలహామీద మోహినీ ఏకాదశి వ్రతం చేసి ఎంతో పుణ్యాన్ని పొందాడు. ఆ తరువాత కురుక్షేత్ర యుద్ధంలో సమస్త కౌరవులను సంహరించి రాజ్యాన్ని పొందాడు.

తీవ్రమైన ఆర్థిక బాధలతో, శత్రు బాధలతో బాధపడేవారు ఈ మోహినీ ఏకాదశి వ్రతాన్ని చేసినట్లయితే వారి బాధలు తప్పనిసరిగా తీరిపోతాయి. అనేక యజ్ఞాలు చేస్తే ఎంత పుణ్యం వస్తుందో, పవిత్ర క్షేత్రాలను దర్శిస్తే ఎంతటి ఫలితం దక్కుతుందో, వేలాదిమందికి అనేకసార్లు అన్నదానం చేస్తే ఎంత పుణ్యం వస్తుందో – ఒక్కసారి మోహినీ ఏకాదశి వ్రతం చేస్తే అంత ఫలితం వస్తుందని హైందవ ధర్మశాస్త్రాలలో చెప్పబడి ఉన్నది. వైష్ణవ మతస్తులకు ఏకాదశి ఎంతో పవిత్రమైనదని చెబుతారు. ఆ కారణంగానే వైష్ణవులు, ఏకాదశిని 'హరివాసర' అనే పేరుతో పిలుస్తారు.

**పుత్రద ఏకాదశి వ్రత విశేషములు :**

ప్రతి సంవత్సరం శ్రావణమాస (జూలై–ఆగష్టు) శుక్లపక్షంలో వచ్చే ఏకాదశి తిథిని "పవిత్రోపన" లేదా "పుత్రద ఏకాదశి" అనే పేరుతో పిలుస్తారు. ఈ లోకంలో కావలసిన, అన్ని రకముల భోగభాగ్యాలను పొందటమే కాకుండా, పరలోకంలో మంచిస్థితి పొందటం కోసం అద్భుత మాహాత్మ్యంగల పుత్రద ఏకాదశి వ్రతాన్ని ఆచరించాలని హైందవ ధర్మశాస్త్రములలో చెప్పబడి ఉన్నది. ఈ రోజున, ఏవిధమైన ధాన్యములు, పప్పులు తీసుకోకుండా నిష్టతో ఉపవాసం ఉండి, దైవాన్ని

ఆరాధించినట్లయితే – గతజన్మల నుండి ఈ జన్మ వరకు చేసిన సమస్త పాపములు తొలగిపోతాయి. సంతానం లేక తల్లడిల్లే దంపతులు ఈ అద్భుత "పుత్రద ఏకాదశి" వ్రతమును భక్తిశ్రద్ధలతో చేసుకున్నట్లయితే సంవత్సరం తిరిగేలోగా ఆ దంపతులకు తప్పనిసరిగా సంతాన భాగ్యం కలుగుతుంది. ఈ వ్రతం చేసినవారికి మరణానంతరము తప్పనిసరిగా స్వర్గ ప్రాప్తి కలుగుతుందని ధర్మశాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి.

సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మ, ద్వాపరయుగంలో ఈ అద్భుత వ్రత ప్రక్రియ గురించి ధర్మరాజుకి వివరించాడని చెబుతారు. ఈ వ్రతానికి సంబంధించిన ఒక కథ ఇలా ఉంటుంది...

పూర్వం అనగా, ద్వాపరయుగ ప్రారంభ సమయంలో భారతదేశంలోని మాహిష్మతీ రాజ్యాన్ని మహిజిత అనే ఒక మహారాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయన ఎంతటి పెద్ద రాజ్యానికి ప్రభువు అయినప్పటికీ పుత్ర సంతానం లేని కారణంగా ఆయన ప్రతిరోజూ విచారిస్తూ ఉండేవాడు. పుత్ర సంతానంలేని వ్యక్తికి మృత్యులోకం నుండి విముక్తి ఉండదని ధర్మశాస్త్రాలు తెలియజేస్తున్నాయి. అనగా, పుత్రుడు కలిగిన వ్యక్తికే "పున్నామ నరకం" నుండి విముక్తి కలుగుతుంది అన్నమాట. ఏదిఏమైనా, మహాజిత ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ పుత్రుడిని పొందలేకపోయాడు.

అలాంటి పరిస్థితుల్లో ఆయన తన మంత్రులతో ఒకసారి సమావేశం అయి వారితో ఇలా చెప్పాడు. "నా ప్రియమైన మంత్రులారా! మన రాజ్యం ఎంతో సుభిక్షంగా ఉన్నది. నేను ఏమాత్రం ధర్మం తప్పకుండా పాలిస్తున్నాను. నా సొంత బంధువులు తప్పుచేసినా, ధర్మశాస్త్ర సూత్రాల ప్రకారం వారిని శిక్షిస్తున్నాను. నా శత్రువు మంచివాడు, సుగుణవంతుడు అయినప్పుడు అతడిని కూడా నా మిత్రుడిగా ఆదరిస్తున్నాను. నేను శత్రుదేశాల పైకి యుద్ధాలకు వెళ్ళినప్పుడు ధర్మం ప్రకారమే ప్రవర్తిస్తున్నాను. నా ప్రజల్ని నా కన్న బిడ్డలు లాగా చూసి పరిపాలిస్తున్నాను. నేను ఏనాడూ బ్రాహ్మణుల యొక్క, దేవాలయాల యొక్క ఆస్థులను, భూములను అపహరించలేదు. బలహీనులపై ఏనాడూ దౌర్జన్యం చెయ్యలేదు. నిరంతరమూ వేద పఠనాన్ని నా గృహంలో చేయిస్తున్నాను. నా భార్య అనేక దైవ సంబంధమైన వ్రతాలను ఎంతో భక్తిశ్రద్ధలతో చేస్తున్నది. అయినప్పటికీ నాకు ఈనాటికీ పుత్ర సంతానం కలుగలేదు. 60వ సంవత్సరానికి దగ్గర కాబోతున్న నేను ఇంకా ఎంతో కాలం పరిపాలన సమర్ధవంతంగా సాగించలేకపోవచ్చు. నా తరువాత ఈ రాజ్యాన్ని పరిపాలించాల్సిన వారసులు

నాకు లేరు. ఇలాంటి పరిస్థితుల్లో మీలో ఎవరైనా సరే నాకు పుత్ర సంతానం కలిగే మార్గాన్ని దయచేసి చెప్పండి".

మహారాజు అయిన మహిజిత అలా చెబుతూ ఉన్న సమయంలో అక్కడికి ఆయన పురోహితుడు వచ్చాడు. ఆ పురోహితుడు గొప్ప వేదశాస్త్ర పండితుడే కాకుండా అనేక ధర్మశాస్త్రాలను ఔపోసన పట్టిన మహాజ్ఞాని అయి ఉన్నాడు. రాజుగారి యొక్క సంతాన బాధ గురించి అర్థంచేసుకున్న ఆ రాజ పురోహితుడు, రాజుగారితో ఇలా చెప్పాడు. "ఓ రాజా! నీ సమస్యకు పరిష్కారం చూపింగల ఒకేఒక వ్యక్తి మన రాజ్యానికి ఉత్తర దిక్కులో ఉన్న పర్వతాలలో నివసిస్తున్నాడు. ఆయన పేరు "లోమస ఋషి". ఆయన త్రికాలజ్ఞాని. ఆయన యొక్క గొప్పతనం ఏమంటే, అనేక కోట్ల సంవత్సరాల పరిమాణంగల ఒక "కల్పం" ముగిసినప్పుడు ఆయన శరీరం మీద ఉండే ఒక వెంట్రుక రాలుతుంది. ఆయన, బ్రహ్మదేవుడి కన్నా ఎక్కువకాలం జీవిస్తాడని జ్ఞానులు చెబుతూ ఉంటారు. అందువల్ల, నీవు ఆ లోమసుడిని కలుసుకున్నట్లయితే తప్పనిసరిగా నీకు పుత్ర సంతానం కలిగే మార్గం దొరుకుతుంది". ఈవిధంగా రాజ పురోహితుడు చెప్పగానే మహీజితకు ఎంతో ఆనందం కలిగింది. ఆపై ఆయన కొంతమంది మంత్రులను వెంటపెట్టుకుని అప్పటికప్పుడే లోమస మహర్షిని కలుసుకోవటానికి బయలుదేరాడు. అలా రెండు రోజులు అరణ్యాల గుండా, పర్వతాల మీదుగా ప్రయాణించి, చివరికి లోమస మహర్షిని కలుసుకున్నాడు ఆ మహారాజు. ఏదిఏమైనా, ఎంతో శ్రమపడి తన దగ్గరకు వచ్చిన మహాజిత్‌ని ఎంతో ఆదరంతో ఆహ్వానించాడు లోమసమహర్షి. ఆపై, తనకు పుత్ర సంతానం లేని విషయం ఆ మహర్షికి ఎంతో దీన స్వరంతో తెలియజేసాడు. ఆ మహారాజు చెప్పిన మాటలు శ్రద్ధగా విన్న లోమస మహర్షి ఒక క్షణంపాటు కళ్ళుమూసుకుని ధ్యానంలోకి వెళ్ళాడు. ఆ తరువాత కళ్ళు తెరచి ఆ మహారాజుతో ఇలా అన్నాడు.

"ఓ రాజా! నీవు గతజన్మలో ఒక వ్యాపారిగా ఉన్నావు. విపరీతమైన ధనాశ కారణంగా ధర్మాధర్మ విచక్షణ లేకుండా నీవు అనేక మోసాలకు పాల్పడి కోట్లకు పడగలు ఎత్తావు. అయినప్పటికీ, నీకు ఆశ చావలేదు. ఇంకా సంపాదించాలన్న ఆశతో నీవు – వందల కొద్ది బండ్లలలో వివిధ రకాల వస్తువులను నింపి, ఆపై ఆ బండ్లతో సహా దేశంలోని అనేక ప్రాంతాలకు వెళ్ళి, అక్కడ ఆ వస్తువులను అమ్ముకుని మరింత ధనం గడించే ప్రయత్నంలో పడ్డావు. ఆ సమయంలో నీవు ఒక మధ్యాహ్న సమయానికి ఒక ఊరి పొలిమేరలు దగ్గరకు వెళ్ళావు. ఆ సమయంలో విపరీతమైన

ఎండ కాస్తుండటం వల్ల నీకు విపరీతమైన దాహం వేసింది. నీవు, అక్కడకు దగ్గరలో ఉన్న ఒక సరస్సు దగ్గరకువెళ్ళి అక్కడ మంచినీళ్ళు త్రాగుదామని ప్రయత్నించావు. సరిగ్గా అదే సమయంలో ఒక ఆవు తన లేగ దూడతో కలిసి అక్కడకు వచ్చింది. అవి కూడా ఆ సమయంలో విపరీతమైన దాహంతో ఉన్నాయి. అయితే, అవి నీళ్ళు త్రాగుతూ ఉండటం వల్ల నీకు నీళ్ళు త్రాగటానికి వీలుకాని కారణంగా, నీవు నీ దగ్గర ఉన్న కర్రతో ఆ లేగదూడను మరియు దాని తల్లిని కొట్టి ఆ సరస్సు దగ్గర నుండి దూరంగా తరిమివేసావు. నీవు ఆవిధంగా, ఎంతో దాహంతో ఉన్న ఆ ఆవు మరియు దాని దూడకు నీళ్ళు లేకుండా చేసావు. నీవు చేసిన ఆ మహాపాప ఫలితంగా నీకు ఈ జన్మలో పుత్ర సంతానం లేకుండా పోయింది. అయితే, గతజన్మలో నీవు అనేక దాన ధర్మాలు కూడా చేసావు. ఆ దానాల ఫలితంగా నీవు ఈ జన్మలో మాహిష్మతి రాజ్యానికి రాజుగా ఉన్నావు. గతజన్మలో ఆవు దూడలకు నీళ్ళు లేకుండా చేసిన పాపానికి ప్రతిఫలంగా నీకు పుత్ర సంతానం లేకుండా పోయింది". అప్పుడు ఆ మహారాజు ఎంతో భక్తితో రెండు చేతులూ జోడించి లోమసమహర్షితో ఇలా అన్నాడు. "ఓ మహాత్మా! నా గతజన్మలో చేసిన పాపం కారణంగానే నాకు ఇప్పుడు పుత్ర సంతానం లేకుండా పోయింది అని అర్థం చేసుకున్నాను. ఏది ఏమైనా, నా యందు దయయుంచి, నాకు పుత్ర సంతానాన్ని కలిగే మార్గాన్ని చెప్పు. సాధారణ మానవుడిని అయిన నేను చేసిన తప్పుని క్షమించి, నాకు పుత్రుడిని పొందే భాగ్యాన్ని ప్రసాదించు".

అప్పుడు లోమస మహర్షి ప్రశాంతమైన స్వరంతో ఆ రాజుతో మరియు ఆయన మంత్రులతో ఇలా అన్నాడు. "ఓ రాజా! మీ మంత్రులు మరియు మీ దేశ ప్రజలు రాబోయే శ్రావణమాసంలోని శుక్లపక్షంలో వచ్చే ఏకాదశి తిథినాడు పరిపూర్ణమైన భక్తి విశ్వాసాలతో ఉపవాసం ఉండి, ఆ రోజు రాత్రంతా శ్రీమన్నారాయణుడిని ధ్యానిస్తూ జాగారం ఉండాలి. మర్నాడు, అనగా ద్వాదశినాడు నీ మంత్రులు మరియు నీ రాజ్య ప్రజలు నిన్నటి ఏకాదశి ఉపవాసం వల్ల వారికి వచ్చిన పుణ్యాన్ని నీకు దానం చెయ్యాలి. ఆ దానం వల్ల నీ యొక్క గతజన్మ పాపం నశించిపోతుంది. ఆపై నీకు పుత్ర సంతానం కలుగుతుంది". ఈవిధంగా లోమస మహర్షి చెప్పిన సలహాను ఎంతో ఆనందంతో స్వీకరించిన ఆ రాజు మరియు ఆ మంత్రులు ఆ మహర్షికి కృతజ్ఞతలు చెప్పి, ఆపై అక్కడ నుండి తమ రాజ్యానికి తిరిగి వచ్చారు. ఆ తరువాత కొద్ది రోజులకే శ్రావణమాస శుక్లపక్ష ఏకాదశి తిథినాడు అనగా "పుత్రద ఏకాదశి"

నాడు ఆ రాజు, మంత్రులతో సహా ఆ రాజ్య ప్రజలందరూ ఎంతో భక్తిశ్రద్ధలతో ఆ రోజంతా ఉపవాసం ఉండటమే కాకుండా తెల్లవార్లూ హరినామ స్మరణతో జాగారం చేసారు. ఆ మర్నాటి ద్వాదశి తిథినాడు మాహిష్మతి రాజ్య ప్రజలందరూ మంత్రులతో సహా రాజ భవనానికి వచ్చి, ఆపై తమ ప్రభువుకి "పుత్రద ఏకాదశి" ఉపవాసం ద్వారా పొందిన మహా పుణ్యాన్ని ఎంతో ప్రేమతో దానం చేసారు. ఆ తరువాత కొంతకాలానికే మహారాణి గర్భవతి కావటం, ఆమెకు మగబిడ్డ జన్మించటం జరిగింది.

ఈ కలియుగంలో మానవులకు తమ ప్రమేయం లేకుండానే ఎన్నో పాపాలు చుట్టుకుంటున్నాయి. అందువల్ల, మనుషులు తమకు తెలియకుండానే ఆ పాపాల వల్ల అనేక బాధలకు గురి అవుతున్నారు. మానవులు ఈ "పుత్రద ఏకాదశి" లాంటి అద్భుతమైన తిథులలో ఉపవాసాలు ఉండి దైవాన్ని ప్రార్థించినట్లయితే, వారి పాపాలు తొలగిపోతాయి. అంతేకాకుండా, వారికి అన్ని రకాలుగా మేలు జరుగుతుంది.



# 13. ఉత్తర మరియు తూర్పు భారతదేశ ప్రాంతాలలో తాంత్రిక విశ్వాసాలు?

**ఉత్తర భారతదేశంలో తాంత్రిక ఆరాధనలు :**

**తాంత్రిక సూర్యారాధన :** క్రీ.శ. 10వ శతాబ్దంలో అనగా జగద్గురు ఆదిశంకరుడు ఈ భూమిమీద సంచరిస్తున్న సమయంలో, ప్రముఖంగా పాటించబడిన హైందవ దైవ ఆరాధనా విధానాలలో "సౌరమతం" ఒకటిగా చెప్పబడింది. సూర్యభగవానుడిని ఆరాధించే మతాన్ని "సౌరమతం" అని పిలుస్తారు. అయితే, ఈ మతంవారు పూజించే సూర్యుడు ఆరు రూపాలలో ఉంటాడని తంత్రశాస్త్రాలలో చెప్పబడింది. కనుక, సౌరమతం – ఆరు వర్గాలుగా విడిపోయింది. ఒక్కోవర్గంవారు సూర్యుడియొక్క ఒక్కొక్క రూపాన్ని పూజించటం జరిగింది. అది ఎలాగంటే...

1. ఉదయిస్తున్న సూర్యుడిని "బ్రహ్మ"గా భావించి ఆరాధించేవారు.

2. మధ్యాహ్న సమయంలో దర్శనమిచ్చే సూర్యుడిని "పరమశివుడి"గా ఆరాధించేవారు.

3. సూర్యాస్తమయ సమయంలో కనిపించే సూర్యుడిని "మహావిష్ణువు"గా భావించి పూజించేవారు.

4. సూర్యుడిని – ఉదయ, మధ్యాహ్న మరియు సాయంత్ర సమయాలలో "త్రిమూర్తి" స్వరూపంగా భావించి ఆరాధించేవారు.

5. సూర్యుడిని బంగారపు రంగు గడ్డం మరియు శిరోజాలు కలిగిన మానవ రూపంలో ఆరాధించేవారు.

(నోట్ : ఈవిధంగా సూర్యుడిని మానవ రూపంలో ఆరాధించేవారు, ఉదయం సూర్యుడిని చూసిన తరువాతే ఏదైనా ఆహారం తీసుకునే కఠినమైన నియమాన్ని పాటిస్తూ ఉండేవాళ్ళు.)

6. ఈ వర్గానికి చెందినవారు, సూర్యుడియొక్క రూపాన్ని (ఇమేజ్) తమ హృదయంలో ముద్రించుకుని, దానిని ఆరాధిస్తూ ఉండేవాళ్ళు. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, ఈ వర్గానికి చెందిన సూర్య ఉపాసకులు తమ నుదుటిమీద, భుజాలమీద మరియు ఛాతీమీద సూర్యుడియొక్క గుండ్రటి రూపాన్ని "బొట్టు"గా ధరించేవారు. (వైష్ణవ మతస్తులు తమ శరీరంపైన, నుదుటిపైన ఎలా తిరునామాలు ధరిస్తారో ఆవిధంగా అన్నమాట).

ఏదిఏమైనా, సౌరమతాన్ని పాటించే హైందవులు సూర్యుడిని "సూర్యపతి" అనే పేరుతో ఆరాధించటం జరిగింది. ఇంకొక విశేషం ఏమంటే, ఈ సౌర మతస్తులు సూర్యుడికి చిహ్నంగా తమ మెడలో స్పటిక మాలను ధరించేవాళ్ళు. అంతేకాకుండా, ఆదివారం మరియు రవి సంక్రమణం (రవి, ఒకరాశి నుండి ఇంకొక రాశిలోకి ప్రవేశించే సమయం) – దినాలలో ఉప్పుని తీసుకునేవాళ్ళు కాదు. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, వీరు తమ నుదుటిమీద ఎర్రగంధాన్ని బొట్టుగా ధరించినట్లుగా తెలుస్తున్నది. ప్రస్తుతం, సౌర మతానికి చెందిన ప్రధాన కేంద్రం "ఔధ్" ప్రాంతంలో ఉన్నది. ఇంకొక విశేషం ఏమంటే, వైష్ణవ మతానికి చెందిన నింబారకుడు అనే యోగి, సౌర ఆరాధనా విధానాన్ని చాలా వరకు సరిదిద్దాడు. ఇంతకీ "నింబారక" అంటే అర్థం ఏమిటో తెలుసా? "వేప చెట్టులో సూర్యుడు" అని. రవిని ఆరాధించే ఆ మహాయోగికి నింబారకుడు లేదా నింబార్కుడు అనే పేరు ఎలా వచ్చిందో తెలియజేసే ఒక కథ ఇలా ప్రచారంలో ఉన్నది...

భాస్కరాచార్య అనే పేరుగల ఒక సౌరమత వైష్ణవ వర్గానికి చెందిన యోగి ఒక సమయంలో ఒక బైరాగిని తన ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. అయితే, ఏదో అనుకోని కారణాల వల్ల, సూర్యాస్తమయ సమయం వరకు ఆ బైరాగికి భోజనం వడ్డించటం కుదరలేదు. ఈ సౌరమత సిద్ధాంతాల ప్రకారం, సూర్యుడు ఆకాశంలో కనిపిస్తూ ఉన్నప్పుడు మాత్రమే ఈ వర్గంవారు భోజనం చెయ్యటం జరుగుతుంది. అయితే, అప్పటికే సూర్యాస్తమయం కావటంవల్ల, గగనంలో సూర్యుడు లేనట్లే లెక్క. అలాగని, భోజనానికి ఆహ్వానించిన బైరాగికి భోజనం పెట్టకపోతే అది మహాపాపం అవుతుంది. ఆ పరిస్థితుల్లో ఏమి చెయ్యాలో? అర్ధంకాక తీవ్రంగా విచారించిన భాస్కరాచార్య తన ఇష్టదైవం అయిన సూర్యభగవానుడిని ఇలా ప్రార్ధించాడు. “ఓ ప్రభూ! నా అతిధికి ఆధిత్యం ఇవ్వాలంటే నీవు కనపడాలి. అందువల్ల నీవు నాకోసం ఒక్కసారి దర్శనమివ్వు”. తన ప్రియ భక్తుడు అయిన భాస్కరాచార్య యొక్క అభ్యర్ధనమేరకు సూర్యభగవానుడు, భాస్కరాచార్య పెరటివైపు ఉన్న వేపచెట్టుమీద సాక్షాత్కరించాడు. సూర్యుడు కనిపిస్తున్నాడు కనుక, భాస్కరాచార్య ఎంతో సంతోషంతో ఆ బైరాగికి ఆ చెట్టుక్రిందే రుచికరమైన విందు భోజనం వడ్డించాడు. ఆ భోజనం పూర్తి అయిన తరువాత సూర్యుడు ఆ చెట్టు మీద నుండి అదృశ్యం అయ్యాడు. ఈవిధంగా సూర్యభగవానుడు తన భక్తుడికోసం సూర్యాస్తమయం తరువాత కూడా మళ్ళీ ఉదయించి తన భక్త ప్రియత్వాన్ని చాటుకున్నాడు. బహుశా ఆకారణంగానే, సూర్యుడిని “ప్రత్యక్ష నారాయణుడు” అనే పేరుతో హైందవులు కీర్తిస్తున్నారు. ఏదిఏమైనా, సూర్యభగవానుడిని తన పెరటిలోని వేపచెట్టుపైకి రప్పించగలిగిన ఆ భాస్కరాచార్యుడికి ఆనాటి నుండి “నింబార్క” (నింబ = వేపచెట్టు, అర్క = సూర్యుడు) అన్న పేరు వచ్చింది.

ఇంకొక అద్భుతమైన విషయం ఏమంటే, కరుడు కట్టిన ఇస్లాం మతవాదిగా, హైందవ మత ద్వేషిగా గుర్తించబడిన మొగల్‌చక్రవర్తి అక్బరు, సూర్యభగవానుడి యొక్క మహత్యాన్ని ప్రత్యక్షంగా తెలుసుకుని, ఆపై సూర్యభగవానుడిని ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం, అర్ధరాత్రి సమయాలలో ఆరాధించాలని ఒక శాసనాన్ని విడుదలచేసాడు. అంతేకాకుండా, సూర్యభగవానుడి యొక్క వెయ్యి సంస్కృత నామాలను ఉదయ సూర్యుడిని చూస్తూ మహాభక్తితో జపిస్తూ ఉండేవాడు. అంతేకాకుండా, ఈ నామ జపం అయిన తరువాత తన రెండు చెవులను రెండు చేతులతో పట్టుకుని ఆత్మ ప్రదక్షిణాలు (తనచుట్టూ తాను తిరగటం) చేసేవాడు. అంతేకాకుండా, సూర్యజయంతి

నాడు, తనను బంగారంతో తూకం వేయించుకుని ఆపై ఆ బంగారాన్ని బైరాగులకు, సాధువులకు దానంచేసేవాడు.

ఇప్పటికీ, ఉత్తర భారతదేశంలోని చాలామంది హిందువులు, ఆదివారంనాడు తాము తీసుకునే ఆహారంలో ఉప్పుని కలపరు. ఉత్తర భారతదేశంలోని గ్రామీణ ప్రాంతాలలో పనిచేసే శ్రామికులు చలికాలంలో ఉండే చలి తట్టుకోలేక ఉదయం లేవగానే, తమకు ఎదురుగా తూర్పు ఆకాశంలో కనపడే లేత కిరణాల సూర్యభగవానుడిని చూసి "సూరజ్‌నారాయణ్" అని అనేకసార్లు ఉచ్ఛరిస్తూ ఉంటారు.

**జల ఆరాధన :** ఉత్తర భారతదేశంలోని హైందవులు – నదులను ముఖ్యంగా, గంగ, యమున లాంటి పవిత్ర నదులను దేవతలతో సమానంగా భావించి వాటికి పూజలు చెయ్యటం ఒక సాంప్రదాయంగా అనాదికాలం నుండి కొనసాగుతున్నది. ఆ కారణంగానే, వింధ్యపర్వతానికి ఇవతల ఉన్న హైందవ మతానికి చెందిన ద్రవిడ ప్రజలు (ఆంధ్రా, తెలంగాణా, తమిళనాడు, కర్నాటక, కేరళ ప్రాంతాల ప్రజలు) తమ కుటుంబాలలో ఎవరైనా వ్యక్తి మరణించినట్లయితే, ఆ వ్యక్తి యొక్క అస్తికలను వింధ్య పర్వతాలకు అవతల ఉన్న గంగానదిలో నిమజ్జనం చెయ్యటం జరుగుతున్నది. నదుల్ని మరియు జల ప్రవాహాలను హైందవులు ఆరాధించటం వెనకాల ఇంకొక నిగూఢమైన మర్మం కూడా దాగి ఉన్నదని ఒక పాశ్చాత్య పరిశోధకుడు తెలియజేసాడు. ఆయన చెప్పిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, "లోతైన నదులలో మరియు సరస్సులలో మరియు వేగంగా ప్రవహించే జల ప్రవాహాలలో దేవతా జాతికి చెందిన సర్పాలు, తక్కువస్థాయికి చెందిన దేవతలు మరియు జల పిశాచాలు నివసిస్తూ ఉంటాయి. ఈ శక్తులయొక్క అనుగ్రహాన్ని పొందటంకోసం ఆ జల సంబంధ ప్రవాహాలకు ప్రత్యేక పూజలు చెయ్యటం జరుగుతున్నది".

ఘర్వాల్ ప్రాంతంలో ఉన్న త్రియుబి నారాయణ్ ఆలయ పరిసరాల్లో ఒక ప్రాచీనకాలంనాటి సరస్సు ఉన్నది. ఈ సరస్సులో పసుపు పచ్చ రంగులో ఉండే అనేక దేవతా జాతి సర్పాలు నివసిస్తూ ఉంటాయి. నాగపంచమినాడు ఈ దేవతా సర్పాలు నీటి పైభాగానికి వస్తాయి. ఆ సమయంలో అనేకమంది హైందవ భక్తులు ఆ సర్పాలు ఉన్న సరస్సులకు పూజలు చేస్తారు. అనగా, ఆ సరస్సులలో ఉండే సర్ప దేవతలకు పూజలు చేస్తారు అన్నమాట.

కొన్ని సమయాలలో తెలిసో, తెలియకో కొంతమంది వ్యక్తులు – నదులలో లేదా జల ప్రవాహాలలో ఉండే "సుడిగుండాలలో" చిక్కుకుని అకాల మృత్యువు

పాలు కావటం జరుగుతుంది. అలా చనిపోయినవారియొక్క ఆత్మలు ఆ నదులలో/ జలప్రవాహాలలో తీవ్రమైన అశాంతితో సంచరించటం జరుగుతుంది. ఎవరైనా వ్యక్తులు ఆ నదిమీద పడవలో ప్రయాణం చేస్తున్నప్పుడు ఆ ప్రేతాత్మలు ఆ పడవలను ముంచివేసి, ఆ పడవలోని ప్రయాణీకులను మరణానికి గురిచేస్తాయి. ఇలా జరగ కుండా ఉండటంకోసం, సుడి గుండాలు ఉన్న ప్రదేశంలో పూలు, పసుపు, కుంకుమ లాంటి పవిత్ర ద్రవ్యాలువేసి, గట్టుమీద నుండే పూజలు చెయ్యటం జరుగుతుంది. ఇలాంటి చెయ్యటం వల్ల ఆ ప్రేతాత్మలు శాంతిస్తాయని, ఎవరికీ హాని చెయ్యకుండా ఉంటాయని భావిస్తారు.

**పశ్చిమ, తూర్పు భారతంలో తాంత్రిక విశ్వాసాలు :**

భారతదేశంలో ఎక్కువ సంఖ్యలో ఉన్న ఆటవిక తెగలలో మూడవ స్థానంలో సంతాల్ తెగ ప్రజలు ఉంటారు. వీరు, భారతదేశంలోని పశ్చిమబెంగాల్, ఒరిస్సా, బీహార్, జార్ఖండ్ మరియు అస్సాం రాష్ట్రాలలో ఎక్కువగా నివసిస్తున్నారు. ఇంకా – బాంగ్లాదేశ్ మరియు నేపాల్ దేశాల్లోకూడా వీరి సంఖ్య చెప్పుకోదగినవిధంగా ఉన్నది. సంతాల్ ప్రజలు, ప్రధానంగా తాంత్రిక మతాన్ని మరియు హిందూ మతాన్ని పాటిస్తారు. వీరి ప్రధాన భాష 'సంతాలి'. ఈ భాషే కాకుండా హిందీ భాషను కూడా వీరు ఎక్కువగా ఉపయోగిస్తారు.

సంతాల్ మతంలో క్షుద్ర విద్యను (సోర్సరీ/బ్లాక్‌మాజిక్) "ఓర్ఝా" అనే పేరుతో పిలుస్తారు. మంత్ర విద్యలను ప్రయోగించే మంత్రగాడిని కూడా "ఓర్ఝా" అని పిలుస్తారు. బీహార్, పశ్చిమబెంగాల్ మరియు ఒరిస్సా రాష్ట్రాలలో నివసిస్తున్న సంతాల్ ప్రజలకు మానవాతీత శక్తులమీద, క్షుద్ర ప్రయోగాలమీద బలమైన విశ్వాసాలు ఈనాటికీ ఉన్నాయని చెప్పవచ్చు.

సంతాల్ మతంలో – మంత్ర, తంత్రాలు, మూలికావైద్యం తెలిసిన వ్యక్తిని "ఓర్ఝా–జాన్‌గురు" అనే పేరుతో పిలుస్తారు. ఎవరైనా, సంతాల్ జాతికి చెందిన వ్యక్తికి తీవ్రమైన అనారోగ్యం వచ్చినా లేక ఒక వ్యక్తిని ఏవైనా ప్రేతాత్మలు ఆవహించి పీడిస్తున్నా "ఓర్ఝా–జాన్‌గురు" లేదా "ఓర్ఝా" రంగంలోకి దిగుతాడు. ఆ మంత్రవాది తన మంత్రశక్తితో మరియు మూలికా వైద్యంతో వ్యాధిగ్రస్తుడైన వ్యక్తికి చికిత్స చెయ్యటం జరుగుతుంది.

సంతాల్ ప్రజలు పూజించే దైవాలలో అతిముఖ్యమైన దైవం పేరు 'మరంగ్‌బరన్'. సంతాల్ ప్రజలలో ఒక విచిత్రమైన మతపరమైన సాంప్రదాయం ప్రచారంలో

ఉంది. అది ఏమిటంటే, ఈ జాతి ప్రజలు పూజించే అన్నిరకాల దేవతలను మరియు దైవాలను కలిపి "బొంగా" అనే పేరుతో పిలుస్తారు. ఉదాహరణకి – తాము ఎంతో భక్తితో పూజించే సూర్యుడిని 'సింగ్‌బొంగా' అనే పేరుతోను, తమ పూర్వీకుల ఆత్మలను 'బొంగారు' అనే పేరుతోను పిలుస్తారు. అంతేకాకుండా కొండలకు, ప్రవాహాలకు, అడవులకు – ఆధిపత్యం వహించే 'బొంగాలు' కూడా ఉంటాయని ఈ జాతి ప్రజలు నమ్ముతారు. ఏదిఏమైనా, అన్ని ముఖ్య సందర్భాలలోను సంతాల్ ప్రజలు ఈ వివిధ రకాల బొంగాల్ దైవాలకు తమ శక్తికొద్ది బలులు ఇస్తూ ఉంటారు.

సంతాల్ జాతి ప్రజలలో "అభిచార" (చేతబడి) ప్రక్రియపై విశ్వాసం ఈనాటి వరకు బలంగా ఉన్నది. కారణం, అలాంటి క్షుద్ర ప్రయోగాలు మానవులపై వాస్తవంగా చాలా ప్రమాదకరమైన ప్రభావాలను చూపిస్తాయని సంతాల్ ప్రజలకు అనుభవ పూర్వకంగా రుజువు అయ్యింది. ఒకవిశేషం ఏమంటే, ఆధునిక విద్యలో ఉన్నతస్థాయి డిగ్రీ సాధించిన ఒక సంతాల్ రచయిత తాను వ్రాసిన ఒక గ్రంధంలో ఇలా చెప్పాడు... "నేను చదివిన సైన్స్, మానవాతీత శక్తులు ఉండవని, చేతబడులు లాంటి ప్రయోగాలు మూఢనమ్మకమని చెబుతుంది. కానీ, నా స్వీయ అనుభవంలో అలాంటి శక్తులు ఉన్నాయని నాకు అనేకసార్లు రుజువు అయ్యింది. ఆ కారణంగానే నేను "అభిచార" ప్రక్రియలు వాస్తవమే అని నమ్ముతున్నాను".

సంతాల్ ప్రజలలో బలంగా ఉన్న విశ్వాసం ప్రకారం చూసినట్లయితే, "తమ జాతిలో ఎవరైనా వ్యక్తి, అకాల మృత్యువుకి గురైనా లేదా తమ సాంప్రదాయ వైద్యానికి, చివరికి ఆధునిక ఇంగ్లీషు వైద్యానికి కూడా లొంగని వ్యాధితో బాధపడుతున్నా – అందుకు కారణం ఖచ్చితంగా ఎవరో ఒక మంత్రవాది ఆ వ్యక్తిమీద చేసిన ప్రయోగమే అని భావించాల్సి ఉంటుంది". ఒక విశేషం ఏమంటే, భారతదేశంలో క్షుద్ర ప్రయోగాలకు పేరుపొందిన రాష్ట్రాలలో మొదటిస్థానం కేరళకు ఇవ్వబడింది. ఆ తరువాత స్థానం ఈశాన్య భారతదేశానికి చెందిన అస్సాం, మణిపూర్ లాంటి రాష్ట్రాలకు ఇవ్వబడింది. అస్సాంలోని "మయాంగ్" ప్రాంతంలో స్త్రీలు కూడా మంత్రగత్తెలుగా ఉంటారు. అదేవిధంగా, సంతాల్ జాతిలో చాలా వరకు స్త్రీలే మంత్రప్రయోగాలు చేసే మంత్రవాదులుగా ఉండటం జరుగుతున్నది.

సంతాల్ జాతికి చెందిన మంత్రగత్తెలు, తమకు వ్యతిరేకులైన ఏ వ్యక్తి మీద అయినా సరే 'ప్రయోగాలు' చెయ్యగలరు. కొన్ని సంవత్సరాల క్రితం అస్సాంలోని ఒక చిన్న పట్టణ ప్రాంతంలో "పిర్థి" అనే పేరుగల ఒక యువకుడు హఠాత్తుగా

అనారోగ్యానికి గురయ్యాడు. అతడి అనారోగ్యానికి కారణం, అతడి పినతల్లి అతడి మీద ప్రయోగించిన క్షుద్రశక్తే కారణం అని ఆ తరువాత జరిగిన ఒక సంఘటన ద్వారా రుజువు అయ్యింది. అది ఎలా జరిగింది అంటే....

ఒకరోజు రాత్రి పిర్ధి తన మంచంమీద పడుకుని నిద్రపోతున్నాడు. అతడు బాగా అనారోగ్యంగా ఉన్న కారణంగా అతడిని ఒకవిధమైన మత్తు ఆవరించి ఉన్నది. అలాంటి సమయంలో అతడి పినతల్లి చాలా రహస్యంగా అతడి గదిలోకి ప్రవేశించి, ఆపై అతడి పొట్టమీద తన తలను ఉంచి ఏదో మంత్రం చదువుతున్నది. ఆ మంత్రం సహాయంతో అతడి పొట్టను చీల్చి ఆ పొట్టలో ఉన్న కాలేయాన్ని (లివర్) బైటకు తియ్యాలని ఆమె ప్రయత్నిస్తున్నది. అదృష్టవశాత్తూ, ఆ సమయంలో పిర్ధికి మెళుకువ వచ్చింది. కళ్ళు తెరచి చూసిన అతనికి తన పొట్టమీదకి వంగి ఉన్న అతడి పినతల్లి కనపడింది. అప్పటికే ఈవిధమైన క్షుద్ర ప్రయోగ సంబంధ ప్రక్రియల గురించి బాగా తెలిసి ఉన్న పిర్ధి ఆపై ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా, తనమీదకు వంగి ఉన్న తన పినతల్లి శిరోజాలను తన రెండు చేతులతో గట్టిగా పట్టుకుని ఆపై పెద్దగా కేకలు వేసాడు. ఆ కేకలకు ఉలిక్కిపడి నిద్రలేచిన ఆ ఇంట్లోని సభ్యులు అందరూ గబ గబా నడుస్తూ పిర్ధి ఉన్న గదిలోకి వచ్చారు. క్షణాలలో ఈ విషయం ఊరంతా పాకిపోయింది. అందరూ పిర్ధి ఇంటిముందు గుమిగూడారు. ఆపై "పరగణా" అక్కడికి వచ్చాడు. ఆయన ఆ స్త్రీని బంధించి, ఆపై ఆమెను గట్టిగా గద్దించి "నీవు ఎందుకు ఇలా చేయబోయావో చెప్పు?" అన్నాడు. అప్పుడు ఆమె భయంతో వణకిపోతూ "పిర్ధిమీద కొద్ది రోజుల క్రితం చేతబడి చేసాను. ఆ చేతబడి ప్రభావంవల్ల అతడు అనారోగ్యంతో బాధపడుతున్నాడు. ఇప్పుడు అతని కాలేయాన్ని తీసుకుని తిందామని ఇలా వచ్చాను. నా దురదృష్టంవల్ల నేను దొరికిపోయాను" అన్నది. ఆపై – పరగణా, ఆమెను తగినవిధంగా శిక్షించి ఆపై ఆ గ్రామం నుండి వెళ్ళగొట్టాడు. (నోట్ : సంతాల్ ప్రాంతాలలో కొన్ని గ్రామాలకు అధిపతిగా ఉండే వ్యక్తిని సంతాలీ భాషలో 'పరగణా' అనే పేరుతో పిలుస్తారు.)

### ♦ పులిగా మారే యువకుడి యదార్ధ వృత్తాంతము :

సంతాల్ జాతికి చెందిన స్త్రీలకు మాత్రమే తాంత్రిక విద్యలు తెలుస్తాయని చెప్పుకుంటారు. అయితే, ఒక్కోసారి ఎవరైనా స్త్రీ, తనకు నచ్చిన పురుషుడికి ఈ తాంత్రిక విద్యలు నేర్పే అవకాశాలు ఉంటాయి. అలాంటి సందర్భంలో కొంతమంది పురుషులకు కూడా తాంత్రిక విద్యలు వస్తాయి. తన స్నేహితురాలి దగ్గర తంత్ర

విద్యలు నేర్చుకున్న ఒక యువకుడు తన విద్యను, తన భార్య దగ్గర ఎలా ప్రయోగించాడు? అన్న విషయాన్ని తెలియజేసే ఈ యదార్ధగాథ దాదాపు 100 సంవత్సరాల క్రితం జరిగింది. ఆ వృత్తాంతం గురించి తెలుసుకుందాం...

కొత్తగా పెళ్ళి అయిన 30 సంవత్సరాల "మంగో" అనే ఒక సంతాల్ యువకుడికి అతడి స్నేహితురాలు, పులిగా మారే మంత్రవిద్యను నేర్పింది. అతడికి ఆ విద్య వచ్చు అన్న విషయం అతడి భార్యకు ఏమాత్రం తెలియదు. ఒకరోజు ఆ యువకుడు తన భార్యను వెంటపెట్టుకుని తన అత్తగారింటికి బయలుదేరాడు. ఆ కాలంలో భారతదేశంలోని చాలా ప్రాంతాలలో రవాణా సౌకర్యాలు ఉండేవి కాదు. అందువలన ఈ యువ దంపతులు, కాలినడకన ప్రయాణం ప్రారంభించారు. వాళ్ళు ప్రయాణించే మార్గం ఒక అడవి గుండా వెళుతుంది. ఏదిఏమైనా, ఆ దంపతులు మధ్యాహ్న సమయానికి అడవి మధ్య భాగానికి చేరుకున్నారు. ఆ సమయంలో ఆ దంపతులకు ఒకచోట కొన్ని ఆవులు మరియు కొన్ని కోడె దూడలు గడ్డి మేస్తూ కనిపించాయి. వాటిలో ఒక కోడెదూడ బాగా బలిసి కనపడింది. ఆ కోడె దూడను చూడగానే ఆ "మంగో" ఒక నిమిషం మనసులో ఏదో ఆలోచించుకుని, ఆపై అక్కడే నిలబడి పోయాడు. అతని భార్యకూడా అక్కడే నిలబడి అతనివైపు పరిశీలనగా చూస్తున్నది. అప్పుడు "మంగో" తన శరీరం పై భాగంలో ఉన్న లాల్చీ లాంటి వస్త్రాన్ని తొలగించాడు. ఇప్పుడు అతడి నడుము క్రింద భాగం మీద మాత్రమే వస్త్రాలు ఉన్నాయి. ఆపై "మంగో" తాను విప్పిన లాల్చీని తన భార్య చేతికి ఇచ్చి ఆమెతో ఇలా అన్నాడు. "నువ్వు ఒక్క 10 నిమిషాలు ఇక్కడే నిలబడి ఉండు. నాకు బాగా ఆకలిగా ఉన్నది. అదిగో అక్కడ కనపడుతున్న ఆ కొవ్వు పట్టి బలిసిన కోడెదూడను తినేసి వస్తాను". అతడి మాటలు విన్న ఆ భార్య ఒక్కసారిగా నిర్ఘాంతపోయింది. "బ్రతికి ఉన్న కోడిదూడను ఇతడు ఎలా తింటాడు?" అని ఆ భార్య ఆలోచించింది. తన భార్య ఏమనుకుంటున్నదో ఇట్టే గ్రహించిన "మంగో" చిన్నగా నవ్వి, ఆపై ఆమెతో ఇలా అన్నాడు. "నేను, ఇప్పుడు నా మంత్రశక్తితో పులిగా మారి ఆపై ఆ కోడె దూడను ఆరగిస్తాను. నేను పులిగా మారిన తరువాతగాని లేదా నేను పులి రూపంలో ఆ కోడె దూడను తింటున్నప్పుడు గాని నీవు భయపడి పారిపోవద్దు. ధైర్యంగా ఉండు". ఆపై "మంగో" తన నడుముకి ఉన్న చిన్న సంచి నుండి ఒక చిన్న చెట్టు వేరు ముక్కని తన భార్య చేతిలో పెట్టి ఆపై ఆమెతో ఇలా చెప్పాడు. "నేను ఆ కోడె దూడను తిన్న తరువాత నీ దగ్గరకు వస్తాను. అప్పుడు నువ్వు, నన్నుచూసి బెదరకుండా ధైర్యంగా ఉండు. ఆపై ఈ చెట్టు వేరుని నా ముక్కు దగ్గర పెట్టు. ఆ చెట్టువేరు వాసన నాకు

తగలగానే నేను మళ్ళీ మనిషి రూపంలోకి మారిపోతాను. ఆ తరువాత మనిద్దరం కలిసి నడుచుకుంటూ మీ పుట్టింటికి వెళదాం". అప్పుడు "మంగో" రెండు అడుగులు ముందుకు నడిచి, ఆపై తన తలపై రెండు చేతుల్నీ పెట్టుకుని చిన్న స్వరంతో ఏదో ఒక మంత్రాన్ని రెండు నిమిషాలు పఠించాడు.



అద్భుతం! ఆశ్చర్యం!, "మంగో" పులి రూపంలోకి మారిపోయాడు. ఆపై, ఆ పులి పెద్దగా గాండ్రిస్తూ ముందుకు పరుగుతీసి, ఆపై అక్కడ గడ్డి మేస్తున్న కోడె దూడ మీదకు దూకింది. ఆ కోడెదూడ మెడ భాగాన్ని తన నోటితో పట్టుకుని బలంగా కొరికింది. ఆ కోడె దూడ ఏ అరుపూ లేకుండా ప్రాణాలు వదిలింది. ఆపై, ఆ పులి ఆ కోడెదూడ రక్తాన్ని పీల్చేసింది. ఈ భయంకర దృశ్యం చూసి అతని భార్య అరవటానికి కూడా శక్తిలేక గజ గజా వణకిపోతూ గుడ్లు తేలేసి నిలబడింది. ఆ పులి, కోడెదూడ మాంసాన్ని కూడా ఆరగిస్తున్న సమయంలో ఆ యువతి స్పృహలోకి వచ్చింది. ఆపై ఆమె ఆ అడవిలో పిచ్చిగా పరుగులు తీస్తూ తన పుట్టింటికి చేరుకున్నది. ఆమె ఎడమ చేతిలో ఆమె భర్తయొక్క లాల్చీ మరియు కుడిచేతిలో మూడు అంగుళాల పొడవు ఉన్న ఏదో చెట్టు వేరును చూసి ఆమె తల్లిదండ్రులు ఆశ్చర్యపోయారు. ఆమె నోట మాట రాకుండా అలా నిలబడిపోయింది. ఆపై, వాళ్ళు – ఆమెకు సపరిచర్యలుచేసి బాగా ధైర్యం చెప్పారు. కొద్ది నిమిషాల తరువాత ఆమె కోలుకుని ఈ లోకంలోకి వచ్చింది. అప్పుడు ఆమె, అడవిలో తన భర్త చేసిన భయంకరమైన పనిగురించి వాళ్ళకి వణుకుతున్న స్వరంతో చెప్పింది. వాళ్ళు, ఆమె చెప్పిన మాటలు విని భయాందోళనలతో వణికిపోయారు.

అక్కడ – అరణ్యంలో కోడెదూడ మృతదేహాన్ని సంపూర్తిగా ఆరగించిన తరువాత ఆ పులి, తన భార్య అంతకుముందు నిలబడి ఉన్న ప్రదేశం దగ్గరకు వచ్చి చూడగా అక్కడ ఆ భార్య లేదు. "ఆమె తనకి ఆ వేరుని వాసన చూపిస్తేగాని, తను మనిషిగా

మారటం సాధ్యంకాదు. ప్రస్తుతం ఆమె అక్కడ లేదు. అలాగని తాను ఆ పులి రూపంలో తన భార్య ఉన్న గ్రామానికివెళితే తనని అక్కడ జనం తప్పకుండా చంపేస్తారు". – అందువల్ల తాను, ప్రస్తుతం తన భార్య దగ్గరకు వెళ్ళే అవకాశం లేదని అర్ధంచేసుకున్న పులి రూపంలో ఉన్న "మంగో" ఆ రోజు రాత్రి అయ్యేదాకా ఆ అరణ్యంలోనే అటు, ఇటు పిచ్చిగా తిరిగాడు. అర్ధరాత్రి అయ్యింది. "అర్ధరాత్రి సమయంలో అత్తగారి గ్రామంలోకి వెళితే తనను ఎవరూ చూడరు. అలాంటి పరిస్థితుల్లో అత్తగారింట్లోకి వెళితే, అక్కడ తన భార్య ఉంటుంది కనుక, ఆమె దగ్గర ఉన్న వేరు సహాయంతో తను మళ్ళీ మనిషి రూపంలోకి మారవచ్చు". – ఇలా ఆలోచించిన పులి రూపంలో ఉన్న "మంగో", అర్ధరాత్రి దాటిన తరువాత నిశ్శబ్దంగా – అత్తగారి ఇల్లు ఉన్న గ్రామంలోకి ప్రవేశించాడు. అయితే, అతడు ఇలా ఊళ్ళోకి ప్రవేశించాడో లేదో ఆ ప్రాంతంలో ఉన్న డజన్లకొద్ది ఊరకుక్కలు, పులి రూపంలో ఉన్న "మంగో"ని చూసి బెదిరిపోయి భయంకరంగా మొరగటం ప్రారంభించాయి. కుక్కలు అలా ఒక్కసారిగా మొరగటం విన్న ఆ గ్రామస్తుల్లో ఒకడు, తన ఇంటి వాకిలి తలుపులు తెరచి బైటకు వచ్చిచూసాడు. అతడి ఇంటికి కొద్ది అడుగుల దూరంలో నిలబడి దిక్కులు చూస్తున్న పులి కనపడింది. దాంతో అతడు పెద్ద స్వరంతో "బాబోయ్ పులి!" అని నాలుగైదుసార్లు అరిచి, ఆపై వేగంగా తన ఇంట్లోకి పరుగెత్తి తలుపులు వేసుకున్నాడు. అతడి అరుపులు విన్న ఇరుగు పొరుగు వాళ్ళుకూడా "గ్రామంలోకి పులి వచ్చిందని" తెలుసుకుని తలుపులు వేసుకుని లోపల బిక్కు బిక్కు మంటూ కూర్చున్నారు. గ్రామస్తులు అరుస్తున్న అరుపులు విన్న పులి రూపంలో ఉన్న "మంగో"కి బాగా కంగారు పుట్టింది. అయినప్పటికీ అతడు మొండి ధైర్యంతో ముందుకి నడిచాడు. కొంతసేపు నడిచిన తరువాత అతడికి అత్తగారిల్లు కనిపించింది. అతడు, మూసి ఉన్న ఆ ఇంటి తలుపుల్ని తన తలతో ఒకసారి బలంగా గుద్దాడు. ఆ తలుపులు తెరచుకున్నాయి. అతడు లోపలికి ప్రవేశించాడు. అతడిని చూడగానే ఆ ఇంట్లోని వారందరూ భయంతో వణికిపోయి పెద్దగా అరవటం ప్రారంభించారు. "తమ ఇంట్లోకి వచ్చింది పులి రూపంలో ఉన్న తన భర్తే" అని గ్రహించిన అతడి భార్య తన దగ్గర ఉన్న వేరుని చేతిలో పట్టుకుని ఒక్క అడుగులో ఆ పులి దగ్గరకు వచ్చింది. ఆపై, ఆ పులి ముక్కు దగ్గర ఈ వేరుని ఉంచింది. ఆ పులి ఈ వేరుని ఒక్కసారి బలంగా వాసన చూసింది. క్షణాలలో ఆ పులి మానవ రూపంలోకి మారిపోయింది. అది గమనించిన "మంగో" అత్తమామలు అతడి కాళ్ళని, చేతుల్ని చల్లటి నీళ్ళతో కడికి, ఆపై అతడికి త్రాగటానికి వేడి వేడిగా ఉన్న గంజిని ఇచ్చారు. ఆ వేడి గంజి త్రాగగానే అతడు పెద్దగా వాంతులు చేసుకున్నాడు.

ఆ వాంతిలో – గడ్డకట్టిన రక్తం చాలా కనపడింది. (పులి రూపంలో అతడు త్రాగిన కోడెదూడ రక్తం ఆవిధంగా బయటపడింది అన్నమాట.) తెల్లవారిన తరువాత, "మంగో"యొక్క మామగారు ఆ గ్రామంలోని ప్రజలందరినీ తన ఇంటి దగ్గకు పిలిపించి, ఆపై వాళ్ళతో నిన్న అడవిలో తన అల్లుడు "మంగో" పులిగా మారిన విషయం, కోడెదూడను తిన్న విషయం మరియు నిన్న అర్ధరాత్రి సమయంలో పులి రూపంలో తన ఇంటికి వచ్చిన విషయం చెప్పాడు. వాళ్ళందరూ భయంతో మరియు ఆశ్చర్యంతో నోళ్ళు తెరచి "మంగో" కేసి చూస్తూ ఉండిపోయారు. అప్పుడు "మంగో" మామగారు కఠినత్వం నిండిన స్వరంతో "మంగో"తో ఇలా అన్నాడు. "నీవు వెంటనే ఇక్కడ నుండి వెళ్ళిపో. ఇక, జీవితంలో నా కూతురు నీ ముఖం చూడదు".

ఆవిధంగా మామగారు అనటంతో "మంగో" అవమానంతో, బాధతో తలవంచు కున్నాడు. అతడి భార్య, అతడి ముఖం చూడటానికి ఇష్టపడక, అక్కడ నుండి లేచి పెరట్లోకి వెళ్ళిపోయింది. ఆ గ్రామ ప్రజలందరూ "మంగో"ని అసహ్యంగా చూసారు. ఇక, అక్కడ తన మాట ఎవరూ పట్టించుకోరని అర్ధం చేసుకున్న "మంగో" భారంగా అడుగులు వేస్తూ తన స్వగ్రామం వైపు ప్రయాణం ప్రారంభించాడు.

సంతాల్ జాతివారు ఎలాంటి మంత్రవిద్యలను కలిగి ఉంటారో స్వయంగా చూసిన ఒక సంతాల్ జాతి రచయిత తాను కొన్ని దశాబ్దాల క్రితం వ్రాసిన గ్రంధంలో తనకు ఎదురైనా రెండు అనుభవాల గురించి ఇలా తెలియజేసాడు.

♦ మా గ్రామానికి దాదాపు 30 కి.మీ. దూరంలో ఉన్న మొహల్‌పహారి అనే గ్రామంలో జర్బా అనే పేరుగల ఒక యువకుడు ఉండేవాడు. అతడు తన గ్రామానికి 10 కి.మీ. దూరంలో ఉన్న ఒక చిన్న పట్టణంలో నివసిస్తున్న ఒక ధనికుడి దగ్గర పనిచేస్తూ ఉండేవాడు. అతడు, ప్రతిరోజూ ఉదయం తన గ్రామం నుండి బయలుదేరి తన యజమాని ఉంటున్న పట్టణానికి చేరుకునేవాడు. చీకటి పడే వరకు యజమాని చెప్పిన పనులన్నీ పూర్తిచేసుకుని, ఆపై మళ్ళీ కాలినడకన తన గ్రామానికి తిరిగి వస్తూ ఉండేవాడు. ఒకరోజు పనుల వత్తిడి కారణంగా జర్బాకి చీకటి పడగానే బయలుదేరటానికి వీలుకాలేదు. దాదాపు రాత్రి 11 గంటల సమయంలో యజమాని ఇంట్లోని పనులన్నీ పూర్తిచేసుకుని ఆపై తన గ్రామానికి బయలుదేరాడు. అతడు సగం దూరం వచ్చేసరికి అర్ధరాత్రి అయిపోయింది. ఆ సమయంలో అతడికి రోడ్డుకి ప్రక్కగా కొంచెం దూరంలో ఉన్న దట్టమైన చెట్ల మధ్య నుండి ఏదో శబ్దం మరియు ఎవరో ఇద్దరు, ముగ్గురు వ్యక్తులు మాట్లాడుకుంటున్నట్లుగా వినపడింది. ఆ నిర్మానుష్య

ప్రాంతంలో, అందునా అర్ధరాత్రి సమయంలో అక్కడ ఉన్న వ్యక్తులు ఎవరు? – అన్న సందేహం జర్బ్బాని పీడించింది. ఆపై, అతడు తన ప్రయాణాన్ని ఆపి ఆపై రోడ్డుకి ప్రక్కగా ఉన్న చెట్ల మధ్యలోకి మెల్లిగా అడుగులు వేస్తూ వెళ్ళాడు. అక్కడకు వెళ్ళిన అతడికి అక్కడ ఒక విచిత్రమైన లేదా భయాన్ని కలిగించే ఒక దృశ్యం కనపడింది. అది ఏమిటంటే, "అక్కడ చాలా ఎత్తుగా ఉన్న ఒక వేప చెట్టు ఉన్నది. ఆ వేపచెట్టు మొదట్లో ఒక మట్టి ప్రమిదలో దీపారాధన వెలుగుతున్నది. ఆ చెట్టుకి చుట్టుప్రక్కల నేలలో పాతిన ఆరు అడుగుల కర్రలకు, వెలుగుతున్న కాగడాలు కట్టబడి ఉన్నాయి. ఆ వెలుగులో దాదాపు నలుగురు – అయిదుగురు స్త్రీలు ఒకరిచేతిని ఒకరు పట్టుకుని విచిత్రంగా



నృత్యం చేస్తున్నారు. మరికొందరు, స్త్రీలు ప్రక్కనే నిలబడి వికృతమైన స్వరంతో ఏవో మంత్రాలు చదువుతున్నారు. వాళ్ళకి దగ్గరగా వెళ్ళిన జర్బ్బా, అక్కడ కనపడుతున్న దృశ్యాలను చూసి భయంతో ఒక్కసారిగా "బాబోయ్! అని పెద్దగా అరిచాడు. అతని అరుపు విన్న ఆ స్త్రీలు ఒక్కసారిగా నిశ్శబ్దంగా నిలబడిపోయారు. ఆపై, వాళ్ళు పెద్దగా అరుస్తూ జర్బీ వైపు పరుగెత్తుకుంటూ వచ్చారు. వాళ్ళనుచూసి భయపడిన జర్బీ, తన శక్తికొద్ది అక్కడ నుండి రోడ్డువైపు పరుగెత్తటం ప్రారంభించాడు. అయినప్పటికీ, వాళ్ళు మరింత వేగంగా పరుగెత్తి జర్బీని పట్టుకున్నారు. వాళ్ళు మొత్తం 12 మంది దాకా ఉన్నారు. ఆ తరువాత ఆ స్త్రీలు, జర్బీని ఆ వేపచెట్టు దగ్గరకు తీసుకువచ్చి, ఆపై అతడిని ఆ వేపచెట్టుకి ఉన్న ఒక పెద్ద కొమ్మకి తలక్రిందులుగా వ్రేలాడదీసారు. దాంతో అతడికి ఒక్కసారిగా స్పృహ తప్పింది. ఆ మర్నాడు సూర్యోదయ సమయంలో జర్బీకి స్పృహ వచ్చింది. తనకి రాత్రి ఏం జరిగిందో? జర్బీకి సరిగ్గా గుర్తులేదు. ఏదిఏమైనా, అదృష్టవశాత్తు ఆ సమయంలో అటువైపుగా వచ్చిన ఒక రైతుకి –

చెట్టుకి తలక్రిందులుగా వ్రేలాడుతున్న జర్బీ కనపడ్డాడు. ఆపై, అతడు చాలా జాగ్రత్తగా చెట్టు ఎక్కి, జర్బీ కాళ్ళను చెట్టు కొమ్మకి బంధించి ఉన్న తాడుని ఒక కత్తితో కోసి, చాలా జాగ్రత్తగా జర్బీని క్రిందకు జార్చాడు. ఆ తరువాత జర్బీ చేతులకు మరియు కాళ్లకు ఉన్న కట్లు కోసివేసి అతడిని బంధ విముక్తుడిని చేసాడు. ఆపై, జర్బీ నీరసంగా నడుస్తూ తన గ్రామానికి చేరుకున్నాడు.

ఇంటికి చేరిన అతడు, నిన్న అర్ధరాత్రి తనకు ఎదురైన భయంకర అనుభవం గురించి ఇంట్లో వాళ్ళకి తెలియజేసాడు. "ఆ స్త్రీ మంత్రగాళ్ళు, జర్బీ మీద ఏదైనా క్షుద్ర ప్రయోగం చేసి ఉంటారేమో" అన్న అనుమానం అతడి ఇంట్లో వారికి కలిగింది. దాంతో వాళ్ళు, వాళ్ళ గ్రామంలోని ఒక "ఓఝాని" తమ ఇంటికి పిలిపించారు. ఆ ఓఝా తనకు తెలిసిన మంత్రాలను మరియు వన మూలికలను ఉపయోగించి జర్బీకి భయం తగ్గించటానికి ప్రయత్నించాడు. ఏది ఏమైనా, ఈ సంఘటన జరిగిన తరువాత జర్బీ, రెండు మూడు రోజుల దాకా ఇంట్లో నుండి బైటకు రాలేదు. నాల్గవరోజు ఉదయం, జర్బీ హఠాత్తుగా కేకపెట్టి క్రింద పడిపోయాడు. అదిచూసి అతని కుటుంబంలోని వాళ్ళు అతని చుట్టూ చేరారు. కొద్ది నిమిషాల తరువాత జర్బీ పాదాల నుండి దాదాపు ఒక అంగుళం పరిమాణంలో ఉన్న సన్నటి పురుగులు బయటకు వచ్చాయి. అదిచూసి కంగారు పడిన అతడి కుటుంబీకులు ఒక వైద్యుడిని అక్కడకు రప్పించి అతడికి ఆ వైద్యుడి ద్వారా వైద్యం చేయించారు. అయితే జర్బీ విచిత్రమైన స్వరంతో తన ఇంట్లో వారితో ఇలా చెప్పాడు. "నామీద ఆ ఆడ మాంత్రికులు ఏదో చెడు ప్రయోగం చేసారు. ఇక నేను బ్రతకటం అసాధ్యం. నాకోసం మీరు వైద్యులను రప్పించటం వృధా. నేను ఏ క్షణంలో అయినా చనిపోవచ్చు".

అతడు ఆ తరువాత కొద్ది రోజులకే చనిపోయాడు. ఆ చనిపోవటానికి ముందు అతడు తన తల్లిని తన దగ్గరకు పిలిచి ఆమెతో చాలా చిన్న స్వరంతో ఇలా చెప్పాడు. "ఆ రోజు అర్ధరాత్రి నన్ను బంధించిన ఆడవారిలో మన గ్రామానికి చెందిన ఒక అమ్మాయి కూడా ఉన్నది". ఈవిధంగా చెప్పిన జర్బీకి హఠాత్తుగా మాట పడిపోయింది. ఆ తరువాత కొద్ది క్షణాల్లోనే జర్బీ చనిపోయాడు.

♦ నా బావమరిది, మా గ్రామానికి 40 కి.మీ. దూరంలో ఉన్న ముబుండి అనే గ్రామంలో నివసిస్తూ ఉంటాడు. ఒకరోజు రాత్రి సమయంలో అతడు మరియు మరికొందరు వ్యక్తులు వాళ్ళకు సంబంధించిన పొలంలో కూర్చుని, ఆ పొలంలో కుప్పలుగా వెయ్యబడిన వరి ధాన్యానికి కాపలా కాస్తున్నారు. సరిగ్గా, అర్ధరాత్రి

దాటిన తరువాత వాళ్ళకి - దాదాపు పావు కిలోమీటరు దూరంలో మెరుస్తూ, ఆరిపోతూ అనేక వెలుగులు కనిపించాయి. అవి ఏమిటో? వాళ్ళకి అర్ధంకాలేదు. మిగిలినవాళ్ళు ఆ విషయాన్ని పెద్దగా పట్టించుకోలేదు. కానీ, బాగా ధైర్యవంతుడు అయిన మా బావమరిది ఆ వెలుగులు ఏమిటో? తెలుసుకోవాలని నిర్ణయించుకుని ఆపై మిగిలిన వారిని అక్కడే కూర్చోమని చెప్పి, తను ఒక్కడే వేగంగా నడుస్తూ ఆ వెలుగులవైపు వెళ్ళాడు. అతడు ఆ వెలుగుల దగ్గరకు వెళ్ళే సరికి ఆ వెలుగులు చాలా వేగంగా ప్రక్కనే ఉన్న ఒక ఇంట్లోకి ప్రవేశించాయి. మా బావమరిది ఆ ఇంట్లోకి వెళ్ళకుండా బైటే నిలబడి కాసేపు వేచి ఉన్నాడు. ఆ తరువాత మెల్లిగా అడుగులు వేస్తూ ఆ ఇంట్లోకి వెళ్ళాడు. అక్కడ కొంతమంది స్త్రీలు, వెలుగుతున్న ఒక పెద్ద దీపం చుట్టూ తిరుగుతూ ఏవో మంత్రాలు చదువుతూ కనిపించారు. ఆ స్త్రీలను మా బావమరిది పరిశీలనగా చూసాడు. ఆ తరువాత వాళ్ళు, అప్రయత్నంగా మా బావమరిదివైపు చూసారు. ఆపై వాళ్ళలో ఇద్దరు స్త్రీలు వికృతంగా అరుస్తూ మా బావమరిది వైపు దూసుకు వచ్చారు. దాంతో, మా బావమరిది విపరీతమైన భయానికి గురై ఆ ఇంట్లోంచి రెండుగెంతుల్లో బైటకు దూకాడు. ఆపై, పిచ్చిపట్టినవాడిలా పరుగెడుతూ తన ఇంట్లోకి వెళ్ళిపోయాడు. అలా భయంతో ఇంటికి వచ్చిన మా బావమరిదిని చూసి అతని భార్య అతడితో ఇలా అన్నది. “నీవు, మన పొలాలకు దూరంగా కనిపిస్తున్న వెలుగుల గురించి తెలుసుకోవాలని వెళ్ళావు కదా. ఆ వెలుగులు ఏమిటో నీకు తెలిసిందా?”.

ఆమె అడిగిన ప్రశ్నలకు మా బావమరిది సమాధానం చెప్పకుండా నిశ్శబ్దంగా ఉండిపోయాడు. మర్నాడు ఉదయానికి అతని కుడిచేయి బాగా వాచిపోయింది. మధ్యాహ్న సమయానికి ఎడమ చేయి కూడా వాచిపోయింది. సాయంత్రానికి మాట పడిపోయింది. ఆ తరువాత కొన్ని గంటలకే అతడు ఒక్కసారి పెద్దగా కేకవేసి కింద పడిపోయాడు. ఆ తరువాత అతడు తిరిగి లేవలేదు. “మా బావ మరిది బహుశా ఆ రోజు రాత్రి ఆ ఇంట్లో చూసిన మంత్రగత్తెల ప్రయోగం కారణంగానే చనిపోయి ఉంటాడని భావిస్తున్నాను”.

♦ కర్మాటనే అనే గ్రామంలో నివసిస్తున్న సురై అనే వ్యక్తి అల్లుడైన కాడే, కొంతమంది మంత్రగత్తెల సమావేశాన్ని చూసిన కారణంగా మరణించాడని చెబుతారు. అతడు చనిపోవటానికి ముందు, తన కుటుంబంలోనివారితో చెప్పిన సమాచారం ప్రకారం చూసినట్లయితే....

“అప్పటికి వారం రోజుల క్రితం కాడే, కొంతమంది మిత్రులతో కలిసి రాత్రి సమయంలో – దగ్గరలో ఉన్న పట్టణం నుండి కర్మాటనే గ్రామానికి తిరిగి వస్తున్నాడు. వాళ్ళు పట్టణంలో బయలుదేరే ముందే కొంచెం ఎక్కువగా మద్యం సేవించారు. ఏదిఏమైనా, వాళ్ళందరూ పట్టణం నుండి బయలుదేరి వస్తూ కొంతదూరం నడిచారు. అలా నడిచిన తరువాత – వాళ్ళు వస్తున్న మార్గం ఒకచోట మూడుగా చీలింది. అప్పుడు కొందరు వ్యక్తులు ఒక మార్గం గుండా తమ గ్రామంవైపు వెళ్ళారు. మరికొందరు వ్యక్తులు ఇంకొక మార్గం గుండా తమ గ్రామానికి బయలుదేరారు. కాడే, అదే మార్గం గుండా ముందుకు నడుస్తూ కర్మాటనే గ్రామంవైపు వేగంగా అడుగులు వేస్తున్నాడు. అతడు ఇంకొక కిలోమీటరు నడిస్తే తన గ్రామంలోకి ప్రవేశిస్తాడు. ఇంతలో, అతడికి రోడ్డుకి ప్రక్కగా వెయ్యి గజాల దూరంలో ఎత్తైన చెట్టుక్రింద దీపాల వెలుగు కనిపించింది. ఆ వెలుగు ఏమిటా? అన్న ఆసక్తితో కాడే, రోడ్డుమీద నుండి అటువైపుకి నడిచాడు. అక్కడ కొంతమంది ఆడవాళ్ళు నిలబడి సన్నటి స్వరంతో ఏవో మంత్రాలు చదువుతున్నారు. “వాళ్ళు మంత్రగత్తెలు” అని తెలియని కారణంగా కాడే, వాళ్ళ దగ్గరకువెళ్ళి “మీరందరూ ఎవరు?, ఇంత రాత్రివేళ మీరు ఇక్కడ ఏం చేస్తున్నారు?” అన్నాడు. అప్పుడు వాళ్ళు అతనివైపు చూసి పెద్దగా అరిచారు. ఆ తరువాత అతడి దగ్గరకు వచ్చి అతడిని బలవంతంగా ఆ పెద్ద చెట్టు కాండం దగ్గరకు తీసుకువచ్చారు. ఆ తరువాత అతడిని ఆ చెట్టుముందు నేలమీద బోర్లా పడుకోపెట్టి, అతడి వీపుమీద పసుపు, కుంకుమ చల్లి ఆపై అస్పష్టంగా ఉన్న సంతాలీ భాషలో ఏవో మంత్రాలు చదివారు. దాంతో కాడేకి స్పృహతప్పిపోయింది.

తూర్పున వెలుగులు వస్తున్న సమయంలో కాడేకి స్పృహ వచ్చింది. అక్కడ ఆడవాళ్ళులేరు. అప్పటివరకు అక్కడ దీపాలు వెలిగాయి అన్నందుకు గుర్తుగా కొన్ని ప్రమిదలు కొండెక్కుతూ కనిపించాయి. ఏదిఏమైనా, కాడే తేరుకుని ఆ తరువాత మెల్లిగా అడుగులు వేస్తూ తన గ్రామంలోకి ప్రవేశించి, ఆపై తన ఇంట్లోకివెళ్లి అక్కడ ఉన్న ఒక మంచంమీద బోర్లా పడిపోయాడు. ఒక విచిత్రం ఏమంటే, ఆ రోజురాత్రి కాడేతోపాటు ప్రయాణించిన ఇతర పురుషులకు కూడా రెండు మూడు రోజులపాటు విపరీతమైన అనారోగ్యం వచ్చింది. కానీ, కాడే మాత్రం తనకు వచ్చిన అనారోగ్యంతో తొమ్మిదోరోజు సాయంత్ర సమయంలో చనిపోయాడు. “ఎవరైనా పురుషుడు తెలిసో, తెలియకో – రాత్రి సమయంలో క్షుద్ర పూజలు చేస్తున్న మంత్రగత్తెలను చూసినట్లయితే ఆ మంత్రగత్తెలు ఆ పురుషుడిపై చేసే ప్రయోగంవల్ల ఆ పురుషుడు తప్పనిసరిగా చనిపోతాడు” అని అప్పటికే సంతాల్ ప్రాంతాలలో ప్రచారంలో ఉన్న విశ్వాసం, కాడే మరణంతో ఇంకొకసారి బలపడింది.

◆ ఈశాన్య–భారత రాష్ట్రాలలో తాంత్రిక విశ్వాసాలు :

అస్సాం, అరుణాచల్ ప్రదేశ్, మణిపూర్, మేఘాలయ, మిజోరాం, నాగాలాండ్, త్రిపుర, సిక్కిం – అనే 8 రాష్ట్రాలు భారతదేశ ఈశాన్య ప్రాంతంలో ఉన్నాయి. ఈ రాష్ట్రాలలో ఆటవికుల మరియు కొండజాతుల ప్రజల సంఖ్య అత్యధికంగా ఉంటుంది. మొత్తంమీద ఈ రాష్ట్రాలలో 130 ప్రధాన జాతులకు చెందిన ప్రజలు నివసిస్తున్నారు. అనాదికాలం నుండి ఈ ప్రజలు – చెట్లను, రాళ్ళను పూజించటమే కాకుండా – తాంత్రిక ప్రయోగాలను బలంగా విశ్వసించటం జరుగుతున్నది. చనిపోయిన మనిషియొక్క ఆత్మ "ప్రేతాత్మ"గా మారుతుందని, అలాంటి ప్రేతాత్మలు మానవులకు వ్యాధులను కలిగిస్తాయని, ఈ ప్రాంతాలకు చెందిన ప్రజలు బలంగా నమ్ముతారు. అనేక దశాబ్దాలుగా ఈ ప్రాంతాలలో క్రైస్తవమతం బాగా ప్రచారంలోకి వచ్చినప్పటికీ, అక్కడి ప్రజలలో చాలామంది ఈనాటికీ మానవాతీత శక్తుల్ని విపరీతంగా నమ్ముతున్నారు. ఒక్కొక్క రాష్ట్రంలోనూ, ఒక్కోరకమైన తాంత్రిక విద్యలు ప్రచారంలో ఉన్నాయి. ఉదాహరణకి – నాగాలాండ్ రాష్ట్రంలో ప్రచారంలో ఉన్న "ధేరీ" అనే తాంత్రిక విద్యను ఆ ప్రాంతంలో ఉన్న స్త్రీలు మాత్రమే ప్రయోగిస్తూ ఉంటారు. తల్లి నుండి కూతురుకి, కూతురు నుండి ఆమె కూతురుకి ఈ విద్య అందుతూ ఉంటుంది. ఈ స్త్రీలు "ధేరీ" తంత్రవిద్యలో అసాధారణమైన నైపుణ్యాన్ని కలిగి ఉన్నారని తెలుస్తున్నది. ఈ తాంత్రిక విధానంలో స్త్రీ మంత్రగత్తె, ఎదుటి మనిషి కళ్ళకు కనపడని ఒక పొడిని గాలిలోకి చల్లుతుందని, ఆ పొడి మీద పడిన వ్యక్తి కొద్ది గంటల్లోనే తీవ్రమైన అనారోగ్యానికి గురై చనిపోవటం జరుగుతుందని చెబుతారు. ఒక విశేషం ఏమంటే, ఈ పొడి తాకిన వ్యక్తికి ఇంగ్లీషు వైద్యం ఏమాత్రం రక్షణ కల్పించలేదని తెలుస్తున్నది. ఈ వ్యక్తిపైన ఈ ప్రయోగం చేసిన మంత్రగత్తె దొరికినట్లయితే అప్పుడు ఆ ప్రాంత ప్రజలు ఆ మంత్రగత్తెను తమ ప్రదేశం నుండి శాశ్వతంగా వెళ్లగొట్టటంగాని లేదా భవిష్యత్తులో ఇంకే ప్రయోగం చెయ్యకుండా ఆమె కుడిచేయి నరకటంగాని జరుగుతుంది.

ఈశాన్య భారతంలో ఉన్న ముఖ్యమైన రాష్ట్రాలలో మణిపూర్ ఒకటి. మహాభారత కాలం నుండి ఈ రాష్ట్రానికి ప్రత్యేకమైన పేరు ఉన్నది. అనాదికాలం నుండి ఈ ప్రాంతంలో "పోస్టాం జాదూ" అనే మంత్రవిద్య ప్రచారంలో ఉన్నది. ఒకవిశేషం ఏమంటే, ఈ రాష్ట్రంలో ఈ మంత్రవిద్య తెలిసిన పురుషులు మరియు స్త్రీలు కూడా ఉన్నారు. ఈ మంత్రవిద్యను ఇతరులకు చెడు చెయ్యటానికి లేదా మంచి చెయ్యటానికి ఉపయోగిస్తారు. ఈ మంత్రవిద్య తెలిసిన పురుష మంత్రవాదిని "మేయిబా" అనేపేరుతో,

స్త్రీ మంత్రవాదిని “మెయిబీస్” అనే పేరుతోనూ పిలుస్తారు. ఈ మెయిబా మంత్రగాళ్ళు తమ దగ్గర ఉండే ఒక ప్రత్యేక అద్దాని ఉపయోగించి, దొంగల ఆచూకీని తెలుసుకుంటారు. అంతేకాకుండా, ఆ దొంగ ఎక్కడ ఉన్నాడు? అతడు దొంగిలించిన ద్రవ్యం లేదా వస్తువులు ఎక్కడ దాచాడు? – అన్న విషయాలను కూడా ఈ అద్దంలో చూసి తెలుసుకుని ఆపై ఈ సమాచారాన్ని అవసరమైనవారికి తెలియజేస్తారు.

ఇక, మేఘాలయ ప్రాంతంలో ఉన్న మంత్రగాళ్ళు “యుధెలెన్” అనే పేరుగల ఒక మహా పరిమాణంలో ఉండే దేవతా సర్పాన్ని ఆరాధిస్తారు. ఈ సర్పానికి అప్పుడప్పుడూ నరబలి ఇస్తారు. ఈ సర్పాన్ని ఆరాధించటంవల్ల ఈ ప్రాంతంలోని మంత్రగాళ్ళకు అసాధారణమైన శక్తులు వస్తాయని చెబుతారు. ఇక, అస్సాం ప్రాంతంలోనూ మంత్రవాదులు అసంఖ్యాకంగా ఉన్నారు. ఇక్కడ మంత్రవాదులు ఎలాంటి తీవ్రమైన వ్యాధిని కూడా తమ మంత్రాలతో నిర్మూలిస్తారని తెలుస్తున్నది. సైన్స్ ఎంతో అభివృద్ధి చెందినప్పటికీ, ఈశాన్య రాష్ట్రాలలో నివసిస్తున్న విద్యాధికులు కూడా “చేతబడి”, “అతీంద్రియ శక్తులు” ఉన్నాయని ఈనాటికీ బలంగా విశ్వసిస్తున్నారు. మంత్రాలవల్ల మనుషులకు మేలు లేదా కీడు జరుగుతుందని ఈ ప్రాంతాలలోని ఎక్కువమంది ప్రజలు నమ్ముతున్నారు.

మణిపూర్ ప్రాంతంలో “వూడూ” అనే ఆఫ్రికన్ మంత్రవిద్యను పోలిన చేతబడులు చేసే మంత్రగాళ్ళు చెప్పుకోదగ్గ సంఖ్యలో ఉన్నారు. ముఖ్యంగా, ఈ ప్రాంతంలో ఉన్న స్త్రీ మంత్రగత్తెలు తమ శత్రువుయొక్క బొమ్మను తయారుచేసి, దానికి సూదుల్ని గుచ్చి ఆపై ఆ బొమ్మకి చేతబడి చేస్తారు. ఈ ప్రయోగానికి గురైన వ్యక్తి అతి కొద్దికాలంలోనే తీవ్రమైన అనారోగ్యానికి గురై, ఆపై దారుణంగా మరణించటం జరుగుతుంది. ఒక విశేషం ఏమంటే, ఈ రాష్ట్రాలలో నివసించే ప్రజలలో కొందరు క్రైస్తవ మతాన్ని త్రికరణశుద్ధిగా పాటిస్తారు. అందువలన వీరిలో ఎవరిమీదైనా క్షుద్ర ప్రయోగం జరిగినట్లయితే వీళ్ళు ఆ ప్రయోగాన్ని ఎదుర్కోవటంకోసం చర్చిలకువెళ్ళి అక్కడ ప్రార్థనలు చేస్తారు. అంతేగాని, ఆ ప్రయోగాన్ని తిప్పి కొట్టటంకోసం మంత్రగాళ్ళను ఆశ్రయించరు.



# 14. మహాసిద్ధ సకార జీవిత విశేషాలు?

క్రీ.శ. 6-7వ శతాబ్దాల మధ్య 14 లక్షల కుటుంబాలకు నివాసం అయిన కంచి రాజ్యాన్ని ఇంద్రభూతి అనే రాజు పరిపాలిస్తున్న కాలంలో, ఆయన రాజ్యం ఎంతో సుభిక్షంగా ఉండేది. అయితే, ఆయనకు పుత్ర సంతానంలేదు. అందువలన ఆయన ఎన్నో రకాల పూజలను, యజ్ఞాలను చేసి ఎంతో పుణ్యాన్ని పొందాడు. ఆపై ఇటు భూమిమీద, అటు స్వర్గంలో సంచరించే అనేకమంది దేవతల్ని "తనకు పుత్ర సంతానం ప్రసాదించమని" ప్రార్థించాడు. ఇంద్రభూతి యొక్క పుణ్యకార్యాలకు సంతోషించిన దేవతలు, అతడి భార్యకు గర్భాన్ని ప్రసాదించారు. అయితే, గర్భవతి అయిన దగ్గర నుండి ఆయన భార్యకు అంతకంతకూ ఏదో తెలియని అశాంతి మనసులో కలుగుతూ ఉండేది. ఆమెకు ఆరవ నెల దాటిన తరువాత ఒకరోజు తెల్లవారుఝామున స్వప్నంలో "తాను మేరు పర్వతాన్ని ఆహారంగా తీసుకున్నట్లుగాను, సముద్రాన్ని సంపూర్తిగా త్రాగివేసినట్లుగాను" కనిపించింది. తనకు వచ్చిన కలలకు అర్థం తెలియక ఆమె, తన కలల సమాచారాన్ని తన భర్త అయిన ఇంద్రభూతికి తెలియజేసింది. మహా మేధావి మరియు ఎంతో శాస్త్ర పాండిత్యంగల ఇంద్రభూతికి కూడా ఆ స్వప్నాల వెనకాల దాగి ఉన్న అర్థం ఏమిటో తెలియలేదు. ఆపై, ఆయన తన ఆస్థానంలోని ఉద్దండులైన జ్యోతిషపండితులను, వేద పండితులను తన దగ్గరకు రప్పించుకుని, వాళ్ళకి తన భార్య యొక్క స్వప్నాల గురించి చెప్పి, ఆ స్వప్నాల మర్మం ఏమిటో విప్పి చెప్పమని వాళ్ళని అభ్యర్థించాడు. అప్పుడు ఆ పండితుడు ఎంతో దీర్ఘంగా ఆలోచించి, ఆపై ఇంద్రభూతితో "ఓ ప్రభూ! నీ భార్యకు వచ్చిన స్వప్నాలు సామాన్యమైనవి కాదు. నీ భార్య కడుపున భోదిసత్వుడు జన్మించబోతున్నాడు. కానీ, నీ ప్రజలకు నీ బిడ్డయొక్క జననం సంతోషకరంగా ఉండదు. అయితే, అతడు పుట్టిన సమయంలో అపారమైన సంపద ఈ భూమిమీద వర్షిస్తుంది" అన్నాడు.

మహారాణికి 9వ నెలలో, 10వ రోజున – అర్ధరాత్రి 12 గంటల సమయంలో పురిటి నెప్పులు ప్రారంభం అయ్యాయి. ఆమె కడుపున బిడ్డగా జన్మించబోయేది సాక్షాత్తు బోధిసత్వుడు అయిన కారణంగా ఆ బిడ్డ ఆమె యోని నుండి జన్మించలేదు. మరి, ఆ రాణి విశ్రాంతి తీసుకుంటున్న ప్రదేశానికి ప్రక్కనే ఉన్న నీటి కొలను మధ్య భాగంలో ఉన్న ఒక ఎరుపురంగు కలువ పువ్వులో జన్మించాడు. అనగా, ఇంద్రభూతి మహారాజు యొక్క కుమారుడు ఆయన భార్య యొక్క ఉదరంలో 9 నెలల వరకు పెరిగి ఆపై ఆమె యోని నుండి కాకుండా ఒక సరోవరం అనగా సరస్సు నుండి ఈ

లోకంలోకి వచ్చాడు అన్నమాట. అతడు ఈ భూమిమీద పడగానే ఆకాశం నుండి బంగారు, వెండి నాణాలు, విలువైన రత్నాలు వర్షంలాగా కురిసాయి. ఈ అపూర్వమైన సంఘటన చూసి కంచి రాజ్య ప్రజలు, పట్టరాని ఆనందానికి, అంతకు మించిన ఆశ్చర్యానికి గురయ్యారు. ఏదిఏమైనా, కలువ పువ్వులో జన్మించిన ఆ బిడ్డకు అతని తండ్రి "సరోరుహ కుమార" అనే పేరు పెట్టాడు. ఏదిఏమైనా, మహా అదృష్టవంతుడు మరియు దైవాంశ సంభూతుడు అయిన ఆ బిడ్డ, జన్మించిన నాటి నుండి కంచి రాజ్య ప్రజలు అపారమైన సిరిసంపదలతో, ప్రశాంతతో జీవించటం మొదలయ్యింది.

ఈ బిడ్డ జన్మించిన కొంతకాలానికి మహారాణికి ఇంకొక బిడ్డకూడా పుట్టాడు. అనేక సంవత్సరాలు గడిచాయి. ఇంద్రభూతి వృద్ధుడై మరణించాడు. యుక్తవయస్సుకి వచ్చిన సరోరుహుడు రాజ్యాన్ని చేపట్టటానికి తిరస్కరించాడు. ఫలితంగా, అతని తమ్ముడు రాజుగా ప్రతిష్టించబడ్డాడు. ఇక, సరోరుహుడు సన్యాసం స్వీకరించి, ఆపై కంచి రాజ్యాన్ని వదిలిపెట్టి, ధాన్యకటక నగరానికి (నేటి ఆంధ్రదేశంలోని అమరావతి ప్రాంతం) కాలి నడకన బయలుదేరాడు. మార్గమధ్యంలో అతడికి మహాయాన బౌద్ధ మతంలో మహా శక్తివంతమైన దైవంగా చెప్పబడిన అవలోకితేశ్వరుడు ఒక సన్యాసి రూపంలో ప్రత్యక్షం అయి, సరోరుహుడియొక్క నిజాయితీని, ఓర్పుని క్షుణ్ణంగా పరీక్షించి, ఆపై అతడికి తన యదార్ధ రూపాన్ని చూపించాడు. ఆ తరువాత సరోరుహుడికి మంత్ర దీక్ష ఇవ్వటంకోసం అతడికి ఉన్న అర్హతను పరీక్షించాలని నిర్ణయించుకున్నాడు. ఆ పరీక్షలో – సరోరుహుడు నిజాయితీగలవాడని అర్ధంచేసుకున్నాడు. ఆపై అతనికి మహాయాన బౌద్ధమత తాంత్రిక దీక్షను ఇచ్చి అదృశ్యం అయిపోయాడు.

ఆవిధంగా సాక్షాత్తూ, మహాయాన బౌద్ధమత దైవం చేత యోగదీక్షను పొందిన సరోరుహుడు ఆపై ధాన్యకటకానికి చేరుకుని, అక్కడ ఒక రహస్యమైన గుహలో మంత్ర సాధనను ప్రారంభించాడు. కొంతకాలం గడిచింది. ఒకరోజు ఉదయం యోగి లాంటి రూపం కలిగిన ఒకవ్యక్తి, సరోరుహుడి దగ్గరకు వచ్చి అతడితో ఇలా చెప్పాడు. "అయ్యా! నా పేరు ధారకుడు. నేను మీ దగ్గరే ఉండి, మీకు సేవలు చేసుకుంటాను. మీ యోగసాధన పూర్తి అయితే మీకు సిద్ధులు సంక్రమిస్తాయి. అప్పుడు మీరు, నాకు మంత్రదీక్షను ఇచ్చి నా గురువుగా వ్యవహరించాలి". ధారకుడు యొక్క మాట తీరు మరియు స్వభావం సరోరుహుడికి బాగా నచ్చాయి. దాంతో ఆయన, ధారకుడిని తన సహాయకుడిగా అంగీకరించాడు.

ఆ తరువాత ధారకుడు, దాదాపుగా 12 సంవత్సరాల పాటు సరోరుహుడి దగ్గరే ఉంటూ, అతడు యోగసాధనలు చేస్తున్నప్పుడు అతడికి కావలసిన సేవలు ఎంతో శ్రద్ధగా చేసాడు. సరోరుహుడికి సేవ చేస్తూ గడిపిన ధారకుడు చేసిన కొన్ని అద్భుత విషయాల గురించి తప్పనిసరిగా ఇక్కడ చెప్పుకోవలసి ఉన్నది. అది ఏమిటంటే,

సరోరుహుడు యోగదీక్షను అనగా తపస్సును ప్రారంభించిన కొద్ది నెలలకే ఆ ప్రాంతంలో తీవ్రమైన కరువు కాటకాలు విలయ తాండవం చేసాయి. ఫలితంగా, వందలాదిమంది ప్రజలు ఆకలితో చనిపోయారు. ఈ విషయం తపో ధ్యానంలో ఉన్న సరోరుహుడికి తెలిస్తే, అతడు తపస్సుని మధ్యలో మానివేస్తాడని ఊహించిన ధారకుడు ఆ విషయాన్ని సరోరుహుడికి ఏమాత్రం తెలియనియ్యకుండా జాగ్రత్త పడ్డాడు. ఏదోఒకవిధంగా, సరోరుహుడికి అవసరమైన ఆహారాన్ని తెచ్చి ఇస్తూ ఉండేవాడు. ఆవిధంగా 12 సంవత్సరాలు గడిచాయి.



12వ సంవత్సరం చివరి రోజుల్లో ధారకుడు, ఆ ప్రాంతంలోని గ్రామాలలో భిక్షాటనచేసి ఆవిధంగా వచ్చిన కొద్దిపాటి ఆహారాన్ని గుహలో ఉన్న సరోరుహుడికి ఇస్తూ ఉండేవాడు. 12వ సంవత్సరం చివరి రోజున ఆ భిక్ష కూడా దొరకలేదు. దాంతో, అతడు ఆ ప్రాంతాన్ని పరిపాలించే రాజుగారి భవనానికి వెళ్ళాడు. అక్కడ ఉన్న కొంతమంది ఆడవాళు ళ్ళ, ఒక చిన్న గిన్నెనిండా బియ్యంపోసి ఆపై ఆ గిన్నెను ధారకుడు చేతిలో పెట్టారు. ధారకుడు, ఆ బియ్యాన్ని తీసుకుని నేరుగా తమ గుహ ముందుకి వచ్చి, ఆపై – తలపై ఉన్న బియ్యం గిన్నెతో సహా ఆ గుహలోకి ప్రవేశిస్తున్న సమయంలో అతడి తలకి ఆ గుహయొక్క ప్రవేశ ద్వారబంధం పైభాగం తగిలింది. దాంతో ధారకుడు నేలమీద బోర్లా పడ్డాడు. అతని చేతిలోని పాత్ర క్రింద పడింది. ఆ పాత్రలోని బియ్యం నేలమీద చెల్లాచెదరుగా పడ్డాయి. సరిగ్గా, అదే సమయంలో సరోరుహుడు ఆ రోజు తపస్సు ముగించి కళు ళ్ళ తెరచి చూసాడు. తూలి నేలమీద పడిన ధారకుడిని చూసి, ఆపై గంభీరమైన స్వరంతో “నీవు ఈ రోజు మద్యం సేవించావా?” అన్నాడు. అప్పుడు ధారకుడు

బలహీనమైన స్వరంతో “గురుదేవా! నాకు మద్యం ఎక్కడ దొరుకుతుంది?, ఎన్నో నెలలుగా తిండి లేని కారణంగా నా శరీరం బలహీనం అయిపోయింది. అందుకే, ద్వారంబంధం పై భాగం తగలగానే ఇలా క్రింద పడిపోయాను” అన్నాడు.

ధారకుడు అన్నమాటలు విన్న సరోరుహుడు కొంచెంసేపు మౌనం వహించి ఆపై విచిత్రమైన స్వరంతో “నీకు ఇన్నాళ్ళుగా ఆహారం దొరకటంలేదా?” అన్నాడు. అప్పుడు ధారకుడు దీనమైన స్వరంతో సరోరుహుడితో “గురుదేవా! గత 12 ఏళ్ళుగా ఈ ప్రాంతంలో దారుణమైన కరువు-కాటకాలు విలయ తాండవం చేస్తున్నాయి. అనంతమైన సంఖ్యలో ప్రజలు ఆకలితో అలమటించి చనిపోయారు. ఇప్పటికీ, కరువు కొనసాగుతూనే ఉన్నది. ఈ కరువు విషయం నీకు చెబితే నీవు బాధపడి నీ తపస్సుని మానివేస్తావు అన్న భయంతో ఇన్నాళ్ళు ఆ విషయాన్ని నీకు చెప్పలేదు. నాకు ఆహారం లేకున్నా ఏదోఒకవిధంగా ఎక్కడో ఒకచోట కొంత ఆహారాన్ని సంపాదించి నీకు ఇస్తున్నాను” అన్నాడు. ఆ వ్యక్తి అన్నమాటలు విన్న సరోరుహుడు ఒక్కసారిగా ఆగ్రహానికి గురయ్యాడు. ఆ తరువాత కొంచెం క్రోధం నిండిన స్వరంతో “12 సంవత్సరాలుగా ఇక్కడ కరువు తాండవం చేస్తుంటే, ఆ విషయం నాకు ఎందుకు చెప్పలేదు. నేను ఇక్కడ - వర్షాన్ని కురిపించే శక్తిని కలిగి ఉన్నాను అన్న విషయం నీకు తెలియదా?. ప్రస్తుతానికి నువ్వు ఇక్కడ నుండి వెళ్ళిపో” అన్నాడు.

ఆ తరువాత సరోరుహుడు, నేలమీద చిందిన బియ్యం మొత్తాన్ని ప్రోగుచేసి ఆపై వాటిని తన భుజంమీద ఉన్న వస్త్రంలో చిన్న మూటలాగా కట్టుకుని ప్రక్కనే ప్రవహిస్తున్న ఒక నదీ ప్రవాహం దగ్గరకు వెళ్ళాడు. ఆ తరువాత ఆ బియ్యాన్ని వండి చిన్న చిన్న ముద్దలుగా చేసి, ఆపై తంత్రశాస్త్ర సంబంధ మంత్రాలను పఠిస్తూ ఆ అన్నం ముద్దలను పాతాళలోకంలో ఉండే నాగులకు అందటంకోసం ఆ ప్రవాహంలో వదిలిపెట్టాడు. ఆ తరువాత తన మంత్రబలంతో, “పాతాళలోకంలో ఉండే తొమ్మిది మహా నాగుల యొక్క శిరస్సులు బద్దలు అయిపోతాయా” అన్నంతగా నొక్కివేసాడు. దాంతో, ఆ మహానాగులు భయపడి నది అడుగు నుండి గట్టుమీద ఉన్న సరోరుహుడి వద్దకు వచ్చి తమను రక్షించమని వేడుకున్నాయి. అప్పుడు సరోరుహుడు ఆగ్రహం ధ్వనిస్తున్న స్వరంతో ఆ నాగులతో ఇలా అన్నాడు. “ఈ ప్రాంతంలో 12 సంవత్సరాలుగా వర్షాలు లేవు. కరువు కాటకాలతో ప్రజలు దారుణంగా చనిపోతున్నారు. భూమిమీద ఎక్కడైనా ఎక్కువకాలం వర్షాలు పడటంలేదు అంటే, అందుకు కారణం పాతాళ నాగులైన మీరు ఆ వర్షాలను కావాలని అడ్డుకుంటున్నట్టే అని నాకు తెలుసు. ఇప్పటికైనా, మీరు మీ దుర్మార్గ ఆలోచనలను వదిలిపెట్టండి. ఈ ప్రాంతంలో సమృద్ధిగా

వర్షాలు కురిపించండి. అంతేకాదు, ప్రస్తుతం – ఆకలితో అలమటించిపోతున్న ఈ ప్రాంత ప్రజలు, మరణ ముఖం నుండి బైటపడటంకోసం ఈ రోజు – వండిన ఆహారాన్ని వర్షంగా కురిపించండి. రేపు, వరి ధాన్యాన్ని వర్షంగా కురిపించండి. ఎల్లుండి – పప్పు ధాన్యాలను, తైలాలను వర్షంగా కురిపించండి. ఆపై రోజు – బంగారాన్ని, రత్నాలను కురిపించండి. ఏడవ రోజు – నిజమైన కుంభవృష్టిని అనగా భారీ వర్షాన్ని కురిపించండి. మీరు, నేను చెప్పినట్లుగా చెయ్యటానికి అంగీకరిస్తేనే మిమ్మల్ని నా మంత్ర పీడ నుండి రక్షిస్తాను".

అప్పటికే సరోరుహుడి యొక్క మంత్రశక్తిని అనుభవపూర్వకంగా అనుభవించిన ఆ అష్టనాగులూ, సరోరుహుడు చెప్పినట్లుగా తూచ తప్పకుండా చేసాయి. ఫలితంగా, ఆ ప్రాంతంలో కరువు కాటకాలు లేకుండా పోయాయి. ఆహారాన్ని, ధాన్యాన్ని కూడా వర్షంలాగా కురిపించగలిగిన సరోరుహుడు ఎంతటి గొప్ప సిద్ధ పురుషుడో ఆ ప్రాంత ప్రజలకు స్పష్టంగా అర్ధమయ్యింది. ఫలితంగా, ఎంతోమంది ప్రజలు సరోరుహుడికి శిష్యులుగా చేరిపోయారు. సరిగ్గా అదే సమయంలో, సరోరుహుడు, గతంలో 12 సంవత్సరాలు ఆకలి దప్పులు నియంత్రించుకుని, తనకు సేవ చేసిన ధారకుడిని తన దగ్గరకు పిలిపించుకుని అతడికి మంత్ర దీక్షను ఇవ్వటమే కాకుండా ఆ వ్యక్తికి "రామ" అనే కొత్తపేరు ఇచ్చాడు. ఆ తరువాత ఆ రామ, తన గురువైన సరోరుహుడి సారధ్యంలో తంత్ర సాధనలు విశేషంగా సాగించి ఆపై గొప్ప మంత్ర సిద్ధులను పొందాడు. ఆ సమయంలోనే సరోరుహుడు, మహాయాన బౌద్ధ మతంలో అతి గొప్పదైన "హేవజ్ర" మంత్ర దీక్షను రామకు ఇచ్చాడు. ఆ దీక్ష ఇచ్చేముందు సరోరుహుడు తన శిష్యుడైన రామతో ఇలా చెప్పాడు.

"ఈ దీక్ష ఫలించిన తరువాత నీకు అసాధారణమైన శక్తులు వస్తాయి. నీవు ఆ శక్తులను నిస్వార్ధంగా ప్రజలకోసం మాత్రమే ఉపయోగించినట్లయితే నీ జీవిత చివర సమయంలో నీకు "ఢాకినీ స్వర్గం" సిద్ధిస్తుంది. కనుక, నీవు వెంటనే ఇక్కడకు దగ్గరలో ఉన్న శ్రీపర్వతంమీదకు చేరుకుని, అక్కడ 'హేవజ్ర' సాధన చెయ్యి". ఈవిధంగా తన శిష్యుడికి అసాధారణమైన హేవజ్రదీక్షను ఇచ్చి, ఆపై ఆకాశంలోకి సశరీరంగా ఎగిరిపోయాడు. అలా ఆకాశంలోకి ఎగిరిన సరోరుహుడు సశరీరంగా ఢాకినీ స్వర్గంలోకి ప్రవేశించాడు.

ఇక, శ్రీపర్వతంమీదకి వెళ్ళిన రామ, అక్కడ ఒక యువరాణిని తన అర్ధాంగిగా చేసుకుని, ఆపై ఆమెతో కలిసి అక్కడకు దగ్గరలో ఉన్న ఒక అరణ్యంలో ఒక ఆలయం

నిర్మించి అక్కడే తన భార్య సహకారంతో హేవజ్ర సాధనను అనేక సంవత్సరాలపాటు సాగించాడు. ఫలితంగా, అతడికి అమోఘమైన సిద్ధులు సంక్రమించాయి. అతడు మహా సిద్ధుడిగా మారిపోయాడు. ఆపై, అతడు తన శక్తులను మానవ సంక్షేమం కోసం ఎంతోకాలంపాటు వినియోగించాడు. ఆపై, అతడు సశరీరంగా ఢాకినీ స్వర్గంలోకి ప్రవేశించాడు.

నోట్ : "సకర" అనే పదం సరోరుహ అనగా పద్మానికి పర్యాయపదం అని గుర్తించాలి. సరోరుహుడు ఒక సరస్సు మధ్యలో వికసించిన నీలి కలువ పువ్వు నుండి ఆవిర్భవించాడు. 'సకర' అనే టిబెటన్ పేరుకి "సరోరుహుడు" అని అర్థం. సరోరుహుడు అనగా సరస్సు నుండి ఆవిర్భవించినది. అనగా కలువ పువ్వు అని అర్థం. కొంతమంది బౌద్ధమత పరిశోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే టిబెట్ దేశంలో బహుళ ప్రచారంలో ఉన్న మహాయాన బౌద్ధమతానికి గురువైన పద్మసంభవుడు (పద్మం నుండి ఆవిర్భవించినవాడు.) మరియు సరస్సులోని పద్మం నుండి ఆవిర్భవించిన సరోరుహుడు లేదా సకార ఒక్కరే అని తెలుస్తున్నది. అయితే ఇది ఎంతవరకు నిజమో ఇప్పటి వరకు నిర్ధారించబడలేదు.

# 15. హైందవ యోగశాస్త్రంలో చెప్పబడిన 'కుండలినీ' రహస్యం?

"మనిషియొక్క వెన్నుముక ప్రారంభ భాగంలో ఉంటుంది" అని చెప్పబడుతున్న మూలాధార చక్రంలో, చుట్టచుట్టుకుని నిద్రిస్తున్న సర్పాకారంలో ఒక "యోగశక్తి" ఉంటుందని చెబుతారు. ఆ శక్తినే "కుండలిని" అనే పేరుతో పిలుస్తారు. సాధకులు అనేక రకాల మార్గాలలో – తమలో నిద్రాణంగా ఉన్న కుండలినీ శక్తిని నిద్రలేపటానికి ప్రయత్నిస్తారు.

సంస్కృత భాషలో 'కుండలిని' అనగా 'చుట్టుకుని' ఉన్నది అని అర్థం. అనగా, ఒక త్రాచుపాము చుట్టచుట్టుకుని, ఆపై తన పడగని ఆ చుట్టు లోపలికి వంచి ఎలా నిద్రిస్తూ ఉంటుందో, కుండలినీ శక్తి కూడా మనిషియొక్క మూలాధార చక్రంలో ఆలా నిద్రిస్తూ ఉంటుందని యోగశాస్త్రం తెలియజేస్తున్నది. జ్యోతిషశాస్త్రంలో చెప్పబడిన

సూత్రాల ప్రకారం చూసినట్లయితే, కుజగ్రహం, భూమియొక్క పుత్రుడని భావించాలి. ఇక, మూలాధార చక్రం "భూతత్వాన్ని" కలిగి ఉంటుంది. అందువలన మూలాధార చక్రానికి కుజుడు అధిపతిగా ఉంటాడని తెలుస్తున్నది.




మూలాధార చక్రంలో సర్ప రూపంలో చుట్టచుట్టుకుని ఉండే కుండలినీ శక్తిని "స్త్రీ" స్వరూపం అయిన ఆదిశక్తిగాను, సహస్రార చక్రంలో ఉండే శక్తిని పరమశివుడిగాను భావిస్తారు. సాధకులు చేసే అసాధారణ మైన సాధన కారణంగా మూలాధార చక్రంలోని కుండలినీ శక్తి నిద్రలేచి, ఆపై పైన ఉండే విభిన్నమైన చక్రాలను దాటుకుని, చివరగా సహస్రార చక్రంలోకి అనగా, వెయ్యి దళాలు గల యోగచక్రంలోకి ప్రవేశిస్తుంది. అలా ప్రవేశించిన కుండలినీ శక్తి అనగా ఆదిశక్తి ఆ చక్రంలో ఉండే పరమశివుడితో సంయోగం జరుపుతుంది. ఫలితంగా, సాధకుడు సమాధి స్థితిలోకి వెళ్ళిపోతాడు. ఆ స్థితికి చేరిన సాధకుడికి ఇహలోకంతో సంబంధం సంపూర్తిగా తెగిపోతుంది. కుండలినీ సాధనను పూర్తిచేసిన సాధకులకు మరణం ఎప్పుడు కావాలంటే అప్పుడు వస్తుంది. ఆ సాధకులు తలచుకుంటే తమ మరణాన్ని అనేక సంవత్సరాలపాటు వాయిదా వెయ్యగలరు. అంతేకాదు, కుండలినీని సాధించిన యోగులకు మరుజన్మ ఉండదని చెబుతారు.

ఒక విశేషం ఏమంటే, కేవలము యోగశాస్త్రంలో చెప్పబడిన ప్రాణాయామం, ఇతర ఆసనాలు చెయ్యటం ద్వారా మాత్రమే కాక, మంత్ర జపంతోను, ధ్యానంతోను, కీర్తనంతోను (దైవ నామాన్ని గానం చెయ్యటం) మరియు దైవ ప్రార్ధనలతోను కూడా కుండలిని శక్తిని నిద్రలేపవచ్చని చెబుతారు.

యోగశాస్త్రంలో చెప్పబడిన సూత్రం ప్రకారం చూసినట్లయితే, ఈ కుండలినీ సహజంగా – ఒక "సర్పశక్తి"గా గుర్తించబడింది. సర్పం ఏవిధంగా అయితే పాకుతూ ముందుకి వెళుతుందో, అదేవిధంగా మూలాధార చక్రంలో నిద్రావస్థలో ఉండే

కుండలినీ నిద్రలేచినప్పుడు, ఒక సర్పంలాగా ప్రాకుతూ వెన్నుముక గుండా పైన ఉండే చక్రాలలోకి ప్రవేశిస్తుంది. కుండలినీ శక్తి, క్రింద నుండి పైకి ఉండే ఒక్కొక్క చక్రంలోకి ప్రవేశిస్తున్నప్పుడు, సాధకుడి యొక్క ఆధ్యాత్మికస్థాయి మరియు శక్తి క్రమ క్రమంగా పెరుగుతూ ఉంటాయి. ఈ కుండలినీ, సాధకుడి యొక్క సహస్రారచక్రంలోకి ప్రవేశించినప్పుడు సాధకుడికి నేరుగా పరబ్రహ్మతో అనగా దైవంతో సంబంధం ఏర్పడుతుంది. ఆ సమయంలో సాధకుడు మాటలతో చెప్పలేని ఒక మహాద్భుతమైన సంతోషాన్ని అనుభవిస్తాడు.

మనిషియొక్క గుద(ఆనస్) ప్రాంతంలో "మూలాధార చక్రము" లైంగిక అవయవాలు ఉండే ప్రదేశంలో "స్వాధిష్టాన చక్రము" ఉంటాయి. మనిషిలో ఉండే ఇహలోక సంబంధ కోర్కెలు, వ్యామోహాలు, వాంఛలు, ఈ రెండు చక్రాలలో సంచరిస్తూ ఉంటాయి. మనిషి యొక్క మూలాధార చక్రంలో నిద్రావస్థలో ఉండే కుండలిని నిద్రలేచి, ఆపై మనిషి బొడ్డు భాగంలో ఉండే మణిపూర చక్రం దాకా వచ్చినట్లయితే ఆ మనిషి యొక్క మనస్సు శుద్ధి అవుతుంది. ఆ దశలో మనిషికి సంతోషం మరియు ఒకస్థాయి తాంత్రిక శక్తి లభిస్తుంది. ఆ తరువాత కుండలిని, గుండె ప్రాంతంలో ఉండే అనాహత చక్రందాకా చేరినప్పుడు, సాధకుడు గొప్ప సంతోషాన్ని పొందటమే కాకుండా తన ఇష్టదేవత యొక్క రూపాన్ని కూడా తన మనో నేత్రాలతో దర్శించ గలుగుతాడు. ఆపై, కుండలినీ సాధకుడి యొక్క గొంతు ప్రాంతంలో ఉన్న విశుద్ధ చక్రం దగ్గరకు చేరినప్పుడు సాధకుడికి మహా ఆనందం కలగటమే కాకుండా ఉన్నతస్థాయి అతీంద్రియ శక్తులు లభిస్తాయి. ఇంకొక విశేషం ఏమంటే, సాధకుడు సాధనలో ఏవైనా పొరపాట్లు చేసినట్లయితే కుండలిని, విశుద్ధచక్రం నుండి క్రిందకు దిగిపోయి, మళ్ళీ మూలాధార చక్రంలోకి చేరుకునే అవకాశం ఉంటుంది.

ఏదిఏమైనా, సాధకుడు గొప్ప ఏకాగ్రతతో సాధనచేసినట్లయితే కుండలిని, విశుద్ధ చక్రం నుండి పైకి ప్రయాణించి ఆపై రెండు కనుబొమల మధ్య ఉండే నుదుటి భాగంలో ఉన్న అజన చక్రం దగ్గరకు చేరుకుంటుంది. ఇలా చేరుకున్న సాధకుడు, సమాధి స్థితిలోకి వెళ్ళిపోవటమే కాకుండా సర్వ సృష్టికి ఆధారభూతమైన దైవాన్ని తన మనోనేత్రాలతో దర్శిస్తాడు. అయితే, ఈ దశలో సాధకుడు తనకి మరియు తనకు కనిపిస్తున్న దైవానికి మధ్య తేడా ఉన్నదని నమ్ముతాడు.

సాధకుడు మరింత ఏకాగ్రతతో సాధన కొనసాగించినట్లయితే కుండలినీ శక్తి అజన చక్రాన్ని దాటి పైకివెళ్ళి, ఆపై మెదడు ప్రాంతంలో ఉన్న సహస్రార చక్రాన్ని

చేరుకుంటుంది. (వెయ్యి దళాలుగల కలువ పువ్వు ఆకారంలో ఉండే ఈ చక్రాన్ని సహస్రార చక్రం అని పిలుస్తారు.) ఎప్పుడైతే, సాధకుడిలోని కుండలిని ఈ చక్రాన్ని చేరుకుంటుందో ఆ క్షణంలో సాధకుడు నిర్వికల్ప సమాధికి చేరుకుంటాడు. ఈ స్థితిలో అతడికి మరియు అతడికి కనిపించే దైవానికి మధ్య ఏ తేడా లేనట్లుగా (అద్వైతం) ఆ సాధకుడికి అనిపిస్తుంది. ఆపై, కుండలిని అనే స్త్రీ శక్తిరూపం, ఈ సహస్రార చక్రంలో ఉండే శివుడితో ఐక్యం చెందుతుంది. ఈవిధంగా, మూలాధార చక్రంలో ఉండే కుండలినిశక్తి – సహస్రారచక్రంలో ఉండే శివుడితో లీనం కావటమే కుండలినీ శక్తియొక్క పరమార్థం అని గ్రహించాలి. ఏ సాధకుడిలో కుండలినీ శక్తి సహస్రారచక్రానికి చేరుకుంటుందో ఆ సాధకుడు మహాద్భుత తాంత్రిక శక్తులను పొందుతాడు. ఈ సృష్టిలో అతడు చెయ్యలేని మాహాత్యం అంటూ ఉండదని గుర్తించాలి.

విధానం ఏదైనప్పటికీ, సాధకుడు లేదా సాధకురాలు తనలోని కుండలినీ శక్తిని నిద్రలేపినప్పుడు ఆ కుండలినీ శక్తి, మొదట తాను ఉన్న మూలాధార చక్రాన్ని చీల్చుకుని ఆ తరువాత ఉన్న చక్రంలోకి ప్రవేశిస్తుంది. ఆపై ఆ తరువాత ఉన్న చక్రంలోకి ఆ తరువాత, ఆపైన ఉన్న చక్రాన్ని భేదించి, ఆ తరువాత పైన ఉండే చక్రాన్ని చేరుకుంటుంది. ఈవిధంగా – శిరస్సు మధ్యభాగంలో ఉండే సహస్రార చక్రంలోకి కుండలినీ శక్తి, ఒక సర్పంలాగా చేరుకుంటుంది. ఒక ముఖ్యవిశేషం ఏమంటే, కుండలినీ శక్తి ఏ చక్రంలో ఉంటుందో, ఆ సమయంలో సాధకుడి వంట్లో దాదాపు 120 డిగ్రీల ఉష్ణోగ్రత ఆవిర్భవిస్తుంది. సాధారణ వ్యక్తులకు అంత ఉష్ణోగ్రత లేదా జ్వరం శరీరంలో ఉంటే ఆ వ్యక్తులు తప్పనిసరిగా స్పృహతప్పి పడిపోవటమో లేదా చనిపోవటమో జరుగుతుంది. కానీ, కుండలినీ సాధకులకు అలా జరగదు. కుండలినీ శక్తి, ఒక చక్రాన్ని వదిలి పై చక్రానికి వెళ్ళగానే అప్పటి వరకు విపరీతమైన ఉష్ణోగ్రతతో ఉన్న క్రింది యోగచక్రం ఒక్కసారిగా చల్లబడిపోతుంది.

కుండలినీ శక్తిని నిద్రలేపటం పెద్ద విషయమేమీ కాదు. కానీ, అలా నిద్రలేచిన కుండలినీ శక్తిని సహస్రార చక్రం దాకా తీసుకువెళ్ళటమే మహా కష్టమని యోగశాస్త్ర పండితులు ఉద్ఘాటిస్తున్నారు. ఎందుకంటే, ఒక చక్రాన్ని దాటగానే సాధకులకు కొద్దిపాటి శక్తులు మరియు అనుభూతులు లభిస్తాయి. వాటినిచూసి తమ లక్ష్యం పూర్తి అయ్యిందని సాధకులు భ్రమపడతారు. అయితే, ఎంతో ఓర్పుతో మరింత సాధన చేసినప్పుడే కుండలినీ శక్తి, ఒక చక్రం నుండి ఇంకో చక్రానికి పై దిక్కులో ప్రయాణిస్తుంది. మూలాధారచక్రం నుండి బయలుదేరిన కుండలినీ శక్తి, ఆపైచక్రానికి చేరుకున్న తరువాత కూడా సాధకుడు ఏకాగ్రతతో తన సాధన కొనసాగించినప్పుడే

కుండలినీ శక్తి ఆ తరువాత ఉండే పై చక్రంలోకి ప్రవేశిస్తుంది. కఠినమైన ఏకాగ్రతతో మరియు సాధనతో కృషిని కొనసాగించిన సాధకులకు మాత్రమే కుండలినీ శక్తి సహస్రార చక్రం దాకా చేరుతుంది.

**యోగనాడులు :** మనిషియొక్క గుదద్వారానికి (Anus) దగ్గరలో ఉన్న ప్రదేశాన్ని యోగశాస్త్రంలో "కాండ" అనే పేరుతో పిలుస్తారు. ఆ ప్రదేశం నుండే లేదా ఆ కాండం నుండే అన్ని నాడులు ప్రారంభం అయి, శరీరం అంతా వ్యాపించి ఉంటాయి. మూలాధార చక్రము మరియు సుషుమ్ననాడి ఈ కాండం వద్దే అనుసంధించబడి ఉంటాయని చెబుతారు. మనిషియొక్క సూక్ష్మదేహంలో వేలాది నాడులు ఉన్నప్పటికీ, వాటిలో 14 నాడులు ముఖ్యమైనవిగా చెబుతారు. ఆ 14 నాడులలో ఇడ, పింగళ మరియు సుషుమ్న అనే మూడు నాడులను అత్యంత ప్రధానమైనవిగా గుర్తించారు. యోగసాధకులకు ఈ మూడు నాడులు అతి ముఖ్యమైనవిగా ఉంటాయి. ఇతర నాడులన్నీ ఈ మూడు నాడులకు సహాయకులుగా ఉంటాయని చెప్పవచ్చు.

వైద్యశాస్త్రంలో చెప్పబడిన నరములు (నెర్వ్స్) - స్కానింగ్, ఎక్సరే లాంటి యంత్రాలకు కనిపిస్తాయి. కానీ, యోగశాస్త్రంలో చెప్పబడిన నాడులు, మనిషి నేత్రాలతో సహా, భౌతికమైన ఏ యంత్రాలకు కనపడవు. కారణం, అవి మనిషి యొక్క 'సూక్ష్మదేహం'లో ఉంటాయి. యోగశాస్త్రంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, "ప్రాణశక్తి" అని పిలువబడే ఒక అదృశ్యశక్తి, మనిషియొక్క సూక్ష్మదేహం అంతటా వ్యాపించి ఉండే నాడుల గుండా ప్రవహిస్తుంది. ఆ ప్రాణశక్తి ప్రవహించినంతకాలమే మనిషి యొక్క భౌతికదేహం పనిచేస్తుంది. ఒకవిశేషం ఏమంటే, అటు సూక్ష్మదేహంగాని, ఇటు ఆ సూక్ష్మదేహంలో ప్రవహించే ప్రాణశక్తిగాని భౌతిక నేత్రాలకుగాని, ఇతర యంత్రాలకు గాని కనపడవు. కేవలము, యోగశక్తి గలవారికి మాత్రమే వాటిని చూడగలిగే శక్తి ఉంటుంది. ఏదిఏమైనా, మానవ సూక్ష్మదేహంలో అసంఖ్యాకమైన నాడులు ఉంటాయి. అయితే, నాడుల సంఖ్య ఎంత అని? స్పష్టంగా ఏ యోగశాస్త్ర పండితుడూ ఈనాటికీ చెప్పలేకపోయాడు. చాలామంది యోగశాస్త్ర నిపుణుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, ఈ నాడుల సంఖ్య దాదాపు 72 వేల నుండి మూడున్నర లక్షల వరకు ఉంటుందని తెలుస్తున్నది. యోగశాస్త్రంలో

నాడులకు విశేషమైన ప్రాధాన్యత ఇవ్వబడింది. సూక్ష్మదేహంలోని నాడులు పరిశుద్ధమైనప్పుడే మానవుడి మూలాధార చక్రంలోని "కుండలినీ"శక్తి నిద్రలేవటం, ఆపై పై చక్రాలలోకి ప్రవేశించటం జరుగుతుంది. ఇంకొక విశేషం ఏమంటే, కుండలినీ శక్తి, క్రింద నుండి పైకి ప్రవహించే మార్గం కూడా ఒక నాడే అని గ్రహించాలి. ఆ నాడిని యోగశాస్త్రంలో "సుషుమ్ననాడి" అని పిలుస్తారు. అందువలన కుండలినీ శక్తిని నిద్రలేపాలని భావించే సాధకులు, మొదట ప్రాణాయామం మరియు ఇతర యోగశాస్త్ర సంబంధ ప్రక్రియల ద్వారా తమ శరీరంలోని నాడులను శుద్ధి చేసుకోవాలి. ఒక ముఖ్యవిషయం ఏమంటే, సూక్ష్మదేహంలో ఉండే నాడులు ఆ సూక్ష్మ దేహానికి సంబంధించిన భౌతికదేహంలోని నరాలపై మరియు ఆ భౌతికదేహం పనిచేసే తీరుపై సంపూర్ణమైన ప్రభావాన్ని కలిగి ఉంటాయి. అంతేకాకుండా, శరీరంలోని ఒక్కొక్క భాగానికి మరియు ఆ భాగానికి చెందిన యోగచక్రానికి మధ్య సంబంధం ఉంటుంది. అందువలన, శరీరంలోని ఒక భాగంపై – యోగశాస్త్రంలో చెప్పబడిన విధానాలతో ప్రభావం చూపినప్పుడు, ఆ ప్రభావం ఆ భౌతిక భాగానికి సంబంధించిన యోగచక్రంపై ప్రభావాన్ని చూపిస్తుంది.

అదేవిధంగా, సాధకుడి శరీరంలో ఉండే నరాల వ్యవస్థను పదును పెట్టటానికి అనేక రకాల యోగాసనాలు వెయ్యబడతాయి. ఇంకా వివిధ రకాల ముద్రల ద్వారా మనిషి శరీరంలో సంచరించే వివిధ రకాల ప్రాణాలను సాధకుడు తన పూర్తి నియంత్రణలోకి తెచ్చుకుంటాడు. ఈవిధమైన సాధనల వల్ల సాధకుడియొక్క మూలాధార చక్రంలో ఉండే కుండలినీ శక్తి నిద్రలేచి, క్రమంగా ఒక్కొక్క చక్రంగుండా ప్రయాణిస్తూ, శిరస్సు మధ్యభాగంలో ఉండే సహస్రార చక్రానికి చేరుకుంటుంది.

హఠయోగులు – ప్రాణాయామం, ఆసనాలు, ముద్రలు అనే మూడు విధానాల ద్వారా తమలోని కుండలినీ శక్తిని నిద్రలేపుతారు. ఇక, మనస్సుని అనేక పద్ధతుల్లో ఏకాగ్రతా స్థితికి తీసుకువెళ్ళటం వల్ల రాజయోగులు – తమలోని కుండలినిని జాగృతి చేస్తారు. ఇక, భక్తులు తమ మనసుని పూర్తిగా భగవంతుడికి స్వాధీనం చేసుకోవటం ద్వారా తమలోని కుండలిని శక్తిని జాగృతం చేస్తారు.

**కుండలినీ శక్తిని నిద్రలేపే విధానములు :**

**1. తంత్రసాధన :** నిజానికి, కుండలినీ యోగం అనగా కుండలినిని నిద్రలేపటం

అనే అంశం, తంత్రశాస్త్రానికి సంబంధించినదిగా చెప్పబడింది. తంత్రశాస్త్రంలో కుండలినీకి సంబంధించిన లోతైన మరియు నిగూఢ సమాచారం చాలా వివరంగా చెప్పబడి ఉన్నది. కుండలినీ శక్తి, ఈ భూమిమీద జన్మించిన ప్రతి పురుషుడి మరియు స్త్రీ యొక్క మూలాధార చక్రంలో నిద్రాస్థితిలో ఉంటుందని, తంత్రసాధన ద్వారా ఆ కుండలినీ శక్తిని సాధకులు నిద్రలేపవచ్చునని, తంత్రశాస్త్రం ఉద్ఘాటిస్తున్నది.

**2. హఠయోగం :** హఠయోగం యొక్క ప్రధాన లక్ష్యం, కుండలినీని నిద్రలేపటమే అని చెబుతారు. అయితే, కుండలినీ సాధన – హఠయోగంలో ఒకవిధంగా ఉండగా, తాంత్రిక విధానంలో ఇంకొక విధంగా ఉంటుందని గుర్తించాలి. హఠయోగంలో సాధకుడి యొక్క భౌతిక దేహాన్ని వివిధ రకాల యోగశాస్త్ర విధానాలలో శుద్ధి చేయటం జరుగుతుంది. అనగా, మానవ శరీరంలో ఉండే నాడులను శుద్ధిచెయ్యటం, శరీరంలో ఉండే ప్రాణాలను నియంత్రించటం లాంటివి జరుపబడతాయి.

**3. రాజయోగం :** ఒక విశేషం ఏమంటే, రాజయోగం అని చెప్పబడే విధానంలో "కుండలిని" గురించిన ప్రస్తావన ఏమాత్రం కనపడదు. కానీ, రాజయోగంలో చెప్పబడిన విధానాలను పాటించే సాధకుల యొక్క శరీరంలోని కుండలినీ శక్తి, వారికి తెలియకుండానే నిద్రలేచి, పైన ఉండే ఇతర చక్రాల గుండా ప్రయాణిస్తూ క్రమంగా సహస్రార చక్రానికి కూడా చేరుకుంటుంది. రాజయోగ విధానంలో – గురువు యొక్క సూచనల మేరకు, శిష్యుడు అనగా సాధకుడు తన మనస్సుని తన చుట్టూ ఉండే భౌతికమైన అంశాల నుండి మరియు తన శరీరంలో ప్రబలంగా పనిచేసే ఇంద్రియాల మీద నుండి ఉపసంహరించి, ఆపై మనస్సుని పరిపూర్ణమైన నియంత్రణలోకి తీసుకు రావటం జరుగుతుంది. ఇలా జరగటానికి సాధకుడు చాలా తీవ్రమైన సాధన చెయ్యవలసి ఉంటుందని మర్చిపోకూడదు. ఎందుకంటే, మనిషి చుట్టూ ఉండే భౌతిక అంశాలు మరియు మనిషిలోని వివిధ రకాల వాంఛలు మనిషిమీద విపరీతమైన ప్రభావాన్ని చూపిస్తూ ఉంటాయి. వాటియొక్క ప్రభావాన్ని దూరం చేసుకుంటూ, క్రమ క్రమంగా తన మనసుని "ఒక దైవం" మీద సంపూర్తిగా లగ్నం చేయవలసి ఉంటుంది. హఠయోగంలో చేసే సాధనలు – యాంత్రికంగా ఉంటాయి. అవి చాలా వరకు భౌతిక దేహానికి సంబంధించి ఉంటాయి. కానీ, రాజయోగంలో సాధనలు – మనసుకి సంబంధించి ఉంటాయి. అంతేకాకుండా, "యమ" మరియు "నియమ" విధానాల ద్వారా మనిషి, ఏవిధంగా ఆధ్యాత్మిక

మరియు నైతిక అభివృద్ధిని సాధించాలో రాజయోగంలో నేర్పించబడుతుంది. ఈ విధానంలో, పవిత్రమైన గ్రంధాలను అధ్యయనం చెయ్యటం ద్వారా మనిషిలో ఆధ్యాత్మిక అభివృద్ధి కలిగించటం జరుగుతుంది. ఈవిధానంలో, సాధకుడు క్రమ క్రమంగా తన మనసుని "పరబ్రహ్మ" మీద నిమగ్నంచేసి, అంతిమంగా ఆయనకు తనను తాను సమర్పించుకుంటాడు. ఒక ముఖ్య విషయం ఏమంటే, రాజయోగంలో కూడా కొంతవరకు ప్రాణాయామం ఉపయోగించబడుతుంది. ఏదిఏమైనా, రాజయోగంలో పరిపూర్ణమైన పరిణతి సాధించిన వ్యక్తిలో అప్రయత్నంగా కుండలినీ నిద్రలేస్తుందని చెప్పక తప్పదు.

**కుండలినీ సాధకుడికి లేదా సాధకురాలికి ఉండవలసిన ప్రాధమిక లక్షణములు :**

కుండలినీ సాధించాలని ఆశించే సాధకుడు, ప్రధానంగా తన గురువు యొక్క మాటలమీద మరియు శాస్త్రాలమీద (హైందవ ధర్మశాస్త్రాలు) పరిపూర్ణమైన విశ్వాసాన్ని కలిగి ఉండాలి. ఆహారం విషయంలో, నిద్ర విషయంలో పరిమితిని పాటించాలి. అహంకారాన్ని, హింసాత్మక స్వభావాన్ని, వాంఛలను, ఆగ్రహాన్ని, దురాశను, స్వార్ధాన్ని, సంపూర్తిగా దూరంగా ఉంచాలి.

ఎవరైతే, శారీరక సుఖాలకు బానిసలుగా ఉంటారో, అహంకారులుగా, గర్విష్టులుగా, నిజాయితీలేనివారుగా, కృతఘ్నులుగా, కపటంగా మాట్లాడేవారుగా, ద్రోహపూరిత స్వభావం గలవారిగా, గురువుపట్ల, పెద్దలపట్ల, సాధు సన్యాసులపట్ల గౌరవం లేనివారుగా ఉంటారో, వ్యర్ధమైన ఐహిక విషయాల గురించి వృధాగా మాట్లాడుతూ, సంతోషాన్ని పొందుతూ ఉంటారో – ఇలాంటి లక్షణాలు గలవారు ఏనాటికీ యోగసాధనలో విజయాన్ని సాధించలేరు.

ఆహారం విషయంలో చాలా జాగ్రత్తలు తీసుకోవాల్సి ఉంటుంది. సాధారణంగా, విపరీతమైన ఆహారం తీసుకునేవాళ్ళు, నాలుకకు లొంగిపోయి అనగా జిహ్వాచాపల్యం వల్ల అనేక రకాల రుచులుగల ఆహారాలకు బానిసలుగా ఉండేవారు – యోగసాధనలో నిమగ్నం కావటం దాదాపు అసాధ్యం అని గ్రహించాలి.

సాధకులు – సాత్విక స్వభావంగల ఆహార పదార్ధాలను అనగా బార్లి, పాలు, ఎర్రబియ్యం, గోధుమలు, వెన్న, పెరుగు, పెసరపప్పు, బాదంపప్పు, పటికబెల్లం, కిస్మిస్‌పండ్లు, అరటిదవ్వ (అరటిచెట్టు కాండం లోపల ఉండే పదార్ధం), మామిడి పండ్లు, అరటిపండ్లు, తేనె, శొంఠి, నల్లమిరియాలు, ద్రాక్షపండ్లు, దానిమ్మపండ్లు,

బెండకాయలు – లాంటి వాటిని మాత్రమే ఆహారంగా తీసుకోవాలి. పాల విషయానికి వచ్చినట్లయితే, సాధకులు పాలను పొయ్యిమీద ఉంచి, ఆపై ఒక్క పొంగు రాగానే పాల గిన్నెను పొయ్యిమీద నుండి క్రిందకి దింపాలి. పాలను ఎక్కువసేపు మరగ పెట్టినట్లయితే, పాలలో ఉండే పోషక పదార్థాలు సంపూర్తిగా నశించిపోతాయి. ఒక్క పొంగుతో, కాచినపాలు సాధకులకు పరిపూర్ణమైన ఆహారంగా ఉంటుందని చెప్పబడింది.

# 16. తాంత్రిక సంభోగంతో "కుండలినీ"ని నిద్రలేపటం సాధ్యపడుతుందా?

కొందరు సాధకులు, వివిధ రకాల తాంత్రిక పద్ధతులలో కుండలినీ శక్తిని మేలు కొలుపుతారు. అయితే, కొన్ని తాంత్రిక విధానాలలో స్త్రీయొక్క ఆవశ్యకత ఉంటుంది. అనగా, తనయొక్క తాంత్రిక సహాయకురాలు లేదా శిష్యురాలితో తాంత్రిక సంబంధ సంభోగాన్ని జరపటం వల్ల సాధకుడిలో కుండలినీ శక్తి నిద్రలేస్తుంది. అందువలన, తాంత్రిక సంబంధ కుండలినీ సాధనలో "శృంగారానికి" ప్రముఖ స్థానం ఇవ్వబడింది. అది ఎలాగంటే...

శివుడు మరియు శక్తి అనే రెండు శక్తులు – పరస్పర విరుద్ధమైన లక్షణాలు కలిగి ఉంటాయి. ఈ రెండు శక్తుల కలయికవల్లే ఈ సృష్టి ఏర్పడుతుంది. స్త్రీరూపం అయిన "శక్తి" – విస్తరించే స్వభావాన్ని (ఎక్స్‌టెన్షన్) కలిగి ఉంటుంది. అందువల్ల, శక్తిని "యోని"తోను మరియు సంకోచించే స్వభావంగల (కంట్రాక్షన్), శివుడియొక్క శక్తిని "శిశ్నము" (లింగము)తోను పోల్చటం జరిగింది. ఏ సాధకుడైతే, తన సాధనతో మూలాధార చక్రంలో ఉన్న శక్తిని నిద్రలేపి ఆపై దానిని సహస్రారచక్రం దాకా తీసుకువెళ్ళి, అక్కడ ఉన్న శివుడితో కలిసేలా చేస్తాడో ఆ సాధకుడు మూడు లోకాలకు ప్రభువుకాగల శక్తిని పొందుతాడు అని హఠయోగం తెలియజేస్తుంది.



స్త్రీ మరియు పురుషుడు సంభోగించినప్పుడు పురుషుడిలోని "యాంగ్" (Yang) శక్తి మరియు స్త్రీలోని "ఇన్" (Yin) శక్తి – పరస్పరం కలుసుకుంటాయి. వారిద్దరి శరీరాల చుట్టూ వ్యాపించి ఉండే కాంతి వలయాలు (అరా) – ఒకదానితో ఒకటి మిశ్రమం అవుతాయి. ఆ స్త్రీ, పురుషులు ఇద్దరూ కలిసి "ఒక మూడవ వ్యక్తిగా" అవతరిస్తారు. అనగా, వారి ఇద్దరి మధ్యా తేడాలేని స్థితికి చేరుకుంటారు అన్నమాట.

'కౌలతంత్ర' విధానంలో స్త్రీలకు అగ్రస్థానం ఇవ్వబడింది అని చెప్పవచ్చు. ఆ కారణంగానే, కౌలమార్గంలో ఎందరో యోగినులు, స్త్రీ తాంత్రికులు ఆవిర్భవించారు. స్త్రీలు – నిజమైన రత్నాలు, స్త్రీ లేనిదే జీవితం లేదు. స్త్రీ దైవ స్వరూపిణి అని, యోని తంత్రలో చెప్పబడి ఉన్నది. కౌలమార్గంలో స్త్రీకి చాలా పవిత్ర స్థానం ఇవ్వబడింది. ఆ కారణంగానే, ఏ పురుషుడూ స్త్రీని కొట్టటం, బెదిరించటం, చివరికి ఆమె పైకి చెయ్యి ఎత్తటం లాంటివి కౌలమార్గంలో వ్యతిరేకించబడ్డాయి.

కుండలిని శక్తిని నిద్రలేపటానికి ఉపయోగించే తాంత్రిక సంభోగానికి మరియు సంతానంకోసం/సుఖంకోసం జరిపే సంభోగానికి మధ్య విపరీతమైన తేడా ఉంటుందని తంత్రశాస్త్ర పండితులు ఉద్ఘాటిస్తున్నారు. తాంత్రిక శృంగారంలో సాధకుడు తన తాంత్రిక భాగస్వామినితో శృంగారాన్ని ప్రారంభించటానికి ముందు – ఆమెను దేవతగా భావించి ఆపై, ఆమెకు 9 రకాల పుష్పాలను సమర్పిస్తాడు. ఆ పుష్పాలు ఏవంటే, 1. ఆలింగన (కౌగలించుకోటం) 2. చుంబనం (ముద్దాడటం) 3. స్తనమర్దన 4. దంతకరమం (పెదవులతో కొరకటం) 5. స్పర్శనం (తాకటం) 6. విస్తరణ (యోనిని విస్తరింప చేయటం) 7. తన శిశ్నమును వత్తుకొనటం 8. యోని ప్రవేశానికి సిద్ధపడటం 9. ప్రవేశం (యోనిలోకి శిశ్నమును ప్రవేశపెట్టుట) – ఈవిధమైన తొమ్మిది పుష్పాలను మైధున ప్రక్రియలో తాంత్రికులు తమ భాగస్వామ్య సాధకురాలికి సమర్పిస్తారు.

నాటి కామరూప ప్రాంతంలో (నేటి అస్సాం) అనేక కౌలతంత్ర గ్రంథాలు రచించబడ్డాయి. ఇంకొక విశేషం ఏమంటే, హైందవ పురాణాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, సతీదేవి యొక్క "యోని" ఈ కామరూప ప్రాంతంలోని 'కామాఖ్యా' అనే ప్రదేశంలో పడినట్లుగా తెలుస్తున్నది. ఆ కారణంగానే, కామరూప ప్రాంతంలో యోనిని పూజించే తాంత్రిక సాంప్రదాయం ఆవిర్భవించింది. కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, 'నాథ'మత స్థాపకుడు మరియు గోరఖ్‌నాథ్ గురువైన – మత్స్యేంద్రనాథుడు ఈ కామరూప ప్రాంతంలోనే

కౌలతంత్ర శాస్త్రాన్ని రచించినట్లుగా తెలుస్తున్నది. ఇంకొక విశేషం ఏమంటే, మత్స్యేంద్రనాధుడు – కౌలతాంత్రిక మతాన్ని మరియు నాధ మతాన్ని స్థాపించాడు. అయితే, గోరఖ్‌నాధ్, స్త్రీ సంబంధం ఉన్న కౌల మతాన్ని తిరస్కరించి, 'నాధ' మతాన్ని ప్రచారం చేసాడు.

ఈ ప్రపంచంలోని ఆధ్యాత్మిక రంగంలో వేదాలు అన్నింటికన్నా చాలా గొప్పవి. ఆ వేదాల కన్నా వైష్ణవ సాధన గొప్పది. ఆ వైష్ణవ సాధన కన్నా, శైవ సాధన గొప్పది. ఆ శైవ సాధన కన్నా, దక్షిణాచారం గొప్పది. ఆ దక్షిణాచారం కన్నా వామమార్గం అనగా వామాచారం గొప్పది. ఆ వామాచారం కన్నా 'సిద్ధాంతం' గొప్పది. ఆ సిద్ధాంతం కన్నా, కౌలాచారం గొప్పది. ఆ కౌలాచారంలో లేదా కులాచారంలో "మ"కార పంచకానికి మరియు యోని పూజకు ప్రధాన స్థానం ఇవ్వబడింది. యోని పూజ ద్వారా సాధకుడు మోక్షాన్ని పొందవచ్చునని కౌలతంత్రలో చెప్పబడింది. అయితే, తంత్రసాధనలో భాగంగా యోని పూజలు చేసే సాధకులకు సాధన సిద్ధించిన తరువాత – అమోఘమైన తాంత్రిక శక్తులు సంక్రమించటం జరుగుతుంది. అయితే, వాటిని ఆ సాధకులు లోక కళ్యాణం కోసం మాత్రమే వినియోగించాల్సి ఉంటుంది.

**కుండలినీ సాధనలో "తాంత్రిక శృంగారం" :**

తాంత్రిక సంభోగానికి మరియు భౌతిక ఆనందంకోసం చేసే సంభోగానికి మధ్య చేసే తేడా ఏమంటే, తాంత్రిక సంభోగంలో సాధకుడు తనలోని – "సహ స్వతంత్ర నాడీ వ్యవస్థ" (పారా సింపథెటిక్ నెర్వ్స్–అసంకల్పిత ప్రతీకార చర్యలను నియంత్రించే నాడులు)ని నియంత్రించుకుంటాడు. ఫలితంగా, అతడు – తనలో జరగబోయే స్కలనాన్ని అడ్డుకుంటాడు. ఇది ఒక విధానం కాగా, ఇంకొక విధానంలో సాధకుడు తన భాగస్వామిలో స్కలనాన్నిచేసి, ఆపై ఆ స్కలనంలోని కణాలను మళ్ళీ వెనక్కి లాక్కుంటాడు. అది ఎలా జరుగుతుందంటే...

పురుషుడియొక్క వీర్యం (వీర్యకణాలు అని గ్రహించాలి) చాలా శక్తివంతమైనది. తాంత్రిక సాధకుడు, తన తాంత్రిక భాగస్వామినితో శృంగారం జరిపేటప్పుడు – ఏదో ఒక సమయంలో అతనిలోని కామవాంఛ పతాకస్థాయికి చేరుకుంటుంది. ఆ సమయంలో అతడు ఆమెయొక్క యోనిలో వీర్యాన్ని స్కలించే క్షణం వస్తుంది. అప్పుడు సాధకుడు, తాను సాధకురాలియొక్క యోనిలో స్కలించిన ద్రవంలోని (సెమెన్) వీర్య కణాలను తనయొక్క యోగశక్తితో (యోగసాధనలు చెయ్యటంవల్ల నాడులలో,

కండరాలలో ఏర్పడేశక్తి.) తన సూక్ష్మ శరీర పై భాగాలకు అనగా యోగచక్రాలలోకి ప్రవహించేలా చేస్తాడు. ఈ ప్రక్రియనే "ఊర్ధ్వరేతస్" అని పిలుస్తారు. ఇలా చెయ్యగలిగిన సాధకుడికి ఏనాటికీ వృద్ధాప్యంరాదు. వ్యాధులురావు. చివరికి అతనికి మరణం కూడా ఉండదు.

(స్త్రీ శరీరంలో – శృంగార సమయంలో తయారయ్యే ద్రవాలను "రజస్సు" అని పిలుస్తారు. ఇక, పురుషుడియొక్క వెనక్కి తీసుకురాబడిన వీర్య కణాలను 'బిందు' అని పిలుస్తారు.)

## కుండలినీ సాధనలో సహకరించే వజ్రోలి, సహజోలి ముద్రల మర్మం?

"వజ్ర" అనగా పిడుగు అని అర్థం. ఇంద్రుడి ఆయుధాన్ని కూడా వజ్రాయుధం అని పిలుస్తారు. ఇక, యోగశాస్త్రం విషయానికి వచ్చినట్లయితే మనిషి యొక్క – "మూత్ర సంబంధ, మూత్ర జననేంద్రియ వ్యవస్థ"ని (యూరోజెనిటాల్ సిస్టమ్) "వజ్రనాడి" అనే ఒక నాడి నియంత్రిస్తూ ఉంటుంది. సుషుమ్న నాడిలో – అతి లోపలగా (Inner) ఉండే వాటిలో ఇది రెండవదిగా చెప్పుకుంటారు. మనిషియొక్క లైంగిక అవయవాలను నియంత్రించే వెన్నుముక (స్పైన్) గుండా ఈ వజ్రనాడియొక్క శక్తి ప్రవహిస్తుంది. ఈ వజ్రనాడియొక్క శక్తి, మనిషిలోని శృంగార భావాలకు, శృంగారానికి సంబంధాన్ని కలిగి ఉంటుంది. దీనినే, ప్రఖ్యాత మనస్తత్వ శాస్త్రవేత్త సిగ్మండ్ ఫ్రాయిడ్ – "కామేచ్ఛ" (లిబిడో) అని పేర్కొన్నాడు. తాంత్రిక సాధనలో ఈ వజ్రనాడి యొక్క శక్తిని వజ్రోలి, సహజోలి, అమరోలి అనే ముద్రల ద్వారా నిద్రలేపి, ఆపై శృంగార శక్తిని (సెక్సువల్ ఎనర్జీ) కుండలినీ శక్తిని జాగృతం చెయ్యటానికి ఉపయోగిస్తారు.

సంభోగ సమయంలో పురుషుడు, తనయొక్క స్త్రీ – యోనిలో స్ఖలించే వీర్యంలోని వీర్యకణాలను తన మూత్రద్వారం (యురెత్రా) ద్వారా మళ్ళీ వెనక్కి పీల్చుకోవటాన్ని "వజ్రోలి" అని పిలుస్తారు. హఠయోగంలో చెప్పబడిన ఈ విధానాన్ని లేదా ముద్రని "వజ్రోలి ముద్ర" అని పిలుస్తారు. వీర్యాన్ని అనగా వీర్యకణాలను రక్షించుకోవటానికి హఠయోగంలో చెప్పబడిన 'సహజోలి' మరియు 'అమరోలి' అనే ముద్రలు కూడా వజ్రోలి యొక్క ఇతర రూపాలు అని గుర్తించాలి.

పురుషులు వేసే వజ్రోలి ముద్రను – స్త్రీలు వేసినప్పుడు "సహజోలి" అని పిలుస్తారు. "యోగినులు", సహజోలి ముద్రను సాధన చెయ్యటంవల్ల వారి శరీరంలోని

అండాశయముల (ఓవరీస్) నుండి ఉత్పత్తి అయ్యే హార్మోన్లు నియంత్రణలో ఉంచబడతాయి.

వజ్రోలి సాధన కారణంగా పురుషుడు, స్కలన సమయంలో తన వీర్యకణాలను వెనక్కి తీసుకోవటంవల్ల, అలా వెనక్కి తీసుకోబడిన వీర్యకణాలు "బిందు" అనే రూపాన్ని ధరించి, ఆపై సూక్ష్మశరీరంలో ఉండే వెన్నుముక మీదుగా ఉండే వివిధ చక్రాలను దాటుకుని ఆపై కనుబొమల మధ్య ఉండే "అజన" చక్రం వద్ద తనయొక్క ఉనికిని సూచిస్తుంది.

మూత్రవిసర్జన చేసే సమయంలో సాధకుడు, తనలో ప్రవహించే వాయుశక్తిని ఉపయోగించి మూత్రాన్ని బిగపట్టి, ఆపై కొద్ది కొద్దిగా విసర్జన చెయ్యటం జరుగుతుంది. ఈవిధంగా ఆరు నెలలు సాధన చేసే సరికి సాధకుడు తన "బిందువు"ను (వీర్య కణాలు) సంభోగ సమయంలో స్కలించకుండా అడ్డుకోగలుగుతాడు. ఈవిధమైన సాధనలో పరిపూర్ణుడైన సాధకుడు – "వరుసగా వందమంది స్త్రీలతో కూడా సంభోగాన్ని జరుపగల శక్తిని" పొందుతాడని శివసంహితలో చెప్పబడి ఉన్నది. ఎవరైతే, తన బిందువును విసర్జించకుండా తమలోనే ఉంచుకోగలుగుతారో వారు మరణాన్ని జయిస్తారని పరమశివుడు, పార్వతితో చెప్పాడు.

వజ్రోలిముద్రలో పురుషుడు, సంభోగ సమయంలో స్త్రీ యోనిలోకి తాను స్కలించిన వీర్య ద్రవం నుండి వీర్యకణాలను వెనక్కి తీసుకుంటాడు. అలా, మళ్ళీ శరీరంలోకి ప్రవేశించిన వీర్యకణాలు "బిందు" అనే పేరు పిలువబడతాయి. ఎప్పుడు సాధకుడు సంభోగ సమయంలో తన సాధకురాలి యోనిలో స్కలించిన వీర్యంలోని వీర్యకణాలను పైన చెప్పిన విధానంలో మళ్ళీ శరీర వ్యవస్థలోకి తీసుకోగలిగినప్పుడు, ఆ కణాలు అసాధారణమైన శక్తి రూపంలోకి మారి ఆ సాధకుడి మూలాధార చక్రం నుండి సహస్రార చక్రం దాకా వేగంగా దూసుకుపోతుంది. ఫలితంగా, సాధకుడి అంతిమ లక్ష్యం అయిన సహస్రారచక్రం వికసిస్తుంది. ఎప్పుడైతే, సహస్రారచక్రం తెరచుకుంటుందో అప్పటి నుండి ఆ సాధకుడు "సిద్ధుడు" అవుతాడు.

పురుషుడు తన వీర్యకణాలను వెనక్కి తీసుకోవటంవల్ల, అతడిలో శక్తినష్టం అవటం అనేది ఉండదు. ఇక, స్త్రీల విషయానికి వచ్చినట్లయితే సంభోగ సమయంలో సహజోలి లేదా అమరోలి అనే ముద్రను పాటించటంవల్ల స్త్రీ, తనలో "అండం" (ఎగ్/ఓవమ్) విడుదల కాకుండా అడ్డుకుంటుంది. ఫలితంగా, సంభోగంలో పాల్గొన్నప్పటికీ ఆమెలో శక్తి నష్టంకాదు.

ఇంకొక జీవి ఏర్పడటానికి అనగా "పిండం" (ఎంబ్రియో) ఏర్పడటానికి ఎక్కువ మొత్తంలో వీర్యకణాలు మరియు అధిక మొత్తంలో బహిష్టు రక్తము ఉపయోగపడవలసి ఉంటుంది. వైద్యశాస్త్రం ఇస్తున్న సమాచారం ప్రకారంచూసినట్లయితే "ప్రతి మిల్లీమీటరు ద్రవంలోను 5 మిలియన్ల వీర్యకణాల కన్నా తక్కువగా ఉన్నా మరియు స్త్రీకి కొనసాగే బహిస్టు సమయం నాలుగు లేదా ఐదు రోజుల కన్నా తక్కువగా ఉన్నా – వారి సంభోగం వలన "పిండం" ఏర్పడే అవకాశాలు చాలా తక్కువగా ఉంటాయని అని తెలుస్తున్నది". కనుక, వజ్రోలి సాధన చేసిన స్త్రీ మరియు పురుషుడు సంభోగంలో పాల్గొన్నప్పటికీ వారికి వీర్యకణాలనష్టం, అండం నష్టం ఉండవని యోగశాస్త్రం తెలియజేస్తుంది.

**తంత్రశాస్త్రాలలో చెప్పబడిన స్త్రీ శరీర రహస్యములు :**

అనేక తంత్రశాస్త్ర గ్రంథాలలో స్త్రీ సంభోగం గురించి విస్తృతంగా చర్చించినప్పటికీ స్త్రీ యొక్క బహిష్టు విషయానికి వచ్చే సరికి, దానికి సంబంధించిన అంశాలను స్పష్టంగా వివరించటం జరగలేదు. కానీ, వజ్రయాన తంత్ర విధానానికి సంబంధించిన తాంత్రిక గ్రంథాలలో బహిష్టు రక్తం యొక్క విశేషాలను వివరించటం జరిగింది.

"మాత్రికాభేద తంత్ర" అనే తంత్రశాస్త్ర గ్రంథంలో ఇవ్వబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, బహిష్టు రక్తములు మూడు రకాలుగా ఉంటాయని, ఒక్కొక్క రక్తానికి ఒక్కొక్కవిధమైన తంత్రశాస్త్ర సంబంధ ప్రాముఖ్యత ఉన్నదని తెలుస్తున్నది. అది ఎలాగంటే...

**1. స్వయంభు బహిష్టు :** తన కన్యత్వాన్ని (వర్జినిటి) కోల్పోయిన స్త్రీ నుండి తొలిసారిగా స్రవించిన రుధిరాన్ని "స్వయంభు బహిష్టు" అని పిలుస్తారు.

**2. కుండ బహిష్టు :** ఒక వివాహం అయిన స్త్రీకి అన్య పురుషుడివల్ల కలిగిన అమ్మాయికి వచ్చే తొలి బహిష్టును "కుండ బహిష్టు" అనే పేరుతో పిలుస్తారు. ఈ బహిష్టు రుధిరం చాలా మహత్యాన్ని కలిగి ఉంటుందని, కోరిన కోర్కెలు తీరుస్తుందని చెప్పబడి ఉన్నది.

**3. గోలా బహిష్టు :** ఒక విధవ స్త్రీకి – ఏదోఒక విధంగా వచ్చిన గర్భం వల్ల జన్మించే కన్యకు వచ్చిన బహిష్టుని "గోలా బహిష్టు" అనే పేరుతో పిలుస్తారు. దైవాలు కూడా ఈ బహిష్టు స్రావానికి తలవంచి తీరాలని చెప్పబడి ఉన్నది.

**4. స్వపుష్ప బహిష్టు :** ఒక కన్యకు వివాహం అయి కాంతగా మారిన తరువాత తొలిసారిగా వచ్చే బహిష్టును "స్వపుష్ప బహిష్టు" అని పిలుస్తారు.

నోట్ : పురుషుడితో సంపర్కం/సంభోగం ఎరుగని చిన్న వయస్సు స్త్రీని 'కన్య' (వర్జిన్) అని పిలుస్తారు. వివాహం అయినా, కాకపోయినా పురుష సంపర్కాన్ని అనుభవించిన స్త్రీని 'కాంత' అని పిలుస్తారు.

చాలా మంది సాధకులు – వీర్యాన్ని (సెమెన్) మరియు బహిష్టు స్రావాన్ని (మెనుస్ట్రువల్ ఫ్లూయిడ్)ని అసహ్యించుకుంటారు. కానీ, ఆ సాధకులు ఒక విషయాన్ని తప్పనిసరిగా గుర్తుపెట్టుకోవాలి. అది ఏమిటంటే... ఈ మానవ దేహంతో ముక్తిని సంపాదించాలని వారు ఆశపడతారు. కానీ, ఈ మానవ దేహం, స్త్రీ మరియు పురుషుల నుండి విడుదల అయిన ద్రవాల కారణంగానే ఏర్పడుతుంది.

ఈ భూమిమీద – ఒక స్త్రీ గర్భం ద్వారా బైటకు వచ్చే ప్రతి మనిషికి (స్త్రీ/ పురుష) తండ్రి నుండి మజ్జ (ఎముకల మధ్యలో ఉండే సారం), ఎముకలు, స్నాయుబంధనము (టెండన్–కండరాలను ఎముకకు కలిపే కణనిర్మితమైన ఒక బలమైన తీగె లాంటిది) మరియు తల్లి నుండి చర్మం, మాంసం, రక్తం లభిస్తాయి. అలాంటప్పుడు, వీర్యాన్ని, బహిష్టుని – మనుషులు అసహ్యించుకోవటంలో అర్థంలేదు. ఇంకొక విశేషం ఏమంటే, చాలామంది, మలమూత్రాల యొక్క పేర్లను వింటానికి కూడా ఏమాత్రం ఇష్టపడరు. కానీ, మనిషి తాను తీసుకున్న ఆహారం మరియు పానీయము – అతడి ఉదరంలోకి వెళ్ళిన తరువాత, కొన్ని గంటలకు జీర్ణక్రియ ఫలితంగా, మలమూత్రములుగా మారి బైటకు విసర్జించబడతాయి. అందువలన మలమూత్రాలను అసహ్యించుకోవలసిన పనిలేదని తంత్రశాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి.

**తంత్రశాస్త్రాలలో చెప్పబడిన బ్రహ్మచర్య మర్మం ఏమిటి?**

కుటుంబ జీవితాన్ని గడుపుతున్న పురుషుడు కేవలము సంతానంకోసం మాత్రమే భార్యతో సంభోగం జరిపినట్లయితే అతడు "బ్రహ్మచర్యాన్ని" పాటిస్తున్నట్లుగా గుర్తించాలని తంత్ర శాస్త్రాలు తెలియజేస్తున్నాయి.

శృంగారం మూడు రకాలుగా ఉంటుంది. 1. తామస స్వభావం కలిగిన వ్యక్తి, శృంగారాన్ని సంతానోత్పత్తికోసం ఉపయోగించుకుంటాడు. 2. రాజసగుణం కలిగిన వ్యక్తి, సుఖంకోసం ఉపయోగించుకుంటాడు. 3. సత్వగుణం కలిగిన వ్యక్తి, శృంగారాన్ని జ్ఞానం పొందటంకోసం, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే మోక్షం పొందటంకోసం ఉపయోగించుకుంటాడు.

కేవలము, సంతానంకోసమే అదికూడా – కొన్ని నిర్ణీత సమయాలలో సంభోగాన్ని జరిపినప్పుడు ఆరోగ్యవంతులు, మేధావులు, ఉదారగుణం గలవారు, బలవంతులు, సౌందర్యవంతులు అయిన బిడ్డలు పుడతారు. పరాశర మహర్షి – తన వంశాన్ని నిలబెట్టే బిడ్డకోసం మాత్రమే మత్స్యగంధి అనే బెస్తజాతి కన్యతో సంభోగాన్ని జరిపాడు. ఫలితంగా, ఆమెకు దైవాంశ సంభూతుడు మరియు ఎన్నో పురాణ గ్రంధాలను రచించిన వేదవ్యాసుడు జన్మించాడు. పురాణకాలంలో ఎందరో మహర్షులు, మహా సౌందర్యవతులు అయిన రాజకుమార్తెలను వివాహం చేసుకున్నప్పటికీ, కేవలము సంతానంకోసం మాత్రమే వారు తమ భార్యలతో మైధునాన్ని జరిపారు.

ఇక, సాధారణ గృహస్తుల విషయానికి వచ్చినట్లయితే, ప్రతి గృహస్తూ నెలకు ఒక్కసారి, అదికూడా మంచి సమయంలో అనగా గ్రహాలు అనుకూలంగా ఉన్న సమయంలో మాత్రమే తన భార్యతో శృంగారాన్ని జరపాలి. అలా జరిపినట్లయితే ఆ గృహస్తు బ్రహ్మచర్యాన్ని పాటిస్తున్నట్లుగా గుర్తించబడతాడు. మానవ జాతికి పితామహుడిగా చెప్పబడిన మనువు, సంతానం గురించి ఒకేఒక వాక్యంలో ఇలా చెప్పాడు. “ఏ దంపతులకైనా మొదట పుట్టిన బిడ్డ ‘ధర్మంవల్ల’ పుట్టటం జరుగుతుంది. ఆ తరువాత పుట్టే బిడ్డలు “కామం వల్ల” పుట్టటం జరుగుతుంది”.

ఏదిఏమైనా, సాధకులు లేదా సాధారణ గృహస్తులు – ఎట్టి పరిస్థితుల్లోను తెల్లవారుఝామున 3 గంటల నుండి ఉదయం 6 గంటలలోపు శృంగారానికి దూరంగా ఉంటే మంచిది. కారణం, ఆ సమయంలో భూమిమీద వాతావరణం చాలా సున్నితంగా ఉంటుంది. అందువలన, ఆ మూడు గంటల సమయంలో సంభోగానికి దూరంగా ఉండాలని తంత్రశాస్త్రాలు తెలియజేస్తున్నాయి.

అపరిమితమైన శృంగారం కేవలము పురుషులమీద మాత్రమే కాక, స్త్రీల మీద కూడా తీవ్రమైన చెడు ప్రభావం చూపిస్తుంది. పురుషులు విపరీతమైన శృంగారం చెయ్యటం వల్ల తమలోని వీర్యాన్ని విపరీతంగా కోల్పోతారు. ఫలితంగా, అనారోగ్యం పాలు అవుతారు. ఇక, స్త్రీల విషయానికి వచ్చినట్లయితే స్త్రీలలో విపరీత శృంగారం వల్ల వారిలోని నరాలు విపరీతమైన వత్తిడికి గురి అవుతాయి. ఫలితంగా, వారిలోని నరాల వ్యవస్థ దెబ్బతింటుంది. ఇక, పురుషులలో – వృషణాలు (టెస్టీస్) వీర్యాన్ని తయారుచేస్తాయి. స్త్రీలలో అండాశయాలు “అండాలను” (ఒవమ్‌ని) తయారుచేస్తాయి. విపరీతంగా శృంగారంలో పాల్గొనటంవల్ల స్త్రీల అండాశయాల్లో తయారయ్యే అండములు, పిండమును (ఎంబ్రియో) తయారుచేయటానికి ఇవతలికి వచ్చేస్తాయి.

అనగా, అండాశయాల్లో ఉండే బలం తగ్గిపోతుంది. ఇలా విపరీతంగా – అండాశయాలు ఖాళీ అయిపోవటం వల్ల ఆ స్త్రీలలో ఆరోగ్యం తగ్గిపోతుంది. సౌందర్యం తగ్గిపోతుంది. తొందరగా వృద్ధాప్యాన్ని పొందుతారు. అదేవిధంగా, అధిక శృంగార కారణంగా – వారిలో విపరీతమైన ఉద్రేకం అనేకసార్లు చెలరేగటంవల్ల వారియొక్క నరాల వ్యవస్థ బలహీన పడిపోతుంది. కనుక, ఎక్కువగా శృంగారంలో పాల్గొనే పురుషుల కన్నా, స్త్రీలకే ఎక్కువ ప్రమాదం జరిగే అవకాశాలు ఉంటాయి. స్త్రీల అండాశయాలలో (ఓవరీస్) ఉత్పత్తి అయ్యే అండాలు మరియు హార్మోన్లు – స్త్రీ యొక్క శారీరక మరియు మానసిక ఆరోగ్యానికి అతి ముఖ్యమైనవిగా గుర్తించబడ్డాయి. విపరీతమైన శృంగారంలో పాల్గొనే స్త్రీలలో ఈ అండాలు మరియు హార్మోన్లు విపరీతంగా ఖర్చుచేయబడతాయి. అలా జరగక్కుండా ఉండాలంటే స్త్రీలుకూడా చాలా తక్కువసార్లు సంభోగంలో పాల్గొంటూ బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ ఉండాలి.

"జంతువు"కి తన కామాన్ని తృప్తిపరచుకోవటం ప్రధానంగా ఉంటుంది. వాంఛలన్నింటిలోకి కామవాంఛను "జంతు సంబంధమైన వాంఛ"గా పేర్కొంటారు. అయితే, ఎన్నో రకాల జీవులుగా, జంతువులుగా జన్మించిన తరువాతే ఆత్మకి "మానవ జన్మ" లభిస్తుంది. అప్పటికి, అనేక విభిన్న జన్మలలో శృంగారపరమైన వాంఛలను తీర్చుకున్న తరువాత కూడా మనిషి – ఈ జన్మలో కూడా ఇంకా శృంగార సుఖంకోసం అర్రులుజాచటం సమంజసమైనది కాదని చెబుతారు. పునర్జన్మ రహితమైన మోక్షాన్ని పొందటంకోసమే జీవికి 'మానవ జన్మ' లభిస్తుంది. ఆ జన్మను సరిగా ఉపయోగించు కోకుండా కామ సంబంధ సుఖాలలో ఓలలాడినట్లయితే, మనిషియొక్క చెడుకర్మఫలం మరింత పెరిగిపోతుంది. ఎందుకంటే, విపరీతంగా వాంఛలు పెంచుకున్న వ్యక్తికి ఒక జన్మలో ఆ వాంఛలు తీరవు. అందువల్ల మనిషి ఆ వాంఛలు తీర్చుకోవటంకోసం మళ్ళీ మళ్ళీ జన్మిస్తూనే ఉంటాడు. ఇది ఎలా ఉంటుంది అంటే "బొగ్గులు తయారీకోసం ఇతర తక్కువ జాతికి చెందిన చెట్లకు బదులుగా గంధపు చెట్లను ఉపయోగించినట్లుగా" అన్నమాట.

మనిషికి ఈ భూమిమీద ఉన్న శత్రువులందరిలోకి అతిపెద్ద శత్రువు "కామం" అని పండితులు చెబుతారు. విచిత్రం ఏమంటే, శృంగార సుఖం పొందిన కొద్ది నిమిషాలకే మనిషి నీరసించిపోతాడు. వెలుగు ఉన్నచోట చీకటి ఉండదు. అలాగే శృంగార సుఖాలు ఎల్లప్పుడూ ఆశించే వ్యక్తికి శాశ్వత సుఖం ఏనాటికీ లభించదు.

చాలామంది పురుషులు 'శృంగార సుఖాన్ని' మించిన సుఖం ఉండదని బలంగా నమ్ముతారు. ఆ సుఖం పొందటంకోసం వాళ్ళు ఎంత నష్టపోవటానికైనా, ఎంత దిగజారిపోవటానికైనా సిద్ధపడతారు. కానీ, "శృంగార సుఖం అనేది చాలా

తాత్కాలికమైనది” అని గుర్తించాలి. ఒక మనిషి తన ఆర్థిక మరియు శారీరక శక్తిని బట్టి – అపరిమితమైన సౌందర్యవతులైన వందలమంది స్త్రీలతో సంభోగించినా ఆ మనిషికి శాశ్వతమైన ఆనందం కలగదు. విపరీతంగా శృంగారం అనుభవించిన మనిషి క్రమ క్రమంగా అనారోగ్యానికి గురి అవుతాడు. కొంతమంది మేధావులు ఇలా చెబుతారు. “కామాన్ని అనుభవించకుండా ఏ మనిషి సన్యాసికాలేడు”. కానీ, సుఖాలు అనుభవించినకొద్దీ ఇంకా, ఇంకా, ఇంకా అనుభవించాలనే వాంఛ పెరిగిపోతుంది. విరక్తిమాత్రం కలుగదు. కనుక, ఆధ్యాత్మిక మార్గంలో ప్రయాణించాలని కోరుకునే వ్యక్తి, తప్పనిసరిగా తనలోని కామవాంఛలను నియంత్రించుకోవలసిన అవసరం ఉందని గుర్తించాలి. శాశ్వతమైన ఆనందం, దైవంతో కలిసినప్పుడే అని గ్రహించాలి. శృంగార సుఖం అనేది కేవలం “ఒక మాయ” అని అర్థంచేసుకోవాలి.

ఇంకొక విచిత్రం ఏమంటే, ఆధునికకాలంలో అనేకమంది దంపతులు – తమది “ఆత్మీయబంధం” అని భావిస్తూ ఉంటారు. కానీ, నిజానికి వారిమధ్య ఉన్నది “శారీరక బంధమే” అని గుర్తించరు. తన భార్య అందంగా ఉన్నంతవరకు ఆమెను ఆమె భర్త అనేక రకాలుగా పొగుడుతాడు. ఆమెను అనుక్షణం ఆరాధిస్తూ ఉంటాడు. ఎప్పుడైతే – ఆమె అందం, వృద్ధాప్యంవల్లో లేక అనారోగ్యంవల్లో నశించినట్లయితే అతడు, ఆమెను ఆపై ఎంతమాత్రమూ ఇష్టపడడు. నిజంగా, తన జీవిత భాగస్వామితో “ఆత్మబంధం” కలిగిన వ్యక్తి (స్త్రీ లేదా పురుషుడు) ఆ భాగస్వామి మరణించిన మరుక్షణం చనిపోవటం జరుగుతుంది లేదా ఇహలోక బంధాలను త్యజించటం జరుగుతుంది. భర్త చనిపోతున్న సమయంలో – అతడు పోవటంవల్ల తనకి ఆర్థికంగా ఎంత నష్టం కలుగుతుంది? – అని ఆలోచించే భార్యలు ఈ కాలంలో ఎక్కువ సంఖ్యలో ఉన్నారని, తన భార్య చనిపోతే మళ్ళీ కొత్త భార్యను ఎప్పుడు తెచ్చుకోవాలి? అని ఆలోచించే భర్తలు అధిక సంఖ్యలో ఉన్నారని అనుభవజ్ఞుడైన ఒక జ్ఞాని ఉద్ఘాటించాడు.

“భార్య” అనే వ్యక్తి – నిరంతరం భర్తకి సమస్యలు కలిగించే ఒక శక్తిగా ఉంటుందని కొందరు సన్యాసులు చెబుతూ ఉంటారు. సిద్ధార్థుడు, సంసార జీవితాన్ని త్యజించిన తరువాతే బుద్ధుడిగా గుర్తింపు పొందాడు. వివాహం అయినప్పటికీ ఏవిధమైన సంసారిక సుఖాలను పొందకుండా, కఠోర బ్రహ్మచర్యం పాటించిన “రామకృష్ణుడు” ఆ తరువాతకాలంలో “రామకృష్ణపరమ హంస”గా గుర్తించబడ్డాడు. వివాహాన్ని తన జీవితం నుండి చెరిపివేసిన స్వామి వివేకానంద, హైందవ వైరాగ్య భావానికి,

బ్రహ్మచర్యానికి ప్రతీకగా గుర్తించబడ్డాడు. భతృహరి అనే మహారాజు, దాంపత్య జీవితంలో ఉన్న భ్రమలను వదులుకున్న తరువాతే సిద్ధయోగిగా మారాడు.

**వీర్యంలో ప్రాణశక్తి దాగి ఉంటుందా?**

వీర్యం, పురుషునియొక్క క్రింద భాగాలలో (వృషణాలు) తయారవుతున్నప్పటికీ దానియొక్క శక్తి, మనిషి శరీరం అంతటా వ్యాపించి ఉంటుంది. అది ఎలాగంటే, చెరుకురసం, చెరుకుగడ అంతా ఎలా వ్యాపించి ఉంటుందో, నెయ్యి-పెరుగు మొత్తం ఎలా వ్యాపించి ఉంటుందో ఆవిధంగా వీర్యంయొక్క శక్తి పురుషుడి శరీరం అంతటా విస్తరించి ఉంటుంది. పువ్వు యొక్క మొగ్గలో సువాసన ఉండదు. ఎప్పుడైతే ఆ మొగ్గ, పుష్పంగా మారుతుందో అప్పుడే దాని నుండి సువాసనలు వస్తాయి. అలాగే, 16 సంవత్సరాలు నిండిన తరువాత మాత్రమే పురుషుడియొక్క వీర్యం, సంతానోత్పత్తిని కలిగించే శక్తిని పొందుతుంది.

"పరిపూర్ణమైన ఆయుర్దాయం తనకు ఉండాలని కోరుకునే పురుషుడు తనకు 16 సంవత్సరాలు నిండిన తరువాత నుండి 70 సంవత్సరాలు నిండే వరకు మాత్రమే స్త్రీ సంభోగం జరపాలి". చాలా చిన్నవయస్సులోనే అనగా 16 సంవత్సరాలు నిండకముందే స్త్రీ సంభోగానికి పాల్పడే యువకుడు చాలా తొందరగా క్షీణించిపోతాడు. కారణం, ఆ వయస్సులోపు అతడి శరీరం లోపల ఉండే ధాతువులు పరిపక్వంకావు. "కొద్దిగా నీరు ఉన్న సరస్సు విపరీతమైన ఎండ కారణంగా ఏవిధంగా సంపూర్తిగా ఎండిపోతుందో అదేవిధంగా తన శరీరంలోని ధాతువులు పూర్తిగా అభివృద్ధి చెందకుండా - స్త్రీ సంభోగంలో పాల్గొనే యువకుడు కూడా ఆరోగ్యపరంగా క్షీణించిపోతాడు".

తన ఆరోగ్యాన్ని మరియు ఆయుర్దాయాన్ని రక్షించుకోవాలని ఆశపడే పురుషుడు - బాగా చిన్న వయస్సు ఉన్న బాలికతో, బాగా పెద్ద వయస్సు ఉన్న స్త్రీతో, దీర్ఘకాల వ్యాధులతో బాధపడుతున్న స్త్రీతో, మానసిక పరమైన వ్యాధులతో బాధపడుతున్న స్త్రీతో "సంభోగము" జరుపరాదు. అదేవిధంగా - స్త్రీ కూడా పైన చెప్పిన అనారోగ్య సమస్యలు, తన కన్నా అల్ప వయస్సు, చాలా అధిక వయస్సు ఉన్న పురుషుడితో సంభోగంలో పాల్గొన్నట్లయితే ఆమె ఆరోగ్యము, ఆయుర్దాయము తప్పనిసరిగా దెబ్బతింటాయి.



# 17. ప్రాచీన ఇరాక్‌దేశ సూఫీయోగి హబీబ్ అల్ – అజామి జీవిత విశేషాలు?

క్రీ.శ. 7వ శతాబ్దంలో ఆనాటి ఇరాక్ దేశంలోని బస్రా నగరంలో హబీబ్ ఆజామి అనే ఒక దురాశాపరుడైన మరియు సంపన్నుడైన ఒక వడ్డీ వ్యాపారి ఉండేవాడు. అతడు, రోజులో ఎక్కువభాగం నగరం అంతా తిరుగుతూ తనకు రావలసిన వడ్డీని వసూలు చేసుకుంటూ ఉండేవాడు. ఒకరోజు ఉదయం, ఒక ఋణగ్రస్తుడి ఇంటికి వడ్డీ వసూలు చేయటంకోసం హబీబ్ వెళ్ళాడు. ఇతడు వెళ్ళేసరికి ఆ ఇంటి తలుపులు మూసి ఉన్నాయి. దాంతో, హబీబ్ ఆ తలుపులు తట్టాడు. కొద్ది నిమిషాల తరువాత తలుపులు తెరచుకున్నాయి. లోపల నుండి ఒక స్త్రీ, చిన్న స్వరంతో ఇలా చెప్పింది. "నా భర్త ప్రస్తుతం ఇంట్లో లేడు". ఆ స్త్రీ అన్నమాటలు విన్న హబీబ్ కొంచెం చిరాకు నిండిన స్వరంతో "నీ భర్త ఇంట్లో లేకపోతే నాకేంటి? మీరు ఇవ్వాల్సిన వడ్డీ ఇస్తే తీసుకుని నేను వెళ్ళిపోతాను" అన్నాడు. అప్పుడు ఆ భార్య దీనమైన స్వరంతో "నీకు ఇవ్వటానికి నా దగ్గర ఏమాత్రం సొమ్ములేదు. కాకపోతే ఒక మేక తలమాత్రం ఉన్నది. అది, ఈపూట కూర చేసుకుందామని అనుకుంటున్నాను. కావాలంటే అది ఇస్తాను తీసుకువెళ్ళు" అన్నది. అప్పుడు హబీబ్ "సరే! అదే తీసుకువచ్చి ఇవ్వు. దాన్ని వడ్డీక్రింద జమవేసుకుంటాను" అన్నాడు. ఆపై, ఆమె ఒక చిన్న గుడ్డ సంచిలో మేక తలను పెట్టి ఆ సంచిని తీసుకువచ్చి హబీబ్‌కి ఇచ్చింది. హబీబ్ అక్కడ నుండి నేరుగా ఇంటికివెళ్ళి, ఆపై ఆ మేక తలను తన భార్యకు ఇచ్చి "ఈ పూట ఈ మేక తలతో రుచికరంగా కూర వండు" అన్నాడు. అప్పుడు ఆ భార్య కొంచెం చిరాకు నిండిన స్వరంతో "ప్రస్తుతం మన ఇంట్లో రొట్టెలుగాని, వండుకోవటానికి పుల్లలుగాని లేవు" అన్నది. అప్పుడు హబీబ్ ఒకసారి భార్యకేసి పరిశీలనగాచూసి "ఇప్పుడే వస్తాను" అని ఆమెతో చెప్పి ఆపై ఇంట్లోంచి బైటకు వచ్చాడు.

ఆ తరువాత తనకి వడ్డీ ఇవ్వవలసిన ఒక వ్యక్తి దగ్గరకువెళ్ళి ఆ వ్యక్తి దగ్గర వడ్డీతో పాటుగా కొంచెం కట్టెపుల్లలు తీసుకున్నాడు. ఆ తరువాత ఇంకొక వ్యక్తి దగ్గరకువెళ్ళి అతని దగ్గర వడ్డీ మరియు కొన్ని రొట్టెలు కూడా తీసుకున్నాడు. ఆ తరువాత ఆ వస్తువులతో ఇంటికి వచ్చాడు. ఆపై అతని భార్య ఆ పుల్లలతో పొయ్యి మండిస్తూ మేకతలతో కూర చెయ్యటం ప్రారంభించింది. కొంచెంసేపు గడిచిన తరువాత ఒక ఫకీర్ (ఇస్లాం మతానికి చెందిన సూఫీ సన్యాసి) ఆ ఇంటి ముందుకి వచ్చి

నిలబడి "నాకు బాగా ఆకలిగా ఉన్నది. కొంచెం ఆహారం దానం చెయ్యండి" అని పెద్ద స్వరంతో అరిచాడు. అతడి అరుపు విన్న హబీబ్ విసురుగా బైటకువచ్చి, కోపంతో నిండిన స్వరంతో "ఇక్కడ దొరికే భిక్షతో నువ్వు లక్షాధికారివి కావు. అందువల్ల నువ్వు ఇక్కడ నుండి వెళ్ళిపో" అన్నాడు. ఆ ఫకీర్ ఒకసారి హబీబ్‌ని చిరునవ్వుతో వీక్షించి, ఆపై నిశ్శబ్దంగా అక్కడ నుండి వెళ్ళిపోయాడు. ఇంతలో హబీబ్ భార్య, మేక తలతో వండిన కూరని నింపిన పాత్రను మధ్య గదిలోకి తెచ్చి ఉంచింది. ఆ తరువాత తనకి, తన భర్తకి భోజనం చెయ్యటానికి రెండు పళ్ళాలు బల్లమీద పెట్టింది. బైట గదిలో హబీబ్ ఆ రోజు తాను తెచ్చుకున్న వడ్డీ డబ్బుల్ని లెక్కవేసుకుంటున్నాడు. రెండు పళ్ళాల్లో రొట్టెలుపెట్టి, ఆపై కూర వేద్దామని కూర గిన్నె దగ్గరకు గరిటె తీసుకుని వెళ్ళింది. ఆ గిన్నెలో వండిన మాంసం కూర బదులుగా ఎర్రటి చిక్కటి పచ్చి నెత్తురు కనపడింది. ఆ దృశ్యంచూసి ఆమె భయంతో ఒక్కసారిగా కేకలు వేసింది. ఆమె అరుపులు విన్న హబీబ్ ప్రక్క గదిలోంచి మధ్యగదిలోకి వచ్చి చూసాడు. అప్పుడు, అతనివైపు కోపంగా చూస్తూ "ఇందాక నీవు ఆ ఫకీర్‌ని క్రూరంగా నిందించావు. ఫలితంగా, మనం తినాల్సిన మాంసం కూర, పచ్చి రక్తంగా మారిపోయింది" అన్నది. ఆ పాత్రలో ఉన్న పచ్చి నెత్తురుని చూసి హబీబ్ కూడా భయంతో వణికిపోయాడు. "తాను ఇన్నాళ్ళుగా మానవత్వాన్ని మర్చిపోయి ప్రజల్ని వడ్డీకోసం పీడించి చంపుతున్నాడు. ఇప్పుడు పుణ్యాత్ముడైన ఆ ఫకీర్‌ని ఛీత్కరించాడు. ఈ పాపాల కారణంగానే, తాను తినబోతున్న ఆహారం పచ్చి నెత్తురుగా మారిపోయింది". - ఈవిధంగా ఆలోచించిన తరువాత హబీబ్‌లో విపరీతమైన మార్పు వచ్చింది. ఇకపై వడ్డీ వ్యాపారం చెయ్యకూడదని ఆ క్షణంలో నిర్ణయం తీసుకున్నాడు. ఆ మర్నాడే శుక్రవారం వచ్చింది. అతడు బస్రా నగరంలోని ఒక వీధి గుండా నడుస్తూ వెళు తున్నాడు. ఆ సమయంలో అతడికి కొందరు పిల్లలు రోడ్డు ప్రక్కన ఏదో ఆట ఆడుకుంటూ కనిపించారు. అలా ఆడుకుంటున్న పిల్లల్లో ఒకడు తమ ప్రక్క నుండి వెళుతున్న హబీబ్‌ని చూసి అసహ్యంతో నిండిన స్వరంతో "మిత్రులారా! మనం వెంటనే ఇక్కడ నుండి వెళ్ళిపోదాం. లేకపోతే, ఈ వడ్డీ వ్యాపారి నడిచి వెళుతున్నప్పుడు అతడి కాళ్ళక్రింద నలిగిన దుమ్ము రేగి మనమీద పడుతుంది. అలా పడితే మనం దైవంచేత, అతడిలాగానే శపించబడతాం" అన్నాడు.

ఆ బాలుడు అన్న మాటలు హబీబ్ హృదయాన్ని బలంగా తాకాయి. "తాను ఇంతకాలంగా చేస్తున్న దారుణమైన వడ్డీవ్యాపారంవల్ల, తాను అంతులేని పాపాన్ని మూట కట్టుకున్నానని, అంతిమ తీర్పు (ఖయామత్) సమయంలో ఆ అల్లా, తనని

నరకంలోకి నెట్టివేస్తాడని" – హబీబ్‌కి మనసులో బలంగా అనిపించింది. దాంతో అతడు విపరీతమైన భయానికి గురై అక్కడే మూర్ఛపోయి నేలమీద పడిపోయాడు. ఆ తరువాత కొంతసేపటికి మూర్ఛ నుండి తేరుకుని లేచి నిలబడ్డాడు. అదే సమయానికి అక్కడికి ఒక సూఫీ మత గురువు వచ్చాడు. అంతేకాదు, అనేకమంది బస్రా పౌరులు అక్కడ గుమిగూడారు. వాళ్ళందరినీ గమనించిన హబీబ్, వణుకుతున్న స్వరంతో వాళ్ళతో "నా ప్రియమైన సోదరులారా! ఇన్నాళ్ళు నేను ధర్మాన్ని మర్చిపోయి అక్రమంగా వడ్డీ వ్యాపారం చేసాను. ప్రజల రక్తాన్ని వడ్డీల రూపంలో పిండుకుని అపారమైన సంపదను కూడపెట్టాను. మీరందరూ నన్ను క్షమించండి" అన్నాడు.

ఆ తరువాత హబీబ్ తన శక్తికొద్దీ ప్రజలకు ఆర్ధికంగా, శారీరకంగా సహాయాలు చెయ్యటం ప్రారంభించాడు. కొంతకాలం గడిచింది. ఒకరోజు ఉదయం హబీబ్ ఒక వీధిలో నడుస్తూ వెళుతున్నాడు. అక్కడ గతంలో కనిపించిన పిల్లలు ఆడుకుంటూ ఉన్నారు. హబీబ్ తమకి దగ్గరలోకి రాగానే ఆ పిల్లల్లో ఒకడు పెద్ద స్వరంతో తన మిత్రులతో ఇలా అన్నాడు. "అదిగో హబీబ్, మన ప్రక్క నుండే వెళుతున్నాడు. మనం అతడి మార్గానికి అడ్డుగా నిలబడి ఆడకూడదు. మనం అలా ఆడినట్లయితే మన పాదధూళి, పవిత్రుడిగా మారిన హబీబ్‌పై పడుతుంది. అలా పడితే మనకి పాపం సంక్రమిస్తుంది". తాను చేసిన పాపాలకు పశ్చాత్తాపపడి, ఆపై 'అల్లా' చూపిన ధర్మ మార్గంలోకి ప్రవేశించిన వెంటనే ప్రజలందరూ తనని గౌరవిస్తున్నారు. గతంలో తనని 'పాపాత్ముడిగా' గుర్తించిన ఆ పిల్లలు కూడా ఇప్పుడు తనని "పుణ్యాత్ముడిగా" భావిస్తున్నారు. ఇదంతా ఆ అల్లా దయ. – ఈవిధంగా హబీబ్ ఎంతో సంతోషించాడు. ఆ తరువాత, హబీబ్ అప్పటి దాకా తన దగ్గర వడ్డీకి తీసుకున్న వ్యక్తులయొక్క అసలు మరియు వడ్డీని రద్దుచేసాడు. ఆ తరువాత అతడు అప్పటిదాకా సంపాదించిన కోట్లాది దినారాల సంపదను బస్రా నగరంలో అవసరంలో ఉన్న ప్రజలందరికీ దానం చేసాడు. తన దగ్గర ఒక్క దినారం కూడా లేకుండా తన సంపద మొత్తాన్ని ప్రజలకు కానుకగా ఇచ్చేసాడు. ఆ తరువాత అక్కడికి దగ్గరలో ఉన్న 'యూఫ్రటీస్' నదీ తీరంలో ఒక చిన్న ఆశ్రమాన్ని నిర్మించుకున్నాడు. ఆపై తన భార్యతో కలిసి ఆ ఆశ్రమంలోనే నివసించటం ప్రారంభించాడు.

కొత్త నివాసానికి మారిన హబీబ్, ప్రతిరోజూ ఉదయం నుండి రాత్రి దాకా నిరంతరమూ "అల్లా" నామాన్ని జపిస్తూ కాలం గడపసాగాడు. ఆ కాలంలో మొత్తం ఇరాక్ దేశంలోనే గొప్ప సూఫీ గురువుగా మరియు అనేక ఆధ్యాత్మిక గ్రంథాల

రచయితగా పేరుపొందిన హసన్ బస్రీ, తానే స్వయంగా హబీబ్ నివసిస్తున్న ఆశ్రమం దగ్గరకు వచ్చాడు. హబీబ్‌కి సూఫీమత దీక్షను ఇవ్వాలని నిర్ణయించుకున్నాడు. హబీబ్‌కి ఆ సూఫీ గురువు దీక్ష ఇవ్వబోతున్న సమయంలో – ఖురాన్‌లోని కొన్ని మొదటి వాక్యాలను హబీబ్‌కి చెప్పి, వాటిని పెద్ద స్వరంతో ఉచ్ఛరించమని అతనిని అడిగాడు. అయితే, హబీబ్ ఆ పదాలను సరిగా ఉచ్ఛరించలేకపోయాడు. ఆపై హసన్‌బస్రీ అక్కడ నుండి నిశ్శబ్దంగా వెళ్ళిపోయాడు. కొద్ది నిమిషాల తరువాత హబీబ్ భార్య ఆశ్రమంలో నుండి బైటకువచ్చి – ఆశ్రమంబైట చెట్టు క్రింద కూర్చుని ఉన్న హబీబ్ దగ్గరకు వచ్చి అతడితో ఇలా అన్నది. “నీవు మొత్తం డబ్బు దానం చెయ్యకుండా కొంచెం అయినా ఉంచుకుంటే బాగుండేది. ఇప్పుడు మనకి తినటానికి తిండిలేదు. కట్టుకోవటానికి బట్టలేదు”. అయితే హబీబ్, ఆమె మాటల్ని ఏమాత్రం పట్టించుకోకుండా రెండు చేతులూ పైకెత్తి ఆకాశంలోకి చూస్తూ “అల్లా ఏది నిర్ణయిస్తే అది జరుగుతుంది” అని చెప్పి, ఆపై అక్కడ నుండి లేచి ఆ నది గట్టుమీద ముందుకు నడుచుకుంటూ వెళ్ళాడు. అతడి భార్య ఏం మాట్లాడాలో? అర్థంకాక, అలా నడుచుకుంటూ వెళ్ళిపోతున్న తన భర్తకేసి కళ్ళుఅప్పగించి చూస్తూ ఉండిపోయింది. అలా వెళ్ళిపోయిన హబీబ్, సాయంత్ర సమయంలో తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. అప్పుడు అతని భార్య విచిత్రమైన స్వరంతో “ఇప్పటిదాకా ఎక్కడ తిరిగి వస్తున్నావు?” అన్నది. అప్పుడు హబీబ్ “నేను ఉద్యోగం చేసి వస్తున్నాను” అన్నాడు. అప్పుడు అతని భార్య అతడివైపు ఆశ్చర్యంగా చూసి “మరి, ఈ రోజు జీతం డబ్బులు తెచ్చావా?” అన్నది. అప్పుడు హబీబ్ చిన్నగా నవ్వి “మా యజమాని చాలా దయామయుడు. నేను పది రోజులు చేసిన తరువాత పదకొండవ రోజున నాకు జీతం ఇస్తానని చెప్పాడు” అన్నాడు.

ఆ మర్నాటి నుండి హబీబ్, ప్రతిరోజూ ఉదయం – ఆశ్రమం నుండి వెళ్ళిపోయి మళ్ళీ సాయంత్రానికి తిరిగి వస్తూ ఉండేవాడు. అలా పది రోజులు గడిచాయి. పదకొండవ రోజుకూడా వచ్చింది. హబీబ్, సాయంత్రం దాకా నదీతీరంలో ఒకచోట కూర్చుని దైవ ధ్యానం చేస్తూ కాలం గడిపాడు. సాయంత్రం అయిన తరువాత తన ఆశ్రమానికి బయలుదేరాడు. మార్గ మధ్యంలో హబీబ్ తనలో తాను ఇలా అనుకున్నాడు. “ఇవాళ పదకొండవరోజు. ఈ రోజు నాకు జీతం వస్తుందని నా భార్యతో చెప్పాను. ఆ జీతం వస్తే ఆహారం కొనుక్కుని తినవచ్చని ఆమె ఎంతగానో ఆశపడుతున్నది. ఇప్పుడు, నేను డబ్బులు లేకుండా ఇంటికివెళితే ఆమె ఏమంటుందో?”. ఈవిధంగా మనసులో అనుకుంటూ హబీబ్ ఆ నదీ తీరం వెంట నడుస్తూ వెళు తున్నాడు. సరిగ్గా అదే సమయంలో, నలుగురు వ్యక్తులు, హబీబ్ ఆశ్రమం దగ్గరకు

వెళ్ళారు. వాళ్ళను చూసి హబీబ్ భార్య "ఎవరు మీరు?" అని అడిగింది. అప్పుడు వాళ్ళు, తాము తెచ్చిన వస్తువుల్ని ఆమె ముందుపెట్టి ఆపై ఆమెతో ఇలా అన్నారు. "ఇదిగో మీ ఇద్దరికోసం ఒక బస్తా గోధుమ పిండి, ఒక గొర్రెని, ఒక జాడీడు తేనెని, వండుకోవటానికి నూనెని తీసుకువచ్చాం. నీ భర్త మా యజమాని దగ్గర పది రోజులుగా ఉద్యోగం చేస్తున్నాడు. అతనికి ఇవ్వాల్సిన జీతం క్రింద ఇవన్నీ మీకు ఆయన మాచేత పంపించాడు".

ఇంతలో ఆ నలుగురిలో ఒకవ్యక్తి, ఆమె దగ్గరకువచ్చి, ఆమె చేతికి ఒక చిన్న సంచిని ఇచ్చి ఆమెతో ఇలా అన్నాడు. "నీ భర్త చేసిన పనికి జీతంగా ఈ బంగారు నాణాలు మీకు ఇచ్చి రమ్మని మా యజమాని నన్ను పంపించాడు". ఆ తరువాత వాళ్ళు నలుగురూ అక్కడ నుండి వెళ్ళబోయేముందు వాళ్ళలో ఒకడు ఆమెతో ఇలా అన్నాడు. "నీ భర్త కాసేపట్లో ఇక్కడకు వస్తాడు. అతడిని ఉద్యోగం శ్రద్ధగా చేసుకోమని చెప్పు. మేము ఇలాగే కొద్ది రోజులకు ఒకసారి వచ్చి అతడి జీతాన్ని నీకు అందిస్తాం". ఈవిధంగా చెప్పి వాళ్ళు, అక్కడ నుండి వేగంగా నడుస్తూ వెళ్ళి పోయారు. వాళ్ళు వెళ్ళిన అరగంటకి హబీబ్ ఎంతో దిగులుతో మరియు ఆందోళనతో ఆశ్రమంలోకి ప్రవేశించాడు. అక్కడ – అతడికి సువాసనలు వెదజల్లుతూ ఉడుకుతున్న మాంసం కూర కనిపించింది. అది ఎక్కడ నుండి వచ్చిందా? అని హబీబ్ ఆశ్చర్యంతో చూస్తూ ఉండగా అతని భార్య అతడి దగ్గరకువచ్చి ఆపై ఆనందం తాండవిస్తున్న స్వరంతో అతడితో ఇలా అన్నది. "ఓ హబీబ్! నీ యజమాని చాలా దయామయుడు. ఇదిగో ఇక్కడ కనిపిస్తున్న వస్తువులన్నీ ఆయనే పంపించాడు. ఇక, నాకు దిగులు లేదు. నువ్వు శ్రద్ధగా నీ ఉద్యోగం చేసుకో. ఆయన ఇలాగే ఎప్పుడూ మనకి అన్నీ పంపిస్తూ ఉంటాడు". భార్య అన్నమాట వినగానే "ఈ వస్తువులన్నీ తన నిజమైన యజమాని అయిన అల్లా పంపించాడని" హబీబ్‌కి స్పష్టంగా అర్థమయ్యింది. ఆ క్షణంలో ఆయన, అల్లాకు సంపూర్ణమైన దాసుడిగా మారిపోయాడు. ఆపై ఆయన తనలో ఇలా నిర్ణయించు కున్నాడు. "ఈ క్షణం నుండి నేను ఇహలోక బంధాలను, ఆశలను సంపూర్తిగా త్యజిస్తాను. అల్లాలో జీవిస్తాను".

**హబీబ్‌కి సూఫీ మత దీక్ష ఇచ్చిన హసన్‌బస్రీ :**

హసన్‌బస్రీ, ఇస్లాం మతంలో భాగమైన సున్నీ తెగకు ఆద్యుడిగా చెబుతారు. ఈయన గొప్ప సూఫీయోగి, విజ్ఞాని, న్యాయవేత్త మరియు తంత్రజ్ఞాని. అంతేకాకుండా, సూఫీ మతానికి సంబంధించిన అనేక అమూల్యమైన గ్రంధాలను ఈయన రచించాడు.

హబీబ్‌కి సూఫీ మత దీక్షను ఇచ్చింది హసన్‌బస్రీ అని చెబుతారు. ఆ కారణంగానే హబీబ్, హసన్‌బస్రీని తన గురువుగా భావించాడు.

హబీబ్, జాతి రీత్యా పెర్షియాకి (ఇరాన్) చెందినవాడు. అందువలన, ఆయనకి పెర్షియన్ భాష మాత్రమే వస్తుంది. అయితే, ఖురాన్ గ్రంథం 'అరబిక్' భాషలో ఉంటుంది. ఆ భాష సరిగా రాని కారణంగా హబీబ్ – అరబిక్ భాషను తప్పులతో మాట్లాడేవాడు. అలాగే, ఖురాన్‌ని సరిగా ఉచ్ఛరించలేకపోయేవాడు. ఆనాటి అరబిక్ ప్రజలు ముఖ్యంగా, ఇరాక్ ప్రజలు, ఇరాన్‌కి చెందిన పెర్షియన్ భాషను "అనాగరిక భాష" అని మరియు పెర్షియన్ జాతి వారిని "అనాగరికులు" అని పిలిచేవారు. ఏదిఏమైనా, హబీబ్ – ఖురాన్‌ని సరిగా చదవలేకపోయిన కారణంగా అతని గురువైన హసన్‌బస్రీతో సహా అనేకమంది బస్రా నగర ప్రజలు హబీబ్‌ని "అజామి" అనగా 'అనాగరికుడు' అని పిలవటం జరిగింది.

కాలం గడుస్తున్నది. ఒకరోజు ఉదయం హసన్‌బస్రీ, హబీబ్ ఆశ్రమానికి వచ్చాడు. అప్పుడు హబీబ్ తన దగ్గర ఉన్న రెండు బార్లి ఆకులను మరియు కొంచెం ఉప్పుని హసన్‌బస్రీ ముందు ఉంచాడు. అప్పుడు హసన్‌బస్రీ ఆ ఆకులను తినటానికి తన కుడిచేయిని ముందుకు చాపాడు. సరిగ్గా అదే సమయంలో ఆ ఆశ్రమం బైట ఒక ఫకీర్ వచ్చి నిలబడి, ఆపై పెద్ద స్వరంతో "దయచేసి నాకు ఏదైనా ఆహారం దానం చెయ్యి" అన్నాడు. వెంటనే హబీబ్, అంతకుముందు తాను హసన్‌బస్రీ ముందు ఉంచిన బార్లి ఆకులను తీసుకువెళ్లి, బైట నిలబడి ఉన్న ఫకీర్ చేతిలో పెట్టాడు. అది చూసి హసన్‌బస్రీ కొంచెం కోపం నిండిన స్వరంతో హబీబ్‌తో ఇలా అన్నాడు. "హబీబ్ నువ్వు చాలా మంచివాడివి. కానీ, నువ్వు కనీస మర్యాదను మరియు అతిథి ధర్మాన్ని ఎలా మర్చిపోయావు?, నాకు ఆహారంగా ఇచ్చిన బార్లి ఆకులను తీసుకువెళ్ళి బైట ఉన్న ఫకీరుకి ఎలా ఇచ్చావు?, అతిథికి పెట్టిన ఆహారాన్ని వెనక్కి తీసుకోకూడదు అన్న విషయం ఎలా మర్చిపోయావు?. నీ ఇంటికి భిక్షకు వచ్చిన ఫకీర్‌కి ఆహారం ఇచ్చావు. కానీ, నీ ఇంటికి అతిథిగా వచ్చిన నన్ను పట్టించుకోలేదు".

హసన్‌బస్రీ అన్న మాటకు హబీబ్ సమాధానం చెప్పకుండా మౌనం వహించాడు. ఇంతలో బైట నుండి ఎవరో ఒక వ్యక్తి, ఒక పెద్ద పళ్ళాన్ని నెత్తిమీద మోసుకుంటూ ఆశ్రమంలోకి వచ్చాడు. ఆ పళ్ళెంలో గొర్రెపిల్ల మాంసంతోచేసిన వేపుడు, అనేక రకాల తీపి పదార్థాలు మరియు ఒక చిన్న మూటలో బంగారు నాణాలు కనిపించాయి. ఆ వ్యక్తి ఆ పళ్ళాన్ని హబీబ్ ముందు ఉంచి, ఆపై హబీబ్‌తో మృదువైన స్వరంతో

"అయ్యా! మా యజమాని వీటిని నీకు ఇచ్చి రమ్మని నన్ను పంపించాడు" అని చెప్పాడు. ఆపై, హసన్‌బస్రీ మరియు హబీబ్‌లు ఆ మధుర పదార్ధాలతో సంతృప్తిగా భోజనం చేసారు. భోజనం పూర్తి అయిన తరువాత ఆశ్రమం బైటకు వచ్చిన హబీబ్‌కి అటువైపుగా వెళుతున్న కొందరు ఫకీర్లు కనిపించారు. అప్పుడు హబీబ్ వాళ్ళని తన దగ్గరకు పిలిచి, తన దగ్గర మిగిలిన ఆహార పదార్ధాలను మరియు బంగారు నాణాలను ఆ ఫకీర్లకు ఇచ్చాడు. ఇంతలో హసన్‌బస్రీ కూడా ఆశ్రమంలోంచి బైటకు వచ్చాడు. అప్పుడు హబీబ్ చిరునవ్వుతో హసన్‌బస్రీ చూస్తూ ఇలా అన్నాడు. "ఓ గురుదేవా! నువ్వు చాలా మంచి వాడివి. నేను, ఇందాక నీవు తినబోతున్న బార్లీ ఆకులను ఒక ఫకీరుకి ఇచ్చినప్పుడు నీవు నామీద కోపగించావు. కానీ, నువ్వు నీ మంచితనానికి తగ్గట్లుగా, నువ్వు – నేను చేసిన ఆ చిన్న దానానికి సంతోషించి ఉంటే నీ గొప్పతనం మరింతగా పెరిగి ఉండేది". ఆ తరువాత కొంతకాలానికి హసన్‌బస్రీ, ఒకరోజు సాయంత్రం హబీబ్ ఆశ్రమం దగ్గరకు వచ్చాడు. సరిగ్గా, అదే సమయంలో హబీబ్ తన సాయంత్రం ప్రార్ధనను ప్రారంభించబోతున్నాడు. ఆ సందర్భంలో హబీబ్ 'అల్‌హమ్ద్" అని పలకటానికి బదులుగా 'అల్‌హెమ్ద్' అని అన్నాడు. అతడు అలా అనటం విన్న హసన్‌బస్రీ తన మనసులో ఇలా అనుకున్నాడు. "ఈ హబీబ్‌కి ఖురాన్‌లో పదాలు సరిగ్గా పలకటం కూడా రాదు. ఇలాంటి వాడితో కలిసి ప్రార్ధనలు చెయ్యాలనుకోవటం నా మూర్ఖత్వం. నేను ఇంకొక ప్రక్కన కూర్చుని నా ప్రార్ధన నేను వేరుగా చేసుకుంటాను". ఆ రోజు రాత్రి హసన్‌బస్రీకి స్వప్నంలో సర్వశక్తివంతుడైన అల్లా కనిపించి అతడితో ఇలా అన్నాడు. "ఓ హసన్! నీవు హబీబ్, ఖురాన్‌లోని పదాలను సరిగా ఉచ్ఛరించలేక పోతున్నాడని అతడిని నీ మనసులో తక్కువగా చూస్తున్నావు. కానీ, హబీబ్ నాలుక ఆ పదాలను సరిగా పలకలేకపోవచ్చేమో గాని, అతని మనసు చాలా సరిగ్గా ఆపదాలను ఉచ్ఛరిస్తున్నది. స్వచ్ఛమైన మనసుతో చేసే ప్రార్ధనలు, వ్యాకరణ దోషాలతో ఉన్నా, పద సంబంధ దోషాలతో ఉన్నా నేను పట్టించుకోను. నాకు నా భక్తుడి యొక్క మనసు మాత్రమే ముఖ్యం". సాక్షాత్తు అల్లా, స్వప్నంలో హబీబ్ గురించి అలా చెప్పే సరికి హసన్‌బస్రీకి హబీబ్ ఎంత గొప్పదైవ భక్తుడో స్పష్టంగా అర్ధమైపోయింది.

ఆ కాలంలో ఇరాక్‌ని యూసఫ్ అనే అతి దుర్మార్గుడైన గవర్నర్ పరిపాలిస్తూ ఉండేవాడు. ఒక సమయంలో హసన్‌బస్రీని ఆ గవర్నర్ తాలీకు సైనికులు పట్టుకుని బంధించాలని ప్రయత్నించారు. అయితే, హసన్‌బస్రీ ఎలాగో ఆ సైనికుల బారి నుండి తప్పించుకుని హబీబ్ ఆశ్రమానికి చేరుకున్నాడు. ఆపై, హబీబ్ ఆశ్రమంలో

ఒకమూల దాక్కున్నాడు ఇంతలో, ఆ సైనికులు హసన్‌ని వెతుక్కుంటూ ఆ ఆశ్రమం దగ్గరకు వచ్చారు. ఆపై, వాళ్ళు హబీబ్‌ని ఇలా అడిగారు. "హసన్‌బస్రీ ఇటువైపుగా ఏమన్నా వచ్చాడా?". అప్పుడు హబీబ్ చిన్న స్వరంతో వాళ్ళతో ఇలా అన్నాడు. "హసన్‌బస్రీ ప్రస్తుతం నా ఆశ్రమంలో ఆ మూల దాక్కుని ఉన్నాడు".

ఆపై, వాళ్ళు హసన్‌బస్రీ కోసం ఆశ్రమం లోపలికివెళ్ళి వెతికారు. అక్కడ ఎవరూ లేరు. ఆపై, వాళ్ళు హబీబ్ దగ్గరకు వచ్చి కోపంతో కూడిన స్వరంతో అతడితో ఇలా అన్నారు. "హబీబ్! మన గవర్నర్ అయిన యూసఫ్‌కి వ్యతిరేకి అయిన హసన్‌బస్రీని దాచి పెట్టావు. ఇందుకు తగిన ఫలితం నీవు త్వరలో అనుభవిస్తావు. లోపల హసన్‌బస్రీ ఉన్నాడు అన్నావు. కానీ, అతను అక్కడ లేడు". వాళ్ళు అన్న మాటలు విన్న హబీబ్ చిన్నగా నవ్వి ఆపై ప్రశాంతమైన స్వరంతో వాళ్ళతో ఇలా అన్నాడు. "నేను ఇప్పటికీ అదే మాట అంటున్నాను. హసన్‌బస్రీ ఆశ్రమం లోపలే ఉన్నాడు. కానీ, అతడు మీకు కనపడటంలేదు. అందుకు నేనేం చెయ్యగలను?".

దాంతో వాళ్ళు మళ్ళీ ఆశ్రమంలోకి వెళ్ళి బాగా వెతికారు. అక్కడ హసన్‌బస్రీ కనపడలేదు. దాంతో వాళ్ళు చేసేది లేక అక్కడ నుండి వెళ్ళిపోయారు. కొద్ది నిమిషాల తరువాత హసన్‌బస్రీ, తాను దాక్కున్న ప్రదేశం నుండి బైటకువచ్చి హబీబ్‌తో "హబీబ్! నేను నీ ఆశ్రమంలోపల దాగి ఉన్నానని ఆ సైనికులకు చెప్పావు. నీ గురువైన నాకు నీవు చెల్లించే గురు దక్షిణ ఇదేనా?" అన్నాడు. అప్పుడు హబీబ్ చిన్నగా నవ్వి హసన్‌బస్రీతో ఇలా అన్నాడు. "ఓ గురుదేవా! నీవు ఆశ్రమం లోపల లేవు అని నేను ఆ సైనికులకు చెప్పి ఉంటే మనమిద్దరం పట్టుపడేవాళ్ళం. నేను నిజం చెప్పటం వల్ల మాత్రమే, నీవు ఆ సైనికుల బారి నుండి తప్పించుకున్నావు". హబీబ్ మాటలు హసన్‌బస్రీకి ఏమాత్రం అర్థంకాలేదు. తనకి, అతని మాటలు అర్థంకాని విషయం అతడితోనే చెప్పాడు. అప్పుడు హబీబ్ ఇలా అన్నాడు. "ఓ గురుదేవా! నీవు లోపల దాక్కున్న సత్యాన్ని, నేను ఆ సైనికులకు చెప్పిన మాట వాస్తవమే. కానీ, నేను నా మనసులో 'నిన్ను రక్షించమని ఆ అల్లాను అనేకసార్లు వేడుకున్నాను. అల్లా దయవల్ల నీవు వాళ్ళకు కనపడలేదు. ఫలితంగా, నీవు వాళ్ళ నుండి తప్పించుకోగలిగావు. నేను అబద్ధం ఆడి ఉంటే అనగా అల్లా మార్గాన్ని తప్పి ఉంటే నిన్ను అల్లా రక్షించేవాడు కాదు. నేను నిజం చెప్పటం వల్ల, నేను ధర్మాన్ని పాటించినవాడిని అయ్యాను. అందువల్ల అల్లా నామీద దయతో నిన్ను, వాళ్ళబారి నుండి కాపాడాడు".

హబీబ్ అన్న మాటల్లోని వాస్తవాన్ని గుర్తించిన హసన్‌బస్రీ ఎంతో ఆశ్చర్యానికి గురై ఆపై హబీబ్‌తో ఇలా అన్నాడు. “హబీబ్ నువ్వు ఏవిధమైన సాధనలుచేసి - అల్లాను ఏదైనా సరే కోరుకోగల శక్తిని పొందావో దయచేసి నాకు చెప్పు”. అప్పుడు హబీబ్ చిన్నగా నవ్వి “గురుదేవా! నీవు తెల్ల కాగితాలను నల్లగా మారుస్తూ ఉన్న సమయంలో (అనగా ఆధ్యాత్మిక గ్రంధాలను వ్రాస్తున్న సమయంలో), నేను నా హృదయాన్ని దైవ ప్రార్ధనలతో శుద్ధి చేసుకోవటానికి ప్రయత్నిస్తూ ఉంటాను. అందువల్లే నేను ఏ సహాయం అడిగినా ఆ అల్లా తక్షణమే నాకు ఆ సహాయం చేస్తున్నాడు”. హబీబ్ అన్న మాటలు విన్న హసన్‌బస్రీ ఒక్కక్షణం నిర్ఘాంతపోయాడు. ఆపై దిగులు ధ్వనిస్తున్న స్వరంతో ఇలా అన్నాడు. “హబీబ్! నేను వ్రాస్తున్న ఆధ్యాత్మిక గ్రంధాలు ఇతరులలో దైవజ్ఞానాన్ని పెంచుతున్నాయి. కానీ, ఆ గ్రంధాలు నాకు ప్రఖ్యాతిని ఇస్తున్నాయి గాని, దైవానుగ్రహాన్ని ఇవ్వటంలేదు. ఇందుకు కారణం ఏమిటి?”. తన గురువైన హసన్‌బస్రీ ఆవిధంగా బాధపడటం చూసిన హబీబ్, దయతో చలించి పోయాడు. ఆపై హబీబ్, హసన్‌బస్రీతో ఇలా అన్నాడు. “ఓ గురుదేవా! అల్లా దృష్టిలో గొప్పవాళ్ళు, తక్కువవాళ్ళు అన్న భేద భావం ఉండదు. నీవు, అల్లాను సంపూర్ణ ఏకాగ్రతతో ధ్యానించటం కన్నా, ఆయన యొక్క గొప్పతనాన్ని ప్రజలలో ప్రచారం చెయ్యటానికి ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నావు. అందువల్లే ఆయన అనుగ్రహం నీకు సంపూర్తిగా లభించలేదు”.

అల్లాకు అతి ప్రియమైన భక్తుడిగా జీవించిన హబీబ్‌ని అతని కాలంనాటి మత పెద్దలు “హబీబ్ అజామి” అనే పేరుతో పిలిచేవారు. “అజామి” అనగా అనాగరికుడు లేదా సరిగా మాట్లాడలేనివాడు అని అర్ధం. ఖురాన్‌లోని పదాలను సరిగా ఉచ్ఛరించలేని కారణంగా హబీబ్‌ని “హబీబ్ అజామి” అని పిలిచారు. ఈ విషయం బాగా తెలిసి ఉన్న హబీబ్, తాను ప్రతిరోజూ ప్రార్ధన చేసేటప్పుడు బాగా రోదించి ఆపై “అయ్యో! నేను, పవిత్రమైన ఖురాన్‌ని సరిగ్గా చదవలేకపోతున్నానే” అని బాధపడుతూ ఉండేవాడు. అలాంటి సమయంలో ఒకసారి ఒక మత పండితుడు హబీబ్ దగ్గరకు వచ్చి “హబీబ్! ఖురాన్ గ్రంధం అరబ్బీ భాషలో ఉంటుంది. కానీ నీకు అరబ్బీ భాష సరిగా రాదు. అలాగే అనాగరికులకు కూడా అరబ్బీ భాష రాదు. అందువల్ల నీవుకూడా “అనాగరికుడివి (అజామివి)” అన్నాడు. అప్పుడు హబీబ్ చిన్నగా నవ్వి “అయ్యా! నీవు చెప్పినది నిజమే. కానీ, నా నాలుక మాత్రమే “అజామి”

అనగా అనాగరికమైనది. కానీ, నా హృదయం మాత్రం అరబ్బీ జాతికి చెందినది" అన్నాడు.

హబీబ్ తన ఆశ్రమంలో ఆధ్యాత్మిక సాధనలు చేస్తున్న సమయంలో ఆయన యొక్క కీర్తి ప్రతిష్టలు ఆనాటి ఇరాక్ దేశం అంతా వ్యాపించాయి. అలాంటి సమయంలో ఒకరోజున ఒక వృద్ధురాలు, హబీబ్ దగ్గరకు వచ్చి ఆపై పెద్దగా ఏడుస్తూ ఆయన పాదాలపై పడింది. హబీబ్ ఎంతో దయతో ఆ వృద్ధురాలిని తన రెండు చేతులతో లేపి నుంచోపెట్టాడు. అప్పుడు ఆమె అతి కష్టంమీద తన దు:ఖాన్ని నియంత్రించుకుని ఆపై గద్గ స్వరంతో "అయ్యా! నా కుమారుడు చాలాకాలం క్రితం నన్ను వదిలిపెట్టి వెళ్ళిపోయాడు. నేను ఇప్పుడు నిస్సహాయురాలైన వృద్ధురాలిగా ఉన్నాను. నీవు, దైవాన్ని ప్రార్ధించి ఎలాగైనా సరే నా బిడ్డ నా దగ్గరకు వచ్చేలా చేయాలి" అన్నది. అప్పుడు హబీబ్ చిన్నగా నవ్వి ఆమెతో ఇలా అన్నాడు. "నీ దగ్గర ఏమైనా డబ్బు ఉన్నదా?"

అప్పుడు ఆమె "ఆ! నా దగ్గర రెండు దినారాలు ఉన్నాయి" అన్నది. అప్పుడు హబీబ్ మృదువైన స్వరంతో "నీ దగ్గర ఉన్న ఆ సొమ్మును వెంటనే పేదలకు దానం చెయ్యి" అన్నాడు. ఆమె, కొద్దిసేపట్లోనే ఆ సొమ్ముని కొంతమంది భిక్షగాళ్ళకు మరియు ఫకీర్లకు దానం చేసింది. అది గమనించిన హబీబ్, ఆమెతో ఇలా అన్నాడు. "నీవు వెంటనే నీ ఇంటికివెళ్ళు. నేను, ఇక్కడ నీకోసం అల్లాను ప్రార్ధిస్తాను. నీవు ఇంటికివెళ్ళేసరికి నీ కొడుకు నీ ఇంట్లో కనిపిస్తాడు". ఆపై, ఆ వృద్ధురాలు ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా హబీబ్ దగ్గర సెలవు తీసుకుని, ఆపై తన శక్తికొద్ది నడుస్తూ కొద్దిసేపట్లోనే తన ఇంటికి చేరుకున్నారు. ఆశ్చర్యం! ఆమె ఇంటికివెళ్ళే సరికి ఆమె కుమారుడు లోపల ఒక బల్లమీద కూర్చుని ఉన్నాడు. అతడిని చూసి ఆశ్చర్యపోయిన ఆ వృద్ధురాలు అతడితో ఇలా అన్నది. "ఇన్నేళ్ళ నుంచి నీవు నాకు దూరంగా ఎక్కడో ఉన్నావు. ఇప్పుడు హఠాత్తుగా ఇక్కడికి ఎలా వచ్చావు?".

అప్పుడు ఆ యువకుడు ఆ వృద్ధురాలితో ఇలా అన్నాడు. "నేను ఇన్నేళ్ళుగా కిర్మాన్ అనే పట్టణంలో ఒక సూఫీ గురువు దగ్గర విద్య నేర్చుకుంటున్నాను. కొద్దిసేపటి క్రితం ఆయన, కొంచెం మాంసం కొనుక్కు రమ్మని నన్ను బజారుకి పంపించాడు. ఆ సమయంలో ఒక సుడిగాలి నావైపుకి వీచి నాతో ఇలా చెప్పింది. నీవు వెంటనే నీ తల్లి దగ్గరకు వెళ్ళాల్సి ఉన్నది. హబీబ్ చేసిన ప్రార్ధన ఫలితంగా నీవు నీ తల్లి దగ్గరకు

వెళ్ళబోతున్నావు. ఆ తరువాత ఏం జరుగుతున్నదో అర్థం చేసుకునే లోగానే ఆ సుడిగాలి, నన్ను గిర గిరా తిప్పి నిమిషాలలో ఇక్కడకు తీసుకువచ్చి దింపింది". హబీబ్ యొక్క వాక్సుద్ధి ఎంత గొప్పదో ఆ క్షణంలో ఆ వృద్ధురాలికి స్పష్టంగా అర్థమయ్యింది.

ఒక సమయంలో బస్రా నగరంలో విపరీతమైన కరువు ఏర్పడింది. ఆ సమయంలో హబీబ్ తనకు తెలిసిన ఒక దుకాణదారు వద్ద ఆహార పదార్థాలను అప్పుగా తీసుకుని, ఆపై వాటిని ఆకలితో అలమటిస్తున్న పేదలకు దానం చేస్తూ ఉండేవాడు. ఇలా కొద్ది రోజులు గడిచాక ఆ దుకాణుదారు తన రుణం వసూలుకోసం హబీబ్ ఆశ్రమానికి వచ్చేవాడు. అప్పుడు హబీబ్ తన తలగడ క్రింద ఉన్న ఒక చిన్న ఖాళీ సంచిని తీసి ఆ దుకాణుదారు చేతిలో ఉంచేవాడు. ఏమాత్రం బరువుగా లేని ఆ సంచిలో ఏమీ ఉండవని భావించిన ఆ దుకాణుదారు ఆ సంచి విప్పి చూడగా లోపల అతడి ఋణానికి సరిపడా బంగారు నాణాలు ఉండేవి. దాంతో ఆ దుకాణుదారు, హబీబ్‌కి చిరునవ్వుతో నమస్కరించి, ఆపై ఆ నాణాల సంచితో తన దుకాణం దగ్గరకు వెళ్ళిపోయేవాడు.

బస్రా నగరంలో మూడు రోడ్లు కలిసే ప్రాంతంలో హబీబ్‌కి ఒక చిన్న గృహం ఉండేది అతడి దగ్గర గొర్రె బొచ్చుతో చేసిన ఒక కోటు ఉండేది. అతడు ఎండాకాలం మరియు చలికాలం సమయాలలో ఆ కోటుని ధరించేవాడు. అలా చాలాకాలంపాటు ధరించటంవల్ల ఆ కోటు మురికిగా మారింది. దానిని శుభ్రం చెయ్యాలని నిర్ణయించుకున్న హబీబ్, దానిని తన ఇంటి కిటికీలోంచి రోడ్డుమీదకి విసరివేసాడు. సరిగ్గా అదే సమయంలో హబీబ్ ఇంటికి వస్తున్న అతని గురువైన హసన్‌బస్రీకి రోడ్డుమీద పడి ఉన్న హబీబ్ యొక్క కోటు కనిపించింది. దానిని చూసి గుర్తుపట్టిన హసన్‌బస్రీ, తనలోతాను ఇలా అనుకున్నాడు. "ఈ అజామి (అనాగరికుడు) విలువైన తన కోటుని ఇలా రోడ్డుమీదకి విసరివేసాడు. ఇది ఇక్కడే పడి ఉంటే ఎవరో ఒకరు దీనిని తప్పనిసరిగా ఎత్తుకుపోతారు. ఇతడికి ఈ కోటు విలువ తెలిసినట్లు లేదు". ఈవిధంగా ఆలోచించిన హసన్‌బస్రీ, అటు, ఇటు వెళ్ళకుండా ఆ కోటు దగ్గరే నిలబడి దానికి కాపలా కాయసాగాడు. ఒక అరగంట తరువాత హబీబ్ తన ఇంట్లోంచి రోడ్డుమీదకు వచ్చాడు. అక్కడ కోటుకి కాపలాగా ఉన్న హసన్‌బస్రీ కనిపించాడు. అప్పుడు హబీబ్ చిన్నగా నవ్వి "ఓ గురుదేవా! నీవు నా ఇంట్లోకి

రాకుండా ఇక్కడే ఎందుకు నిలబడిపోయావు?" అన్నాడు. హబీబ్ మాటలు విన్న హసన్‌బస్రీ కొంచెం కోపం ధ్వనించే స్వరంతో "నువ్వు నీ కోటుని ఇలా బజారులో పడేసావు. దీనికి ఎవరు కాపలా కాస్తారు?, ఎవరిని దీనికి నీవు కాపలా పెట్టావు?" అన్నాడు. అప్పుడు హబీబ్ చిన్న స్వరంతో "ఆ దైవాన్ని ఈ కోటుకి కాపలాగా పెట్టాను. ఆ కారణంగానే నీవే స్వయంగా ఇటువైపువచ్చి నా కోటుకి ఇప్పటిదాకా కాపలాకాసావు కదా?" అన్నాడు.

హబీబ్ తన చివరి సమయంలో బాగ్దాద్ నగరానికి చేరుకుని అక్కడే భౌతిక దేహాన్ని త్యజించాడు. ఆ తరువాత టైగ్రిస్ నదీ తీరంలో ఉన్న బషార్ అనే ప్రాంతంలో "హబీబ్ అల్‌అజమ్" యొక్క సమాధి నిర్మించబడింది.



# 18. ప్రభువుగా మారిన 'పాదముద్రశాస్త్ర' పండితుడి వృత్తాంతము?

పూర్వం బెనారస్ రాజ్యాన్ని బ్రహ్మదత్తుడు పరిపాలిస్తున్న సమయంలో జరిగిన కథ ఇది.

ఆ సమయంలో ఆ మహారాజు యొక్క పెద్ద భార్య అయిన మహారాణి చాలా సౌందర్యవతిగా పేరు పొందింది. దురదృష్టవశాత్తు, ఆమె ఒక ప్రియుడిని మరిగి అతడితో శృంగార సుఖాలు అనుభవించటం ప్రారంభించింది. ఎలాగో, ఈ విషయం మహారాజుకి తెలిసింది. ఆపై, ఆయన ఒక రాత్రి సమయంలో ఆ మహారాణిని ఈ విషయమై ఇలా ప్రశ్నించాడు. "నీవు ఇంకొక వ్యక్తితో శృంగార సంబంధాలు పెట్టుకుని మన దాంపత్య జీవితానికి ద్రోహం చేస్తున్నావని నా గూఢచారులు తెలియజేసారు. అది నిజమా కాదా చెప్పు?". అబద్ధాలు చెప్పటంలో అప్పటికే ఆరితేరిన ఆ మహారాణి అమాయకత్వాన్ని నటిస్తూ, ఆపై దీనమైన స్వరంతో ఆ మహారాజుతో "ప్రభూ! నేను మహా పతివ్రతని. నిన్ను తప్ప ఇతర ఏ పురుషుడినీ కన్నెత్తి చూడను. నేను చెప్పింది అబద్ధం అయితే, నేను ఇప్పటికిప్పుడే గుర్రం ముఖంగల ఒక రాక్షసిగా మారిపోవాలి" అన్నది. ఆమె ఆవిధంగా మాట్లాడటం పూర్తిచేసిన మరుక్షణమే ఆమె, గుర్రం ముఖంగల ఒక ఆడ రాక్షసిగా మారిపోయింది.

దాంతో, ఆ మహారాజు తన మహారాణి, ఒక జారిణి (వ్యభిచారి) అని అర్థంచేసుకుని, ఆపై ఆమెను అక్కడ నుండి దూరంగా తరిమివేయించాడు. ఆవిధంగా రాజ్యం నుండి తరిమివేయబడిన ఆ రాక్షసి ఆ బెనారస్ రాజ్యానికి చాలా దూరంగా ఉన్న ఒక అరణ్యంలోకి చేరుకున్నది. ఆపై, ఆ అరణ్యంలో ఒక మూలగా ఉన్న ఒక కొండ గుహలోకి ప్రవేశించి, అక్కడ తన నివాసం ఏర్పాటుచేసుకున్నది. ఒక విశేషం ఏమంటే, భారతదేశ తూర్పు ప్రాంతం నుండి పశ్చిమ ప్రాంతానికివెళ్ళే ఒక రహదారి ఆ కొండ ముందు నుండే వెళుతుంది. అందువలన, ఆ రాక్షసి ఆ రహదారిమీదుగా వెళ్ళే వ్యక్తుల్ని పట్టుకుని తిని తన ఆకలి తీర్చుకుంటూ ఉండేది. ఇలా అనేక ఏళ్ళు గడిచాయి. ఒకరోజు మధ్యాహ్న సమయంలో ఆ రాక్షసికి విపరీతమైన ఆకలివేసింది. దాంతో అది ఆహారంకోసం గుహలోంచి బైటకువచ్చి, రహదారికి ప్రక్కగా నిలబడి ఎవరైనా మనిషి అటువైపు వస్తాడేమో అని ఆత్రంగా ఎదురుచూస్తున్నది. అలాంటి సమయంలో మహాధనికుడు, అందగాడు, మంచి వయస్సులో ఉన్నవాడు అయిన ఒక బ్రాహ్మణుడు, కొంతమంది పరివారంతో కలిసి పల్లకిలో ప్రయాణిస్తూ అటువైపుగా వచ్చాడు. ఆ జనాన్ని చూడగానే ఆ రాక్షసిలో ఒక్కసారిగా ఆకలి విజృంభించింది. దాంతో అది భీకరంగా అరుస్తూ వాళ్ళ దగ్గరకు వెళ్ళింది. ఆ భయంకర రాక్షసిని చూడగానే పల్లకి మోస్తున్న బోయీలు, ఆ పల్లకిని నేలమీద ఉంచి, కనిపించిన దిక్కులోకి పరుగులు తీసారు. ఇక, ఆ పల్లకికి ముందు మరియు వెనక కాపలాగా ఉన్న వ్యక్తులు కూడా ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా భయంతో, గాలితో సమానంగా పోటీపడుతూ పిక్కబలం చూపారు.

సరే, ఆ రాక్షసి, వేగంగా నడుస్తూ ఆ బ్రాహ్మణుడి వద్దకువచ్చి ఆపై అతడిని తన భుజంపై వేసుకుని తన గుహలోకి తీసుకువెళ్ళింది. బలిష్టంగా ఉన్న ఆ బ్రాహ్మణుడి యొక్క శరీర స్పర్శ తగలగానే ఆ రాక్షసిలో ఆకలి బాధ పోయి "కామబాధ" ప్రారంభం అయ్యింది. ఫలితంగా, ఆ రాక్షసి ఆ బ్రాహ్మణుడి అంగీకారంతో పనిలేకుండా అతడిని బలాత్కారంగా అనుభవించింది. ఆమెకు అడ్డుచెబితే తనని చంపి తినేస్తుందని అర్థం చేసుకున్న ఆ బ్రాహ్మణుడు మరేమీ మాట్లాడకుండా ఆమెతో రాజీ పడ్డాడు. ఆ రాక్షసి అతడిని తన భర్తగా భావించుకుని, అతడికి ప్రతిరోజూ ప్రక్కనే ఉన్న అరణ్యం నుండి పండ్లు, దుంపలు ఇస్తూ ఉండేది. ఆ బ్రాహ్మణుడు కూడా తాను ఎవరు? అన్న విషయం మర్చిపోయి, ఆ రాక్షసి ఇచ్చిన పండ్లు, ఫలాలు ఆరగిస్తూ ఆమెతో సంసారం సాగించటం ప్రారంభించాడు.

ఇక, ఆ గుహ ముందు ఉన్న మార్గంమీదుగా వెళ్ళే పురుషుల్ని చంపినప్పుడు ఆ రాక్షసి ఆ పురుషులు ధరించిన అందమైన వస్త్రాలను, ఆభరణాలను మరియు వారి వద్ద ఉన్న సుగంధ ద్రవ్యాలను, మర్దనా తైలాలను తీసుకుని గుహలోకివచ్చి ఆ దుస్తులను, ఆభరణాలను తన భర్తకైన ఆ బ్రాహ్మణుడికి ధరింపచేసి, ఆపై ఆ సుగంధ ద్రవ్యాలను, తైలాలను ఆ బ్రాహ్మణుడి శరీరంపై ఆప్యాయంగా పూస్తూ ఉండేది. ఈవిధంగా ఆ రాక్షసి మరియు ఆ బ్రాహ్మణుడు రెండు సంవత్సరాలపాటు కాపురం చేసారు. తాను ఎక్కడికైనా దూర ప్రాంతానికి వెళ్ళినప్పుడు, ఆ బ్రాహ్మణుడు ఆ గుహలోంచి తప్పించుకుని వెళ్ళిపోతాడేమో అన్న అనుమానం కూడా ఆ రాక్షసికి ఉండేది. అందువల్ల అది, ఆ గుహకి దూరంగా వెళ్ళాల్సివచ్చినప్పుడు ఆ గుహ ద్వారానికి ఒక పెద్ద బండను అడ్డంగా ఉంచేది. ఫలితంగా, ఆ బ్రాహ్మణుడు ఎక్కడికీ తప్పించుకోలేక ఆ గుహలోనే ఉండిపోయేవాడు. మరొక రెండేళ్ళు గడిచాయి. భగవంతుడి లీల కారణంగా ఆ బ్రాహ్మణుడి కారణంగా ఆ రాక్షసి గర్భవతి అయ్యింది. ఆమెకు 10 నెలలు నిండిన తరువాత ఒక అందమైన మగబిడ్డ పుట్టాడు. ఆ మగబిడ్డ గతజన్మలో బోధిసత్వుడు అనే పేరుగల ఒక మహాయోగి అయి ఉన్నాడు. ఏదిఏమైనా, అందంగా ఉన్న తన బిడ్డను చూసుకుని ఆ రాక్షసి ఎంతో సంతోషించింది. ఆ మగబిడ్డకి "సుబుద్ధి" అన్న పేరు పెట్టుకున్నది. ఆపై, ఆమె తనకు వీలున్నప్పుడల్లా బైట నుంచి వివిధ రకాల మధుర పదార్థాలను తీసుకువచ్చి ఆ బ్రాహ్మణుడికి మరియు తన బిడ్డకి తృప్తి తీరా పెడుతూ ఉండేది. మరికొన్నేళ్ళు గడిచాయి. ఇప్పటికీ కూడా ఆ రాక్షసి తాను ఎక్కడికైనా బైటకు వెళ్ళేటప్పుడు ఆ కొండ గుహకి అడ్డంగా బండరాయిని ఉంచటం మానలేదు.

ఆ బాలుడికి కాలక్రమంలో 10 సంవత్సరాలు వచ్చాయి. తను, తన తండ్రి ఎల్లప్పుడూ అదే గుహలో ఉండటం, తన తల్లి మాత్రం అప్పుడప్పుడూ బైటకు వెళ్ళిరావటం మరియు ఆమె బైటకు వెళ్ళేటప్పుడు ఆ గుహకి ఒక బండరాయిని అడ్డంగా ఉంచటం ఆ బాలుడికి చాలా విచిత్రంగా అనిపించింది. ఒకరోజు ఉదయం ఆ రాక్షసి ఆహార సంపాదనకోసం బైటకు వెళ్ళింది. అప్పుడు ఆ బాలుడు ఆసక్తితో నిండిన స్వరంతో తన తండ్రి అయిన ఆ బ్రాహ్మణుడితో ఇలా అన్నాడు. "అయ్యా! నీ ముఖం ఒక రకంగా ఉన్నది. నా తల్లి ముఖం ఒక రకంగా ఉన్నది. ఎందుకని, ఇలా మీ ఇద్దరికీ వేరు వేరు ముఖాలు ఉన్నాయి చెప్పవా?" అన్నాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు బాధగా నిట్టూర్చి ఆపై ఆ బాలుడిని తన దగ్గరకు తీసుకుని అతడితో "నాయనా! నీవు, నేను మానవులం. నీ తల్లి ఒక రాక్షసి. అందుకే

ఆమెకు గుఱ్ఱం ముఖం ఉన్నది. ఆమె శరీరం మోటుగా, నల్లగా పెద్దదిగా ఉన్నది" అన్నాడు. అప్పుడు ఆ బాలుడు ఏదో అర్థం అయినట్లుగా ఒకసారి తలను నిలువుగా ఊపి ఆపై, విచిత్రమైన స్వరంతో "అయ్యా! మనం మనుషులం అయినప్పుడు, నరమాంసం తినే ఈ రాక్షసితో కలిసి ఉండటం దేనికి?. నువ్వు అంగీకరిస్తే మన ఇద్దరం ఈ గుహలోంచి పారిపోయి, మన తోటి మనుషులు ఉండే ప్రాంతానికివెళ్ళి వాళ్ళతో కలిసి ఉందాం ఏమంటావ్?" అన్నాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు బాధతో కూడిన స్వరంతో ఆ బిడ్డతో "నాయనా! నీ తల్లి మహా శక్తివంతురాలు. మనం ఈ గుహలోంచి తప్పించుకోవటానికి ప్రయత్నిస్తే ఆమె మన ఇద్దరినీ నిర్దాక్షణ్యంగా చంపి తినేస్తుంది. ఆమె సంగతి నీకు తెలియదు సుమా?" అన్నాడు. అప్పుడు ఆ బాలుడు ప్రశాంతంగా నవ్వి, ఆపై మృదువైన స్వరంతో "అయ్యా! భయపడకు. నిన్ను నేను, క్షేమంగా ఈ గుహలోంచి తప్పించి మనతోటి మనుషుల దగ్గరకుచేరుస్తాను. నన్ను నమ్ము" అన్నాడు. ఆ బ్రాహ్మణుడు అప్పటికి ఏమీ మాట్లాడకుండా మౌనం వహించాడు. మరికొంతసేపటికి ఆ రాక్షసి ఒక బుట్ట నిండా పండ్లు మరియు మధుర పదార్థాలు తీసుకుని ఆ గుహలోకి వచ్చింది. ఆ బ్రాహ్మణుడు మరియు ఆ బాలుడు ఆ పదార్థాలను కడుపునిండా ఆరగించారు.

"సుబుద్ధి"కి 16 ఏళ్ళ వయస్సు వచ్చే వరకు ఆ గుహలోనే తన తండ్రితో కలిసి నివసించాడు. ఒకరోజున ఉదయం, అతడి తల్లి అయిన రాక్షసి ఆహారంకోసం బయలకువెళ్ళినప్పుడు, అతడు ఆ గుహకి అడ్డంగా ఉన్న బండరాయిని ప్రక్కకు తప్పించి, గుహబైటకు వచ్చి చుట్టూ ఉన్న బాహ్య ప్రపంచాన్ని ఆసక్తిగా పరిశీలించాడు. కొద్దిసేపు గడిచిన తరువాత మళ్ళీ గుహలోకి తిరిగివచ్చేసాడు. ఆపై, కొద్దిసేపటికి ఆ రాక్షసి, గుహ దగ్గరకు వచ్చి చూడగా, గుహకి అడ్డంగా ఉండాల్సిన రాయి - ప్రక్కగా ఉన్నది. దాంతో, ఆమె వేగంగా లోపలికి వచ్చి "గుహకి అడ్డంగా నేను ఉంచిన బండరాయిని ప్రక్కకి ఎవరు తప్పించారు?" అని భర్త మరియు కొడుకుని నిగ్గదీసి అడిగింది. అప్పుడు "సుబుద్ధి" ప్రశాంతమైన స్వరంతో "అమ్మా! గుహబైట ఏముందో చూద్దామన్న ఉద్దేశంతో నేనే ఈ గుహకి అడ్డంగా ఉన్న బండరాయి ప్రక్కకి తప్పించాను" అన్నాడు. ఆ పనిచేసింది తన కొడుకు అని తెలియటంతో ఆ రాక్షసి తన కొడుకు మీద ఉన్న ప్రేమ కారణంగా అతడిని ఏమీ అనలేదు. ఆ తరువాత కొద్ది రోజులకి "సుబుద్ధి" తన తండ్రితో "అయ్యా! మనం మనుషులం అయినప్పుడు - ఈ గుహలో ఈ రాక్షసి దగ్గర ఉండటం అర్థరహితం. నువ్వు

అంగీకరిస్తే నిన్ను, నీతోటి మనుషులు ఉండే ప్రాంతానికి తీసుకువెళ్ళి వదిలిపెడతాను ఏమంటావ్?" అన్నాడు.

అప్పుడు ఆ బ్రాహ్మణుడు దిగులు నిండిన స్వరంతో "బిడ్డా! నాకుమాత్రం ఈ గుహలో పడి ఉండటం ఇష్టం అనుకున్నావా. కానీ, నీ తల్లి మహా శక్తివంతురాలు. మనం ఇక్కడనుండి తప్పించుకుని వెళ్ళిపోయినా ఆమె, మళ్ళీ మనల్ని బంధించి ఇక్కడకు తీసుకువస్తుంది" అన్నాడు. అప్పుడు "సుబుద్ధి" గంభీరమైన స్వరంతో "అయ్యా! నీవు నా తల్లి గురించి భయపడకు. నేను, నిన్ను సురక్షితంగా ఇక్కడ నుండి తీసుకు వెళతాను. నన్ను నమ్ము." అన్నాడు. అంత నమ్మకంగా తన కొడుకు అలా హామీ ఇవ్వటంతో ఆ బ్రాహ్మణుడు "సరే", అన్నాడు. ఆ మర్నాడు ఉదయం ఆ రాక్షసి ఆహారంకోసం గుహ నుండి బైటకు వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళి కొద్ది నిమిషాలకు "సుబుద్ధి" ఆ గుహకి అడ్డంగా బండరాయిని తొలగించి, ఆపై తన తండ్రిని తన వీపుమీద ఎక్కించుకుని గాలి కన్నా వేగంగా పరుగులుతీస్తూ, ఒక గంటలో 80 మైళ్ళ దూరం ప్రయాణించాడు. ఆపై, కొద్దిగా అలసటగా అనిపించటంతో ఒక చెట్టుక్రింద ఆగి తన తండ్రిని వీపు మీద నుండి క్రిందకి దింపాడు. సరిగ్గా, అదే సమయంలో అక్కడ గుహలోకి వచ్చిన రాక్షసికి ఆ గుహలో భర్త మరియు కుమారుడు కనపడలేదు. "వాళ్ళు తప్పించుకుపోయి ఉంటారు" అన్న అనుమానం ఆ రాక్షసికి వచ్చింది. మనిషి వాసనను ఎంత దూరం నుండి అయినా పసిగట్టగల శక్తి ఉన్న ఆ రాక్షసికి ఎన్నో మైళ్ళ దూరంలో – ఒక చెట్టు క్రింద నిలబడి ఉన్న తన భర్త మరియు కుమారుడియొక్క ఉనికి తెలిసిపోయింది. దాంతో, ఆ రాక్షసి గాలికన్నా అనేక రెట్లు వేగంతో గాలిలో ఎగిరిపోయి, క్షణాల్లో తన భర్త మరియు కొడుకు ఉన్న ప్రదేశానికి చేరింది. ఆ రాక్షసిని చూడగానే ఆ బ్రాహ్మణుడు భయంతో బిక్క చచ్చిపోయాడు. "సుబుద్ధి" మాత్రం ప్రశాంతంగా ఆ రాక్షసికేసి చూసాడు. అప్పుడు ఆ రాక్షసి కొంచెం కోపం నిండిన స్వరంతో ఆ బ్రాహ్మణుడితో "నాధా! నీకు ఏం లోటు చేసాను. ఎందుకు నన్ను వదిలి పారిపోతున్నావ్?" అన్నది.

ఆ బ్రాహ్మణుడు సమాధానం చెప్పలేక గుటకలు మింగాడు. అప్పుడు "సుబుద్ధి" చిన్నగా నవ్వి "అమ్మా! ఇందులో నా తండ్రి తప్పేమీలేదు. సంవత్సరాల తరబడి ఆ గుహలో ఉండటంవల్ల ఆయనకు అశాంతిగా ఉన్నది. కాసేపు బైట ప్రపంచం చూస్తే ఆయనకు సంతోషంగా ఉంటుందని భావించిన నేను, ఆయనను ఇక్కడకు తీసుకువచ్చాను. నిజానికి, మాకు ఆ గుహలోంచి తప్పించుకుపోవాలన్న కోరిక లేదు సుమా" అన్నాడు. కొడుకు మీద ఉన్న ప్రేమ కారణంగా, ఆ కొడుకు చెప్పిన

మాటను ఆ రాక్షసి బాగా నమ్మింది. ఆపై, ఆ రాక్షసి – తన భర్త మరియు కొడుకుని తన వీపుమీద ఎక్కించుకుని కన్నుమూసి తెరిచేలోగా గుహలోకి వెళ్ళిపోయింది. ఆ తరువాత కొన్ని రోజులు గడిచాయి. “సుబుద్ధి” తనలో తాను ఇలా ఆలోచించాడు. “నా తల్లి అయిన ఈ రాక్షసికి ఖచ్చితంగా కొంత నిర్ణీత ప్రదేశంపైన మాత్రమే అధికారం ఉండి ఉంటుంది. అందుకే, ఆమె అంత సులువుగా మా ఆచూకీని పసిగట్టి క్షణాల్లో అక్కడికి వచ్చి మమ్మల్ని వెనక్కి తీసుకువచ్చింది. అంటే, ఆమెకు ఉన్న నిర్ణీత పరిధిని దాటి మేము వెళ్ళ గలిగితే, మేము ఖచ్చితంగా ఆమె బారి నుండి తప్పించుకోవచ్చు”. ఈవిధంగా ఆలోచించిన “సుబుద్ధి”, ఒకరోజు సాయంత్రం ప్రశాంతంగా గుహలోకి కూర్చుని ఉన్న ఆ రాక్షసి దగ్గరకువెళ్ళి మృదువైన స్వరంతో “తల్లీ! నీ కొడుకుని అయిన నాకు, నీ రాజ్యంమీద అధికారం ఉంటుంది. నీ రాజ్య పరిధి ఎంత దూరం ఉంటుందో చెప్పు. భవిష్యత్తులో నీ తరువాత నీ రాజ్యం నాకు వస్తుంది కనుక నా రాజ్య పరిధులు ఎక్కడి దాకా ఉన్నాయో నాకు తెలియాలి కదా” అన్నాడు.

తన కొడుకు అలా అడిగే సరికి ఆ రాక్షసికి ఎంతో ముచ్చటవేసింది. ఆపై ఆమె తన భయంకరమైన స్వరంతో అతడితో “కుమారా! ఈ గుహ దగ్గర నుండి చుట్టూ 20 యోజనాల వరకు (160 మైళ్ళు) ఉన్న భూమి, పర్వతాలు, నదులు నా ఆధీనంలో ఉన్నాయి. 20 యోజనాలు దాటిన తరువాత ఉన్న భూమిపై నాకు ఏమాత్రం అధికారంలేదు” అన్నది. తన తల్లియొక్క అధికార పరిధి ఎంత దూరం ఉంటుందో తెలుసుకున్న “సుబుద్ధి” మనసులో ఎంతో సంతోషించాడు. ఆ తరువాత మూడవ రోజు ఉదయం ఆ రాక్షసి, ఆహార సంపాదనకోసం బైటకు వెళ్ళగానే “సుబుద్ధి” ఆ గుహకి అడ్డంగా ఉన్న బండరాయిని ప్రక్కకు తప్పించి, ఆపై తన తండ్రిని తన వీపుమీద ఎక్కించుకుని వాయు–మనోవేగాలతో 20 యోజనాల దూరం చేరుకున్నాడు. అక్కడ ఒక పెద్ద నది కనపడింది. ఆ నది గట్టు వరకు తన తల్లి ప్రభావం ఉంటుందని “సుబుద్ధి”కి నిమిషాలలో అర్థమైపోయింది. సరిగ్గా, అదే సమయానికి ఆ గుహలోకి వచ్చిన ఆ రాక్షసికి – గుహలో ఉండాల్సిన భర్త, కొడుకు కనపడలేదు. వాళ్ళిద్దరూ తప్పించుకుని వెళ్ళి పోయారని దానికి స్పష్టంగా అర్థమయ్యింది. దాంతో అది, మహా వేగంతో గాలిలో ఎగురుతూ కొడుకు, భర్త ఉన్న నదివైపు వెళ్ళిపోయింది.

గాలిలో, ప్రచండవేగంతో ఎగురుతూ తమవైపు వస్తున్న ఆ రాక్షసిని చూసిన “సుబుద్ధి” ఏమాత్రం ఆలస్యం చెయ్యకుండా తన తండ్రిని తీసుకుని వేగంగా నదిలోకి

దిగి, ఈత కొడుతూ నది మధ్యలోకి చేరుకున్నాడు. అప్పటికి ఆ రాక్షసి, నది గట్టు మీదకు వచ్చి నిలబడింది. ఆ గట్టు దాటి నదిలోకి వెళ్ళే అర్హత తనకు లేదని తెలిసి ఉన్న ఆ రాక్షసి – తన భర్త మరియు కుమారుడు తనకి దూరం అయిపోతున్నారని అర్థంచేసుకుని పెద్దగా రోదించింది. ఆపై, దీనమైన స్వరంతో "సుబుద్ధి"తో "బిడ్డా! నీవు, నీ తండ్రి నాకు దూరం అయిపోతే నేను బ్రతకలేను. నామీద దయయుంచి మీ ఇద్దరూ వెనక్కి తిరిగి రండి" అన్నది. అప్పుడు "సుబుద్ధి" ప్రశాంతమైన స్వరంతో ఆ రాక్షసితో ''అమ్మా! విధి నిర్ణయంవల్ల ఇప్పటిదాకా నేను, నా తండ్రి నీ ఆధీనంలో ఉన్నాం.



నా తండ్రి మనిషి కనుక అతడు తనతోటి మనుషుల మధ్య జీవించటం ధర్మం. అందువల్ల నీవు మమ్మల్ని మర్చిపో. మేము వెళ్ళిపోతున్నాం" అన్నాడు. ఆపై ఆ బ్రాహ్మణుడు వేగంగా ఈదుకుంటూ నది అవతల గట్టుకి చేరుకున్నాడు. "సుబుద్ధి" మాత్రం నది మధ్యలో నిలబడి తల్లితో మాట్లాడుతున్నాడు. ఆ బ్రాహ్మణుడు అవతల గట్టుకి చేరుకోవటం గమనించిన ఆ రాక్షసి ఇంకొక్కసారి తన కొడుకుతో "నాయనా! నీ తండ్రి ఎలాగూ వెళ్ళిపోయాడు. కనీసం, నీవైనా నామీద దయతలచి వెనక్కి రా. మనిద్దరం కలిసి హాయిగా బ్రతుకుదాం" అన్నది.

అప్పుడు "సుబుద్ధి" గంభీరమైన స్వరంతో "అమ్మా! నేను ఈ ప్రపంచంలో చెయ్యవలసిన పనులు చాలా ఉన్నాయి. నేను నీ దగ్గరకు తిరిగి రాలేను. నన్ను క్షమించు" అన్నాడు. అప్పుడు ఆ రాక్షసి దీనమైన స్వరంతో "నాయనా! ఇప్పటి వరకు నీవు ఏ పని నేర్చుకోకుండా బ్రతికావు. నువ్వు వెళ్ళబోయే మహా ప్రపంచంలో ఏ పనీ రాకుండా ఎలా బ్రతుకుతావో చెప్పు?" అన్నది. "సుబుద్ధి" సమాధానం చెప్పకుండా మౌనం వహించాడు. అప్పుడు ఆ రాక్షసి, తన నడుముకి ఉన్న ఒక తోలు సంచిలో నుండి ఎంతో ప్రకాశంతో మెరిసిపోతున్న మరియు కోడిగుడ్డు అంత పరిమాణంలో ఉన్న ఒక రత్నాన్ని తన చేతిలోకి తీసుకుని, ఆపై పెద్ద స్వరంతో తన కొడుకుతో "నాయనా! అమూల్యమైన ఈ రత్నం ఎంతో మహిమగలది. ఈ రత్నాన్ని ఉపయోగించి నీవు, 12 సంవత్సరాలలోపు – ఒక మార్గంలో నడిచి వెళ్ళిపోయిన వ్యక్తులయొక్క

పాద ముద్రలను గుర్తించి, ఆపై ఆ వ్యక్తులు ఎక్కడికివెళ్ళారో తెలుసుకోవచ్చు. ఈ రత్నాన్ని ఉపయోగించుకుని నీ భుక్తికి అవసరమైన డబ్బు సంపాదించుకో. కనీసం, ఈ రత్నమైనా తీసుకుని నాకు సంతోషాన్ని కలిగించు" అన్నది. "సుబుద్ధి" సరే, అన్నట్లుగా తల ఊపి, "ఆ రత్నాన్ని తనవైపు విసరమని" తన తల్లితో పెద్ద స్వరంతో అన్నాడు. ఆమె, గట్టుమీద నుండి ఆ రత్నాన్ని నది మధ్యలో ఉన్న "సుబుద్ధి"వైపు బలంగా విసరింది. అది గమనించిన "సుబుద్ధి" తన రెండు చేతుల్ని దోసిలిలాగా పట్టి, గాలిలో వస్తున్న ఆ రత్నాన్ని చాలా నేర్పుగా పట్టుకుని, ఆపై దానిని తన నడుముకి ఉన్న వస్త్రంలో భద్రపరచాడు. ఆపై, తల్లికి వీడ్కోలుగా చేతులు ఊపుతూ ఆ నది అవతలి గట్టువైపు నీళ్ళమీద తేలుతూ వెళ్ళిపోసాగాడు. "తన కొడుకు తన దగ్గరకు ఇక రాడని" స్పష్టంగా అర్థమైన ఆ రాక్షసి బిగ్గరగా ఏడుస్తూ, రొమ్ములు బాదుకుంటూ నది అవతల గట్టుమీద కూలిపోయింది. మరు నిమిషమే దాని ప్రాణం అనంత వాయువుల్లో కలిసిపోయింది.

నది అవతల గట్టుకి చేరుకున్న "సుబుద్ధి"కి, ఆ నది ఇవతల గట్టున మృతదేహంగా మిగిలిన ఆ రాక్షసి కనపడింది. దాంతో "సుబుద్ధి" తన తండ్రితో సహా మళ్ళీ ఇవతల గట్టుకి వచ్చి, ఆపై ఆ రాక్షసి మృతదేహానికి అగ్ని సంస్కారంచేసి, మండుతున్న చితికి దగ్గరలో, రంగు రంగుల పూలనువేసి, ఆమె ఆత్మశాంతికోసం దైవాన్ని ప్రార్థించాడు. ఆ దృశ్యాన్ని ఆ బ్రాహ్మణుడు వికలమైన మనసుతో చూస్తూ ఉండిపోయాడు. ఆ తరువాత "సుబుద్ధి" కొంచెంసేపు తన తల్లికోసం బిగ్గరగా రోదించాడు. ఆపై, మనసుని నిగ్రహించుకుని, తన తండ్రిని వీపుమీద ఎక్కించుకుని గాలిలో ప్రయాణిస్తూ ఆ నది ఇవతల గట్టు మీద నుండి అవతల గట్టుకి చేరుకున్నాడు. అలా అవతల గట్టుకి చేరుకున్న "సుబుద్ధి" తన తండ్రితో కలిసి అక్కడికి చాలా దగ్గరగా ఉన్న బెనారస్ పట్టణానికి (కాశీ/వారణాసి) చేరుకున్నాడు.

ఆపై "సుబుద్ధి" తన తండ్రితో కలిసి ఆ వారణాసి రాజ్యాన్ని పరిపాలించే మహారాజుయొక్క భవనం ముందుకివెళ్ళి, అక్కడ కాపలాగా ఉన్న ఒక భటుడితో ఇలా చెప్పాడు... "నాయనా!, 12 సంవత్సరాలలోపు ఏదో ఒక మార్గం గుండా వెళ్ళిపోయిన మనుషులయొక్క పాదముద్రలను గుర్తించి, ఆపై ఆ పాదముద్రల సహాయంతో ఆ మనుషులు ఎక్కడికి వెళ్ళారు?, ప్రస్తుతం ఎక్కడ ఉన్నారు? అన్న విషయాలను చెప్పగలిగే శక్తి నాకు ఉన్నది. మీ రాజు గారికి ఈ విషయంలో నా సహాయం అవసరం అనుకుంటే, నేను ఆయన దగ్గర ఉద్యోగంలో చేరతాను. నీవు

మీ రాజు వద్దకువెళ్ళి నేను ఇలా – ఇక్కడికి ఆయన దగ్గరకు ఉద్యోగంకోసం వచ్చానని చెప్పు". ఆ భటుడు, "సుబుద్ధి" చెప్పిన మాటలను విని ఎంతో ఆశ్చర్య పోయాడు. ఆపై, మహారాజు వద్దకువెళ్ళి "సుబుద్ధి" గురించి చెప్పాడు. భటుడు చెప్పిన మాట విన్న ఆ మహారాజు ముందు ఆశ్చర్యపడి, ఆపై పెద్దస్వరంతో తన ప్రక్కన ఉన్న వారితో ఇలా అన్నాడు. "ఓహో! అంతటి అద్భుతమైన శక్తిగల వ్యక్తి మనకి ఎప్పటికైనా ఉపయోగపడతాడు. వెంటనే ఆ వ్యక్తిని లోపలికి తీసుకు రండి".

ఆపై ఒక సేవకుడు బైటకువెళ్ళి, అక్కడ నిలబడి ఉన్న "సుబుద్ధి"ని మరియు అతడి తండ్రిని మహారాజు వద్దకు తీసుకువచ్చాడు. అప్పుడు ఆ మహారాజు, "సుబుద్ధి"ని పరిశీలనగా చూస్తూ "అబ్బాయీ! నీకు ఉన్న శక్తి గురించి మా భటుడి ద్వారా తెలిసింది. అయితే, నీ శక్తి మాకు ఎలా ఉపయోగపడుతుందో చెప్పగలవా?" అన్నాడు. అప్పుడు "సుబుద్ధి" ప్రశాంతమైన స్వరంతో "ఓ ప్రభూ! నిన్నా, మొన్నా కాదు, దాదాపు 12 ఏళ్ళ క్రితం – మీ ఖజానా నుండి లేదా భవనం నుండి ఎవరైనా దొంగలు – నగలు, ధనం లాంటివి దోచుకుని వెళ్ళిపోయి ఉంటే మరియు వాళ్ళ ఆచూకీ మీకు ఇప్పటిదాకా దొరక్కుండా ఉండి ఉంటే, నేను నా శక్తితో 12 ఏళ్ళ క్రితం ఆ దొంగలు మీ ఖజానా దగ్గర నుండి లేదా అంత:పురం దగ్గర నుండి నడిచివెళ్ళినప్పుడు పడిన పాద ముద్రలను నేను పసిగడతాను. ఆపై, ఆనాడు ఆ పాదముద్రలు గల వ్యక్తి లేదా వ్యక్తులు ఎటువైపు వెళ్ళారో తెలుసుకుంటాను. అంతేకాదు, వాళ్ళు ప్రస్తుతం ఎక్కడ ఉన్నారో కూడా తెలుసుకుంటాను. ఆవిధంగా నేను మీ సంపదలు దోచుకున్న దొంగలయొక్క పాద ముద్రల ఆధారంగా వాళ్ళను మీకు పట్టిస్తాను" అన్నాడు.

అప్పుడు ఆ మహారాజు ఎంతో సంతోషంతో "శభాష్!, వెంటనే ఉద్యోగంలో చేరు. నీకు ఎంత జీతం కావాలో అడుగు ఇస్తాను" అన్నాడు. అప్పుడు "సుబుద్ధి" ప్రశాంతమైన స్వరంతో "ఓ రాజా! నాకు రోజుకి వెయ్యి వరహాలు జీతంగా ఇవ్వు. పని ఉన్నా లేకపోయినా నీవు నాకు రోజూ వెయ్యి వరహాలు ఇవ్వాల్సి ఉంటుంది" అన్నాడు. ఆ రాజు సంతోషంగా అందుకు అంగీకరించాడు. ఆపై "సుబుద్ధి" ప్రతిరోజూ రాజుగారివద్దకువెళ్ళి, ఆ రోజు జీతం వెయ్యి వరహాలు తీసుకుని ఆ సొమ్ముతో తన తండ్రితో కలిసి మహా సుఖంగా జీవితం గడపటం ప్రారంభించాడు. కొద్ది రోజులు గడిచాయి. ఆ రాజుగారియొక్క పురోహితుడికి "సుబుద్ధి"మీద ఏదో అనుమానం వచ్చింది. దాంతో ఆ పురోహితుడు నేరుగా రాజుగారి వద్దకువెళ్ళి ఆయనతో "ప్రభూ! ఈ యువకుడు ఏ పనీ చెయ్యకుండానే ప్రతిరోజూ మీ దగ్గర వెయ్యి వరహాలు

జీతంగా తీసుకుంటున్నాడు. ఆ సొమ్ముతో అతడు మరియు అతడి తండ్రి సుఖంగా జీవితం గడుపుతున్నారు. అతడికి నిజంగా, పాదముద్రలనుబట్టి వ్యక్తుల ఆచూకీని పసిగట్టగలిగే శక్తి నిజంగా ఉందని మనకి రుజువు ఏముంది?. అందువలన మీరు అతడియొక్క శక్తిని పరీక్షించవలసిన అవసరం ఎంతైనా ఉంది" అన్నాడు.

పురోహితుడు చెప్పిన మాటల్లో వాస్తవం ఆ రాజుకి అర్థమయ్యింది. దాంతో ఆయన, "సుబుద్ధి"యొక్క శక్తిని పరీక్షించాలని నిర్ణయించుకున్నాడు. ఆపై, ఆయన బాగా తెలివిగలవాళ్ళైన నలుగురు భటుల్ని తన దగ్గరకు పిలిపించుకుని, ఆపై వాళ్ళతో ఇలా చెప్పాడు..."మన రాజ భవనం ప్రక్కన తాళాలు వేసి ఉన్న నాలుగు ఖజానా గదులు ఉన్నాయి. మీ నలుగురిలో ఒక్కొక్కడు ఒక్కొక్క ఖజానా గదిలోకివెళ్ళి మీ చేతిలో పట్టినన్ని బంగారు నగలు తీసుకుని బైటకు రండి. ఆ తరువాత ఆ ఖజానా గదులకు వంద గజాల దూరంలో ఉన్న రాణిగారి అంత:పుర భవనం చుట్టూ నాలుగుసార్లు గుండ్రంగా తిరగండి ఆ తరువాత ఆ అంత:పురానికి కుడివైపున 100 గజాల దూరంలో ఉన్న రాజదర్బార్ భవనంలోకి ప్రవేశించి అక్కడ పదినిమిషాలు కూర్చోండి. ఆ తరువాత ఆ రాజదర్బార్ ప్రక్కనే ఉన్న ప్రహరీ గోడకు ఒక నిచ్చెన ఆనించి, ఆ నిచ్చెన మీదుగా నడిచి ప్రహరీగోడ పైకి చేరుకుని, ఆపై అటువైపుగా వేసి ఉన్న నిచ్చెనమీదుగా అటువైపు క్రిందకు దిగండి. ఆపై, అక్కడ నుండి రహదారి గుండా నడుస్తూ ఊరి చివర ఆలయం ముందు ఉన్న కొలనులోకి దిగి, ఆ కొలను అడుగున – మీతోపాటు తీసుకువెళ్ళిన నగలను దాచండి. ఆపై, మళ్ళీ అక్కడి నుండి ప్రహరీగోడ దగ్గరకువచ్చి, అటువైపు ఉన్న నిచ్చెన ద్వారా ఆ గోడ ఎక్కి, ఇటువైపు ఉన్న నిచ్చెన ద్వారా ప్రహరీకి ఇవతలివైపుకివచ్చి, ఆపై రాణి అంత:పురంలోకి వెళ్ళిపోండి".

ఆ నలుగురు భటులూ, అర్ధరాత్రి దాటిన తరువాత రాజుగారు చెప్పినట్లుగానే నగలు దొంగిలించి, ఆయన చెప్పిన విధానంలోనే నడుస్తూ – ఊరి చివరికి చేరుకుని అక్కడ ఉన్న పుష్కరిణి అడుగున ఆ నగలను దాచిపెట్టి, తెల్లవారేలోపే మళ్ళీ రాజుగారు చెప్పినట్లుగానే నడుస్తూ అంత:పురానికి చేరుకున్నారు. తెల్లవారింది. "రాజుగారియొక్క నాలుగు ఖజానాలలో ఉన్న అతి విలువైన నగలు దొంగతనానికి గురి అయ్యాయి" అన్న వార్త ఆ నగరంలో కార్చిచ్చులా వ్యాపించింది. ఈ విషయం తెలుసుకున్న "సుబుద్ధి", వెంటనే మహారాజు వద్దకు చేరుకుని ఆయనతో "ప్రభూ!, 12 సంవత్సరాల క్రితం దొంగతనం చేసిన దొంగల పాదముద్రలను కూడా నేను గుర్తించగలను. అలాంటిది, కేవలము ఒక్కరోజు క్రితం దొంగతనం చేసిన దొంగల పాదముద్రలను

గుర్తించటం నాకు చాలా తేలిక. మీరు అనుమతి ఇస్తే ఆ దొంగల పాదముద్రల ఆధారంగా వాళ్ళని పట్టుకుని మీకు అప్పగిస్తాను" అన్నాడు. మహారాజు, "సుబుద్ధి" చెప్పిన మాటలువిని "సరే, నీ పని ప్రారంభించు" అన్నాడు.

ఆపై "సుబుద్ధి", తన నడుముకి ఉన్న సంచి నుండి – తన తల్లి ఇచ్చిన అద్భుత రత్నాన్ని బైటకుతీసి, ఒక్కసారి తన తల్లిని తలచుకుని ఆ రత్నాన్ని కళ్ళకు అద్దుకున్నాడు. ఆ మరుక్షణమే, అతనికి – రాజభవనం ప్రక్కనే ఉన్న ఖజానా గదుల్లోకి వెళ్ళిన వ్యక్తులయొక్క పాదముద్రలు నేలపై కనిపించాయి. దాంతో, "సుబుద్ధి", మహారాజువైపు తిరిగి "రాజా! దొంగలు ఈ మార్గం గుండా ఖజానా గదుల్లోకి వెళ్ళారు. ఈ పాదముద్రల ప్రక్కనే, వాళ్ళు ఖజానా గదుల్లో నుండి బైటకు తిరిగి వచ్చినప్పుడు పడ్డ పాదముద్రలు ఉన్నాయి" అన్నాడు. ఆపై, మహారాజు, రాజ పురోహితుడు, కొందరు భటులు తన వెంటరాగా "సుబుద్ధి", తన చేతిలో ఆ రత్నాన్ని ఉంచుకుని దాని మహత్యంతో దొంగల పాదముద్రలు ఎటువైపు పడ్డాయో అటువైపు నడవటం ప్రారంభించాడు. ఆ తరువాత ఆ దొంగల అడుగులు, రాణిగారి అంత:పురం చుట్టూ నాలుగుసార్లు ప్రదక్షిణాలు చేసినట్లుగా కనిపించాయి. ఆ విషయాన్నే "సుబుద్ధి", రాజుగారికి తెలియజేసాడు. ఆ తరువాత ఆ అడుగులు అక్కడికి 100 గజాల దూరంలో రాజదర్బారులోకి వెళ్ళినట్లుగా కనిపించాయి. "సుబుద్ధి", రాజదర్బారులోకి ప్రవేశించాడు. అతడివెనకాలే రాజుగారు, ఆయన పరివారం నడిచింది. ఆ తరువాత ఆ అడుగులు మళ్ళీ బైటకు పడినట్లుగా కనపడటంతో "సుబుద్ధి" ఆ రాజదర్బార్‌లోంచి బైటకువచ్చి, ప్రక్కనే ఉన్న ప్రహరీ గోడ దగ్గరకు వచ్చి ఆగాడు. అక్కడ, క్రింద నుండి ప్రహరీగోడ పై వరకు గాలిలో పాదముద్రలు కనపడ్డాయి. అది చూసిన "సుబుద్ధి" విచిత్రమైన స్వరంతో ఆ రాజుతో "రాజా! ఆ నలుగురు దొంగలూ ఈ నిచ్చెన మీదుగా ఎక్కి ప్రహరీగోడ పైకి చేరుకున్నారు" అన్నాడు. అప్పుడు రాజుగారు వెంటనే ఒక నిచ్చెనను అక్కడికి తెప్పించి ఆ గోడకి ఆనింపచేసాడు.

గాలిలో కూడా పాదముద్రలను చూడగలిగిన "సుబుద్ధి"యొక్క మహత్యానికి ఆ మహారాజు ఎంతో ఆశ్చర్యపోయినప్పటికీ, పైకి మాత్రం గంభీరంగా కనిపించాడు. ఏది ఏమైనా, "సుబుద్ధి", అక్కడ ఆనించిన ఆ నిచ్చెన దానిమీదుగా నడిచి ప్రహరీగోడ పైకిచేరుకున్నాడు. అతడి వెనకాలే రాజుగారు, పురోహితుడు, కొంతమంది భటులు ఆ నిచ్చెన మీదుగా ప్రహరీగోడ పైకి చేరుకున్నారు. గోడపైకి చేరుకున్న "సుబుద్ధి"కి గోడమీదుగా గాలిలో క్రిందకు వెళ్ళిన పాదముద్రలు కనిపించాయి. అప్పుడు "సుబుద్ధి", తన ప్రక్కనే రాజుగారితో "ప్రభూ! ఆ దొంగలు ఇటువైపు నుండి కూడా ఒక నిచ్చెనను

ఏర్పాటుచేసుకుని ఆ నిచ్చెన మీదుగా క్రిందకు దిగారు" అన్నాడు. ఆపై, "సుబుద్ధి" ఒక భటుడిచేత ఒక నిచ్చెనను తెప్పించి గోడకి అటువైపుకి ఆనింపచేసాడు. అప్పుడు "సుబుద్ధి" ఆ నిచ్చెన మీదుగా గోడమీద నుండి అవతలవైపుకి క్రిందకి దిగాడు. అతని వెనకాలే ఆ నిచ్చెన మీదుగా రాజుగారు, ఆయన పరివారం క్రిందకు దిగారు. ఆ తరువాత, "సుబుద్ధి" తన చేతిలో ఉన్న రత్నాన్ని మరొక్కసారి కళ్ళకు అద్దుకుని చూడగా, రహదారి మీదుగా ఊరి చివరికి వెళ్ళిన పాదముద్రలు అతడికి కనిపించాయి. అప్పుడు "సుబుద్ధి" ఆ పాదముద్రలను అనుసరిస్తూ ఊరి చివర ఉన్న ఆలయంవైపు నడిచాడు. అతడి వెనకాలే రాజుగారు మరియు ఆయన బృందము నడిచింది. కొంతసేపటికి, వాళ్ళు ఆ ఆలయం దగ్గరకి చేరుకున్నారు. అక్కడ, నేలమీద నుండి ఆ పుష్కరిణి గట్టుమీదకి ఉన్న అడుగుజాడలు కనిపించాయి. దాంతో, "సుబుద్ధి" ఆ అడుగు జాడలను ఆధారంగా చేసుకుని పుష్కరిణి గట్టుమీదకు చేరుకున్నాడు. పుష్కరిణి నీటిమీద అవే అడుగు జాడలు కనిపించాయి. దాంతో, పుష్కరిణిలోకి దిగి ఆ నీళ్ళలో నడుస్తూ పాదముద్రలు ఎక్కడి దాకా ఉన్నాయో అక్కడిదాకా నడిచాడు. సరిగ్గా, పుష్కరిణి మధ్యభాగంలో ఆ పాదముద్రలు ఆగిపోయాయి.

అది గమనించిన "సుబుద్ధి" అక్కడ నీళ్ళలోకి వంగి రెండు చేతులతో అక్కడి నేలను త్రవ్వాడు. అప్పుడు అతని చేతికి నాలుగు గుడ్డ మూటలు దొరికాయి. వాటిని పైకి తీసి చూడగా వాటిలో రాజుగారి నగలు ఉన్నట్లుగా "సుబుద్ధి"కి అర్థమయ్యింది. గట్టుమీద నుండి ఆ దృశ్యాన్ని చూసిన మహారాజు మరియు పురోహితుడు ఎంతో ఆశ్చర్యపోయారు. అయినప్పటికీ రాజుగారు "సుబుద్ధి"ని మెచ్చుకోకుండా ఇలా అన్నాడు. "ఈ మాత్రం దొంగల్ని పట్టుకోవటానికి పాదముద్రలు ఆధారంగా నీవు మంత్రం వెయ్యాల్సిన అవసరం ఏముంది?. అసలు ఈ దొంగతనం చేసిన దొంగలు ఎవరో నువ్వు చెప్పాలి. అప్పుడే, నీవు నిజమైన "పాదముద్రల విద్య" తెలిసినవాడివి అని నమ్ముతాను".

అప్పుడు "సుబుద్ధి" తన చేతిలో ఉన్న రత్నాన్ని ఒకసారి కళ్ళకి అద్దుకుని చుట్టూ ఒకసారి పరిశీలనగా చూసాడు. దొంగల పాదముద్రలు ఆ పుష్కరిణి నుండి రహదారి మీదుగా రాజుగారి దర్బారు ప్రక్కన ఉన్న ప్రహరీగోడవైపు వెళ్ళినట్లుగా కనిపించాయి. దాంతో, "సుబుద్ధి" మళ్ళీ ఆ అడుగు జాడల ఆధారంగా నడుస్తూ, నడుస్తూ మళ్ళీ ప్రహరీగోడ దగ్గరకు వచ్చాడు. అక్కడ ప్రహరీ గోడపైకి గాలిలో పాదముద్రలు కనిపించాయి. అప్పుడు "సుబుద్ధి" ఆ రాజుతో "ప్రభూ! ఆ దొంగలు ఒక నిచ్చెన సహాయంతో ప్రహరీగోడపైకివెళ్ళి ఆపై గోడమీదుగా లోపలివైపుకి దూకారు.

అంతేకాదు, వాళ్ళు మళ్ళీ రాణిగారి అంత:పురంలోకి వెళ్ళిపోయారు” అన్నాడు. అప్పుడు ఆ మహారాజు కొంచెం అసంతృప్తి నిండిన స్వరంతో “సుబుద్ధి”తో “మిత్రుడా! దొంగలు తీసుకుపోయిన సొమ్మును మాకు తిరిగి వచ్చేలా చేసావు. సంతోషం. కానీ, దొంగలు ఎక్కడ ఉన్నారో తెలుసుకుని, మాకు పట్టించటం కూడా నీ బాధ్యతే అని మర్చిపోకు” అన్నాడు. అప్పుడు “సుబుద్ధి” ప్రశాంతమైన స్వరంతో, “ఓ ప్రభూ! ఆ దొంగలు మనకి చాలా దగ్గరలో ఉన్నారు. ఆ విషయం గుర్తించండి” అన్నాడు. అయితే, “సుబుద్ధి” ఏం చెబుతున్నాడో తనకి అర్థం అవుతున్నప్పటికీ, దొంగలు ఎవరో తనకి తెలియనట్లుగా నటిస్తూ “ఆ దొంగలు ఎవరో నువ్వు స్పష్టంగా చెప్పకుండా నాకు ఎలా తెలుస్తుంది?” అన్నాడు. అప్పుడు “సుబుద్ధి”, గంభీరమైన స్వరంతో “ఓ రాజా! నీకు, చాలా కాలం క్రితం జరిగిన ఒక కథ గురించి చెబుతాను. నీకు తెలివి ఉంటే ఆ కథ విన్న తరువాత దొంగలు ఎవరో నీకు అర్థమైపోతుంది. దయచేసి ఆ కథ విను” అన్నాడు. ఆపై “సుబుద్ధి” ఆ కథను ఇలా చెప్పాడు.

“చాలాకాలం క్రితం ఈ బెనారస్ నగరానికి కొంచెం దూరంలో – గంగానది అవతలి ఒడ్డున ఉన్న ఒక గ్రామంలో ‘పాతాళ’ అనే ఒక పేరుగల ఒక మంచి గాయకుడు ఉండేవాడు. అతడు వారానికి ఒకసారి, నగరంలోకి వచ్చి నగరంలో ఏదో ఒక చోట తంబూర వాయిస్తూ పాటలు పాడుతూ, నృత్యం చేస్తూ ప్రజలకి వినోదం కలిగించేవాడు. ఆ వినోదానికి సంతోషించిన ప్రజలు ఆ పాతాళుడికి తమకు తోచిన డబ్బులు కానుకలుగా ఇచ్చేవారు. ఆ డబ్బుతో పాతాళుడు తన ఇంట్లోకి కావలసిన సరుకులు కొనుక్కుని, మళ్ళీ నది దాటి తన గ్రామానికి వచ్చేవాడు. ఇలా ఎన్నో ఏళ్ళు గడిచాయి. ఒకరోజున, పాతాళుడు తన భార్యను కూడా తనతోపాటు పట్టణానికి తీసుకువెళ్ళాడు. ఆ రోజు కూడా ఎప్పటిలాగానే తంబూర వాయిస్తూ పాటలు పాడి, నాట్యం చేసిన పాతాళుడికి ప్రజలు కొంత సొమ్ము కానుకగా ఇచ్చారు. పాతాళుడు ఆ సొమ్ము తీసుకుని, ఆ తరువాత భోజనానికి కావలసిన కొంచెం బియ్యం మరియు హాయి కలగటంకోసం ఒక సీసాడు ఘాటైన మద్యాన్ని కొనుగోలు చేసి, ఆపై భార్యతో కలిసి కాలినడక నది ఒడ్డుకి చేరుకున్నాడు. అప్పటికి సాయంత్రం కావొస్తున్నది. గంగానదీ ప్రవాహం చాలా ఎక్కువగా ఉన్నది. అది చూడగానే పాతాళుడికి ఉత్సాహం కలిగింది. ఆపై, అతడు తన దగ్గర ఉన్న మద్యం మొత్తాన్ని క్షణాల్లో త్రాగేసాడు. ఆ మద్యం మత్తువల్ల పాతాళుడికి తల తిరగటం మొదలయ్యింది. అయినప్పటికీ, పాతాళుడు ఆ విషయాన్ని ఏమాత్రం పట్టించుకోకుండా నదిని దాటాలని నిర్ణయించుకున్నాడు. తాను వాయించే తంబూరాను (వీణలాంటి ఒకపెద్ద సంగీత

వాయిద్యం) మెడలో వేసుకుని, ఆపై ఎడమ చేతిలో బియ్యం మూటను పట్టుకుని కుడిచేత్తో భార్య చెయ్యిని పట్టుకుని ఆ నదిలోకి దిగాడు. నది మెడ లోతు వరకు వస్తున్నది. అలాగే నడుచుకుంటూ నది మధ్యదాకా వచ్చాడు. దురదృష్టవశాత్తు, నదీ జలం ఆ తంబూరలోకి బాగా ప్రవేశించింది. ఫలితంగా, ఆ తంబూర బరువు విపరీతంగా పెరిగిపోయింది. దాంతో పాతాళుడు, తన భార్యతో సహా నదిలో మునగటం, మళ్ళీ తేలటం ప్రారంభించాడు. ఈదటానికి అతనికి ఒంట్లో సరిగ్గా స్పృహలేదు. దాంతో పాతాళుడు నదిలో మునిగినప్పుడల్లా విపరీతంగా నీళ్ళు త్రాగటం ప్రారంభించాడు. అలా కొద్ది క్షణాలు గడిచాయి. తానుకూడా అతడితోపాటు ఉంటే తనకూడా మునిగిపోతానని అర్థం చేసుకున్న అతని భార్య, అతని చేతి పట్టు నుండి విడిపోయి ఆ నీళ్ళలో వేగంగా ఈదుతూ అవతలి గట్టుకి చేరుకున్నది. ఇక, పాతాళుడు నీళ్ళు విపరీతంగా త్రాగటంవల్ల అతని పొట్ట ఉబ్బిపోయింది. అది గమనించిన అతని భార్య తన మనసులో ఇలా అనుకున్నది. "నా భర్తను ఈ నది నుండి రక్షించటం నాకు సాధ్యం కాదు. ఇతడు ఖచ్చితంగా ఈ నీళ్ళలో మునిగి చనిపోతాడు. ఇతడు పోయిన తరువాత నేను ఎలా బ్రతకాలి?. అందువల్ల, అతని దగ్గర ఇప్పుడే ఒక పాట నేర్చుకుంటా. ఆ పాట జనాల మధ్యపాడి వాళ్ళ మెప్పుపొంది, ఆపై వాళ్ళు ఇచ్చే సొమ్ము తీసుకుని, ఆ సొమ్ముతో నా పొట్టపోసుకుంటా".

ఈవిధంగా ఆలోచించుకున్న ఆమె పెద్ద స్వరంతో ఇలా అన్నది. "ఓ ప్రాణ సఖా! నీ మరణం ఖాయమని తేలిపోయింది. నీవు పోయిన తరువాత నేను ఎలా బ్రతకను?, అందుకే కనీసం ఒక చిన్న పాట అన్నా నాకు నేర్పు. అది పాడుకుని నా పొట్ట గడుపుకుంటాను". నదిలో మునకలు వేస్తూ ఊపిరి ఆడక సతమతమవుతున్న పాతాళుడు ఎలాగో గొంతు పెగల్చుకుని భార్యతో ఇలా అన్నాడు. "ఓ ప్రియా! మనుషులు మూర్ఛపోయినప్పుడు నీళ్ళుచల్లి నిద్రలేపుతారు. గొంతు ఎండిపోయి మరణించటానికి సిద్ధంగా ఉన్న మనిషి నోట్లో నీళ్ళుపోస్తే ఆ మనిషి బ్రతుకుతాడు. అలా బ్రతికించాల్సిన నీళ్ళు, ఈ క్షణంలో నన్ను చంపాలని చూస్తున్నాయి. ఈ పరిస్థితుల్లో నేను, నీకు ఒక పాటను ఎలా నేర్పగలను".

"సుబుద్ధి" ఈ కథచెప్పి, ఆపై మహారాజుతో ఇలా అన్నాడు. "ప్రభూ! ఎవరికైనా ప్రమాదం వస్తే ప్రభువుని రక్షణ కోరతారు. కానీ, అలాంటి ప్రభువే ప్రజలకి ప్రమాదాన్ని కలిగిస్తే వాళ్ళని రక్షించేది ఎవరు?". అప్పుడు కూడా మహారాజు అమాయకత్వం నటిస్తూ "మిత్రమా! నీవు చెప్పిన కథ నాకు అర్థమయ్యింది. కానీ, దొంగలు ఎక్కడ ఉన్నారు? అన్నదానికి, ఈ కథకి సంబంధం ఏముందో నాకు అర్థం కావటంలేదు

సుమా" అన్నాడు. అప్పుడు "సుబుద్ధి", చిన్నగా నవ్వి "నీకు ఇంకొక కథ చెబుతాను. ఆ కథ శ్రద్ధగా వింటే దొంగలు ఎవరో నీకు స్పష్టంగా అర్థమైపోతుంది" అన్నాడు. ఆపై "సుబుద్ధి" ఇంకొక కథను ఇలా చెప్పటం ప్రారంభించాడు.

పూర్వం హిమాలయ పర్వత ప్రాంతంలోని ఒక ప్రదేశంలో అనేక కొమ్మలు గల ఒక పెద్ద వృక్షం ఉండేది. ఆ వృక్షం మీద వేల సంఖ్యలో పక్షులు నివసిస్తూ ఉండేవి. ఒక సమయంలో ఆ చెట్టు యొక్క రెండు కొమ్మలు ఒకదానిని ఒకటి బలంగా రుద్దుకోవటం వల్ల నిప్పు పుట్టింది. కొద్దిసేపట్లోనే, ఆ నిప్పు పెద్ద జ్వాలగా మారి ఆ చెట్టును దహించటం ప్రారంభించింది. దట్టమైన పొగ ఆ చెట్టుని ఆవరించింది. ఈ విధ్వంసాన్ని చూసిన ఆ పక్షుల యొక్క పెద్ద, విచారంతోకూడిన స్వరంతో మిగిలిన పక్షులతో ఇలా అన్నది. "మనకు ఆశ్రయం మరియు రక్షణ ఇస్తున్న ఈ చెట్టు, ఇప్పుడు అగ్నిగుండంగా మారి మనల్ని బలితీసుకుంటున్నది. ఇప్పుడు మనల్ని ఎవరు రక్షిస్తారు?".

ఈవిధంగా ఆ మహారాజుకు ఈ కథను చెప్పిన "సుబుద్ధి", ఆపై ఆ రాజుతో "ఓ ప్రభూ! పక్షులకి రక్షణ ఇవ్వాల్సిన చెట్టు ఆ పక్షుల్ని దహించటానికి సిద్ధపడింది. అలాగే, ప్రజల్ని రక్షించాల్సిన రాజే దొంగలాగా మారితే ఆ ప్రజలకు రక్షణ ఎవరు?. ఈ కథను నీవు జాగ్రత్తగా అర్థంచేసుకుంటే దొంగలు ఎవరో నీకే అర్థం అవుతుంది" అన్నాడు. ఆ కథలోని అంతరార్థం తనకు అర్థమైనప్పటికీ ఆ రాజు ఏమీ తెలియనట్లుగా నటిస్తూ "ఈ కథ గురించి నాకు అనవసరం. దొంగలు ఎవరో?, ఎక్కడ ఉన్నారో? చెప్పు" అన్నాడు. అప్పుడు "సుబుద్ధి" ఎంతో ఓర్పుతో మళ్ళీ ఇంకొక కథను ఇలా చెప్పాడు.

పూర్వం వారణాసికి దగ్గరలో ఉన్న ఒక గ్రామం పొలిమేరల్లో ఒక కుమ్మరివాడు నివసిస్తూ ఉండేవాడు. అతడు కుండలు చెయ్యటంకోసం వారానికి ఒకసారి ఆ ప్రక్కనే ఉన్న ఒక ప్రదేశంలో బండెడు బంకమట్టి త్రవ్వి ఇవతలికి తీసుకువచ్చేవాడు. ఆపై, ఆ మట్టితో కుండలుచేసి ఆ కుండల్ని ప్రజలకు అమ్ముకుని, ఆ వచ్చిన సొమ్ముతో జీవిస్తూ ఉండేవాడు. అలా అనేక సంవత్సరాలు గడిచాయి. చాలాకాలంపాటు మట్టిని త్రవ్వటంవల్ల ఆ ప్రాంతంలో చాలాపెద్ద గుంట ఏర్పడింది. ఒకరోజున ఆ కుమ్మరివాడు మట్టి త్రవ్వటంకోసం, లోతుగా ఉన్న ఆ గుంటలోకి దిగి మట్టిని త్రవ్వుతున్నాడు. ఇంతలో, దురదృష్టవశాత్తు ఆకస్మాత్తుగా ఆకాశంలో కారుమబ్బులు దట్టంగా కమ్ముకున్నాయి. క్షణాలలో కుంభవృష్టి ప్రారంభం అయ్యింది. ఒక పిడుగు

కూడా పడింది. ఫలితంగా, ఆ గుంటయొక్క అంచు విరిగి, పెద్ద మొత్తంలో ఒక మట్టి దిబ్బ, గుంటలో అడుగున ఉన్న ఆ కుమ్మరి తలపై పడింది. అంత బరువైన మట్టి దిబ్బ తలపై పడటంతో ఆ కుమ్మరి తల పగిలిపోయింది. ఆ తల నుండి రక్తం ధారగా కారుతున్నది. అప్పుడు ఆ కుమ్మరి, వణుకుతున్న స్వరంతో ఇలా అన్నాడు. "మట్టిలో విత్తనాలు మొలిచి, పంటగా మారి ఆపై మానవులకు ఆహారంగా మారి వాళ్ళని బ్రతికిస్తాయి. అలా మనుషుల్ని రక్షించే మట్టి, ఇప్పుడు నా తల పగలకొట్టి నన్ను చంపుతున్నది".

ఈ కథ చెప్పటం పూర్తిచేసిన "సుబుద్ధి" గంభీరమైన స్వరంతో "ఓ రాజా! ఈ మట్టి, మానవులకు ఆశ్రయం ఇస్తున్నది. ఈ మట్టే మానవులకు ఆహారాన్ని ఇస్తున్నది. అలా మనుషులకు రక్షణ కల్పించాల్సిన ఆ మట్టి ఆ కుమ్మరి తలను పగలకొట్టి అతని మరణానికి కారణమైంది. అలాగే, ప్రజలకు రక్షణ కల్పించాల్సిన ప్రభువే దొంగతనం చేయిస్తే ప్రజల్ని ఎవరు కాపాడుతారు?. ఈ కథలోని మర్మాన్ని ఇప్పటికైనా అర్ధంచేసుకుని, దొంగలు ఎవరో తెలుసుకో" అన్నాడు.

మోసగాడు మరియు కుచ్ఛితుడైన ఆ రాజు అప్పటికి కూడా ఆ దొంగలు ఎవరో తనకు తెలుసునని, తానే వాళ్ళని పంపించానని ఒప్పుకోకుండా, ఆపై మోసం నిండిన స్వరంతో "దొంగలు ఎవరో నువ్వు చెబితేగాని, నీకు పాదముద్రలను బట్టి దొంగల్ని వెతికే శక్తి ఉందని అంగీకరించను. ఆ దొంగలు ఎవరో చెప్పకపోతే నువ్వు మోసగాడివి అని నిర్ణయించి నిన్ను శిక్షిస్తాను" అన్నాడు. అప్పటివరకు "సుబుద్ధి" చెప్పిన కథలను విన్న అక్కడ ఉన్న ప్రజలకు "సుబుద్ధి", మహాత్ముడని, దొంగతనం చేయించి ఆ మహాత్ముడిని పరీక్షకు గురిచేస్తున్నది మోసగాడైన మహారాజని స్పష్టంగా అర్ధమైపోయింది. ఆ మహారాజుమీద వాళ్ళందరికీ విపరీతమైన ఆగ్రహం కలిగింది. దాంతో, వాళ్ళు అందరూ ఆ మహారాజుపైపడి చచ్చేటట్లు చావకొట్టారు. ఆ దెబ్బలకు తట్టుకోలేక ఆ మహారాజు ప్రాణాలు వదిలాడు. ఆపై, ఆ ప్రజలు తాము, ధర్మాత్ముడు అని భావించిన "సుబుద్ధి"ని ఆ రాజ్యానికి రాజుగా నియమించుకున్నారు.



# 19. మహా శైవయోగి కలయ నయనార్ జీవిత విశేషాలు?

చారిత్రక కాలంలో ఆనాటి చోళ సామ్రాజ్యంలోని తిరుకడవూర్ అనే ఒక మహా శైవ క్షేత్రంలో కలయనయనార్ అనే ఒక మహా శివయోగి జన్మించాడు. ఈ క్షేత్రంలోని పరమశివునియొక్క అవతారం పేరు "అమృదఘటేశ్వరర్ (అమృత ఘట ఈశ్వరుడు). ఈ క్షేత్రంలోని స్వామికి ఆ పేరు రావటానికి ఒక కారణం ఉన్నదని పురాణాలలో చెప్పబడి ఉన్నది. అది ఏమిటంటే...

ఒకప్పుడు దేవ-దానవులు, పాల సముద్రాన్ని మధించి అమృతాన్ని సముద్రం నుండి బైటకు తీసారు. ఆ తరువాత వాళ్ళు ఆ అమృతాన్ని త్రాగటంకోసం అమృతం ఉన్న భాండాన్ని (కుండ) తీసుకుని నేటి తిరుకడవూర్ ప్రాంతానికి వచ్చారు. పవిత్రమైన ఆ అమృతాన్ని శుభ్రంగా స్నానంచేసి త్రాగాలని నిర్ణయించుకున్న దేవ-దానవులు తాము తెచ్చిన అమృత భాండాన్ని అక్కడే ఒకచోట నేలపై ఉంచి, ఆపై దగ్గరలో ఉన్న సరస్సులో స్నానం చెయ్యటానికి వెళ్ళారు. కొద్ది సేపట్లోనే స్నానం ముగించుకుని ఆ దేవ-దానవులు, అమృతం త్రాగటంకోసం మహా ఆత్రంతో, అమృతభాండం ఉన్న ప్రదేశానికి వచ్చారు. వాళ్ళు ఒకటి తలస్తే - విధి ఇంకొక రకంగా తలచింది. ఫలితంగా, వాళ్ళు ఆ ప్రదేశంలో ఉంచిన అమృత భాండం ఒక శివలింగంగా మారిపోయింది. అమృతం ఉన్న భాండం, శివలింగంగా మారటంచేత ఆ శివలింగానికి 'అమృతలింగం' అన్న పేరు వచ్చింది. ఆవిధంగా, అమృతభాండం శివలింగంగా మారిపోవటంతో చేసేదిలేక దేవ-దానవులు అక్కడ నుంచి వెళ్లిపోయారు. ఆ తరువాతకాలంలో బాలుడైన మార్కండేయ మహర్షి ఈ అమృత లింగాన్ని ఎంతో భక్తి శ్రద్ధలతో పూజించి ఆపై పరమేశ్వరుని అనుగ్రహాన్ని పొంది మరణమేలేని చిరంజీవి అయ్యాడు. ఫలితంగా, మార్కండేయుడు సర్వ కాలాలలో 16 సంవత్సరాల నవ యువకుడిగా కనిపిస్తూ ఉంటాడు.

ఈ క్షేత్రంలోని పరమశివుని పట్ట మహిషి పేరు అభిరామి అమ్మన్. ఈ దేవత అపూర్వమైన మహిమలు గలదని, తన భక్తులకోసం ఎంతటి మహత్యాన్ని అయినా అవలీలగా ప్రదర్శిస్తుందని చెప్పుకుంటారు. ఒక సమయంలో అభిరామి పట్టర్ అనే పేరుగల ఒక దేవీ భక్తుడు ఈ క్షేత్రంలోని అమ్మవారిని ఎల్లవేళలా నిశ్చలమైన భక్తితో ఆరాధిస్తూ ఉండేవాడు. ఒక సమయంలో ఏదో కారణంమీద ఈ భక్తుడికి ఆ ప్రాంతాన్ని

పాలించే ప్రభువుతో తీవ్రమైన వివాదం వచ్చింది. ఈ భక్తుడు, ఆ సమయంలో వచ్చిన ఒక అమావాస్య రాత్రిని 'పున్నమిరాత్రి' అని పొరపాటున చెప్పాడు. ఆవిధంగా తప్పుగా చెప్పినందువల్ల ఆ ప్రాంతపు ప్రభువు, అభిరామి పట్టర్‌ను శిక్షించాలని ప్రయత్నించాడు. తన భక్తుడైన అభిరామి పట్టర్‌ను రక్షించటంకోసం అనగా ఆ భక్తుడు చెప్పిన మాటను నిజం చెయ్యటంకోసం అమ్మవారు, తన మహత్యంతో ఆనాటి అమావాస్య రాత్రిలో – ఆకాశంలో పున్నమి చంద్రుడు కనిపించేలా చేసింది. అభిరామి పట్టర్ కారణంగా అమావాస్యనాడు పున్నమి చంద్రుడు కనపడటంతో ఆ ప్రాంత ప్రభువు, అభిరామి పట్టర్‌ని మహా పురుషుడని గ్రహించి ఆపై ఆ భక్తుడిని ఎంతో గౌరవించాడు.

ఇక అసలు కథలోకి వద్దాం...కలయ నయనార్, దైవ భక్తి కలిగిన ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించాడు. ఇతడు ఎల్లప్పుడూ ఒక చిన్న మట్టి పాత్రను లేదా కుండను చేత్తో పట్టుకుని అమృతఘటేశ్వర్ ఆలయంలో తిరుగుతూ ఉండేవాడు. అతని చేతిలోని ఈ చిన్న కుండలో ఉన్న నిప్పులపైన సాంబ్రాణి మండుతూ ఉండేది. ఆవిధంగా ఈ నయనార్, తన ఇష్టదైవం అయిన పరమశివుడికి, అవకాశం ఉన్నప్పుడల్లా సాంబ్రాణి ధూపాన్ని సమర్పిస్తూ ఆనందంతో తబ్బిబ్బు అవుతూ ఉండేవాడు. అనేక సంవత్సరాల పాటు తనకు సాంబ్రాణి ధూపాన్ని సమర్పించిన కలయ నయనార్ పట్ల పరమశివుడికి విపరీతమైన అభిమానం ఏర్పడింది. అయితే , ఎంతటి భక్తుడిని అయినా ముందుగా కఠినంగా పరీక్షించి, ఆపై ఆ భక్తుడికి తన దర్శనాన్ని ఇవ్వటం పరమశివుడికి అలవాటు. అందుకే, ఆయన తన పరమ భక్తుడైన కలయ నయనార్‌కి తనపట్ల ఉన్న భక్తి ఎంత దృఢమైనదో? పరీక్షించాలని నిర్ణయించు కున్నాడు. ఆ పరీక్షలో కలయనయనార్ నెగ్గినట్లయితే, లోకానికి కూడా ఆ నయనార్ ఎంతటి మహా భక్తుడో తెలుస్తుందని పరమశివుడు తీర్మానించుకున్నాడు.

తన భక్తుడైన నయనార్‌ని పరీక్షించాలని శివుడు నిర్ణయం తీసుకున్న కొద్ది రోజుల్లోనే కలయ నయనార్ సంపదలు హఠాత్తుగా నశించి పోయాయి. ఫలితంగా, ఆ నయనార్ తన ఇంటితో సహా ఉన్న వస్తువులన్నింటినీ అమ్ముకున్నాడు. ఆపై, ఆ నయనార్ కుటుంబం శివాలయానికి దగ్గరలో ఉన్న ఒక చిన్న గుడిసెలో నివసించటం ప్రారంభించింది. తన సమస్తమూ పోయినప్పటికీ కలయనయనార్ తన ప్రియదైవం అయిన శివుడిపై ఉన్న భక్తిని ఏమాత్రం కోల్పోలేదు. ఎప్పటిలాగానే ఆ క్షేత్రంలోని పరమశివుని లింగం ముందు ఎంతో భక్తితో సాంబ్రాణి ధూపాన్ని సమర్పిస్తూనే ఉన్నాడు.

కొద్ది నెలలు గడిచాయి. కలయనయనార్ కుటుంబానికి కొద్ది రోజులపాటు ఆహారం లేకుండా పోయింది. అలాంటి పరిస్థితుల్లో, ఆ నయనార్ భార్య, కొద్ది రోజులుగా ఆకలి బాధతో అలమటించి పోతున్న తన బిడ్డలకు అన్నంపెట్టటంకోసం తన మెడలోని మంగళ సూత్రాన్ని తీసి తన భర్త చేతికి ఇచ్చి ఆయనతో ఇలా అన్నది. "స్వామీ! ఏ హైందవ స్త్రీ, తన భర్త సజీవంగా ఉన్నంత వరకు తన మెడలోని మంగళ సూత్రాన్ని తియ్యకూడదు. కానీ, మన పేదరికం కారణంగా మన బిడ్డలకు కొద్ది రోజులుగా ఆహారం లేకుండా పోయింది. ఇంకా కొద్ది రోజులు గడిస్తే ఆ బిడ్డలు ఆకలితో చనిపోతారు. వాళ్ళు అలా చనిపోవటం మనకి ధర్మంకాదు. అందుకే పాపం అయినా సరే, నా మాంగల్యాన్ని తీసి నీకు ఇస్తున్నాను. దీనిని ఏదైనా నగల దుకాణంలో అమ్మి, ఆపై అలా వచ్చిన సొమ్ముతో భోజనానికి కావలసిన పదార్థాలను తీసుకురా". భార్య చెప్పిన మాటలను శ్రద్ధగా విన్న కలయ నయనార్, ఆమె ఇచ్చిన మంగళ సూత్రాన్ని జాగ్రత్తగా చేతిలో పట్టుకుని ఆపై ఆ ప్రాంతంలోని ఒక నగల దుకాణానికి బయలు దేరాడు. ఇంకా కొద్ది అడుగులు నడిస్తే నగలు దుకాణం వస్తుంది అనగా, హఠాత్తుగా మార్గ మధ్యంలో ఒక వ్యక్తి, కలయ నయనార్‌కి ఎదురుపడ్డాడు. ఆ వ్యక్తి చేతిలో ఒక వెదురు బుట్ట ఉన్నది. ఆ బుట్టలో సాంబ్రాణి గడ్డలు ఉన్నాయి. ఆ వ్యక్తి, నేరుగా కలయ నయనార్ ముందుగా నిలబడి ఆపై చిరునవ్వు నవ్వుతూ అతనితో "అయ్యా! నీవు ప్రతిరోజూ నీ ఇష్టదైవం అయిన పరమ శివుడికి సాంబ్రాణి ధూపాన్ని సమర్పిస్తున్నావని తెలుసుకున్నాను. ప్రస్తుతం నేను అరేబియా దేశం నుండి తెప్పించిన సాంబ్రాణిని ఈ ప్రాంతంలో విక్రయించటానికి తీసుకువచ్చాను. ఈ సాంబ్రాణిని నిప్పులపై వేస్తే, మనసును మైమరపించే ధూపం వస్తుంది. ఇది చాలా ఖరీదైన సాంబ్రాణి. శివభక్తుడివి అయిన నీవు ఈ సాంబ్రాణిని కొనుక్కుంటావని ఆశిస్తున్నాను" అన్నాడు.

తన ఇష్టదైవం అయిన పరమశివుడికి ఆ ఖరీదైన సాంబ్రాణి ధూపం వెయ్యాలని ఆ క్షణంలోనే నిర్ణయించుకున్న కలయనయనార్ ఆపై ఏమాత్రం ఆలోచించకుండా, తన దగ్గర ఉన్న బంగారు మంగళ సూత్రాన్ని ఆ వ్యక్తికి ఇచ్చి, ఆపై ఎంతో సంతోషంతో ఆ వ్యక్తి చేతిలోని సాంబ్రాణి బుట్టను తన చేతిలోకి తీసుకున్నాడు. ఆపై, కలయ నయనార్ ఆ సాంబ్రాణి బుట్టను తన తలపై పెట్టుకుని మహా సంతోషంతో శివాలయంవైపు వెళ్ళిపోయాడు. ఆ తరువాత ఆ సాంబ్రాణితో నిర్విరామంగా పరమశివుడికి ధూపం వేస్తూ ఆనందించ సాగాడు.

ఈ భూమిపై జన్మించిన ఏ జీవి అయినా సరే – మనిషితో సహా, ఆకలి తీర్చుకోవటం కోసం ఎంతకైనా తెగించటం జరుగుతుంది. అంతటి తీవ్రమైన ఆకలి బాధను కూడా లెక్కచెయ్యకుండా కలయ నయనార్ ఏవిధంగా తనను ఆరాధిస్తాడో పరీక్షించాలని భావించిన పరమశివుడు, సాంబ్రాణి అమ్మే వ్యక్తి రూపంలో కలయ నయనార్‌కి కనిపించి, ఆపై అతడికి సాంబ్రాణిని ఇచ్చి, అందుకు బదులుగా అతడి



దగ్గర ఉన్న మంగళ సూత్రాన్ని తీసుకున్నాడు. ఆ మంగళ సూత్రాన్ని అమ్మి తన కుటుంబం ఆకలి తీర్చుకోవాలి అన్న విషయాన్ని ఏమాత్రం పట్టించుకోకుండా కలయ నయనార్ ఆ మంగళ సూత్రంతో పరమశివుడికి సాంబ్రాణిని కొన్నాడు.

చీకటి పడింది. తన భర్త ఇంకా ఇంటికి రాకపోవటంతో ఆ భార్య ఎంతో ఆందోళనకు గురి అయ్యింది. ఎప్పుడో, మధ్యాహ్న సమయంలో మంగళ సూత్రాన్ని తీసుకువెళ్ళిన తన భర్త, రాత్రి అయినా తిరిగి రాకపోవటంతో ఆమెకు ఏం చెయ్యాలో అర్థం కాలేదు. ఎలాగో, అతి కష్టంమీద తన బిడ్డలకు మంచినీళ్ళు త్రాగించి ఆపై వాళ్ళని నిద్రపుచ్చింది. మంగళ సూత్రాన్ని అమ్మి, ఆహార పదార్థాలను తీసుకు రావలసిన భర్త ఇంకా ఇంటికి తిరిగి రాకపోయినా – గుణవతి అయిన ఆమె తన భర్తను ఏమాత్రం నిందించలేదు. పిల్లల్ని నిద్రపుచ్చిన ఆమె, ఆపై ఆ గుడిసెలో ఒకచోట కూర్చుని శివ నామాన్ని మహా భక్తితో జపం చెయ్యటం ప్రారంభించింది.

“తన భర్తను తప్ప ఇతర ఏ దైవాన్ని పూజించని స్త్రీ, కోరుకుంటే వర్షం కూడా కురుస్తుందని” ఒక తమిళ సిద్ధుడు ఉద్ఘాటించాడు. తన భర్త చేసే దైవ సేవకు పరిపూర్ణంగా సహకరిస్తున్న కలయనయనార్ భార్యపైన పరమశివునికి ఎంతో అనుగ్రహం కలిగింది. ఆపై, ఆయన – నిద్రపోతున్న ఆమెకు స్వప్నంలో కనిపించి ఆమెతో “బిడ్డా! నీ పతిభక్తి నన్ను సంతోషింప చేసింది. నీకు సమస్త భోగ భాగ్యాలను ప్రసాదిస్తున్నాను” అన్నాడు.

తెల్లవారుఝాము సమయంలో మెళుకువ వచ్చి చూసిన ఆమెకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. కారణం, ఆమె ఒక పట్టు పరుపు వేసిన పట్టె మంచంమీద పడుకుని ఉన్నది. ఆ మంచంమీద నుండి దిగి చుట్టూ చూసిన ఆమెకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. కారణం, రాత్రి పడుకునేటప్పుడు ఒక చిన్న గుడిసెలో ఉన్న ఆమె, ఇప్పుడు ఒక పెద్ద భవనంలో ఉన్నది. అంతేకాదు, ఆమె చుట్టూ వెండి, బంగారు నాణాలు కుప్పలుగా పోసి ఉన్నాయి. తమ కుటుంబాన్ని పరమశివుడు అనుగ్రహించాడని అర్థం చేసుకున్న ఆమె ఎంతో సంతోషించింది. ఆపై, ఆమె తన భర్త మరియు సంతానంకోసం చక్కటి రుచికరమైన భోజనాన్ని వండి, ముందు పిల్లలకు కడుపునిండా పెట్టి, ఆపై వాళ్ళను ఆడుకోవటానికి బైటకు పంపించింది. ఆ తరువాత తన భర్త రాకకోసం ఎదురుచూస్తూ వాకిటి ద్వారం వద్ద నిలబడింది.

ఇక్కడ ఆమె అలా వాకిటి ద్వారం ముందు నిలబడి తన భర్తకోసం ఎదురు చూస్తున్న సమయంలో – అక్కడ ఆలయంలో శివుని ముందు నిలబడి సాంబ్రాణి ధూపం వేస్తున్న కలయనయనార్ ముందు పరమశివుడు ప్రత్యక్షం అయి, ఆపై వాత్సల్యం ధ్వనిస్తున్న స్వరంతో “ఓ పుణ్యాత్ముడా! నీవు ఇప్పటిదాకా నాకు చేసిన సాంబ్రాణి సేవకు ఎంతో సంతోషిస్తున్నాను. నీ భార్య నీకోసం రుచికరమైన ఆహార పదార్థాలను వండి నీకు వడ్డించటంకోసం నీ ఇంట్లో ఎదురు చూస్తున్నది. ఇక, నీవు నా సేవను ఆపి నీ ఇంటికి బయలు దేరు” అన్నాడు. పరమశివుడు ఆవిధంగా ఆజ్ఞాపించటంతో కలయనయనార్ ఎంతో సంతోషంతో తన ఇంటికి నడక ప్రారంభించాడు. ఇంటికి వెళ్ళే సరికి – “నిన్న మధ్యాహ్నం వరకు గుడిసెగా ఉన్న తన నివాసం ఇప్పుడు ఒక అద్భుత భవనంలాగా కనిపించే సరికి” కలయనయనార్ సంభ్రమాశ్చర్యాలకు గురి అయ్యాడు. పరమ శివుడు తనను ఆవిధంగా సంపదలతో కరుణించాడని అర్థం చేసుకున్న కలయనయనార్, పరమశివుడికి తన కృతజ్ఞతలను తెలియజేసాడు. పరమశివుడు తనకు ప్రసాదించిన సంపదతో ప్రతిరోజూ అనేకమంది

శివ భక్తులకు అన్నదానం చేస్తూ, నిరంతరం ఆ శివభక్తులతో కలిసి శివ నామాన్ని జపిస్తూ కాలం గడపటం ప్రారంభించాడు.

కొద్ది నెలలు గడిచాయి. ఒక రోజు ఉదయం, కలయనయనార్‌కి, అక్కడకు దగ్గరలో ఉన్న తిరుప్పాండల్ క్షేత్రానికి వెళ్ళి, ఆ క్షేత్రంలో కొలువైన అరుణాసతేసర్ అనే శివ లింగాన్ని దర్శించుకోవాలనిపించింది. ఈ క్షేత్రంలోని శివలింగానికి ఒక ప్రత్యేకత ఉన్నది. అది ఏమిటంటే, త్రేతాయుగంలో జీవించిన "తాటకి" అనే ఒక ఆడ రాక్షసి, సంతానం పొందటంకోసం ఈ క్షేత్రంలోని శివలింగాన్ని ప్రతిరోజూ క్రమం తప్పకుండా పూజిస్తూ ఉండేది. ఒక రోజున ఆమె, మధ్యాహ్నం దాకా శివలింగాన్ని పూజించి, ఆపై ఆ శివలింగం పైన ఒక పెద్ద పూల దండను వెయ్యాలని నిర్ణయించుకుని, ఆపై తన రెండు చేతులను పైకి ఎత్తి ఆ దండను శివలింగంమీద వెయ్యాలని ప్రయత్నించింది. విధివశాత్తూ, ఆ సమయంలో ఆమె నడుము చుట్టూ ఉన్న వస్త్రం క్రిందకి జారిపోవటం మొదలయ్యింది. దాన్ని పైకి లాక్కోవటానికి ఆ సమయంలో వీలుకాదు. కారణం, అప్పుడు ఆ సమయంలో ఆమె తన రెండు చేతులతో పూల దండను పట్టుకుని ఉన్నది. "నడుము దగ్గర ఉన్న వస్త్రం క్రిందకు జారిపోతే తన మర్యాద పోతుందని" గ్రహించిన ఆ తాటకి తన రెండు చేతుల్ని కొంచెం క్రిందకు వంచి, తన రెండు మోచేతులతో ఆ వస్త్రం, మరింత క్రిందకు జారిపోకుండా అడ్డుకున్నది. ఆవిధంగా ఆమె, తన మోచేతులతో నడుము దగ్గర ఉన్న వస్త్రాన్ని అడ్డుకోవటంతో ఆమె చేతులు పైకి ఎత్తలేకపోయింది. అనగా, తన చేతిలోని దండను శివలింగంపైన వెయ్యలేక పోయింది. తన భక్తురాలి అవస్థను గమనించిన లింగ రూపుడైన శివుడు ప్రక్కకి వంగాడు. (అనగా శివ లింగం క్రిందకి వంగింది.) ఫలితంగా, తాటకి తన చేతుల్ని ఎత్తకుండానే ఆ శివలింగంపైన పూల దండను వేయ గలిగింది.



ఆ తరువాత కాలంలో కూడా ఆ శివలింగం అలా ప్రక్కకి వంగి ఉండిపోయింది. ఎంతోమంది భక్తులు ఆ లింగాన్ని నిటారుగా చెయ్యాలని ప్రయత్నించినా ఫలితం లేకుండా పోయింది. తమ రాజ్యంలోని ఆ శివలింగం వంకరగా ఉండే సరికి ఆ రాజ్య ప్రభువు, ప్రతిరోజూ ఎంతో బాధపడుతూ ఉండేవాడు. ఏదిఏమైనా, ఆ ఆలయానికి వచ్చిన కలయనయనార్‌కి అక్కడ పరిస్థితి అర్ధమయ్యింది. వంకరగా ఉన్న ఆ శివలింగాన్ని నిటారుగాచేసి ఆ రాజ్య ప్రభువుకి సంతోషాన్ని కలిగించాలని ఆ నయనార్ నిర్ణయించుకున్నాడు.

ఆ తరువాత ఆయన, ఎంతో మంది భక్తులతో కలిసి ఆ ఆలయంలోకి వెళ్ళాడు. ఆ తరువాత ఆ శివలింగానికి ఒకసారి నమస్కరించి, ఆపై ఒక పెద్ద తాడుయొక్క ఒక కొసను, వంకరగా ఉన్న శివలింగానికి కట్టి, ఇంకొక కొసను తన మెడలో కట్టుకుని, ఆపై తన మెడను బలంగా వెనక్కి లాక్కున్నాడు. అద్భుతం! అప్పటి వరకు ఎంతో కాలంగా వంకరగా ఉన్న ఆ శివలింగం, నాటారుగా మారిపోయింది. మహా భక్తుడైన కలయనయనార్ యొక్క మహా శివభక్తి కారణంగానే ఆ శివలింగం నిటారుగా మారిందని అక్కడ ఉన్న శివ భక్తులందరికీ అర్ధమయ్యింది. ఆ తరువాత కలయనయనార్ కొంతకాలంపాటు ఆ క్షేత్రంలోనే ఉండి శివుడిని తృప్తి తీరా పూజించుకుని, ఆపై తన స్వప్రాంతానికి వెళ్ళాడు. ఆ తరువాత కొన్నేళ్ళపాటు కలయనయనార్ శివభక్తిని ఈ లోకంలో ప్రచారంచేసి, అంతిమంగా తన భౌతిక దేహాన్ని త్యజించి జ్యోతిరూపంలో పరమశివుడిలో లీనం అయిపోయాడు.



# 20. ఆధ్యాత్మిక మార్గాన్ని అడ్డగించే కామ ప్రభావం?

మనిషికి ఉండే కోరికలలో అత్యంత శక్తివంతమైనది “కామం” అని శాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి. మనిషి ఏ కోరికనైనా నిగ్రహించుకోవచ్చు. కానీ, కామాన్ని నిగ్రహించుకోవటం దాదాపు అసాధ్యం అని చెప్పాలి. ఇంకొక విశేషం ఏమంటే, మనిషి శరీరంలో పంచేంద్రియాలు ఉంటాయి. ఒక్కొక్క ఇంద్రియం ఒక్కొక్క లక్షణాన్ని కలిగి ఉంటుంది. ఉదాహణకి...ముక్కు, వాసనను తెలుసుకోవటానికి ఉపయోగిస్తుంది. కళ్ళు, ఎదురుగా ఉండే వస్తువు యొక్క రూపం ఎలా ఉందో తెలుసుకునే శక్తిని ఇస్తుంది. ఇక, కోరికల విషయానికి వచ్చినట్లయితే చాలా కోరికలు ఈ

పంచేంద్రియాలలో ఏదోఒక ఇంద్రియం ద్వారా తృప్తిపరచబడుతుంది. ఉదాహరణకి – ఒక వ్యక్తికి "ఇరానీ సమోసా" తినాలని కోరిక కలిగింది అనుకుందాం. అతడు దానిని తిన్నప్పుడు, నాలుక ద్వారా దానియొక్క రుచి అతడి మనసుకి తెలుస్తుంది. అనగా, నాలుక ద్వారా అతడు ఆ సమోసా యొక్క రుచిని అనుభవించి తృప్తి చెందుతాడు. కానీ, శృంగారం విషయానికి వచ్చినట్లయితే మనిషిలోని పంచేంద్రియాలూ – మనిషి, శృంగార తృప్తిని పొందటంలో పాత్ర వహిస్తాయి. అందమైన స్త్రీని కళ్ళతో చూస్తాడు. ఆమె యొక్క స్వరాన్ని చెవులతో వింటాడు. ఇక ఆమె యొక్క శరీరం నుండి వచ్చే సువాసలను ముక్కుతో ఆఘ్రాణిస్తాడు. ఇక, ఆమెతో శృంగారం జరపటానికి ముందు, జరిపే సమయంలో – ఆమె శరీరాన్ని ముద్దాడటంకోసం తన నాలుకను, పెదవులను ఉపయోగిస్తాడు. ఎదుటి వస్తువు యొక్క స్పర్శను తెలియజేసే 'చర్మం' ద్వారా ఆమె శరీర స్పర్శను తెలుసుకుంటాడు. అనగా, శృంగార సంభోగం ద్వారా పురుషుడు తృప్తి చెందాలంటే అతని శరీరంలోని పంచేంద్రియాలూ పనిచేయాల్సి ఉంటుంది. ఇంకొక విచిత్రం ఏమంటే, ఒకవ్యక్తి తనకు ఇష్టమైన పదార్థాన్ని తిన్నప్పటికీ అతనికి పెద్దగా తృప్తి కలగదు. కానీ, ఒక స్త్రీని సంభోగించినప్పుడు అతనికి పరిపూర్ణమైన తృప్తి చాలాసార్లు కలుగుతుంది. ఇంకొక విశేషం ఏమంటే, ఇతర ఏ కోరికలైనా బహిరంగంగా తీర్చుకోవచ్చు. ఉదాహరణకి – రోడ్డు ప్రక్క బండిమీద అమ్మే మిర్చి బజ్జీలు నిరభ్యంతరంగా, బహిరంగంగా హాయిగా ఆరగించవచ్చు. కానీ, శృంగారాన్ని ఎక్కడ పడితే అక్కడ బహిరంగంగా అనుభవించే అవకాశం ఉండదు. ఇతర కోర్కెలు తీర్చుకోవటానికి అవకాశాలు చాలా ఉంటాయి. కానీ, శృంగార సంబంధ కోర్కెలు తీర్చుకునే అవకాశాలు చాలా తక్కువగా ఉంటాయి.

శృంగార వాంఛ విషయంలో మానవులకు మరియు ఇతర జంతువులకు మధ్య విపరీతమైన తేడా ఉన్నదని చెప్పక తప్పదు. ఆడ జంతువులు "ఋతుకాలం"లో ఉన్నప్పుడు మాత్రమే అనగా, గర్భాన్ని ధరించగల స్థితిలో ఉన్నప్పుడు మాత్రమే మగ జంతువులు వాటితో సంభోగం జరుపుతాయి. అంతేకాకుండా, ఆడ జంతువు గర్భవతి అయిన తరువాత ఏ మగ జంతువూ ఆ ఆడజంతువుతో సంభోగించాలని ప్రయత్నించదు. ఆ కారణంగానే, మగ జంతువులలో ఎప్పుడుపడితే అప్పుడు 'అంగం' స్తంభించటం జరగదు. ఫలితంగా, మగ జంతువులు బాగా వృద్ధాప్యం వచ్చేవరకు ఆరోగ్యంగా ఉంటాయని గుర్తించాలి. ఇక, జంతువుల సంభోగ విషయంలో – వాటి మనస్సులకు ఏవిధమైన ప్రాధాన్యత ఉండదు. కానీ, మనుషుల విషయానికి

వచ్చినట్లయితే – సంభోగంలో కేవలము శరీరం మాత్రమే కాకుండా మనసుకి కూడా పాత్ర ఉంటుంది. ఒక వేశ్యతో ఒక పురుషుడు జరిపే సంభోగంలో అతడి మనసు ఏవిధంగానూ స్పందించదు. కేవలము అతడు తన వాంఛను తీర్చుకోవటానికి మాత్రమే ప్రయత్నిస్తాడు. ఆ కారణంగానే మనసుతో ప్రమేయంలేని అలాంటి సంభోగాన్ని, జంతువుల మధ్య జరిగే సంభోగంగా భావించటం జరుగుతుంది.

శృంగార వాంఛలు చాలా తీవ్రమైన శక్తిని కలిగి ఉంటాయి. మనిషిని 'కామం' వంచినట్లుగా ఇంకే శక్తీ వంచలేదని ధర్మశాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి. కామానికి లొంగిపోయిన వ్యక్తి ఎలాంటి నీతి, నియమాలను పాటించడు. ఆ కారణంగానే "కామం గుడ్డిది" అని చెప్పబడి ఉన్నది. అంతేకాకుండా, "కామాతురాణం నభయం నలజ్జ" అని శాస్త్రాలు ఉద్ఘాటించాయి. అనగా, కామోద్రేకంతో రగిలిపోయేవాడికి భయం ఉండదు, సిగ్గు ఉండదు. వాడి ఏకైక లక్ష్యం వాడిలో రగిలే కామాగ్ని తీర్చుకోవటమే అని గుర్తించాలి. కామానికి వావివరుసలు కూడా ఉండవని మనువు ఏనాడో తన "మనుస్మృతి" అనే గ్రంథంలో చెప్పాడు. ఆ కారణంగానే, ఆయన – పురుషులకు కొన్ని నియమాలను విధించాడు. అవి ఏమిటంటే, పురుషుడు – మధ్య వయస్సులో ఉన్న తన తల్లి లేదా యుక్త వయస్సుకు వచ్చిన తన చెల్లెలు లేదా కూతురితో ఒకే మంచంమీద కూర్చోరాదని, అలాగే, ఒకే ఆసనంలో ప్రక్క ప్రక్కన దగ్గరగా కూర్చోరాదని చెప్పాడు. కారణం, మనిషి శరీరంలో దాగి ఉండే కామం వావివరుసలను గుర్తించదు. "స్త్రీ"ని చూడగానే ఆకర్షణకు గురికావటం కామం యొక్క ప్రత్యేకత. అలా, కామం చేత ప్రభావితుడైన మానవుడు వావి వరుసలు మర్చిపోయి లైంగిక నేరాలకు పాల్పడటం జరుగుతుంది. అందువల్లే మనువు ఆవిధంగా నియమాలను విధించాడు.

పైన చెప్పిన ఉదాహరణలను బట్టి "కామం" చాలా అపవిత్రమైనదని, కామ వాంఛను కలిగి ఉండటం మహాపాపమని భావించరాదు. ఎందుకంటే, కామం లేనిదే ఈ సృష్టిలేదు. ధర్మ మార్గంలో తీర్చుకునే కామం పవిత్రమైనదిగా గుర్తించబడింది. అయితే, బలహీనమైన/అసహాయ స్థితిలో దొరికిన స్త్రీలను దౌర్జన్యంతో అనుభవించటం, వావి వరుసలేకుండా కనిపించిన ప్రతి స్త్రీతో అక్రమ సంబంధాలు పెట్టుకోవటం లాంటివి చెడు సంబంధమైన శృంగారంగా చెప్పబడింది.

ఒక కొత్త జీవిని లేదా ప్రాణిని సృష్టించటంకోసం ఒక స్త్రీ మరియు పురుష జీవుల మధ్య జరిగే లైంగికపరమైన కలయికను 'సంభోగము' (ఇంటర్‌కోర్స్) అని

పిలుస్తారు. తంత్రశాస్త్రంలో శృంగార సంభోగానికి అధిక ప్రాధాన్యత ఇవ్వబడింది. స్త్రీ యోనిలో ప్రవేశించిన పురుషునియొక్క శిశ్నము (పెన్నిస్), యోనిలో స్రవించే వీర్యాన్ని (సెమెన్) యజ్ఞగుండంలో వేసే “హవిస్సు”గా చెప్పబడింది. అందువలన స్త్రీ, పురుషులు చేసే సృష్టి కార్యం ఒక యజ్ఞంతో పోల్చబడింది. కారణం, యజ్ఞ గుండం నుండి యజ్ఞఫలం ఆవిర్భవిస్తుంది. అలాగే, స్త్రీ, పురుషులు కలిసి చేసే యజ్ఞంవల్ల ఒక కొత్త జీవి, స్త్రీ యోని నుండి ఆవిర్భవిస్తుంది. ఆ కారణంగానే స్త్రీ యొక్క యోనిని “మహాభాగ” అని, స్త్రీ యొక్క గర్భసంచి (యుటిరస్) ప్రాంతాన్ని “గర్భలోక” అనే పేరుతో పిలువబడింది.

జనన–మరణాలు లేని మోక్షాన్ని పొందటం మనిషియొక్క ఏకైక లక్ష్యం కావాలి. ఆ లక్ష్యం సాధించాలంటే మనిషి, మొదట ఆధ్యాత్మిక మార్గంలో ప్రయాణిస్తూ ఆధ్యాత్మిక సాధనలు చెయ్యాలి. అలా చెయ్యాలంటే, అతని మనస్సు వ్యామోహాలకు అతీతంగా ఉండాలి. అయితే, మనిషి కొన్ని రకాల వ్యామోహాలను అనగా – మద్యం సేవించటం, ధూమపానం చెయ్యటం, నశ్యం పీల్చటం లాంటి వ్యామోహాలను కొద్దిపాటి మనోనిగ్రహంతో నియంత్రించవచ్చు. కానీ, కామ వాంఛలను అదుపుచేసుకోవటం దాదాపు అసాధ్యమే అని చెప్పవచ్చు. ఒక మనిషి, ఆధ్యాత్మిక మార్గంలో వెళుతున్నప్పుడు (ఆ మనిషి స్త్రీ కావొచ్చు? లేదా పురుషుడు కావొచ్చు?) ఆ మనిషి, ఇంకొక మనిషి గురించి (స్త్రీ కావొచ్చు? లేదా పురుషుడు కావొచ్చు?) వ్యామోహ కోణంలో ఆలోచించటం ప్రారంభించినప్పుడు, ఆ మనిషియొక్క ఆధ్యాత్మిక సాధన కొంతవరకు అడ్డగించబడుతుంది. ఒక మనిషి (స్త్రీ/పురుషుడు), ఇంకొక మనిషితో (స్త్రీ/పురుషుడు) శృంగార సంభోగం జరిగినప్పుడు ఆధ్యాత్మిక సాధన నూటికి నూరుశాతం అడ్డగించబడుతుంది.

పురుషుల వయస్సును బట్టి వారిలో శృంగార భావాలు మారుతూ ఉంటాయి. ఉదాహరణకి – యుక్త వయస్సులోకి వచ్చిన అబ్బాయి, ఎంతమంది అందమైన స్త్రీలు కనపడ్డా వారందరినీ ఆకర్షణ దృష్టితో చూస్తాడు. ఆ తరువాత అతడు ఇంకొక అమ్మాయిపై ప్రేమలో పడ్డా లేదా ఒక అమ్మాయిని వివాహం చేసుకున్నా – అతడు తన కోరికను ఒక అమ్మాయిమీదే లగ్నం చేస్తాడు. ఒక పురుషుడు కేవలము ఒక స్త్రీతో మాత్రమే (ఆమె అతని భార్య కావొచ్చు లేదా ప్రేమికురాలు కావొచ్చు) శృంగారాన్ని అనుభవించినట్లయితే అతడి యొక్క శృంగార కార్యకలాపాలకు పరిమితి ఉంటుంది. అలా కాకుండా అనేకమందితో శృంగారం చేసినప్పుడు అతడికి విపరీతమైన కామ

వ్యామోహం ఉంటుంది. ఆ కారణంగానే, హైందవ మత శాస్త్రాలలో "పురుషుడు కేవలము తన భార్యతో మాత్రమే శృంగార సుఖాన్ని పొందాలి" అని చెప్పబడి ఉన్నది". అదేవిధంగా గృహస్తాశ్రమం నుండి బైటకు వచ్చిన పురుషుడు (తన బిడ్డలకు పెళ్ళిపేరంటాళ్ళు పూర్తిచేసిన వ్యక్తి) ఆపై, వానప్రస్తాశ్రమానికి చేరుకోవాలి. అనగా ఇహలోక వ్యవహారాలకు, విషయాలకు దూరం కావాలి. అలాంటి వ్యక్తి, శృంగార వాంఛల గురించి అసలు ఆలోచించకూడదు. వానప్రస్త ఆశ్రమంలో ఉన్న వ్యక్తికి శృంగారం నిషేధించబడింది.

యోగశాస్త్రంలో పురుషుడియొక్క వీర్యానికి ఎంత శక్తి ఉన్నదో చాలా వివరంగా చెప్పబడి ఉన్నది. పురుషుడు స్కలించే వీర్యంలోని ప్రతి బొట్టు, ఇంకొక జీవికి జన్మనిచ్చే శక్తిని కలిగి ఉంటుంది. అనగా, ప్రతి బొట్టులోనూ ఆత్మలాంటి ఒక చేతన (Consciousness)ఉంటుందని చెప్పవచ్చు. అలాంటి మహత్తర శక్తిగల వీర్యాన్ని కామ సుఖంకోసం ధారపొయ్యటం మహా అపరాధమని యోగశాస్త్రంలో చెప్పబడి ఉన్నది. ప్రాచీనకాలంలోని హైందవ యోగులు తమ శరీరంలో వీర్యాన్ని నిలువ ఉంచుకున్నారు. ఆ కారణంగానే వాళ్ళు మరణాన్ని జయించారు. వీర్యాన్ని కోల్పోవటం అంటే ఆయుర్దాయాన్ని తగ్గించుకోవటమే అని గుర్తించాలి.

కొంతమంది గురువులు ఇలా చెబుతారు. "కామిగానివాడు మోక్షగామికాడు. కనుక, శృంగార సుఖాలను విపరీతంగా అనుభవించినట్లయితే – అతడికి శృంగారంమీద మరియు ఆ శృంగార సుఖాన్ని ఇచ్చే స్త్రీ మీద పూర్తిగా విముఖత వస్తుంది. వైరాగ్యం ఏర్పడుతుంది. అప్పుడు అతడే ఆధ్యాత్మికతవైపు వెళ్ళిపోతాడు. ఆపై అతడిని కామం ఏమాత్రం బాధించదు". కానీ, మహాజ్ఞానులైన వేదాంతులు – పైన చెప్పిన సూత్రాన్ని ఇలా ఖండించారు. వారు చెప్పిన మాటల ప్రకారం చూసినట్లయితే "ఒక వ్యక్తికి 'రసగుల్లా' అనే మధుర పదార్థంమీద విపరీతమైన కోరిక ఉంది అనుకుందాం. ఆ వ్యక్తి, అనేక రోజులపాటు అదేపనిగా కిలోలకొద్ది రసగుల్లాలు తిన్నట్లయితే కొద్ది రోజుల తరువాత అతనికి రసగుల్లాలమీద రోత పుడుతుంది. ఆపై అతడు రసగుల్లాలను చూస్తే అసహ్యంతో ముఖం తిప్పేసుకుంటాడు. అదేవిధంగా శృంగారాన్ని విపరీతంగా అనుభవించేస్తే, దానిమీద వ్యామోహం పోతుంది అని భావించకూడదు. ఎందుకంటే, అనుభవించిన కొద్ది శృంగారం మీద ఆసక్తి పెరిగిపోతుంది. అందువలన నిరంతర కామ సుఖాలలో ఎంతకాలం తేలియాడినా కామంమీద విరక్తి కలగటం దాదాపు అసాధ్యమని గుర్తించాలి".

"కోర్కెలు తీర్చుకుంటున్న కొద్దీ – వాటియొక్క తీవ్రత పెరిగిపోతుందేగాని, ఏమాత్రం తగ్గదు. కారణం, అగ్నిలో ఎండు పుల్లలు వేస్తున్నకొద్ది ఆ అగ్ని మరింత పెద్ద పరిమాణంలో మండుతుందేకాని తగ్గదు". శృంగారాన్ని అదుపు చేసుకోవాలంటే – మొదట మనసును నియంత్రించుకోవాలి. శృంగారలో ప్రధాన పాత్ర మనసుదే అవుతుంది. ఒక అందమైన స్త్రీని చూసిన వెంటనే మనసు "కామ జ్వరానికి" గురి అవుతుంది. ఆపై, ఆ మనసు కారణంగా ఆ మనిషి శరీరంలోని పంచేంద్రియాలు ప్రభావితం అయి కామవాంఛ పూర్తికి సిద్ధపడతాయి. అందువలన కామప్రకోపాన్ని కలిగించే అందమైన స్త్రీలకేసి చూడకుండా ఉండటం అనే చర్యను యోగులు, ప్రధానంగా చెయ్యటం జరుగుతుంది. రామాయణ గ్రంథంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే – లక్ష్మణుడు ఏనాడూ సీతాదేవి పాదాలను తప్ప, ఇతర ఏ భాగాలను చూడలేదు. కారణం, మహా సౌందర్యవతి అయిన సీతాదేవి యొక్క ముఖాన్ని చూడటం వల్ల, తనలో ఏవిధమైన కామవాంఛ తల ఎత్తకూడదు అన్న ఉద్దేశంతో అని గ్రహించాలి.

పశ్చిమ భారతదేశంలో మహా యోగిగా గుర్తించబడిన స్వామినారాయణ్ – స్త్రీల వైపు కన్నెత్తి చూడటానికి కూడా ఇష్టపడేవాడు కాదు. విధివశాత్తు లేదా అనుకోకుండా ఎవరైనా స్త్రీ ముఖాన్ని చూడాల్సి వచ్చినప్పుడు స్వామినారాయణ్ వెంటనే అసహ్యంతో వాంతులు చేసుకునేవాడు. ఆ కారణంగానే స్వామినారాయణ్ మతాన్ని పాటించే పురుషులు, స్త్రీలవైపు కన్నెత్తి చూడరు. ఆ తరువాత, భారతదేశంలో ఒక గొప్ప యోగిగా గుర్తించబడిన స్వామి లోకనాథ తీర్థ, ఎవరైనా స్త్రీలతో ముఖాముఖి మాట్లాడాల్సి వచ్చినప్పుడు ఆయన తన చూపుని తన 'ముక్కు కొనపైన' ఉంచుకునే వాడు. అనగా, ఆ సమయంలో ఆయనకు ఎదురుగా ఉన్న స్త్రీ ఏమాత్రం కనపడదు అన్నమాట.

"బ్రహ్మచర్యం" అంటే స్త్రీతో సంభోగం జరపకుండా ఉండటం అని మాత్రమే భావించరాదు. 1. స్త్రీ గురించి ఆలోచించటం, 2. ఆమె శరీరం యొక్క అందమైన లక్షణాలను వర్ణించటం, 3. స్త్రీతో ఆటలు ఆడుకోవటం, 4. స్త్రీ మాట్లాడే మాటలు వినటం, 5. వంటరిగా ఉన్న స్త్రీతో మాట్లాడటం, 6. స్త్రీని పొందాలని ఆశించటం, 7. ఆమెను పొందటానికి ప్రయత్నించటం, 8. యదార్థంగా, స్త్రీతో సంభోగానికి దిగటం – ఈ ఎనిమిది రకాల కార్యాలను శృంగార కార్యాల క్రింద గుర్తించారు. కనుక, ఈ ఎనిమిది చర్యలను నిషేధించిన వ్యక్తిని మాత్రమే "బ్రహ్మచర్యాన్ని" పాటించే

వ్యక్తిగా గుర్తిస్తారు. ఆధ్యాత్మిక మార్గంలో ప్రయాణించాలని ఆశించే పురుషుడు, పైన చెప్పిన ఎనిమిది చర్యలకు సంపూర్తిగా దూరంగా ఉండాలి. అప్పుడే అతడు పరిపూర్ణమైన బ్రహ్మచారిగా మారతాడు. అతనిలో మోక్ష మార్గానికి – ప్రధాన అవసరమైన సత్వగుణం అభివృద్ధి చెందుతుంది.

ఒక పురుషుడు లేదా స్త్రీ తన శృంగార భాగస్వామితో శృంగారంలో పాల్గొన్నప్పుడు – ఆ శృంగార క్రీడ ముగింపు దశలో కలిగే సుఖం, గరిష్టంగా ఒకటి లేదా రెండు నిమిషాలు మించి ఎట్టి పరిస్థితుల్లోను ఉండదు. కానీ, అదే మనసుని పరిపూర్ణంగా దైవంమీద లగ్నంచేసినప్పుడు కలిగే సుఖం, శాశ్వతమైనదిగా ఉండటమే కాకుండా ఆ మనిషికి ఆపై మళ్ళీ, మళ్ళీ జన్మించి ఈలోకంలో ఉండే అనేక రకాల కష్టాలను, బాధలను అనుభవించే దుస్థితి తప్పిపోతుంది.

**ఏకాగ్రత :** అతి సామాన్య స్థితి నుండి ఒక గొప్ప దేశానికి చక్రవర్తిగా, ఇంకా గట్టిగా చెప్పాలంటే మహా నియంతగా పరిణామం చెందిన నెపోలియన్ బోనపార్టే యొక్క ఏకాగ్రతా శక్తి చాలా గొప్పదని పరిశోధకులు తెలియజేసారు. ఒక విశేషం ఏమంటే, అత్యంత పేద కుటుంబంలోజన్మించిన నెపోలియన్ బోనపార్టే చిన్న తనం నుండి మూర్ఛలతో సహా అనేక రకాల వ్యాధులతో బాధపడుతూ ఉండేవాడు. అన్ని అనారోగ్యాలు ఉన్నప్పటికీ నెపోలియన్ తన శక్తి సామర్థ్యాలను తనయొక్క మనోబలంతో పెంచుకున్నాడు. ఆయన, తనకు ఎప్పుడు ఇష్టమైతే అప్పుడే నిద్రపోగల సామర్థ్యాన్ని అలవరచుకున్నాడు. ఈయన, నిద్రపోవటానికి ఇలా మంచంమీదకి జారిన మరుక్షణమే ఆయనకి పెద్దగా గురక మొదలయ్యేది. ఏ సమయానికి నిద్రలేవాలని ఆయన ముందుగా నిర్ణయించుకునేవాడో, సరిగ్గా అదే సమయానికి నిద్రలేచేవాడు. ఆయనకి ఏవిధమైన యోగశాస్త్ర సూత్రాలు తెలియవు. కానీ, తనయొక్క అతిశక్తివంతమైన ఏకాగ్రతా శక్తితో ఆయన ఒక యోగిలాంటి స్థాయికి చేరుకున్నాడు. తన మనసుని తనకు అవసరమైన కార్యంమీద పరిపూర్ణంగా లగ్నంచెయ్యగల శక్తిని ఆయన సాధించాడు. ఆయన, ఒక అంశంమీద ఏకాగ్రతతో ఉన్నప్పుడు ఆ మనసులో ఆ సమయంలో ఏ ఇతర విషయం గురించిన ఆలోచన ఒక అర సెకను కూడా తల ఎత్తేదికాదు. తనకు ఎంతసేపు కావాలంటే అంతసేపు ఒకే విషయంమీద మనసును నిగ్రహం చెయ్యగల శక్తిని నెపోలియన్ తన సామర్థ్యంతో సాధించుకున్నాడు. ఆయన మనో నిగ్రహానికి ఒక ఉదాహరణ ఏమంటే, తన ప్రక్కన పెద్ద యుద్ధం జరుగుతున్నప్పటికీ ఆయన ఏమాత్రం చలించకుండా నిద్రపోయేవాడు. ఆ నిద్రలో – హఠాత్తుగా

లేవటంగాని, పీడ కలలు కనటంగాని జరిగేదికాదు. తనయొక్క ఏకాగ్రత శక్తితో నెపోలియన్ తననే కాక, తన దేశాన్ని కూడా తన ఆధీనంలోకి తెచ్చుకున్నాడు. ఏ వ్యక్తి అయినా తన జీవితంలో అత్యున్నత స్థాయిని సాధించాలంటే మొదట ఆ వ్యక్తి తనను తాను జయించుకోవాలి. అనగా, నిశ్చలమైన ఏకాగ్రతా శక్తిని పెంపొందించుకోవాలి. ఎందుకంటే, ఏకాగ్రతతో కూడిన మనసులేని వ్యక్తి ఏ విజయాలను సాధించలేడు.



# 21. మళయాళి మంత్రవాదుల మర్మాలు?

### ♦ కుట్టిచేతన్ :

కొన్ని వందల సంవత్సరాల క్రితం, నాటి కేరళ రాష్ట్రంలోని కలక్కాడ్ నంబూద్రి బ్రాహ్మణ వంశం, మంత్రవాదంలో ప్రముఖ స్థానాన్ని కలిగి ఉండేది. ఆ సమయంలో ఒక నంబూద్రి యువకుడు, నిమ్న జాతికి చెందిన ఒక స్త్రీతో కొంతకాలంపాటు సంసారం సాగించాడు. ఫలితంగా, ఆ స్త్రీకి ఒక బాలుడు జన్మించాడు. ఆ బాలుడు 12 సంవత్సరాల వయస్సు వాడు అయిన తరువాత ఒకరోజు తన తండ్రి అయిన నంబూద్రి దగ్గరకువెళ్ళి "నాక్కూడా నీ సంతానంతో పాటుగా సమాన స్థానం ఇవ్వు. ఇది నాహక్కు" అన్నాడు. అప్పుడు ఆ నంబూద్రి విచిత్రంగా నవ్వుతూ "నువ్వు నా కొడుకువే అన్నమాట వాస్తవమే. కానీ, నీ తల్లి నిమ్న జాతికి చెందినది. అందువల్ల నీవు నా కుమారులతో సమానంగా స్థానాన్ని పొందలేవు. అది నీ విధివ్రాత" అన్నాడు. తండ్రి ఆవిధంగా అనటంతో కుట్టిచేతన్ విపరీతమైన ఆందోళనకు గురై ఆపై ఉన్మాదిగా మారిపోయాడు. ఆ తరువాత ఒకరోజు అర్ధరాత్రి సమయంలో – తన తండ్రికి సంబంధించిన 'మంత్రశాల'ని (నంబూద్రీల కులదైవాల విగ్రహాలు ఉండే ప్రదేశం) మరియు తన తండ్రి వంశస్తులు నివసించే "కలక్కాడ్" గృహాన్ని తగలబెట్టాడు. ఆ క్రూరమైన హింసాకాండ చేసిన తరువాత కుట్టిచేతన్‌కి ఉన్మాదం తగ్గిపోయింది.

ఆ తరువాత కొద్ది నెలలకు కుట్టిచేతన్‌ని ఎవరో కొందరు అజ్ఞాత వ్యక్తులు అనేక ముక్కలుగా నరికి చంపారు. అలా దారుణమైన హత్యకు గురైన కారణంగా కుట్టిచేతన్ మృతదేహం యొక్క ఖండాల నుండి వందలకొద్ది సంఖ్యలో కుట్టిచేతన్‌లు

ఆవిర్భవించారు. ఈ కుట్టిచేతన్‌లు విపరీతమైన ఆగ్రహం, క్రూరత్వం మరియు అసాధారణమైన మేధస్సుని కలిగి ఉంటాయి. వీటిలో ప్రధానమైన కుట్టిచేతన్ అనగా నంబూద్రికి జన్మించిన కుట్టిచేతన్, ఒకరోజు అర్ధరాత్రి సమయంలో – తన గదిలో నిద్రపోతున్న నంబూద్రికి కనిపించి అతడితో "నీకు అక్రమంగా జన్మించిన కారణంగా నాకు సమాజంలో ఏ గుర్తింపు లేకుండా పోయింది. నన్ను, నీకు సంబంధించిన వ్యక్తులు సంహరించారు. ఇప్పుడు, నేను మహా శక్తివంతమైన పిశాచిగా మారిపోయాను. అంతేకాదు, నాకు వందలకొద్ది పిశాచాల సైన్యం ఏర్పడింది. అందువలన నన్ను, నీ కులదైవాల వరుసలో ఉంచి పూజించు. లేకుంటే నీ వంశం మొత్తాన్ని క్షణాల్లో అంతం చేస్తాను" అన్నాడు. కుట్టిచేతన్ 'మహా శక్తివంతుడు' అని, అతడిని ధిక్కరిస్తే తనకు, తన వంశానికి కీడు తప్పదని ఆ క్షణంలో ఆ నంబూద్రికి అర్ధమయ్యింది. ఆపై – ఆ నంబూద్రి, కుట్టిచేతన్‌ని బహిరంగంగా తన కుమారుడిగా అంగీకరించాడు. అంతేకాదు, కుట్టిచేతన్ యొక్క ఆత్మకి శాంతి కలగటంకోసం అతడి యొక్క విగ్రహాన్ని తన 'మంత్రశాల'లో ప్రతిష్టించి అక్కడ ఉన్న ఇతర దేవతా విగ్రహాలతోపాటుగా కుట్టిచేతన్ విగ్రహానికి కూడా పూజలు చెయ్యటం ప్రారంభించాడు.

ఆ తరువాతకాలంలో కుట్టిచేతన్, ఒక మధ్యస్థాయి దైవంగా మారిపోయాడు. కుట్టిచేతన్, కొంతకాలం 'ఉన్మాది'గా లేదా పిచ్చివాడిగా జీవించిన కారణంగా ఆ తరువాతకాలంలో ఎవరికైనా ఉన్మాదం కలిగితే, దాన్ని తగ్గించటానికి కుట్టిచేతన్ యొక్క మంత్రాన్ని ఉపయోగించటం జరుగుతున్నది. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, కేరళలో సాంప్రదాయ బద్ధంగా చేసే 'థెయ్యామ్' నృత్యాల సమయంలో కుట్టిచేతన్ ఎవరో ఒక థెయ్యామ్ నృత్యకారుడిని ఆవహిస్తాడని చెబుతారు.

**♦ ప్రాచీన కేరళకు చెందిన మహా మంత్రవాది కొండమారుక్కు నంబూద్రి యదార్ధ గాథ?**

పరశురాముడు విసిరిన గొడ్డలి యొక్క ధాటికి అరేబియా సముద్రం కొంతదూరం వెనక్కి వెళ్ళిపోయింది. అలా వెళ్ళిపోవటం వల్ల బైటపడిన భూమిని "పరశురామదేశం" అనేపేరుతో పిలిచేవారు. ఆ తరువాతకాలంలో ఆ ప్రాంతానికి "కేరళం" అనే పేరు వచ్చింది. కాలక్రమంలో ఆ పేరు "కేరళ"గా మారింది. పరశురాముడు మంత్ర శాస్త్రంలో మహాద్భుత పాండిత్యాన్ని కలిగి ఉన్నాడు.

ముఖ్యంగా, అధర్వణ వేదంలో ఆయనకు తిరుగులేని పాండిత్యం ఉన్నది. ఆ కారణంగానే, ఆయన తరువాతికాలంలో కేరళ ప్రాంతంలో అతి శక్తివంతులైన

నంబూద్రి మంత్రవాదులు అవతరించారు. అదేవిధంగా, అతిశక్తివంతమైన తాంత్రిక ప్రయోగాలను చెయ్యటంలో ఆ నంబూద్రి మంత్రవాదులకు మొత్తం భారతదేశంలోనే ఎదురులేదని చెబుతారు. సాధారణంగా, ఆనాటి నంబూద్రి మంత్రవాదులు తమయొక్క మంత్రశక్తిని ప్రజలయొక్క మంచికోసం ఉపయోగిస్తూ ఉండే వాళ్ళు. అలా ఆ ప్రాంతంలో మహా మంత్రవాదులుగా గుర్తించ బడినవారిలో కొండమారుక్కు నంబూద్రి కూడా ఒకడు. నిజానికి, కొండమారుక్కు అనేది ఒక ఇంటి పేరు. అయినప్పటికీ, ఆ కుటుంబం లో అత్యంత ప్రఖ్యాతి చెందిన ఈ నంబూద్రి మంత్రవాదికి 'కొండ మారుక్కు నంబూద్రి' అన్న పేరు వచ్చింది. అలా ఎందుకు జరిగిందంటే – ఆ కుటుంబానికి పెద్దగా ఉండే పురుషుడికి 'కొండమారుక్కు' అనే పేరు ఇవ్వటం జరుగుతుంది. ప్రజల సంక్షేమంకోసం పాటుపడుతూ దైవాన్ని నిరంతరం ఆరాధిస్తూ ఉండే ఆ నంబూద్రి బ్రాహ్మణ కుటుంబం, మొత్తం కేరళలోనే ఎంతో గొప్ప ప్రఖ్యాతిని పొందింది. ఇక అసలు కథలోకి వద్దాం...



ఆనాటి కేరళ రాష్ట్రంలోని కొట్టాయం జిల్లాలో ఉన్న పాలై పట్టణానికి దగ్గరలో ఉన్న రామాపురం అనే గ్రామంలో కొండమారుక్కు నంబూద్రి కుటుంబం నివసిస్తూ ఉండేది. ఆ కుటుంబ పెద్ద అయిన కొండమారుక్కు నంబూద్రి కేవలం మంత్రశాస్త్రం లోనే కాక జ్యోతిషశాస్త్రంలో కూడా అసాధారణమైన జ్ఞానాన్ని కలిగి ఉన్నాడు. ఫలితంగా, ఆ నంబూద్రికి కేవలము కేరళలోనే కాక, కేరళకి ఆనుకుని ఉండే తమిళనాడులోని కొన్ని ప్రాంతాలలో కూడా గొప్ప జ్యోతిష పండితుడిగా పేరు వచ్చింది. అలాంటి సమయంలో ఉత్తర కేరళ ప్రాంతంలో ఒక నాయర్ కుటుంబం జీవిస్తూ ఉండేది. ('నాయర్' అంటే ఒక వ్యవసాయ ఆధారిత కులం) ఆ కుటుంబంలో అందమైన మరియు మంచి విద్యగల ముగ్గురు కుమార్తెలు ఉండేవాళ్ళు. ఆ ఇంటి పెద్ద అయిన నాయర్ తన పెద్ద కూతుళ్ళు ఇద్దరికీ ఒక మంచి సమయంలో పెళ్ళిళ్ళు చేసాడు. పెళ్ళి అయిన కొన్నాళ్ళకు ఆ ఇద్దరు కూతుళ్ళూ గర్భవతులు అయి ఆపై ప్రసవంకోసం పుట్టింటికి వచ్చారు. అలా పుట్టింటికి వచ్చిన ఆ ఇద్దరు అమ్మాయిలూ

ఒకరోజు అర్ధరాత్రి సమయంలో అదృశ్యం అయిపోయారు. వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో? ఆ నాయర్‌కి ఏమాత్రం అర్ధంకాలేదు. అలా చాలాకాలం గడిచింది. అదృశ్యం అయిపోయిన ఆ ఇద్దరు అమ్మాయిలు కనపడలేదు. "తన మూడవ కుమార్తె కూడా ఏదోఒకవిధమైన హాని జరుగుతుందేమో" అని ఆ నాయర్‌కి ప్రతిరోజూ ఎంతో ఆందోళనగా ఉండేది. ఆమెకి కూడా పెళ్ళిచేస్తే, ఆమె కూడా అదృశ్యం అయిపోతుందేమో అన్న భయం నాయర్‌ని వెంటాడుతూ ఉండేది. అలాగని ఆమెకి వివాహం చెయ్యకుండా ఎంతకాలం ఇంట్లో ఉంచుకోవాలో? ఆ నాయర్‌కి అర్ధంకాలేదు. చివరికి, ఇంట్లో వారి వత్తిడిమీద, ఆ చుట్టు ప్రక్కల ప్రాంతాలలో అన్వేషించి, చివరికి రూపవంతుడు, గుణవంతుడు అయిన ఒక అబ్బాయికి ఇచ్చి తన మూడవ కూతురుకి ఘనంగా వివాహం చేశాడు. ఒక సంవత్సరం గడిచేసరికి ఆ అమ్మాయి గర్భవతి అయి ప్రసవంకోసం పుట్టింటికి వచ్చింది. అంతే, నాయర్‌కి రాత్రిపూట నిద్రలేకుండా పోయింది. తన పెద్ద కూతుళ్ళులాగానే ఈ ఆఖరి కూతురు కూడా ఏదో ఒక సమయంలో అదృశ్యం అయిపోతుందేమో అన్న భయం నాయర్‌ని అనుక్షణం వెంటాడ సాగింది. దాంతో, అతడు రాత్రి సమయాలలో నిద్రపోకుండా తన కూతురు పడక గది తలుపు దగ్గర ఒక బాణాకర్ర చేతిలో పట్టుకుని కాపలాకాయటం ప్రారంభించాడు. అయినప్పటికీ, తన కూతురు తనకు దక్కకుండా పోతుందేమో అన్న భయం ఆ నాయర్‌ని పీడిస్తున్నది. సరిగ్గా, అదే సమయంలో ఎవరి ద్వారానో "కొండమారుక్కు నంబూద్రి" గురించి తెలుసుకున్నాడు. ఆయన మహా మంత్రవేత్త మాత్రమే కాక జ్యోతిషశాస్త్రంలో అద్భుతమైన పాండిత్యం గలవాడని తెలుసుకున్న ఆ నాయర్, సాక్షాత్తూ తన తమ్ముడితో – ఆ నంబూద్రి వద్దకువెళ్ళి ఆయనను సాదరంగా ఇంటికి తీసుకు రమ్మని చెప్పాడు. ఆ రోజు మధ్యాహ్న సమయానికి కొండమారుక్కు నంబూద్రి, నాయర్ ఇంటికి వచ్చాడు. ఆ తరువాత నాయర్ ద్వారా అతడి గృహంలో జరిగిన బాధాకరమైన సంఘటన గురించి తెలుసుకున్నాడు. ఆ తరువాత ఆ నంబూద్రి కాసేపు కళ్ళుమూసుకుని తన ఇష్టదైవం అయిన చొట్టానిక్కర భగవతిని స్మరించుకున్నాడు. ఆ తరువాత కళ్ళు తెరచి లేచి నుంచున్నాడు. అది గమనించిన నాయర్ మరియు అతని ఇతర కుటుంబ సభ్యులు కూడా లేచి నిలబడ్డారు. అప్పుడు ఆ నంబూద్రి ఏమీ మాట్లాడకుండా ఆ ఇంటి పెరటివైపు వచ్చాడు. పెరటి ప్రాంతాన్ని చాలా పరిశీలనగా చూసాడు. ఆ తరువాత మళ్ళీ లోపలికి వచ్చాడు. ఆపై, ఆ ఇంటి మధ్యభాగంలో ఉన్న ఒక ప్రదేశంలో పద్మాసనంలో కూర్చుని కళ్ళు మూసుకుని ధ్యానంలోకి వెళ్ళాడు. సరిగ్గా 5 నిమిషాల తరువాత కళ్ళు తెరచి ఆ నాయర్‌తో

"నేను నీ గృహంలో 41 రోజులపాటు తాంత్రిక పరిహారాలు చేస్తాను. అందుకు కావలసిన ఏర్పాట్లు ఏమాత్రం తేడా లేకుండా ఏర్పాటు చేయించు" అన్నాడు. ఆ నాయర్ వెంటనే తన తమ్ముళ్ళను మరియు పనివాళ్ళను పిలిచి నంబూద్రి చెప్పిన ఏర్పాట్లను సాయంత్రంలోగా చేయించాడు. ఆ మర్నాడు ఉదయం నుండి నంబూద్రి అక్కడే ఉండి తాంత్రిక పూజలు చెయ్యటం ప్రారంభించాడు.



రోజులు గడుస్తున్నాయి. ఆ రోజు 12వ రోజు. ఆ రోజు మధ్యాహ్న సమయానికి నంబూద్రి హోమాన్ని ముగించాడు. ఆ తరువాత నాయర్‌ని తన దగ్గరకు పిలిచి అతడితో చిన్న స్వరంతో "నాయర్! నువ్వు వెంటనే నీ ఆఖరి అల్లుడిని ఇక్కడకు రప్పించు. రేపు 13వ రోజు. రేపటి నుంచి నీ కూతురు మరియు అల్లుడు ఇక్కడే ఉండాలి. వాళ్ళ సమక్షంలోనే తాంత్రిక పూజలు కొనసాగిస్తాను" అన్నాడు. 13వ రోజుకి ఆ నాయర్ తన అల్లుడిని కూడా రప్పించాడు. ఆ రోజు నుంచి పూజలు జరిగే ప్రదేశంలోనే నాయర్ – కూతురు మరియు అల్లుడు కూర్చున్నారు. ఆ రోజు నుంచి అర్ధరాత్రి వరకు హోమాలు, పూజలు జరుగుతూనే ఉండేవి. అలా కొన్ని రోజులు గడిచాయి. చివరికి 41వ రోజు అర్ధరాత్రికి నంబూద్రి చెయ్యాలను కున్న తాంత్రిక పూజలు, హోమాలు పూర్తి అయిపోయాయి. అప్పుడు ఆ నంబూద్రి – అక్కడే కూర్చుని ఉన్న నాయర్ కూతురు మరియు అల్లుడివైపు పరిశీలనగా చూస్తూ గంభీరమైన స్వరంతో వాళ్ళతో "బిడ్డలారా! మీరు వెంటనే మీ పడక గదిలోకివెళ్ళి తలుపులు వేసుకుని నిద్రపోండి" అన్నాడు. వాళ్ళు, వాళ్ళకు కేటాయించిన పడక గదిలోకి వెళ్ళిపోయారు. ఆ తరువాత ఆ నంబూద్రి తన సహాయకులైన ఇద్దరు బ్రాహ్మణ

యువకులను తన దగ్గరకు పిలిచి వాళ్ళతో ఇలా చెప్పాడు. "ఈ దంపతులు, తమ పడక గదిలోకివెళ్ళి తలుపులు వేసుకున్న తరువాత మీరు ఇద్దరూ ఆ తలుపుల బయట చాలా జాగ్రత్తగా కాపలా కాయండి.

ఆ తరువాత ఆయన తన భుజానికి వ్రేలాడుతున్న గుడ్డ సంచి నుండి దాదాపు 3 అడుగుల పొడవు ఉన్న ఒక పేము బెత్తాన్ని బైటకు తీసాడు. ఆ తరువాత నాయర్‌ని మరియు అతని కుటుంబ సభ్యులను వెంట పెట్టుకుని ఆ ఇంటి ప్రధాన ద్వారాన్ని దాటి బైటకు వచ్చాడు. చాలా పెద్దదిగా ఉండే ఆ ఇంటి చుట్టూ, దాదాపు 6 అడుగుల ఎత్తు ఉండే ప్రహరీ గోడ ఉంటుంది. ఆ ఇంటి ప్రధాన ద్వారానికి 20 అడుగుల దూరంలో ఆ ప్రహరీ గోడకు ప్రవేశ ద్వారం ఉంటుంది. నంబూద్రి నేరుగా ఆ ప్రహరీ ద్వారం దగ్గరకువెళ్ళి ఒకసారి ఆ ద్వారాన్ని పరిశీలనగా చూసాడు. ఆ తరువాత నాయర్‌ని తన దగ్గరకు పిలిచి అతనితో ఇలా చెప్పాడు.

"ఈ ప్రహరీ ద్వారానికి ఇవతలగా సరిగ్గా 8 అడుగుల దూరంలో ఒక చిన్న గొయ్యి తీయించు". నాయర్ వెంటనే ఆ పని చేయించాడు. అప్పుడు నంబూద్రి తన చేతిలో ఉన్న పేము బెత్తాన్ని ఒక్కసారి కళ్ళకు అద్దుకుని కొన్ని తాంత్రిక మంత్రాలను శబ్దం రాకుండా పఠించాడు. ఆ తరువాత ఆ బెత్తాన్ని తీసుకువెళ్ళి, అంతకుముందే త్రవ్వి సిద్ధంగా ఉంచిన గుంటలోకి బలంగా దింపాడు. ఆ తరువాత అందరినీ వెంటపెట్టుకుని ఆ ఇంట్లోకి వెళ్ళాడు. ఆ తరువాత ఆ ఇంట్లో తన వసతికోసం ఏర్పాటు చేయబడిన గదిలోకివెళ్ళి, ఆపై ఆ గది కిటికీ తలుపులు తెరచి బైటకు చూసాడు. అది పౌర్ణమి తిథి కావటంతో వెన్నెల విరగ్గాస్తున్నది. చుట్టు ప్రక్కల ప్రాంతాలన్నీ చాలా స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ గదిలోకి చల్లగా వీస్తున్న గాలిని పీలుస్తూ కొంచెం విశ్రాంతి పొందాడు ఆ నంబూద్రి. ఇంతలో, ఆయనకి ఒక విచిత్రమైన దృశ్యం బైట నుండి కనపడింది. అది ఏమిటంటే...ఆ ఇంటి ప్రహరీ గోడకు అవతల వైపు నుండి ఉన్న మార్గం మీదుగా నడుస్తూ ఆరుగురు పురుషులు కనిపించారు. వాళ్ళు నగ్నంగా ఉన్నారు. వాళ్ళ చేతుల్లో ప్రకాశవంతంగా మండుతున్న కాగడాలు కనిపిస్తున్నాయి. వాళ్ళను చూడగానే నంబూద్రి కనుబొమలు ఒక్కసారిగా ముడి పడ్డాయి. ఆయన, వాళ్ళను అలాగే చూస్తూ నిలబడ్డాడు. కొద్ది నిమిషాలలోనే వాళ్ళు ఆరుగురూ ఆ ఇంటి ప్రహరీ ద్వారం దగ్గరకు వచ్చి, ఆపై పెద్ద స్వరంతో ఏవో మంత్రాలు పఠించారు. వాళ్ళు ఎవరో? అప్పటికి కూడా అర్థంకాని నంబూద్రి చాలా వేగంగా తన గదిలోంచి బైటకువచ్చి, ఆపై ఆ ఇంటి అరుగుమీదకు వచ్చి నిలబడ్డాడు.

బైట, కాగడాలతో నిలబడి ఉన్న వ్యక్తులు కొద్దిసేపు మంత్రాలు చదవగానే ఆ ప్రహరీ ద్వారం దానంతట అదే బార్లా తెరుచుకున్నది. ఆపై, "వాళ్ళు లోపలికి రాబోతున్నారు" అని అర్థం చేసుకున్న నంబూద్రి, వాళ్ళకన్నా ముందుగానే ఆ ఇంటి లోపలికి ప్రవేశించి ఆ ఇంట్లో ఒక స్థంభం వెనకాల దాక్కున్నాడు.



నంబూద్రి ఊహించినట్లుగానే – ఆ ఆరుగురు వ్యక్తులు మంత్ర పఠనంతో ఆ ఇంటి ప్రధాన ద్వారాన్ని కూడా తెరచి, చాలా నిశ్శబ్దంగా అడుగులు వేస్తూ ఇంట్లోకి ప్రవేశించారు. ఆపై, మేడమెట్లు ఎక్కి పైకి వెళ్ళారు. అక్కడ, నాయర్ కూతురు మరియు అల్లుడు నిద్రపోతున్న పడక గది ఉన్నది. ఈ వచ్చిన ఆరుగురు వ్యక్తుల మంత్రబలం కారణంగా, అక్కడ కాపలాగా ఉన్న నంబూద్రి శిష్యులు ఇద్దరూ చాలా విచిత్రంగా నిద్ర మత్తులోకి జారిపోయారు. ఆ ఆరుగురు వ్యక్తులూ ఆ గది తలుపుల ముందు నిలబడి మంత్ర పఠనం చేస్తున్నారు. క్రింద, ఒక స్తంభం ప్రక్కన నక్కి ఉన్న నంబూద్రి ఆ స్తంభం ప్రక్క నుంచి వచ్చి, పైన ఉన్న పడక గది తలుపువైపు ఆత్రంగా చూస్తున్నాడు. ఇంతలో, ఆ గది తలుపులు హఠాత్తుగా తెరచుకున్నాయి. నాయర్ కూతురు, నగ్నదేహంతో ఆ గదిలోంచి బైటకు వచ్చింది. ఆమె ఒకవిధమైన మైకంలో ఉన్నట్లుగా నంబూద్రికి అర్థమయ్యింది. అలా బైటకు వచ్చిన ఆమెను బైట నిలబడి ఉన్న ఆరుగురు వ్యక్తులు తమ వెంటపెట్టుకుని, ఏమాత్రం శబ్దం చెయ్యకుండా ప్రధాన ద్వారం వైపు వెళ్ళారు. అంతకుముందే – ఆ ఆరుగురు వ్యక్తుల మంత్రబలం వల్ల తెరువ బడిన ఆ ద్వారం గుండా వాళ్ళు ఆరుగురు ఒకరి తరువాత ఒకరు బైటకు వెళ్ళారు. వాళ్ళ తరువాత చివరగా ఆ అమ్మాయి కూడా ఇంట్లో నుండి బైటకు వచ్చింది. ఆ వ్యక్తులు, ప్రహరీ ద్వారంవైపు నడుస్తున్నారు. సరిగ్గా, అదే సమయంలో అక్కడ ఒక మహాద్భుతం జరిగింది. అది ఏమిటంటే, నంబూద్రి ఆ ప్రహరీ ద్వారానికి ఇవతల, భూమిలో పాతిన పేము బెత్తం, భూమిలోంచి బైటకువచ్చి ఆపై శరవేగంతో ఆ ఆరుగురు చుట్టూ తిరగటం ప్రారంభించింది. దాంతో, వాళ్ళు ఆరుగురు అక్కడ నుండి బైటకు వెళ్ళలేకపోయారు. వాళ్ళలో ఎవరైనా అటు, ఇటు కదలాలని చూస్తే ఆ బెత్తం వాళ్ళని చాలా బలంగా బాదటం

ప్రారంభించింది. దాంతో, వాళ్ళు కదలలేక అక్కడే ఉండిపోయారు. అదే సమయానికి నాయర్ ఇంట్లోని కుటుంబ సభ్యులు బైటకు వచ్చారు. బైట జరుగుతున్న దృశ్యాన్ని చూసి వాళ్ళు అందరూ భయంతో కేకలు వెయ్యటం ప్రారంభించారు. వీళ్ళ అరుపులు కొద్దిసేపట్లోనే చుట్టు ప్రక్కల ఇళ్ళవాళ్ళకి వినిపించాయి. దాంతో, ఆ ఇళ్ళలోని వారు, "నాయర్ ఇంట్లో ఏదో ప్రమాదం జరుగుతున్నది" అని నిర్ణయించుకుని, ఆపై చేతికి దొరికిన ఆయుధాన్ని తీసుకుని పరుగులు పెడుతూ నాయర్ ఇంటి ప్రహరీ ద్వారం దగ్గరకు వచ్చారు. అక్కడ నగ్నంగా ఉన్న ఆరుగురు అజ్ఞాత పురుషులు మరియు వారి ప్రక్కన నగ్నంగా నిలబడి ఉన్న నాయర్ కూతురు వాళ్ళకు కనిపించారు. నాయర్ కూతురుకి ఆ అజ్ఞాత పురుషులు ప్రమాదం తలపెట్టబోతున్నారని ఊహించిన ఆ గ్రామస్తులు పెద్దగా అరుస్తూ వాళ్ళని కొట్టటానికి, వాళ్ళమీదకి దూకపోయారు. సరిగ్గా, అదే సమయానికి ఇంట్లోంచి నంబూద్రి బైటకు వచ్చాడు. ఆపై, ఆయన పెద్ద స్వరంతో "ఆగండి" అని ఆ గ్రామస్తులను శాసించాడు. మహామంత్రవాది అయిన ఆ నంబూద్రి అలా అనటంలో ఆ గ్రామస్తులు ఒక్కసారిగా మౌనం వహించారు. ఆపై ఆ నంబూద్రి, నాయర్ అల్లుడిని తన దగ్గరకు పిలిచి చిన్న స్వరంతో అతడితో "నీవు వెంటనే పైకి వెళ్ళి నీ భార్య వస్త్రాలు తీసుకువచ్చి ఆమెకు వెంటనే ధరింపచెయ్యి" అన్నాడు.

ఆ తరువాత నంబూద్రి తన కమండలంలో ఉన్న నీటిని తన కుడిచేతిలోకి పోసుకుని కళ్ళకు అద్దుకుని, ఆ తరువాత ఆ నీటిని – అక్కడ అచేతనంగా నిలబడి ఉన్న నాయర్ కూతురిపైన చల్లాడు. ఆమెకు వెంటనే మైకం తొలగిపోయింది. ఆ మరుక్షణంలోనే ఆమెకు "తాను నగ్నంగా అంతమందిలో నిలబడి ఉన్నాను" అన్న సత్యం అర్ధమయ్యింది. ఆపై, ఆమె గభాలున నేలపై మోకాళ్ళపై కూర్చుని రెండు చేతులతో ముఖం కప్పుకుని బిగ్గరగా ఏడవటం ప్రారంభించింది. ఇంతలోనే ఆమె భర్త, ఆమె బట్టలు తెచ్చి ఆమెకు తొడిగాడు. నంబూద్రి, నాయర్ అల్లుడివైపు ఒకసారి పరిశీలనగా చూసి "బిడ్డా! వెంటనే నీ భార్యను లోపలికి తీసుకువెళ్ళిపో" అన్నాడు. వెంటనే అతడు తన భార్యను తీసుకుని ఇంట్లోకి వెళ్ళిపోయాడు. అప్పుడు నంబూద్రి ఒకసారి తేలిగ్గా నిట్టూర్చి, ఆపై నాయర్‌ని దగ్గరగా పిలిచి తగ్గు స్వరంతో అతడితో "నాయర్! వెంటనే పోలీసుల్ని పిలిపించు. జరగాల్సిన కార్యక్రమాన్ని వాళ్ళే జరిపిస్తారు" అన్నాడు. ఇంతలో పోలీసులు వచ్చారు. పోలీసుల్ని చూసిన నంబూద్రి ఒకసారి చిన్నగా నవ్వి, ఆపై ఆ పోలీసులకు అధిపతి అయిన పోలీసు అధికారితో "ఇప్పుడు ఒక విచిత్రం జరుగుతుంది చూడండి" అన్నాడు. నంబూద్రి గురించి ఆ పోలీసులకు

కూడా బాగా తెలుసు. ఎందుకంటే, గతంలో అనేకసార్లు వాళ్ళు, నంబూద్రి సహకారంతో అనేకమంది నేరస్థుల్ని బంధించటం జరిగింది. ఇప్పుడు నంబూద్రి ఏం చెయ్యబోతున్నాడా? అని పోలీసులు ఆసక్తిగా చూస్తున్నారు. నంబూద్రి తన కమండలం నుండి కొద్దిగా జలాన్ని కుడిచేతిలోకి తీసుకుని కళ్ళకు అద్దుకున్నాడు. ఆపై ఆ జలాన్ని – అక్కడ నిలబడి ఉన్న ఆరుగురు నగ్న వ్యక్తుల శిరస్సులమీద చల్లాడు. ఆ మరుక్షణమే, ఆ వ్యక్తులు స్పృహ కోల్పోయి బొమ్మల్లాగా నిలబడ్డారు. అప్పటికీ, వాళ్ళ చేతుల్లో కాగడాలు వెలుగుతూనే ఉన్నాయి. అప్పుడు నంబూద్రి అక్కడ ఉన్న పోలీసు అధికారితో ఇలా చెప్పాడు. "ఈ ఆరుగురు అజ్ఞాత వ్యక్తులూ చాలా ప్రమాదకరమైన మాంత్రిక వర్గానికి చెంది ఉన్నారు. నేను ఇప్పుడు వారిమీద చల్లిన మంత్రజలం కారణంగా వారి మైకం తొలగిపోతుంది. అప్పుడు వాళ్ళు ఈ లోకంలోకి వస్తారు. మిమ్మల్ని చూసి పారిపోవాలని ప్రయత్నిస్తారు. అందువల్ల మీరు చాలా జాగ్రత్తగా ఉండాలి. వాళ్ళని పారిపోకుండా బంధించాలి".

నంబూద్రి చెప్పినట్లుగానే రెండు, మూడు నిమిషాలలోపే ఆ ఆరుగురికి స్పృహ వచ్చింది. ఆశ్చర్యం!...అప్పటి వరకు వాళ్ళ చేతుల్లో ఉన్న కాగడాలు హఠాత్తుగా బరిశల్లాగా మారిపోయాయి. వాళ్ళు, పోలీసుల బారి నుండి తప్పించుకోవటంకోసం పోలీసుల్ని ఆ బరిసెలతో చంపటానికి ప్రయత్నించారు. అయితే, పోలీసులు, అక్కడ చేరిన అనేకమంది ప్రజల సహాయంతో ఆ ఆరుగురిని బంధించారు. ఆ తరువాత ఆ ఆరుగురినీ పోలీసు స్టేషన్‌కి తీసుకువెళ్ళారు. వారి వెనకాలే నాయర్, నంబూద్రి, నాయర్ కుటుంబ సభ్యులు మరియు ఆ గ్రామస్తులు పోలీస్ స్టేషన్‌కి వెళ్ళారు. అక్కడ ఉన్న పోలీసు అధికారి ఆ ఆరుగురిని కొంచెంసేపు కఠినంగా ప్రశ్నించిన తరువాత వాళ్ళు, వికృతమైన స్వరంతో ఇలా చెప్పారు. "మేము తాంత్రిక సాధనలు చేస్తూ ఉంటాము. గర్భవతిగా ఉన్న స్త్రీలను బలి ఇస్తే మాకు ఎన్నో శక్తులు వస్తాయి. ఆ కారణంగానే, మేము ఇంతకు ముందు ఈ నాయర్ యొక్క ఇద్దరు కూతుళ్ళనీ మంత్ర ప్రయోగంతో తీసుకువెళ్ళి బలి ఇచ్చాం. ఇప్పుడు, ఆయన మూడవ కూతురుని తీసుకువెళ్ళి బలి ఇద్దాము అనుకున్నాము. కానీ, మహా మంత్రవాది అయిన కొండమారుక్కు నంబూద్రి, మంత్రబలం ముందు మా మంత్రశక్తి నిలబడలేకపోయింది. అందుకే, మేము ఇలా దొరికిపోయాం". వాళ్ళు చెప్పిన మాటలు విన్న నాయర్ ఒక్కసారిగా పెద్దగా రోదించాడు. అది గమనించిన నంబూద్రి, నాయర్ దగ్గరకువెళ్ళి అతడి భుజంమీద చెయ్యివేసి ఆపై ప్రశాంతమైన స్వరంతో "నాయర్! బాధపడకు. విధివ్రాతను ఎవరూ తప్పించలేరు. నీ పెద్దకూతుళ్ళు ఇద్దరూ నీకు కాకుండా పోయారు.

కానీ, ఆ భగవతి దయవల్ల నీ కూతురు క్షేమంగా నీకు దక్కింది. నీవు, గతం గురించి విచారించకు. నీ కూతురికి పుట్టబోయే బిడ్డ గురించి మాత్రమే ఆలోచించు. నీకు మంచి జరుగుతుంది" అన్నాడు. నాయర్ కళ్ళు తుడుచుకుంటూ కృతజ్ఞతతో నిండిన చూపులతో, రెండు చేతులూ జోడించి నంబూద్రి వైపు చూసాడు.



# 22. గోవాలో కొలువైన శ్రీ మహాలాసదేవీ క్షేత్ర విశేషాలు?

మహారాష్ట్ర మరియు కర్నాటక రాష్ట్రాల మధ్య, పొందికగా అమరి ఉన్న అతి చిన్న రాష్ట్రం అయిన గోవా, అరేబియా సముద్రతీరంలో ఉన్నది. గోవా రాష్ట్ర, ఉత్తర ప్రాంతంలో ఉన్న దక్షిణ గోవా జిల్లాలోని 'పొండ' అనే పట్టణానికి దగ్గరలో 'మర్డోల్' అనే చిన్న గ్రామంలో మహాద్భుత రూపం మరియు అంతకు మించిన మాహాత్యంగల ఒక వైష్ణవ మత సంబంధ ఆలయం ఉన్నది. ఈ ఆలయంలో పూజలందుకునే ప్రధాన దేవిని "శ్రీ మహాలస నారాయణి' అన్న పేరుతో పిలుస్తారు. కొంతమంది పరిశీలకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, 'మహాలస' – లక్ష్మీదేవి యొక్క ఒక అవతారమని తెలుస్తున్నది. అందువలన, ఆమెను మహావిష్ణువు యొక్క ధర్మపత్నిగా గుర్తిస్తారు. మరికొంతమంది పండితుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, సాగరమధనం జరిగిన సమయంలో రాక్షసుల్ని వంచించటంకోసం 'మోహిని'గా అవతరించిన మహావిష్ణువు యొక్క స్త్రీ రూపమే ఈ మహాలసదేవి అని తెలుస్తున్నది ఏదిఏమైనా, ఈమె వైష్ణవ సంబంధమైన దైవం అని చెప్పక తప్పదు.

మహాలాసదేవి, కొన్ని ప్రాంతాలలో సంపూర్ణమైన దేవతగా ఆరాధించబడుతూ ఉండగా, కొన్ని ప్రాంతాలలో గ్రామదేవతగా (గ్రామానికి రక్షకురాలు) పూజించ బడుతున్నది. మహాలసదేవి యొక్క ప్రధాన ఆలయాలు మహారాష్ట్రలోని పైఠాన్, నెవాసా మరియు గోవాలోని మర్డోల్ అనే ప్రాంతంలోను ఉన్నాయి. గోవా మరియు కర్నాటక రాష్ట్రంలోని దక్షిణ కెనరా ప్రాంతంలో నివసించే వైష్ణవ మతస్తులు ఈ దేవతను 'నారాయణి'గా పూజిస్తారు. భవిష్యపురాణంలో ఈ దేవతను 'నారాయణి' అని, రాహుమర్దని (రాహువుని సంహరించింది) అని చెప్పబడి ఉన్నది. గౌడసారస్వత్ బ్రాహ్మణులు, కర్హాడే బ్రాహ్మణులు, దైవజ్ఞ బ్రాహ్మణులు, భండారీలు మరియు

షింపీ కులంవారు కూడా మహాలసాదేవిని తమ ఇలవేల్పుగా ('కులదేవత') అనాదికాలం నుండి పూజిస్తున్నారు. గోవాలోని వైశ్యులు మరియు సోనార్లు (కంసాలి కులస్తులు) కూడా మహాలసాదేవిని తమ కులదేవతగా ఒక శతాబ్దం నుండి పూజించటం ప్రారంభించారు.

ఈ క్షేత్రానికి సంవత్సరంలో – లక్షలాదిమంది భక్తులు మరియు వేలాదిమంది విహార యాత్రికులూ వస్తూ ఉంటారు. ఈ క్షేత్రంలో ప్రధాన దైవంగా పూజలందుకుంటున్న 'మహాలస', మహా శక్తివంతమైన దేవతగా గుర్తించబడింది. గోవా, మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాలలో ఈ దేవతను ఆరాధించే భక్తులు లక్షల సంఖ్యలో ఉంటారు. అయితే, తెలుగు రాష్ట్రాలలోని చాలామందికి ఈ దేవతయొక్క మహత్యం తెలియదని భావించవచ్చు. ఏవిధమైన, కష్టాలలో ఉన్నవారైనా ఈ మహాలసదేవిని ఒక్కసారి సందర్శించుకుంటే వారు ఆ కష్టాల నుండి బైట పడటమే కాకుండా కొత్త వారికి కూడా ఆ దేవియొక్క మహత్యం గురించి చెప్పి తీరతారు అనటంలో అతిశయోక్తిలేదు.

**మహాలసదేవి ఆవిర్భావం ఎలా జరిగింది?**

"తమ దగ్గర అపారమైన సంపదలు ఉన్నాయి అని, గర్వతో విర్రవీగుతున్న దేవతలు ఒక సమయంలో – తనకు చేసిన అవమానానికి ప్రతీకారంగా దూర్వాస మహర్షి ఆ దేవతల సమస్త సంపదలు సముద్రంలో కలిసిపోవాలని" శపించాడు. ఫలితంగా, దేవతలు ఏమీలేని దరిద్రులుగా మారిపోయారు. అలాంటి సమయంలో బ్రహ్మదేవుడి సలహామీద దేవతలు ఆ సముద్రాన్ని మధించి, అందులో ఉన్న తమ సంపదల్ని మళ్ళీ వెనక్కి తీసుకోవాలని నిర్ణయించుకున్నారు. అయితే, సముద్రాన్ని చిలకాలంటే సాధారణమైన కవ్వం పనికిరాదు. అందువల్ల, ఆకాశాన్ని తాకుతూ ఉండే మంధర పర్వతాన్ని సముద్రంలో కవ్వంలాగా దించారు. ఇక, ఆ కవ్వాన్ని తిప్పటానికి మామూలు తాడు పనికిరాదు. అందువలన, ఊహాతీతమైన పొడుగు ఉండే వాసుకి అనే మహా సర్పరాజుని ఆ కవ్వానికి తాడుగా అమర్చారు. అయితే, ఆ కవ్వం తాడుని లాగటానికి రెండువైపులా వ్యక్తులు ఉండాలి. అలాంటి సమయంలో వాళ్ళు, రాక్షసుల్ని ఆ సర్పంయొక్క రెండవవైపు పట్టుకుని, సముద్రాన్ని చిలకటానికి సహాయపడమని అడిగారు. అప్పుడు రాక్షసులు "మీకు సహాయం చేస్తే మాకు వచ్చే లాభం ఏమిటి?, అదీకాక అనాదికాలం నుండి మనమధ్య తీవ్రమైన విరోధం ఉన్నది. అలాంటప్పుడు మీకు సాయం చెయ్యాల్సిన అవసరం మాకు ఏమిటి?"

అన్నారు. అప్పుడు, చాలా తెలివైన ఇంద్రుడు ఆ రాక్షసులతో చాలా మృదువైన స్వరంతో "సోదరులారా! ఈ సముద్రాన్ని చిలుకుతున్నప్పుడు సముద్రంలోంచి అసాధారణమైన మరియు అపురూపమైన ఎన్నో వస్తువులు వస్తాయి. అలా వచ్చే వస్తువులలో సగం మీకు ఇస్తాం. సగం మేము తీసుకుంటాం" అన్నాడు.

"సముద్రంలోంచి వచ్చే వస్తువులలో తమకు భాగం వస్తుంది" – అన్న ఆశతో రాక్షసులు ఆ కవ్వాన్ని తిప్పటంలో సహకరించటానికి సిద్ధపడ్డారు. అప్పుడు కూడా ఇంద్రుడు తన తెలివిని ప్రదర్శించాడు. అది ఎలాగంటే...ఇంద్రుడు ఆ రాక్షసులతో "మేము మీ కన్నా కొంచెం గొప్పవాళ్ళం కనుక, మేము ఈ సర్పం యొక్క తలభాగాన్ని పట్టుకుని లాగుతాం. మీరు ఈ సర్పం యొక్క తోక భాగాన్ని పట్టుకుని లాగండి" అన్నాడు. ఆ మాట వినగానే రాక్షసులకి కోపం కట్టలు తెంచుకున్నది. ఆపై వాళ్ళల్లో ప్రముఖుడైన రాహువు అనే రాక్షసుడు క్రూరమైన స్వరంతో ఇంద్రుడితో "ఇంద్రా! మీరు, మేము తల్లులు వేరైనా ఒకే తండ్రికి పుట్టాం. అలాంటప్పుడు మీరు మా కన్నా గొప్పవాళ్ళు ఎలా అవుతారు?. ఏదిఏమైనా సరే, మేము తలవైపే పట్టుకుని లాగుతాం. మీరు అందుకు ఒప్పుకుని తీరాలి. లేకపోతే మేము వెళ్లిపోతాం" అన్నాడు. రాహువు అన్న మాటలు విన్న ఇంద్రుడు మనసులో బాగా ఆనందించి, ఆపై మెత్తటి స్వరంతో "సోదరా! నీ ఇష్ట ప్రకారమే చెయ్యండి. మీరే తలభాగం పట్టుకోండి. మేము తోకభాగం పట్టుకుంటాం సరేనా" అన్నాడు. అప్పుడు రాక్షసులు గర్వంతో పొంగిపోతూ వాసుకి యొక్క తలవైపు భాగాన్ని పట్టుకున్నారు. దేవతలు తోక భాగాన్ని పట్టుకున్నారు. ఆపై ఆ సముద్రాన్ని చిలకటం ప్రారంభించారు. కొన్ని రోజులు గడిచేసరికి ఆ పర్వతానికి అనగా కవ్వానికి తాడుగా ఉపయోగపడుతున్న వాసుకి సర్పం, విపరీతమైన వత్తిడికి గురి అయ్యింది. ఒకవైపు రాక్షసులు, ఇంకొక వైపు దేవతలు తమ బలం కొద్దీ ఆ సర్పాన్ని పట్టుకుని గుంజుతూ ఉండేసరికి ఆ సర్పం యొక్క శరీరం, మంధర పర్వతం యొక్క బలమైన ఒత్తిడికి అతి భయంకరమైన ఉష్ణోగ్రతతో ఉన్న విషాన్ని కక్కటం ప్రారంభించింది. తలవైపు ఉన్న రాక్షసుల మీదకి ఆ సర్పం యొక్క తల అనగా నోటి నుండి వస్తున్న విషం ఉప్పెనలాగా పడిపోయింది. ఆ మహావిషం ధాటికి వందలకొద్దీ రాక్షసులు అక్కడికక్కడే చనిపోయారు. తోకవైపు ఉన్న కారణంగా దేవతలకి ఏమాత్రం ప్రాణ నష్టం కలగలేదు. తమలో చాలామంది ఆ విషం వల్ల చనిపోయిన తరువాత రాక్షసులుకి ఇంద్రుడు పన్నిన తంత్రం అర్థమయ్యింది. "ఇప్పుడు తల భాగాన్ని తాము పట్టుకోము అంటే తమకి పరువు తక్కువ" అని భావించిన రాక్షసులు ఆ విషాన్ని తట్టుకుంటూ మొండిగా ఆ కవ్వాన్ని తిప్పుతూనే ఉన్నారు. అలా అనేక

నెలలు గడిచిన తరువాత ఆ సముద్రం నుండి 'ఐరావతం' అనే అనేక తలలు గల తెల్లటి ఏనుగు, ఉచ్చైశ్రవం అనే ఒక దేవతా అశ్వం మరియు అనేక రకాల నిధులు బైటకు వచ్చాయి. అప్పుడు ఇంద్రుడు, రాక్షసులతో ఇలా అన్నాడు. "ఈ ఏనుగు, గుర్రం, వెండి-బంగారాలు మీ లాంటి గొప్పవాళ్ళకి అనవసరం, ఇక, ముందు రాబోయే అమృతాన్ని మాతోపాటుగా సగభాగం మీరూ తీసుకోండి. ఆ అమృతాన్ని త్రాగితే మీరుకూడా మాలాగే ఏనాటికీ చావులేకుండా ఉంటారు".

ఇంద్రుడు లౌక్యంగా అన్న ఈ మాటలకు మోసపోయిన రాక్షసులు, మొదట వచ్చిన సంపదల్ని పట్టించుకోలేదు. ఆ తరువాత మూడు లోకాలను ధ్వంసం చెయ్యగలిగిన "హాలాహలం" అనే మహావిషం బైటకు వచ్చింది. అప్పుడు మహావిష్ణువు కోరికమీద పరమశివుడు ఆ హాలాహలాన్ని తన నోట్లో వేసుకుని, ఆపై తన గొంతులో ఆ మహావిషాన్ని నిలబెట్టాడు. ఎందుకంటే, ఆ విషం శివుడి కడుపులోకి వెళితే ఆయన కూడా అంతం అయిపోతాడు మరి. ఏదిఏమైనా, ఆ హాలాహలాన్ని తన గొంతులో దాచుకున్న మహాశివుడు ఆనాటి నుండి "గరళకంఠుడు" (గొంతులో విషం కలవాడు), నీలకంఠుడు (విషం కారణంగా నీలంరంగులోకి మారిన కంఠం గలవాడు) అనే పేర్లతో పిలువబడ్డాడు. ఏదిఏమైనా, "ఎవరికైనా జీవితంలో ఒక మహర్దశ రావటానికి ముందు, ఖచ్చితంగా ఒక గొప్ప ఆపద లేదా కష్టం వచ్చి తీరుతుంది". అందుకు ఉదాహరణగా, సముద్ర మథనంలో మొదట హాలాహలం అనే అతి భయంకరమైన విషం పుట్టింది. ఆ తరువాత అమృతం, సముద్రం నుండి బైటకు వచ్చింది. ఏదిఏమైనా, ఒక సువర్ణ పాత్రలో భద్రపరచబడిన అమృతం సముద్రం నుండి బైటకు వచ్చింది. అక్కడ నుండి అసలు సమస్య ప్రారంభం అయ్యింది. అసలే మహా బలవంతులు మరియు తమపట్ల ఆగర్భశత్రుత్వంగల తమ దాయాదులైన రాక్షసులకు ఆ అమృతం త్రాగిస్తే, వాళ్ళు కూడా మరణంలేనివారు అవుతారు. అప్పుడు వాళ్ళని అడ్డుకోవటం ఆ మహావిష్ణువుకి కూడా సాధ్యంకాదు. "అమరులుగా మారే రాక్షసులు, తమని చిత్రహింసలుపెట్టి కట్టుబానిసలుగా మార్చటం ఖాయం" అని దేవతలు గుర్తించారు. అప్పుడు ఇంద్రుడు తన మనసులో మహావిష్ణువుని ప్రార్థించి, ఆ అమృతం రాక్షసులకు దక్కకుండా చెయ్యమని కోరాడు. ఏదిఏమైనా, మహావిష్ణువు సురపక్షపాతి అనగా దేవతలమీద మహా అభిమానం కలవాడు కనుక ఆయన, రాక్షసులకు అమృతం దక్కకుండా చెయ్యాలని నిర్ణయించుకున్నాడు. అందుకోసం, ఆయన అప్పటి వరకు భూమితో సహా ఏ లోకంలోనూ లేని మరియు బ్రహ్మదేవుడు అప్పటి వరకు సృష్టించని లేదా సృష్టించటానికి సాధ్యం కాని, మహాద్భుత

సౌందర్యవతి అయిన 'మోహినీ' రూపాన్ని ధరించాడు. ఆపై, ఆ మోహినీ తన జగన్మోహనాకారంతో రాక్షసుల ముందుకి వెళ్ళి, ఆపై తన మృదు మధురమైన స్వరంతో ఆ రాక్షసులతో ఇలా చెప్పింది.



"నేను, మీకు మరియు మీ దాయాదులైన ఆ దేవతలకు న్యాయం చేస్తాను. మీ రెండు వర్గాలకు అమృతం దక్కేలా చేస్తాను". మహాద్భుతమైన సౌందర్యంతో మెరిసిపోతున్న ఆ జగన్మోహినిని చూసిన ఆ రాక్షసులని అప్పటికే కామ వ్యామోహం కప్పివేసింది. "అందమైన స్త్రీ, విషం త్రాగమని చెప్పినా ఆనందంగా త్రాగటానికి సిద్ధపడే కొందరు ఆధునిక పురుషులలాగానే ఆనాటి రాక్షసులు కూడా మోహినీ చెప్పినట్లుగా చెయ్యటానికి అంగీకరించారు". ఆపై, మోహినీ – దేవతలందరినీ ఒకవైపు, రాక్షసులందరినీ ఒకవైపు కూర్చోపెట్టింది. ఆపై, వాళ్ళందరినీ దోసిళ్ళుపట్టి సిద్ధంగా ఉండమని చెప్పింది. ముందు – దేవతలయొక్క దోసిళ్ళల్లో అమృతం పొయ్యటం ప్రారంభించింది. దేవతలు తమ చేతిలో అమృతం పడగానే గటగటా త్రాగటం ప్రారంభించారు. ఇక, రాక్షసులు – మోహినీ యొక్క అద్భుతమైన ఒంపుసొంపులను వళ్ళు తెలియని మైకంతో చూస్తూ మురిసిపోతున్నారు. "తమనోట్లో మట్టికొట్టి, దేవతల నోట్లో అమృతాన్ని పోస్తున్న మోహిని యొక్క మోసాన్ని" రాక్షసులు ఏమాత్రం పసికట్టలేకపోయారు. కొంతసేపు గడిచిన తరువాత, రాక్షసులలో తెలివైనవాడు అయిన రాహువుకి మోహినీయొక్క మోసం అర్థమైపోయింది. ఇంకా ఇటువైపే ఉంటే, ఆ అమృతంలో ఒక చుక్క కూడా తమకి దక్కదని అర్థంచేసుకున్న రాహువు, వెంటనే తన మాయాశక్తితో ఒక మగ దేవత రూపం ధరించి చాలా రహస్యంగా ఆ దేవతల గుంపులోకి చేరి కూర్చున్నాడు. మోహిని – ఒకొక్కరికీ అమృతం పోస్తూ చివరగా రాహువు దగ్గరకు వచ్చింది. రాహువు యొక్క రూపంచూసి వాడుకూడా దేవతలలోని వాడే అని భావించిన మోహినీ వాడి దోసిట్లో కూడా

అమృతాన్ని పోసింది. అదే సమయంలో ఆకాశంలో ఉన్న సూర్యచంద్రులు ఆ విషయాన్ని పసిగట్టి ఆపై మోహినితో "దేవీ! నువ్వు, దేవత రూపంలో ఉన్న రాహువు అనే రాక్షసుడి దోసెట్లో అమృతం పోసావు జాగ్రత్త" అని పెద్ద స్వరంతో అన్నారు. వాళ్ళు అలా అంటున్న సమయంలోనే రాహువు ఆ అమృతాన్ని తన నోట్లో పోసుకుని గుటుక్కున మింగాడు. ఆ అమృతం – వాడి శరీరంలోకి చేరగానే వాడికి మరణంలేని స్థితిని (అమరత్వాన్ని) ప్రసాదించింది. అది గమనించిన మోహినీ, ఒక్కసారి తన సుదర్శన చక్రాన్ని మనసులో తలచుకున్నది. ఆపై, ఆ చక్రం మహావేగంతో తిరుగుతూ వచ్చి రాహువుయొక్క తలని ఖండించింది. ఫలితంగా, రాహువుయొక్క శిరస్సు ఒకవైపు, మొండెం ఒకవైపు పడ్డాయి. అయితే, అమృతం త్రాగిన కారణంగా ఆ శిరస్సు మరియు మొండెం ప్రాణంతో ఉన్నాయి. ఆపై, ఆ శిరస్సు 'కేతువు' అనే సర్పగ్రహంగాను, మొండెం "రాహువు" అనే సర్పగ్రహంగాను మారాయి. "తాను అమృతం త్రాగిన విషయాన్ని పసిగట్టి ఆ విషయాన్ని మోహినికి తెలియజెప్పిన సూర్య–చంద్రుల మీద పగపట్టిన ఆ రాహువుయొక్క రెండు రూపాలైన రాహు–కేతువులు ఆనాటి నుండి సంవత్సరంలోని కొన్ని సందర్భాలలో రవి, చంద్రులను మింగటం ప్రారంభించారు. ఇలా, రాహు–కేతువుల చేత కొంతసేపు – రవి, చంద్రులు మింగబడే (రవి,చంద్రులు కనపడని స్థితి) అసాధారణమైన సంభవాన్ని "గ్రహణం" అనే పేరుతో పిలవటం ప్రారంభం అయ్యింది.

ఏదిఏమైనా, తన అసాధారణమైన సౌందర్యంతో రాక్షసులను వంచించిన "మాయామోహిని" యొక్క మహా సౌందర్యాన్ని చూసి స్థితప్రజ్ఞుడైన శివుడు కూడా కామ వ్యామోహంతో చలించిపోయాడు. ఆయన ఆ మోహినీ వద్దకువెళ్ళి ఆమె యొక్క పొందును కోరాడు. అప్పుడు మోహినీ చిరునవ్వు నవ్వి "ఈశ్వరా! నీవు కలియుగంలో ఖండోబాగా జన్మిస్తావు. అప్పుడు నేను, మహల్సా (మహాలస) దేవిగా జన్మించి నీ భార్యను అయి, నిన్ను శృంగార సామ్రాజ్యంలో ముంచితేలుస్తాను. అప్పటి వరకు నిగ్రహంతో ఉండు" అన్నది. శివుడు సంతోషంగా అందుకు అంగీకరించాడు. ఈవిధంగా, మహావిష్ణువు – దుష్టులైన రాక్షసులను వంచించటంకోసం ఎత్తిన మోహినీ రూపమే ఆ తరువాత కాలంలో మహాలసదేవిగా భక్తులచేత పూజలందుకోవటం ప్రారంభించింది.

**ఖండోబా ధర్మపత్ని మహల్సా (మహాలస) వృత్తాంతము :**

మరాఠి భాషలో 'మహల్సా' అని పిలువబడే మహాలసదేవిని మహావిష్ణువు యొక్క – జగన్మోహిని లేదా మోహినీ అవతారంగా ఎక్కువమంది గుర్తిస్తారు. అయితే,

కొంతమంది భక్తులు, ఆమెను పరమశివుడి అవతారమైన 'ఖండోబా' యొక్క భార్యగా ఆరాధిస్తున్నారు.

మరాఠి భాషలో కొద్ది శతాబ్దాల క్రితం వ్రాయబడిన 'మల్హారి మాహాత్య' అనే గ్రంథంలో 'మహల్సా' యొక్క అవతార విశేషాలు వివరించబడ్డాయి. అది ఎలాగంటే... పూర్వం, భారతదేశ పశ్చిమ ప్రాంతంలో మణి మరియు మల్ల అనే ఇద్దరు రాక్షస సోదరులు ఉండేవారు. వాళ్ళు, బ్రహ్మదేవుడి గురించి గొప్ప తపస్సుచేసి గొప్ప శక్తులను పొందారు. ఆవిధంగా మహా బలవంతులుగా మారిన ఆ రాక్షస సోదరులు, కేవలము భూమిమీదే కాక, పైన ఉండే స్వర్గలోకంలో కూడా తీవ్రమైన దుర్మార్గాలు చెయ్యటం ప్రారంభించారు. ఫలితంగా, ఇటు మానవులు, అటు దేవతలు ఆ రాక్షస సోదరుల హింసలు తట్టుకోలేక గిలగిలలాడిపోయారు. అలాంటి పరిస్థితులలో దేవతలు మరియు మానవులు – పరమశివుడి వద్దకువెళ్ళి ఆ రాక్షస సోదరుల బారి నుండి తమను రక్షించమని ఆయనను వేడుకున్నారు. పరమశివుడు అనుగ్రహించాడు. ఆపై, పరమశివుడు – భైరవుడుగాను, పార్వతీదేవి – మహల్సాగాను అవతరించి ఆ రాక్షస సోదరులను ఒక ఘోర యుద్ధంలో సంహరించటం జరిగింది.

'జజూరి' క్షేత్రంలో (మహారాష్ట్రలోని పూనె జిల్లాలో ఈ పట్టణం ఉన్నది) ఖండోబా యొక్క ప్రధాన ఆలయం ఉన్నది. మహల్సాదేవి కూడా ఈ ఆలయంలో ఖండోబాతో పాటుగా ప్రముఖంగా పూజించబడుతున్నది. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, కేవలము జజూరి క్షేత్రంలోనే కాకుండా ప్రతి ఖండోబా ఆలయంలో కూడా మహల్సాదేవి పూజలందుకుంటున్నది.

అయితే, మహారాష్ట్రలోని 'నేవాసా' అనే పట్టణంలో ఉన్న మోహినీరాజ్ అనే దేవతను ఖండోబా యొక్క ధర్మపత్నిగా కొందరు భావిస్తారు. ఈ మోహినీరాజ్ సాక్షాత్తు మహల్సాదేవి అని గుర్తించాలి. ఈ ఆలయంలో మోహినీరాజ్, నాలుగు హస్తాలను కలిగి ఉన్నట్లుగా కనిపిస్తుంది. ఈమె, 'మోహినీ'(విష్ణువు)గా గుర్తించబడింది. ఈమె ప్రక్కన గుర్రంపై ఆసీనుడై ఉండే ఖండోబా కనిపిస్తాడు. ఇంకొక విశేషం ఏమంటే, మహల్సాదేవి, ఖండోబా వెనకాల ఒక గుర్రంమీద కూర్చుని ఉన్నట్లుగా లేదా ఖండోబా ప్రక్కన నిలబడి ఉన్నట్లుగా కొన్ని చిత్రాలు (పెయింటింగ్స్) కనిపిస్తాయి.

మహల్సాదేవిని పార్వతీ స్వరూపంగా భావించే వర్గానికి చెందినవారు చెప్పే సమాచారం ప్రకారం చూసినట్లయితే, కొన్ని శతాబ్దాల క్రితం మహారాష్ట్రలోని 'నేవాసా'

ప్రాంతంలో తిమ్మసేట్ అనే ఒక లింగాయత్ కులానికి చెందిన ఒక సంపన్న వ్యాపారి ఉండేవాడు. ఆయన కుమార్తెగా పార్వతీదేవి, మహల్సా అనే పేరుతో జన్మించింది. ఆమెకు యుక్త వయస్సుకు వచ్చిన తరువాత ఒకరోజున పరమశివుడి అవతారమైన ఖండోబా, తిమ్మసేట్‌కి స్వప్నంలో కనిపించి "మహల్సాను తనకు ఇచ్చి వివాహం చెయ్యమని" అడిగాడు. ఆ ప్రకారమే, ఆ తరువాత కొద్ది రోజులకు తిమ్మసేట్ పుష్యమాసంలో వచ్చిన పుష్యమాస పౌర్ణమి రోజున మహల్సాకు మరియు ఖండోబాకు వివాహం చేసాడు. ఆ తరువాతకాలంలో – ఆనాడు జరిగిన ఈ వివాహానికి గుర్తుగా రెండు శివలింగాలకు 'పాళి' (పెంబర్) అనే ప్రదేశంలో ఈనాటికీ సంవత్సరానికి ఒకసారి పుష్య పౌర్ణమినాడు వివాహం చెయ్యటం జరుగుతున్నది.

**'మర్దోల్' మహాలసాదేవి క్షేత్ర విశేషములు :**

కొంతమంది పరిశోధకుల అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, మహాలసాదేవి యొక్క ప్రధాన ఆలయం నేపాల్‌లో ఉన్నదని, ఆ తరువాత కాలంలో ఆ ఆలయంలోని విగ్రహం, మహారాష్ట్రలోని ఔరంగాబాద్‌కి తరలించబడిందని, మొగల్ చక్రవర్తులు ఉత్తర భారతదేశాన్ని పరిపాలిస్తున్నప్పుడు ముఖ్యంగా, ఇస్లాంమత మూర్ఖుడైన ఔరంగజేబ్ పరిపాలనాకాలంలో ఔరంగాబాద్‌లోని మహాలసాదేవి విగ్రహాన్ని గోవాలోని ఒక రహస్య ప్రాంతానికి తరలించారని తెలుస్తున్నది. ఏదిఏమైనా ఆ తరువాతకాలంలో గోవాలోని వెర్న/వెల్హామ్ అని పిలువబడే ఒక ప్రాంతంలో ఒక చిన్న ఆలయాన్ని నిర్మించి, ఆ ఆలయంలో మహాలసాదేవి విగ్రహాన్ని ప్రతిష్టించి పూజించటం ప్రారంభించారు.

ప్రస్తుతం, ఒక పారిశ్రామిక వాడ (ఇండస్ట్రియల్ ఎస్టేట్)గా ఉన్న 'వెర్న' అనే ప్రాంతం కొన్ని శతాబ్దాల క్రితం ఒక చిన్న గ్రామంగా ఉండేది. ఆ గ్రామంలోనే తొలిసారిగా మహాలస ఆలయం నిర్మించబడింది. అయితే, క్రీ.శ.1543లో ఈ ఆలయం, పోర్చుగీసు సైనికులచేత సర్వనాశనం చేయబడింది.

మర్దోల్ క్షేత్రంలో ప్రచారంలో ఉన్న సమాచారాన్నిబట్టి చూసినట్లయితే, చాలా దశాబ్దాల క్రితం ఒక పశువుల కాపరి, 'వెర్న' అనే ఒక చిన్న పట్టణ సమీపంలో ఉన్న సన్‌సాడా పీఠభూమి భాగంలో తన పశువులను మేపుతున్నప్పుడు, దేవీమహాలస ఒక మానవ స్త్రీ రూపంలో ఆ పశువుల కాపరికి కనిపించి అతడితో "బిడ్డా! నీవు వెంటనే ఊళ్ళోకి వెళ్ళి మీ యజమానిని వెంటపెట్టుకుని నా దగ్గరకు తీసుకురా" అని

చెప్పింది. దేవతా స్త్రీ రూపంలో ఉన్న మహాలసను చూసి భయపడిన ఆ పశువుల కాపరి, ఆమె బారి నుండి ఎలాగైనా సరే, తప్పించుకోవాలనే ఉద్దేశంతో ఆమెతో ఒక అబద్ధం ఇలా చెప్పాడు. “అమ్మా! నా పశువులకు బాగా దాహంగా ఉన్నది. అందువల్ల వాటికి నీళ్ళు త్రాగించాలి. కనుక, ఇప్పుడు నేను ఊళ్ళో ఉన్న మా యజమాని దగ్గరకు వెళ్ళటం కుదరదు”. అప్పుడు ఆమె చిరునవ్వునవ్వి ఆపై గజ్జలతో అలంకరించ బడిన తన కుడికాలుని నేలపై ఒకసారి బలంగా తట్టింది. ఆ మరుక్షణమే, ఆ ప్రదేశంలో ఒక నీటి బుగ్గ (భూమి నుండి వేగంగా పైకి చిమ్మే జలధార) ఆవిర్భవించింది. ఇప్పటికీ, ఆ జలధార సజీవంగా ఉన్నది. ప్రస్తుతం, ఆ జలధారను ‘నూపుర్ సరస్సు’ అనే పేరుతో పిలుస్తున్నారు. ఆ మహత్యం చూసిన ఆ పశువుల కాపరి, అమ్మవారికి భక్తితో నమస్కరించి, ఆపై వేగంగా నడుస్తూ ఊళ్ళోకి వెళ్ళాడు. ఆ తరువాత, అక్కడ యజమాని లేకపోవటంతో యజమాని యొక్క అల్లుడిని తనతోపాటు తీసుకుని ఊరి పొలిమేరల్లో ఉన్న పీఠభూమి ప్రాంతానికి వచ్చాడు. అప్పటి దాకా అక్కడే వేచి ఉన్న అమ్మవారు, పశువుల కాపరితో వచ్చిన ఆ వ్యక్తిని చూసి చిరునవ్వు నవ్వి, ఆపై “బిడ్డా! ఈ ప్రదేశంలో నాకు ఒక ఆలయాన్ని నిర్మించు. నేను ఇక్కడే, సృష్టి ఉన్నంత కాలం నిలిచి ఉంటాను. ఇక్కడకు వచ్చిన భక్తుల్ని ఎల్లవేళలా కనిపెట్టుకుని కాపాడుతూ ఉంటాను” అన్నది.

ఆపై, ఆ వ్యక్తి తన మామగారి వద్దకు వెళ్ళి, అమ్మవారు తనకు చెప్పిన విషయాన్ని ఆయనకు చెప్పాడు. ఆ తరువాత కొద్ది కాలానికే ఆ ప్రదేశంలో (వెర్నవద్ద) మహాలసాదేవికి ఒక చిన్న ఆలయం నిర్మించారు. ఆ తరువాత కొంతకాలానికి ఆ ప్రాంతం, క్రైస్తవ మతస్తులు మరియు వలసవాదులు అయిన పోర్చుగీసువారి ఆధీనంలోకి వచ్చింది. గోవాలోని అనేక హైందవ ఆలయాలను నాశనం చెయ్యటమే తమ ప్రధమ కర్తవ్యంగా పెట్టుకున్న ఆ పోర్చుగీసువారు తమ కార్యక్రమంలో భాగంగా వెర్నాలోని మహాలసాదేవి ఆలయాన్ని కూడా నాశనం చెయ్యటానికి నిర్ణయించు కున్నారు.

క్రీ.శ.1567లో “వెర్న” ప్రాంతంపై పోర్చుగీసు సైన్యాలు దాడిచేసాయి. ఆ దాడిని ముందే పసిగట్టిన మహాలాస ఆలయ పూజారులు, అమ్మవారి విగ్రహాన్ని శత్రువుల చేతిలో పడకుండా రహస్యంగా బైటకు తీసుకువెళ్ళిపోయారు. పోర్చుగీసు సైన్యాలు “మహాలసా” ఆలయాన్ని చాలా వరకు ధ్వంసంచేసి, అక్కడ నుండి వెళ్ళిపోయాయి. ఆ తరువాత, 17వ శతాబ్దంలో “కొత్త మర్దోల్” ప్రాంతంలో

మహాలసాదేవికి కొత్త ఆలయం నిర్మించారు. ఈ కొత్త మర్దోల్ ప్రాంతం, పోర్చుగీసువారి ఆధీనంలో లేదు. కనుక, ఇక్కడ ధైర్యంగా అమ్మవారికి ఆలయాన్ని నిర్మించారు. ప్రస్తుతం, మహాలసాదేవి కొలువై ఉన్న ఈ ఆలయం 17వ శతాబ్దంలో నిర్మించింది అని గుర్తించాలి.

(మహాలాసాదేవి యొక్క మొదటి ఆలయం నిర్మించబడిన “వెర్నా” అనే ప్రాంతం గతంలో వెల్లాం మరియు వెర్న అనే పేర్లతో పిలువబడింది. పాత మర్దోల్ ప్రాంతం నాటి గోవాలోని సాల్‌సెట్ తాలూకాలో ఉన్నది. అయితే, పోర్చుగీసువారి దాడుల కారణంగా ఆ తరువాతకాలంలో వెర్నాకు కొంచెం దూరంలో ఉన్న ‘మర్దోల్’ అనే ప్రాంతంలో మహాలాసాదేవి కొత్త ఆలయం నిర్మించబడింది. అందువలన, వెర్నాను ‘పాతమర్దోల్’ అని, కొత్త ఆలయం కట్టిన ప్రాంతం అయిన మర్దోల్‌ను ‘కొత్త మర్దోల్’ అనే పేరుతో పిలవటం జరిగింది.)

**ఈ క్షేత్ర ప్రత్యేక విశేషములు :**

మర్దోల్ క్షేత్రంలో పూజలందుకుంటున్న మహాలసాదేవి, గర్భగుడిలో నిలుచుని ఉన్న భంగిమలో కనిపిస్తుంది. మర్దోల్ క్షేత్రంలో ప్రధాన దేవతగా పూజలందుకుంటున్న మహాల్సాదేవి నాలుగు హస్తాలను కలిగి ఉంటుంది. ఆ నాలుగు హస్తాలలో 1. త్రిశూలం, 2. ఖడ్గం (ఆమెయొక్క కుడిచేతివైపు విలోచనుడు అనే రాక్షసుడు వంగి ఉన్నట్లుగా కనిపిస్తాడు. వాడియొక్క శిరోజాలు అమ్మవారియొక్క ముందువైపు ఉండే కుడిచేయి గుప్పెట్లో ఉంటాయి.) 3. మానవ శిరస్సు (ఈమె చేతిలో ఉన్న శిరస్సు నుండి కారుతున్న రక్తాన్ని తన నాలుకతో నాకుతున్న ఒక సింహం లేదా పులియొక్క విగ్రహం కూడా ఇక్కడ కనిపిస్తుంది.) 4. నాల్గవచేతిలో అమృతపాత్ర కనిపిస్తాయి. ఒకవిశేషం ఏమంటే, హైందవ మతంలోని ఏ దేవతకీ లేనివిధంగా ఈ మహాల్సాదేవి శరీరంపైన యజ్ఞోపవీతం (జంధ్యము) ఉంటుంది. మహావిష్ణువు పురుషుడు కనుక, స్త్రీ రూపం అయిన మోహినీరూపాన్ని ఎత్తినప్పటికీ ఆమె శరీరంమీద యజ్ఞోపవీతం ఉంటుందని గుర్తించాలి. ఈమె, పాదాల పడుకుని ఉన్న ఒక రాక్షసుడు కనిపిస్తాడు. అమ్మవారి



విగ్రహం వెనకవైపున ఉన్న గోడమీద సంస్కృత భాషలో ‘శ్రీమహాలస’ అన్న అక్షరాలు

కనిపిస్తాయి. ఈ అక్షరాల ప్రక్కన శంఖం, చక్రం, శేషుడియొక్క బొమ్మలు కనిపిస్తాయి. ఈ చిహ్నాలను బట్టి ఈ దేవి, మహావిష్ణువుకి సంబంధించినది అని అర్థంచేసుకోవచ్చు.

ఈ దేవత యొక్క ప్రత్యేకత ఏమంటే, సంవత్సరంలో వివిధ సమయాలలో, వివిధ రకాల అలంకారాలలో (ఒకసారి లక్ష్మి అలంకారంలో, ఇంకొకసారి విష్ణు సంబంధ అవతార అలంకారంలో) కనపడుతుంది. అంతేకాకుండా, ఒక రోజులో ఈమె తొమ్మిది రకాల అలంకారాలలో భక్తులకు దర్శనమిస్తుంది.

ప్రధాన ఆలయ పైభాగం రాగితో మలాం చేయబడింది. మహాలసా ఆలయంలోని లోపలి భాగంలో గోడలమీద మహావిష్ణువుయొక్క పది అవతారాల చిత్రములు మహాద్భుతంగా చిత్రించబడి ఉన్నాయి. ఆలయ ప్రవేశ ద్వారం వెండితో తాపడం చెయ్యబడి ఉంటుంది. ఆలయం బైట ఉండే స్తంభాలపై అద్భుతమైన చిత్రాలు చెక్కబడి ఉంటాయి. ఈ ఆలయ సభా మండపం పూర్తిగా గ్రానైట్ రాయితో నిర్మించబడింది.



ఈ ఆలయం యొక్క ప్రహరీ, లోపలి భాగంలో ఏడు అంతస్తులుగా ఉండే ఒక దీప స్తంభం ఉన్నది. ఈ దీపస్తంభం - పంచలోహాలతో 17వ శతాబ్దంలో నిర్మించబడిందని తెలుస్తున్నది. దాదాపు 40 అడుగుల ఎత్తు ఉండే ఈ దీప స్తంభానికి 21 రింగులు ఉంటాయి. ఈ రింగులలో 150 చిన్న దీపాలు, ప్రతి ఆదివారం సాయంత్ర సమయాలలో వెలిగించబడతాయి. భారతదేశం మొత్తంమీద ఇంత గొప్ప ద్వీప స్తంభం గల ఏకైక హైందవ క్షేత్రం మర్దోల్ మాత్రమే అని చెబుతారు.

మర్దోల్ క్షేత్రంలోని మహాలసా ఆలయ ప్రహరీలోపల శాంతదుర్గ (శాంతేరి), లక్ష్మీనారాయణుడు లాంటి దైవాలు కొలువైన చిన్న చిన్న ఆలయాలు కూడా ఉన్నాయి. ఇక, ఇదే ప్రాంతంలో మహాలసాదేవికి అనుచరులుగా ఉండే పంచ గణదేవతలు అయిన – గ్రామ పురుష, భగవతి, దాధ్, సింహపురుష, మహల్‌పురుష – అనే ఐదుగురు ఉపదేవతలకు కూడా చిన్న ఆలయాలు ఉన్నాయి. ఈ ఉపదేవతలకు పూజలు చేసిన తరువాతే, ప్రధాన దేవతలకుపూజలు చెయ్యటం ఈ క్షేత్రంలో ఒక

విశేషంగా భావించ వచ్చు. ఈ ఆలయం వెనుక భాగంలో ఒక అద్భుతమైన పుష్కరిణి/సరస్సు ఉన్నది. ఈ సరస్సు గట్టున ఒక పెద్ద రావిచెట్టు కూడా ఉన్నది. ఈ ఆలయ నిర్వాహణ ఎంతో అద్భుతంగా ఉంటుంది. ఫలితంగా, ఈ ఆలయం పరిశుభ్రంగా, ప్రశాంతంగా ఉండి, అక్కడకు వచ్చిన భక్తులకు ఎంతో మానసిక ఆనందాన్ని కలిగిస్తుంది.

**పరశురాముడు ఏర్పరచిన ప్రత్యేక ఆరాధన విధానం :**

సాక్షాత్తూ, పరశురాముడు ఈ క్షేత్రానికి వచ్చి మహాలసాదేవిని ఏవిధంగా పూజించాలో వివరించాడు. ప్రతిరోజుని 9 భాగాలుగా చేసి, ఆమెను 9 రూపాలతో పూజించాలని పరశురాముడు నిర్ణయించాడు. అది ఎలాగంటే....

1. ప్రాత:కాలంలో ఆమెను "ఆదిశక్తి"గా పూజించాలి. 2. పూర్వాహ్ణ కాలంలో "మహామాయ"గాను, 3. మధ్యాహ్న సమయంలో "మూలప్రకృతి"గాను, 4. అపరాహ్ణ సమయంలో "ఈశ్వరి"గాను, 5. సాయంకాల సమయంలో "గంధద్వార"గాను, 6. ప్రదోష సమయంలో "దురాదర్ష"గాను, 7. రాత్రి సమయంలో "నిత్యపుష్ట"గాను, 8. మధ్యరాత్రి సమయంలో "కర్షిణి"గాను, 9. అపరాత్రి సమయంలో "శ్రీదేవి"గాను, ఆరాధించాలి.

మహాలసాను "విష్ణువు" యొక్క రూపంగా భావిస్తున్న కారణంగా కొన్నిసార్లు ఈమెకు బాలకృష్ణుడు, రాముడు, విఠోబా, వెంకటేశ్వరుడు లాంటి విష్ణు సంబంధ అలంకారాలు అనగా, పురుష దేవతా సంబంధ అలంకారాలు చేస్తారు. మహాలసాదేవికి ఈ క్షేత్రంలో అనేక రకాల ఆభరణాలు మరియు వస్త్రాలు ధరింపచేస్తారు. ఈమె, లక్ష్మీదేవియొక్క స్వరూపంగా భావించబడిన కారణంగా ఈమెకు కొన్నిసార్లు లక్ష్మీదేవియొక్క అలంకారాలు (వస్త్రధారణ, ఆభరణధారణ) చేయిస్తారు. మహాలసాదేవి, ఇతర దేవతలు మరియు దైవాల కన్నా ఎంతో జాగరూకతతో అనగా, మెళుకువగా ఉంటుందని చెబుతారు. ఏ భక్తులు అయినా సరే, ఈమె ముందుకు వెళ్ళి మనస్ఫూర్తిగా ఈమెను ప్రార్థిస్తే ఆ భక్తుల సమస్యలు ఖచ్చితంగా తొలగిపోతాయని చెబుతారు.

మర్ధోల్ క్షేత్రంలో కొలువైన మహాలసానారాయణి సన్నిధికి వెళ్ళిన భక్తులు ఆమెకు డబ్బు, బంగారం, పండ్లు, పూలు సమర్పిస్తారు. ఒక విశేషం ఏమంటే, "ఎవరు ఎంత పెద్ద కానుక ఇచ్చినప్పటికీ పెద్దగా సంతోషించని ఆ దేవత, కొద్దిగా కుంకుమ సమర్పిస్తే ఎంతో ఆనందించి తన భక్తుడిని లేదా భక్తురాలిని చాలా

శీఘ్రంగా అనుగ్రహిస్తుంది". ఆ కారణంగానే, ఈ క్షేత్రానికి వెళ్ళిన భక్తులు అమ్మవారికి శ్రీమహాలసా అష్టోత్తరంతో కూడిన కుంకుమార్చన చేయిస్తారు. ఈ కుంకుమార్చన చేయించినవారికి మంచి ఫలితాలు చాలా తొందరగా లభిస్తాయని ఈ క్షేత్రానికి వెళ్ళి వచ్చిన భక్తులు తెలియజేస్తున్నారు.

మర్డోల్ క్షేత్రం యొక్క ఇంకొక ప్రత్యేకత ఏమంటే, ఈ క్షేత్రంలో ఒక పెద్ద ఇత్తడి గంట ఉంటుంది. అయితే, ఈ గంట లోపల గంటను మ్రోగించే 'కడ్డీ' ఉండదు. ఎవరైనా భక్తులు వచ్చి అడిగినప్పుడు ఆ కడ్డీని గంట లోపల బిగిస్తారు. ఈ గంట యొక్క మాహాత్యం ఏమంటే, ఎవరైనా భక్తుడు లేదా భక్తురాలు తమను ఎవరైనా వ్యక్తి, తీవ్రంగా బాధిస్తూ ఉంటే ఆ భక్తుడు లేదా భక్తురాలు ఈ క్షేత్రంలోకి వచ్చి మహాలసాదేవిని మనసులో తలచుకుని, ఆపై ఈ గంటను మూడుసార్లు మ్రోగించినట్లయితే, సరిగ్గా మూడు రోజులలోగా వారి శత్రువు చనిపోవటం లేదా మళ్ళీ లేవకుండా చావుదెబ్బ తినటం జరుగుతుందని చెబుతారు. దాదాపు మూడు శతాబ్దాల నుండి ఈ ధర్మగంటకు గొప్ప మాహాత్యం ఉన్నట్లుగా విశ్వసించబడుతున్నది. గతంలో, ఈ ప్రాంతాన్ని పరిపాలించిన పోర్చుగీసువారు కూడా ఈ గంటకు దైవ మాహాత్యం ఉన్నదని ప్రభుత్వ పరంగా అంగీకరించటం జరిగింది.

ఆంధ్రదేశంలోని కాణిపాకంలో కొలువైన గణపతి ఆలయంలో – నిలబడి అబద్ధం చెబితే నాశనం అయిపోతారనే ఒక విశ్వాసం బలంగా ప్రచారంలో ఉన్నది. ఆ కారణంగానే, కాణిపాక గణపతిని 'సాక్షి గణపతి' అనే పేరుతో పిలుస్తారు. అదేవిధంగా, ఈ మర్డోల్ క్షేత్రంలో ఒక ధర్మగంట ఉన్నది. ఈ గంటను కొడుతూ ఎవరైనా వ్యక్తి అబద్ధం చెప్పినట్లయితే ఆ వ్యక్తిని మూడు రోజుల్లోగా దేవీమహాలస శిక్షిస్తుందని చెబుతారు. ఆ కారణంగానే, కొన్ని దశాబ్దాల క్రితం వరకు ఈ క్షేత్రంలో ఈ ధర్మగంట సహాయంతో ఈ ప్రాంత పెద్దలు మరియు న్యాయమూర్తులు, నేరవిచారణ చెయ్యటం జరిగింది. ఆనాటి పోర్చుగీసు ప్రభుత్వం కూడా మహాలసా ఆలయంలోని ధర్మగంట ద్వారా చేసే నేరవిచారణను చట్టబద్ధమైనదిగా అంగీకరించటం ఒక గొప్ప విశేషంగా చెప్పవచ్చు.

ఈ క్షేత్రంలో ప్రతి సంవత్సరమూ ఫిబ్రవరి నెలలో 'జాత్రమహోత్సవ్' (మాఘ మహోత్సవ్) అనే పేరుతో ఒక గొప్ప ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవానికే "మర్డోల్ జాత్ర" (మర్డోల్ తిరునాళ్ళు) అనే ఇంకొక పేరుకూడా ఉన్నది. ఇవేకాకుండా

ఆగష్టు నెలలో ఈ క్షేత్రంలో జయాంక్షిపూజ మరియు కోజిగర్‌పూర్ణిమ అనే ప్రత్యేక ఉత్సవాలు కూడా జరుగుతాయి. ప్రతి సంవత్సరం నవరాత్రి సందర్భాలలో ఈ క్షేత్రంలో విశేషమైన ఉత్సవాలు జరుగుతూ ఉంటాయి.

మర్డోల్ క్షేత్రంలో "ఆదివారం" మహాలసాదేవికి ప్రత్యేకమైన మరియు ఇష్టకరమైన రోజుగా గుర్తించబడింది. అందువలన ఆదివారంనాడు ఈ క్షేత్రానికివెళ్ళటం చాలా శుభకరమని చెబుతారు. ఆ రోజున ఈ క్షేత్రంలో అమ్మవారికి ఇతర పూజలతోపాటుగా 'పల్లకీ సేవ' చేస్తారు. ఈ రోజున ఈమెను ఒక పల్లకీలో ఉంచి, ఆపై ఆ పల్లకీని ఈ క్షేత్రంలో అనేకమంది భక్తుల సమూహాలతో కలిసి మహా వైభవంగా ఊరేగిస్తారు.

ఈ ఆలయం భక్తుల దర్శనంకోసం ఉదయం 6.30 నుండి రాత్రి 8.30 గంటల వరకు తెరచి ఉంటుంది.

2011 నుండి ఈ క్షేత్రంలోకి విదేశీయుల ప్రవేశం నిరాకరించబడింది. వారియొక్క వస్త్రధారణ మరియు ప్రవర్తనావిధానం ఈ క్షేత్ర ఆచారాలకు వ్యతిరేకంగా ఉంటున్నది అన్న కారణంతో విదేశీయులను ఈ ఆలయంలోకి రానియ్యటంలేదు.

మర్డోల్‌లో ఉన్న ప్రధాన ఆలయమే కాక, కర్నాటకలోని కుమట మరియు బాస్‌రూల్ అన్న ప్రదేశాల్లో ఉన్న మహాలస ఆలయాలు కూడా దాదాపు 400 సంవత్సరాల క్రితం నిర్మించబడ్డాయని తెలుస్తున్నది. ఇంకా, కర్నాటకలోని సముద్ర తీర జిల్లా అయిన "ఉడిపి" జిల్లాలో ఉన్న హరిఖండిగే అన్న గ్రామంలోకూడా 'అమ్మమహాలస' అన్న పేరుతో ఒక అద్భుతమైన దేవీమహాలస ఆలయం ఉన్నది. ఈ హరిఖండిగే క్షేత్రం – దట్టమైన అరణ్యాలు మరియు పర్వతాల మధ్యలో అనగా, అత్యంత ఆహ్లాదకరమైన వాతావరణంలో ఏర్పడి ఉన్నది. ఒక విశేషం ఏమంటే, ఈ ఆలయం కేవలం ఒక దశాబ్దం క్రితం నిర్మించబడినప్పటికీ భారతదేశంలోని చాలా ప్రాంతాలలోని హైందవులు ఈ క్షేత్రానికి అధిక సంఖ్యలో వస్తున్నారు. ఈ క్షేత్రంలోని మహాలసదేవి అద్భుతమైన మహత్యాలను తన భక్తులకు ప్రదర్శిస్తున్నట్లుగా చెబుతున్నారు.

గతకొద్ది దశాబ్దాలుగా మహాలసాదేవియొక్క ప్రఖ్యాతి పెరిగిపోతున్న కారణంగా ఇటీవలకాలంలో ముఖ్యంగా, కర్నాటక సముద్రతీరంలో ఉన్న అనేక ప్రదేశాలలో మహాలసాదేవికి కొత్త కొత్త ఆలయాలు నిర్మించబడుతున్నాయి.

"మర్డోల్" మహాలసా క్షేత్రానికి ఎలా చేరాలి...?

**రోడ్డుమార్గంలో :** ఈ క్షేత్రానికి వెళ్ళాలనుకునేవారు, మడ్‌గాం లేదా పాన్‌జిమ్ (పనాజి) నుండి రోడ్డుమార్గంలో ప్రభుత్వరంగ బస్సులలో లేదా ప్రైవేటు వాహనాలలో (టాక్సి/ఆటో) పొండా పట్టణానికి చేరుకోవాలి. పొండా పట్టణంలో ఒక కొత్త బస్‌స్టాండ్, ఒక పాతబస్టాండ్ ఉన్నాయి. ఇక్కడికి బస్సుల్లో వచ్చేవాళ్ళు పాత బస్టాండ్ వద్ద దిగి, మర్డోల్ క్షేత్రం దగ్గరకు ప్రైవేటు వాహనాలలో చేరుకోవచ్చు. పోండా పట్టణానికి 9 కి.మీ. దూరంలో మర్డోల్ గ్రామం ఉన్నది. పోండా-మర్డోల్ రోడ్డుమార్గంలో ప్రయాణించి మర్డోల్‌కి చేరుకోవచ్చు.

పాన్‌జిమ్ (పనాజి), మార్గోవా, పోండా నుండి ఈ క్షేత్రానికి ప్రభుత్వరంగ రవాణా సంస్థ బస్సులు విస్తారంగా నడుస్తున్నాయి. గోవా ప్రభుత్వ రవాణా సంస్థకు చెందిన అనేక బస్సులు ఈ మర్డోల్ గ్రామం మీదుగా వెళతాయి.

**రైలు మార్గంలో :** వాస్కోడాగామా రైల్వేస్టేషన్‌కి 41 కి.మీ. దూరంలోను, మార్గోవా రైల్వేస్టేషన్‌కి 26 కి.మీ. దూరంలోను ఈ మర్డోల్ మహాలసాదేవి క్షేత్రం ఉన్నది. వాస్కోడాగామా రైల్వేస్టేషన్ నుండి రైలులో కార్మాలి రైల్వేస్టేషన్ చేరుకోవాలి. ఈ కార్మాలి రైల్వేస్టేషన్‌కి చాలా దగ్గరలో మర్డోల్ మహాలసాదేవి ఆలయం ఉన్నది.

పాన్‌జిమ్ (పనాజి) నగరానికి అతి దగ్గరలో అనగా 39 కి.మీ. దూరంలో మార్గామ్ రైల్వేస్టేషన్ ఉన్నది. మార్గామ్ (మడ్‌గామ్) రైల్వేష్టేషన్ నుండి దాదాపు 31 కి.మీ. దూరంలో మర్‌డోల్ గ్రామం ఉన్నది.

**విమానం ద్వారా :** గోవా నగరానికి దగ్గరలో ఉన్న ఎయిర్‌పోర్ట్ పేరు 'డాబోలిమ్'. ఒక విశేషం ఏమంటే, గోవారాష్ట్ర రాజధాని నగరం అయిన పనాజి (పాన్‌జిమ్) నుండి 29 కి.మీ. దూరంలోను, మార్గోవాకి 23 కి.మీ. దూరంలో డాబోలిమ్ విమానాశ్రయం ఉన్నది. వాస్కోడాగామా పట్టణానికి దగ్గరలోను ఈ డాబోలిమ్ విమానాశ్రయం ఉన్నది.

భారతదేశంలోని ప్రధాన నగరాలతో సహా ప్రపంచంలోని చాలా దేశాలకు పాన్‌జిమ్ నుండి అనగా డాబోలిమ్ విమానాశ్రయం నుండి చక్కటి విమాన ప్రయాణ సౌకర్యం లభిస్తున్నది. అందువలన, భారతదేశం లోని చెన్నై, హైదరాబాద్, బొంబాయి, బెంగుళూరు లాంటి పెద్ద నగరాల నుండి విమానంలో "డాబోలిమ్" ఎయిర్‌పోర్ట్‌కి చేరుకుని, అక్కడ నుండి ప్రభుత్వ లేదా ప్రైవేటు వాహనాలలో మర్డోల్ మహాలసా క్షేత్రానికి చేరుకోవచ్చు.

**గోవా రాష్ట్రానికి సంబంధించిన కొన్ని అతి ముఖ్యమైన విషయాలు :**

**1. గోవా నగరం :** గోవారాష్ట్రంలో ఉన్న ఒక పెద్ద నగరం పేరు కూడా "గోవా" అని గుర్తించాలి. ముంబయి నుండి దాదాపు 610 కి.మీ. దూరంలో ఉన్న గోవా నగరానికి చక్కటి రోడ్డు మార్గాలు ఉన్నాయి.

**భారతదేశంలోని ప్రముఖ నగరాల నుండి గోవా ఎంత దూరంలో ఉన్నది..?:**

మహారాష్ట్రలోని పూనె నుండి 460 కి.మీ. దూరంలోను, కోల్హాపూర్ నుండి 230 కి.మీ. దూరంలోను, కర్నాటకలోని బెంగుళూరు నుండి 560 కి.మీ. దూరంలోను, మంగుళూరు నుండి 360 కి.మీ. దూరంలోను గోవా నగరం ఉన్నది. దక్షిణ భారత చిట్టచివరి భాగంలో ఉన్న కేరళ రాష్ట్రంలోని కోజికోడ్ నుండి బయలుదేరే రోడ్డుమార్గం – కర్నాటకలోని మంగుళూరు మీదుగా గోవాకి చేరుతుంది. కోజికోడ్ నుండి గోవా దాదాపు 610 కి.మీ. దూరంలో ఉన్నది.

**2. మార్గోవా పట్టణ విశేషాలు :**

**మడ్‌గామ్/మార్గోవా :** మరాఠి భాషలో మడుగామ్ అని, కొంకణి భాషలో మడ్‌గామ్ అని, పోర్చుగీసు ఉచ్చారణలో 'మార్గోవా' అని పిలువబడే పట్టణం "మడ్‌గాం" అని గ్రహించాలి. గోవా రాష్ట్రం యొక్క వ్యాపార మరియు సాంస్కృతిక రాజధానిగా ఈ మడ్‌గాం నగరం గుర్తించబడింది. గోవా రాష్ట్రంలో అత్యధిక సంఖ్యలో జనాభా ఉన్న నగరం ఇదే అని చెబుతారు.

కొన్ని శతాబ్దాల క్రితం, మడ్‌గాం ప్రాంతాన్ని "మఠ్‌గ్రామ్" లేదా "మట్‌గామ్" అనే పేరుతో పిలిచేవాళ్ళు. అందుకు కారణం ఏమంటే, ఈ ప్రదేశంలో 15వ శతాబ్దం చివరి భాగంలో – ద్వైతమతానికి చెందిన వైష్ణవమత "మఠం" స్థాపించబడింది. "మఠం" ఉన్న కారణంగా అప్పట్లో ఈ ప్రాంతానికి "మఠ్‌గ్రాం" (అనగా మఠం ఉన్న గ్రామము అని అర్థం.) అన్న పేరు వచ్చింది. కాలక్రమంలో ఆ పేరే "మడ్‌గాం"గా మారింది.

గోవారాష్ట్ర రాజధాని నగరం అయిన పాన్‌జిమ్ (పనాజి) నుండి 33 కి.మీ. దూరంలోను, వాస్కోడాగామా నుండి 27 కి.మీ. దూరంలోను మార్గోవా పట్టణం ఉన్నది. ఈ పట్టణం 'సాల్‌నది' గట్టున ఉన్నది. భారతదేశంలోని మంగుళూరు, ఉడిపి, కార్వార్, రత్నగిరి, ముంబయి నగరాల నుండి మార్గోవాకి నేరుగా రోడ్డుమార్గం ఉన్నది.

మార్గోవాలో నివసించే ప్రజలలో ఎక్కువ మంది గోవా రాష్ట్ర ముఖ్యభాష అయిన "కొంకణి" మాట్లాడతారు. దాని తరువాత ఇంగ్లీషును ఎక్కువమంది మాట్లాడతారు. కొన్ని దశాబ్దాల క్రితం ఈ ప్రాంతం, పోర్చుగీసువారి ఆధీనంలో ఉన్న కారణంగా, ఈ ప్రాంతంలో పోర్చుగీసు భాష మాట్లాడేవాళ్ళు కూడా ఉన్నారని చెప్పవచ్చు. అయితే, ఈ నగరంలోని అత్యధిక సంఖ్యాకులకు హిందీభాష బాగా అర్థం అవుతుంది. మార్గోవాకి 23 కి.మీ. దూరంలో డాబోలిమ్ విమానాశ్రయం ఉన్నది.

గోవారాష్ట్రంలో అతిపెద్ద రైల్వేస్టేషన్‌గా మడ్‌గాం రైల్వేస్టేషన్ గుర్తించబడింది. కొంకణ్ రైల్వే మరియు నైరుతిరైల్వే మార్గాలు కలిసేచోట ఈ జంక్షన్ రైల్వేస్టేషన్ ఉన్నది. గోవా రాష్ట్రంలోని మడ్‌గామ్ జంక్షన్ రైల్వేస్టేషన్ ఈ రాష్ట్రంలోనే అతి ముఖ్యమైన స్టేషన్‌గా గుర్తించబడింది. భారతదేశంలోని ప్రధాన నగరాలైన న్యూఢిల్లీ, ముంబాయి, కోల్‌కతా, చెన్నై, బెంగుళూరు, మంగుళూరు, పూనె, హైదరాబాద్, విజయవాడ, విశాఖపట్టణం, కోయంబత్తూర్, తిరువనంతపురం (త్రివేంద్రం), సూరత్, పాట్నా, డెహరాడూన్, చండీఘర్, వడోదర నుండి మడ్‌గామ్ పట్టణానికి నేరుగా రైళ్ళు నడుస్తున్నాయి.

**3. పాన్‌జిమ్/పనాజి పట్టణ విశేషాలు :**

గోవా రాష్ట్ర రాజధాని నగరం అయిన పాన్‌జిమ్ నగరం - ముంబయి నుండి 540 కి.మీ. దూరంలోను, బెంగుళూరు నుండి 589 కి.మీ. దూరంలోను, ఢిల్లీ నుండి 1831 కి.మీ.దూరంలోను, కోల్‌కతా నుండి 2118 కి.మీ. దూరంలోను, హైదరాబాద్ నుండి 666 కి.మీ.దూరంలోను, చెన్నై నుండి 920 కి.మీ. దూరంలోను, కోయంబత్తూర్ నుండి 781 కి.మీ. దూరంలోను ఉన్నది. పనాజి పట్టణంలో ఉన్న 'కదంబ' బస్‌స్టేషన్ గోవా రాష్ట్రంలోని అతిపెద్ద బస్సు స్టేషన్‌గా గుర్తించబడుతున్నది.

ఒకవిశేషం ఏమంటే, గోవా రాష్ట్రానికి రాజధాని నగరం అయిన పాన్‌జిమ్‌లో రైల్వేస్టేషన్ లేదు. అందువల్ల, ఈ నగరానికి 39 కి.మీ. దూరంలో ఉన్న మడ్‌గామ్ స్టేషన్‌కి రైలులో చేరుకుని, అక్కడ నుండి రోడ్డుమార్గంలో పాన్‌జిమ్‌కి చాలా సులువుగా మరియు సౌకర్యవంతంగా చేరుకోవచ్చు.

**3. వాస్కోడాగామా పట్టణ విశేషాలు :**

**వాస్కోడాగామా రైల్వేస్టేషన్ :** గోవా రాష్ట్రంలోని వాస్కోడాగామా పట్టణంలో వాస్కోడాగామా రైల్వేస్టేషన్ ఉన్నది. గోవా రాష్ట్రంలోని - గోవా నగరం నుండి 28

కి.మీ. దూరంలో వాస్కోడాగామా పట్టణం ఉన్నది. ఈ రెండు పట్టణాల మధ్య విస్తారంగా రైళ్ళు నడుస్తూ ఉంటాయి.

ఆంధ్రరాష్ట్రంలోని విజయవాడ రైల్వేస్టేషన్ నుండి వాస్కోడాగామా జంక్షన్ రైల్వేస్టేషన్‌కి నేరుగా వెళ్ళే ఎక్స్‌ప్రెస్ ట్రైన్ పేరు “అమరావతి” ఎక్స్‌ప్రెస్. ఇది అత్యంత వేగంగా ప్రయాణించి, దాదాపు 20 గంటల సమయంలో విజయవాడ నుండి వాస్కోడాగామా స్టేషన్‌కి చేరుకుంటుంది. ఈ రెండు స్టేషన్ల మధ్యదూరం దాదాపు 930 కి.మీ. ఉంటుంది.

ఇక, తెలంగాణా రాష్ట్రంలోని హైదరాబాద్ (కాచిగూడ రైల్వేస్టేషన్) నుండి 832 కి.మీ. దూరంలో వాస్కోడాగామా రైల్వేస్టేషన్ ఉన్నది. హైదరాబాద్ నుండి రైలు మార్గంలో వాస్కోడాగామా చేరుకోవటానికి దాదాపు 22 గంటల సమయం పడుతుంది.

వాస్కోడగామా పట్టణం నుండి రైలు మార్గంలో 20 కి.మీ. దూరంలో మడ్‌గామ్ పట్టణం ఉన్నది. ఈ రెండు పట్టణాల మధ్య నేరుగా రైళ్ళు నడుస్తున్నాయి. అయితే, రోడ్డుమార్గంలో వెళ్ళినట్లయితే ఈ రెండు పట్టణాల మధ్య దూరం దాదాపు 32 కి.మీ. ఉండటం విశేషం.



# 23. హైందవ జ్యోతిషశాస్త్రంలో గ్రహాలకు గ్రహణం ఏర్పడటం/అస్తంగత్వం (Combustion) యొక్క విశేషాలు?

**అస్తంగత్వం (Combustion) :** సౌర కుటుంబంలో సంచరించే ప్రధాన ఏడు గ్రహాలలో సూర్యుడిని మినహాయించి, మిగిలిన ఆరు గ్రహాలైన చంద్రుడు, కుజుడు, బుధుడు, గురుడు, శుక్రుడు, శని – అనే గ్రహాలలో ఏ గ్రహం అయినా, రవి గ్రహానికి బాగా దగ్గరలోకి వెళ్ళినప్పుడు ఆ గ్రహం, తాత్కాలికంగా కనపడకుండా పోతుంది. దీనినే ‘అస్తంగత్వం’ అంటారు.

ఏ గ్రహం, రవిగ్రహానికి ఎన్ని డిగ్రీల దూరంలో ఉంటే ఆ గ్రహానికి అస్తంగత్వం/గ్రహణం ఏర్పడుతుందో ఇక్కడ తెలుసుకుందాం.

**1. చంద్రుడు :** రవిగ్రహానికి అటువైపునగాని, ఇటువైపునగాని 12 డిగ్రీల లోపున చంద్రుడు ఉన్నప్పుడు ఈ గ్రహానికి అస్తంగత్వం ఏర్పడుతుంది.

**2. బుధుడు :** రవిగ్రహానికి అటువైపునగాని, ఇటువైపునగాని 14 డిగ్రీల లోపల బుధుడు ఉన్నప్పుడు ఈ గ్రహానికి గ్రహణం/అస్తంగత్వం ఏర్పడుతుంది. ఇక్కడ గమనించాల్సిన ఒక ముఖ్య విషయం ఏమంటే, బుధుడు వక్ర గమనంలో ఉన్నప్పుడు (రెట్రోగ్రేడ్ మోషన్), రవిగ్రహానికి 12 డిగ్రీల దగ్గరలోకి వచ్చినప్పుడు మాత్రమే బుధగ్రహానికి అస్తంగత్వం సంభవిస్తుంది.

**3. శుక్రుడు :** రవిగ్రహానికి అటువైపున లేదా ఇటువైపున 10 డిగ్రీల లోపు శుక్రగ్రహం ఉన్నప్పుడు ఈ గ్రహానికి అస్తంగత్వం ఏర్పడుతుంది. అయితే, శుక్రుడు వక్ర గమనంలో ఉన్నప్పుడు 8 డిగ్రీల దగ్గరలోకి వచ్చినప్పుడు మాత్రమే ఈ గ్రహానికి అస్తంగత్వం ఏర్పడుతుంది.

**4. కుజుడు :** రవిగ్రహానికి అటువైపున లేదా ఇటువైపున 17 డిగ్రీల లోపల ఉన్నప్పుడు కుజుడికి అస్తంగత్వం ఏర్పడుతుంది.

**5. గురువు :** రవి గ్రహానికి అటువైపునగాని, ఇటువైపునగాని 11 డిగ్రీల లోపు గురువు ఉన్నప్పుడు ఈ గ్రహం అస్తంగత్వానికి గురి అవుతుంది. ఈ పరిస్థితినే "గురుమౌఢ్యమి" అని పిలుస్తారు.

**6. శని :** రవిగ్రహానికి అటువైపునగాని, ఇటువైపునగాని 15 డిగ్రీలలోపు శనిగ్రహం వచ్చినప్పుడు ఈ గ్రహానికి అస్తంగత్వం ఏర్పడుతుంది.

**అస్తంగత్వంలో దాగి ఉన్న కొన్ని ముఖ్య మర్మములు :**

1. రవికి బాగా దగ్గర అయినప్పుడు గ్రహానికి అస్తంగత్వం చాలా అధికంగా ఉంటుంది. ఉదాహరణకి – ఒక జాతకంలోని సింహరాశిలో రవిగ్రహం 20 డిగ్రీల మీద ఉన్నదని అనుకుందాం. అదే రాశిలో బుధగ్రహం 10 డిగ్రీల మీద ఉన్నదని భావిద్దాం. ఇక్కడ, బుధగ్రహ అస్తంగత్వానికి కావలసిన కనీసదూరం ఉన్నది. అందువలన, ఇక్కడ అస్తంగత్వం బుధగ్రహానికి ఏర్పడుతుంది. అయితే, సింహరాశిలోని 20 డిగ్రీలమీద రవిగ్రహం ఉండి, అదే రాశిలో బుధగ్రహం 18 డిగ్రీల మీద ఉన్నప్పుడు ఆ రెండు గ్రహాల మధ్య దూరం 2 డిగ్రీలు మాత్రమే ఉంటుంది. అందువల్ల, మొదటి ఉదాహరణలో కన్నా, రెండవ ఉదాహరణలో అనగా 2 డిగ్రీల తేడా ఉన్న స్థితిలో – బుధగ్రహం చాలా బలంగా గ్రహణానికి

లేదా అస్తంగత్వానికి గురి అవుతుందని గుర్తించాలి. కొన్ని పరిస్థితులలో సింహరాశిలో రవి మరియు బుధుడు - 20 డిగ్రీల మీద అనగా ఒకే డిగ్రీమీద ఉన్నప్పుడు బుధగ్రహానికి అత్యంత తీవ్రమైన అస్తంగత్వదోషం ఏర్పడుతుందని గ్రహించాలి.

2. అస్తంగత్వం - జాతకచక్రంలోని ఏ రాశిలో జరిగింది? అనే విషయాన్ని కూడా తప్పనిసరిగా లెక్కలోకి తీసుకోవాలి. అది ఎలాగంటే...

ఉదాహరణకి - బుధుడి ఆధిపత్యం ఉండే మిధునరాశిలో శని మంచి స్థితిలో ఉంటాడు. అలాంటి మిధునరాశిలో రవి మరియు శనిగ్రహాలు ఒకరికి ఒకరు 15 డిగ్రీల దూరంలో ఉన్నట్లయితే శని, అస్తంగత్వం చెందినప్పటికీ శనియొక్క ప్రభావం పూర్తిగా నశించిపోదు. అలా కాకుండా, రవి ఉచ్ఛస్థితిలో ఉండే మేషరాశిలో రవికి శని - 15 డిగ్రీల దూరంలో ఉన్నట్లయితే, శని తీవ్రమైన అస్తంగత్వాన్ని పొందుతాడు. ఇందుకు కారణం - శని, మేషరాశిలో నీచస్థితిలో ఉంటాడు. ఇంకొక విశేషం ఏమంటే...శనికి ఉచ్ఛస్థానం అయిన తులారాశిలో శని, రవికి 15 డిగ్రీల దూరంలో ఉన్నప్పుడు శనికి అస్తంగత్వం చాలా తక్కువ స్థాయిలో ఉంటుంది. కారణం, తులారాశిలో రవి నీచస్థితిలో అనగా బలహీన స్థితిలో ఉంటాడు.

**గురు, శుక్ర మూఢమి :**

సూర్యగ్రహానికి బాగా దగ్గరగా వెళ్ళిన గ్రహం గ్రహణానికి గురి అవుతుంది. దీనిని హైందవ జ్యోతిషశాస్త్రంలో అస్తంగత్వం అని, మౌఢ్యమి అని, మూఢమి అని పిలుస్తారు.

పైన చెప్పిన విధంగా రాహు, కేతువులకు మినహా మిగిలిన ఆరు గ్రహాలకు, గ్రహణం లేదా మూఢమి లేదా అస్తంగత్వం ఏర్పడినప్పటికీ, కేవలము గురువుకి మరియు శుక్రుడికి ఏర్పడే గ్రహణాన్ని లేదా మూఢమిని మాత్రమే భారతదేశంలోని హైందవులు శుభకార్యాల విషయంలో లెక్కలోకి తీసుకోవటం జరుగుతున్నది. కానీ, అనుభవజ్ఞులైన జ్యోతిషశాస్త్ర పండితులు, ఇతర గ్రహాలయొక్క మూఢమి ఫలితాలు జాతకులపై ఎలా ఉంటాయో సంపూర్తిగా లెక్కలోకి తీసుకుంటున్నారు అన్న విషయం గుర్తించాలి. అది ఎలాగంటే...

కుజుడు గ్రహణానికి గురి అవుతున్న సమయంలో 'సామవేద' వర్గానికి చెందిన బ్రాహ్మణులు - నూతన మంత్రదీక్ష ఇవ్వటం లేదా తీసుకోవటం, ఉపనయనాలు చెయ్యటం లాంటివి సంపూర్తిగా నిషేధిస్తారు. ఇక, "ఋగ్వేద" వర్గానికి చెందినవారు,

గురుగ్రహం, గ్రహణానికి గురైనప్పుడు మంత్రదీక్ష, ఉపనయనాలు లాంటి కార్యాలను వాయిదా వేస్తారు. ఇక, "యజుర్వేద" వర్గానికి చెందినవారు శుక్రుడు, గ్రహణానికి గురి అయినప్పుడు ఉపనయన కార్యక్రమాన్ని వాయిదావేస్తారు.

**శుక్రమూఢమి/మౌఢ్యమి :**

జ్యోతిషశాస్త్ర మరియు ఖగోళశాస్త్ర సూత్రాల ప్రకారం చూసినట్లయితే, శుక్రుడు మరియు బుధుడు అనే రెండు గ్రహాలు – భూ కక్ష్యకు అనగా భూమి తిరిగే మార్గానికి లోపలివైపుగా ఉండి మరియు సూర్యుడి చుట్టూ తిరుగుతారు. ఈ రెండు గ్రహాలూ, భూమి కంటే వేగంగా తిరుగుతాయి. ఇలా తిరిగే సమయంలో అప్పుడప్పుడూ ఈ రెండు గ్రహాలూ – భూమిమీద ఉండే మనుషులకు కనపడవు. ఇలా ఈ గ్రహాలు కనపడని పరిస్థితినే "బుధ అస్తంగత్వం", "శుక్ర అస్తంగత్వం" అంటారు. అయితే, ఇలా శుక్రుడు, భూమిమీద ఉండే మానవులకు కనపడని పరిస్థితిని శుక్రమూఢమి లేదా శుక్రమౌఢ్యమి అని పిలుస్తారు. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, శుక్రుడు, రవికి అవతలవైపుకి వెళ్ళినప్పుడు శుక్రుడు కనపడని స్థితిని 'తూర్పు అస్తంగత్వం' అని, శుక్రుడు – భూమికి, సూర్యుడికి మధ్య ఉన్న స్థితిలో, కనపడని స్థితిని "పశ్చిమ అస్తంగత్వం" అని పిలుస్తారు. సూర్యగ్రహానికి ముందువైపున లేదా వెనుక వైపున 10 డిగ్రీల దూరంలోపు శుక్రుడు ఉన్నప్పుడు శుక్రఅస్తంగత్వం అనగా శుక్రుడు కనపడకపోవటం (మూఢమి) ఏర్పడుతుంది.

ఏదిఏమైనా, మూఢమి సమయంలో శుక్రగ్రహం యొక్క కిరణాలు భూమిమీదకి ప్రసరించకుండా సూర్యగోళం అడ్డుగా ఉంటుంది. అందువల్ల, ఆ సమయంలో శుక్రగ్రహం బలహీనంగా ఉంటుంది. (సూర్యగోళం ఒక గ్రహానికి అడ్డుగా వచ్చినప్పుడు, ఆ గ్రహానికి సూర్యుడివల్ల గ్రహణం ఏర్పడుతుందని పైన మనం చెప్పుకున్నాం. మూఢమి అనగా 'చీకటి' అని అర్థం. గ్రహణం వల్లకూడా ఒక గ్రహానికి చీకటి ఏర్పడుతుందని గుర్తించాలి.) శుక్రుడు, మానవులలో సంభోగ సామర్థ్యానికి మరియు వీర్యకణాల ఉత్పత్తికి అధిపతిగా ఉంటాడు. అందువల్ల శుక్రుడు, గ్రహణస్థితిలో అనగా కనపడని స్థితిలో ఉన్నప్పుడు పురుషులలో సంభోగ సామర్థ్యం తగ్గుతుంది. అంతేకాదు, ఆ సమయంలో పురుషుల వీర్యకణాలలో చలనం (మొటిలిటి) తక్కువగా ఉంటుంది మరియు వీర్యకణాలు గర్భోత్పత్తి చెయ్యగల శక్తిని కోల్పోయి ఉంటాయి. అందువలన, ఈ సమయంలో నూతన దంపతులకు శోభన

కార్యక్రమం జరిపించినప్పటికీ, ఆ దంపతులు సంతోషాన్ని పరిపూర్ణంగా పొందలేరు మరియు నూతన వధువుకి గర్భవతి అయ్యే అవకాశాలు దాదాపు ఉండవు. అందువలన, మూఢమి సమయంలో నూతన దంపతులకు "తొలిరాత్రి" కార్యక్రమం చెయ్యరాదు. అలాగే ఆ సమయంలో నూతన దంపతులు "మధుయాత్ర" (హనీమూన్)కి వెళ్ళరాదు.

శుభగ్రహం అయిన శుక్రుడు అస్తంగత్వం చెందినప్పుడు అనగా కనపడకుండా పోయినప్పుడు (మూఢమి సమయంలో), హైందవ మతస్తులు శుభకార్యాలు జరపరు. ఈ సమయంలో శుక్రగ్రహం యొక్క అనుగ్రహం లేదా బలం అవసరమైన ఏ శుభ కార్యాలూ అనగా వివాహాలు, ప్రధానం పెట్టుకోవటం, కొత్తవాహనాలు కొనటం, పెళ్ళి చూపులకు వెళ్ళటం కూడదు. అలాగే, నూతన గృహప్రవేశం లేదా కొత్తగా అద్దె ఇంట్లోకి వెళ్ళటం ఈ సమయంలో నిషేధించబడింది. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, శుక్రమూఢమి జరుగుతున్న సమయంలో – ఏ జాతకులకు అయినా శుక్రమహాదశ లేదా శుక్రఅంతర్దశ జరుగుతున్నట్లయితే ఆ జాతకులు ఆ సమయంలో శుక్ర సంబంధ పరిహారాలను తప్పనిసరిగా చేసుకోవాలి. లేనట్లయితే, ఆ జాతకులకు ఆర్థికపరమైన లేదా శారీరకపరమైన సమస్యలు తల ఎత్తే అవకాశాలు బలంగా ఉంటాయి.

**గురుమూఢమి/గురుఅస్తంగత్వం/గురుగ్రహ గ్రహణం :** రవిగ్రహానికి 11 డిగ్రీల లోపు దూరంలో గురుగ్రహం వచ్చినప్పుడు "గురుమౌఢ్యమి/గురుమూఢమి ఏర్పడుతుంది. ఆ సమయంలో గురుగ్రహంయొక్క ప్రభావం సంపూర్తిగా నశించి పోతుంది. ఫలితంగా, గురువు వల్ల జాతకులకు రావలసిన మంచి ఫలితాలు రాకుండా పోతాయి. కనుక, ఆ సమయంలో ఏవిధమైన శుభకార్యాలు చెయ్యరాదు. అంతేకాకుండా ఆస్తుల అమ్మకాలు మరియు కొనుగోళ్ళు చెయ్యరాదు.

శుక్ర లేదా గురు మూఢమి సమయంలో వివిధ రకాల జన్మనక్షత్ర శాంతులు, హోమాలు, గ్రహశాంతులు లాంటివి నిరభ్యంతరంగా చేసుకోవచ్చు.



# 24. జాతకచక్రంలో గ్రహణం పట్టిన గ్రహాలు జాతకులకు ఎలాంటి ఫలితాలు ఇస్తాయి?

"భూమిమీద నుండి ఆకాశంలోకి చూసే మనిషికి – ఆకాశంలో కనిపించే ఏదైనా ఒక గ్రహం, దాని కన్నా ఇంకా దూరంగా ఉన్న గ్రహం నుండి ప్రసరిస్తున్న కాంతికి అడ్డంగా వచ్చినప్పుడు దూరంగా ఉన్న గ్రహం కనపడదు. ఇలా దూరంగా ఉన్న గ్రహం, తనకి మరియు భూమి మీద ఉన్న మనిషికి మధ్య అడ్డంగా రావటాన్ని ఖగోళశాస్త్ర పరిభాషలో "గ్రహణం" అంటారు. ఇలా కనపడకుండా పోయిన గ్రహాన్ని 'గ్రహణం పట్టిన గ్రహం' అని భావించాలి. అంతరిక్షంలో ఉన్న మన సౌర కుటుంబంలో (సూర్యుడు మరియు ఇతర గ్రహాలతో కూడిన సముదాయం) సూర్యుడు మధ్యస్థానంలో, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే కేంద్రస్థానంలో ఉంటాడు. ఇతర గ్రహాలన్నీ తమ తమ సొంత మార్గాలలో, సూర్యుడి చుట్టూ వృత్తాకారంలో తిరుగుతూ ఉంటాయి. అయితే, భూమి మరియు చంద్రుడు అనే రెండు గ్రహాలు – తమచుట్టూ తాము తిరగటమే కాకుండా, సూర్యుడి చుట్టూ కూడా తిరుగుతాయి.

చంద్రుడు, భూమి చుట్టూ ఒకసారి తిరిగి రావటానికి సుమారుగా 27.5 రోజుల సమయం పడుతుంది. భూమి ఒకసారి గుండ్రంగా తిరగటానికి అనగా తనచుట్టూ తాను తిరగటానికి 24 గంటలు సమయం పడుతుంది. విశేషం ఏమంటే, చంద్రుడు మరియు భూమి – సూర్యుడి చుట్టూ తిరగటానికి దాదాపు ఒక సంవత్సర సమయం తీసుకుంటాయి.

సూర్యుడు మరియు భూమికి మధ్య బుధుడు మరియు శుక్ర గ్రహాలు తమ తమ కక్షలలో (మార్గాలు/ఆర్బిట్) తిరుగుతూ ఉంటాయి. శుక్రుడు, సూర్యుడికి దాదాపు 107 మిలియన్ల కి.మీ. దూరంలో ఉండగా, బుధుడు 58 మిలియన్ల కి.మీ. దూరంలో ఉంటాడు. అందువలన, కొన్ని సందర్భాలలో భూమికి మరియు సూర్యుడికి మధ్యగా చంద్రుడు, బుధుడు మరియు శుక్రుడు అనే గ్రహాలు రావటం జరుగుతుంది.

చంద్రుడు, భూమికి చాలా దగ్గరగా ఉంటాడు. సూర్యుడు, భూమికి చాలా దూరంగా ఉంటాడు. ఎప్పుడైతే భూమికి మరియు సూర్యుడికి మధ్య చంద్రుడు అడ్డు వచ్చినప్పుడు సూర్యుడు, భూమిమీద ఉన్న మనిషికి కనపడదు. ఇలాంటి స్థితినే 'సూర్యగ్రహణం' అని పిలుస్తారు. చంద్రుడియొక్క నీడ, సూర్యుడిని కప్పివేయటంవల్ల

సూర్యగ్రహణం ఏర్పడుతుంది. సూర్యుడు మరియు చంద్రుడు ఒకే సరళరేఖమీద ఉన్నప్పుడు వచ్చే అమావాస్యనాడు సూర్యగ్రహణం ఏర్పడుతుంది.

చంద్రుడికి మరియు సూర్యుడికి మధ్య భూమి అడ్డంగా వచ్చినప్పుడు చంద్రుడు, భూమిమీద ఉన్న మనిషికి కనపడదు. ఈ స్థితినే "చంద్రగ్రహణం" అని పిలుస్తారు.



ఏదిఏమైనా, సూర్య గ్రహణ సమయంలో సూర్యుడియొక్క ప్రకాశం, చంద్రుడి కారణంగా అడ్డగించబడుతుంది. ఫలితంగా, సూర్యుడి యొక్క కిరణాలు తాత్కాలికంగా భూమిమీద పడవు. అదేవిధంగా, చంద్రగ్రహణ సమయంలో భూమి కారణంగా చంద్రుడియొక్క కిరణాలు భూమిమీదకి ప్రసరించవు. ప్రధాన గ్రహాలైన రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని అనే గ్రహాలలో చంద్ర మరియు సూర్యగ్రహణాలు అందరికీ తెలుస్తాయి. కారణం, ఆ రెండు గ్రహాలూ చాలా పెద్ద పరిమాణంలో – భూమిమీద ఉండేవారికి కనిపిస్తాయి కనుక, ఆ రెండు గ్రహాల గ్రహణాల గురించి మరియు ఆ గ్రహణ ఫలితాల గురించి ఆలోచిస్తారు. కానీ, ఇతర ప్రధాన గ్రహాలైన కుజ, బుధ, గురు, శుక్ర, శని – అనే ఐదు గ్రహాలకు కూడా అప్పుడప్పుడూ గ్రహణం ఏర్పడుతూ ఉంటుంది. అయితే, ఆ గ్రహాలు భూమిమీద నుండి చాలా చిన్నవిగా కనపడుతున్న కారణంగా, ఆ గ్రహణాల గురించి చాలామందికి తెలియదు. అయితే, సూర్య మరియు చంద్రగ్రహణాలు మానవులపై ఏవిధంగా ప్రభావాలు చూపిస్తాయో అదేవిధంగా ఇతర ప్రధాన గ్రహాలయొక్క గ్రహణాలు కూడా మానవులపై మంచి లేదా చెడు ప్రభావాలను చాలా అధికంగా చూపిస్తాయని జ్యోతిషశాస్త్రం చాలా స్పష్టంగా తెలియజేస్తున్నది. అది ఎలాగో తెలుసుకుందాం...

బుధుడు మరియు శుక్రగ్రహాలను "Inferior planets" అని పిలుస్తారు. అందుకు కారణం ఏమంటే, అవి, భూమి కన్నా సూర్యుడికి దగ్గరలో ఉంటాయి. అమావాస్య మరియు సూర్యగ్రహణ సమయాలలో చంద్రుడు ఏవిధంగా అయితే భూమికి మరియు సూర్యుడికి అడ్డంగా వస్తాడో, అదేవిధంగా కొన్ని సమయాలలో బుధుడు మరియు

శుక్రుడు అనే గ్రహాలు భూమికి మరియు సూర్యుడికి మధ్య అడ్డంగా వస్తాయి. చంద్రగ్రహణ సమయంలో భూమి కారణంగా చంద్రుడు ఏవిధంగా కనిపించడో, ఆవిధంగా అన్నమాట. కానీ, భూమి – ఏనాటికీ బుధుడికి మరియు సూర్యుడికి మధ్య లేదా శుక్రుడు మరియు సూర్యుడికి మధ్యగా రాదు. అందుకు కారణం ఏమంటే, సూర్యుడు సౌరకుటుంబంలో మధ్యస్థానంలో ఉంటాడు. సూర్యుడి నుండి బుధుడు 58 మిలియన్ల కి.మీ. దూరంలో ఉండగా, శుక్రుడు 107 మిలియన్ల కి.మీ. దూరంలో ఉన్నాడు. కానీ, సూర్యుడికి భూమికి మధ్య ఉన్న దూరం – పై రెండు దూరాల కన్నా ఇంకా ఎక్కువగా అనగా 148 మిలియన్ల కి.మీ. దూరంలో ఉన్నది.

పాశ్చాత్య జ్యోతిష్కులు, కేవలం సూర్య మరియు చంద్ర గ్రహణాలకు మాత్రమే మానవుల జీవితాలపై ప్రభావం చూపించే అవకాశం ఉంటుందని నమ్ముతారు. సూర్యుడితో ఒకేస్థానంలో ఉండే గ్రహాలు మానవులపై చూపించే ప్రభావాల గురించి వాళ్ళు ఏనాడూ ఆలోచించలేదు. కానీ, కొన్నివేల సంవత్సరాల క్రితమే కాళిదాసు, వరాహమిహురుడు, మహాదేవుడు లాంటి మహా జ్యోతిష పండితులు, ఇతర ముఖ్య గ్రహాలు – గ్రహణానికి గురైనప్పుడు జాతకులకు ఎలాంటి ఫలితాలు ఇస్తాయో? స్పష్టంగా తెలుసుకుని, తరువాతి తరాల మానవులకు గ్రంధ రూపంలో అందజేసారు. జాతకచక్రంలో ఏదైనా గ్రహం లేదా గ్రహాలు – గ్రహణానికి గురై ఉన్నప్పుడు అనగా ఒక జాతకుడు పుట్టిన సమయంలో ఏదైనా గ్రహం – గ్రహణానికి గురైన పరిస్థితిలో ఉన్నట్లయితే ఆ జాతకులకు ఆ గ్రహం యొక్క మహాదశలో, అంతర్దశలో మరియు గోచారంలో ఎలాంటి ఫలితాలు వస్తాయో? ప్రాచీన హైందవ జ్యోతిష పండితులు చాలా స్పష్టంగా తెలియజేసారు.

హైందవ జ్యోతిషశాస్త్రాలలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, ఒక పాపగ్రహం లేదా శుభగ్రహం గ్రహణానికి గురైనట్లయితే, ఆ గ్రహంయొక్క బలం బాగా తగ్గిపోతుంది. ముఖ్యంగా, శుభగ్రహం గ్రహణం వల్ల బలహీనపడి నప్పుడు, ఆ శుభగ్రహం జాతకులకు ఇవ్వవలసిన ఫలితాలు దాదాపు 90% వరకు రాకుండా పోతాయి అని తెలుస్తున్నది. మహాదేవుడు అనే ప్రాచీన హైందవ జ్యోతిషశాస్త్రజ్ఞుడు తాను వ్రాసిన "జాతక తత్వం" అనే గ్రంధంలో ఇలా చెప్పాడు. "గ్రహణానికి గురైన గ్రహం, జాతకులకు అనేక రకాల సమస్యలను తప్పనిసరిగా సృష్టిస్తుంది".

ఇక, "సంకేతనిధి" అనే ఇంకొక ప్రాచీన జ్యోతిషశాస్త్ర గ్రంధంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే, "ఏదైనా జాతకచక్రంలోని 5వ స్థానంలో ఉన్న కుజుడు మరియు శుక్రుడు గ్రహణానికి గురైనట్లయితే, ఆ జాతకానికి సంబంధించిన వ్యక్తికి ఒక కన్ను మాత్రమే మిగులుతుంది". ఇక, జాతకచక్రంలోని ద్వాదశాంశ లగ్నం యొక్క అధిపతి, గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకుడు లేదా జాతకురాలు తమ ఆస్థిని కోల్పోయే అవకాశాలు చాలా అధికంగా ఉంటాయి. ఇక, జాతకచక్రంలోని త్రిమశాంశ లగ్నాధిపతి, గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకుడు తన బంధువులతో విపరీతమైన అభిప్రాయ భేదాలతో మరియు తగాదాలతో జీవిస్తాడు.

కేవలం, మహాకవిగానే కాక మహా జ్యోతిషపండితుడిగా పేరుపొందిన కాళిదాసు తన "ఉత్తర కాలామృతం" అనే మహా జ్యోతిషశాస్త్ర గ్రంధంలో చెప్పిన అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, "జాతకచక్రంలోని ఏదైనా భావ అధిపతి, సూర్యుడియొక్క కిరణాల చేత గ్రహణానికి గురైనట్లయితే, ఆ భావం – జాతకుడికి ఇవ్వవలసిన ఫలితాలు నాశనం అయిపోతాయి. ఆ భావంలో శుభ గ్రహం ఉన్నప్పటికీ జాతకుడికి ఆ భావం వల్ల ఎలాంటి ఫలితాలు రావు అని తెలుస్తున్నది. గ్రహణానికి గురైనప్పటికీ శుక్రుడు మరియు శని అనే రెండు గ్రహాలు తమ శక్తిని ఏమాత్రం కోల్పోవని కూడా కాళిదాసు పేర్కొన్నాడు. అంతేకాక, జాతకచక్రంలో కొన్ని గ్రహాలు మంచి బలమైన స్థితిలో ఉన్నప్పటికీ, ఆ గ్రహాలు సూర్యుడిచేత గ్రహణానికి గురైనట్లయితే ఆ గ్రహాలు జాతకులకు తాము ఇవ్వాల్సిన శుభ ఫలితాలను తమయొక్క దశలలో ఇవ్వలేవు. అంతేకాకుండా, తాము ఉన్న భావాల యొక్క ఫలితాలను మరియు తాము వివిధ స్థానాలలో ఉండటం వల్ల జాతకులకువచ్చే శుభయోగాల యొక్క ఫలితాలను ఆ జాతకులకు ఇవ్వలేని బలహీనస్థితిలోకి వెళ్ళిపోతాయి.

సూర్యుడి కారణంగా గ్రహణానికి గురైన గ్రహాలలో శుక్రుడు మరియు శని గ్రహాలు తమకు ఉండే బలంలో సగభాగాన్ని కోల్పోతాయి. ఒకవేళ చంద్రుడు గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకుడు తాను ఉన్న ఉన్నత స్థితి నుండి పడిపోవటం జరుగుతుంది. అతడియొక్క మానసిక స్థితి దెబ్బతినటం జరుగుతుంది. ఆ జాతకుడికి కామెర్లు లేదా పిత్తరస సంబంధ వ్యాధులు శరీరంలో ఏర్పడతాయి. అంతేకాకుండా ఆ జాతకులకు జలగండం కూడా ఉండవచ్చు.

జాతకచక్రంలో కుజుడు గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకులకు ఆ కుజుడు అనేక రకాల ఆందోళనలను కలిగిస్తాడు. ఫలితంగా, ఆ జాతకులు ఒకవిధమైన

వినాశనాత్మక మనోస్థితిని కలిగి ఉంటారు. (అనగా తమకు చికాకు కలిగించిన లేదా తమకు నచ్చని వాటిని నాశనం చెయ్యాలని భావిస్తూ ఉంటారు అన్నమాట.)

జాతకచక్రంలో బుధుడు గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకులకు భూ సంబంధ ఆస్థులు నష్టం కావటం, వీరు ఎల్లప్పుడూ మానసికవేదనతో బాధపడటం జరుగుతుంది. అంతేకాకుండా, ఆ జాతకులకు కామెర్లు, ఇతర అనారోగ్యాలు సంప్రాప్తిస్తాయి. ఆర్థికపరమైన నష్టాలు ఎదురవుతాయి.

జాతకచక్రంలో గురువు గ్రహణానికి గురైనట్లయితే, ఆ జాతకులకు పిసినారితనం తనం మరియు సంతోషం సమాన పరిమాణంలో లభిస్తాయి.

జాతకచక్రంలో శని, గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకుల యొక్క ఖర్చు మరియు ఆదాయం సమానంగా ఉంటాయి. ఆ జాతకులకు సంతోషం ఉండదు. అంతేకాకుండా, ఆ జాతకులు బలహీనమైన శరీరాన్ని కలిగి ఉంటారు. కానీ, వారియొక్క కీర్తి చాలాదూరం వ్యాపిస్తుంది. ఈ జాతకులు అనేక రకాల మానసికపరమైన బాధలతో ఇబ్బంది పడతారు.

గ్రహణ సమయంలో జన్మించిన జాతకులు – సాధారణంగా చాలా తక్కువ ఆయుర్దాయాన్ని కలిగి ఉంటారని, అంతేకాకుండా – జాతకుల యొక్క జాతకచక్రంలోని లగ్నాధిపతి, నవాంశ లగ్నాధిపతి మరియు చంద్రుడు ఉన్న రాశి – గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకులు ఎక్కువకాలం జీవించే అవకాశాలు ఉండవని హైందవ మహర్షులు తెలియజేసారు.

ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, పురుష జాతకుని యొక్క సప్తమస్థానం అతని భార్యను సూచిస్తుంది. అలాంటి సప్తమస్థానానికి అధిపతి అయిన గ్రహం ఆ జాతకుడి జాతకంలో గ్రహణానికి గురైనట్లయితే – అతడి భార్య చాలా తొందరలో (వివాహం అయిన కొద్దికాలంలో) మరణించే అవకాశాలు ఉంటాయి. అదేవిధంగా, ఒక జాతకుడు లేదా జాతకురాలియొక్క పంచమస్థానం వారి సంతానాన్ని సూచిస్తుంది. కనుక, ఒక వ్యక్తి జాతకచక్రంలో (స్త్రీ/పురుషుడు) పంచమస్థానాధిపతి గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకులయొక్క సంతానానికి తీవ్రమైన ప్రాణగండాలు ఉంటాయి. ఒక వ్యక్తియొక్క (స్త్రీ/పురుషుడు) జాతకచక్రంలో లగ్నాధిపతి గ్రహణానికి గురైనట్లయితే ఆ వ్యక్తియొక్క ఆయుర్దాయం తగ్గిపోయే అవకాశాలు ఉంటాయి. ఇంకొక విశేషం ఏమంటే, జాతకచక్రంలోని 6వ స్థానం జాతకునియొక్క శత్రువులను సూచిస్తుంది. కనుక,

ఒకవ్యక్తి యొక్క జాతకచక్రంలో 6వ స్థానాధిపతి (షష్టాధిపతి) గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకుడియొక్క శత్రువులు అందరూ నాశనం అయిపోతారు.

ఇక, జాతకచక్రంలోని భావాలకు అధిపతులు అయిన గ్రహాలకు జాతకచక్రంలో అనగా జాతకుల జన్మసమయంలో గ్రహణం ఏర్పడితే జాతకులకు ఎలాంటి ఫలితాలు వస్తాయో జ్యోతిషశాస్త్రాలలో ఇలా తెలుపబడ్డాయి...

**1. లగ్నాధిపతి :** ఒకవ్యక్తియొక్క జాతకచక్రంలోని 1వ స్థానం యొక్క అధిపతి గ్రహణానికి గురైనట్లయితే ఆ వ్యక్తి (స్త్రీ/పురుషుడు) తన జీవితంలో ఏదో ఒక సమయంలో కారాగారానికి వెళ్ళే అవకాశాలు ఉంటాయి. ఆ జాతకులు తమ జీవితంలో కొన్నిసార్లు మారుపేరుతో రహస్యంగా జీవించాల్సి వస్తుంది. తరచుగా ఎవరో ఒకరికి అంత్యక్రియలు చెయ్యాల్సి వస్తుంది. ఈ జాతకులు వ్యాధులతో, ఆందోళనతో, ఏదో ఒక భయంతో బ్రతకాల్సి వస్తుంది. తమ యొక్క స్థాయిని కోల్పోవాల్సి వస్తుంది. మొత్తంమీద ఈ జాతకులు చాలావరకు దురదృష్టవంతులుగా మారే అవకాశాలు ఉంటాయి.

**2. ద్వితీయ స్థానాధి పతి :** జాతకచక్రంలోని 2వ స్థానానికి అధిపతి అయిన గ్రహం, గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకులు బహిరంగ సభలలో/నలుగురు కలిసి మాట్లాడుకునే సమయంలో బుద్ధి తక్కువగా మాట్లాడేవారుగాను, మోసపూరితమైన వ్యక్తులుగాను, విసిగించే ఉత్తరాలను పొందేవారు మరియు వ్రాసేవారు అవుతారు. అంతేకాకుండా, ఈ జాతకులకు నేత్ర సంబంధమైన సమస్యలు ఉంటాయి. వీళ్ళు విపరీతంగా ధనవ్యయంచేస్తారు. ప్రభుత్వం యొక్క ఆగ్రహానికి గురి అవుతారు.

**3. తృతీయస్థానాధిపతి :** జాతకచక్రంలోని 3వ స్థాన అధిపతి అయిన గ్రహం గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకులకు సోదరులు చనిపోయే అవకాశాలు ఉంటాయి. అంతర్గత శత్రువుల వల్ల లేదా గుప్త శత్రువుల వల్ల జాతకులకు అనేక తీవ్ర సమస్యలు ఏర్పడతాయి. అవమానాలు, వ్యాధులు ఏర్పడతాయి. నలుగురిలో మర్యాద దెబ్బతింటుంది.

**4. చతుర్థాధిపతి :** జాతకచక్రంలోని 4వ స్థానాధిపతి గ్రహానికి గురైనట్లయితే ఆ జాతకులయొక్క తల్లికి తీవ్రమైన సమస్యలు, కష్టాలు ఎదురవుతాయి. ఈ జాతకుల స్నేహితులకు అనారోగ్యాలు ఉంటాయి. ఈ జాతకుల భూములకు మరియు పశు సంపదకు నష్టాలు జరుగుతాయి. ఈ జాతకులకు వాహనాలవల్ల, జలంవల్ల ప్రాణ గండం ఉంటుంది.

**5. పంచమాధిపతి :** జాతకచక్రంలోని 5వ స్థాన అధిపతి అయిన గ్రహం గ్రహణానికి గురైనట్లయితే ఆ జాతకుల సంతానం నష్టం అవుతుంది. ఆ జాతకుల మనస్సు స్థిరంగా ఉండదు. వీరికి ఉదరంలో అనారోగ్య సమస్యలు ఏర్పడతాయి. శరీరం బలహీనంగా ఉంటుంది. అంతేకాకుండా, వీరికి ప్రభుత్వంవల్ల సమస్యలు, చికాకులు ఏర్పడతాయి.

**6. షష్టమాధిపతి :** జాతకచక్రంలోని 6వ స్థానం అధిపతి అయిన గ్రహం, గ్రహణానికి గురైనట్లయితే, జాతకులకు దొంగల వలన నష్టాలు ఉంటాయి. తరచుగా ఓటమి ఎదురవుతుంది. చేసే కార్యాలలో పరాజయాలు సంభవిస్తాయి. ఈ జాతకులు కుటిలమైన పనులుచేస్తారు. హీనమైన వృత్తి, ఉద్యోగాలు చేస్తూ బ్రతుకు గడుపుతారు. అందరిచేత అసహ్యించుకోబడతారు. అపకీర్తికి, శారీరక హింసకు గురి అవుతారు.

**7. సప్తమాధిపతి :** జాతకచక్రంలోని 7వ స్థానాధిపతి గ్రహణానికి గురైనట్లయితే జాతకుడు లేదా జాతకురాలియొక్క అల్లుడికి కష్టనష్టాలు సంభవిస్తాయి. ఈ జాతకులు తమ ఆత్మీయులకు దూరం అయిపోతారు. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, పురుష జాతకులకు స్త్రీలవల్ల, స్త్రీ జాతకులకు పురుషులవల్ల సమస్యలు ఎదురవుతాయి. ఈ జాతకులకు లైంగిక సంబంధమైన వ్యాధులు సంక్రమిస్తాయి. ఒకచోట స్థిరంగా ఉండలేని పరిస్థితి ఈ జాతకులకు ఉంటుంది.

**8. అష్టమాధిపతి :** జాతకచక్రంలోని 8వ స్థానాధిపతికి గ్రహణం సంభవించినట్లయితే, ఈ జాతకులు విపరీతమైన బాధలకు గురి అవుతారు. వీరికి బుద్ధి సరిగా పనిచెయ్యదు. వీరు విపరీతమైన కామ వ్యామోహం గలవారుగా, అసూయాపరులుగా మంచి, చెడు విచక్షణ లేనివారుగా, పేదవారుగా, వృధాగా మాట్లాడేవారుగా, అనారోగ్యవంతులుగా, అవమానాలు పొందేవారుగా, అకాల మృత్యువు పొందేవారుగా ఉంటారు.

**9. నవమాధిపతి :** జాతకచక్రంలోని 9వ స్థానాధిపతి గ్రహణానికి గురైనట్లయితే ఈ జాతకులు దైవ శాపానికి లేదా గురుశాపానికి గురి అవుతారు. చెప్పలేని కారణాల వల్ల బాధలు పడతారు. ఈ జాతకులయొక్క జీవిత భాగస్వామికి (భార్య లేదా భర్త) మరియు సంతానానికి సమస్యలు ఉంటాయి. ఈ జాతకులు చెడుపనులు చేస్తారు. వీరు తరచుగా పేదరికం అనుభవిస్తారు.

**10. దశమాధిపతి :** జాతకచక్రంలోని 10వ స్థానాధిపతి గ్రహణానికి గురైనట్లయితే, ఈ జాతకులు చేసే ప్రయత్నాలు ఫలించవు. గౌరవాన్ని కోల్పోతారు.

వీరు తమ జన్మస్థానాన్ని వదిలిపెట్టి ఎక్కడెక్కడో వివిధ ప్రదేశాలలో జీవిస్తారు. అనగా, వీరికి స్థిరమైన నివాస ప్రదేశం ఉండదు. వీరి జీవితంలో అనేక అశుభ సంఘటనలు జరుగుతాయి. వీరు సమస్యలతో జీవితాన్ని గడుపుతారు.

**11. ఏకాదశాధిపతి :** జాతకచక్రంలోని 11వ స్థానాధిపతి గ్రహణానికి గురైనట్లయితే, ఈ జాతకులకు ఎల్లప్పుడు చెడు వార్తలు వస్తూ ఉంటాయి. ఈ జాతకుల అగ్రజులకు (అన్నలకు) కష్టాలు వస్తాయి. ఈ జాతకుల బిడ్డలు తరచుగా అనారోగ్యానికి గురి అవుతారు. ఈ జాతకులు పిసినారివారుగా, చెవి సంబంధ వ్యాధులతో బాధపడేవారుగా అవుతారు.

**12. ద్వాదశాధిపతి :** జాతకచక్రంలోని 12వ స్థానాధిపతి గ్రహణానికి గురైనట్లయితే, జాతకులకు వివిధ రకాల వ్యాధులు రావటం, అవమానాలు ఎదురు కావటం, సంపద నశించిపోవటం, కారాగారవాసం, బానిస బ్రతుకు (బానిసలాంటి ఉద్యోగజీవితం) లభిస్తాయి.

హైందవ జ్యోతిషశాస్త్ర పండితులు, గ్రహములకు ఏర్పడే గ్రహణం, జాతకులకు చెడు ఫలితాలను ఇస్తుంది అని భావిస్తూ ఉండగా, పాశ్చాత్య జ్యోతిషశాస్త్ర పండితులు ఇందుకు విరుద్ధమైన అభిప్రాయాలను తెలియజేస్తున్నారు. అది ఎలాగంటే...

సూర్యుడి కారణంగా, చంద్రుడు కనపడకుండా పోయినప్పుడు అనగా అస్తంగత్వం చెందినప్పుడు, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఈ రెండు గ్రహాలు ఒకేరాశిలో కలిసి ఉన్నప్పుడు (జాతకుల జనన సమయంలో) – ఆ జాతకులకు విపరీతంగా సంపదలు లభిస్తాయని, ఉన్నతస్థాయి వృత్తి ఉద్యోగాలలో ఈ జాతకులు రాణిస్తారని చెప్పబడింది.

ఇక, ఒకవ్యక్తి జనన కాలంలో కుజగ్రహణం అనగా రవి మరియు కుజ గ్రహాలు ఒకేరాశిలో ఉన్నప్పుడు అనగా, ఆ రెండు గ్రహాల కలయికవల్ల జాతకులకు బలమైన వ్యక్తిత్వం, ఎన్ని కష్టాలను అయినా తట్టుకునే ధైర్యం లభిస్తాయి. అయితే, ఇలాంటి జాతకులు తమను తాము నిగ్రహించుకోవటానికి చాలా అధికస్థాయిలో ఆత్మనిగ్రహాన్ని అభివృద్ధి చేసుకోవలసి ఉంటుంది.

బుధగ్రహణ సమయంలో అనగా రవి మరియు బుధుడు ఒకేరాశిలో బాగా దగ్గరగా ఉన్నప్పుడు జన్మించిన జాతకులకు – అసాధారణమైన మేధస్సు మరియు చాలా ఉన్నత స్థాయిలో నిర్ణయాలు చెయ్యగల సామర్థ్యం లభిస్తాయి. అంతేకాదు, ఈ జాతకులు పరిస్థితులనుబట్టి తమను తాము మార్చుకుంటూ ముందుకు వెళ్ళగలిగే

శక్తిని కలిగి ఉంటారు. ఈ జాతకులకు గొప్పజ్ఞాపకశక్తి, అద్భుతమైన వాక్చాతుర్యం ఉంటాయి. గొప్ప ఉపన్యాసకులుగా, ఇంజనీర్లుగా, ప్రఖ్యాత ఛార్టెడ్ ఎకౌంటెంట్లుగా ఉన్నవారి జాతకాలలో – తప్పనిసరిగా రవి మరియు బుధుడు చాలా దగ్గరగా ఒకే రాశిలో ఉండటం జరిగింది.

గురుగ్రహణ సమయంలో అనగా గురువు మరియు రవి ఒకేస్థానంలో చాలా దగ్గర దగ్గరలో ఉన్నప్పుడు పుట్టే జాతకులు – గొప్ప పండితులుగా, విద్యావంతులుగా ఉంటారు. అదేవిధంగా, ఈ జాతకులు మంచి ఆరోగ్యాన్ని కలిగి ఉంటారు. తమ వృత్తి, ఉద్యోగాలలో చాలా వేగంగా ముందుకు వెళతారు. వీరు ఏది ప్రారంభించినా అది విజయవంతం అవుతుంది.

శుక్రగ్రహణం ఏర్పడినప్పుడు అనగా రవి మరియు శుక్రుడు ఒకేస్థానంలో చాలా దగ్గర దగ్గరలో ఉన్నప్పుడు జన్మించిన జాతకులు – తమ జీవితాలలో అనేక రకాలుగా విజయవంతం అవ్వటమే కాకుండా కీర్తి ప్రతిష్టలు సంపాదించుకుంటారు. ఈ జాతకులు – సంగీతం/కళలు/కవిత్వం లాంటి రంగంలో మంచి సామర్థ్యాన్ని గడిస్తారు. శుక్రుడు గ్రహణానికి గురైన సమయంలో పుట్టిన జాతకులకు స్త్రీల వల్ల చాలా మేలు జరుగుతుంది. వివాహం చాలా ఆనందకరమైన జీవితాన్ని ప్రసాదిస్తుంది.

శనిగ్రహణం ఏర్పడినప్పుడు అనగా – శని మరియు రవి ఒకేస్థానంలో చాలా దగ్గర దగ్గరలో ఉన్నప్పుడు జన్మించే జాతకులు – మహా ధైర్యవంతులుగా, అసాధారణ మేధస్సుగలవారుగా, దేనికీ తల వంచని సాహసవంతులుగా, చెక్కు చెదరని ఆత్మ విశ్వాసం గలవారుగా ఉంటారు. అయితే, శనిగ్రహణ సమయంలో పుట్టిన జాతకుల దాంపత్య జీవితం అంత అనుకూలంగా ఉండదు. తరచుగా అనారోగ్యాలు రావటం, జీవితంలో ముందుకు వెళ్ళటానికి చేసే కార్యాలలో ఆటంకాలు ఎదురుకావటం జరుగుతాయి. అయితే, ఇలా గ్రహణానికి గురైన శనిమీద ఏవైనా శుభగ్రహాల యొక్క లేదా శుభగ్రహం యొక్క వీక్షణం (దృష్టి) పడినట్లయితే, ఆ జాతకులు మహా శక్తిని, అధికారాన్ని పొందుతారు.

జనన సమయంలో గ్రహణానికి గురైన గ్రహాలు, తమ మహాదశ లేదా అంతర్దశ సమయంలో తమయొక్క ప్రభావాలను జాతకులపై చూపిస్తాయని అటు పాశ్చాత్య జ్యోతిష్కులతో పాటుగా, ఇటు ఆధునిక హైందవ జ్యోతిషశాస్త్ర పండితులు కూడా విశ్వసిస్తున్నారు. ఏదిఏమైనా, గ్రహణానికి గురైన గ్రహాలు – జాతకులకు చెడు ఫలితాలతో పాటుగా, కొన్ని మంచి ఫలితాలు కూడా ఇస్తాయని భావించవచ్చు.

ఉదాహరణకి – ఒకవ్యక్తి వృశ్చిక లగ్నంలో జన్మించాడు అనుకుందాం. ఆ లగ్నంలో చంద్రుడు ఉన్నాడు. ఈ జాతకుడు జన్మించిన సమయంలో శుక్రుడు గ్రహణానికి గురి అయ్యాడు. ఈ జాతకుడికి శుక్రదశ జరుగుతున్న సమయంలో ఇతడికి వివాహం జరిగింది. ఈ దశలోనే జాతకుడు సంపదల్ని పొందటం, భోగాలు అనుభవించటం జరిగింది. నిజానికి, ఈ జాతకంలో గ్రహణానికి గురైన శుక్రుడు జాతకుడికి చెడు ఫలితాలు ఇవ్వాలి. కానీ, గ్రహణం వల్ల సహజంగా – శుభగ్రహం అయిన శుక్రుడు పూర్తి అశుభుడుగా మారలేదు. ఫలితంగా, ఆ జాతకుడికి కొంచెం తక్కువ స్థాయిలో మంచి ఫలితాలను ఇచ్చాడు అని గ్రహించాలి.



# 25. భారతదేశ వివిధ ప్రాంతాలలో ఉన్న కొన్ని విచిత్ర ఆలయాల విశేషాలు?

**♦ అద్భుత ఛాంగ్ నారాయణ్ ఆలయ (నేపాల్) విశేషాలు?**

పూర్వకాలం నుండి నేపాల్‌ని సంపూర్ణ హిందూదేశంగా గుర్తించారు. అంతేకాకుండా, ఆ దేశాన్ని పరిపాలించిన అనేక రాజ వంశాలు భారతదేశ మూలాలను కలిగి ఉన్నాయి. అందువలన ప్రాచీనకాలంలో నేపాల్‌ని కూడా భారతదేశంలో భాగంగా పరిగణించటం జరిగింది. అందువలన ఈ దేశంలోని హైందవ ఆలయాలను భారతదేశంలోని ఆలయాలుగా భావించటం జరిగింది.

అనేక శతాబ్దాల క్రితం నేపాల్‌లోని భక్తపూర్ జిల్లాలో ఉన్న ఖాట్మండ్ నగరానికి తూర్పు దిక్కులో దాదాపు 12 కి.మీ. దూరంలో ఉన్న ఛాంగ్ లేదా ధవళగిరి అనే పర్వతంమీద ఒక మహావిష్ణువు ఆలయం నిర్మించబడింది. ఈ మహావిష్ణువునే 'నారాయణుడు' అని పిలుస్తారు. 'ఛాంగ్' అనే పర్వతంమీద నిర్మించిన కారణంగా ఈ ఆలయంలోని నారాయణుడికి 'ఛాంగ్‌నారాయణ్' అనే పేరు వచ్చింది. ఈ ఛాంగ్‌నారాయణ్ ఆలయం, సముద్రమట్టానికి దాదాపు 1600 మీటర్ల ఎత్తులో ఉన్నది.

మొదటిసారిగా, ఛాంగ్‌నారాయణ్ ఆలయం క్రీ.శ.4వ శతాబ్దంలో అనగా క్రీ.శ.323లో ఆనాడు నేపాల్ ప్రాంతాన్ని పరిపాలించిన హరిదత్త అనే లిచ్ఛవి

వంశ రాజు చేత నిర్మించబడింది. 14 శతాబ్దాల తరువాత ఈ అద్భుత ఆలయం అగ్ని ప్రమాదానికి గురి అయ్యింది. ఆ తరువాత మళ్ళీ ఈ ఆలయం పునర్‌నిర్మించబడింది.



'ఛాంగ్' అనే పర్వతం పైన వెలసిన ఈ మహావిష్ణువుయొక్క రూపాన్నే నేపాల్ దేశీయులు "ఛాంగ్ నారాయణ్" అనే పేరుతో పూజిస్తున్నారు. ఇంకొక విశేషం ఏమంటే, ఈ క్షేత్రం చుట్టూ చంపక వృక్షాలతో కూడిన అరణ్యం మరియు ఛాంగ్ అనే పేరుగల ఒక గ్రామం ఉన్నాయి. ఈ పర్వతానికి ప్రక్కగా 'మనహర' అనే నది ప్రవహిస్తున్నది. నేపాల్ చరిత్రలో ఇది అత్యంత ప్రాచీనమైన హైందవ ఆలయంగా పేర్కొనబడింది. చారిత్రక కాలంలో, ఈ క్షేత్రానికి దగ్గరలో ఉన్న భక్తపూర్ అనే ప్రాంతాన్ని పరిపాలిస్తున్న రాజుయొక్క కుమారుడికి, ఆనాటి కాశ్మీర్ రాజు తన కుమార్తె అయిన "చంపక"ను ఇచ్చి వివాహం చేసాడు. ఆమె జ్ఞాపకార్ధగా ఈ పర్వతంమీద "ఛాంగ్ నారాయణ్" ఆలయం నిర్మించబడిందని తెలుస్తున్నది.

**ఛాంగ్‌నారాయణ్ వృత్తాంతము :**

ప్రాచీనకాలంలో ఈ ఛాంగ్ అనే ప్రాంతం చంపక వృక్షాలతో నిండిన ఒక అరణ్యంలాగా ఉండేది. ఆ సమయంలో సుదర్శనుడు అనే ఒక బ్రాహ్మణుడికి ఎవరో ఒక ధనవంతుడు ఒక ఆవుని దానంగా ఇచ్చాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు ఆ ఆవుని మేపే బాధ్యత తన పనివాడైన 'వల్లుడి'కి అప్పగించాడు. అప్పటికే, ఆ బ్రాహ్మణుడి దగ్గర చాలా ఆవులు ఉన్నాయి. ఏదిఏమైనా, ఆ వల్లుడు, ఈ కొత్త ఆవుని కూడా అప్పటికే ఉన్న ఆవుల మందలో కలిపి, ఆపై ప్రతిరోజూ ఆ ఆవుని తన మందలోని ఇతర ఆవులతో సహా ఛాంగ్ ప్రాంతంలో ఉన్న చంపక వనంలో గడ్డి మెయ్యటానికి తీసుకువెళుతూ ఉండేవాడు. ఆ సమయంలో ఒక విశేషం జరగటం మొదలయ్యింది. అది ఏమిటంటే...కొత్తగా మందలో చేరిన ఆవు, ప్రతిరోజూ మధ్యాహ్న సమయంలో అక్కడ ఉన్న ఒక చెట్టు దగ్గరకు వెళ్ళి నిలబడేది. అప్పుడు, ఒక బాలుడు అక్కడకు వచ్చి ఆ ఆవు పాలను త్రాగుతూ ఉండేవాడు. సాయంత్ర సమయంలో వల్లుడు ఆ

ఆవులను తోలుకుని ఇంటికి వెళ్ళేవాడు. ఇంటికి వెళ్ళిన తరువాత అతడు ఆ ఆవులకు పాలు పిండి ఆపై ఆ పాలను తన యజమాని అయిన బ్రాహ్మణుడికి ఇచ్చేవాడు. ఆ ఒక్క ఆవు తప్ప మిగిలిన ఆవులన్నీ బాగా పాలు ఇచ్చేవి. ఆ ఆవు మాత్రం ఒక గిద్దెడు పాలను మాత్రమే ఇస్తూ ఉండేది. ఇందుకు కారణం ఏమిటో?, ఆ పశువుల కాపరికి చాలా రోజులు అర్ధంకాలేదు. ఈ ఆవు ఎందుకు ఇలా చాలా తక్కువ పాలు ఇస్తుందో? తెలుసుకోవాలని ఒకరోజు ఆ వల్లుడు గట్టిగా నిర్ణయించుకున్నాడు.

ఎప్పటిలాగానే ఆ రోజు కూడా తన ఆవుల మందని తీసుకుని అరణ్యంలోకి వెళ్ళాడు. మధ్యాహ్నం కాగానే వల్లుడు, ఒక చెట్టు క్రింద కూర్చుని భోజనం చెయ్యటం ప్రారంభించాడు. అయినప్పటికీ, అతడు ఆ ఆవుని ఒక కంట కనిపెడుతూనే ఉన్నాడు. కొంతసేపు గడిచిన తరువాత ఆ ఆవు అక్కడికి కొంచెం దగ్గరలో ఉన్న ఒక చెట్టువైపు వెళ్ళటం కనిపించింది. అది గమనించిన వల్లుడు భోజనం చెయ్యటం ఆపివేసి, ఆపై ఏమాత్రం శబ్దం లేకుండా దాని వెనకాలే నడుస్తూ ఆ చెట్టు వెనకాలకు వెళ్ళి దాక్కున్నాడు. ఆ ఆవు చెట్టు క్రిందకి చేరి అక్కడ నిలబడింది. ఇంతలో దాదాపు 5 సంవత్సరాల వయస్సు ఉన్న ఒక నల్లటి బాలుడు ఆ చెట్టు నుండి బైటకువచ్చి, ఆపై ఆ ఆవు కాళ్ళ మధ్యకువెళ్ళి, నేలపై వెల్లికిలా పడుకున్నాడు. అప్పుడు ఆ ఆవు పొదుగుల నుండి పాలు, తెరచి ఉన్న ఆ బాలుడి నోట్లో ధారలాగా పడ్డాయి. ఆ బాలుడు ఆ పాలను సంపూర్తిగా త్రాగివేసాడు. చెట్టు చాటు నుండి అది అంతా గమనించిన వల్లుడికి “ఆ నల్లటి బాలుడు ఒక పిశాచి అయి ఉంటాడని, ఆ పిశాచి ఆ చెట్టుని ఆవహించి ఉన్నదని, ఆ పిశాచే ప్రతిరోజూ తన ఆవు దగ్గర పాలను త్రాగుతూ ఉన్నదని” అనిపించింది. దాంతో, వల్లుడు అప్పటికి నిశ్శబ్దంగా ఇవతలికి వచ్చేసి, మర్నాడు ఉదయం ఇంకొక వ్యక్తిని తనకు తోడుగా తెచ్చుకుని అతడి సహాయంతో ఒక గొడ్డలితో ఆ చెట్టును మొదలు దగ్గర నుంచి నరకం ప్రారంభించాడు. వల్లుడు ఆ చెట్టును కొంత భాగం నరికేసరికి ఆ చెట్టు నుండి మానవ రక్తం వరదలాగా బైటకు స్రవించటం ప్రారంభం అయ్యింది. ఆ దృశ్యాన్ని చూసిన వల్లుడు మరియు అతడి స్నేహితుడు విపరీతంగా భయానికి గురయ్యారు. తాము, ఆ చెట్టును నరికి ఘోరపాపం చేసామని అనుకున్నారు. ఆపై, వాళ్ళు భయంతో పెద్దగా అరవటం ప్రారంభించారు. అప్పుడు ఆ చెట్టు నుండి ఒక దివ్యకాంతి బైటకు వచ్చింది. ఆ కాంతిలో చతుర్భుజుడైన మహావిష్ణువు అభయహస్తంతో వాళ్ళముందు ప్రత్యక్షం అయి ఆపై వాళ్ళతో “బిడ్డలారా! భయపడకండి. ఇది అంతా నా లీల. నా అభీష్టం కారణంగానే మీరు ఈ చెట్టుని నరకాలని ప్రయత్నించారు. నిజానికి, నేను చాలా ఏళ్ళ క్రితం

సుదర్శనుడు అనే ఒక బ్రాహ్మణుడి యొక్క తండ్రిని అనుకోకుండా నా బాణంతో సంహరించాను. ఫలితంగా, నాకు బ్రహ్మ హత్యాదోషం తగిలింది. ఆపై నేను ఈ భూమిమీద ఉండలేక నా వాహనం అయిన గరుత్మంతుడిమీద ఎక్కి ఆకాశంలో అనేక ఏళ్ళపాటు తిరిగాను. చివరికి, కొంతకాలం క్రితం గరుత్మంతుడు అనుకోకుండా ఈ ప్రక్కనే ఉన్న ఛాంగ్ పర్వత శిఖరంమీద దిగాడు. ఆపై, నేను ఇక్కడ ఉన్న ఈ చెట్టులోకి ప్రవేశించి, ప్రతిరోజూ బాలుడి రూపంలో బైటకువచ్చి ఇక్కడికి వస్తున్న నీ ఆవు దగ్గర నుండి పాలు త్రాగి నా ఆకలి తీర్చుకుంటున్నాను. ఈ రోజున నీవు గొడ్డలితో ఈ చెట్టుని నరికినప్పుడు, ఈ చెట్టులో దాగి ఉన్న నా యొక్క శిరస్సు ఖండించబడింది. ఫలితంగా, నాకు ఆ బ్రహ్మహత్య వల్ల సంక్రమించిన పాపం సంపూర్తిగా తొలగిపోయింది" అన్నాడు. సరిగ్గా అదే సమయానికి ఆ ఆవుకి యజమాని అయిన సుదర్శనుడు అక్కడకు వచ్చాడు, ఆపై ఆ బ్రాహ్మణుడు, అక్కడ దర్శనమిచ్చిన ఆ మహావిష్ణువుకి నమస్కరించి తన జన్మ ధన్యం చేసుకున్నాడు. ఆ తరువాత అక్కడే మహావిష్ణువుకి ఒక చిన్న ఆలయాన్ని నిర్మించి, ఆ ఆలయంలో విష్ణువు విగ్రహాన్ని ప్రతిష్ఠించి దానికి పూజలు చెయ్యటం ప్రారంభించాడు. ఇప్పటికీ ఈ ఆలయంలో ఆనాటి బ్రాహ్మణ పూజారి సుదర్శనుడి యొక్క వారసులు ఆ ఆలయంలో పూజలు చేస్తూ ఉండగా, ఆనాడు చెట్టు నరికిన పశువుల కాపరి వల్లుడియొక్క వంశస్తులు ఆ ఆలయ పరిరక్షకులుగా ఉన్నారు.

ఛాంగ్‌నారాయణ్ ఆలయం, ఛాంగ్ పర్వతం, ఒక అంచుమీద అనగా కొండపైన ఒక ప్రక్కగా ఉన్న కారణంగా కొండపైకి చేరగానే ఈ ఆలయం కనపడదు. కానీ, దూరంగా ఉండే ఖాట్మండ్ నగరం మరియు కొండ క్రింద ఉండే భక్తపూర్ పట్టణాలు చాలా స్పష్టంగా కనిపిస్తాయి. ఇంకొక విశేషం ఏమంటే, ఖాట్మండ్ నగరం ఈ ఆలయానికి చాలా దగ్గరగా ఉన్న కారణంగా, ఆ నగరంలో ఉన్న త్రిభువన్ విమానాశ్రయం నుండి ఆకాశంలోకి వెళ్ళే మరియు క్రిందకు దిగే విమానాలు కనిపిస్తాయి. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, కొండమీద అనగా ఈ ఆలయ చుట్టు ప్రక్కల అనేక హెూటళ్ళు, దుకాణాలు ఉన్నాయి.

పర్వత పై భాగంలో నిర్మించబడిన ఛాంగ్ నారాయణ్ ఆలయానికి వెళ్ళేమార్గంలో 'నేవార్' కులానికి చెందిన వందలాదిమంది ప్రజలు నివసిస్తున్నారు. ఈ క్షేత్రానికి ప్రతి సంవత్సరం – వేలాదిమంది భక్తులు వస్తున్న కారణంగా ఈ ఆలయ పరిసరాల్లో చిన్న చిన్న హెూటళ్ళు, రెస్టారెంట్లు, రకరకాల కళాకృతులను అమ్మే దుకాణాలు ఏర్పడ్డాయి.

ఈ ఆలయం రెండు అంతస్తులుగా నిర్మించబడి ఉన్నది. ఈ ఆలయం అటు భారతదేశానికి చెందిన శిఖర విధానంలోగాని, ఇటు బౌద్ధమతానికి చెందిన పగోడా విధానంలోగాని ఉండదు. సాంప్రదాయ నేపాలీ వాస్తు నిర్మాణ విధానంలో ఈ ఆలయం నిర్మించబడింది. ఈ క్షేత్రంలో కొలువైన ఛాంగ్‌నారాయణుడికి పది శిరస్సులు, పది చేతులు ఉంటాయి. ఈ ఆలయానికి ఉత్తర దిక్కులో, గరుడవాహనంమీద ఆశీనుడై కనిపించే విష్ణువు యొక్క విగ్రహం కనిపిస్తుంది. ఈ విగ్రహం 9వ శతాబ్దంలో చెక్కబడిందని చెబుతారు. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, నేపాల్ దేశానికి చెందిన పది రూపాయల నోటుమీద ఈ గరుడవాహన విష్ణువుయొక్క బొమ్మ ముద్రించబడి ఉంటుంది.

ఈ ఆలయ పరిసరాలలో శివుడు, అష్టమాత్రికలు, ఛిన్నమస్తా, శ్రీకృష్ణుడు లాంటి దేవతలయొక్క ఆలయాలు కూడా కనిపిస్తాయి. ఈ ఆలయానికి నాలుగు ప్రవేశ మార్గాలు ఉన్నాయి. ప్రతి మార్గం దగ్గర, పెద్ద పరిమాణంలో ఉండే సింహాలు, శరభాలు, ఏనుగులు లాంటి బొమ్మలు కాపలాగా ఉన్నట్లుగా నిలబడి ఉంటాయి. ఈ ఆలయానికి పశ్చిమ ముఖద్వారం "ప్రధాన ద్వారం"గా ఉంటుంది.



ఈ ఆలయం యొక్క పశ్చిమ దిశలో మానవ శిరస్సు కలిగిన గరుత్మంతుడి విగ్రహం కనిపిస్తుంది. ఈ గరుత్మంతుడికి ప్రతి సంవత్సరం నాగపంచమినాడు భక్తులు, మధుర పదార్థాలను నైవేద్యంగా ఇస్తారు. ఇంకొక విశేషం ఏమంటే, ఈ విగ్రహానికి చెమట పడుతుంది. ఈ చెమట మహాపవిత్రమైనది అని, అనేక రకాల అల్సర్లను మరియు కుష్టువ్యాధిని తగ్గిస్తుందని విశ్వసిస్తారు. ఆ కారణంగానే, ఈ క్షేత్రంలో ఉండే పూజారులు, ఈ గరుడ విగ్రహానికి చెమట పట్టినప్పుడు ఆ చెమట చుక్కలను ఒక పాత్రలో సేకరించి ఆపై దానిని, అవసరమైనవారికి ప్రసాదంలాగా ఇస్తారు. రాత్రి సమయంలో ఈ క్షేత్రంలో బస చేసిన వారికి, తెల్లవారే సమయంలో ఈ ఆలయ పైభాగంలో జరుగుతున్నదా? అన్నట్లు కనిపించే సూర్యోదయ దృశ్యం చాలా అద్భుతంగా ఉ ంటుందని చెప్పుకుంటారు.

గర్భగుడిలోని మహావిష్ణువుని, నేపాల్‌లోని హైందవులు "గరుడనాయణ్" అని, బౌద్ధులు "లోకేశ్వర" అనే పేరుతో ఆరాధిస్తున్నారు. ఈ ఆలయ గర్భగుడిలోకి కేవలము పూజారి మాత్రమే వెళ్లగలడు. ఒక విశేషం ఏమంటే, ఈ ఆలయంలోకి నేపాల్ దేశీయులు ఉచితంగా ప్రవేశించవచ్చు. అయితే, భారత, చైనా, శ్రీలంక, మాల్దీవ్స్, బర్మా లాంటి దేశాల ప్రజలు వివిధ రకాల రేట్లలలో ప్రవేశ రుసుం చెల్లించి ఆలయంలోకి ప్రవేశించాల్సి ఉంటుంది.

ఈ క్షేత్రంలో వివిధ సందర్భాలలో అద్భుతమైన ఉత్సవాలు జరుగుతాయి. వాటిలో ముఖ్యమైనది 'ఛాంగ్ నారాయణ్' జాతర అని చెబుతారు. అంతేకాకుండా, ఉగాది నవమి మరియు హరిబోధినీ ఏకాదశి తిధులలో ఈ క్షేత్రంలో ప్రత్యేక పూజలు జరుగుతాయి. ఇవి కాకుండా, ప్రతిరోజూ ఛాంగ్‌నారాయణ్‌కి సాంప్రదాయ ప్రకారం పూజలు జరుగుతాయి.

**ఈ క్షేత్రానికి ఎలా వెళ్ళాలి...?**

ఛాంగ్‌నారాయణ్ ఆలయం ఖాట్మండ్ నగరానికి తూర్పు దిక్కులోను, భక్తపూర్ పట్టణానికి ఉత్తర దిక్కులోను ఉన్నది. ఖాట్మండ్ బస్టాండు నుండి ప్రతి అరగంటకీ ఛాంగ్‌నారాయణ్ క్షేత్రానికి ప్రభుత్వ బస్సులు నడుస్తున్నాయి. అలాగే, భక్తపూర్ నుండి కూడా ఛాంగ్‌నారాయణ్‌కి బస్సు సౌకర్యం ఉన్నది.

భగ్దిగామ్ లేదా భక్తపూర్ అని పిలువబడే పట్టణం, ఖాట్మండ్ నగరానికి తూర్పు దిక్కులో ఉన్నది. ("భక్తపూర్" అనగా భక్తులయొక్క నగరం అని అర్థం.) ఖాట్మండ్ నుంచి దాదాపు 45 నిమిషాలలో – వాహనాలలో భక్తపూర్‌కి చేరుకోవచ్చు. నాగర్‌కోట్ మరియు ధూలిఖేల్ పట్టణాలు భక్తపూర్‌కి చాలా దగ్గరలో ఉన్నాయి. భక్తపూర్ నుండి 6 కి.మీ. దూరంలో ఛాంగ్‌నారాయణ్ ఆలయం ఉన్నది.

పర్వతం పైభాగాన ఉన్న ఛాంగ్‌నారాయణ్ ఆలయానికి రెండు మార్గాల ద్వారా చేరుకోవచ్చు. అది ఎలాగంటే...

1. అరణ్యాల గుండా ఉన్న కాలి మార్గం ద్వారా వెళ్ళటం – ఖాట్మండ్ పట్టణం నుండి రోడ్డు మార్గంలో 20 కి.మీ. ప్రయాణించి, భక్తపూర్ చేరుకోవాలి. ఆ తరువాత అక్కడ నుండి పర్వతంపైకి ఎక్కటం ప్రారంభించాలి. అలా పర్వతంమీద ప్రయాణిస్తున్నప్పుడు చుట్టూ పచ్చటి అరణ్యాలు కనిపిస్తాయి. ఈ మార్గం, అనేక చిన్న చిన్న గ్రామాల గుండా వెళుతుంది. అంతేకాకుండా, చుట్టూ వ్యాపించి ఉండే

పర్వతాలు కూడా కనిపిస్తాయి.

2. చక్కగా నిర్మించిన రోడ్డు మార్గం ద్వారా వెళ్ళటం – కొండ క్రింద ఉన్న భక్తపూర్ నుండి కారు, జీపులాంటి ప్రైవేటు వాహనంలో 30 నిమిషాల్లో ఛాంగ్‌నారాయణ్ ఆలయ పరిసరాల్లోకి చేరుకోవచ్చు. భక్తపూర్ నుండి ఈ క్షేత్రానికి ప్రభుత్వ బస్సులలో కూడా దాదాపు 30 నిమిషాలలో చాలా సులువుగా చేరుకోవచ్చు.

ఈ రెండు మార్గాలలో ఏ మార్గం ద్వారా వెళ్ళినా చక్కటి ప్రకృతి దృశ్యాలు యాత్రికులకు కనులవిందు జరుగుతుందని చెప్పక తప్పదు. అయితే, రోడ్డు మార్గంలో వెళ్ళే వారికి ఖాట్మండ్ లోయ మొత్తం చాలా స్పష్టంగా కనిపిస్తుందని చెప్పవచ్చు. ఇంకొక ముఖ్యవిశేషం ఏమంటే, రోడ్డుమార్గం ద్వారా పైకి వెళ్ళే యాత్రికులకు ఆహారపానీయాల కల్పనకోసం మార్గానికి ప్రక్కన అక్కడక్కడా చిన్న చిన్న హెూటళ్ళు, భోజనశాలలు ఉన్నాయి. పర్వతంపైన ఉన్న ఆలయానికి చేరుకోవటానికి ప్రధాన మార్గం ఈ రోడ్డు అయినప్పటికీ, సాధారణంగా ఈ రోడ్డు మార్గంలో జనసాంద్రత తక్కువగా ఉంటుంది. అందువలన, ఎక్కువమంది యాత్రికులు ఈ రోడ్డు మార్గం ద్వారానే పర్వతంపైకి చేరాలని భావిస్తారు.

**♦ రాత్రి సమయాలలో ఈనాటికీ శ్రీకృష్ణుడు సంచరిస్తున్న “నిధివన్” క్షేత్ర మర్మం?**

భారతదేశంలో అనాదికాలం నుండీ మనిషి మేధస్సుకి అందని ఎన్నో నిగూఢ రహస్యాలు దాగి ఉన్నాయి. ‘సైన్స్’ ఎంతగా అభివృద్ధి చెందినప్పటికీ, ఆ సైన్స్‌కి అందని ఎన్నో అద్భుతాలు ఈనాటికీ భారతదేశంలో జరుగుతున్నాయి. అలాంటి వాటిలో కొన్ని, ‘ప్రకృతి’కి సంబంధించినవి కాగా, మరికొన్ని, ఆ దైవం యొక్క ఆలయాలకు సంబంధించి ఉన్నాయి. అలాంటి వాటిలో అతి ముఖ్యమైనది “నిధివన్” ఆలయం ఒకటి అని చెబుతారు.

ఈ “నిధివన్” అనే ఆలయం పేరు – “నిధి” (నిద్ర) మరియు “వన” (అడవి) అనే రెండు పేర్ల కలయికతో ఏర్పడింది. అనగా, ఈ అరణ్యంలో రాత్రిపూట నిద్ర ఉండదని, ఈ ప్రాంతంలో రాధాకృష్ణులు మరియు గోపికలు – మెళుకువతో ఉండి రాసలీల సాగిస్తారని భావిస్తారు. నిగూఢమైన మర్మాలతో కూడి ఉన్న ఈ “నిధివన్” ఆలయం, బృందావన్ పట్టణ మధ్యభాగంలో ఉన్నది. మొదట, బృందావన్ పట్టణం గురించి తెలుసుకుని ఆ తరువాత అక్కడ ఉన్న “నిధివన్” ఆలయం గురించి చెప్పుకోవలసి ఉంటుంది.

ప్రాచీనకాలంలో ఈ పట్టణాన్ని “బృందవన” అనే పేరుతో పిలిచారు. బృంద అనగా (తులసి) అని, వన అనగా వనం లేదా అరణ్యం అని అర్ధం. కొన్ని వందల సంవత్సరాల క్రితం ఒక దట్టమైన అడవిగా ఉన్న బృందావనం ఈనాడు అనేక వేల ఆలయాలకు నిలయంగా మారింది. ఫలితంగా, రోజుకి కొన్నివేల మంది హైందవ భక్తులు ఈ పట్టణానికి వచ్చి, ఆపై ఇక్కడ ఉన్న అనేక ఆలయాలను దర్శించుకుంటున్నారు. ఒకవిశేషం ఏమంటే, బృందావన్ పట్టణంలోని ప్రతి సందులోనూ ఒక ఆలయం ఉంటుంది. ఈ క్షేత్రంలో దాదాపుగా 5500 ఆలయాలు ఉన్నట్లుగా తెలుస్తున్నది.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బృందావన్ పట్టణాన్ని “వితంతువుల నగరం” అని పిలుస్తారు. అందుకు కారణం ఏమంటే, భర్త చనిపోయిన మరియు విపరీతమైన దైవభక్తిగల స్త్రీలు – ఈ బృందావనానికి వచ్చి స్థిరపడి, ఆపై ప్రతిరోజూ ఈ ప్రాంతంలో ఉన్న వివిధ ఆలయాలను దర్శించుకుంటూ తమ జీవితాలను గడుపుతూ ఉంటారు. ఒక విశేషం ఏమంటే, ప్రస్తుతం ఈ బృందావనంలో దాదాపు 20వేల మంది వితంతు స్త్రీలు ఉన్నట్లుగా తెలుస్తున్నది. వీళ్ళు, భారతదేశంలోని వివిధ ప్రాంతాల నుండి ఇక్కడకు వచ్చి స్థిరపడిన హైందవ స్త్రీలే అని గుర్తించాలి.

**నిధివన్ ఆలయము :**

మహాద్భుతమైన మాహాత్యంగల “నిధివన్” లేదా “నిధివనం” అనే పేరుగల ఒక శ్రీకృష్ణ ఆలయం, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని మధుర జిల్లాలో ఉన్న “బృందావనం” అనే పట్టణంలో ఉన్నది. దట్టంగా వ్యాపించి ఉన్న అరణ్యం మధ్యలో ఈ “నిధివన్” ఆలయం ఉన్నది. ఈ ఆలయం పసుపు రాయితో నిర్మించబడింది. ఈ ఆలయం చుట్టు ప్రక్కల ప్రాంతంలో ‘వనతులసి’ చెట్లు (బాసిల్‌ట్రీస్) విస్తారంగా కనిపిస్తాయి.

దట్టమైన చెట్లతో కూడిన అరణ్యం చుట్టూ నిర్మించబడిన ఒక గోడ ఉంటుంది. ఆ గోడ లోపలవైపు ఉండే అరణ్యం మధ్యభాగంలో ఈ నిధివన్ ఆలయం నిర్మించబడింది. నిధివన్ ఆలయం చుట్టూ కట్టబడిన ప్రహరీగోడ చాలా ఎత్తుగా ఉంటుంది. దాని యొక్క ప్రధాన ప్రవేశ ద్వారం, 20 అడుగుల ఎత్తులో, ఒక రాజకోట ప్రవేశ ద్వారం లాగా చాలా బలిష్టంగా ఉంటుంది.

ఒక విశేషం ఏమంటే, నిధివన్ ఆలయం చుట్టూ ఉన్న ప్రహరీకి ఎత్తైన ప్రవేశ ద్వారం మరియు నిష్క్రమణ ద్వారం ఉంటాయి. ఈ ద్వారం దాటి లోపలికి వెళ్ళిన

తరువాత క్రిందకువెళ్ళే మెట్లు కనిపిస్తాయి. ఆ మెట్ల గుండా క్రిందకు వెళితే, అక్కడ ఒక అరణ్యం కనిపిస్తుంది. ఆ అరణ్యంలో ఎత్తు తక్కువగా ఉండి మరియు ఒకదానిని ఒకటి పెనవేసుకున్న "వనతులసి చెట్లు" కనిపిస్తాయి. ఈ చెట్లే రాత్రి సమయంలో గోపికలుగా మారతాయని చెప్పుకుంటారు. ఈ ప్రాంతంలో ఉన్న తులసి చెట్లకు ఉన్న ఆకులను కోసినవారికి త్వరలోనే తీవ్రమైన ప్రమాదం ఏర్పడుతుందని చెప్పుకుంటారు. అందువలన, ఎవరూ కూడా ఈ తులసి చెట్లకు ఉన్న ఆకులను కోయటానికి ఏమాత్రం సాహించరు.



ఈ క్షేత్రంలో, రాత్రి సమయంలో శ్రీకృష్ణుడు తన ప్రియురాలైన రాధ మరియు ఇతర గోపికలతో కలిసి ఆడి, పాడతాడని చెబుతారు. ఈ కార్యక్రమాన్ని 'రాసలీల' అనే పేరుతో పిలుస్తారు. ఈ క్షేత్రంలో పూజలందుకునే శ్రీకృష్ణుడిని "బాంకే బిహారి" అనే పేరుతో పిలుస్తారు. "బన్-కీ-బిహారి (వన్-కీ-బిహారి)" అనగా వనంలో "విహరించేవాడు" అని అర్థం.

ఈ ఆలయం లోపలి భాగంలో శ్రీకృష్ణుడు మరియు రాధాదేవి యొక్క విగ్రహాలు ఎంతో అద్భుతంగా అలంకరించబడి ఉంటాయి. నిధివన్ ఆలయానికి ఎదురుగా ఒక చిన్న బావి ఉంటుంది. ఈ బావిని "లలితకుండం" అనే పేరుతో పిలుస్తారు. ఒకప్పుడు రాధాదేవికి విపరీతమైన దాహం వేసిందని, ఆపై ఆమె దాహం తీర్చటంకోసం శ్రీకృష్ణుడు తన పిల్లనగ్రోవితో ఆ బావిని త్రవ్వాడని చెప్పుకుంటారు.

ఇతర, ఏ హైందవ ఆలయాలైనా రాత్రి 9 గంటల వరకు తెరచి ఉంటాయి. అదేవిధంగా, ఆ ఆలయాల పరిసరాలలో భక్తులు, రాత్రి సమయంలో నిద్రపోవచ్చు. కానీ, సాయంత్రం 5.30 దాటిన తరువాత ఏ వ్యక్తినీ నిధివన్ ఆలయం లోపల ఉండనివ్వరు. ఈ నిధివన్ ఆలయం లోపలికి రాత్రి సమయంలో మనిషి అనేవాడు

పొరపాటున కూడా ప్రవేశించదు. అంతేకాదు, ఈ ఆలయ ప్రహరీ లోపలి భాగంలోకి కూడా ఎవరూ ప్రవేశించరు.

రాత్రి 7 గంటల సమయంలో శ్రీకృష్ణుడికి సాయంత్ర హారతి ఇచ్చిన తరువాత ఈ ఆలయం యొక్క తలుపులు మరియు ఈ ఆలయం చుట్టూ ఉండే ప్రహరీ గోడకు ఉండే ప్రవేశ ద్వారం తలుపులు మూసివేయబడతాయి. ముఖ్యంగా, ప్రవేశ ద్వారానికి బలమైన తాళాలు వేయబడతాయి. భక్తులుగాని, ఆ ఆలయంలో పనిచేసే పూజారులుగాని రాత్రి 7 గంటలు దాటిన తరువాత ఆ ఆలయం బైటగాని, ఆ ఆలయ ప్రహరీ లోపలగాని పొరపాటున కూడా ఉండరు. అదేవిధంగా పగలంతా ఆ ప్రాంతంలో చిత్ర, విచిత్ర శబ్దాలు చేస్తూ సంచరించే వివిధ రకాల పక్షులు, రాత్రి 7 గంటలు కాగానే నిశ్శబ్దంగా ఈ ప్రాంతం నుండి వెళ్ళిపోతాయి.

ఈ ఆలయానికి ఎదురుగా ఉండే గృహాల వారు, ఆ ఆలయంలో సాయంత్ర హారతి ఇస్తున్నప్పుడు మ్రోగించే గంట శబ్దం వినపడగానే, తమ ఇంటియొక్క కిటికీ తలుపులు మూసివేస్తారు. ఎందుకంటే, ఆ కిటికీ తలుపులు తెరిస్తే – ఎదురుగా



ఉండే నిధివన్ ఆలయం కనిపిస్తుందని లేదా నిధివన్ ఆలయ ప్రహరీ లోపల రాత్రి సమయంలో జరిగే "రాసలీల" కనిపిస్తుందని ఆ గృహాలలోని వ్యక్తులు భయపడతారు. ఎందుకంటే, ఆ రాసలీలను కళ్ళతో చూసే ఏ మనిషీ, ఆపై మామూలుగా బ్రతకటం

సాధ్యంకాదని ఆ ప్రాంత వ్యక్తులకు చాలా స్పష్టంగా తెలుసు. ఇంకొక విశేషం ఏమంటే, ఎప్పుడూ ఈ ప్రదేశంలో విచ్చలవిడిగా తిరిగే కోతులు, రాత్రి కాగానే ఆ చుట్టు ప్రక్కల ఉండే ప్రదేశాలకు వెళ్ళిపోతాయి. అనగా, రాత్రి సమయంలో ఈ ఆలయ ప్రహరీ లోపల ఒక్క కోతికూడా కనపడదు.

గత ఐదువేల సంవత్సరాలుగా ఈ నిధివన్ ఆలయ పరిసరాలలో మహాద్భుతమైన "రాసలీల" జరుగుతున్నదని చెబుతున్నారు. రాత్రి సమయంలో గోలోకం నుండి రాధ మరియు శ్రీకృష్ణుడు ఈ క్షేత్రంలోకి దిగి వస్తారని, సరిగ్గా అదే సమయంలో – అప్పటి వరకు ఆ పరిసరాలలో తులసి చెట్ల రూపంలో ఉన్న గోపికలు, మానవ రూపం ధరించి ఆడి, పాడతారని చెప్పుకుంటారు. రాత్రి 11.30 దాటిన తరువాత కృష్ణుడు మరియు ఇతర గోపికలు రాసలీల చాలిస్తారు. అప్పుడు, శ్రీకృష్ణుడు, రాధతో కలిసి 'రంగమహల్' అనే పేరుగల ఒక ప్రత్యేకమైన గదిలోకి వెళతాడు. అక్కడ తమకోసం సిద్ధంగా ఉంచిన మధుర పదార్థాలను ఆరగించి, ఆపై అక్కడ ఉన్న అలంకరించిన పడకమీద తన ప్రియురాలైన రాధతో కలిసి సుఖిస్తాడని చెప్పుకుంటారు. సూర్యోదయానికి 3 గంటల ముందు శ్రీకృష్ణుడు మరియు రాధ ఆ రంగమహల్ నుండి తమ లోకానికి వెళ్ళిపోతారు. ఇక, అప్పటి వరకు మానవ రూపంలో ఆ ప్రాంతంలో సంచరిస్తున్న గోపికలు, చెట్ల రూపంలోకి మారిపోయి నిలబడతారు.

అనేకమంది భారత మరియు పాశ్చాత్య రచయితలు మరియు పరిశోధకులు ఈ నిధివన్ క్షేత్రం యొక్క మర్మం ఏమిటో? – బైట పెట్టాలని ఈ క్షేత్రానికివెళ్ళి ఎన్నో రోజులపాటు ఇక్కడ ఉండి పరిశోధనలు చేసారు. కానీ, వాళ్ళకి ఈ క్షేత్రానికి సంబంధించిన ఏ చిన్న రహస్యం కూడా తెలియలేదు.

**ఈ క్షేత్రంలోని ప్రత్యేక విశేషాలు :**

నిధివన్ ఆలయం చుట్టు ప్రక్కల ఉండే వన తులసిచెట్లు, చిన్న పరిమాణంలో ఉండటమే కాకుండా ప్రతి రెండు చెట్లూ ఒకదానిని ఒకటి పెనవేసుకుని ఉంటాయి. రాత్రి సమయంలో మానవ రూపాన్ని ధరించే గోపికలు, పగటి సమయంలో ఇలా చెట్ల రూపంలో ఉంటాయని ఈ క్షేత్రంలో చెప్పుకుంటారు. ఇంకొక విశేషం ఏమంటే, ఈ చెట్లపైన పక్షులు వాలవు. అంతేకాదు, ఈ చెట్లపైన ఏవిధమైన పక్షి గూళ్ళు ఉండవు. ఈ చెట్లపైన ఏవిధమైన కీటకాలు కనిపించవు.

ఒక విచిత్రం ఏమంటే, ఈ అరణ్యంలో ఉండే వనతులసి చెట్ల యొక్క కాండాలు గుల్లలాగా ఉంటాయి. అంతేకాకుండా, వీటియొక్క వేళ్ళు పైకి కనిపిస్తూ ఉంటాయి.

ఈ చెట్లకు ఎవరూ నీళ్ళు పొయ్యరు. అయినప్పటికీ, వీటి ఆకులు సంవత్సరం అంతా పచ్చగానే కనిపిస్తాయి. రాత్రి సమయంలో ఈ ప్రాంతంలో శ్రీకృష్ణుడు సంచరిస్తున్న కారణంగానే, ఈ సారంలేని భూమిలో పచ్చని చెట్లు ఉన్నాయని భావిస్తున్నారు.

ఇంకొక విచిత్రం ఏమంటే, సాయంత్రం వరకు చెట్ల రూపంలో ఉన్న గోపికలు, రాత్రి కాగానే, మానవ రూపం ధరించి ఈ ప్రాంతంలో నృత్యాలు చేస్తారు. అయితే, తెల్లవారే సమయానికి ఆ గోపికలు మళ్ళీ చెట్లుగా మారతారు. ఇక్కడ చెప్పుకోలసిన విషయం ఏమంటే, ఈ చెట్లు – తాము ఉన్న ప్రదేశాలను తరచుగా మారుస్తూ ఉంటాయి. అందువలన, ఈ రోజు ఒకచోట ఉన్న చెట్లు, మూడు రోజుల తరువాత, అక్కడికి కొంచెం దూరంలో ఉన్న ఇంకొక ప్రదేశంలో కనిపిస్తాయి. అందుకు కారణం ఏమంటే, చెట్లు, గోపికలుగా మారిన తరువాత, మళ్ళీ ఇంకొక ప్రదేశంలో మళ్ళీ చెట్లుగా మారి నిలబడటం జరుగుతుంది. ఈ విషయం నిజమా? కాదా? – అన్న విషయాన్ని తేల్చుకోవటం కోసం – కొందరు వ్యక్తులు, ఈ ప్రాంతంలోని నాలుగైదు చెట్లను ఎంపికచేసుకుని, వాటికి ఎరుపురంగు దారాలు కట్టారు. అలా కట్టిన మూడు రోజుల తరువాత అక్కడకు వచ్చి చూసిన వారికి, వాళ్ళు దారాలు కట్టివెళ్ళిన చెట్లు, మొదట ఉన్న చోటులో ఉండకుండా, అక్కడికి ఒక 20 చెట్ల అవతల కనిపించాయి. ఈ క్షేత్రంలో చెట్లు తరచుగా ఒకచోట నుండి ఒకచోటకి వెళ్ళిపోతాయి – అని నిరూపించే ఒక ఆధారం ఇక్కడ కనిపిస్తుంది. అది ఏమిటంటే... ఈ ప్రదేశంలో దాదాపు 1600 రంధ్రాలు నేలమీద కనిపిస్తాయి. ఆ రంధ్రాలలో ఉన్న చెట్లు, ఇంకొక ప్రదేశానికి ఏదో ఒక సమయంలో వెళ్ళిపోయినట్లుగా గుర్తిస్తారు.

**రాధాకృష్ణుల శృంగార “రంగమహల్” :**

ఈ ఆలయం లోపల, “రంగమహల్” అనే పేరుగల ఒక ప్రత్యేకమైన గది ఉంటుంది. ఆ గది మధ్యభాగంలో – గంధపు చెక్కతో చేయబడిన మరియు అందంగా అలంకరించిన ఒక మంచం కనిపిస్తుంది. ఈ ఆలయాన్ని మూసివెయ్యటానికి ముందు ఆ ఆలయ పూజారులు ఆ గదిలో అనేక రకాల మధుర పదార్థాలు, పూలు లాంటివి ఉంచుతారు. అంతేకాదు, రాత్రి సమయంలో ఆ గదిలోకి ప్రవేశించే రాధాదేవికి ధరించటంకోసం కొత్త చీరెలు, గాజులు ఉంచుతారు. ఇంకా, ఆ రాధాకృష్ణులు తాంబూలం సేవించటంకోసం తమలపాకులు, సున్నం, వక్కలు ఉంచుతారు. ఇంకొక విశేషం ఏమంటే, తెల్లవారుఝాము సమయంలో – ఆ గదిలో నుండి వెళ్ళ బోతున్న

రాధాకృష్ణులు, దంతధావనం చెయ్యటంకోసం వేప పుల్లలు, పాత్రలలో నీరు ఉంచుతారు. తెల్లవారిన తరువాత ఆలయ పూజారులు ఆలయాన్ని తెరచి, ఆపై రంగమహల్ గదిని తెరచి చూసినప్పుడు ఆ గదిలో – నేలంతా చిందరవందరగా పడిన పూలు, మంచంమీద ఉన్న పాత్రలో సగం తిని వదిలేసిన మధుర పదార్థాలు కనిపిస్తాయి. అంతేకాదు, ఆ మంచంమీద వేసిన పరుపు కూడా కొంచెం నలిగిపోయి కనిపిస్తుంది. అనగా, రాత్రి సమయంలో ఎవరో వ్యక్తులు ఆ పడకమీద పడుకుని లేచినట్లుగా కనిపిస్తుంది అన్నమాట.

**నాస్తికులకు, హేతువాదులకు అంతుచిక్కని నిధివన్ మర్మం :**

దేవుడిని నమ్మేవారు ఎంతమంది ఉంటారో, దేవుడిని నమ్మనివాళ్ళు కూడా ఎంతో కొంతమంది ఉంటారు. అలాంటి వారిని "నాస్తికులు" అని పిలుస్తారు. అయితే, ఆ నాస్తికులు, తమను "హేతువాదులు" అని ముద్దుగా పిలుచుకుంటూ ఉంటారు. భారతదేశంలోని అనేకమంది హేతువాదులు లేదా నాస్తికులు – "దేవుడు లేడు" అని అనేక వేల సంవత్సరాల నుండి వాదిస్తున్నారు. ఆ ప్రయత్నంలో కొందరు నాస్తికులు, తీవ్రమైన క్రూర చర్యలకు కూడా పాల్పడుతున్నారు. చివరగా, ఆ నాస్తికులు అకాల మృత్యువు పాలు కావటము లేదా తీవ్రమైన వ్యాధులకు గురై నీచమైన మరణాన్ని పొందటమో జరుగుతూ ఉంటుంది. ఏదిఏమైనా, భారతదేశానికి చెందిన కొందరు హేతువాదులు, "నిధివన్‌లో దేవుడు లేడు" అని నిరూపించటంకోసం, రాత్రి సమయంలో రహస్యంగా ఆ ఆలయ ప్రహరీ లోపల సంచరించారు. అయితే, వాళ్ళకి దేవుడు కనపడలేదు. కానీ, ఆ దేవుడి ఉనికిని అబద్ధం అని నిరూపించాలని ప్రయత్నించిన వాళ్ళకి కళ్ళుపోవటం, మతిచెడిపోవటం లాంటివి జరిగాయి. కొంతమంది ఆధునిక హేతువాదులు, చాలా రహస్యంగా ఆ ఆలయం లోపల "నిఘా కెమెరాలను" అమర్చి, ఆపై ఉదయంపూట వచ్చి ఆ కెమెరాలను పరిశీలించినప్పుడు – ఆ కెమెరాలకు దట్టమైన చీకటి కనిపించినట్లుగా వాళ్ళకు తెలిసింది. "ఆ దైవం అనుగ్రహం ఉండటం వల్లే మనిషి ఏదైనా చూడగలిగే శక్తిని కలిగి ఉంటాడు. అలాంటి దేవుడిని చూసే శక్తి – మనుషులు ఏర్పాటుచేసే నిఘా కెమెరాలకు ఉంటుందా?".

కొంతకాలం క్రితం, ముగ్గురు యువకులు – రాత్రి సమయంలో నిధివన్ ఆలయ పరిసరాలలో రాధాకృష్ణులు మరియు గోపికలు ఆడుతూ, పాడుతూ చేసే

'రాసలీల' గురించి స్వయంగా తెలుసుకోవాలని భావించి, సాయంత్రం – ఆ ఆలయాన్ని మూసే లోపే ఆలయ ప్రహరీ లోపలికి వెళ్ళిపోయి, ఆపై అక్కడ ఉన్న ఒక రహస్య ప్రదేశంలో దాక్కున్నారు. సమయం కాగానే పూజారులు ఆ ఆలయానికి తాళంవేసి వెళ్ళిపోయారు. సరిగ్గా, రాత్రి 10 గంటల కాగానే ఆ ప్రాంతంలో గజ్జల మోతలు వినపడ్డాయి. ఆపై, శ్రీకృష్ణుడు మరియు రాధ, ఇతర గోపికలు ఆ ప్రదేశంలో ప్రత్యక్షం అయి, ఉల్లాసంగా నృత్యం చెయ్యటం ప్రారంభించారు. వాళ్ళు ఉన్న ప్రదేశం అంతా ఒక ప్రత్యేకమైన ప్రకాశంతో మెరిసిపోతూ కనిపించింది. ఆ అద్భుత దృశ్యాన్ని చూసి ఈ ముగ్గురు యువకులు భయంతో వణికిపోయారు. అరవటానికి వాళ్ళ గొంతు కూడా సహకరించలేదు. ఆ దృశ్యాన్ని చూసిన వాళ్ళు, క్షణాల్లో స్పృహతప్పి నేలపై పడిపోయారు. మర్నాడు ఉదయం ఆ ఆలయ పూజారులు తాళాలుతీసి ఆపై ఆలయం దగ్గరకు వచ్చి చూడగా, అక్కడ స్పృహ తప్పి పడి ఉన్న ఈ ముగ్గురు యువకులూ కనిపించారు. ఆ తరువాత ఆ ఆలయానికి చెందిన కొందరు వ్యక్తులు, ఆ ముగ్గురు యువకులను తీసుకువెళ్ళి ఆసుపత్రిలో చేర్చారు. వాళ్ళలో ఇద్దరు యువకులకు తీవ్రమైన ఉన్మాదం వచ్చింది. మూడవ యువకుడు, నిన్నరాత్రి నిధివన్ ఆలయ పరిసరాలో తనకి "శ్రీకృష్ణుడు – రాధ మరియు ఇతర గోపికలతో సాగించిన రాసలీల తనకి కనిపించిందని" వణుకుతన్న స్వరంతో ఇతరులకు చెప్పాడు. ఒకవిశేషం ఏమంటే, ఆ హాస్పటల్‌లో చేరిన మూడవ రోజే ఆ యువకుడి యొక్క కళ్ళు పోయాయి.

**ఈ క్షేత్రానికి ఎలా చేరాలి....?**

ఈ బృందావనం క్షేత్రానికి చలికాలంలో లేదా వర్షాకాలంలో వెళితే హాయిగా ఉంటుంది. ఎండాకాలంలో అనగా ఏప్రియల్–జూన్ నెలల మధ్యలో ఈ ప్రాంతంలో ఉష్ణోగ్రత తట్టుకోలేనంత తీవ్రంగా ఉంటుంది. ఢిల్లీ నుండి 193 కి.మీ. దూరంలో బృందావనం పట్టణం ఉన్నది.

ఢిల్లీ నగరం నుండి రోడ్డు లేదా రైలు మార్గంలో మధుర పట్టణానికి చేరుకోవచ్చు. ఆగ్రా–ఢిల్లీ నగరాల మధ్యగా వెళ్ళే 44వ నెంబరు జాతీయ రహదారిమీదుగా ప్రయాణించి మధుర పట్టణానికి చేరుకోవచ్చు. మధుర పట్టణం నుండి 14 కి.మీ. దూరంలో ఉన్న బృందావన్ పట్టణానికి బస్సు లేదా కారు లేదా ఆటోలో చేరుకోవచ్చు. ప్రతి 15 నిమిషాలకు ఒకసారి మధుర నుండి బృందావన్‌కి బస్సులు నడుస్తున్నాయి.

ఢిల్లీ–చెన్నై, ఢిల్లీ–ముంబయి నగరాల మధ్య నడిచే ప్రధాన రైల్వేమార్గంలో మధర రైల్వేష్టేషన్ తగులుతుంది. భారతదేశంలోని ఢిల్లీ, ముంబయి, చెన్నై, బెంగుళూర్, కోల్‌కతా, ఆగ్రా లాంటి నగరాల నుండి మధుర పట్టణానికి నేరుగా రైళ్ళలో చేరుకోవచ్చు. మధుర పట్టణం నుండి అనగా మధుర రైల్వేస్టేషన్ నుండి 14 కి.మీ. దూరంలో బృందావన్ పట్టణం ఉన్నది.



# 26. జాతకచక్రంలో 'పీడించబడిన గ్రహములు' జాతకులకు ఎలాంటి ఫలితాలను ఇస్తాయి?

జాతకచక్రంలో ఒక గ్రహం బలహీనంగా ఉండటానికి మరియు పీడించబడటానికి మధ్య చాలా తేడా ఉన్నది. అయితే, ఈ రెండు రకాల గ్రహాలు కూడా జాతకుల యొక్క జీవితాన్ని చెడుగా ప్రభావితం చేస్తాయని చెప్పక తప్పదు. జాతకచక్రంలో ఒక గ్రహం బలహీనంగా (వీక్‌నెస్) ఉన్నప్పుడు, ఆ గ్రహం – తాను ఏ స్థానానికి (హౌస్) అధిపతిగా ఉంటుందో, ఆ స్థానానికి సంబంధించిన ఫలితాన్ని సంపూర్తిగా ఇవ్వలేకపోతుంది. ఉదాహరణకి – ఒక పురుషుడియొక్క జాతకచక్రంలో 'శుక్రుడు' బలహీనంగా ఉన్నట్లయితే ఆ జాతకుడికి ఆలస్యంగా వివాహం కావటం లేదా అసలు వివాహమే లేకుండా పోవటం జరుగుతుంది. ఒకవేళ, జాతకచక్రంలో శుక్రుడు – పీడనకు (Affliction) గురైనట్లయితే ఆ జాతకుడు తన భార్యతో విరోధాన్ని కలిగి ఉండటం లేదా ఆ జాతకుడి భార్యకు తీవ్రమైన అనారోగ్య సమస్యలు ఉండటం జరుగుతుంది. కనుక, ఒక గ్రహం బలహీనంగా ఉండటానికి మరియు పీడన స్థితిలోఉండటానికి మధ్య తేడా ఉంటుందని అర్థం చేసుకోవచ్చు.

**జాతకచక్రంలో ఒక గ్రహం పీడనకి గురి అయినట్లుగా ఎలా గుర్తించాలి?**

1. జాతకచక్రంలోని ఒక గ్రహం – సహజ పాపగ్రహం అయిన శని/కుజుడు/రాహువు/కేతువు – అనే గ్రహంతో లేదా గ్రహాలతో కలిసి ఏదో ఒక స్థానంలో ఉన్నట్లయితే ఆ గ్రహం 'పీడనకు' గురైనట్లుగా గుర్తించాలి. ఇలా, పీడనకు గురైన గ్రహం – తాను సహజంగా ఇవ్వాల్సిన శుభ ఫలితాలను ఆ జాతకులకు

ఇవ్వలేకపోతుంది. ఉదాహరణకి – ఒక జాతకంలో "శుక్రుడు" పాపగ్రహం అయిన శనితో కలిసి ఏదో ఒక స్థానంలో ఉన్నట్లయితే ఆ జాతకులకు వివాహం ఆలస్యం కావటమే కాకుండా, వివాహానంతర జీవితం కూడా తీవ్రమైన అశాంతితో, బాధతో కూడి ఉంటుంది. జాతకచక్రంలో శుక్రుడితో కేతువు కలిసి ఉన్నట్లయితే ఆ శుక్రుడు పీడనకు గురి అవుతాడు. ఫలితంగా – ఆ జాతకులకు వివాహ జీవితం అత్యంత బాధాకరంగా ఉంటుంది. ఇదే పరిస్థితి పురుషుల జాతకంలో ఉన్నట్లయితే ఆ జాతకులు "సంభోగ పరంగా అసమర్థతను (ఇంపోటెన్సి)" కలిగి ఉండే అవకాశాలు చాలా అధికంగా ఉంటాయి.

2. కొన్ని జాతకాలలో శుభగ్రహం, పాపగ్రహంతో కలిసి ఒకే స్థానంలో ఉండకపోయినప్పటికీ, ఒక స్థానంలో ఉన్న శుభగ్రహంపై పాపగ్రహం యొక్క "దృష్టి" పడినట్లయితే ఆ దృష్టిని పొందిన శుభగ్రహం "పీడనకు" గురి అవుతుంది. అదేవిధంగా ఒక శుభగ్రహం మరియు ఒక పాపగ్రహం "పరివర్తన" చెందినట్లయితే శుభగ్రహం పీడనకు గురి అవుతుంది. (పరివర్తన అనగా రెండు గ్రహాలు ఒక జాతకంలో పరస్పరం స్థానాలు మార్చుకుని ఉండటం అని అర్థం.)

3. జాతకచక్రంలోని ఒక గృహం లేదా గ్రహంపై – 6/8/12వ స్థానాధిపతి యొక్క దృష్టి పడినట్లయితే ఆ గృహం (హౌస్) లేదా గ్రహం పీడనకు గురి అవుతాయి. అయితే, లగ్నాన్నిబట్టి కొన్ని జాతకాలలో పాపగ్రహాల యొక్క దృష్టి – విభిన్నమైన ఫలితాలను ఇవ్వటం జరుగుతుంది. ఉదాహరణకి – మాజీ ప్రధాని రాజీవ్‌గాంధీ కుమారుడైన రాహుల్ గాంధీ యొక్క జాతకంలో లగ్నం "తులాలగ్నం" అయ్యింది. ఈ జాతకంలో సప్తమ స్థానంలో అనగా మేషరాశిలో "శని" నీచస్థితిలో ఉన్నాడు. నిజానికి, తుల మరియు వృషభ లగ్నాలకు శని, యోగకారకుడుగా ఉంటాడు. అయితే, ఈ జాతకంలో అనగా తులా లగ్నానికి యోగకారకుడు కావలసిన శని 7వ స్థానంలో అనగా మేషరాశిలో బలహీనమైన స్థితిలోఉండటం వల్ల, అందులోనూ కళత్రాన్ని మరియు దాంపత్య జీవితాన్ని సూచించే 7వ స్థానంలో ఉండటం వల్ల శని – రాహుల్ గాంధీకి వివాహ భాగ్యాన్ని ఇవ్వలేకపోయింది.

4. జాతకచక్రంలోని 6/8/12వ స్థానంలో ఉండే గ్రహం, తప్పనిసరిగా పీడనకి గురి అవుతుంది. అనగా, ఆ స్థానాల్లో ఉండే శుభగ్రహాలు జాతకులకు మంచి ఫలితాలను ఇవ్వలేవు.

5. అస్తంగత్వం (Combustion) చెందిన గ్రహాలు కూడా పీడనకు గురైనట్లుగా గుర్తించాలి.

6. గ్రహ యుద్ధంలో (ప్లానెటరీ వార్) ఓడిపోయిన గ్రహం కూడా కొంతవరకు 'పీడిత' గ్రహంగా ఉంటుంది.

7. జాతకచక్రంలోని ఒక గ్రహం – పాప గ్రహానికి చెందిన నక్షత్రంలో ఉన్నా లేదా 6/8/12 స్థానాధిపతుల యొక్క నక్షత్రంలో ఉన్నా ఆ గ్రహం పీడనకు గురైనట్లుగా గుర్తించాలి.

8. రెండు గ్రహాల మధ్య చిక్కుకుపోయిన 'గ్రహం' (పాపకర్తరి) కూడా పీడించబడిన గ్రహంగా గుర్తించబడుతుంది. ఉదాహరణకి – ఒక జాతకచక్రంలోని 7వ స్థానంలో చంద్రుడు, 6వ స్థానంలో శని, 8వ స్థానంలో కుజుడు ఉన్నట్లయితే ఆ చంద్రుడు "పాపకత్తెర" మధ్యలో ఉన్నట్లుగా గుర్తిస్తారు. అంతేకాదు, ఈ జాతకంలో చంద్రుడు పీడనకు గురైనట్లుగా అర్థంచేసుకోవాలి.

జాతకచక్రంలోని గ్రహాలకు మాత్రమే కాకుండా – స్థానాలకు (హౌసెస్) కూడా ఈ పీడన సూత్రం వర్తిస్తుంది. ఒక జాతకచక్రంలో ఒక గ్రహం పీడనకు గురైనట్లయితే, ఆ జాతకచక్రంలో ఆ గ్రహం ఏ స్థానానికి అధిపతిగా ఉంటుందో?, ఆ స్థానం కూడా పీడనకు గురి అవుతుంది. అనగా, ఆ స్థానం నుండి జాతకులకు రావలసిన శుభ ఫలితాలు రాకుండా పోతాయి. అదేవిధంగా, ఒక గృహానికి అటువైపు మరియు ఇటువైపు పాపగ్రహాలు ఉన్నట్లయితే అనగా ఆ గృహం పాపకర్తరి యోగానికి గురైనట్లయితే ఆ గృహం పీడనకు గురైనట్లుగా గ్రహించాలి.

**జాతకచక్రంలో రాహువు యొక్క 'పీడ' ప్రభావాలు :** రాహువు, ఒక్క కేతుగ్రహంతో తప్ప ఇతర ఏడు గ్రహాలతో (రవి, చంద్ర, శుక్ర, కుజ, బుధ, గురు, శని) జాతకచక్రంలోని ఏదో ఒక స్థానంలో కలిసి ఉండే అవకాశం ఉంటుంది. అనగా, రాహువు – ఏడు గ్రహాలను పీడించే అవకాశాలు ఉంటాయి. రాహువు – ఒక గ్రహంతో కలిసి ఏదో ఒక స్థానంలో ఉన్నా లేదా ఇతర స్థానాలలో ఉన్న గ్రహంపై రాహువు యొక్క దృష్టి పడ్డా ఆ గ్రహం, రాహువుచేత పీడించబడినట్లుగా గుర్తిస్తారు. అయితే, రాహువుచేత పీడించబడుతున్న గ్రహం, జాతకచక్రంలో బలమైన స్థితిలో ఉన్నట్లయితే రాహువు పీడనవల్ల ఆ గ్రహానికి జరిగే హాని చాలా తక్కువగా ఉంటుంది. అలా కాకుండా, జాతకచక్రంలో బలహీనంగా ఉన్న గ్రహం – రాహువు

చేత పీడించబడినట్లయితే, ఆ గ్రహం – తీవ్రమైన చెడు ఫలితాలను ఆ జాతకులకు ఇస్తుంది అని గ్రహించాలి. ఏదిఏమైనా, రాహువు చేత ఏ గ్రహం (అది పాప గ్రహం కావొచ్చు, శుభగ్రహం కావొచ్చు) పీడించబడినా ఆ గ్రహం ఆ జాతకంలో తాను ఇవ్వాల్సిన శుభ ఫలితాలను ఇవ్వలేకపోగా, చెడు ఫలితాలను మాత్రం ఖచ్చితంగా ఇస్తుంది.

**జాతకచక్రంలో రవి పీడనకు గురైనట్లయితే :** జాతకుల చిన్నతనంలో అనేక దురదృష్టకర సంఘటనలు జరుగుతాయి. ఈ జాతకులు తమ స్వయంకృషితో ఒక ఉన్నతస్థాయికి చేరుకున్న తరువాత దురదృష్టం తన ప్రభావాలను చూపిస్తుంది. ఫలితంగా, జాతకులు అప్పటిదాకా తాము సంపాదించుకున్న కీర్తిని, స్థాయిని, సంపదను హఠాత్తుగా పోగొట్టుకుంటారు. జాతకులకు ఎన్నాళ్ళకీ తగ్గని దీర్ఘకాల వ్యాధులు ఉ ంటాయి. వాటిని తగ్గించుకోవటం కోసం జాతకులు విపరీతంగా ధనవ్యయం చెయ్యాల్సి ఉంటుంది.

**జాతకచక్రంలో పీడిత చంద్రుడు (Afflicted-moon) :**

రవికి ఆరు డిగ్రీల లోపు దూరంలో చంద్రుడు ఉన్నప్పుడు దహనం/అస్తంగత్వం/గ్రహణానికి గురి అవుతాడు. అనగా, చంద్రుడు పీడనకు గురి అవుతాడు. ఒక విచిత్రం ఏమంటే, రవి, చంద్రులు మిత్రులే అయినప్పటికీ రవికి మరీ దగ్గరగా వెళ్ళిన చంద్రుడు 'అస్తంగత్వం' చెందుతాడు. పాపగ్రహాలతో ఒకేరాశిలో ఉన్నా, పాప గ్రహాలయొక్క దృష్టిని పొందినా తనకు నీచ స్థానం అయినా వృశ్చికంలో మూడు డిగ్రీల వద్ద ఉన్నా, పాప స్థానంలో ఉన్నా – చంద్రుడు పీడనకు గురి అయినట్లుగా గుర్తిస్తారు.

అస్తంగత్వం (సూర్యుడికి బాగా దగ్గరగా వెళ్ళిన స్థితి/గ్రహణం) చెందిన చంద్రుడు, శని/కుజ/రవి/రాహు/కేతు – అనే గ్రహంతో కలిసి ఒకే స్థానంలో ఉన్నా లేదా ఈ గ్రహాలలో ఏదో ఒక గ్రహంయొక్క దృష్టిని పొందినా లేదా చంద్రుడు, జాతకచక్రంలో అశుభస్థానాలుగా చెప్పబడిన 3,6,8,12 – అనే ఏదో ఒక స్థానంలో ఉన్నా ఆ చంద్రుడు పీడిత చంద్రుడిగా గుర్తించబడతాడు. పీడిత చంద్రుడు బలహీనుడిగాను, జాతకులకు అశుభ ఫలితాలు ఇచ్చే పాపగ్రహంగాను ఉంటాడు. శని/రాహు/కేతు – గ్రహంతో చంద్రుడు ఒకేరాశిలో ఉన్నట్లయితే ఆ చంద్రుడు పీడనకు గురి అయినట్లుగా గుర్తించాలి.

కొన్నేళ్ళక్రితం ఢిల్లీలోని ఒక సంపన్న కుటుంబానికి చెందిన ఒక అమ్మాయి తన కన్నా తక్కువ కులానికి చెందిన మరియు తక్కువ ఆర్థికస్థాయికి చెందిన ఒక యువకుడిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నది. ఆమె తల్లికి తన కూతురు చేసే పని నచ్చలేదు. అందువల్ల, ఆమె – కొందరు కిరాయి హంతకులను ఉపయోగించి ఆ అమ్మాయిని అత్యంత దారుణంగా హత్య చేయించింది. ఢిల్లీకి చెందిన ఒక జ్యోతిషశాస్త్ర పరిశోధకుడు అనుకోకుండా ఆ అమ్మాయి యొక్క జాతకాన్ని పరిశీలించటం జరిగింది. ఆ జాతకంలో – చంద్రుడు చాలా తీవ్రంగా పీడనకు గురి అయి ఉన్నాడు. సహజ పాపగ్రహాలైన శని, కుజుడు, రవి మరియు కేతు గ్రహాల మధ్యలో చంద్రగ్రహం చిక్కుకుపోయింది. అనగా, "పాపకర్తరి" (కత్తెర) యోగానికి గురి అయ్యింది. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏమంటే, చంద్రుడు, జాతకులయొక్క తల్లికి కారకుడిగా (సిగ్నిఫికేటర్) ఉంటాడు. ఇక్కడ, ఈ అమ్మాయిని చంపించింది సాక్షాత్తు ఆమె తల్లే. అంతేకాకుండా, ఆమె తల్లిని సూచించే చంద్రుడు ఆమె జాతకంలో పాపగ్రహంగా ఉన్నాడు.

**జాతకచక్రంలో కుజుడు పీడనకు గురైనట్లయితే :** ఈ జాతకులు, యవ్వనంలోకి ప్రవేశించే సమయానికి వీరిలో సామర్ధ్యం విజృంభిస్తుంది. ఫలితంగా, వీరు తమకు ఎదురైన ఆటంకాలను/ప్రత్యర్థులను నిర్దాక్షిణ్యంగా తొక్కిపారేసి ఆపై, మంచి స్థాయిని, కీర్తిని, సంపదలను సంపాదించు కుంటారు. ఇంకొక విచిత్రం ఏమంటే, ఈ జాతకులకు విజయం వస్తుంది అనుకుని సంతోషపడుతున్న సమయంలో – చివరి నిమిషంలో పరాజయాలు వచ్చే అవకాశాలు ఉంటాయి. ఏక కాలంలో రెండు, మూడు అశుభాలు కలిసి జాతకులపై దాడిచేస్తాయి.

**జాతకచక్రంలో బుధుడు పీడనకు గురైనట్లయితే :** ఈ జాతకులయొక్క కూతురు లేదా చెల్లెలు యొక్క వివాహ సమయంలో ఈ జాతకులమీద దురదృష్టం దాడిచేస్తుంది. కొన్నిసార్లు ఈ జాతకులకు మగబిడ్డ పుట్టిన సమయంలో వీరికి చెడు సంఘటనలు ఎదురవుతాయి. కొన్ని జాతకాలలో బుధుడు వక్రించి ఉన్నప్పుడు, వీళ్ళు పుట్టుకతో కోటీశ్వరులు అయినప్పటికీ జీవితంలో ఏదో ఒక సమయంలో ముఖ్యంగా, మధ్యవయస్సు వచ్చే సరికి పేదలుగా మారిపోయే అవకాశాలు అధికంగా ఉంటాయి.

**జాతకచక్రంలో గురువు పీడనకు గురైనట్లయితే :** ఈ జాతకులకు చిన్న వయస్సులోనే జుట్టు తెల్లబడిపోతుంది. ఎప్పుడైతే, జుట్టు తెల్లబడటం ప్రారంభిస్తుందో

అప్పటి నుండి వారికి దురదృష్టం ప్రారంభం అవుతుంది. అప్పటి దాకా ఉన్న గౌరవం అపకీర్తిగా మారిపోతుంది.

**జాతకచక్రంలో శుక్రుడు పీడనకు గురైనట్లయితే :** ఈ జాతకుల కుటుంబ సభ్యులలో ఎవరో ఒకరికి వివాహం అవుతున్న సమయంలో వీరికి సమస్యలు ప్రారంభం అవుతాయి. ఆ సమయంలోనే వారికి ఒకవైపు మహా ఆనందం, ఇంకొకవైపు పట్టరాని బాధ ఏర్పడుతాయి. శుభకార్యాల సమయంలో ముఖ్యంగా, వివాహాల సమయంలో ఈ జాతకుల కుటుంబంలో అతి ముఖ్యమైన వ్యక్తి మరణించటం జరుగుతుంది.

**జాతకచక్రంలో శని పీడనకు గురైనట్లయితే :** జాతకులు చేసిన కృషి ఫలించి ఆపై జాతకులు మంచి పరిస్థితులలోకి వెళ్ళబోతున్న సమయంలో హఠాత్తుగా దురదృష్టం తల ఎత్తుతుంది. గృహంలో జరిగే అగ్ని ప్రమాదం వల్ల జాతకుడు లేదా జాతకురాలు అంగవైకల్యం పొందే అవకాశాలు ఉంటాయి.

**జాతకచక్రంలో రాహువు చెడుస్థితిలో ఉన్నట్లయితే :** ఊహకు అతీతంగా సంఘటనలు జరగటం రాహువు యొక్క గుణంగా చెబుతారు. అందువల్ల, జాతకచక్రంలో రాహువు పీడనకు ఏదైనా గ్రహం గురైనప్పుడు ఆ జాతకుల జీవితంలో ఏదైనా సరే, కన్నుమూసి తెరిచేలోగా మరియు ఊహాతీతంగా జరుగుతుంది. జీవితంలో ఉన్నత స్థితికి చేరుకోబోయే సమయంలో రాహువు యొక్క చెడు ప్రభావం వల్ల జాతకులు ఒక్కసారిగా క్రిందకు పడిపోతారు. అనగా, వారి ఆశలు "పేకమేడలు" లాగా కూలిపోతాయి. ఈ జాతకులకు చాలా విషయాలలో అన్యాయం ఎదురవుతుంది. ఈ జాతకులపై అవినీతి మరకలు అంటుతాయి.

**జాతకచక్రంలో కేతువు చెడుస్థితిలో ఉన్నట్లయితే :** జాతకచక్రంలో కేతువు పీడనకు గురైన జాతకుల యొక్క మగ బిడ్డలపై చెడు ప్రభావం అధికంగా ఉంటుంది. సాధారణంగా, ఈ జాతకులకు మగ బిడ్డలు పుట్టరు. ఒకవేళ పుట్టినా ఆ మగబిడ్డలు అంగవైకల్యం గలవారుగా లేక నిరుపయోగులుగా ఉంటారు.



# 27. రావణ సంహితలో చెప్పబడిన రహస్యములు?

స్వయంగా, పరమశివుడు తనకు అందించిన నిగూఢమైన ధర్మశాస్త్ర రహస్యములను, దశకంఠ రావణుడు ఒక గ్రంథ రూపంలో మానవులకు అందించాడు. ఆ అద్భుత గ్రంథం పేరు "రావణసంహిత". సాక్షాత్తూ, శివుడు చెప్పిన వివిధ రకాల శాస్త్ర రహస్యాలు ఈ గ్రంథంలో వివరించబడ్డాయి. ఈ గ్రంథంలోని విశేషాలను క్లుప్తంగా తెలుసుకుందాం...



ఒకరోజు మధ్యాహ్న సమయంలో ఏ కారణంచేతో, రావణుడు తన మందిరంలో తన శయ్యమీద గాఢనిద్రలో ఉన్నాడు. సరిగ్గా, అదే సమయంలో కైలాసం నుండి పరమశివుడు, నేరుగా రావణుడి ముందు ప్రత్యక్షం అయ్యాడు. నిద్రలో ఉన్న రావణుడిని తన చేత్తో తట్టిలేపి ఆపై, హఠాత్తుగా నిద్రలేచిన రావణుడితో శివుడు "నాయనా! మానవ జీవితం లభించటం ఎంతోకష్టం. అందులోనూ, నీవు మహానుభావుడైన పులస్త్యబ్రహ్మ వంశంలో జన్మించావు. సాక్షాత్తూ బ్రహ్మయొక్క వంశంలో జన్మించిన నీవు, సాధారణ మానవుడిలాగా పట్టపగలు నిద్రపోతూ పగటి కలలు కంటున్నావు. ఈవిధంగా చెయ్యటం తప్పుకాదా?" అన్నాడు. అప్పుడు రావణుడు సంభ్రమాశ్చర్యాలతో తన శయ్యమీద నుండి లేచి, ఆపై తన ఎదురుగా నిలబడి ఉన్న పరమశివుడి పాదాలపై పడి "ప్రభూ! ఏదో పొరపాటున ఇలా నిద్రపోయాను. నన్ను క్షమించు. నా మీద దయ ఉంచి, నేను ఇక నుండి ఎలా ప్రవర్తించాలో తెలియజేయి" అన్నాడు. అప్పుడు శివుడు, రావణుడిని అనుగ్రహించి, ఆపై రావణుడితో ఇలా చెప్పటం ప్రారంభించాడు. "నాయనా! అతిశక్తివంతులైన దేవతలకు కూడా తెలియని కొన్ని నిగూఢ రహస్యాలను నీకు తెలియజేస్తాను విను".

1. ఏ పురుషుడూ పొరపాటున కూడా వెలుగుతున్న దీపాన్ని నోటితో ఊది ఆర్పరాదు.

2. ఒక మనిషి, ఏదో ఒక దైవాన్ని ఆరాధిస్తూ ఉపవాసం ఉన్న రోజున ఆ మనిషి శరీరంలో అతడు ఆరాధిస్తున్న దైవం కొలువై ఉంటుంది. అందువల్ల, ఆ మనిషి ఆ రోజున అపరిశుభ్రంగా ఉండటం, స్త్రీలకు దూరంగా ఉండటం మంచిది. అంతేకాకుండా, ఆ రోజున ఆ మనిషి కేవలము ఫలములను ఆహారంగా తీసుకోవాలి. నేలపైన పడుకోవాలి. సాంప్రదాయాన్ని పాటించే, దైవ భక్తులైన బ్రాహ్మణులకు దానాలు చెయ్యాలి. దైవాన్ని ఆలయములలో ఆరాధించాలి.

3. లోహములలో "రాగి" అత్యంత శుద్ధమైనదిగా చెప్పబడి ఉన్నది. మానవుడు ఆ రాగి పాత్రలో (బొక్కెనలో) ఉన్న నీటితో స్నానం చేసినట్లయితే ఆ మానవుడికి గంగానది లాంటి పవిత్రమైన నదిలో స్నానంచేసిన ఫలితం లభిస్తుంది.

4. పవిత్ర దినాలలో ఉపవాసం ఉండటం, స్వర్గస్థులైన పూర్వీకులకు శార్ధకర్మలు చెయ్యటం, మనిషియొక్క ప్రధాన విధి అయి ఉన్నది. వాటిని నిర్లక్ష్యం చెయ్యటం పాపాన్ని ప్రసాదిస్తుందని గుర్తించాలి.

5. నీ ఇంటికి లేదా నీ దగ్గరకు ఒక కొత్తవ్యక్తి లేదా పరాయి ప్రాంతానికి చెందిన వ్యక్తి వచ్చి ఏదైనా సహాయం అడిగినప్పుడు, నీ శక్తికి తగినట్లుగా సహాయం చెయ్యాలి. నిర్లక్ష్యం చెయ్యటం, హేళన చెయ్యటం – పాపాన్ని ప్రసాదిస్తుందని గుర్తించాలి.

6. నీవు ఏ పనిచేసినా నీ ఇష్టదైవం పేరుమీద చెయ్యి. అందువల్ల ఆ కర్మకు సంబంధించిన ఫలితాలు ఏవీ నిన్ను అంటుకోవు.

7. భోజన సమయంలో ఏ మనిషీ, చెడు మాటలు మాట్లాడకూడదు. అబద్ధాలు చెప్పకూడదు.

8. ఏ పురుషుడూ తన భార్యను కఠినమైన, దుర్మార్గమైన మాటలతో బాధించరాదు. అందుకు కారణం, భార్య అతడి శరీరంలో సగభాగం మాత్రమే కాక అతడియొక్క శ్రేయోభిలాషులలో ఆమె ప్రథమస్థానంలో ఉంటుంది.

9. ఏ పురుషుడూ ఉదయం నుండి రాత్రి అయ్యే వరకు ఏ సమయంలోనూ తన ఇంటి గుమ్మంమీద, పనిలేకుండా కూర్చుని ఉంటే – అతడియొక్క సంపద నశించిపోతుంది. అతడియొక్క పుణ్యం కరిగిపోతుంది. అతడి రుణబాధ పెరిగిపోతుంది.

ఈవిధంగా పరమశివుడు చెప్పిన రహస్యములను విని రావణుడు ఎంతో బాధకు గురయ్యాడు. దిగులుపడుతూ మౌనంగా ఉండిపోయాడు. అట్టి స్థితిలో ఉన్న రావణుడినిచూసి పరమశివుడు ఎంతో జాలితో రావణుడియొక్క శిరస్సుపై తల ఉంచి ఆపై అతడితో ఇలా అన్నాడు. "నాయనా! నీకు కేవలం మంచి మాత్రమే జరగాలంటే నేను చెప్పబోతున్న ఈ సూత్రాలను పాటించు".

1. ఎవరైనా నీ దగ్గరకు లేదా నీ ఇంటికి వచ్చి ఆహారంకోసం అడిగితే నీవు పట్టించుకోకుండా ఉండవొద్దు. (అనగా నీకు తోచిన ఆహారం ఆ వ్యక్తికి ఇవ్వాలి.)

2. ఎవరైనా నీ దగ్గరకు సహాయంకోసం వస్తే, నీకు తోచిన సహాయం (కనీసం సలహా అయినా చెప్పు) చెయ్యి. భూమిమీద ఇంతకన్నా మంచి పని ఏదీ ఉండదని, అలా మంచి చేస్తే ఆ దైవం నిన్ను కరుణిస్తాడని మర్చిపోవద్దు.

3. నీకు ఉన్న దాంట్లోనే తృప్తిపడు. అప్పుచెయ్యటం, దొంగతనం చెయ్యటం, భిక్షాటన చెయ్యటం చాలా తప్పు. నీ కృషితో నీ సంపదలను పెంచుకునే ప్రయత్నం చెయ్యి. ఆ దైవం నిన్ను తప్పనిసరిగా గొప్పవాడిని చేస్తాడు.

4. నలుగురితో ఉన్నప్పుడు నీ దగ్గర ఉన్న పదార్థాలను నీవు ఒక్కడివే తినటం పాపం.

5. వివాహం అయిన పురుషుడియొక్క పడక మీద (అనగా ఆ పురుషుడు తన భార్యతో కలిసి శయనించే పడక అన్నమాట) ఆ పురుషుడియొక్క - ఏ పురుష బంధువూ చివరికి ఆ పురుషుడి యొక్క సోదరుడు కూడా పడుకోరాదు లేదా కూర్చోరాదు. అలా చెయ్యటం పాప హేతువు అని గుర్తించాలి.

6. ఎక్కడైతే దైవ సంబంధ వాక్కులు (ఉపన్యాసాలు) వినిపిస్తున్నాయో ఆ సమయంలో అక్కడ ఉన్న మనిషి, వాటిని ఎంతో శ్రద్ధతో విన్నట్లయితే అప్పటిదాకా అతడిని అంటిపెట్టుకుని ఉన్న పాపాలు తప్పనిసరిగా కొంత వరకైనా తొలగిపోతాయి.

7. ఎవరైనా వ్యక్తి, నిన్ను నమ్మి నీ దగ్గర భద్రపరచిన ధనాన్ని లేదా విలువైన వస్తువులను నీవు ఆ తరువాతకాలంలో ఆ వ్యక్తికి ఇవ్వకుండా మోసంచేసినట్లయితే నీ కుటుంబంలోని స్త్రీలకు "గొడ్రాలితనం" సంప్రాప్తిస్తుంది.

8. ఏ వ్యక్తీ - ఇతరులు తనని పొడిగితే వినాలని ఆశపడటం లేదా తనను తానే పొగుడుకోవటం శుభకరం కాదని గుర్తించాలి.

9. ఏ పురుషుడూ తన తండ్రితోగాని లేదా పెద్దన్నతోగాని చెడుగా మాట్లాడకూడదు.

10. ఏ పురుషుడైతే యుద్ధ సమయంలో లేదా తన యజమాని కష్టాల్లో ఉన్నప్పుడు ఆ యజమానిని వదిలిపెట్టి వెళ్ళిపోతాడో అతడిని తప్పనిసరిగా చాలా తీవ్రంగా శిక్షించాలి.

11. ఏ మానవుడైతే తన జీవితకాలంలో ఒక్కసారైనా గంగానదిలో స్నానం చెయ్యకపోయినా లేదా ఏ పుణ్యక్షేత్రాన్ని దర్శించకపోయినా ఆ మనిషి మరుజన్మలో ఒక పశువుగా జన్మించటం జరుగుతుంది.

12. నీ కులానికి చెందిన వ్యక్తుల్ని అకారణంగా బాధపెట్టటం, కారణం లేకుండా ఒక వ్యక్తిని హింసించటం, తీవ్రంగా నిందించటం పాపహేతువు అని గుర్తించు.

13. మానవుడు తనకు ఎదురయ్యే కష్టాలను మరియు సుఖాలను సమానంగా చూడగలిగే శక్తిని అనగా మనోధైర్యాన్ని, స్థిరత్వాన్ని పెంచుకోవాలి. మనిషి తాను చేసిన కర్మల ఫలితాన్ని బట్టి అతడికి మంచి లేదా చెడు ఎదురవుతుంది. మనిషిని అతడి మరణం తరువాత అతడి ధనంగాని, బంధువర్గంగాని, బలగంగా గాని కాపాడలేవు. కేవలము, అతడు చేసిన మంచి పనులు మాత్రమే అతడిని నరకం నుండి కాపాడతాయని గుర్తించుకో.

14. మామిడిచెట్టుని నరకటం అనగా – ఒక బ్రాహ్మణుడిని చంపటంతో సమానం (బ్రహ్మహత్య). ఇక, నీ పెరట్లో ఒక మామిడిచెట్టుని నాటటం అంటే, నీవు వెయ్యి యజ్ఞాలు చేసిన ఫలితాన్ని పొందుతావని గుర్తించు.

15. కొడుకు చేసిన పాపపు పనులు, పుణ్యకార్యాల యొక్క ఫలితాలు పైలోకాలలో ఉండే అతడి తండ్రిమీద ప్రభావాన్ని చూపిస్తాయని గుర్తించు. ఆ కారణంగానే, చనిపోయిన వ్యక్తులయొక్క కుమారులు తమకు వీలైనప్పుడు తమ శక్తికి తగినట్లుగా తోటి మానవులకు మేలుచేసే ధర్మకార్యాలు చేస్తూ ఉండాలి.

16. ఓ రావణా! ఏ మనిషి అయితే ఇతరుల యొక్క సౌభాగ్యాన్ని, సంపదలను చూసి ఆగ్రహంతో మరియు అసూయతో రగిలిపోతాడో, ఆ మనిషి తన జీవితంలో ఏదో ఒక సమయంలో దరిద్రుడిగా మారిపోతాడు. అంతేకాకుండా, పై లోకాలలో శిక్షలకు గురి అవుతాడు.

17. ఏ మనిషి అయినా తీర్థయాత్రలకు వెళుతున్నప్పుడు – మార్గమధ్యంలో ఎక్కడా కూడా ఇతరులు ఇచ్చే ఆతిధ్యంకోసం ఆగరాదు. తన ప్రయాణాన్ని, తాను చేరుకోవలసిన క్షేత్రం వరకు కొనసాగిస్తూనే ఉండాలి.

18. ఏడుస్తున్న బిడ్డను ఆ బిడ్డయొక్క తల్లి లేదా తండ్రి కూడా కొట్టరాదు.

19. ఏ మనిషీ, కావాలని – తనకి పనిచేసి పెట్టిన శ్రామికుడికి డబ్బు ఎగ్గొట్టరాదు.

20. భార్య చనిపోయిన పురుషుడు (తనకి సంతానం ఉన్నప్పటికీ) మళ్ళీ వివాహం చేసుకున్నట్లయితే అతడికి సంతోషం రాదు. సంపదలు పెరగవు. సరైన వారసులు జన్మించరు.

21. ఉదయిస్తున్న మరియు మధ్యాహ్న మరియు అస్తమిస్తున్న సూర్యుడిని చూడరాదు. గ్రహణ సమయంలో చూడరాదు. నీటిలో సూర్య బింబాన్ని చూడరాదు.

22. గోవు, ముత్తైదువ, బ్రాహ్మణుడు (సద్బ్రాహ్మణుడు అని గుర్తించాలి.), ఆలయం, దైవం, రావిచెట్టు, ఆవు – ఈ పవిత్రమైన వాటిచుట్టూ సవ్యదశలో (క్లాక్‌వైజ్) మాత్రమే ప్రదక్షిణం చెయ్యాలి. దిలీపుడు అనే మహారాజు గొప్ప దైవభక్తుడు మరియు గో పూజ చేసేవాడు అయి ఉన్నప్పటికీ గోవుకి అపసవ్య దిశలో (యాంటీ క్లాక్‌వైజ్) ప్రదక్షిణాలు చేసిన కారణంగా ఆయనకి సంతానం కలుగలేదు.

23. పవిత్ర జల ప్రవాహాల దగ్గరకు వెళ్ళినప్పుడు – ముందుగా కుడిచేత్తో ఆ జలాన్ని తీసుకుని తలపై చల్లుకుని, ఆపై కాళ్ళు కడుక్కుని ఆ తరువాత మాత్రమే నీళ్ళలోకి దిగాలి. ముందుగా, నదిలోకి లేదా పవిత్ర జల ప్రవాహంలోకి కాళ్ళు పెట్టరాదు. అదేవిధంగా, పవిత్ర జలాల్లో స్నానంచేసేటప్పుడు ఉమ్మి వేయరాదు. నగ్నంగా స్నానం చెయ్యరాదు.

24. ఎవరి ఇంటిలోకి అయినా సరే, వెనుక ద్వారం నుండి (బాక్‌డోర్) ప్రవేశించరాదు. దక్షయజ్ఞం సమయంలో సతీదేవి తన తండ్రి అయిన దక్షుడి ఇంట్లోకి వెనుక ద్వారం ద్వారా ప్రవేశించింది. ఫలితంగా, ఆమె ఆత్మత్యాగం చేసుకున్నది. ఆమె తండ్రి చేసిన యజ్ఞం నాశనం అయ్యింది.

25. రాత్రి సమయంలో ఎవరూ చెట్టు క్రింద ఉండరాదు. ముఖ్యంగా, గర్భిణీ స్త్రీ రాత్రి, సమయంలో చెట్టు క్రింద నిద్రించినట్లయితే ఆమె గర్భంలోని శిశువుకి ఆరోగ్య సమస్యలు కలిగే అవకాశాలు ఉంటాయి. శాస్త్రీయ పరంగా చూసినట్లయితే

రాత్రి సమయాలలో చెట్లు, మనిషికి హాని కలిగించే "కార్బన్‌డైఆక్సైడ్" అనే వాయువును విడుదల చేస్తాయి. అది పీల్చటం మనిషి ఆరోగ్యానికి ఏమాత్రం మంచిదికాదు.

26. భిక్షగాడు వస్తాడని భయపడి – ఉదయంపూట మరియు సాయంత్రంపూట ప్రధాన ద్వారం మూయరాదు.

27. ఎవరి ప్రతిబింబాన్ని వారు నీటిలోగాని, నూనెలోగాని చూసుకోరాదు.

28. మధ్యాహ్నం తరువాత రావిచెట్టు చుట్టూ ప్రదక్షిణాలు చెయ్యరాదు.

29. ఇద్దరు బ్రాహ్మణుల మధ్య నుండి, రెండు ఆవుల మధ్య నుండి, భార్యాభర్తల మధ్య నుండి, గురువు–విద్యార్థి మధ్య నుండి. అక్కా–చెల్లెళ్ళ మధ్యనుండి, అన్నా–తమ్ముళ్ళ మధ్యనుండి, ఇద్దరు పిల్లల మధ్య నుండి, శివుడికి–నందికి మధ్య నుండి – వెళ్ళినట్లయితే ఆ వెళ్ళిన వ్యక్తియొక్క పుణ్యం నశించిపోతుంది.

30. స్నేహితులకు, బంధువులకు వీడ్కోలు పలికిన తరువాత, పూజలు చేసిన తరువాత, వివాహం అయిన తరువాత, ఏదైనా వ్రతం పూర్తి అయిన తరువాత వెంటనే స్నానం చెయ్యరాదు.

31. సూర్యగ్రహణానికి మూడు "యామములు" ముందు, చంద్రగ్రహణానికి రెండు "యామములు" ముందు మాత్రమే భోజనం చెయ్యాలి. (యామము అనగా మూడు గంటలు).

32. గ్రహణ సమయంలో చేసే మంత్రజపం, దానం – అనంతమైన పుణ్య ఫలితాలను ఇస్తాయి.

33. నల్లనువ్వులు మరియు బెల్లము కలిపి, రావిచెట్టు మొదట్లో ఉంచి నమస్కరించినట్లయితే తీవ్రమైన వ్యాధులు కూడా నివారించబడతాయి.

34. పాలు, గంధపు పేస్టు, పూలు అనే పదార్థాలను రాగి పాత్రలలో ఉంచరాదు.

35. 'ఉపవాసం' అనే ప్రక్రియ, శరీరాన్ని మరియు మనసును పరిశుద్ధం చెయ్యటానికి రూపొందించబడింది. కనుక, మతపరమైన కారణం లేకుండా ఉపవాసం ఉండరాదు.

36. రజకులు బట్టలు ఉతికే రేవులో (దోభీఘాట్), ఇనుప పాత్రలో ఉన్న నీళ్ళతో స్నానం చెయ్యరాదు. అదేవిధంగా – ఆదివారం, సప్తమి మరియు రాత్రి సమయాలలో ఉసిరికాయ తినరాదు.

37. పెరుగుని చేతితో చిలకరాదు. అలా చిలకటంవల్ల తయారుచేసిన మజ్జిగను త్రాగరాదు.

38. ఉదయ సూర్యుడి ఎండలో శరీరాన్ని పొడిగా చేసుకోవటం, మృతదేహాలు తగలబడుతున్నప్పుడు వచ్చే పొగ శరీరాన్ని తాకటం, తన కన్నా ఎక్కువ వయస్సు ఉన్న స్త్రీతో సంభోగించటం, రాత్రిపూట పెరుగు తినటం – అనే అంశాలు మనిషి యొక్క ఆయుర్దాన్ని తగ్గిస్తాయి.

39. సాయంత్రం ఎండలో పొడిబారటం (ఎండలో తిరగటం), హోమ గుండంలో నుండి వచ్చే పొగ శరీరానికి తగలటం, తనకన్నా చిన్న వయస్సులో ఉన్న స్త్రీలతో సంభోగించటం, రాత్రి సమయంలో పాలు మరియు అన్నం కలిపి తినటం వల్ల మనిషికి ఆయుర్దాయం పెరుగుతుంది.

40. అతిథిని ముందు గదిలో లేదా హాలులో కూర్చోపెట్టి – ఆ ఇంటివాళ్ళు మాత్రమే లోపల భోజనం చేసినట్లయితే ఆ భోజనం "గో మాంసానికి" సమానం.

41. సాధ్యమైనంతవరకు రుణం చెయ్యకుండా ఉంటేనే మంచిది. ఒకవేళ చేసినట్లయితే సాధ్యమైనంత త్వరంలో ఆ రుణాన్ని తీర్చివెయ్యాలి. ఒకవ్యక్తికి మనం రుణం తీర్చకుండానే చనిపోయినట్లయితే, ఆ వ్యక్తి, మరుజన్మలో మనకి బిడ్డగా జన్మించి తనకు రావలసిన మొత్తాన్ని ఏదో ఒక రూపంలో తీసుకుని ఆపై బాల్య దశలోనే ఆ బిడ్డ మరణిస్తాడు.

42. మానవ శరీరం నీటి బుడగలాగా అశాశ్వతమైనది. సంపద ఏ క్షణంలో పోతుందో తెలియదు. అందువల్ల, రేపు అనేది మనకి ఉంటుందో లేదో తెలియదు. కనుక మంచి పనుల్ని సాధ్యమైనంత త్వరలో చేసినవాడు జ్ఞానిగా గుర్తించబడతాడు.

43. గంధపు కర్రను రాయిమీద రుద్ది తయారుచేసిన గంధాన్ని వెంటనే ఆ రాయిమీద నుండి తీసి ఇంకొక పాత్రలోకి తీసుకోవాలి. అలా కాకుండా ఆ రాయిమీదే ఉంచి వాడుకునే గంధం మరియు పిల్లి ఎంగిలిచేసిన ఆహారాన్ని తినటం ఒకేవిధమైన చెడు ఫలితాన్ని ఇస్తాయి.

44. గాడిదలు, మేకలు నడవటంవల్ల రేగిన ధూళి, చీపురుతో చిమ్మినప్పుడు ఎగిరే ధూళి శరీరంమీద పడితే దరిద్రం తప్పదు.

45. చెవుల్లో (చెవి ప్రక్కన) పూలు ధరించటం, శిరోజాలపైన తులసిని పెట్టుకోవటం వల్ల పాపం సంక్రమిస్తుంది. కనుక, పుష్పాలను శిరోజాలపైన అనగా తలపైన, తులసిని చెవుల ప్రక్కన ఉంచుకోవాలి.

46. కేవలము స్త్రీలు మాత్రమే గంధపు పేస్టుని తమ మెడకు మరియు చేతులకు వ్రాసుకోవచ్చు. పురుషులు తమ ఛాతీకి మరియు చేతులకు మాత్రమే గంధపు పేస్టుని పూసుకోవాలి.

47. తన కొడుక్కి అప్పులను మిగిల్చి చనిపోయే తండ్రి – ఆ కొడుక్కి శత్రువు అవుతాడు. ఏ తండ్రి అయితే తన కొడుక్కి జ్ఞానాన్ని మరియు వినయాన్ని నేర్పకుండా చనిపోతాడో ఆ తండ్రి ఆ కొడుక్కి శత్రువు అవుతాడు. వికారంగా ఉండే భార్య లేదా మహా అందంగా ఉండే భార్య – భర్తకి శత్రువు అవుతుంది.

48. కూతురుకి పెళ్ళి అయి, ఆపై ఆమెకి ఒక బిడ్డ పుట్టే దాకా కూతురు ఇంట్లో ఆమె తల్లిదండ్రులు భోజనం చెయ్యరాదు.

49. భోజనం చేసిన వెంటనే వంద గజాలు నడవాలి. అలా కాకుండా కూర్చున్నా లేక పడుకున్నా త్వరలోనే ఉదర సంబంధ వ్యాధులు వస్తాయి. భోజనం చేసిన వెంటనే వేగంగా నడిచినా లేక పరుగెత్తినా ఆయుర్దాయం తగ్గిపోతుంది.

50. పెద్దలకు పాదాభివందనం చేసేటప్పుడు ఎడమచేత్తో కుడి పాదాన్ని, కుడి చేత్తో ఎడమ పాదాన్ని తాకి నమస్కరించాలి.

51. మంచినీటి బావిలో లేదా చెరువులో పిల్లి లేదా కుక్క పడి చనిపోతే ఆ నీటి నుండి వంద కుండల నీటిని తీసి అవతల పారపోసి ఆ తరువాత ఆ బావిలోని నీటిని వాడుకోవచ్చు. ఒకవేళ, ఆ బావిలో లేదా చెరువులో మనిషి పడి చనిపోతే అందులో ఉన్న నీటిని మొత్తం తొలగించి, ఆపై పంచగవ్యాలతో 'పుణ్యాహం' అనే తాంత్రిక ప్రక్రియ నిర్వహించి ఆపై బావిలోని నీటిని వాడుకోవాలి.

52. ఆవుయొక్క పృష్టం (వెనుకభాగం) మరియు వెనక కాళ్ళు పవిత్రమైనవి. అందువల్ల, వాటిని తాకి నమస్కరించవచ్చు. లక్ష్మీదేవి ఆ భాగాలలో నివసిస్తుంది. దధీచి మహర్షియొక్క దేహాన్ని నిర్మూలించటంకోసం కామధేనువు అనే ఆవు దధీచి యొక్క మాంసాన్ని నాకివేసి ఆరగించింది. అందువల్ల, ఆవుయొక్క శిరస్సు అపవిత్రమైనదిగా గుర్తించబడింది. అయితే, ముందు – ఆవుయొక్క వెనకభాగాన్ని పూజించి ఆ తరువాత ముందుభాగాన్ని పూజించుకోవచ్చు.

53. ఒక మనిషి చనిపోయిన తరువాత సాధ్యమైనంతవరకు ఒక యామం తరువాత మరియు మూడు యామాలలోపు ఆ మృతదేహాన్ని దహనం చెయ్యాలి.

(ఒక యామం అనగా మూడు గంటలు) ఒకవేళ, ఆ పరిమితి దాటిపోయినట్లయితే ప్రాయశ్చిత్తం తప్పనిసరిగా చేసుకోవలసి ఉంటుంది.

54. పట్టుపురుగును బాధించటంవల్ల అనగా పట్టుపురుగు తయారుచేసుకునే గూడును తొలగించటం వల్ల పట్టు తయారైనప్పటికీ అది, పవిత్రమైనదిగానే ఉంటుంది. అది ఎలాగంటే…ఆవు దూడ ఎంగిలి చేసిన తరువాత మనిషి ఆ ఆవు నుండి పిండే పాలు ఏవిధంగా పవిత్రమైనవిగా ఉంటాయో అలా అన్నమాట. అనేక తేనెటీగలు తమ ఎంగిలి పువ్వుల సారంతో చేసిన తేనె పవిత్రమైనది. అందువల్లే దానిని దేవుడి అభిషేకానికి ఉపయోగిస్తారు. కాకి రెట్ట నుండి వచ్చిన విత్తనం నుండి మొలిచే రావి చెట్టుకూడా పవిత్రమైనదే అవుతుంది.

55. సాధ్యమైనంత వరకు సిల్క్ వస్త్రాలను బైట ఎవరిచేతో ఉతికించటం కన్నా, సొంతంగా అమావాస్య లేదా ద్వాదశి తిథుల్లో పెసర గంజితో ఉతుక్కోవటం మంచిది.

56. బ్రాహ్మణుడి యొక్క పాదాలను అతడి చీలమండల వరకు మాత్రమే కడగాలి.

57. పితృదేవతలకు పిండాలు పెట్టినప్పుడు, కాకి వాటిని తాకటానికి ముందే ఇతర ఏదైనా జీవి లేదా కుక్క తాకినట్లయితే పితృ కర్మలు చేసేవారు ఆ రోజుకి ఉపవాసం ఉండి ఆ మర్నాడు జాగ్రత్తగా మళ్ళీ పిండాలు పెట్టాలి.

58. పితృదేవతలకు పిండం పెట్టినప్పుడు ఆ పిండాన్ని – ఒక కాకి తూర్పువైపు నుండి తీసుకున్నట్లయితే ఆ కర్మలు చేసిన కర్తకు సంపదలు పెరుగుతాయి. దక్షిణం వైపు నుండి తీసుకున్నట్లయితే ఆ కర్తకు అనారోగ్యం వస్తుంది. పశ్చిమ దిక్కు నుండి తీసుకున్నట్లయితే ఆ కర్త వేరే ప్రాంతానికి వెళ్లవలసి వస్తుంది. ఉత్తరంవైపు నుండి తీసుకున్నట్లయితే కర్త యొక్క ఆయుర్దాయం పెరుగుతుంది. ఒకవేళ, కాకి – పిండాన్ని తాకనట్లయితే కర్తకు బాధలు అధికం అవుతాయి.

59. తలను రెండు చేతులతో గీరుకోరాదు.

60. బూడిద గుమ్మడికాయను చేత్తో పగలకొట్టరాదు.

61. గర్భిణీ స్త్రీ కొబ్బరికాయ కొట్టరాదు మరియు కొబ్బరికాయ కొట్టే ప్రదేశంలో ఉండరాదు.

62. భార్యాభర్తల సంగమానికి అడ్డం తగిలే స్త్రీ - 21 జన్మలలో వితంతువుగా ఉంటుంది.

63. పెరుగు అన్నం తిన్న తరువాత ఆ వ్యక్తిని "ఇంకా అన్నం కావాలా" అని అడగాలి.

ఈవిధంగా, ఎన్నో అద్భుతమైన విషయాలను రావణుడికి చెప్పిన పరమశివుడు చివరగా రావణుడితో ఇలా చెప్పాడు.

"నాయనా! ఎవరైతే నేను చెప్పిన ఈ నియమాలను త్రికరణశుద్ధిగా పాటిస్తారో, ఎవరైతే, తాము చేసే కర్మలయొక్క ఫలితాన్ని ఆ దైవానికి వదిలిపెట్టి, తమ కర్తవ్యాన్ని నిర్వహిస్తారో అట్టి మానవులు ఎల్లప్పుడూ దైవానుగ్రహాన్ని పొందుతూ ఉంటారని గ్రహించు".

**నోట్ :** రావణ సంహితలో కేవలము పైన చెప్పిన సమాచారం మాత్రమే కాక, జ్యోతిషశాస్త్ర, ఆయుర్వేదశాస్త్ర లాంటి శాస్త్ర రహస్యాలు కూడా ఉన్నాయి. ఇంకొక విశేషం ఏమంటే, తన పట్ట మహిషి అయిన మండోదరి కోరిక మీద రావణుడు 'కుమారతంత్ర' అనే అద్భుత గ్రంథాన్ని వ్రాసాడు. ఈ గ్రంథంలో, పసిపిల్లలకు వచ్చే వ్యాధుల గురించి మరియు ఆ వ్యాధులను నివారించే ఔషధాల గురించి చాలా అద్భుతంగా వివరించబడ్డాయి.

రావణుడు తాను వ్రాసిన ఒక తంత్రగ్రంథంలో ఇలా చెప్పాడు. "గొడ్డు మాంసం తిన్నవారికి 98 రకాల కొత్త వ్యాధులు సంక్రమిస్తాయి. అందువల్ల గొడ్డు మాంసానికి దూరంగా ఉండటం మనిషికి చాలా మంచిది.

**చండయోగినీ సాధన :** తీవ్రమైన కష్టాలతో సతమతమవుతున్నవారు ఈ సాధన చేసినట్లయితే వారి సమస్యలు చాలా తొందరగా తీరిపోతాయి. ఈ సాధనయొక్క ప్రత్యేకత ఏమంటే, ఈ సాధన ఫలించినప్పుడు - ప్రత్యక్షం అయ్యే చండయోగిని, సాధకులకు ఏవిధమైన వ్యామోహాలను కలిగించదు. అందువల్ల ప్రతి ఒక్కరూ ఈ సాధనను నిస్సంకోచంగా చెయ్యవచ్చు. ఈ సాధనకు అవసరమైన నియమాలు ఇలా ఉన్నాయి...

1. ఈ సాధనకోసం తప్పనిసరిగా నల్లహకీక్ పూసలతో చేసిన జపమాలను కలిగి ఉండాలి.

2. ఈ సాధనను శుక్రవారంనాడు మాత్రమే మొదలుపెట్టాలి.

3. ఈ సాధనచేసే సాధకుడు, నైరుతి దిశలో కూర్చోవాలి అనగా ఈశాన్య దిశకు ఎదురుగా కూర్చోవాలి.

4. ఈ సాధనచేసే సాధకుడు మరియు అతడు కూర్చునే ఆసనం (చాప లాంటిది) ఎరుపు రంగులో ఉండాలి.

5. ఈ సాధనను రాత్రి 11 గంటలు దాటిన తరువాతే ప్రారంభించాలి.

6. ఈ సాధన ఏకధాటిగా ఏడు రాత్రులు చెయ్యాలి (అనగా, శుక్రవారం నాడు ప్రారంభించే ఈ సాధన వరుసగా ఏడు రోజులపాటు సాగాలి అన్నమాట.) ఈ సాధన ఫలించినట్లయితే చండయోగిని అదృశ్య రూపంలో సాధకుడి వెంట ఉంటూ, అతడు చేసే కార్యాలలో విజయాన్ని అందిస్తుంది. మహా శక్తివంతమైన చండయోగిని మంత్రం ఇలా ఉంటుంది.

**॥ ఓం చండయోగినీ సర్వార్థ సిద్ధిం దేహి నమః ॥**



# 28. మీ జాతకచక్రంలో దాగి ఉన్న అదృష్ట/దురదృష్ట కారక గ్రహస్థితుల మర్మం?

హైందవ లేదా వేద జ్యోతిషశాస్త్రంలో చెప్పబడిన సిద్ధాంతాల ప్రకారం చూసినట్లయితే, మనిషి తన గతజన్మలలో చేసిన మంచి లేదా చెడు కర్మలకు తగిన ఫలితాలు గ్రహాల ద్వారా పొందుతాడు. అయితే, మనిషిమీద ఏ ఒక్క గ్రహమూ పరిపూర్ణ ప్రభావాన్ని చూపించదు. రెండు, మూడు గ్రహాల యొక్క మిశ్రమ ప్రభావం మనిషిమీద ఏకకాలంలో పనిచేస్తూ ఉంటుంది. గ్రహాలు తమయొక్క ప్రభావాన్ని అయస్కాంత తరంగాలరూపంలో మనిషిమీద ప్రదర్శిస్తూ ఉంటాయి.

ప్రాచీన గ్రీకుదేశ జ్యోతిషశాస్త్రంపై విస్తారంగా పరిశోధనలు చేసిన బెంజమిన్ వాకర్ అనే జ్యోతిషశాస్త్ర పరిశోధకుడు కొన్ని అద్భుతమైన గ్రహ సంబంధ రహస్యాలను తెలియజేసాడు. ఆయన చెప్పిన సూత్రాల ప్రకారం చూసినట్లయితే......

సాధారణంగా, మనిషి యొక్క ఆయుర్దాయం 108 సంవత్సరాలు ఉంటుంది. ఆ కారణంగానే, గ్రహాల యొక్క దశలకు వేరు వేరుగా – కొన్ని సంవత్సరాల కాల పరిమితి నిర్ణయించబడింది. మనిషి ఈ లోకంలో జన్మించిన తరువాత – మొదట అతనిమీద ప్రభావం చూపించే గ్రహం, రవిగ్రహం. ఈ రవిగ్రహం – మానవులకు విజయాన్ని, సంపదను, కీర్తిని ఇస్తుంది. ఈ గ్రహం యొక్క దశ పరిమాణం ఆరు సంవత్సరాలుగా నిర్ణయించబడింది.

రవి తరువాత మనిషిపై ప్రభావాన్ని చూపించేది చంద్రుడు. ఈ చంద్రగ్రహం జాతకులకు మతపరమైన ఆసక్తిని, వేదాంతాన్ని, రచనా సామర్థ్యాన్ని, వైరాగ్యాన్ని, ఉన్మాదాన్ని ఇస్తుంది. ఈ చంద్రగ్రహ మహాదశ 15 సంవత్సరాలు ఉంటుంది.

ఆపై ప్రభావాన్ని చూపించేది కుజుడు. ఈ కుజుడు, జాతకులకు యుద్ధం చేసే స్వభావాన్ని, తగాదాలను, చట్ట సంబంధ సమస్యలను ఇస్తుంది. ఈ గ్రహం యొక్క మహాదశ 8 సంవత్సరాలు ఉంటుంది.

ఆ తరువాత ప్రభావాన్ని చూపించే బుధుడు, జాతకులకు వ్యాపార సామర్థ్యాన్ని, వ్యవసాయం చెయ్యగల నేర్పుని, ప్రయాణాలు చెయ్యవలసిన అవసరాలను, సంపదను ప్రసాదిస్తాడు. ఈ గ్రహం యొక్క మహాదశ 17 సంవత్సరాలు ఉంటుంది.

ఆపై ప్రభావాన్ని చూపించే శని, జాతకులకు బాధలను, ఆందోళనలను, మరణాన్ని, దు:ఖాన్ని, విషాదాన్ని ప్రసాదిస్తాడు. ఈ గ్రహం యొక్క మహాదశ 10 సంవత్సరాలు జరుగుతుంది.

ఆ తరువాత జాతకుడిపై ప్రభావం చూపించే గురుగ్రహం, జాతకులకు ఆధిపత్యం చెయ్యగల శక్తిని, అధికారాన్ని, బలాన్ని, పరిపాలించే శక్తిని ఇస్తుంది. ఈ గ్రహం యొక్క మహాదశ 19 సంవత్సరాలు జరుగుతుంది.

గురువు తరువాత జాతకులపై ప్రభావాన్ని చూపించే వంతు వచ్చే రాహువు మరియు కేతువు – జాతకులలో దురాశను, ఆగ్రహాన్ని, అసూయను కలిగిస్తాయి. అంతేకాకుండా, జాతకులకు ఆటంకాలను, ఓటమిని కలిగిస్తాయి. ఈ రాహు-కేతువుల యొక్క సమైక్య మహాదశ 12 సంవత్సరాలపాటుజరుగుతుంది.

ఆ తరువాత దశ శుక్రుడికి వస్తుంది. అనగా, శుక్రగ్రహం జాతకులకు

భోగభాగ్యాలను, స్త్రీ సౌఖ్యాన్ని, కామాన్ని, శృంగారపరమైన అంశాలపట్ల ఆసక్తిని ప్రసాదిస్తుంది. ఈ శుక్రగ్రహ దశ యొక్క పరిమాణం 21 సంవత్సరాలు ఉంటుంది.

నోట్ : బెంజమన్‌వాకర్ చెప్పిన పై సమాచారాన్నిబట్టి తెలుస్తున్నది ఏమంటే... సాధారణంగా, 108 సంవత్సరాల ఆయుర్దాయం కలిగిన మనిషియొక్క జీవితంలో 30 సంవత్సరాలు మాత్రమే తీవ్రమైన కష్టకాలంగా ఉంటుందని. ఆ 30 సంవత్సరాలు ఏవంటే...కుజుడు – 8 సంవత్సరాలు, శని – 10 సంవత్సరాలు, రాహు+కేతువు – 12 సంవత్సరాలు = 30 సంవత్సరాలు.

**అదృష్టకారక గ్రహ స్థితులు :**

ఒక జాతకచక్రంలో బుధగ్రహం తన సొంత రాశి అయిన కన్యారాశిలో ఉచ్ఛస్థితిలో ఉండి లేదా తనకు బలం ఉన్న రాశిలో ఉండి మరియు 9వ స్థానాధిపతి 9వ స్థానంలోనే ఉన్నట్లయితే – ఆ వ్యక్తికి 35వ సంవత్సరం దాటినప్పటి నుండి మంచి ఆర్థిక స్థితి ఏర్పడుతుంది. కారణం, ఏ జాతకుడిపైన అయినా సరే, బుధగ్రహం యొక్క ప్రభావం 32–35 సంవత్సరాల మధ్య పరిపూర్ణంగా ఉంటుంది.

ఏదైనా జాతకచక్రలో శుక్రగ్రహం ఉచ్ఛస్థితిలో ఉండటమే కాకుండా, ఆ జాతకంలోని 9వ స్థానాధిపతితో కలిసి ఉండి మరియు శని ఆ జాతకంలోని 3వ స్థానంలో ఉన్నట్లయితే – అనగా ఇలాంటి గ్రహస్థితి ఉన్న జాతకులు మహా అదృష్టవంతులు అవుతారని గుర్తించాలి.

ఏదైనా జాతకచక్రంలో 9వ స్థానాధిపతి – కేంద్ర స్థానములో అనగా 1/4/7/10వ స్థానంలో ఉండి మరియు గురువు ఆ జాతకంలోని 9వ స్థానంలో ఉన్నట్లయితే ఆ జాతకులు తమ 19వ సంవత్సరం నిండినప్పటి నుండి విపరీతమైన అదృష్టాన్ని పొందుతారు. అందుకు కారణం ఏమంటే, గురుగ్రహం యొక్క పరిపూర్ణ ప్రభావం 15–20 సంవత్సరాల మధ్య కనిపిస్తుంది.

ఏ జాతకంలో అయినా 9వ స్థానాధిపతి – 2వ స్థానంలోను, 2వ స్థానాధిపతి – 9వ స్థానంలోను – ఉన్నట్లయితే ఆ జాతకులు అపారమైన సంపదల్ని, భోగాలను పొందుతారు. అయితే, ఈ జాతకులకు 35 సంవత్సరాలు దాటిన తరువాత కీర్తి ప్రతిష్టలు వస్తాయి.

ఏ జాతకంలో అయినా 9వ స్థానాధిపతి, 9వ స్థానంలోనే బలమైన స్థితిలో ఉన్నట్లయితే ఆ జాతకులు మంచి అదృష్టాన్ని, అధిక మొత్తంలో ధనాన్ని పొందగలరు.

జాతకచక్రంలోని 3/6/11వ స్థానంలో పాపగ్రహాలు ఉన్నట్లయితే – ఆ జాతకుడు లేదా జాతకురాలు అదృష్టవంతులు అవుతారు.

ఏదైనా, జాతకచక్రంలోని 12వ స్థానంలో శుక్రుడు మరియు చంద్రుడు కలిసి ఉన్నట్లయితే ఆ జాతకుడికి తన భార్య లేదా తల్లి ద్వారా బాగా కలిసి వస్తుంది.

**జాతక చక్రంలో మహా సంపన్న యోగాన్ని సూచించే గ్రహస్థితులు :**

1. హైందవ జ్యోతిషశాస్త్ర సూత్రాల ప్రకారం చూసినట్లయితే, జాతకచక్రంలోని 2,4,9,11 – అనే నాలుగు స్థానాలు మరియు చంద్ర, గురు గ్రహాలు – జాతకులయొక్క ధన సంబంధమైన అదృష్టాన్ని సూచిస్తాయి. ఇక, జాతకచక్రంలోని 2,4,9వ స్థానాధి పతులకు లగ్నంతో సంబంధం ఏర్పడినా లేదా ఈ స్థానాల అధిపతులు – నవాంశ చక్రంలో ఉన్నా లేదా ఈ స్థానాధిపతులు - 1,2 లేదా 9వ స్థానంలో ఉన్నా ఆ జాతకుడు లేదా జాతకురాలు – అసాధారణమైన సంపదను ఆర్జించటం జరుగుతుంది.

2. జాతకచక్రంలోని ద్వితీయ స్థానాధిపతి – 9వ స్థానాధిపతితో కలిసి 11వ స్థానంలో చంద్రుడు మరియు గురువుతో కలిసి ఉన్నట్లయితే ఆ జాతకుడు లేదా జాతకురాలు – కోటీశ్వరులు అవ్వటం జరుగుతుంది.

3. జాతకచక్రంలోని 2వ స్థానం ఖాళీగా ఉండి (ఆ స్థానంలో ఏ గ్రహం ఉండదు.) మరియు ఆ స్థానంపై బుధుడియొక్క 'దృష్టి' పడినట్లయితే ఆ జాతకులు సంపన్నులు కావటం జరుగుతుంది.

4. జాతకచక్రంలోని 2వ స్థానంలో బుధుడు ఉండి, ఆ బుధుడిపై చంద్రుడి యొక్క 'దృష్టి' పడినట్లయితే ఆ జాతకులు అపార సంపదను పొందుతారు.

5. జాతకచక్రంలోని గురువు – 2వ స్థానానికి అధిపతిగా ఉండి మరియు ఆ గురువు అదే స్థానంలో కుజుడితో కలిసి ఉన్నట్లయితే ఆ జాతకులు – కుబేరుడితో సమానమైన సంపదను పొందుతారు.

6. జాతకచక్రంలోని 2 మరియు 11వ స్థానాధిపతుల 'పరివర్తన' జరిగినట్లయితే

ఆ జాతకులు మహా సంపన్నులు అవుతారు. (పరివర్తన అనగా ఒక గ్రహ స్థానంలోకి ఇంకొక గ్రహం వచ్చి ఉండటం.)

**జాతకచక్రంలో దరిద్రాన్ని సూచించే గ్రహస్థితులు :**

ఏదైనా జాతకచక్రంలో శని – 9వ స్థానంలో చంద్రుడితో కలిసి ఉండి మరియు ఆ జాతకంలోని లగ్నం, నీచస్థితిలో ఉన్నట్లయితే ఆ జాతకుడు లేదా జాతకురాలికి సంపదల సంగతి అటుంచి, కనీసం కడుపునిండా తినటానికి భోజనం కూడా లేని దుస్థితి ఏర్పడుతుంది.



# 29. ప్రాచీన శ్రీలంక తంత్రశాస్త్రంలో చెప్పబడిన వ్యాధుల మర్మం?

పురాతన కాలం నుండి ప్రపంచ వ్యాప్తంగా వ్యాధికి సంబంధించిన భావనలు దాదాపు ఒకేరకంగా ఉన్నాయని చెప్పవచ్చు. “వ్యాధి” అనేది మామూలుగా వచ్చే సమస్య కాదని, దాని వెనకాల కొన్ని ప్రత్యేకమైన మరియు నిగూఢమైన కారణాలు దాగి ఉంటాయని నమ్మటం జరుగుతున్నది. మనిషికి వ్యాధులు రావటానికి మూడు రకాల కారణాలు ఉంటాయని భావించటం జరిగింది. వాటిలో మొదటిది – ఆ మనిషి చేసిన చెడు కర్మలు. రెండవది – ఆ మనిషిపైన అతడి శత్రువులు చేసిన క్షుద్ర ప్రయోగాలు. మూడవది – మనిషికి అతీతమైన ఏదో ఒక శక్తి (ఆ శక్తిని దైవం అనుకుందాం). ఈ మూడు రకాల కారణాల వల్ల మనిషి, రోగగ్రస్తుడు అవుతాడని తంత్రశాస్త్రాలలో కూడా చెప్పటం జరిగింది. వీటిలో క్షుద్ర ప్రయోగం లేదా అభిచారం అనే ప్రక్రియ వల్ల మనిషికి వ్యాధులు వస్తాయని, ఈ భూమిమీద జీవిస్తున్న మానవులలో ఎక్కువ శాతంమంది నమ్ముతున్నారు. ఏదిఏమైనా, దాదాపు రెండువేల సంవత్సరాల క్రితం ఆనాటి సింహళదేశంలో (నేటి శ్రీలంక), తాళపత్ర గ్రంథాలపై రచించబడిన ఒక తంత్రశాస్త్ర గ్రంథంలో “మనుషులకు వ్యాధులు రావటానికి గల ముఖ్య కారణాల గురించి” చాలా వివరంగా చెప్పబడి ఉన్నది. ఆ గ్రంథంలో ఇవ్వబడిన సమాచారం గురించి ఇక్కడ తెలుసుకుందాం...

**1. అభిచారం (సోర్సరీ/బ్లాక్ మాజిక్) :** కొంతమంది మానవులు, తాంత్రిక సంబంధమైన ప్రక్రియలో గొప్ప పరిజ్ఞానాన్ని కలిగి ఉంటారు. వీరు, తమ మంత్రబలంతో ప్రకృతిలోని కొన్ని బలమైన మానవాతీత శక్తులను తమ ఆధీనంలోకి తెచ్చుకుని, ఆపై వాటి సహకారంతో ఇతరులపైన క్షుద్ర ప్రయోగాలు చేస్తారు. ఆ ప్రయోగాలకు గురైన వ్యక్తులు, తీవ్రమైన అనారోగ్యానికి గురికావటం, ఆపై కొంతకాలానికి చనిపోవటం జరుగుతుంది. ఈ అభిచార ప్రక్రియ మూడు రకాలుగా ఉంటుందని చెబుతారు.

ఎ) "ఏ వ్యక్తికి అయితే అనారోగ్యం సంక్రమించాలి" అని కోరుకుంటున్నాడో లేదా "ఏ వ్యక్తికి తీవ్ర ప్రమాదం జరగాలని ఆశిస్తున్నాడో" – ఆ వ్యక్తి యొక్క ప్రతిరూపంగా ఆరు అంగుళాల ఎత్తు ఉండే ఒక బొమ్మని తయారుచేసి, ఆపై తన మంత్రశక్తితో ఆ బొమ్మలోకి తాను, బాధించాలనుకుంటున్న వ్యక్తియొక్క ప్రాణశక్తిలో కొంత భాగాన్ని నింపుతాడు. ఆ తరువాత ఆ బొమ్మకి మేకులు దింపటం ద్వారా లేదా ఆ బొమ్మని భూమిలో పాతిపెట్టటం ద్వారా లేదా ఆ బొమ్మని అగ్నిలో దహించటం ద్వారా ఆ బొమ్మకు సంబంధించిన వ్యక్తికి తీవ్రమైన వ్యాధిని సంక్రమింపచేస్తాడు.

బి) ఈ విధానంలో – మంత్రవాది, తాను ప్రయోగం చెయ్యాలనుకుంటున్న వ్యక్తికి సంబంధించిన కేశములు/గోళ్ళు (కత్తిరించిన గోరు అంచులు), ఆ వ్యక్తియొక్క విసర్జనలు (మలము/మూత్రము) లేదా ఆ వ్యక్తి కొంతకాలంపాటు ధరించిన ఆభరణం లేదా వస్త్రం – సేకరించి ఆపై, వాటిని కొన్ని ప్రత్యేకమైన తాంత్రిక మంత్రాలతో అభిమంత్రించటం జరుగుతుంది. ఒకవ్యక్తి యొక్క వెంట్రుకలు, గోళ్ళు, విసర్జనాలు మరియు ఆ వ్యక్తికి మధ్య విడదీయరాని ఒక అదృశ్య సంబంధం ఉంటుందని, ఆ పదార్థాలు – ఆ మనిషికి ఎంత దూరంలో ఉన్నా ఆ వస్తువులను మరియు ఆ మనిషిని కలిపే ఒక అదృశ్యమైన తీగలాంటి బంధం ఉంటుందని తంత్రశాస్త్రంలో చెప్పబడి ఉన్నది. అందువలన, ఒకవ్యక్తికి సంబంధించిన వ్యక్తిగత వస్తువులను లేదా పదార్థాలను ఉపయోగించి ఆ వ్యక్తిపై క్షుద్రప్రయోగంచేసి ఆ వ్యక్తిని అనారోగ్యం పాలు చేస్తారు.

సి) కొంతమంది మంత్రవాదులు, అసాధారణ స్థాయి శక్తిని కలిగి ఉంటారు. ఇలాంటి మంత్రవాదులు తమ మంత్రశక్తితో తీవ్రమైన చెడు స్వభావం కలిగిన ఆత్మలను, తమ స్వాధీనంచేసుకుని ఆపై అవసరం అయినప్పుడు ఆ ఆత్మలను – తాము ప్రయోగం చెయ్యాలనుకుంటున్న వ్యక్తిపైకి ప్రయోగించటం జరుగుతుంది.

అలా ఒక మంత్రవాది, ఒక వ్యక్తిమీదకి ప్రయోగించిన ఆత్మలు ఆ వ్యక్తిని తీవ్రమైన వ్యాధిగ్రస్తుడిగా మార్చటమో లేదా ఏదో ఒక ప్రమాదానికి గురిచేసి చంపటమో జరుగుతుంది.

పైన పేర్కొన్న మూడు విధానాలు "అభిచార" ప్రక్రియకు సంబంధించినవిగా ఉన్నాయి. ఈవిధానంలో ఏదోఒక మంత్రగాడు చేసే ప్రయోగాల వల్ల ఒక మనిషి వ్యాధిగ్రస్తం కావటం జరుగుతుంది.

**2. ధర్మాన్ని అతిక్రమించటం :** ప్రతి మతంలోను కొన్ని ధర్మ సూత్రాలు బోధించబడతాయి. ప్రపంచవ్యాప్తంగా ఇంచుమించుగా అన్ని మతాలలోను "పాపం-పుణ్యం" అనే భావన ప్రధానంగా కనిపిస్తుంది. నిష్కారణంగా ఇంకొక మనిషికి తీవ్రమైన అపకారం చెయ్యటం వల్ల పాపం సంక్రమిస్తుందని, ఆ పాప ఫలితంగా, జీవితంలో ఏదో ఒక దశలో తీవ్రమైన వ్యాధులకు గురి కావలసి వస్తుందని ధర్మశాస్త్రాలు ఉద్ఘాటిస్తున్నాయి. బైబిల్ గ్రంథంలో చెప్పబడిన సమాచారం ప్రకారం చూసినట్లయితే "పాపాత్ములు చేసిన పాపాలకు పడే గరిష్ఠశిక్ష మరణమే అని గుర్తించాలి". ఒక విశేషం ఏమంటే, తెలిసో, తెలియకో పాపం చేసిన వ్యక్తి తీవ్రమైన వ్యాధికి లేదా అంగవైకల్యానికి గురికావటం జరుగుతుంది. తాను చేసిన పాపానికి పశ్చాత్తాపపడి, ఆపై ఆ పాపానికి తగిన పరిహారం చేసుకున్నట్లయితే ఆ వ్యక్తి, పాపం నుండి విముక్తుడు అవుతాడని దాదాపు అన్ని మతాలలో కూడా చెప్పబడి ఉన్నది.

**3. శరీరంలోకి అన్య పదార్థాలు ప్రవేశించటం :** మనిషి శరీరంలోకి అతడికి వ్యతిరేకమైన ఏదైనా పదార్థం లేదా అంశం ప్రవేశించినట్లయితే - అతడికి తీవ్రమైన అనారోగ్యం సంభవిస్తుందని విశ్వసించబడుతున్నది. అది ఎలాగంటే, బల్లులు, విషపూరితమైన పురుగులు, కీటకాలు లాంటివి - ఆహారం ద్వారా లేదా నీటి ద్వారా మనిషియొక్క ఉదరంలోకి ప్రవేశించిన తరువాత, అతడి శరీరంలో విషపదార్థాలు ఏర్పడతాయి. ఫలితంగా, ఆ మనిషి తీవ్రమైన అనారోగ్యానికి గురి అవుతాడు. ఇవే కాకుండా, కొన్నిసార్లు మనిషి శరీరంలోకి ఆహారం ద్వారా లేదా ఇతర మార్గాల ద్వారా - ఎముక ముక్క, పొదవాటి వెంట్రుక, గులకరాయి, పదునుగా ఉన్న చిన్న కర్రముక్క లాంటివి మనిషి శరీరంలోకి చేరుకున్నప్పుడు మనిషి శరీరంలో వ్యాధి తల ఎత్తుతుంది. అయితే, కొంతమంది మతపరమైన జ్ఞానం కలిగిన మేధావులు చెబుతున్న సూత్రాల ప్రకారం చూసినట్లయితే, "మనిషియొక్క చెడుకర్మ కారణంగా

పైన చెప్పిన వస్తువులు – మనిషి శరీరంలో ప్రవేశించి ఆ మనిషిని వ్యాధికి గురిచేస్తాయని తెలుస్తున్నది". కొంతమంది వ్యక్తుల శరీరాల్లోకి ప్రమాదవశాత్తు లేదా అనుకోకుండా పైన చెప్పిన వస్తువులలో ఏదోఒకటి ప్రవేశించినప్పటికీ, ఆ వ్యక్తులకు ఏవిధమైన ప్రమాదం కలగదు. కనుక, మానవాతీత శక్తులు లేదా దైవం యొక్క ప్రమేయం వల్ల మాత్రమే చెడు పదార్థాలు మనిషి శరీరంలోకి బలవంతంగా ప్రవేశించి (అనగా ఆ మనిషి యొక్క ప్రమేయం లేకుండా) మనిషిని అనారోగ్యంపాలు చెయ్యటం జరుగుతుందని భావించాల్సి ఉంటుంది.

**4. ప్రేతాత్మ ఆవహించటం :** ఆరోగ్యంగా మరియు బలంగా ఉన్న ఒక వ్యక్తిని దయ్యం లేదా ప్రకృతిలో సహజంగా ఆవిర్భవించిన ఏదైనా క్షుద్రశక్తి – కొన్ని సమయాలలో ఆవహించటం జరుగుతుంది. ప్రతి మనిషిలోను ఒక ఆత్మ ఉంటుంది. ఆ ఆత్మకు ఆ మనిషి శరీరాన్ని కాపాడుకోగలిగే శక్తి ఉంటుంది. ఎప్పుడైతే, ఆ మనిషి శరీరంలోకి ఇంకొక చెడు ఆత్మ లేదా క్షుద్రశక్తి ప్రవేశిస్తుందో ఆపై ఆ శక్తి, ఆ మనిషిలోని ప్రాణాన్ని (ఆత్మ) తన ఆధీనంలోకి తెచ్చుకుని ఆ మనిషిని అనేక రకాలుగా పీడిస్తుంది. ఆ పీడలో భాగంగా ఆ మనిషిని చెడు వ్యాధులకు గురిచేయటం జరుగుతుంది. అయితే, దయ్యం పట్టిన ప్రతి వ్యక్తీ 'రోగగ్రస్తుడు' అవ్వాల్సిన పరిస్థితులు రావు. కాకపోతే, ఏదైనా "శక్తి"చేత ఆవహించబడిన వ్యక్తి ప్రవర్తించే విధానం చాలా అసహజంగా మరియు వికృతంగా ఉంటుంది. కొన్ని సమయాలలో, ఆ వ్యక్తులను ఆవహించిన శక్తులు, విచిత్రమైన భాషలలో మాట్లాడటం లేదా జరగబోయే సంఘటనల గురించి చెప్పటం లాంటివి జరుగుతూ ఉంటాయి.

ఏదిఏమైనా, ఏదైనా మానవాతీత శక్తి ఆవహించటం వల్ల వ్యాధిగ్రస్తుడైన మానవుడికి చేసే చికిత్సలో ప్రధాన పాత్ర, దైవ సంబంధమైన మంత్ర ప్రక్రియలకు ఉంటుందని గుర్తించాలి. చెడుశక్తి లేదా ఆత్మ – ప్రధానంగా మనిషియొక్క మనసుని ప్రభావితం చేస్తుంది. అందువలన, మంత్రశక్తి ద్వారా ఆ వ్యక్తియొక్క మనసుని బలంగా మార్చటం జరుగుతుంది. ఎప్పుడైతే, మనిషిలో ఆత్మబలం సమృద్ధిగా ఉంటుందో అప్పుడు ఆ మనిషిలో ఏ చెడు శక్తులూ నిలబడటం దాదాపు అసాధ్యం అవుతుంది. ఆ కారణంగానే, తంత్రశాస్త్రంలో ఒక సామెత ప్రచారంలో ఉన్నది. అది ఏమిటంటే "దయ్యాలు, మానసికంగా బలహీనంగా ఉన్న వ్యక్తులను మాత్రమే ఆవహిస్తాయి". ఏదిఏమైనా, దయ్యం పట్టటం వల్ల అనారోగ్యానికి గురి అయిన వ్యక్తికి నయం చేసే తాంత్రిక విధానాలు క్రైస్తవ మతంలో, ఇస్లాం మతంలో,

మహాయాన బౌద్ధమతంలో మరియు ఇతర చిన్నస్థాయి మతాలలో కూడా ప్రచారంలో ఉన్నాయి. ఇక హిందూ మతంలో ప్రేతాత్మలకు సంబంధించిన వ్యాధుల్ని నాశనం చెయ్యటానికి అసాధారణ స్థాయిలో ఒక ప్రత్యేక మంత్రశాస్త్రం ఎన్నోవేల సంవత్సరాల క్రితమే ఏర్పాటు చేయబడి ఉన్నది. నాలుగు వేదాలలో ఒకటైన 'అధర్వణవేదం' క్షుద్ర శక్తుల్ని నాశనంచేసే అనేక మంత్ర, తంత్రాల గురించి తెలియజేస్తుంది.

**5. ఆత్మ నష్టం (Soul loss) :** ప్రతి మనిషిలోను ఒక ఆత్మ ఉంటుంది. మనిషి శరీరంలో ఆత్మ ఉన్నంతసేపే మనిషి జీవించి ఉన్నట్లుగా గుర్తిస్తారు. ఆత్మలేని మనిషి మృతదేహంతో సమానం. ఇక్కడ "ఆత్మనష్టం" అనే పదం ఉపయోగించబడింది. దీని అర్థం ఏమంటే, మనిషి శరీరంలో ఉండే ఆత్మ ఏదో ఒక కారణం వల్ల తాత్కాలికంగా బైటకు వెళ్ళిపోతుంది. ఇలాంటి పరిస్థితినే ఆత్మనష్టం లేదా సోల్‌లాస్ అని పిలుస్తారు. ఇలా జరగటానికి అనేక రకాల కారణాలు ఉన్నాయి. వాటిలో ప్రధానమైనవి ఇలా ఉన్నాయి.

మనిషి నిద్రపోతున్న సమయంలో అతని లేదా ఆమె ఆత్మ, తాత్కాలికంగా బైటకు వెళ్ళిపోతుందని దాదాపు అన్ని మతాలలోను విశ్వసిస్తున్నారు. అలా వెళ్ళిన ఆత్మ, కొన్ని సమయాలలో మళ్ళీ తిరిగి రాకుండా ఏదో ఒక శక్తి – దాన్ని అడ్డుకుంటుంది. మనిషిలో ప్రధానమైన ప్రాణం ఉన్నప్పటికీ, మనిషి శరీరంలో కదలికలకు కారణం అయిన ఉపప్రాణం అలా బైటకు వెళ్ళిపోయిన కారణంగా ఆ మనిషిలో ప్రాణశక్తి సరిగా పనిచెయ్యదు. ఇలాంటి పరిస్థితుల్లో మనిషి, సహజంగానే అనారోగ్యానికి గురి అవుతాడు. ప్రాణం, శరీరంలోకి తిరిగి రాని కారణంగా ఒక వ్యక్తికి అనారోగ్యం ఏర్పడినప్పుడు అందుకు ప్రధాన పరిహారం – ఆ ఆత్మను తిరిగి శరీరంలోకి రప్పించటమే అని గుర్తించాలి. కొన్ని సమయాలలో ఏదైనా ప్రేతాత్మ లేదా మంత్రగాడు – మనిషిలోంచి బైటకు వెళ్ళిన ప్రాణాన్ని తన ఆధీనంలో పెట్టుకోవటం జరుగుతుంది. అలాంటి సమయాలలో మంత్రశాస్త్రం ద్వారా మాత్రమే మళ్ళీ ఆ ప్రాణాన్ని తిరిగి మనిషి శరీరంలోకి రప్పించటం సాధ్యపడుతుంది. కొంతమంది పారాసైకాలజిస్టులు మరియు ధర్మశాస్త్రవేత్తలు చెబుతున్న సమాచారం ప్రకారం చూసినట్లయితే "హిస్టీరియా మరియు మూర్ఛలు" అనే వ్యాధులు మనిషియొక్క ఆత్మ నష్టం కారణంగానే సంభవిస్తున్నాయని తెలుస్తున్నది.

## ప్రత్యామ్నాయ వైద్యశాస్త్రంలో వ్యాధుల రహస్యం?

మానవ జాతిలో నాగరికత ప్రారంభం అయిన కాలం నుండి మనిషిని వేధిస్తున్న సమస్యలలో ప్రధానమైనది "వ్యాధి" అని చెప్పవచ్చు. మనిషికి ఏ కారణంగా వ్యాధులు వస్తున్నాయి? – అన్న విషయానికి సరైన సమాధానాన్ని పొందటంకోసం అటు వైద్యశాస్త్రజ్ఞులు, ఇటు మేధావులు నిరంతరం తమకు చేతైనవిధంగా ప్రయత్నాలు చేస్తున్నారు. దాదాపు ఒక వంద సంవత్సరాల క్రితం వరకూ, మానవ జాతిని ప్రాణభయంతో వణికించిన మసూచి, కలరా లాంటి వ్యాధులు ప్రస్తుతం నిద్రాణ స్థితిలోకి చేరుకున్నాయని చెప్పుకోవచ్చు. ఎందుకంటే, ఈ దశాబ్దాల కాలంలో ప్రపంచ వ్యాప్తంగా ఉన్న అనేకమంది శాస్త్రజ్ఞులు చేస్తున్న ప్రయోగాల కారణంగా – ప్రమాదకరమైన వ్యాధులు నివారించే ఔషధాలు, అసలు ఆ వ్యాధులు రాకుండా అడ్డుకునే వ్యాక్సిన్లు లాంటివి తయారవుతున్నాయి.

ఒక విచిత్రం ఏమంటే, ప్రమాదకరమైన వ్యాధులు గతంలో ఏకకాలంలో వేలాదిమందిని బలి తీసుకున్నాయి. కానీ, ఈనాడు వైద్యశాస్త్రానికి అంతుపట్టని డయాబెటీస్, ఒబెసిటి (ఊబకాయం), రక్తపోటు (హై.బి.పి.) లాంటి వ్యాధులు మనుషుల్ని క్రమ క్రమంగా చావుకి దగ్గర చేస్తున్నాయి. నాగరికత, బాగా అభివృద్ధి చెందని కాలంలో మనిషి, తన చుట్టూ ఉండే ప్రకృతి విధించిన నియమాలకు అనుగుణంగా జీవించేవాడు. ఫలితంగా, మనిషి చాలావరకు ఆరోగ్యంగానే ఉండేవాడు. మనిషి శరీరంలో మరియు మనస్సులో ఏర్పడే చెడు మార్పుల కారణంగానే మనిషి వ్యాధి గ్రస్తుడు అవుతాడని ప్రత్యామ్నాయ వైద్యం (ఆల్టర్‌నేటివ్ హెల్త్ సైన్స్) ఉద్ఘాటిస్తున్నది. ప్రకృతి, మనిషిని అనేక రకాలుగా కాపాడుతూ ఉంటుంది. మనిషికి వచ్చే రోగాలకు నివారణ ఇచ్చే అనేక రకాల ఔషధి మూలికలు ప్రకృతిలోనే సహజంగా లభిస్తాయి. ప్రత్యామ్నాయ వైద్యంలో – వ్యాధి నివారణకు ప్రకృతి సిద్ధంగా లభించే ఓషధులను ఉపయోగిస్తారు. ఇక, మానసిక పరమైన దౌర్భల్యానికి మంత్రాలు, తంత్రాలు, రత్నధారణ లాంటివి ప్రయోగిస్తారు. ఆధునిక వైద్యశాస్త్రం – ఇంకా స్పష్టంగా చెప్పాలంటే "సైన్స్", ప్రకృతిని తన నియంత్రణలో పెట్టుకోవాలని ప్రయత్నిస్తుంది. ఫలితంగా, అసహజమైన ఔషధాలను వ్యాధుల నివారణకోసం కాకుండా – వ్యాధులను అణచివేయటానికి ఉపయోగిస్తుంది. కాన్సర్‌ని నివారించటంకోసం "కెమోథెరపి"ని ఉపయోగిస్తుంది. ఫలితంగా, మనిషి శరీరంలో విష పదార్థాలు (టాక్సిన్స్) చేరతాయి. అదేవిధంగా, కొన్నిరకాల వ్యాధులను నయం చేయటంకోసం

శస్త్రచికిత్సలు (సర్జరీ) చేసి, శరీరంలోని ముఖ్యమైన భాగాలను తొలగించటం జరుగుతుంది.

ఈనాటి వైద్యశాస్త్రం ఏమాత్రం గ్రహించని ఒక ముఖ్య సూత్రం ఏమంటే, "మనిషి శరీరం – తనకు వచ్చే వ్యాధులను సాధ్యమైనంతవరకు తానే నయం చేసుకోవటానికి ప్రయత్నిస్తుంది". మనిషి శరీరంలో అసాధారణమైన జ్ఞానం దాగి ఉంటుంది. శరీరంలో ఉండే చెడు పదార్థాలను తొలగించుకోవటంకోసం శరీరం కొన్ని రకాల వ్యాధులను సృష్టించుకుంటుంది. ఉదాహరణకి – శరీరంలోని ఏదో ఒక భాగంలో "ఇన్ఫెక్షన్" వచ్చినప్పుడు శరీరం వేడెక్కుతుంది. అనగా – మనిషికి జ్వరం వస్తుంది. ఆ వేడి కారణంగా అతని శరీరంలో చేరిన ఇన్ఫెక్షన్ చనిపోతుంది. అదేవిధంగా, శరీరంలో ఉండే విషపదార్థాలను బైటకు వెళ్లగొట్టటంకోసం మనిషికి దగ్గు వస్తుంది.

"వ్యాధి" అనే సమస్య మనిషికి యాదృశ్చికంగా (యాక్సిడెంటల్/రాండమ్‌గా) వస్తుందని, అతి ప్రమాదకరమైన ఇన్ఫెక్షన్లు కూడా అనుకోకుండా వస్తూ ఉంటాయని పాశ్చాత్య వైద్యశాస్త్రం అనగా సాంప్రదాయ వైద్యశాస్త్రం చెబుతుంది. కానీ, ప్రత్యామ్నాయ వైద్యశాస్త్ర అభిప్రాయం ప్రకారం చూసినట్లయితే, "మనిషి తన వ్యాధిని తానే సృష్టించుకుంటున్నాడు". మనిషి, ప్రకృతి విధించిన నియమాలకు విరుద్ధంగా ఆహారాలు తీసుకోవటం, శరీరానికి హాని కలిగించేవిధంగా చెడు అలవాట్లను కలిగి ఉండటం – అనే స్వయంకృత అపరాధాల వల్ల 'మనిషి రోగగ్రస్తుడు అవుతున్నాడు'. మనిషి చుట్టూ ఉండే పరిసరాలలోని వాయువు, జలం లాంటివి పరిశుద్ధంగా లేకపోతే మనిషికి వ్యాధులు వచ్చేమాట వాస్తవమే. కానీ, మనిషి శరీరం ఆరోగ్యవంతంగా ఉన్నప్పుడు బహిర్గత ప్రభావాలు, మనిషిని వ్యాధిగ్రస్తుడిని చేసే అవకాశాలు చాలా తక్కువగా ఉంటాయి. ఉదాహరణకి – నగరాలలో, పెద్ద పెద్ద పట్టణాలలో అనేక కారణాలవల్ల వాయువు విషపూరితంగా మారుతుంది. కానీ, ఆ వాయువుని పీల్చిన అందరికీ 'ఆస్తమా' వ్యాధి రావటంలేదు. అదేవిధంగా, పూర్తిగా పరిశుభ్రంగాలేని నీటిని త్రాగిన అందరికీ 'ప్రేగులకు' సంబంధించిన వ్యాధులు రావటంలేదు.

డయాబెటీస్ వ్యాధి రావటానికి మూలకారణం స్థూలకాయం లేదా తీవ్రమైన మానసిక వత్తిడి (స్ట్రెస్, యాంగ్జైటి) అని అటు ఆధునిక సైన్స్, ఇటు ప్రత్యామ్నాయ వైద్యశాస్త్రం కూడా అంగీకరిస్తున్నాయి. అయితే, ఈ రెండు కారణాలకు మించిన

ఇంకొక కారణం కూడా ఉన్నది. అది ఏమిటంటే, ఒక మనిషి తన పూర్వీకులు తీసుకునే సహజ ఆహారాన్ని మానివేసి, కొత్తరకం ఆహారాలను తీసుకోవటం అని గుర్తించాలి. ఇంకొక ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే, మనిషి శరీరంలో ఉండే కాలేయం (లివర్), కొన్ని సమయాలలో జడత్వాన్ని పొందుతుంది. అనగా, దానిలో చురుకుతనం బాగా తగ్గిపోతుంది. అలాంటి పరిస్థితుల్లో ఆ లివర్‌లోని మందగొండి తనాన్ని పోగొట్టటంకోసం, శరీరంలో రక్తపీడనం (బ్లడ్‌ప్లెజర్) అధికం అవుతుంది. ఫలితంగా, రక్తం, అధిక వత్తిడితో లివర్‌లోకి ప్రవహిస్తుంది. ఫలితంగా, లివర్‌లో చురుకుతనం పెరుగుతుంది. ఇంకొక విశేషం ఏమంటే, గుండె జబ్బుకి కారణం గుండె కాకపోవచ్చు. మరి, గుండెజబ్బులు (హార్ట్‌డిసీజెస్) ఎలా వస్తున్నాయి? – మనిషి తనలోని భయాన్ని లేదా ఆగ్రహాన్ని బలవంతంగా అణుచుకున్నప్పుడు ఆ అణుచుకున్న భావాల (ఎమోషన్స్) – కారణంగా గుండె వ్యాధిగ్రస్తం అవుతుంది.

ఇంకొక ముఖ్య విశేషం ఏమంటే, ఆధునిక వైద్యం – అనేక ముక్కలుగా అనగా విభాగాలుగా విభజించబడి ఉన్నది. అందువలన ఏ ఒక్క వైద్యుడికీ శరీరానికి సంబంధించిన పూర్తి సమాచారం తెలియదు అని గుర్తించాలి. ఉదాహరణకి – ఆరుగురు గుడ్డివాళ్ళు ఒక ఏనుగు దగ్గరకు వెళ్ళారు. ఏనుగు ఎలా ఉంటుందో? "తడిమి" అనగా స్పర్శ ద్వారా తెలుసుకోవాలని అనుకున్నారు. తోకని పట్టుకున్న గుడ్డివాడు – ఏనుగు సన్నగా, పొడవుగా ఉంటుంది అని చెప్పాడు. తొండం భాగం పట్టుకున్నవాడు – ఏనుగు పొడవుగా, లావుగా ఉన్నది అని చెప్పాడు. అదేవిధంగా, ఏనుగు కాళ్ళు పట్టుకున్నవాడు ఒకవిధంగా, ఏనుగు తలని తడిమినవాడు ఒకవిధంగా చెప్పారు. అనగా, ఒకే ఏనుగు – ఆరుగురికి ఆరు రకాలుగా ఉన్నట్లుగా అనిపించింది. అదేవిధంగా, ఆధునిక వైద్యశాస్త్రం అనేక విభాగాలుగా ఉన్న కారణంగా – గుండె వైద్యుడికి (కార్డియాలజిస్టు) గుండె గురించి మాత్రమే తెలుస్తుంది. ఊపిరితిత్తులకు సంబంధించిన వైద్యుడికి ఊపిరితిత్తులకు సంబంధించిన సమాచారం మాత్రమే తెలుస్తుంది. కానీ, మనిషి శరీరంలో ఉండే ప్రతి భాగమూ, ఇంకొక భాగం పైన ఆధారపడి పనిచేస్తుంది. ఆధునిక వైద్యశాస్త్రం ఆ విషయాన్ని అంగీకరించదు. ఆ కారణంగానే, ఆధునిక వైద్యశాస్త్రం వ్యాధులకు మూలకారణం ఏమిటో? సరిగా ఈనాటికీ చెప్పలేకపోతున్నది. జీర్ణవ్యవస్థకు సంబంధించిన అవయవాలు బలహీన పడ్డ సమయంలో, ప్రోస్టేట్ గ్రంధి పెద్దది కావటం జరుగుతుంది. అదేవిధంగా హైపోధలామస్‌కి మరియు గుండెకు మధ్య సంబంధం ఉంటుంది. పిర్రకి (హిప్) మరియు భుజాలకు మధ్య సంబంధం ఉంటుంది. కనుక, ఒక భాగంలో వ్యాధి

కనిపిస్తే దాని మూలకారణం ఇంకొక భాగంలో ఉంటుందని ప్రత్యామ్నాయ వైద్యశాస్త్రం ఉద్ఘాటిస్తున్నది. (హైపోథలామస్, ఇది మనిషి మెదడులో ఉండే ఒక చిన్న ప్రాంతం. శరీరంలో వివిధ రకాల హార్మోన్ల విడుదల మరియు శరీరంలో ఉష్ణోగ్రతను నియంత్రణ చేయుట లాంటి ముఖ్యమైన విధులను ఈ హైపోథలామస్ నిర్వహిస్తుంది.)

థైరాయిడ్ గ్లాండ్‌కి సంబంధించిన వ్యాధులకు మూలకారణం – వ్యక్తిలోని హైపోథలామస్ మరియు పిట్యూటరి గ్లాండ్‌లో అసమతౌల్యం (ఇన్‌బాలెన్స్) ఏర్పడటమే అని ప్రత్యామ్నాయ వైద్యశాస్త్రం ఉద్ఘాటిస్తున్నది.

బలహీనంగా ఉన్న కాలేయం (లివర్) కారణంగా "సైనస్" సమస్య ఏర్పడుతుంది. శరీరంలోని అనేక భాగాలలో లేదా ఒక భాగంలో అసమతౌల్యం ఏర్పడటంవల్లే ఏ వ్యాధి అయినా వస్తుంది. ఆ అసమతౌల్యం – భౌతికమైనది కావొచ్చు అనగా కలుషితమైన వాయువుని పీల్చటం అనుకోవచ్చు. లేదా మానసికపరమైన అసమతౌల్యం కావొచ్చు. అనగా, మనసులో చెలరేగే తీవ్ర ఆగ్రహాన్ని బలవంతంగా అణచుకోవటం అని భావించవచ్చు. అసంతృప్తి లేదా ఆగ్రహం అనే శక్తి, ఇతర ఏ నిజమైన వైరస్ కన్నా శక్తివంతంగా మనిషిని అనగా మనిషి ఆరోగ్యాన్ని నాశనం చేస్తుందని మర్చిపోకూడదు. ఒక మనిషి ఆరోగ్యంగా ఉండాలన్నా, అనారోగ్యం పాలు కావాలన్నా ఆ మనిషి చేతిలోనే చాలా వరకు ఉంటుందని మర్చిపోకూడదు. "తనకు వచ్చే వ్యాధులకు కారణం తనే" అని మనిషికి తెలిసినప్పుడు, ఆ మనిషి తన ఆరోగ్యాన్ని రక్షించుకోవటానికి సరైన మార్గంలో ప్రయత్నిస్తాడు.

"మనిషికి వచ్చే వ్యాధులన్నింటికీ మూలకారణం, ఆ మనిషిలో ఉండే జన్యువులే (జీన్స్) అని ఆధునిక వైద్యశాస్త్రం వాదిస్తుంది. కానీ, వాస్తవంలో జన్యువులకు మరియు మనిషికి వచ్చే వ్యాధులకు ఉండే సంబంధం చాలా తక్కువగా ఉంటుంది. లూయీ పాశ్చర్ అనే ప్రఖ్యాత జీవ శాస్త్రజ్ఞుడు "క్రిమి సిద్ధాంతాన్ని" (జర్మ్‌థీరి)ని కనిపెట్టాడు. ఈ సిద్ధాంతం చెప్పేది ఏమిటంటే "క్రిములవల్ల మనిషికి వ్యాధులు వస్తాయి". ఒక విచిత్రం ఏమంటే, ఇదే, లూయీ పాశ్చర్ తన మరణ సమయంలో ఇలా చెప్పాడు. "క్రిములవల్ల మనిషికి వ్యాధులు రావు". ఆరోగ్యకరమైన వాతావరణంలో క్రిములు పెరగలేవు. కలుషితమైన వాతావరణం క్రిములు పెరగటానికి చాలా అనుకూలంగా ఉంటుంది. ఇదే సిద్ధాంతం నుండి "జన్యు సిద్ధాంతం" (జీన్ థీరి) ఆవిర్భవించింది.

ఒక వ్యాధి ఎందుకు వస్తుంది? అన్న విషయానికి సమాధానం దొరకని ప్రతిసారీ – ఆ వ్యాధికి కారణం, మనిషిలోని జన్యువులు అని పేర్కొనటం జరుగుతున్నది.

చివరికి, ఈ జన్యు సిద్ధాంతం ఎంత మూర్ఖంగా తయారయ్యిందంటే – స్త్రీలకు వచ్చే వక్షోజ కాన్సర్ దగ్గర నుండి లింగ బేధం లేకుండా ఎవరికైనా వచ్చే అతి తీవ్ర మానసిక వ్యాధి అయిన షీజోఫెర్నియా కూడా జన్యువుల కారణంగానే అనగా వంశం కారణంగానే వస్తున్నాయని వాదిస్తున్నారు. జన్యువుల వల్లే మనిషి యొక్క జుట్టు రంగు, జుట్టు ఆకారం, కంటిపాపల రంగు కూడా ఆధారపడి ఉంటాయని ఆధునిక శాస్త్రజ్ఞులు మూర్ఖంగా వాదిస్తున్నారు.

ఒక జన్యువు లోపల ఉండే శక్తి – ఆ జన్యువు పనిచెయ్యాలా? లేదా ఆగిపోవాలా? అన్న విషయాన్ని నిర్ణయించదని మరియు ఆ జన్యువు ఏ వాతావరణంలో లేదా పర్యావరణంలో (ఎన్విరాన్‌మెంట్) ఉంటుందో, ఆ వాతావరణమే జన్యువు యొక్క పనితీరుకి కారణం అవుతుందని ప్రఖ్యాత మాలిక్యులార్ బయాలజిస్ట్ అయిన బ్రూస్‌లిప్టన్ పేర్కొన్నాడు. అనగా, మనిషిలో ఉండే జన్యువు, తన చుట్టూ ఉండే పరిసరాలకు స్పందిస్తూ, ఆ పరిసరాల యొక్క ప్రభావానికి గురి కావటం జరుగుతుందని అర్థం చేసుకోవాలి. విచిత్రం ఏమంటే, ఇప్పటికీ ఆధునిక శాస్త్రజ్ఞులు "జన్యువు లోపల ఏ రహస్యాలు దాగి ఉన్నాయి?" అన్న విషయం తెలుసుకోవటంకోసం వేల కోట్ల రూపాయలను పరిశోధనలకోసం వెచ్చిస్తున్నారు. కానీ, జన్యువుపైన చుట్టూ ఉండే పర్యావరణ ప్రభావం ఏవిధంగా ఉంటుంది? అన్న విషయాన్ని వాళ్ళు ఏమాత్రం లెక్కలోకి తీసుకోవటంలేదు.



# 30. ప్రాచీన తంత్ర శాస్త్రములలో చెప్పబడిన స్త్రీ సంబంధ విశేషాలు?

◆ భర్తను తీవ్రంగా ద్వేషించే భార్య ఆ భర్తకు ఏదో ఒక సమయంలో హాని చేస్తుందని హైందవ తంత్రశాస్త్రాలలో చెప్పబడి ఉన్నది. చరిత్రలో కనిపించే సమాచారం ప్రకారం చూసినట్లయితే – విదురధుడు అనే రాజుని ఆయన రాణి తన జడలో రహస్యంగా దాచుకున్న చిన్న కత్తితో, సంభోగ సమయంలో చాలా నేర్పుగా సంహరించింది. ఇక, బెనారస్ మహారాజుని తీవ్రంగా ద్వేషించే ఆయన భార్య తన

కాలి గజ్జలలో దాచిన విషంతో ఆయనను సంహరించింది. అందువలన, పురుషులు తమ భార్యల యొక్క ద్వేషాన్ని కాకుండా ప్రేమను పొందేవిధంగా ప్రవర్తించాల్సి ఉంటుందని తంత్రశాస్త్ర పండితులు ఉద్ఘాటిస్తున్నారు.

◆ఆదర్శవంతమైన భార్య తన భర్త వద్ద అతనిపై ఉన్న ప్రేమను అనేక విధాలుగా ప్రదర్శిస్తుంది. అది ఎలాగంటే... వదులైపోయిన తన దుస్తులను సర్దుకుంటున్నట్లుగా నటిస్తూ తన యొక్క నాభిని, బాహుమూలమును, ఆభరణాలను తన భర్తకు ప్రదర్శిస్తుంది. అదేవిధంగా, తనయొక్క శిరోజములు పొరపాటున ముడి నుండి విడిపోయి పరచుకున్నట్లుగా చూపిస్తుంది. తన భర్తవైపు క్రీగంటి చూపులు ప్రసరిస్తుంది.

◆చెడు ప్రవర్తనగల భార్య పెద్ద శబ్దం చేస్తూ ఉమ్ముతుంది. పగలపడి నవ్వుతుంది. భర్త కన్నా ముందు పడకమీదకి చేరుతుంది. మెటికలు విరుస్తుంది. ఆవులిస్తుంది. తన భర్త చూపు తనపై నుండి మరలిన తరువాతే అతనివైపు చూస్తుంది.

◆ ఆదర్శవంతురాలైన భార్య తన భర్తతో ఎల్లప్పుడూ అభిమానంతో మాట్లాడుతుంది. అతనికి అవసరం అయినప్పుడు తన దగ్గర ఉన్న ధనాన్ని ఉదారంగా ఇస్తుంది. తనలో ఎంత ఆగ్రహం ఉన్నా, అతడు కనపడగానే శాంతం వహిస్తుంది. తన భర్తయొక్క స్నేహితులను గౌరవిస్తుంది. తన భర్త శతృవులను ద్వేషిస్తుంది. భర్త తన సన్నిధిలో లేనప్పుడు ఎంతో బాధకు గురి అవుతుంది. తన భర్త అడగగానే తన అధరాలను, హృదయాన్ని అతనికి అందించి, అతనిని ఆలింగనం చేసుకుంటుంది. ఆమె మొదటగా అతడిని ముద్దాడుతుంది.

◆చెడు ప్రవర్తన కలిగిన లేదా అవిధేయురాలైన భార్య తన భర్త కనపడగానే ముఖం చిట్లించుకుని తల ప్రక్కకు తిప్పుకుంటుంది. తన భర్త తనకు ఎంత మేలు చేసినా, ఆమెకు అతడిపట్ల ఏమాత్రం కృతజ్ఞత ఉండదు. తన భర్తను చూసినప్పుడు ఆమెలో ఏవిధమైన సంతోషం ఉండదు. ఆమె భర్త యొక్క శతృవులు ఆమెకు మిత్రులుగా అనిపిస్తారు. ఆమె తన భర్తను కఠినమైన మాటలతో బాధిస్తుంది.

◆ఆదర్శవంతమైన భార్య తన భర్త కన్నా ముందు నిద్రలేస్తుంది. తన భర్త నిద్రించిన తరువాత తాను నిద్రపోతుంది.

◆భిక్షాటన చేసే స్త్రీలు, స్త్రీ భక్తులు, ఆడ పనివాళ్ళు, దాదులు (పిల్లల్ని సాకే ఆయాలు), పూలు అమ్ముకునే స్త్రీలు, వేశ్యలు – ఈ వర్గాలకు చెందిన స్త్రీలు,

కుటుంబ స్త్రీల యొక్క రహస్యాలను తెలుసుకుని ఆ స్త్రీల యొక్క గౌరవానికి హాని కలిగిస్తారు. అందువల్ల, కుటుంబ స్త్రీలు అనగా గౌరవనీయమైన స్త్రీలు ఇక్కడ పేర్కొన్న స్త్రీలకు సాధ్యమైనంత దూరంగా ఉండాలని తంత్రశాస్త్రాలు తెలియజేస్తున్నాయి.

◆ఆదర్శవంతురాలైన భార్య – యుక్తవయస్సులో ఉన్నది, అందమైనది, చక్కటి ఆభరణాలతో అలంకరించుకున్నది, తన భర్త చూపులకు చక్కటి ఆకర్షణీయంగా కనపడేది, దాంపత్య జీవితం సుఖంగా సాగటానికి అవసరమైన జ్ఞానం కలది, ఉల్లాసవంతమైన స్వభావం గలది అయి ఉంటుంది. ఇలాంటి లక్షణాలు గల భార్యను మాత్రమే “స్త్రీ రత్నము” అని శాస్త్రములు పేర్కొంటున్నాయి. ఇలాంటి మంచి లక్షణాలు లేని భార్యను, మంచి అభిరుచులు గల భర్త ఒక ‘వ్యాధిలాగా’ భావిస్తాడు.

◆ఏ స్త్రీ అయితే పవిత్రురాలిగా, పరిశుద్ధమైన ఆహారం తీసుకునేదిగా, అమాయకంగా ఉండి, మధురంగా మాట్లాడుతూ, తన భర్తకు పూర్తిగా అంకితమవుతుందో ఆమెను “లక్ష్మీ సమానురాలు” అని, ఏ స్త్రీ అయితే వికారమైన నేత్రాలను కలిగి ఉంటుందో, మురికిగా ఉంటుందో, తగాదాలమారిగా ఉంటుందో, విపరీతంగా మాట్లాడుతుందో అలాంటి స్త్రీని “రాక్షసి” అని వ్యాసమహర్షి పేర్కొన్నాడు.

◆శుభ స్వభావం కలిగిన భార్య, అల్పస్థాయిలో అనగా తక్కువ స్థాయివారు మాట్లాడే భాషలో మాట్లాడరాదు. ఆమె తన శరీరానికి నప్పని దుస్తులు, అసభ్యంగా ఉండే దుస్తులను ధరించరాదు. అపరిశుభ్రంగా ఉండరాదు. తన భర్త తన ప్రక్కన ఉన్నప్పుడు ఆమె అతడికి అనుకూలంగా ఉండాలి. అతని గురించే ఆలోచించాలి. అంతేగాని, ఆ సమయంలో వేరే ఇతర కార్యాల గురించి ఆలోచించరాదు.

◆ఆదర్శవంతురాలైన భార్య తన భర్త శిరస్సుకి దిండులాగా ఉండాలి. ఆమె యొక్క శిరోజాలు ఎల్లప్పుడూ సువాసనతో ఉండాలి. తన భర్త కోర్కెలను కామధేనువులాగా తీరుస్తూ ఉండాలి.

◆బాగా కండ పట్టిన పిక్కలు గలది, విపరీతంగా నిద్రపోయేది, విపరీతమైన బహిష్టు స్రావం గలది, విపరీతమైన ఉద్రేక స్వభావం గలది, విపరీతమైన కఫ లేదా వాత తత్వం గలది, విపరీతంగా చెమట పట్టేది, పొట్టి జుట్టుగలది లేదా బూడిద రంగు జుట్టు గలది, అంగవైకల్యం గలది లేదా అదనంగా అంగములు కలది

అయిన స్త్రీతో - వివేకవంతుడైన ఏ పురుషుడూ సంభోగము జరపరాదు అని తంత్రశాస్త్రాలలో పేర్కొనబడి ఉన్నది.

♦ఆదర్శవంతుడైన భర్త తన భార్యతో సంభోగం చేసే సమయంలో ఆమెను తన గోళ్ళతోగాని, దంతాలతోగాని గాయపరచరాదు.





**Online Print Books Store Devullu.com**